# తెలుగు సామెతలు - జన జీవనం

1979-80 సంవత్సరంలో
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు పొందిన గ్రంథం

డా॥ పాపిరెడ్డి నరసింహారెడ్డి, ఎం.ఏ., పిహెచ్.డి.,
తెలుగు అధ్యయనశాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం, తిరుపతి.

శ్రీనివాస మురళీ పబ్లికేషన్స్,
తిరుపతి.
1983

తెలుగు సామెతలు - జన జీవనం

శ్రీనివాస మురళీ పబ్లికేషన్స్ - 1

సర్వస్వామ్య సంకలితం

ప్రథమ ముద్రణ :

1200 ప్రతులు

వెల : రూ. **45/-**

ప్రతులకు :

**శ్రీమతి పి. ప్రభావతమ్మ,**

16-134 (1) ఎస్వీనగర్,

తిరుపతి - 517 502,

ముఖపత్ర చిత్రణ : పేటశ్రీ

ముద్రణ :

మాస్టర్ ప్రింట్

తిరుపతి.

# అంకితం



విజ్ఞాన విధాతలు మీరు
వెన్నెలగా మార్చుకొన్నది నేను
పలికింది నేనైనా
పలికించింది మీరు
మీరు నేర్పిన విద్య మీకే అంకితం
దేవుడు సృష్టించిన సుమాల్ని
ఆయన పాదాంకితం చేసినట్లు

# అక్షరార్చన



గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః

**గురువర్యులైన ఆచార్య జి. యన్. రెడ్డిగారికి ఈ గ్రంథం భక్తి పురస్సరంగా కృతజ్ఞతా సూచకంగా అంకితం**

**మా** తెలుగు అధ్యయనశాఖ ఓ ఉమ్మడికుటుంబం. అందులో వయసులో, అనుభవంలో పెద్దవారు జి. యన్. రెడ్డిగారే. డిపార్ట్‌మెంటంతా ఒక మాటగా, ఒక త్రాటిమీద నడుస్తున్నదంటే, వారి ధీరోదాత్తగుణం, మంచితనం. పెద్ద మనిషి తరహా - ఇవే కారణాలు.

పరిశోధనంటే ఏమిటో నాకు నేర్పినవారు వారు. 'కైండ్ సెన్స్' అంటే ఏమిటో తెల్పినవారు వారు. ఆప్యాయత చూపినవారు వారు. ఆర్ద్రతను వర్షించిన వారు వారు. మాటలద్వారా కానే కాదు, వారి చేతల ద్వారానే !

పరిపాలకుడుగా వారికి మంచి పేరుంది. వీపు గొట్టడమే గానీ, కడుపు కొట్టడం తెలియదు వారికి. విద్యార్థులతో సమస్యల్ని చర్చించి, పరిష్కరించడమే గానీ - ఆదేశించి, అణచివేయడం వారికి గిట్టదు. వాత్సల్యంతో అకట్టుకోడం వారికి వెన్నతో పెట్టిన విద్య.

పరిశోధన, విద్యాబోధన వారికి ప్రాణప్రదాలు. మితభాషణ వారి పరిశోధనలోనూ, విద్యాబోధనలోనూ, ఉపన్యాసాల్లోనూ సాక్షాత్కరిస్తుంటుంది.

వర్ధిష్ణువుల్ని వెన్ను తట్టడంలో వారికి వారే సాటి. విశాఖలో, ఓ కాన్ఫరెన్స్‌లో నేనో పేపర్ చదువుతూ, ప్రశ్నలడిగితే చెప్పలేనేమో అని జంకుతుంటుంటే "ఆ విషయం నేను చూసుకొంటాలే" అని అభయమిచ్చారు. ఆదుకొన్నారు.

మంచికైనా, చెడుకైనా, చిన్నా పెద్దా భేదం లేకుండా, హాజరయ్యే, ఆదుకునే మధుర హృదయం వారిది. ఎవరికైనా బాగా లేదంటే, హాస్పిటల్కో, ఇంటికో వెళ్లి పరామర్శించి రావడం తప్పనిసరి. ఆ తర్వాత కనిపిస్తే మొట్టమొదట వారడిగే ప్రశ్న "మీ ఆరోగ్యం ఎలా వుంది?" అనేది.

మా డిపార్ట్‌మెంట్‌లో ఎవరెవరికి ఏయే విషయాల్లో ప్రావీణ్యముందో క్షుణ్ణంగా తెలుసు వారికి. ఏవైనా కాంపిటీషన్లూ అవీ వస్తే, మాలో తగినవార్ని పిలిచి "మీరు దీనికి పోటీ చేయండి" అని చెప్తారు. అలా పోటీచేసి గెలుపొందిన వారిలో డా॥ జి. నాగయ్యగారు ఒకరు. నేను మరొకణ్ణి.

ఏ సబ్జక్టును గురించి వార్తో సంప్రదించినా, మనకు తెలీని ఏవో కొత్త కొత్త అంశాల్ని, అలవోకగానో, ఆలోచించో అప్పటికప్పుడు చెప్తారు. మన పరిశోధన ప్రణాళికను వీలున్నంత సమగ్రంగా, సమర్థంగా ఉండేట్లు చేస్తారు. పరిశోధనలో, పరిశోధన అంశాల్ని నిర్వహించడంలో, పర్యవేక్షించడంలో అంతో యింతో ప్రతిభ నాలో ఏదైనా వుందంటే అదంతా వారి చలవే.

బద్ధకం వారికి బద్ధ శత్రువు. ఈ దేశం యిలా తగలడ్డానికి కారణం ఇదే నంటారు వారు. విధ్యుక్త ధర్మాన్ని విస్మరించే వారంటే అంతులేని అసహ్యం వారికి. కష్టపడి పనిచేసే స్వభావం కలవారంటే వల్లమాలిన అభిమానం వారికి.

ఏదైనా అంశాన్ని చిన్నవాళ్లు సూచించినా, ఇలా చేస్తే బాగుంటుందన్నా, సరైందైతే వెంటనే అంగీకరించే విశాల హృదయం వారిది. మనిషిలో 'ట్యాలెంట్' చూస్తారే గానీ, వయస్సు, హోదా ప్రధానం కాదు వారికి.

అర్ధాంతరంగా ఒడుదుడుకుల్లో పడిన నా పరిశోధనను పరిపుష్టింపచేసింది వారు. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుణ్ణుంచి, విశ్వ విద్యాలయ అధ్యాపకునిగా ఎదిగేట్టు చూపింది వారు. నా ఉజ్జ్వల భవిష్యత్తును సదా దారి చూపేది వారు.

నీతి, నిజాయితీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వారికి. సుస్నిగ్ధ నిస్వార్థ హృదయం వారిది. ఒక్క మాటలో చెప్పాలంటే

హిమాలయ శిఖరంలాంటి అత్యున్నత వ్యక్తిత్వం వారిది.

# కృతజ్ఞతా కుసుమాంజలి



'తెలుగు సామెతలు - జన జీవనం' అనే ఈ గ్రంధాన్ని పలికింది నేనైనా పలికించింది ఆచార్య జి. యన్. రెడ్డిగారు. వారి నిరంతర ప్రోత్సాహం, ఆదర్శ వ్యక్తిత్వం నా నిత్య జీవితాన్ని, పరిశోధనా ప్రాంగణాన్ని ప్రభావితం చేస్తూనే వుంటాయి. లండన్ నుంచి తెప్పించిన బ్రౌన్ సేకరణలోని మైక్రోఫిల్మ్‌ను విని యోగించుకునే అవకాశాన్నీ వారే కల్పించారు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు చంద్రుని కో నూలు పోగు.

పోటీకోసం గ్రంధం వ్రాస్తున్నానంటే 'జయం నీదే' అని అంతులేని ఆప్యాయతతో వెన్ను తట్టింది ఆచార్య ఎం. సుబ్బారెడ్డి గారు. ఆప్తవచనంతో ఆశీర్వదించిందీ వారే.

ఈ గ్రంధాన్ని తీర్చి దిద్దడంలో ఎప్పటికప్పుడు సలహాలిచ్చింది డా॥ కేతు విశ్వనాధరెడ్డిగారు, తమ వద్ద నున్న విలువైన ప్రాచీన సామెతల సంకలనాల్ని. వారు అక్కడక్కడ వ్రాసి పెట్టుకొన్న సామెతల్ని అందించి ప్రోత్సాహించింది బంగోరె గారు ....

వెలుగుకు నోచుకోని శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారి సామెత కార్డుల్ని దుమ్ము దులిపి చూపినవారు వేటపాలెం, సారస్వతనికేతన్ గ్రంధాలయం (నాటి) గౌరవ కార్యదర్శి శ్రీనివాసరావుగారు పాత సాహిత్య పత్రికల్ని, సంకలన గ్రంథాల్ని అందించింది ఆ గ్రంథాలయోద్యోగులు

మైక్రో ఫిల్మ్ రీడర్‌ను, గ్రంధాల్ని వాడుకోనిచ్చింది శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ గ్రంథాలయాధికారి ఆచార్య శ్రీపతి నాయుడుగారు, డిప్యూటీ లైబ్రేరియన్ శ్రీ చంద్రన్‌గారు, నాక్కావాల్సిన పుస్తకాల్ని శ్రమపడి వెదికిచ్చింది లైబ్రరీ అసిస్టెంట్ శ్రీ షణ్ముగం ...

గ్రంధ రచన వివిధ దశల్లో తోడ్పడింది, అట్టమీది బొమ్మ కళాత్మకంగా వుండేందుకు పాటుపడింది మిత్రుడు డా॥ చంద్రశేఖర్ తాను సేకరించిన సామెతల్ని గ్రంథంలో చేర్చుకోనిచ్చింది మిత్రుడు డా॥ చంద్రమౌళి....

నా పరిశోధనలో శ్రమించిన మిత్రులు విశ్వనాధరెడ్డి (విశాఖ), డా॥ చెంగారెడ్డి, **డా॥ శంకర్‌రెడ్డి, పార్థసారధినాయుడు, హరినాధరెడ్డి, రమణ, శారద, ఛాయ, మల్లికార్జునరెడ్డి.**

గ్రంథం టైప్ చేసింది పురుషోత్తం. శ్రీనివాసులురెడ్డి. ఈ గ్రంథాన్ని సర్వశ్రేష్ఠంగా నిర్ణయించింది న్యాయ నిర్ణేతలు. బహుమతి నందించింది ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు

నా భావాలకు తగినట్లు తెలుగువారి సాంఘిక, సాంస్కృతిక జీవనాల్ని ప్రతిబింబించే అందమైన ముఖచిత్ర రచన చేసింది వర్ధిష్ణుపు పేట శ్రీనివాసులురెడ్డి

పుస్తకాన్ని ఎంతో బాగా ముద్రించి యిచ్చింది మాస్టర్ ప్రెస్ అధినేత శ్రీనివాసాచార్యులుగారు, అచ్చుపని పూర్తి చేయించింది శ్రీ అనంతనారాయణగారు, సకాలంలో పని పూర్తిచేసి యిచ్చింది ప్రెస్ కార్మికులు, ముఖచిత్రం ముద్రించి ఇచ్చింది వెల్డన్ ప్రెస్ ఆఫ్‌సెట్, మద్రాస్‌వారు ....

.... అందరికీ వందనాలు కృతజ్ఞతాభివందనాలు.



ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి, ఎమ్.ఏ., పిహెచ్.డి.
తెలుగు అధ్యయనశాఖాధిపతి,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి.

# ఆప్తవచనం

చరిత్ర కర్థం జన జీవన వ్యాఖ్యానమనుకుంటే ఆ చరిత్ర మనలో చాల తక్కువ. ఎక్కువగా మనవారు ఆధ్యాత్మ చింతా సాగర విహారులే గాని ఇహలోక కార్య స్పృహాసక్తులు కారు. ఏ కొద్దో గొప్పో చరిత్ర వున్నా అది రాజుల్ని కేంద్రంగా చేసుకొని పరిభ్రమించిందే. పరవసించిందే. ఈనాడు కావలసింది సామాన్యుడి జీవనాన్ని గర్భీకరించుకున్న చరిత్ర. అంటే జన జీవన విధానాలను వెలుగులోకి తేవలసిన చరిత్ర. సామాజిక చరిత్ర.

సామాన్య జన జీవనానికి నిసర్గ రమణీయ దర్పణం జానపద సాహిత్యం. హృద్గతమైన ఆనందం, ఆవేశం, సుఖం, దుఃఖం, భయం, భక్తి, అనురాగం, అపహారం, వ్యామోహం, వాత్సల్యం, క్రోధం, కార్పణ్యం మరెన్నో మానవ స్వభావాల సహజ వ్యక్త రూపమే జానపద వాఙ్మయం. నాగరక సాహిత్యంలో వీటికే కృత్రిమత్వం పులమడం జరుగుతుంది. జానపద సాహిత్యం జాతి యొక్క నైజ గుణాలకు ప్రతీక. స్వచ్ఛ రమణీయతకు పతాక. జానపద సాహిత్యాంశాల్లో ప్రధానంగా పరిగణించదగినవి గేయాలు, కథా గేయాలు, పద్య కథనాలు, సామెతలు, పొడుపు కథలు మొదలైనవి. మౌఖిక సంప్రదాయ సంబంధులయిన ఈ జానపద ప్రక్రియలను శాస్త్రబద్ధంగా అధ్యయనం చేయడం ఆరంభమైంది ఇటీవలనే. అనాదృతంగావున్న ఈ సాహిత్యాన్ని వెలుగులోకి తెచ్చే ప్రణాళికల్ని మన రాష్ట్రంలో సాహిత్య అకాడమీ, విశ్వ విద్యాలయాలు చేపట్టాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1979-80 సంవత్సరంలో "తెలుగు సామెతలు - సాంఘిక జీవితం" అనే విషయాన్ని ఒక పరిశోధనాంశంగా నిర్ణయించి పోటీలు నిర్వహించింది. ఆ పోటీలో నెగ్గి బహుమాకృతి నందుకున్న డా॥ పి. నరసింహారెడ్డి గ్రంథమే ప్రస్తుతం మీ చేతుల్లోవున్న గ్రంథం.

నిత్య జీవితంలో సామెతల ఆమెతలు వడ్డించనివాడూ, తిననివాడూ ఉండడు. వక్తవ్య విషయావబోధకు సులభ సాధనం సామెత. విషయాన్ని విశదంగా, సూటిగా, స్పష్టంగా సామ్య రూపంలో వ్యక్తం చేయడానికి ప్రతి ఒక్కరికీ ఉపకరించేదే సామెత. ఈ సాధన సంపత్తి ఎవరిలో ఎక్కువ వుంటే వాడు మాటకారి - చిత్తహారి అవుతాడు. సామెత ప్రసంగానికి ప్రాణం. అంతేకాదు, ఏ రచనకైనా జవజీవాల్ని ప్రసాదించే వాటిలో సామెతలు ప్రధానమైనవి.

సామెత అనే పదం 'సామ్యత' కు ఏర్పడిందని డా॥ చిలుకూరి నారాయణ రావుగారి మాట. సామెతకు తెలుగులో లోకోక్తి, శాస్త్రం, సామ్యం, శత, నానుడి, సాటవ మొదలైన పర్యాయాలున్నవి. ఏ పేరుతో పిలిచినా సామ్యం, ప్రాచుర్యత, తరతరాల అనుభవం, సాంప్రదాయికత, సారవత్త, సంక్షిప్తత, శ్రావ్యత సామెత ప్రధాన లక్షణాలు. ఈ లక్షణాలే సామెతల ప్రాచుర్యానికి, ప్రాధాన్యతకు కారణాలు.

ప్రజా వ్యవహారంలో వున్న సామెతల్ని మొదటగా సేకరించిన ఘనత ఎం. డబ్ల్యు. కార్ అనే పాశ్చాత్యుడిది (1868). అప్పటినుండి ఎందరో ఈ సేకరణ వ్యవసాయంలో కృషిచేసిన వారున్నారు. (ఈ గ్రంథం పట్టిక నెం.1 లో ఉదాహరించడం జరిగింది.) "సామెతల వాఙ్మయం" పై వచ్చిన మొదటి పరిశోధనా గ్రంథం డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిది. విస్తారంగా సామెతల్ని నిశితంగా విభజించి విశ్లేషించడానికి జరిగిన బృహత్ప్రయత్నం డా॥ నరసింహారెడ్డిదేననాలి. "తెలుగు సామెతలు - జన జీవనం" అనే ఈ గ్రంథ రచనకోసం రచయిత వివిధ ఆకరాల ద్వారా మొత్తం 40,550 సామెతల్ని పరిశీలించాడు. పునరుక్తుల్ని పరిహరించి దాదాపు 16 వేల వరకు ఈ పరిశోధన కాధారంగా స్వీకరించాడు.

తెలుగు సామెతల్లో జన జీవనం అంటే సామెతల ఆధారంగా తెలుగు వారైన సామాజికుల జీవన విధానాలు, విలువలూ, ప్రమాణాలూ అన్నీ సమగ్రంగా చూపడం. జన జీవనంలో సామెతలు నిర్వహించే పాత్ర కూడా స్పష్టంగా గోచరిస్తుంది. సామెతలో కుటుంబ జీవనమంతా ప్రతిఫలిస్తుంది. అంటే కుటుంబ సభ్యుల మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలు, అనురాగం, వాత్సల్యం, ద్వేషం, సాన్నిహిత్యం - ఇరుగు పొరుగుల్తో, చుట్టాలతో ఉండే సంబంధాలు తెలుస్తాయి. సంఘంలో వ్యక్తి పాత్ర ఎటువంటిది? వృత్తి కులం, ఆహారపుటలవాట్లు, వ్యాపారం, పరిపాలన మొదలైన అనేకానేక విషయాలు అవగతమవుతాయి. భిన్న సంస్కృతుల మధ్య వుండే వ్యత్యాసం, సంబంధం వాటికి కారణాలయిన మతం, విద్య, వైద్యం, కళలు, వినోద విలాసాలు, ఆటలు, ఆచారాలు, నమ్మకాలు మరెన్నో విషయాలు వెలుగులోకి వస్తాయి. తెలుగు సామెతలు ఆధారంగా ప్రజా జీవనంలోని వివిధ దృక్కోణాల చిత్రణ ప్రమాణయుక్తంగా జరిగింది.

నరసింహారెడ్డి నిజమైన పరిశోధకుడు. నిరంతర పరిశోధకుడు. అతని పరిశోధనా పటిమ ఈ గ్రంథం ప్రతి పుటలోనూ కన్పిస్తుంది. లభించిన ఆకరాల్ని విభాగానుక్రమంగా వింగడించి తగిన సామెతల్ని అంకెకు తీసుకొని రాయడమంటే మాటలతో పనిగాదు. నరసింహారెడ్డి పట్టు విడువని, పట్టి విడువని పరిశోధకుడు.

అందుకే మా పరిశోధక విద్యార్థులు చమత్కారంగా ఇతణ్ణి పరిశోధక రాక్షసు డంటారు.

విషయ సేకరణ, వస్తు విశ్లేషణ, అంతర్వీక్షణ, వాదనా పటిమ, క్రమ శిక్షణాయుతమైన పాండిత్యం, సిద్ధాంత నిర్ధారణ, అనుగుణమైన భాషాచాలన కౌశలం నిజమైన పరిశోధకుని లక్షణాలనుకుంటే అవన్నీ సహపాళ్ళలో సముపార్జించు కున్న వ్యక్తి డా॥ నరసింహారెడ్డి.

గ్రంథస్థమైన సామెతల్ని చూడడమేకాక డా॥ నరసింహారెడ్డి వ్యవహారంలోని 450 కొత్త సామెతల్ని సేకరించాడు. డా॥ చంద్రమౌళి వంటి మిత్రుల ద్వారా మరికొన్నింటిని సంపాదించాడు. ప్రస్తుతం ఆంధ్రదేశంలో లభించే (1) తెలుగు సామెతల సంకలన గ్రంథాలు (2) తెలుగు సామెతల ప్రయోగ దృష్టితో పుట్టిన రచనలు (3) తెలుగు సామెతలు ఏకదేశంగా ఉన్న గ్రంథాలు (4) తెలుగు సామెతల్ని ప్రచురించిన పత్రికలు, బులెటిన్లు సమన్వయించి ఒక మంచి సామె తల సంకలనం తయారు చేయవలసిన అవసరంవుంది. అది సంస్థలు చేపట్టవలసిన పని. అలా చేసినపుడు ఆ సంకలన గ్రంథం ఎన్నో పరిశోధనాంశాలకు ఆకర గ్రంథంగా ఉపకరిస్తుంది. తెలుగు సామెతల్లో వృత్తులు; తెలుగు సామెతల్లో కుటుంబ వ్యవస్థ; తెలుగు సామెతల్లో స్త్రీ మొదలైన అనేకానేక విషయాలు పరి శోధనాంశాలుగా భావి పరిశోధకుల ముందు నిలుస్తాయి.

మా నరసింహారెడ్డిని "ముందు ముందు ఇంకా మంచి గ్రంథాలు వెలు వరించాలని" భుజం తట్టవలసిన పనిలేదు. పరిశోధనే అతని ప్రాణం గనుక, వ్రాయడం అతని తపను గనుక. తెలుగులో విమర్శ గ్రంథాల్ని కొనే అలవాటు లేదు. రచయితకు కనీసం అచ్చు ఖర్చులు కూడా రావు. రాయల్టీ మాట దేవు డెరుగు. అచ్చు ఖర్చు లిస్తే సంవత్సరానికొక మంచి గ్రంథం అలవోకగా అందించ గలడు నరసింహారెడ్డి.

ఈ గ్రంథానికి "ఆప్తవచనం" పల్కమన్నపుడు నన్ను దానికి ఉసిగొల్పి నవి రెండు విషయాలు. ఒకటి నరసింహారెడ్డి మీదవున్న ప్రేమానురాగాలు. రెండు అంకితం పుచ్చుకున్న ఆచార్య జి. యన్. రెడ్డిగారి మీద వున్న గౌరవాభి మానాలు. ఈ పరిశోధనలో ప్రాథమిక దశనుండి నిర్మాణ దశ వరకు మనసుపెట్టి ముందుకు నడిపిన మనీషి ఆచార్య రెడ్డిగారు. అంతే కాదు మా తెలుగు అధ్యయన శాఖ పరిపూర్ణ వికాసానికి ఆయనే చోదక శక్తి. అందుకే ఆయనకు అంకిత మివ్వడమంటే మా అందరికీ ఆనందం. ఆ ఆనంద ప్రకటనకే ఈ ఆప్తవచనం.

# విషయ సూచిక



# ఒప్పుల పట్టిక

(కండ్లలో వత్తులు వేసుకొని గాలించినా ముద్రారాక్షసాలు కొన్ని దొర్లాయి. సహృదయంతో సరి చేసుకొండి)

| పుట | పంక్తి | ఒప్పు | పుట | పంక్తి | ఒప్పు |
|---|---|---|---|---|---|
| xi | 13 | బంగోరెగారు | 4 | 20 | భద్రపరచు |
| 5 | 11 | సంక్షిప్త | 7 | చివరి | భార్య |
| 11 | 11 | తర్వాతికాలంలో | 12 | 2 | చోళ్లెక్కడ |
| 17 | 8 | సామెతలు | 32 | 11 | తల్లిదండ్రుల |
| 36 | 19 | పాతాళగంగలు | 37 | 25 | ఆలుమగలు |
| 42 | 1 | అల్లుని | 48 | 11 | కసిని వెళ్ల |
| 49 | 27 | మనుమరాళ్లు | 56 | 18 | నొయ్యకుండా |
| 57 | 9 | జననిని | 58 | 27 | ఆంధ్రప్రదేశ్‌లో |
| 60 | 14 | ఆరుద్రలో | 61 | 2 | జొన్నకు |
| 76 | 16 | పరిచేలు | 79 | 29 | తప్పినా |
| 81 | 9 | వేస్తే | 84 | 2 | మేస్తే |
| 84 | 4 | బెన్‌సన్ | 89 | 14, 15 | వివరించబడింది. |
| 95 | 7 | పాలిస్తుందో | 98 | 22 | వృత్తిని |
| 98 | 28 | సంవత్సరానికింత | 99 | 18 | వ్యంగ్యార్థం |
| 101 | 25 | వారికి | 104 | 15 | దొంగతనంలాంటివి |
| 112 | 14 | కులవిరుద్ధమైన | 117 | 7 | చాటుకు |
| 117 | 15 | లంజలం | 117 | చివరి | 89 |
| 118 | 26 | చదువులు | 120 | 4 | బీదవారైన |
| 120 | 17 | పై విషయాన్ని | 122 | 16 | పొత్తును |
| 126 | 7 | కాని | 136 | 25 | పరమెత్తి |
| 139 | 3 | మొండి | 139 | 19 | ఊచముట్టుగా |
| 140 | 8 | వర్తకుల | 141 | 27 | ఆంధ్రులు |
| 144 | 23 | తినగలమ్మ | 146 | 9 | పళ్లు |
| 155 | 20 | కారములేని | 159 | 23 | వేణీళ్ల |
| 160 | 9 | అతిరసాలు | 160 | 18 | రామచంద్రప్పొడి |

| పుట | పంక్తి | ఒప్పు | పుట | పంక్తి | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 161 | 23 | ఇల్లు విచ్చిన | 165 | 4 | ఉపప్రకరణంలో |
| 165 | 10 | సంవత్సరాని | 166 | 8 | చెప్పబడ్డది |
| 167 | 8 | చేసేవారికి | 168 | 10 | చెపుతుంది |
| 172 | 17 | అద్వై | 174 | 7 | కట్టును |
| 176 | 16 | 3.5.2 | 181 | 10 | పొయ్యే |
| 185 | 25 | కుంపట్లు | 186 | 26 | పెట్టుకొని |
| 190 | 3 | కోతె | 192 | 1 | ఆజ్ఞ |
| 193 | 2 | సేవకులు | 202 | 1 | పాత్రరాహులు |
| 208 | 8 | తిరుపతిలో | 209 | 9 | పెండ్లి |
| 213 | 18 | ఉండనే | 216 | 26 | సృష్టించారు |
| 219 | 20 | బయటపడినట్లు | 219 | 25 | స్వామి |
| 228 | 27 | శరగోపం | 228 | చివరి | దిద్దుకోవడం |
| 229 | 1 | పార్శ్వ | 229 | 5 | నమ్మించేందుకు |
| 236 | 21 | పట్టని | 237 | 24 | లేరని |
| 241 | 11. 12 | చెపుతుంది | 243 | 17 | తులసి |
| 244 | హైటిల్ లైన్ | 4.2 | 246 | 3 | సతికి |
| 244 | 16 | ఓర్చుకోవలదా | 261 | 19 | తప్పరాదు |
| 263 | 21 | జనకరాగమైన | 264 | 21 | మెడను |
| 266 | 11 | ప్రదానిత్వం | 278 | హైటిల్ లైన్ | 4.4 |
| 279 | 25 | మేడి | 285 | 6 | నిర్దేశిస్తున్నాయి |
| 286 | 8 | కదాని | 287 | 1 | హై సా VI-2 |
| 290 | చివరి | ప్రసవ | 295 | 23 | పై కెత్తి |
| 303 | 2 | పిల్లి | 304 | 19 | వ్యతిరేకంగానే |
| 305 | 18 | పెద్దయిం తర్వాత | 305 | 27 | 4.5.12 |
| 312 | 13 | పేడ మరకలతో | 317 | 20 | ప్రస్తావన |
| 321 | 21 | ఇప్పపూలకు | 333 | 7 | చూస్తుంది |
| 335 | 9 | రేపు | 337 | 4 | పోస్తే |
| 345 | 22 | పుట్టు | 348 | 10 | లోక |

# ప్రవేశిక

పల్లీయుల రక్తం పంచుకొని పుట్టి, నిసర్గ జనపద సౌందర్యాన్ని మువ్వై ఏళ్ల పాటు జుర్రుకొన్న అదృష్టం నాది. వింత వింత ఊకుడు కథలకు చెవులప్ప గించి, వెన్నెల రాత్రుల్లో అమ్మలక్కల 'జక్కి పాటలకు' తల ఊపి, వీధి నాట కాల్లో పల్లవి పాడి, పగలంతా పొలంలో శ్రమించిన కాపు వనితలు రాత్రివేళల 'పొడుపు కథలు' వేసి విప్పుకోగా విని, "పొయ్యి అరిస్తే చుట్టాలు వస్తారు, ఉత్త తీతి (తీతువు) అరిస్తే అరిష్టం" లాంటి గ్రామీణుల నమ్మకాల్ని ఆకళింపుకొని, చతుర సంభాషణల్లో పుంఖానుపుంఖంగా వారు ప్రయోగించే సామెతల్ని వొంట బట్టించుకొని గ్రామీణ జీవనాన్ని, జానపద విజ్ఞానాన్ని కొంతలో కొంత తెలుసుకో గలిగాను.

జానపద విజ్ఞాన శాఖల్లో ఏదో ఒక దానిలో పరిశోధన చేస్తే బాగుండును అన్న నా తపనకు 1979-80 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి పోటీ అంశం "తెలుగు సామెతలు - సాంఘిక జీవితం" వెతక బోయిన తీగ కాలికి తగిలినట్లయింది.

తెలుగు సామెతలకు సంబంధించి జరిగిన కృషి ఎంతో నా విషయ పేకర ణలో తెలుసుకొన్న విషయాలివి: 1852 నుంచి 1980 దాకా 128 సంవత్సరాల కాలంలో I సామెతల సంకలన గ్రంథాలు II సామెతలు ఏకదేశంగా ఉండే గ్రంథాలు III. సామెతల ప్రయోగ దృష్టిగల గ్రంథాలు IV సామెతల్ని ప్రచు రించిన పత్రికలు - బులిటెన్‌లను గురించిన సంగ్రహ నివేదిక ఇది. నేను సామె తల్ని సేకరించిన I. గ్రంథ పీఠికలు, వ్యాసాలు, గ్రంథాలు వగైరా గురించి, II. నా పరిశోధనకు మూలాధారాలుగా నిల్చిన కొందరు వ్యక్తుల సేకరణను గురించి కూడా ఇక్కడే చెప్పడం జరుగుతుంది.

ఈ గ్రంథాలకు సంబంధించిన సామాన్య విషయాలన్నీ పట్టిక (చూ. పట్టిక నెం. 1) లో ఇచ్చి, విశేషాంశాలు మాత్రం ఇచ్చట పొందుపరుస్తున్నాను.

## I సామెతల సంకలన గ్రంథాలు.

1. ఆంధ్రలోకోక్తి చంద్రిక : సామెతల సంకలన గ్రంథాల్లో మొదటిది, సి. పి. బ్రౌన్ సేకరించిన ఈ గ్రంథం ప్రతిని ఇండియా ఆఫీస్ రికార్డ్స్, లండన్ నుంచి మైక్రోఫిల్మ్ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ తెలుగు అధ్యయనశాఖ లోని బ్రౌన్ రీసెర్చి ప్రాజెక్టు కోసం తెప్పించబడింది. ఇందులో బ్రౌన్ అక్కడ క్కడా కామెంట్స్, కొన్ని సామెతలు రాసుకొన్నాడు.

ఈ గ్రంథంలో ఆంధ్ర లోకోక్తి చంద్రిక (1-2134). ఆంధ్ర లోకోక్తి చంద్రికా శేషము (2135 - 2700) అనే రెండు భాగాల్లో మొత్తం 2700 తెలుగు సామెతలున్నాయి. 488 సంస్కృత లోకోక్తులు కూడా ఉన్నాయి. ఇందులోని రెండు సూచికల్లో మొదటి దాన్లో ముఖ్య పదానుక్రమణిక, రెండవ దాన్లో తెలుగు సామెత లకు సమానార్థకాలైన 702 యూరోపియన్ సామెతలు, సంస్కృత లోకోక్తులకు సమానార్థకాలుగా 771 యూరోపియన్ సామెతలు వర్ణక్రమాన్ననుసరించి ఇవ్వ బడ్డాయి. తప్పొప్పుల పట్టిక ఉంది.

తన అభ్యర్థనపై చాలా యేండ్లు సామెతలను సేకరించి ఇచ్చింది రావి పాటి గురువయ్యగారు (రావిపాటి గురుమూర్తి శాస్త్రి) అని, తెలుగు సామెతలుండే ఒక వ్రాత ప్రతిని ఇచ్చింది రెవరెండ్ పి. పెర్సివాల్ అని 'ప్రిఫేస్' లో కార్ చెప్పుకొన్నాడు. సామెతల్ని house-hold words గాను, people's words గాను కార్ ప్రశంసించాడు. ఈయన 1871 జనవరిలో చనిపోయినట్లు బ్రౌన్ తన ప్రతి కవర్ పేజ్‌పై రాసుకొన్నాడు.

ఈ గ్రంథం 1869 లో అచ్చయినట్లు "తెలుగు సామెతలు మొదట సేక రించిన కీర్తి కార్ దొరగారికి చెందగా వారి అనుమతి పైని తెలుగులో తొలి సారిగా అకారాది క్రమంగా సామెతలను అచ్చువేసిన యశస్సు పువ్వాడ వేంకట రావుగారికి చెందుతుంది .... 1869 సంవత్సరంలో వారు తెలుగు సామెతలను ఆంధ్ర లోకోక్తి చంద్రిక అనే పేరుతో ప్రకటించారు." అని 'తెలుగు సామెతలు' అనే వ్యాసంలో నిడుదవోలు వేంకటరావు రాశారు. 1868లో కార్ ప్రచురించిన 'ఆంధ్ర లోకోక్తి చంద్రిక'లో తెలుగు సామెతలు అకారాదిగానే కూర్చబడ్డాయి.

తెలుగు సామెతలకు ఆంగ్లానువాదం ఇవ్వకపోయినా సమానార్థకాలైన యూరోపియన్ సామెతల్ని చూపడం, కొన్ని పదాలకు అర్థాలు, వివరణలు

ఇవ్వడం, 75 తెలుగు సామెతలకు ఆధారమైన కథల్ని ఉటంకించడం ఈ గ్రంథంలోని విశేషాలు.

ముఖ్య పదానుక్రమణికతో, ప్రజల వాడుకలో వుండే సామెత కథల్తో, వివరణల్తో, అనురూప విషయాలుండే సామెతలకు Cross references ఇస్తూ ఈ సామెతల గ్రంథాన్ని సంకలనం చేసిన కార్ రచనా ప్రణాళిక నేటికీ అనుసరణీయమే,

2. తెలుగు సామెతలు :

**(Selected Telugu Proverbs for the S. I. M. A. Examinations :** పై పరీక్షకోసం ప్రచురించబడిన గ్రంథమిది. నోట్సు, ఇతర సామెతలు విద్యార్థులు రాసుకొనేందుకు వీలుగా నడుమ నడుమ తెల్ల కాగితాలున్నాయి.

**3. Telugu Proverbs from Hyderabad:**

మెదక్ ధియాలాజికల్ ఇన్‌స్టిట్యూషన్ లోని అధ్యాపకులు, విద్యార్థుల సహకారంలో జె. జి. బెన్నెట్ తాను సేకరించిన 200 సామెతల్ని పది సమాన భాగాలుగా వివిధ విషయాల క్రింద ఇచ్చాడు. ఇలా సామెతల్ని విభజించి సంకలనం చేసిన మొదటి గ్రంథం _ చివరి గ్రంథం కూడా ఇదే. దీన్లో విషయ సూచిక ఇలా వుంది ; i) Comparision : సమాన భావోక్తులు; ii) of consequence ఫలితార్థ సంబంధము. iii) Of contrast and Anamalies వ్యతిరేకోక్తులు; iv) of Devices and Shrewd ness : యుక్తి చమత్కార సంబంధము; v) Of disappointments and Misfortune : దురదృష్ట సంబంధము; vi) Of domisticities and Marriage. సంసార సంబంధము; vii) Of inefficiency నిష్ప్రయోజన సంబంధము; viii) Of ingratitude and meanness : నిర్దయా కృతఘ్నతా సంబంధము; ix) Of injustice and false pretences మోస సంబంధము; x) Of various occasions నానా విధములు అనేవి. పది పుటలు, మధ్య తెల్ల కాగితాల్తో కూర్చబడింది.

4. ఆంధ్ర లోకోక్తి ముక్తావళి: నాకు లభించిన గ్రంథం 934 వ సామెతైన 'నా చేతి మాత్ర పైకుంఠ యాత్ర' వరకే ఉంది. కొన్ని సామెతలకు క్రింద కొద్దిపాటి వివరణ ఉంది, సామెతలకు సంబంధించిన కథలు ఇవ్వబడ్డాయి,

5. తెలుగు సామెతలు : వేటపాలెం లైబ్రరీలోని నెం. 4754 ప్రతి. కవర్ పేజీలు లేనందువల్ల వివరాలు లభించలేదు. గ్రంథాలయ కేటలాగులోనూ వివరాలు లేవు.

6. తెలుగు సామితలు : కార్ గ్రంథం 'ఆంధ్రలోకోక్తి చంద్రిక' ను 'తెలుగు సామితలు' అనే పేర్తో వావిళ్లవారు సంగ్రహించి ప్రచురించారు. కార్ ఇచ్చినట్లు అర్థ వివరణలాంటివి ఇవ్వలేదు. అక్కడక్కడా 'ర' ను బండి ఱ గా మార్చడం ఇలాంటి చిన్న మార్పులు చేశారు. ఆంధ్రలోకోక్తి చంద్రిక - ఆంధ్ర లోకోక్తి చంద్రికాశేషము లోని సామెతల్ని కలిపి ఎంపిక చేసుకొన్న సామెతల్నే ఈ గ్రంథంలో ప్రచురించారు.

7. వ్యవసాయ సామెతలు : ఏడు పుటల ఉపోద్ఘాతం వ్యవసాయ ప్రాధాన్యాన్ని నొక్కి చెపుతోంది. 912 తెలుగు వ్యవసాయ సామెతలు, 234 నానాదేశ వ్యవసాయ సామెతలు ఉన్నాయి.

8. సామెతలు : రచయిత గట్టినేని రామస్వామి చౌదరి. ప్రచురణ సంవత్సరం వేయలేదు. రచయిత, వారి ధర్మపత్నుల ఫోటోలున్నవి. ఆమెగారి ఫోటో కింద కీ. శే. గట్టినేని మహాలక్ష్మి. జననం 1910 - మరణం 1958 అని ఉంది. దీన్ని బట్టి 1958 తర్వాతనే ఈ గ్రంథం ప్రకటించబడినట్లు నిర్ణయించవచ్చు.

9. పసిడి పలుకులు : 1. సామెతలు (లోకోక్తులు) అనే శీర్షిక కింద 4008 సామెత లివ్వబడ్డాయి. సరిగా లెక్కించగా 4009 తేలాయి. 2. జాతీయములు 2077 ఉండగా, అందులో 185 సామెతలుగా నిర్ణయించాను. 3. తేనెసోనలు అనే శీర్షిక కింద వ్యవసాయ సంబంధాలు 23, వైద్య సంబంధాలు 19, జ్యోతిష సంబంధాలు 9, సంసార సంబంధాలు 11, సాంఘిక సంబంధాలు 10, ఫలా ఫలాలు 11, నీతి సంబంధాలు 5. పురాణ సామెతలు 55 ఉన్నాయి. మొత్తం సామెతల సంఖ్య 4325 గా తేల్చి పరిశీలించడం జరిగింది. ప్రత్యేక శీర్షికల కింద చెప్పిన సామెతలకు శాస్త్రీయమైన వివరణ ఉంది.

10. సాటి సామెతలు : సంకలనం : శ్రీ నిడుదవోలు వేంకటరావు, శ్రీ ఎమ్. మరియప్ప భట్, డాక్టర్ ఆర్. పి. సేతు పిళ్లై, డాక్టర్ ఎస్. కె. నాయర్. తప్పొప్పుల పట్టిక ఉంది. 420 తెలుగు సామెతలు తత్తుల్యమైన తమిళ, మలయాళ, కన్నడ భాషల్లోని సామెతలు తెలుగు లిపిలోనే వున్నాయి. తెలుగు సామెతలకు తుల్యమైన సామెత కనీసం ఇంకొక భాషలో ఉన్నా ఇవ్వడం జరిగింది.

11. తెలుగు సామెతలు (ద్వితీయ ముద్రణ) :

సంపాదక వర్గము: కళాప్రపూర్ణ, కవి సమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణగారు (అధ్యక్షులు), అబ్బూరి రామకృష్ణరావుగారు, శ్రీమతి యశోదారెడ్డిగారు మరుపూరు కోదండరామ రెడ్డిగారు. 'సామెతలు' అనే పేర్తో ప్రథమ ముద్రణ పీఠిక సంపత్ రాఘవాచారిగారిది (పు. 1-36), 'సామెతలు' అనే పేరుతోనే ద్వితీయ ముద్రణ పీఠిక విశ్వనాథ సత్యనారాయణగారిది (పు. 37-64) ఉన్నాయి. సంపత్ రాఘవాచారి తన పీఠికలో సమానార్థకాలైన 79 తమిళ-తెలుగు సామెతల్ని, 26 కన్నడ - తెలుగు సామెతల్ని ఇచ్చారు. తమ పీఠికలో 23 సామెతలకు విశ్వనాథవారు కథల్ని చూపారు.

12. ప్రజాసూక్తం: విశేషాలేమీ లేవు.

13. తెలుగు సామెతలు (మూడవ కూర్పు) :

సంపాదక వర్గం: డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, డాక్టర్. పి. యశోదా రెడ్డి, మరుపూరు కోదండరామ రెడ్డిగారు (కన్వీనర్). ఇందులో సంపత్ రాఘవాచారిగారి పీఠిక యథాతథంగా ఇవ్వబడింది (పు. 1-30). విశ్వనాథ వారి పీఠికలో సామెతల కథల్ని, మరికొన్ని భాగాల్ని తొలగించి ప్రచురించారు (పు. 31-38). విశ్వనాథ వారిచ్చిన సామెతల కథలు 23 లో 7 టికి మాత్రం 'ఫుట్‌నోట్'లో గతి కల్పించబడింది. మిగిలిన 16 టికి గతి కల్పించలేదు. కన్వీనర్ వచనములు మరుపూరు కోదండరామరెడ్డిగారివి (పు. 39-42). ఇంతవరకు వచ్చిన సామెతల సంకలన గ్రంథాలన్నిటిలోనూ చాలా పెద్దది.

14. జన శ్రుతులు: ఇందులో సామెతల్తోపాటు రచయిత (సాతవిల్లి కామేశ్వర శర్మ) సొంత వాక్యాలూ ఉన్నాయి. ఆయనే "నాకు కలిగిన భావాలను ముక్తసరిగా సామెతలలాగ వ్రాసుకుంటూ వచ్చినాను. అవి సామెతలేనని నేననను. అయినా ప్రజల్లో బాగా ప్రచారంలో ఉన్న సామెతలతో కలిపి మీకు అందించే సాహసం చేసేను" అని చెప్పుకొన్నాడు. అంతే కాదు. ఆయన సామెతల్ని అవకతవకలుగా మార్చే దుస్సాహసం కూడా చేశాడు. ఉదా॥ 'అమ్మితే ఆడవంది-కొంటే కావంది', 'అందరూ పల్లకి ఎక్కుతారు - మోసేవారు నక్కుతారు' లాంటివి. ఆయన సొంత వాక్యాలు కొన్ని: 'అంతా మంచికనేది అనుకుంటేనే ఉండేది', 'అల్ప సంతోషి - మంచి మనిషి'.

15. సామెతల ప్రవంతి : సామెతలకు శాస్త్రీయమైన వివరణ. కథలు, ప్రయోగం ఇవ్వబడ్డాయి. వివరణలో సమానార్థకాలైన 30 సామెతలున్నాయి

16. తెలుగు సామెతలు : విశేషాలేమీ లేవు.

II సామెతల ప్రయోగమే దృష్టిగా వుట్టిన రచనలు:

1. సరసోక్తియుక్త కృష్ణ శతకము: రచన వెట్టి లక్ష్మీనరసింహా కవి. గ్రంథం నాకు లభ్యం కాలేదు దాన్ని గురించిన క్రింది విషయాలు 'ఆంధ్ర శతక సాహిత్య వికాసం' (పు. 557) అన్న గ్రంథంలోవి. "బూతులలో అశ్లీల వర్ణన లతో పూర్ణమైన శృంగార శతకములలో 'సరసోక్తియుక్త కృష్ణ శతకము' అద్వ మైనది ఒక్కొక్క పద్యమునందు శ్రీ కృష్ణుని శృంగార క్రీడలు లేక అవతార లీలలు వర్ణింపబడినవి ఈ వర్ణనలను బూతులుగను, నుడికారములు, లోకోక్తులు మున్నగు వానిచే సమర్థింప జూచుకొనుట గమనింపదగిన విశేషము.

'అత్త పూజకే ప్రత్తి గింజ మామ యెద్ద మంచపు కోడు' అను లోకోక్తి సూతగా గొని ఈ పద్యమున కవి శ్రీకృష్ణుని శృంగార క్రీడలను వర్ణించెను. గోపికా వస్త్రాపహరణము, కాళింగ మర్దనము, రుక్మిణీ పరిణయము, మున్నగు సన్నివేశములను వర్ణించిన పద్యములయందు కవి ఏదో నాక లోకోక్తిని ప్రయోగించెను. లక్ష్మీ నరసింహకవి ఈ శతకమును వివిధ వృత్తములలో, పద్య ములలో రచించినందున మకుట నియమము పాటించ లేదు".

2. ఆంధ్రలోకోక్తి పంచాశతి . రచన పణుమల నృసింహశాస్త్రి. 51 వృత్తాలు, "చిత్తమా" అనేది మకుటం. ప్రతి పద్యం చివరి పాదంలో ఒక తెలుగు సామెత ఉంది. ఉదా॥ లేనిమబంది కన్న గను లేని మందియు మేలు చిత్తమా.

3. శకున పక్షి : నార్ల వేంకటేశ్వరరావు 16 నాటికల సంపుటి "కొత్తగడ్డ" నాగ్లో నాటిక 'శకున పక్షి' (పుట. 87 - 106) లో సీతాపతిని శకున పక్షిగా చిత్ర యిరచి చిత్రించారు. ఆ పాత్ర మాట్లాడిన 32 సన్నివేశాలలో 62 సామెతల్ని ప్రయో గించడం విశేషం. మొత్తం సామెతలు 66.

4. ఉన్నమాట విసిరా : రచన పి. వి. శ్రీనివాసమూర్తి. తాను వ్రాసిన వెయ్యి అటవెలదుల్లో 250 టిని మొదటి సంపుటంగా ప్రకటించారు. రచయిత మాటల్లో "ఉన్న మాటలంటే - తెలుగులో ఉన్న పలుకుబడులు - జాతీయాలు, లోకోక్తులు, సామెతలతో కూడిన మాటలని ఒక అర్థం. సంపుటంలోని యదార

స్థితిని, మనుష్యుల పోకడలను వివరించే మాటలని ఇంకో అర్థం''. 250 పద్యాల్లో 127 సామెతలున్నాయి. ఒక్కొక్క పద్యంలో రెండు సామెతలు కూడా ఉన్నాయి. ఉదా॥ ఎంత దంట గూడ ఇంట గెలువకుండ రచ్చగెల్వ బూన మెచ్చ దగదు ఉట్టి కెక్క లేక యెట్టు లెక్కును స్వర్గ మున్నమాట వినర ! చిన్నవాడ !

**III** తెలుగు సామెతలు ఏకదేశంగా ఉన్న గ్రంథాలు :

**1;** బ్రౌన్ తెలుగు ఇంగ్లీషు నిఘంటు :

ఇందులో 294 సామెతలు లభ్యమైనాయి. 44 టికి మాత్రం - 'A proverb says' - 'Proverb' అని బ్రౌన్ సూచించాడు. వీటిలో చాలా మాత్రం వేమన తదితరుల సాహిత్యం నుంచి ఎత్తి చూపినవే. పదాలకు అర్థాలిచ్చేటప్పుడు ఆ సందర్భానికి తగిన వాక్యాలుగా సామెతల్ని ఇచ్చాడు.

2. ఆంధ్ర విజ్ఞానము : ఇందులో 692 తెలుగు సామెతలు, 617 ఇతర భాషా సామెతల తెలుగు అనువాదాలు ఉన్నాయి. వివరణ వాక్యాలు, సామెతల కథలు ఉన్నాయి.

3. సుభాషిత రత్నాకరము : విశేషాలేమీ లేవు.

4. పెద్ద బాల శిక్ష : పుదూరి సీతారామశాస్త్రుల వారిచే 'ఆంధ్ర భాషాభ్యాసము చేయదలచిన బాలురకు ప్రథమ శిక్షకు నుపయుక్తముగా నేర్పఱుపబడిన బాలశిక్ష' 1847వ సంవత్సరంలో మొదటిసారిగా అచ్చుపడింది. బి.సి.వావిళ్లవారు దీన్ని 1949లో పునర్ముద్రించారు. మధ్యలో మరి కొన్ని ముద్రణలు కూడా పొందినట్లు తెలుస్తుంది. తెలుగు సామెతలు మొదటి ముద్రణలోనే ఉన్నవో. తర్వాతి ముద్రణల్లో ఎప్పుడు కలసినవో తెలియడం లేదు.

5. వ్యవసాయ ముహూర్త దర్పణము :

ఈ గ్రంథం గురించి పండితాభిప్రాయంలో 'దైవజ్ఞ' మధిర కృష్ణమూర్తి ఇలా అన్నారు. "యీ గ్రంథములో రైతులకు వ్యవసాయమునకు పనికి వచ్చు కాలములు, ఏ కాలమందు ఏ కర్మను చేసిన వారికి అనుకూల ఫలదాయకమై, బహు ద్రవ్యలాభాదులకు పశు వృక్ష సస్యాదులకు సమృద్ధి గలిగి సుఖము లభించునో అట్టి కాలములను వ్యవసాయానుసర ప్రతి ముఖ్య కార్యమునకు శుభ కాల ముహూర్తాదులను వివరించి వ్రాసియున్నారు". ఇందులో 601 వ్యవసాయ సామెతలు చెప్పబడ్డాయి.

6. **పదబంధ పారిజాతము :** ఇందులో పదబంధాలుగా కొన్ని సామెతల్ని ఆరోపాలుగా ఇచ్చారు. కొన్ని పద బంధాలకు ఉదాహరణ వాక్యాలు సామెతలు.

7. విద్యార్థి కల్పతరువు . తెనుగు సామెతల్తోపాటు, లోకోక్తులు (863) అనే వేరే విభాగం కూడ ఉంది. లోకోక్తులు పద్య పాదాల్లో ఉన్నాయి. ఇందులోనివి 37 సామెతలుగా తీసుకోబడ్డాయి.

8. **రాయలసీమ పలుకుబడులు :** ఇందులో పలుకు బడులు, సామెతలు, పొడుపు కథలు ఉన్నాయి. అచ్చు తప్పులు అర్థావగాహనకు ఆటంకంగా ఉన్నాయి.

9. **రాయల బాల బోధిని :** విశేషాలేమీ లేవు.

**IV తెలుగు సామెతల్ని ప్రచురించిన పత్రికలు, బులెటిన్‌లు :**

1. శ్రీ దైవ సమాజిని అను పురుషార్థప్రదాయిని :

మొదటి సంపుటం 1872 సం॥ లోనిది. జనవరి 1872 నుండి డిశంబరు దాకా "సామితలు (ప్రోవెర్బ్స్)" అనే శీర్షిక కింద 16 సామెతలు వేశారు, ఇంగ్లీషు అనువాదం, లాటిన్, ఫ్రెంచ్, జర్మన్ భాషలోని సమానార్థక సామెతలు ఉన్నాయి.

**2. A Collection of Telugu sayings and proverbs bearing on Agriculture**

మద్రాస్ వ్యవసాయశాఖ డైరెక్టర్ విల్సన్ అభ్యర్థనపై, జిల్లా అధికారులు ప్రజల నుంచి సేకరించి పంపిన వ్యవసాయ సామెతల్ని అసిస్టెంట్ డైరెక్టర్ సి. బెన్సన్ ఎడిటరుగా వ్యవసాయ శాఖవారు ఒక బులిటన్ వేశారు. తెలుగు సామెతకు ఎదురుగా ఆంగ్లానువాదం ఉంది. సామెతలు ఏడు విభాగాల కింద విషయ విశ్లేషణ చేసి సంకలించబడ్డాయి ప్రతి విభాగం మొదట్లోను ఆ విభాగానికి సంబంధించిన విషయ వివరణ, కొన్ని ప్రత్యేక పదాల వివరణ ఉన్నాయి.

ఇందులోని ఏడు విభాగాలు 1. On farming generally (వ్యవసాయ సంబంధి) 1 నుంచి 74 దాకా సామెతలు; 2. On the weather and rainfall (వర్ష, వాతావరణ సంబంధి) 75 నుంచి 274 వ సామెత దాకా. 119 వ సామెత తర్వాత కార్తెల్ని గురించిన వివరణ, 196 వ సామెత తర్వాత గ్రహాల గురించి. స్థానిక విషయాల గురించి, 246 వ సామెత తర్వాత చెట్లు కాయలు కాయడాన్ని బట్టి కరువో - కాలమో, నిర్ణయించే సామెతలున్నాయి. ఆయా చెట్ల పరిచయం ఇవ్వబడింది. 3. On Tillages and general managements

(దుక్కి, సస్య సంరక్షణలు) 275 వ సామెత నుంచి 303 దాకా ఉండే సామెతలు; iv) On crops and cropping (పంటలు - పంట పెట్టడం) అనే శీర్షిక కింద 309 నుంచి 364 దాకా సామెతలు; v) Paddy (వరి) ఈ శీర్షికలో 365 నుంచి 389 దాకా సామెతలు; v) Other crops (వరి తప్ప తక్కిన పంటలు) ఈ శీర్షికలో 390 నుంచి 462 దాకా సామెతలు vii) On Live Stock (పశు సంరక్షణ) 483 నుంచి 515 దాకా సామెతలు.

వ్యవసాయ సంబంధమైన విషయ విశ్లేషణ, వివరణ, కార్తెల ప్రాధాన్యం, అవి వచ్చే ఇంగ్లీషు నెలలు, తేదీల్ని చెప్పిన ఇంతటి విపుల వివరణలు ఇప్పటికీ మార్గ దర్శకాలు.

3. వినోదిని : తాతపూడి సత్యనారాయణమూర్తిగారు సంపాదకులు. ఫిబ్రవరి 1931 సంచికలో చమత్కారమైన సామెతలు 26, లోకోక్తి ముక్తావళి శీర్షికలో 25 సామెతలు ఉన్నాయి.

4. గృహలక్ష్మి : 1947 డిశెంబర్ సంచికలో గృహలక్ష్మి సంపాదకులే 15 సామెతలిచ్చి ''ఏ వాఙ్మయానికైనా సామెతలు అమృత గుళికలు. అందులో తెలుగు దేశము సామెతలకు పుట్టినిల్లు. మా పాఠకురాండ్రు ఇట్లే తమకు తోచిన సామెతలు వ్రాసి పంపుతూంటే హృద్యమమైన వానినెల్లా ప్రతీ నెలా ప్రచురిస్తుంటాము'' (గృ. సం.) అని విజ్ఞప్తి చేశారు. శ్రీమతులు ఆర్. రాధాదేవి, వి. మనోహరి, వి. రాజేశ్వరి, పులిపాక బాలా త్రిపుర సుందరమ్మ, కె. పద్మావతిదేవి, పెనుమర్తి శేషమాంబా, కోట దుర్గ స్వామి దేవమ్మ; శ్రీయుతులు డి. వి. రంగనాథం, బి. జి. వి. నరసింహారావు ఈ సామెతల సేకర్తలు.

జూలై 1949 లో 609 సంఖ్యతో అంతమైన సామెతలు సెప్టెంబర్‌లో 644 తో మొదలవుతున్నాయి. అగష్టు 1949 సంచికలో సామెతల్ని 610 - 643 దాకా ప్రచురించలేదు. అంటే 34 సామెతలు గల్లంతయ్యాయన్న మాట. ఇందులో ఉండే సామెతల మొత్తం 1102.

5. గోభూమి: డిశెంబర్ 1949 నుంచి సెప్టెంబర్ 1950 దాకా 'కర్షకుల సామెతలు' పేర గొర్రెపూడి వెంకట సుబ్బయ్య 517 సామెతలు ప్రచురించారు. వ్యవసాయం, రైతు, కార్తెలు, భూములు, వానలు, ఎరువులు, దుక్కి, అదును-పదును, కలుపు, విత్తనాలు, పైర్లు-పంటలు అనే శీర్షికల్ని వివరించి తర్వాత సామెతలు వేశారు. 'కర్షకుల సామెతలు' శీర్షిక కింద ఉగాది సంచిక 1950 లో

రావెళ్ల హనుమంతరావు 40, 'వ్యవసాయ సామెతలు' కింద గొర్రెపాటి రామారావు 51, వి. పెద్ద గుర్విరెడ్డి 35 సామెతల్ని ప్రచురించారు. 'కర్షకుల సామెతలు' శీర్షికతో అక్టోబర్ 1949 లో సంపాదకులే 40 సామెతల్ని ప్రచురించి, అట్లాంటి సామెతల్ని రైతులు వ్రాసి పంపమని కోరారు. నవంబర్ 1949 లో 'కర్షక సామెతలు' శీర్షికలో చెరుకుమిల్లి వెంకటయ్య 28, కర్రి సుబ్బిరెడ్డి 25, ఎలారి ఘటోత్కచుడు 30 సామెతలు ప్రచురించారు. అదే సంచికలో "లోకోక్తి సామెతలు" అనే పేర జి. లక్ష్మిరెడ్డి 25 సామెతల్ని ప్రచురించారు. ఈ పత్రికలోని సామెతల మొత్తం 791.

6. గోవిందరాజస్వామి కళాశాల వార్షిక సంచిక (1978-79) :

'సామెతల్లో సాదృశ్యాలు' అనే శీర్షిక కింద 36 తెలుగు సామెతలు, కింద ఇంగ్లీషు సామెతలు ఇవ్వబడ్డాయి.

7. జానపదం : ఈ త్రైమాసికలో జి. ఎస్. మోహన్ 'సామెతలు' అనే శీర్షిక కింద 32 సామెతలిచ్చారు.

VI గ్రంథాలు, పీఠికలు, వ్యాసాలు :

1. కథలు-గాథలు (ప్రథమ సంపుటం) : సామెతలు సాహిత్యానికి, సంభాషణకు జీవం పోస్తాయని చక్కగా తెలిపిన చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు తమ 'కథలు-గాథలు' (70 వ్యాసాల సంకలనం) లో సందర్భోచితంగా తెలుగు సామెతల్ని, సంస్కృత లోకోక్తుల్ని పుంఖాను పుంఖంగా ప్రయోగించారు, సామెతలే శీర్షికలుగా 3 వ్యాసాలున్నాయి. కథలు-గాథలు మొదట 5 చిన్న సంపుటాలుగా ఉండగా వాటన్నిటినీ కలిపి ఈ గ్రంథంగా ప్రకటించడం జరిగింది. ఇందులో తెలుగు సామెతలు 219 ప్రయోగించబడ్డాయి.

2. సామెతలు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 'తెలుగు సామెతలు' (రెండవ ప్రచురణ) గ్రంథ పీఠిక పేరు 'సామెతలు'. అందులో 89 సామెతల్ని విశ్వనాథ సత్యనారాయణగారు ప్రయోగించారు. 6 సామెతలు గ్రంథంలో లేనివి.

3. తెలుగు సామెతలు : ఈ వ్యాసం భారతి 1966 జనవరి సంచికలో ఉంది. ఇందులో 85 సామెతలున్నాయి.

4. పల్లె పదాలలో ప్రజా జీవనము : ఈ సిద్ధాంత వ్యాసం రచయిత శ్రీ మొల్లంద రఘుమారెడ్డి. ఈ గ్రంథంలో ఇవ్వబడ్డ సామెతలు 20.

V వ్యక్తుల సేకరణ :

నేను వినియోగించుకొన్న వివిధ వ్యక్తుల సేకరణ లోని సామెతల వివరం:

1. సి. పి. బ్రౌన్ : తన వద్ద నున్న 'కార్' ఆంధ్ర లోకోక్తి చంద్రిక ప్రతి బ్రౌన్ అక్కడక్కడా నోట్స్ రాసుకున్నారు. అందులో 52 సామెతలు, కార్ గ్రంథంలో లేనివి వున్నాయి.

2. శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు :

ఒక్కో కార్డులో ఒక్కొక్క సామెత వంతున 2311 సామెతల్ని రాయించారు. కొన్ని సామెతలు బుక్కపట్టణం రామానుజయ్య 'ఆంధ్రలోకోక్తి ముక్తావళి' లోవి, 332 సామెతలు 69 కావ్యాల్లోంచి తీసి యిచ్చినవి. పై రెండు విధాలు గానివి ఇంత వరకు అచ్చు కెక్కనివి 144 సామెతలు కూడా ఇందులోనే వున్నాయి. సారస్వత నికేతన్ గ్రంథాలయంలో ఇన్నాళ్ల అసూర్యంపశ్యలుగా ఉండినవి - యాజమాన్య సుహృద్భావంతో నేను ఎత్తి రాసుకొన్నవి.

3. బంగోర్ గారు : తమ దగ్గరున్న సామెతల గ్రంథాల్లో వారు అక్కడక్కడా 26 సామెతలు రాసుకొన్నారు.

4. నా సేకరణ : 'ఉడతకు ఉడతా భక్తి' గా ఈ పుస్తక రచనాభిలాష కలిగిననాటి నుంచి అచ్చు కెక్కని సామెతల్ని సేకరించే ప్రయత్నం చేసి 450 సామెతల్ని పట్టుకొన్నాను. దాదాపు డెబ్బై ఏళ్లపాటు జనపద జీవితం గడిపిన మా అమ్మగారు శ్రీమతి పి. లక్ష్మమ్మ ఎన్నో సామెతల్ని అందించారు. నా శ్రీమతి పి. ప్రభావతమ్మ అత్తగార్తో పోటీపడింది. మా తెలుగు శాఖలోని సహాధ్యాపకులు, పరిశోధక విద్యార్థులు, విద్యార్థులు నేను కనిపిస్తూనే ఏదో ఒక సామెత చెప్పేవారు.

5. డా॥ ఎలవర్తి చంద్రమౌళి : చిత్తూరుజిల్లాలో సేకరించిన 476 సామెతల్ని అయాచితంగా ఇచ్చారు. అందులో అచ్చు కెక్కని సామెతలు 120.

ఇతర రచయితలు ఉటంకించిన సామెతల గ్రంథాలివి :

(* గుర్తు ఉండేవి నేను చూచినవే)

చేకుమళ్ల కామేశ్వరరావుగారు, భారతి, ఫిబ్రవరి 1955 సంచికలో 'తెలుగు సామెతలు' అనే వ్యాసాన్ని ప్రచురించారు. అందులో కార్ ఆంధ్రలోకోక్తి చ ంద్రికను గురించి రాస్తూ "అతని కంటె ముందు కొంత మంది సామెతల పుస్తకాలను ప్రకటించారన్న సంగతి కార్ పుస్తకం యొక్క పీఠికను బట్టి తెలుస్తూంది"

అన్నారు. కాని కార్ పీఠికలో అలాంటి ప్రస్తావనేదీ లేదు. ఈ వ్యాసం చివరి పేరాలివి :

కాశీనాథుని నాగేశ్వరరావుగారు ప్రకటించిన ఆంధ్ర వాఙ్మయ సూచికలో ఉన్న సామెతల పుస్తకాల పేర్లు ఈ క్రింద తెలియ చేస్తాను.

| పుట సంఖ్య | పుస్తకం పేరు | కర్త పేరు |
|---|---|---|
| 23 | లోకోక్తి ముక్తావళి | యమ్. [illegible] |
| 24 | *హైదరాబాదు తెలుగు సామెతలు (ముద్రిత గ్రంథ పట్టిక) | |
| 15 | *ఆంధ్ర లోకోక్తి చంద్రిక | కార్ |
| 15 | ,, | నందిరాజు చలపతిరావు |
| 15 | * ,, పంచాశత్తు | పణతుల స్వామినాథ శాస్త్రి |
| 15 | * ,, ముక్తావళి | .... |
| 13 | తెలుగు సామెతలు | .... |
| 83 | ,, | |
| 97 | నానాదేశపు సామెతలు | |
| 204 | సంస్కృత లోకోక్తి చంద్రిక | |
| 203 | సామెతలు | |

నాళం కృష్ణారావుగారు 7000 సామెతల దాకా, ఈ వ్యాస కర్తయితే 10000 దాకా సేకరించినట్లు, జయంతి నారాయణ కవి 'లోకోక్తి ప్రకాశిక' ను అచ్చువేసి నట్లు ఈ వ్యాసంలోనే చెప్పబడింది.

పత్రికల్లో వచ్చిన సామెతల్ని గురించి వ్యాస కర్త చెప్పిన వివరాలివి : వినోదినీ పత్రికలో *చమత్కారమైన సామెతలు. మనోరమ పత్రికలోను అముద్రిత గ్రంథ చింతామణి మార్చి 1902 లోను, అదే పత్రికలో 1896 లో 'కాళహస్తి మాహాత్మ్యం' లోని లోకోక్తులు ప్రచురించినట్లు. ఉపాధ్యాయోపయోగిని పత్రికలో 1896 వరకు తెలుగు జనానా పత్రికలో, సత్యవాదిని పత్రికలో చిత్ర రామస్వామి నాయుడు నానాదేశ సామెతలను ప్రకటించినట్లు చెప్పబడింది.

శ్రీ నిడుదవోలు వెంకటరావు 'తెలుగు సామెతలు' అనే వ్యాసాన్ని జనవరి 1966 భారతిలో ప్రకటించారు. అందులో "లక్షలాదిగా ఉండే తెలుగు సామెతలలో ఒక లక్ష సామెతలు సేకరించడానికి కీర్తిశేషులు చిలుకూరి నారాయణరావు

'సామెతల యజ్ఞం' ప్రారంభించారు. సేకరించినవానిని అకారాదిగా సమకూర్చారు. …. 1940 లో పెదపూడిలో సాహిత్య పాఠశాలలో ఉపన్యసించడానికి వచ్చినపుడు వారు తమ సంకలనం చేసిన సామెతలను రెండు పెద్ద మూటలతో తెచ్చారు' అని చెప్పబడింది. వాటి గతి ఏమైందో తెలియడం లేదు.

"తెలుగు సామెతలను మొదట సేకరించిన కీర్తి కార్ దొరగారికి చెందగా వారి అనుమతిపై తెలుగులో తొలిసారిగా అకారాది క్రమంగా సామెతలను అచ్చు వేసిన యశస్సు పువ్వాడ వేంకటరావుగారికి చెందుతుంది ... 1869 వ సంవత్సరంలో వారు తెలుగు సామెతలను 'ఆంధ్రలోకోక్తి చంద్రిక' అను పేరుతో ప్రకటించారు, ఆ పుస్తకము నేడలభ్యము" అని ఆ వ్యాసంలో ఒక భాగం, ఈ విషయాన్ని ఇంతకు ముందే ఈ ప్రవేశికలోనే ఖండించడం జరిగింది.

క్రీ. శ. 1898 లో కావ్యాల్లోని సామెతలను సేకరించి భట్టిప్రోలు రామచంద్రయ్య కవి 'ఆంధ్ర కవితా రత్నాకరము' అనే గ్రంథాన్ని ప్రకటించినట్లు, 1940 లో నాళం కృష్ణారావుగారు తెలుగు జాతీయాలని, సామెతలను ఉదాహరణ పూర్వకంగా కావ్యాల నుంచి సమకూర్చి ఆంధ్ర[illegible]ని కందజేసినట్లు, 1960 లో నేదునూరి గంగాధరంగారు *పసిడి పలుకులు అనే ప్రశస్త గ్రంథాన్ని తెలుగులో సామెతలు. వ్యవసాయ సామెతలు, నానాదేశ సామెతలు, ఇంకా ఎన్నో తెనుగు నుడి విశేషాలతో వెలయించినట్లు ఈ వ్యాసంలోనే చెప్పబడింది.

**తెలుగు సామెతలపై పరిశోధన :** జానపద విజ్ఞాన వచన వాఙ్మయంలో ధ్రువతారగా వెలిగే 'సామెతల వాఙ్మయం' పై మొదటి పరిశోధన గ్రంథం రచించిన ఘనత డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, ఆ గ్రంథానికి పిహెచ్.డి. పట్టం ఇచ్చి గౌరవించిన ఘనత ఆంధ్ర విశ్వకళా పరిషత్‌కు దక్కింది. అది ఇంకా ప్రచురితం గాకుండా అసూర్యంపశ్యగా ఉన్నందువల్ల దాన్ని పరిశీలించి ఈ వాఙ్మయంపై ఒక దృక్పథాన్ని ఏర్పరచుకొనే అవకాశం జానపద విజ్ఞాన జిజ్ఞాసువులకు దక్కటం లేదు.

**నా గ్రంథ రచనా ప్రణాళిక :** 'తెలుగు సామెతలు _ సాంఘిక జీవితం (అచ్చులో తెలుగు సామెతలు _ జన జీవనం) అనే ఈ గ్రంథ రచనకోసం నేను వివిధ ఆకరాల ద్వారా పరిశీలించిన తెలుగు సామెతల సంఖ్య 40,550 కాగా పునరుక్తుల్లేని 15,280 సామెతలు పరిశోధనార్హాలైనాయి. వాటినన్నిటిని కార్డుల్లో రాసు

కొని వివిధ విభాగాల కింద విభజించుకొని ఈ గ్రంథానికి ఒక ప్రణాళిక వేసుకొన్నాను. ఇందులో నాలుగు ప్రకరణాలున్నాయి.

మొదటి ప్రకరణం: "తెలుగు సామెతలు - స్వరూప స్వభావాలు" అనేది. ఇందులో సామెతల నిర్వచనం - లక్షణాలు, సామెతల పుట్టుక, కాల నిర్ణయం, పాఠాంతరాలు, శక్తిమంతం చేయడం, ఒకే విషయం మీద వేర్వేరు సామెతలు, సామెతల వ్యాప్తి - ప్రయోజనం, తెలుగు సాహిత్యంలో సామెతలు, సామెతల స్వరూపం, విషయ విశ్లేషణ, తెలుగు సామెతల్లో బూతు అనే వివిధ శీర్షికల్ని వీలైనంత సమగ్రంగా చర్చించే ప్రయత్నం జరిగింది.

రెండవ ప్రకరణం: "తెలుగు సామెతలు - కుటుంబ జీవన చిత్రణం" అనేది. కుటుంబంలోని సభ్యుల మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలు, అనురాగం, వాత్సల్యం, ద్వేషం, సాన్నిహిత్యం సామెతల్లో ఎలా ప్రతిబింబించాయో చర్చ సాగింది. ఇరుగు పొరుగుతో, చుట్టాలతో ఉండే సంబంధ బాంధవ్యాలు కూడా ప్రస్తావించబడ్డాయి.

మూడవ ప్రకరణం: "తెలుగు సామెతలు - సాంఘిక జీవన చిత్రణం" అనేది. సంఘంలో వ్యక్తి పాత్ర ఏమిటో ఈ ప్రకరణంలోని వివిధ ఉప ప్రకరణాలు చిత్రిస్తాయి. వృత్తి, కులం, ఆహారపుటలవాట్లు, వ్యాపారం, నాణేలు - కొలతలు, పరిపాలన - న్యాయం అనేవి ఉప ప్రకరణాలు.

నాల్గవ ప్రకరణం: "తెలుగు సామెతలు - సాంస్కృతిక జీవన చిత్రణం" అనేది. ఒక సంఘానికి, మరొక సంఘానికి భిన్నంగా ఉండే 'సంస్కృతి' వ్యక్తి జీవితంలో ఎలా ప్రతిబింబిస్తుందో వివిధ ఉప ప్రకరణాలు తెలుపుతాయి. ఆ ఉప ప్రకరణాలు మతం, విద్య - వైద్యం - కళలు, వినోద విలాసాలు - ఆటలు, ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, వస్త్రభూషణాలంకరణలు అనేవి.

ఈ విధంగా 'తెలుగు సామెతలు' ఆధారంగా ప్రజా జీవనంలోని వివిధ దృక్కోణాల్ని నా శాయశక్తులా చిత్రించే ప్రయత్నం జరిగింది. నా ప్రయత్న సాఫల్యానికి ప్రమాణం పెద్దలే.



పట్టిక నెం. 1

## తెలుగు సామెతలు - ఆకరాలు

### I తెలుగు సామెతల సంకలన గ్రంథాలు

| వరుస సంఖ్య | గ్రంథం పేరు | సంక్షిప్త నామం | సంకలన కర్త | సామెతల సంఖ్య | పరిశోధనకు గ్రహించినవి |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. | ఆంధ్ర లోకోక్తి చంద్రిక, పు. 635 (1868) | (కార్) | ఎం. డబ్ల్యు. కార్. క్రిష్టియన్ నాలెడ్జ్ సొసైటీ, మద్రాసు. | 2700 | 84 |
| 2. | తెలుగు సామెతలు, పు. 32 (1915) (Selected Telugu Proverbs for the S. I. M. A., Examinations) | .... | క్రిష్టియన్ లిటరేచర్ సొసైటి ఫార్ ఇండియా, మద్రాస్. | 200 | .... |
| 3. | Telugu Proverbs from Hyderabad, ps. 10, (1921) | (హైసా) | జె. బి. బెన్నెట్, క్రిష్టియన్ లిటరేచర్ సొసైటీ ఫార్ ఇండియా, మద్రాస్. | 200 | 119 |
| 4. | ఆంధ్ర లోకోక్తి ముక్తావళి (నా చేతి మాత్ర వైకుంఠ యాత్ర అనే సామెత వరకు గ్రంథం లభించింది) పు. 64, (1927) | | బుక్క పట్టణము రామానుజయ్య, ఆంధ్ర సాహితీ గ్రంథమాల, చెన్నపురి. | 934 | 98 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 5. | తెనుగు సామెతలు, పు 40, (1950) | | వేటపాళెం లైబ్రరీలోని నెం. 4754 ప్రతి, కవర్ పేజీలు లేనందువల్ల వివరాలు లభించలేదు. | 733 | .... |
| 6. | తెలుగు సామితలు, పు. 180 (1955) | .... | ఎం. డబ్ల్యు. కార్, వావిళ్ల, మద్రాస్. 2 వ నంబరు గ్రంథానికి సంగ్రహరూపం. | 1185 | .... |
| 7. | వ్యవసాయ సామెతలు, పు. 78 (1956) | (వ్యసా) | నేదునూరి గంగాధరం, విశ్వ సాహిత్య మాల, రాజమర్ద్రి, | 912 | 173 |
| 8. | సామెతలు, పు. 69 (1958 తర్వాత) | (సా) | గట్టినేని రామస్వామి చౌదరి, శ్రీ వేంకటేశ్వర గ్రంథమాల, చినగాదెలపఱ్ఱు, తెనాలి, | 1500 | 280 |
| 9. | పసిడి పలుకులు, పు. 351 (1960) | (పప) | నేదునూరి గంగాధరం, జాతీయ జ్ఞానమందిరం, మద్రాసు-20. | 4325 | 332 |
| 10. | పాటి సామెతలు (1961) | (పాసా) | నికువవోలు వేంకటరావు, తదితరులు, విజయా పబ్లికేషన్స్, మద్రాస్. | 420 | 160 |
| 11. | తెలుగు సామెతలు (ద్వితీయ ముద్రణ) పు. 412 (1965) | ... | విశ్వనాథ సత్యనారాయణ, తదితరులు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి, హైదరాబాదు. | లెక్కించ లేదు. | .... |

| | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 12. | ప్రజాసూక్తం, పు. 72, (1973) | (ప్ర.సూ.) | యువభారతి, సికింద్రాబాద్ | 1338 | 18 |
| 13. | తెలుగు సామెతలు *(మూడవ కూర్పు) (పు. 588) (1974) *గ్రంథంలో ఏ గుర్తూ లేకుండా ఇచ్చిన సామెతలు దీన్లోవే) | (తె.సా.) | దివాకర్ల వేంకటావధాని, తదితరులు, ఆం. ప్ర. సా. అకాడమీ, హైద్రాబాదు. (11 వ నెంబరు గ్రంథానికిది పెంపు) | 10511 | 10511 |
| 14. | జన శ్రుతులు, పు. 68 (1977) | .... | సాతవిల్లి కామేశ్వరరావు, రచయితే ప్రచురణ కర్త. | 1769 | .... |
| 15. | సామెతల స్రవంతి, పు. 95 (1979) | .... | చవాను సుదర్శనరావు, జిల్లా రచయితల సహకార సంఘ ప్రచురణలు, కర్నూలు. | 110 | 4 |
| 16. | తెలుగు సామెతలు, పు. 31 (1980) | .... | పండిత శ్రీ ఏలూరి సీతారామ్, శ్రీ లక్ష్మీనారాయణ బుక్ డిపో, రాజమండ్రి-4. | 547 | 3 |
| | | | | 27,384 | 12,382 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| | **II** తెలుగు సామెతల ప్రయోగ దృష్టితో పుట్టిన రచనలు | | | | |
| 1. | సరసోక్తియుక్త కృష్ణ శతకము, (1922) | .... | శెట్టి లక్ష్మీనరసింహకవి | | .... |
| 2. | ఆంధ్ర లోకోక్తి పంచాశత్తు | | వణుతుల నృసింహశాస్త్రి | 51 | .... |
| 3. | శకునపక్షి (నాటిక) (క్రొత్తగడ్డ నాటికల సంకలనం లోనిది) | .... | నార్ల వెంకటేశ్వరరావు | 66 | 3 |
| 4. | ఉన్నమాట వినరా! (ప్రథమ సంపుటం) | .... | పి. వి. శ్రీనివాసమూర్తి, శ్రీ శారదా నిలయము, అశోక నగర్, తిరుపతి. | 127 | .... |
| | | | | 244 | 3 |
| | **III** తెలుగు సామెతలు ఏకదేశంగా ఉన్న గ్రంథాలు | | | | |
| 1. | సి. పి. బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటు (1852) | (బ్రౌ) | సి. పి. బ్రౌన్, (ఆం. ప్ర. సా. అకాడమీ పునర్ముద్రణ, 1966) | 294 | 278 |
| 2. | ఆంధ్ర విజ్ఞానము (1-7 సం.) (1938-41) (తెలుగు ఎన్‌సైక్లోపీడియా) | (ఆం. వి.) | ప్రసాద భూపాలుడు, జమీందార్ ఆఫ్ దేవిడి | 692 | 127 |
| 3. | సుభాషిత రత్నాకరము (1940) | (సుర) | మునునూరి వేంకటశాస్త్రి | 1671 | 100 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 4. | పెద్దబాల శిక్ష (పునర్ముద్రణ) (1949) | .... | పుదూరి సీతారామశాస్త్రి, వావిళ్ల, మద్రాస్. | 220 | 20 |
| 5. | వ్యవసాయ ముహూర్త దర్పణం (1951) | (వ్యముద) | నేదునూరి గంగాధరం యస్, అప్పలస్వామి, రాజమండ్రి | 601 | 76 |
| 6. | పదబంధపారిజాతము, (1-2 సం॥) | .. | నార్ల వేంకటేశ్వరరావు, తదితరులు, ఆం. ప్ర. సా. అకాడమీ, హైద్రాబాద్, | 709 | 289 |
| 7. | విద్యార్థి కల్ప తరువు, (2 వ సంపుటం) (1967) | .... | మునునూరి వేంకటశాస్త్రి | 1552 | 77 |
| 8. | రాయలసీమ పలుకుబడులు | (రా ప.) | వెలగా వెంకటప్పయ్య, తెలుగు సాహితి, కడప. | 777 | 234 |
| 9. | రాయల బాల బోధిని (1980) | .... | ఆర్. ఆర్. ఏజన్సీస్, కర్నూలు, | 118 | 2 |
| | | | | 6,631 | 1.203 |

## IV తెలుగు సామెతల్ని ప్రచురించిన పత్రికలు, బులెటిన్‌లు

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 1. | శ్రీ దైవ సమాజిని అను పురుషార్థప్రదాయిని, (మాస పత్రిక). (1872 జన-డిసెం) | .... | పి. వెంకటరావు, వర్తమాన తరంగిణీ ప్రెస్, మచిలీపట్నం, | 26 | 9 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 2. | A collection of Telugu Sayings and Proverbs bearirg cn Agriculture, (Bulletin) (1891. Jan) | (బెన్సన్) | పి. బెన్సన్, వ్యవసాయశాఖ, మద్రాస్ ప్రెసిడెన్సీ. | 515 | 60 |
| 3, | వినోదిని (మాస పత్రిక) (1931 ఫిబ్రవరి) | .... | తాతపూడి సత్యనారాయణమూర్తి | 51 | 7 |
| 4, | గృహలక్ష్మి (మాస పత్రిక) (ఫిబ్రవరి 1940, డిశంబర్ 1947 నుంచి 1951 వరకు) | (గృ.ల.) | కె. ఎస్. కేసరి, కేసరికుటీరం మద్రాస్. | 1102 | 127 |
| 5. | గోభూమి (మాస పత్రిక) (అక్టోబర్ 1949 నుంచి సెప్టెంబర్ 1950 దాకా; 1950 ఉగాది సంచిక | .... | యేజెళ్ల శ్రీరాములు, తెనాలి. | 791 | 246 |
| 6. | గోవిందరాజస్వామి కళాశాల వార్షిక సంచిక, (1978–79) (సామెతల్లో సాదృశ్యాలు) | .... | వి. వి. సత్యనారాయణశెట్టి | 36 | .... |
| 7. | జానపదం (త్రైమాసిక పత్రిక) శీర్షిక : సామెతలు, రచన జి. ఎస్. మోహన్, (జూన్-సెప్టెంబర్, 1980) | .... | ఆర్వీయస్. సుందరం, ఘట్టమరాజు అశ్వత్థనారాయణ జానపద విజ్ఞాన భారతి, మైసూరు. | 32 | 13 |
| | | | సామెతల మొత్తం | 2,553 | 462 |

## V గ్రంథాలు, పీఠికలు, వ్యాసాలు

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 1. | కథలు-గాథలు (ప్రథమ సంపుటం) (1958) | (క.గా.) | చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,<br>,, సన్స్,<br>కడియం పోస్టు. తూ. గో. జిల్లా. | 219 | 70 |
| 2. | సామెతలు (తెలుగు సామెతలు గ్రంథ పీఠిక) (1965) | .... | విశ్వనాథ సత్యనారాయణ,<br>ఆం. ప్ర. సా. అకాడమీ. | 99 | 6 (ఇవి గ్రంథంలో లేవు) |
| 3. | తెలుగు సామెతలు (వ్యాసం) (భారతి, మాస పత్రిక (1966 జనవరి) | (ని.వేం.) | నిడుదవోలు వేంకటరావు | 85 | 9 |
| 4. | పల్లెపదాలలో ప్రజాజీవనము | (యె.ర.) | యెల్దండ రఘుమారెడ్డి.<br>గురుకుల విద్యా పీఠ ప్రచురణ, యెల్దండ. | 20 | 10 |
| | | | సామెతల మొత్తం | 423 | 95 |

## VI వ్యక్తుల సేకరణ

| | | | ఉన్న సామెతలు | తీసుకొన్న సామెతలు |
|---|---|---|---|---|
| 1. | బ్రౌన్ నోట్స్ | .... | 52 | 43 |
| 2. | శ్రీపాద గోపాల కృష్ణమూర్తి (వేటపాలెం లైబ్రరీలో కార్డుల రూపంలో ఉన్నవి) | (శ్రీపాద) | 2311 | 496 |
| 3. | బంగోరె | .... | 26 | 26 |
| 4. | పాపిరెడ్డి నరసింహారెడ్డి (ఈ సిద్ధాంత వ్యాస రచయిత) | (నర) | 450 | 450 |
| 5. | ఎలవర్తి చంద్రమౌళి | (చంద్ర) | 476 | 120 |
| | | సామెతల మొత్తం | 3,315 | 1,135 |

పరిశీలించిన తెలుగు సామెతల సంఖ్య : 40,550

పరిశోధనకు గ్రహించిన సామెతల సంఖ్య 15,280
(పునరుక్తులు మినహాయించగా మిగిలినవి)

# 1. తెలుగు సామెతలు - స్వరూప స్వభావాలు

1.0 సామెత-పదప్రయోగం: 'సామెతలేని మాట - ఆమెతలేనియిల్లు.' సామెత లేనిమాట విందులేని యిల్లు లాంటిదట. సంభాషణలో సామెతల ప్రాచుర్య, ప్రాముఖ్యాల్ని నొక్కి-చెప్తుంది ఈ సామెత.

తెలుగులో 'సామెత' అనేపదానికి ఇతరభాషల్లో సమానార్థకాలు: ఇంగ్లీష్ Proverb సంస్కృతం: లోకోక్తి. కన్నడం: గాదె, నాణ్ణుడి, సామితె. తమిళం-మలయాళం: పళమొళి, పళచొల్లు అనేవి.

'సామెత' అనేపదం 'సామ్యత'కు తద్భవమని చిలుకూరి నారాయణరావు గారు. ఏదైనా ఒకవిషయం చెప్పేటప్పుడు పోలికకోసం చెప్పే వాక్యం 'సామెత' అని స్థూలంగా చెప్పుకోవచ్చు.

సామెత అనేఅర్థంలో నానుడులు, సుద్దులు, జనశ్రుతులు, శాస్త్రములు, మాటలు అనేపదాలు కూడా వ్యవహారంలో ఉన్నాయి.[1]

సాటువ, సాటవ, చాటువ, చాటవ-అని నెల్లూరు, రాయలసీమ ప్రాంతాల్లో సామెతకు పేరు.[2] 'సాటిఅయినదే సాటవ' అని దివాకర్ల వేంకటావధానిగారు.

'సామెత'కు మారుగా లోకోక్తి, శ్లోకము, సామ్యము, జనవాదము, లోకహితోక్తి, కత, నానుడి, నుడికారం అనేపదాలు తెలుగుసాహిత్యంలో ఉపయోగించ బడ్డాయి.[3]

1.1 సామెత - నిర్వచనం: అరిస్టాటిల్‌నుంచి నేటిదాకా ఎందరో విదేశీ పండితులు సామెతను నిర్వచించారు. కొన్ని ముఖ్య నిర్వచనాలు:

"A Proverb is a remnant from old Philisophy preserves amidst countless destructions, by reason of its brevity and fitness for use" - Aristotle. (సంక్షిప్తత, ప్రయోగార్హత కారణాలుగా అసంఖ్యాకమైన ఆటుపోట్లకు మారొడ్డి నిలిచిన ప్రాచీనజిజ్ఞాసాఅవశేషమే సామెత)

"Short sentences drawn from long experience" Cervantas. (తరతరాలఅనుభవం సృష్టించిన సంక్షిప్తవాక్యాలు సామెతలు)

" Edged tools of speech" - Bacon.
(పదునైన వాక్పరికరాలు సామెతలు.)

"The Wisdom of many and the wit of one" - Russel.
(అనేకమంది జ్ఞానం, ఒకనిచమత్కారం సామెత)

(సామెతలు ప్రజలయొక్క సామాజిక, ఐతిహాసిక అనుభవాల సంక్షిప్తస్వరూపాలు అని గోర్కీ) [శ్రీ వై.వి. రమణరావు అనువాదం].

" A proverb is to speech what salt is to food " - Hamid
(భోజనానికి ఉప్పులాంటిది భాషకు సామెత)

ఆక్స్‌ఫర్డ్ ఆంగ్లసామెతల నిఘంటువు, వివిధ విజ్ఞానసర్వస్వాలు సామెతను నిర్వచించాయి. మచ్చుకు కొన్ని :

" A short, pithy saying in common and recognised use "
The Oxford Dictionary of English Proverbs.

(సార్వజనీనమై గుర్తింపబడిన, సారవంతమైన, సంక్షిప్తవ్యక్తీకరణమే సామెత)

"A short, pithy saying presenting in striking form as well known truth " - Encyclopedia Americana.
(ఒకప్రసిద్ధసత్యాన్ని ఉటంకించే సంక్షిప్త సారవంతమైనవాక్యమే సామెత)

"The proverb is a scrap of unfeathered wit or wisdom that grew up unobstrusively with the human race " - Chamber's Encyclopedia. (మానవజాతితోపాటు క్రమేణా పెరిగిన రూపుగట్టని విజ్ఞాన, చమత్కార శకలం సామెత)

" A proverb is a short wise saying which has been accepted into current speech and writing" - African Encyclopedia.

(నేటి సంభాషణలో, సాహిత్యంలో అంగీకరింపబడిన సంక్షిప్త వివేకయుతమైన పలుకే సామెత)

తెలుగులో సామెతపై వచ్చిన నిర్వచనాలు కొన్ని:

"మానవుని పరంపరానుగతజ్ఞానము (అనుభవజన్యమైన లేక విరీతులజన్యముతో కూడిన లోకపిద్ధ, ప్రభావోత్పాదకమైన, వృష్ఠభూమిని నిర్మించగల కళాత్మక సంక్షిప్తకవాక్యము". (శ్రీ వై.వి. రమణారావు)

"వేదాలు మహర్షులయొక్క జ్ఞానసముదాయము లైతే సామెతల్ని సామాన్య జనులయొక్క అనుభవసాగరాలుగా పేర్కొనవచ్చును"[5] (శ్రీ కాలిపువీరభద్రుడు)
"సంక్షిప్తమైన, వివేకయుతమైన, తీక్ష్ణమైన, సాంప్రదాయికమైన ప్రాచుర్యం కలిగిన అనుభవం పునాదిగా ఉండే అభివ్యక్తి సామెత"[6] (డా॥ ఆర్వీయస్ సుందరం)

"సామెత అనగా జనవ్యవహార క్షుణ్ణమైన ఉక్తి"[7] (శ్రీ సంపత్ రాఘవాచారి.)

"ఒక పిండితార్థాన్ని కొద్దిమాటల్లో చెబుతుంది సామెత"[8] (శ్రీ విశ్వనాథ సత్యనారాయణ)

"పూర్వులు తమయనుభవములను సూత్రప్రాయముగా చెప్పుచూ వచ్చినవే సామెతలైనవి. క్రమముగా కొన్ని నీతులు, కథలు, బోధనలుకూడ సామెతలుగా నిల్చియున్నవి"[9] (శ్రీ నేదునూరిగంగాధరం)

**1 . 2 తెలుగుసామెత ముఖ్యలక్షణాలు :** సామ్యం, ప్రాచుర్యత, తరతరాల అనుభవమూలం, సాంప్రదాయికత, సారవత్త-సంక్షిప్తత, శ్రావ్యత అనేవి.

**అ. సామ్యం :** తెలుగులో సామెతకు పోలిక ప్రాణం అనే అంశాన్ని 'సామెత' అనేపేరే చెప్పకచెప్తున్నది. 'సాటవ' కూడాసాదృశ్యార్థాన్ని బోధించే దే. సంభాషణలో మనం చెప్పేవిషయాన్ని స్పష్టంచేయడానికి ఆ విషయాన్ని పోలిన మరోవిషయం చెప్తాము. అదే సామెత. చెప్పదలచుకొన్న భావాల్ని సంక్షిప్తంగా, సూటిగా శ్రోతమనస్సుకు హత్తుకొనేట్లు చెప్పడంలో సామెతకుసాటియైనది మరొకటి లేదు. శ్రోత అభిప్రాయాన్ని ఖండించడానికిగాని, బలపరచడానికిగాని వక్త సామెతల్ని ఉపయోగించుకోవచ్చు. ఉదా॥ "నేను బాగారాసినా మార్కులు మాష్టారు వేయలేదు" అన్నమాటను 'ఆడలేనమ్మ మద్దెల ఓడన్నదట' అనే సామెతతో ఖండించవచ్చు. "దుక్కిటెద్దు చచ్చిపోయింది, కొంపకాలిపోయింది" అనే ఎదుటవాని ఆవేదనను 'రోరుచుట్టుపైనేకదా రోకటిపోటు' అనేసామెతతో వక్త బలపరచవచ్చు. అంటే వక్త చెప్పదలచుకొన్న అంశానికి మద్దతునిచ్చే పోలికవాక్యాలుగా సామెతలు ఉపయోగపడుతున్నాయనేది సారాంశం.

ఆ. ప్రాచుర్యత : ప్రాచుర్యంలోలేనిది సామెత కాలేదు. ఏదోసందర్భంలో ఒకవ్యక్తి చెప్పినవిషయనివేదకవాక్యం ప్రజలనాలుకలపై మళ్లీమళ్లీ ఆడినపుడే సామెతవిలువను సంతరించుకుంటుంది. అలా ప్రాచుర్యంలోకి రాలేకపోతే అది విషయనివేదకవాక్యంగానే మిగిలిపోతుంది. ప్రాచుర్యత సార్వదేశికం కాకుండా ప్రాదేశికం కూడా కావచ్చు. ఇలాంటి 'ప్రాదేశికసామెతలు' ఆ భాష వ్యాప్తిలోఉన్న కొన్ని ప్రాంతాల్లో అయినా సామెతలుగా వాడబడుతుంటాయి. ఉదా॥ 'వండాడికొండంత కొండా లేదు, సాకిబండంత బండా లేదు'; 'వండాడా? రండాడా?' (వండాడి + ఆ. రండాడి + ఆ) [నర] అనేసామెతలు కడపజిల్లా రాయచోటితాలూకాలోనే ప్రయోగంలో వున్నాయి.

'ప్రజలమాటల్లో మాటిమాటికీ పునరుక్తమయే సంక్షిప్తవాక్యమే సామెత'10 అనే 'జాన్సన్' నిర్వచనం ప్రాచుర్యం వుంటేనే సామెత అవుతుంది అన్న విషయాన్ని ఉటంకిస్తోంది.

ఇ. తరతరాల అనుభవమూలం:- చాలాసామెతలు వ్యక్తులఅనుభవంనుంచే పుట్టాయి. 'అత్తలేని కోడలు ఉత్తమురాలు - కోడలులేనఅత్త గుణవంతురాలు' అనే సామెత అత్తాకోడళ్ల అనుభవంనుంచి; 'కరణంతో కంటుపడితే కాడికదలదు' అనేది ఆ గ్రామప్రజల చేదుఅనుభవంనుంచి, 'కరక్కాయ కన్నతల్లి' అనేసామెత దానివల్ల ఆరోగ్యవంతులైన రోగులఅనుభవంనుంచి పుట్టినవే. తరతరాలఅనుభవాన్ని దాచుకొన్నరసగుళికలు సామెతలు. వాటిలో నిక్షిప్తమైఉన్న తరతరాల అనుభవాన్ని ఊతజేసుకొని అనుభవశూన్యులు బాగుపడాల్సినఅవశ్యకత ఎంతైనా ఉంది.

ఈ. సాంప్రదాయికత : ఆయాజాతుల తరతరాలసంప్రదాయాల్ని భద్రపరకొన్ననిధులు సామెతలు. ఏనాటివో వావీవరసలు, ఆచారవ్యవహారాలు, ఆయా జాతులసంప్రదాయాల్ని పరిరక్షించేవాటిల్లో సామెతలు ప్రధానపాత్రవహిస్తాయి. అంటే సాంప్రదాయికతతో సామెతలకు మరింత విలువ పెరుగుతుందన్నమాట.

ఉ. సారవత్త - సంక్షిప్తత : ఈ రెండులక్షణాలు అవినాభావసంబంధం గలవి. 'అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖం, అస్తోభం అనవద్యంచ సూత్రం సూత్రవిదోవిదుః' అని సూత్రానికి నిర్వచనం. సూత్రలక్షణాలు సామెతకు నూటికితొంబైపాళ్లు పడతాయి. సూత్రలక్షణాల్లో సారవత్త ఒకటి. సామెతల్లో సారవత్తఅంటే ప్రభావోత్పాదకతను కలిగివుండడం. వక్తవుద్దేశించినప్రభావాన్ని శ్రోతలో సామెత తీసుకరాగలిగితేనే అది సారవంతం.

'చిన్నమిరపకాయ కారం హెచ్చు'; 'ఎంత పెద్దగుమ్మడికాయయినా కత్తి పీటకు లోకువ' అన్నట్లు మనం చెప్పదలచుకొన్న ఎన్నోవాక్యాలవిషయాన్ని చిన్న సామెతలో సారవంతంగా పొందుపరచొచ్చు. సామెతలు రెండుపదాల్లోకూడా వుండొచ్చు అంటే సంక్షిప్తతాప్రాధాన్యత బోధపడుతుంది. 'కండేకాంతి' 'మేపేరూపు' లాంటివి దృష్టాంతాలు. ఇరవై పదాలకుంటె ఎక్కువవుంటే అవి సామెతలుకావని కొందరన్నట్లు డా॥ అర్చీయస్. సుందరం 11

అణుసాంద్రత ఎక్కువయ్యేకొద్దీ శక్తివంతంఅవుతుంది ఏవస్తువైనా. మణుగు దూది ఎంత ఎక్కువస్థలాన్ని ఆక్రమిస్తుందో, అంత తక్కువస్థలాన్ని ఆక్రమిస్తుంది మణుగు ఇనుము. మణుగుదూదితో కొడితే చెక్కుచెదరనిమనిషికి మణుగుఇనుముతో కొడితే మరణమే గతిగదా: అంటే ఒక భావాన్ని చెప్పే కొన్ని వాక్యాలు, లేక పొడవుపాటివివరణవాక్యంకన్నా సంక్షిప్తవాక్యంలో వుండే సామెత శక్తిమంతం, ప్రభావోత్పాదకం అని చెప్పడానికి సందేహించాల్సినపన్లేదు.

ఊ. శ్రావ్యత: చాలా తెలుగుసామెతలకు శ్రావ్యత విడదీయరానిలక్షణం. శ్రావ్యతకోసం సంస్కృతంలో శ్లోకపాదాన్ని రెండు సమభాగాలుగా విభజిస్తారు. తెలుగులో పద్యపాదంలో యతిని, ప్రాసయతిని ఉపయోగిస్తారు. తెలుగుసామెతల్లో ఈ రెండులక్షణాలు_రెండు సమభాగాలుగా తునగడం, యతో, ప్రాసయతో కలిగి వుండడం_వున్నాయి. శ్లోక, పద్య లక్షణాలు కలుపుకొన్న తెలుగుసామెత రెండు విధాలశ్రావ్యతల్ని సంతరించుకొంది. నాగరికరచనలైనపద్యాల్లో యతి పదమధ్యాక్షరానికికూడా కవులు వేశారు. కాని సామెతల్లో యతిపడేచోటికి కొత్తపదం వచ్చి తీరుతుంది. జానపదులరచనలైన సామెతల్లో అనుకోకుండానే పడిన ప్రాసయతులు సామెతకు లయనిస్తున్నాయి. పొడవుపాటిపద్యపాదాల్లో యతి కుదిరించలేక కవులు అవస్థపడగా రెండుపదాలుండే అతిచిన్నసామెతల్లో కూడా యతో, ప్రాసయతో ప్రత్యక్షమవుతుంది. 'కండేకాంతి', 'మేపేరూపు'; 'అంగడిబియ్యం తంగెడుకట్టెలు', 'అంతనాడులేదు, ఇంతనాడు లేదు, సంతనాడు పెట్టింది ముంతంతకొప్పు' లాంటివి ప్రాసయతి పడినవి. 'మబ్బువిడిచిన ఎండ, మొగున్నిడిచిన ముండ, పట్టివిడిచిన మండ, ఎత్తివిడిచిన కుండ'; 'అందటికి అట్లపండుగ మనకు ముట్లపండుగ'. అనేవి అంత్యప్రాసకుదాహరణలు.

సంక్షిప్తతను ఒక్కోసారి పక్కకు నెట్టి ఒకతూగు, లయకోసం ఒకేపదం పునరుక్తం చేయబడొచ్చు. 'అత్తపోరు లేదు మామపోరు లేదు. గుడిసెలో గుడ్డి వానిపోరు', 'అత్తకుత్తర తీరె అల్లునిభ్రమ తీరె', అన్నవి దృష్టాంతాలు.

సామెతల్లో వుండే శ్రావ్యతను శ్రీబండినాగరాజు విపులంగా చర్చించారు.[12] శ్రావ్యతమీద పట్టింపులేకుండా విషయప్రాధాన్యంమీదనే ఆధారపడిన సామెతలు తెలుగులో దండిగానే ఉన్నాయి.

'సామాజికమైన తరతరాలఅనుభవాన్ని ఇముడ్చుకొని సామ్యత. ప్రభావోత్పాదకత, ధ్వనిప్రాధాన్యత, ప్రజాప్రాచుర్యం, శ్రావ్యత కలిగి సంభాషణాయోగ్యమైన సంక్షిప్తవాక్యం తెలుగుసామెత'గా మనం నిర్వచించుకోవచ్చు.

**1.3** సామెతల పుట్టుక-ఆధారాలు: జానపదవిజ్ఞానంలో ఒక భాగమైన సామెతలు తక్కిన జానపదవిజ్ఞానశాఖల్లాగే అతి ప్రాచీనమైనవి "ఆదిమమానవుడు తన సుఖ దుఃఖాలను అభివ్యక్తీకరించడానికి, అనుభవాలను ఎదుటివారికి తెలియజెప్పడానికి గీతాలను, కథలను, సామెతలను ఉపయోగించుకున్నాడు. మౌలికమైనప్రతిభాశక్తి కల్పనాశక్తి ఉండిన అతి ప్రాచీన మానవుడే సామెతలను సృష్టించాడనడంలో సందేహం లేదు". అని డా॥ ఆర్వీయస్ సుందరం.[13] ప్రాచీనగ్రంథాలైన వేదాలు, ఉపనిషత్తులు, బైబిల్‌లలో సామెతలున్నాయి.

సామెతలకు కర్తలు ఎవరు? ఇవి కూడా తక్కిన జానపదసాహిత్యశాఖల్లాగే అజ్ఞాతకర్తృకాలు. తరతరాలఅనుభవం ఏ క్షణంలోనో ఒకఅజ్ఞాతకళాకారుని నోటి వెంట వాక్యంగావెలువడ్డం. అది ప్రజల ప్రచారంపొంది సామెతగా రూపుదాల్చడం జరుగుతున్నది. చెళ్లపిళ్లవారు సామెతల్ని 'దేవరసొత్తి' వంటివన్నారు.[14] అంటే ఇష్టముంటే ఎవరైనావాడుకోవచ్చు. అంతేగాదు. సామెతలు 'జాతి ఆస్తి' కూడా.

సామెతలు ఎక్కువభాగం జానపదుల్లో పుట్టినవే. కొన్ని పండితులవివేకం నుంచి పుట్టొచ్చు. వీనికితోడు 'నాగరికులసామెతలు'[15] అనే ఇంకోవిభాగమున్నట్లు డా॥ ఆర్వీయస్ సుందరం. సామెతలపుట్టుకకు ఆధారాలు స్థూలంగాఇవి: 1. కుటుంబంతో, సంఘంతో వ్యక్తికి ఉండేసంబంధాలు, అనుబంధాలు, అనుభవాలు 2.పురాణాలు_చరిత్ర 3. జానపదకథలు 4. సన్నివేశాలు 5. సూక్తులు 6. పరభాషా సామెతలు 7. జానపదగేయాలు 8. నమూనాసామెతలు.

1. కుటుంబంతోను, సంఘంతోను వ్యక్తికిఉండే సంబంధాలు-అనుభవాలు :
సామెతల్లో చాలాపెద్దభాగం ఈ కోవకు చెందుతుంది. కుటుంబంలోని వివిధవ్యక్తుల ఆధారంగా చాలా సామెతలు పుట్టాయి. ఉదా ॥‘ అల్లుడు అంటే, వంకరతాడే లేచి నుంచుంటుంది ’ అనేది అల్లునికి అత్తగారింటితోవుండే సంబంధాన్ని తెలుపుతుంది. అలాగే సమాజంలో ‘ఏఱుదాటి తెప్ప తగలబెట్టేవాళ్లు’ ‘ఇంట్లోఈగలమోత బయట పల్లకీమోత’ గాండ్లు వుండడం సహజమే. ఇలాంటి వారితో సంబంధముండే వ్యక్తులఅనుభవంనుంచి పుట్టినవే పై రెండు సామెతలు.

2. పురాణాలు – చారిత్రకసన్నివేశాలు : రామాయణ, భారత, భాగవతాల్లోని సన్నివేశాలాధారంగా ‘సీతపుట్టి లంక చెడె’, ‘కాగలపని గంధర్వులే తీర్చారు’, ‘చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ’ లాంటి సామెతలు పుట్టాయి.

‘ఏమి అప్పాజీ? అంటే, కాలంకొద్దీ రాయజీ’, ‘అక్కన్న మాదన్నలు అందలంఎక్కితే సాటికి సరప్ప చెరువుకట్ట ఎక్కినాడట’ లాంటివి చారిత్రకసన్నివేశాలనుంచి పుట్టాయి.

చారిత్రక వ్యక్తులతో ముడిపెట్టబడిన సామెతలన్నీ చారిత్రక సత్యాలని చెప్పలేము. ఉదా॥ ‘అన్నాలన్నీ సున్నాలు అప్పాలన్నీ కప్పాలు’ అనేసామెతను వేములవాడభీమకవికి ; ‘అప్పిలేదు, గప్పి లేదు, చచ్చినట్లు తొంగోపి’ అనే దాన్ని కాళిదాసుకు; ‘తండ్రిని జంపబోయినపాపము అత్తవారింటికి పోయి అంబటి కట్ట తెగేవరకు ఉంటే పోవును’ అనేది భారవికి, వింతలేని అవులింత పుట్టదు’ అనేది ప్రతాపరుద్రునిమంత్రి యుగంధరునికి చెందినవిగా చెప్పబడ్డాయి. కాని విశ్వసించడం కష్టం. ఒకేసామెతకు ఆధారంగా వేర్వేరు కథలు చెప్పబడొచ్చు. ‘అటునుంచి నరుక్కురమ్మన్నారు’ అనేసామెత అమరకోశకర్త అమరసింహునికి సంబంధించిందని, వాసిరెడ్డివెంకటాద్రినాయునికి సంబంధించిందని, ఒకనవాబుకు సంబంధించిందని వేర్వేరుగా కథలున్నాయి.

3. జానపదకథలు : కొన్నిసామెతలు జానపదకథలు నుండి పుడతాయి. సామెతవెనుక ఉండే కథ తెలియక పోతే ఆసామెత అర్థంకాదు. ‘నాకు కోపంలేదు _ దున్నతోక చిన్నదయింది’16 అనేది ఆఫ్రికన్‌సామెత. రైతు పొద్దుఎక్కిందాకా దున్ని, భార్య అన్నంతేనందువల్ల దున్నతోక నరికి వండి తిన్నాడు. ఆలస్యంగా భార్య వచ్చింది, అన్నంతో కోపమా? అంది. రైతుసమాధానమే పైసామెత.

ఈకథ తెలియకపోతే ఆ సామెత అర్థంకాదు. నా పరిశీలనలో సామెతకథలు 214 లభించాయి.17 జానపదకథలు మానవసంబంధిగాని, జంతుసంబంధిగాని కావచ్చు.

'కథలో ఒకపాత్ర చెప్పినమాటలే ఒక్కొసారి 'సామెత' లవుతుంటాయి. 'చెల్లీ చెల్లడములకు శెట్టిగారున్నారు', 'మొసలిబావా! కదింపేరాయెగాని కాలయినా యింతేగదా' లాంటివి.

4. సన్నివేశాలు: కథ కాకుండా ఒకసన్నివేశం మాత్రమే సామెతకు ఆధారం కావచ్చు. ఒకసామెత వక్తచెప్తూనే శ్రోతకు ఆ నేపథ్యసన్నివేశం దృశ్యమానమయి వక్త దేనికిపోలికగా ఆ సామెత చెప్పినాడో అన్వయించుకోగలుగుతాడు అప్పుడే ఆ సామెత సార్థకమయి వక్తఉద్దేశం నెరవేర్తుంది. ఉదా॥ ఒకనొక గొప్పవ్యక్తిని నిందిస్తుంటాడు. ఇంకొకడు వచ్చి "నీది తప్పు-నీవు తిట్టకూడదు-నీవు నిందించే వాడు నీకన్నవేయిరెట్లు గొప్పవాడు - అతన్తోపోల్చి చూస్తే నీవు నీచుడివి - నీవు తిట్టినా అతనిగొప్పతనం తరగదు - పరువుపోదు. నీకు కీడుచేయగలిగేశక్తి వుండి కూడా అతను గొప్పదనంతో నిన్ను పోనిస్తున్నాడు". అనే ఏడువాక్యాలసారాం శాన్ని ప్రతిబింబించే ' అప్పనయ్యా, ఏనుగులు పోతుంటాయి-కుక్కలు మొరుగు తుంటాయి' అనేసామెతనో, 'కుక్కకూస్తే జంగంపరువు పోతుందా'? అనే సామెతనో అన్నాడనుకోండి. పైచెప్పిన నిందావాక్యాల్ని ప్రత్యక్షంగా వలికేబదులు వాటి ఉద్దేశం నెరవేర్చేందుకు ఈ సామెతలు సాధనాలవుతున్నాయి. వక్తచెప్పిన పోలికలు జంగం ఏనుగు మహనీయత్వానికి ప్రతీకలైతే, కుక్క అల్పత్వానికి ప్రతీక. ఏనుగు గంభీరంగా నడుస్తూ కుక్క మొరుగుతున్నా వెనుదిరిగి దాన్ని తొండానికి బలిచేయకుండా అలసత్వంతో వెళ్ళడం; జంగం చేతిలో కట్టెవున్నా కుక్కను కొట్టకుండావెళ్ళడం - అనే సన్నివేశాలు పై సామెతలకు ఆధారాలు. ఆ సన్నివేశాలు శ్రోతమనోవీధిలో గోచరమై 'సామెత'ఉద్దేశ్యం సవ్యంగా నెరవేర్తుంది.

5. సూక్తులు: కొన్ని కొన్నిసూక్తులకు సకృత్తుగా సామెతత్వం సంక్రమిస్తుంది సూక్తులు ఆజ్ఞలాంటివికాగా సామెతలు సలహాలాంటివి. మొదటివి ప్రభుసమ్మితాలు, రెండోవి కాంతాసమ్మితాలు. 'అడుసుత్రొక్కనేల? కాలుకడుగనేల?', 'నీతిలేని వాడు కోతికంటె బీడు' లాంటివి ఉదాహరణలు.

6. జానపదగేయాలు: జానపదగేయాలనుంచి కొన్నిసామెతలు పుట్టాయి. ఈ సామెతలు జానపదగేయాల్లోకిచొచ్చుకుపోయాయో, ఆ గేయాంభాగాలు సామెతలుగా మారాయో చెప్పడం కష్టం. ఉదా॥ అత్తలేని కోడలు ఉత్తమురాలు - కోడలులేని అత్త

గుణవంతురాలు' అనేది రోకటిపాటలో ఒకభాగం. 'ఉడకకే ఉడకకే ఓ ఉల్లిపాయా నువ్వెంతవుడికినా నీ కంపుపోదు. మొండికెత్తినదాన్ని మొగుడేమి చేసును? లజ్జ మాలినదాన్ని రాజేమి చేసును? సిగ్గుమాలినదాన్ని శివుడేమి చేసును', 'ఆడజన్మయెత్తి అడలుటకన్న అడవిలోవృక్షమై అట్లుంటమేలు' అనేవి జానపదగేయాల్లోభాగాలు.

7. పరభాషలనుంచివచ్చిన సామెతలు: సంస్కృతంనుంచి తెలుగులోకి ఎన్నో సామెతలు వచ్చాయి. కొన్ని అట్లాగే రాగా మరి కొన్ని అనువదించ బడ్డాయి. 'వాతాపి జీర్ణం - వజ్రశరీరం', 'అతివినయం ధూర్తలక్షణం' లాంటివి మొదటి విభాగానికి; 'చెట్టులేనిచోట ఆముదపుచెట్టు మహావృక్షము' (నిరస్తేపాదపోదేశే ఏరండోపిద్రుమాయతే) 'పండితపుత్రుడు శుంఠ' (పండిత పుత్రో శుంఠః) అనేవి రెండోవిభాగానికి చెందినవి.

ఆంగ్లభాషాప్రభావంతో కొన్ని తెలుగుసామెతలు పుట్టాయి. 'అందని ద్రాక్ష పండ్లు పుల్లన' అనేది " Grapes are sour " అనే ఆంగ్లసామెతకు తెలుగు. " Nearer the Kirk (Church) further the devotion" నుంచి 'గుడిదగ్గరైతే గురుత్వం దూరమవుతుంది' అనే సామెత; Better the devil you know than the devil you don't know నుంచి 'తెలియనిదయ్యంకన్న తెలిసినదయ్యం మేలు' అనే తెలుగుసామెత పుట్టాయి.

కొన్ని ఆంగ్లసామెతలకు భావానుసరణలున్నాయి. ఉదా॥ "Carrying coals to New Castle" అనే ఆంగ్లసామెతకు 'రేపల్లెవాడలో పాలమ్మినట్లు' 'కొండకు కట్టెలు, కోనేటికి నీళ్లుమోసినట్లు', 'బొందలకుంటకు నల్లేరుమోసినట్లు', 'కమ్మరివీధిలో సూదులమ్మినట్లు', 'కుమ్మరవీధిలో కుండలమ్మినట్లు' అనే ఐదు తెలుగుసామెతలు భావానుసరణలు.

సోదరద్రావిడభాషలైన తమిళ మలయాళ కన్నడాలనుంచికూడా తెలుగు సామెతలు వచ్చాయి. సరిహద్దుప్రజల్లో ఈ సామెతలు వ్యాపించి తెలుగులోకి అనువదించబడి తెలుగుదేశమంతా వ్యాపించివుంటవచ్చు. సమానరూపం వుండే సామెతలు నాలుగుభాషల్లో వున్నప్పుడు ఏది దేనికి మూలమో చెప్పడం కష్టసాధ్యం. ఇలాంటి సమరూపత గల 420 సామెతలు 'సాటిసామెతలు' అనేగ్రంథంలో సంకలనంచేయబడ్డాయి. మొత్తం నాలుగుభాషలోలేకపోయినా కనీసం మరోసోదర

భాషతో సారూప్యతవున్నా ఇందులో చేర్చబడ్డాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ వారి 'తెలుగు సామెతలు' పీఠికలో శ్రీ సంపత్ రాఘవాచారి సారూప్యంవున్న 79 తమిళ-తెలుగుసామెతల్ని, 28 కన్నడ-తెలుగుసామెతల్ని ఉటంకించారు. మచ్చుకు 'సాటిసామెతలు' గ్రంథం నుంచి-

తెలుగు : ఆశకు అంతంలేదు. కన్నడం : ఆశెగె మేరెయిల్లా.
తమిళం : ఆశైక్కు వోర్ అళవిల్లై. మలయాళం : ఆశెక్కు అతిరు యిల్ల (సా. సా. 53)
తెలుగు: నిండుకుండ తొణకదు. కన్నడం : తుంబిదకొడ తుళుకువు దిల్ల.
తమిళం : నిఱైకుడమ్ నీర్ తుళుంబాదు. మలయాళం : నెఱుక్కుడమ్ తుళుంబుకఇల్ల. (సా. సా. 269)

8. నమూనాసామెతలు : ప్రచారంలోవున్న సామెతలనమూనల్లో మరికొన్ని సామెతలు పుట్టుంటాయి. వీటివి 'నమూనాసామెతలు' అనొచ్చు. శ్రీ చేమమళ్ళ కామేశ్వరరావు వీటిని 'మాదిరిసామెతలు' అన్నారు.[18] వీటిలో మూలమైన సామెత ఇదవి నిక్కచ్చిగా నిర్ణయించలేము. ఉదా॥'ముల్లువచ్చి అరటాకుమీదపడ్డా, అరటాకు ముల్లు మీద పడ్డా ఆకుకే మోసం' అనేదానినమూనాలో 'కుండవెళ్ళి బండకు తగిలినా బండవచ్చి కుండకుతగిలినా కుండకేమోసం' అనే సామెత పుట్టివుండవచ్చు. 'చెట్టుమీద నుంచి పడ్డవానికి గాయాలెన్నేమిటి' అనే సామెత నమూనాలో 'కొండ మీదనుంచి పడ్డవానికి గాయాలెన్ని' పుట్టివుండవచ్చు. 'ఇచ్చేవాడు తీసుకునే వాడికి లోకువ', 'చెప్పేవానికి చేసేవాడులోకువ', 'పిగరెట్టుత్రాగేవానికి బీడీత్రాగేవాడులోకువ' అనేసామెతల్లో మొదటి రెంటి పౌర్వాపర్యం విచారించలేం గాని చివరిది ఈమధ్యనే పుట్టివుంటుంది.

1. 4. సామెతల కాలనిర్ణయం : సామెతల కాలం నిర్ణయించడం దుస్సాధ్యం. సార్వకాలికమైన సామెతల కాలనిర్ణయం చేయలేము. ఉదా॥ వ్యక్తి సంబంధాలను మానవస్వభావాన్ని తెలిపేవి - ఇలాంటివాటికి. కొన్నిసామెతల కాలనిర్ణయం వుజ్జాయింపుగా చెయ్యొచ్చు.

ఆధారాలుగా 1. కవిప్రయోగం 2. చారిత్రకవ్యక్తులు లేదా సంఘటనలు 3. ప్రాచీన పదాలు, 4. మతపరాలైనపదాలు. 5. పరభాషాపదాలు 6. వర్తకవ్యాపారాలు 7. కొలతలు, తూకాలు. నాణేలు 8. భూషణాలు 9. ఆచారవ్యవహారాలు 10. పంటలు, వస్తువులు అనే అంశాలనుతీసుకోవచ్చు.

1. కవిప్రయోగం : ఆదికవి నన్నయనుంచి నేటివరకు కవులు సామెతల్ని కొద్దిగానో, గొప్పగానో తమకావ్యాల్లో ప్రయోగించారు. ఆకావ్యాల్లోని సామెతలు కవిసృష్టికావచ్చు. లేదా నాటిసామెతలను పద్యాల్లో అవసరంబట్టి మార్చి ప్రయోగించి వుండొచ్చు. 'గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్' అనేది నన్నయ భారతం లోనిది. 'అలిగి తన్నిన పరుపుపై బడినట్లు', 'ఎద్దీనెనన్న గొందిన గట్టుమన్నట్లు' అనేవి పాల్కురికిసోమన గ్రంథాలోవి. అంటే మొదటిసామెత నన్నయకాలం (11 శ.) నాటిదని చెప్పవచ్చు. రెండోది సోమన కాలం (12 శ.) లోనిది. ఈ సామెతలు అంతకు వెనుకటివి మాత్రంగావు. అంతకు ముందువికూడా కావచ్చు.

2. చారిత్రకవ్యక్తులు - లేదా సంఘటనలు : కొన్నిసామెతల్లో చారిత్రక వ్యక్తులు లేదా సంఘటనలప్రసక్తి వుంటుంది. అలాంటిసామెతలు ఆ చారిత్రక వ్యక్తులకాలంలోగాని. తర్వాతికాలంలోనిగాని పుట్టివుండవచ్చు. 'ఏమి అప్పాజీ అంటే కాలంకొద్దీ రాయజీ' అనేది శ్రీకృష్ణదేవరాయలకాలంలోనిది (క్రీ. శ. 1500). 'అక్కన్నమాదన్నలు ఆందలంఎక్కితే సాటికి నరప్ప చెరువుకట్టఎక్కినాడట' అనేది తానీషాకాలంలోనిది (17 శ.) 'లోకమెట్లుందిరా సిద్ధా! అంటే ఎవరిలోకం వాళ్లదేగురూ' అనేది పోతులూరివీరబ్రహ్మం (17వ శ.) కాలంలోనిది. 'వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు తులాభారం తూగితే కర్లెద్దకామక్క వంకాయలభారం తూగిందట' అనేది వాసిరెడ్డి వేంకటాద్రినాయుని కాలంలోనిది (1761-1816).

3. ప్రాచీనపదాలు : పరిణామశీలమైనభాషలో కొన్నిపదాలు మరుగున పడొచ్చు. లేదా అర్థపరిణామంపొందవచ్చు. ఇలాంటిప్రాచీనపదాలు కొన్ని శాసనభాషలోలాగే సామెతల్లోనూ మిగిలి వుంటాయి. వాటినిబట్టి సామెతకాలనిర్ణయం చేయొచ్చు. ఇలా చేయాలంటే శాసనభాష, సాహిత్యం - రెండూ పరిశీలించాల్సివుంటుంది. ఉదా॥ 'వేములువేస్తే భూములుపండును' 'దువ్వును చూచి నక్క వాతబెట్టుకొన్నట్లు' అనేవి, వేము ప్రాచీనపదం. వేప నవీనపదం. దువ్వ అనే ప్రాచీనపదంబదులు ఇప్పుడు పులి వ్యవహారంలోవుంది. 'వేము' క్రీ. శ. 1102 నాటి శాసనాల్లో వాడుకలో ఉంది. 'దువ్వ' నాచనసోమనకాలం (క్రీ.శ. 1350) నాటికి ప్రయోగంలో వుంది. 'పుణ్యంకొద్దీ పురుషుడు దానంకొద్దీ బిడ్డ' అనే సామెతలోని పురుషుడు 'మగడు' అనే అర్థంలో క్రీ. శ. 1113 నాటి శాసనంలో వుంది.

4. వర్తకవ్యాపారాలు : వర్తకవ్యాపారాల్ని తెలిపేపదాలు సామెతల్లో వున్నప్పుడు కాలనిర్ణయంచేసేందుకు ప్రయత్నించొచ్చు. 'సంత' అనేపదం

క్రీ. శ. 1364 లో, 'సుంకం' అనేది క్రీ. శ. 1155 లో శాసనాల్లోకనిపిస్తాయి. ఆ పదాలున్న సామెతలు 'సంతకుపోంగలయితే తోళ్లెక్కడ అమ్ముకోను' 'మాస్తే సుంకం పాస్తే పంకం' అనేవి.

5. మతం : మతాన్ని తెలిపేపదాలున్న సామెతల కాలనిర్ణయం వీలుకావచ్చు. 'బాగా నమిలి మ్రింగు, ఒక్కశివిగాడు చచ్చినా చచ్చినట్లే' అనేసామెత శైవ వైష్ణవద్వేషాలు ప్రబలిన 12-13 వ శతాబ్దాల్లోనిది కావచ్చు.

6. కొలతలు-తూకాలు-నాణేలు : ఒకతరానికి, మరోతరానికి కొలతలు తూకాలు. నాణేలు మారుతుంటాయి. ఒకనాడు శేర్లు, అర్ధశేర్లు - నేడు లీటర్లు; ఒకనాడు బార, మూర-నేడు మీటర్లు; ఒకనాడు వరహాలు, రూకలు అయితే విన్నామొన్నా రూపాయలు, పావలాలు; నేడు రూపాయలు, పైసలు.

'పండనినేల పుట్టెడు కంటేపండేనేల పందుంచాలు'. 'పుట్టెడు, క్రీ.శ. 1235 నాటికే శాసనాల్లో ప్రయుక్తం. 'బారెడు చుట్టయినా బాటన పొమ్మన్నారు'. 'బార' క్రీ. శ. 1484 నాటి శాసనప్రయోగం. పాల్కురికిసోమనలోనూ (క్రీ. శ. 1250) ఈ పదముంది. 'గవ్వన్నరకు గడ్డంగొరుగుతానంటే వెంట్రుకన్నర ఎంత అన్నాడట' 'రూకలేనివాడు పోక చేయలేడు, అనేసామెతల్లోని 'గవ్వ' క్రీ.శ. 1277లో, 'రూక' క్రీ. శ. 1158 లో శాసనాల్లో ప్రయోగించబడ్డాయి.

7. భూషణాలు : ఒకకాలంలో ఉండిన భూషణాలు మరోకాలంలో ఉండక పోవచ్చు. వాటినిబట్టికూడా కాలనిర్ణయంచేయొచ్చు. ఉదా॥ 'కంకణాలచెయ్యిఆడితే కడియాల చెయ్యి ఆడుతుంది', కడియాలప్రసక్తి శ్రీనాథుడు (1384-1455) తెచ్చాడు. 'తనపిల్ల తవిటికి యేడిస్తే, లంజపిల్ల రావిరేకుకు యేడ్చినది'. ఈసామెతలోని 'రావిరేక' అనే ఆభరణప్రసక్తి పాల్కురికి సోమన (13 శ.) లో వుంది.

8. పరభాషాపదాలు : ముస్లింల ప్రవేశంతో హిందూస్థానీ, ఆంగ్లేయులరాకతో ఇంగ్లీషు పదాలు తెలుగులో చేరాయి. హిందూస్థానీ, ఆంగ్లపదాలు సామెతల్లో వుంటే వాటి కాలనిర్ణయం వీలుకావచ్చు. తురకనేస్తం. గాడిదతన్ను సంకటమే' అనేసామెత తురకలు తెలుగుదేశంలో ప్రవేశించిన 14వశతాబ్దిలో, 'కోర్టుకుపోతివా కొల్లయిపోతివా' అనేది ఆంగ్లేయుల "కోర్టుల' ఏర్పాటు తర్వాత (క్రీ. శ. 1801) పుట్టాయి.

9. ఆచార వ్యవహారాలు : ఒకనాటిఆచారవ్యవహారాలు కొన్నాళ్ళకు మరుగు పడొచ్చు. ఆయా ఆచారవ్యవహారాలను ప్రజలు పాటించినకాలాన్ని గుర్తించటం

ద్వారా ఆచారవ్యవహారసంబంధి సామెతల కాలనిర్ణయం చేయొచ్చు. 'వేణ్ణీళ్ళను ఛోర్వలేనమ్మ సాగుమానిము ఛేస్తానన్నదట. అనేసామెత 'సతీసహగమనం' వ్యాప్తిలోవున్న కాకతీయులకాలంనాటిదని చెప్పవచ్చు, ఇల్లు వాకిలి మొదలగు స్థిరనివాసము లేక వర్తకవ్యాపారము పైగాని, భూమికౌలునకిచ్చి దానిఫలభోగము పై గాని జీవనముగడుపువాడు 'సుఖవాసి' (శా. శ. కో.). ఆ వ్యవస్థ మనకిప్పుడు లేదు. 'సూరన్న సుఖవాసి పేరన్న పెద్దవాడు అయ్యవెత్తరా కోళ్ళగంప' (కార్ 2119) అనిసామెత 'సుఖవాసి' పదప్రయోగం క్రీ శ. 1577 లో, దానిరూపాంతరం 'సూవాసి' అనేది భూమిని సేద్యం చేసే కర్షకులుదారు అనేఅర్థంలో క్రీ శ. 1269 లో శాసనాల్లో ప్రయుక్తమయ్యాయి

10. పంటలు-వస్తువులు : పొగాకుపంటను క్రీ. శ. 1600-1650 మధ్యకాలంలో పోర్చుగీసువారు ప్రవేశపెట్టారు. విదేశీయులతోపాటు కొన్నిపంటలు వస్తువులు తెలుగుదేశంలో ప్రవేశించాయి. ఇలాంటి పంటలను, వస్తువులను, తెలిపేపదాల్నిబట్టి సామెతలకాలనిర్ణయం చేయొచ్చు. పొగాకుప్రసక్తి వుండే సామెతలు. ఉదా॥ 'గురువులోరి పొగచుట్ట'. 'పొగాకుఅడుక్కోవాలి అందలం బయటపెట్టరా' అనేవి. తుపాకులు, ఫిరంగులు క్రీ శ. 1400 నాటికే ఆంధ్రదేశంలో వున్నాయి. కాని యూరోపియనులప్రవేశంతో మేలురకపుఫిరంగులు వాడుకలోకి వచ్చాయి. 'తుపాకి కడుపున ఫిరంగి పుట్టినట్టు' అనే సామెత క్రీ॥ శ॥ 1600 సం॥ ప్రాంతంలో పుట్టి వుంటుందని చెప్పవచ్చును.

ఈ చర్చ సారాంశం : కొన్ని సామెతల కాలం ఉజ్జాయింపుగా నిర్ణయించవచ్చు. చాలావాటికి అలా వీలుకాదు.

1.5 సామెతల్లో పాఠాంతరాలు : సామెతలు శిలాక్షరాలుకాదు. లిపిబద్ధమైన సాహిత్యంలోనే పాఠాంతరాలున్నపుడు, మౌఖికవ్యాప్తిగలసామెతల్లో పాఠాంతరాలుండటంలో వింతేమీలేదు. అ. మాండలికభేదంవల్ల ఆ. పాతపదంతీసి కొత్తపదం వేయటంవల్ల ఇ. అర్థంగాక పదాల్నిమార్చటంవల్ల ఈ. ఒకదళంబదులు మరోదళం వేయటంవల్ల పాఠాంతరాలు ఏర్పడుతున్నాయి.

**అ మాండలిక భేదాలు : ఒకసామెత ఏదోమండలంలో పుడుతుంది. దాన్ని గ్రహించిన ఇతర మండలాలవాళ్లు పదాల్నిమార్చి తమమాండలికాల్ని వేయడమో, ప్రదేశనామాల్ని చేర్చడమో జరుగుతుంటుంది.**

1. గడ్డపలుగులు మింగి కష్షాయం తాగినట్లు
   గడ్డపార తినేవాడికి శొంఠి కషాయం ఏమి చేస్తుంది ? (అం. ప్ర.)
   చీడ పిగ్గెలుగదు. తీట పిగ్గెలుగదు.

2. 'కడుపా : చెరువా' అనేది సామెతమూలరూపం కాగా 'కడుపా ? కక్లేపల్లి చెరువా ?', 'కడుపా కొల్లేరుమడుగా?', 'కడుపా ? కంచాలమ్మచెరువా ?' (నర) 'కడుపా? కావేరిపాక్కు చెరువా?' (చంద్ర) 'కడుపా ? ఖండవల్లిమడుగా ?' అనేవి మాండలిక భేదాలు.

'ఎంతపొద్దుండగా లేచినా తుమ్మగుంటవద్దనే తెల్లారుతుంది', 'ఎంతపొద్దుండగా లేచినా తుమ్మలగుంటపాలెందగ్గతే తెల్లవారింది', 'ఎంత పెంద్రాళే లేచినా తుమ్మలగుంటవద్దనే తెల్లవారుతుంది' (అం. ప్ర), 'ఎంతపొద్దుగలగా లేచినా రాళ్ళ వంకకాడనే తెల్లారుతుంది' (నర) 'పెయ్యాళకాలలేచినా చింతమాకులోళ్ళ ఊరుకాడ తెల్లారెనంట' (చంద్ర) అనేవి ఒకేసామెతకు మాండలికభేదాలు. ఇట్లే 'పామర్రుకో పడుచును ఎలమర్రుకో ఎద్దునుఇవ్వరాదు', 'పెనుగొండకు పిల్లనివ్వరాదు' కొవ్వానికి ఎద్దునివ్వరాదు' అనేవికూడా.

2. పాతపదం తీసి కొత్తపదంవేయడం : కొన్నిపదాలు వ్యవహారంలో లుప్తమై పోవడంవల్ల అర్థావగాహన కోసం కొత్తపదాలువేయడం జరుగుతుంది. 'దువ్వను జూచి నక్క వాతపెట్టుకొన్నట్లు' అనేసామెతలోని 'దువ్వ' కు బదులు అదేఅర్థానిచ్చే 'పులి' ప్రవేశించింది ఉదా॥ 'పులినిచూచి నక్కవాతపెట్టుకున్నట్లు' 'దువ్వనుజూచి నక్క యొడలుగాల్చికొన్నవడువున' అని నాచనసోముని (క్రీ. శ. 1350) ప్రయోగం.

3. అర్థంచేసుకోక పదాల్ని మార్చడం : పదాన్ని అర్థంచేసుకోలేక కొన్ని చోట్ల మార్పులు చేశారు. 'తనపిల్ల తవిటికియేడిస్తే లంజపిల్ల రావిరేకకు ఏడ్చి నది' (కార్ 889) 'తనపిల్ల గంజికేడిస్తే లంజపిల్ల దావిరేకకేడ్చిందిట'. 'రావిరేక' అనే పదానికి బదులు 'దావిరేక' వచ్చింది. 'రావిరేక' ఒకఆభరణ విశేషమని కార్ పండితుడు. అలాగని ఇప్పుడు తెలీదు కాబట్టి సామెతలో ఆ పదాన్ని మార్చి వుండొచ్చు. 'వంజెకేలరా వత్తిధర' (కార్. 3600)ను 'వంచె కేలరా వత్తిధర' అనేవిధంగా మార్చారు. అరసున్ని నమ్ముకొని పురుషున్ని పోగొట్టుకొన్నట్లు' అనేది మూలంకాగా 'హర్షుని నమ్ముకొని పురుషునిపోగొట్టుకున్నట్లు' అని మార్చినసామెత.

'అరసు' అంటే రాజు. 'స్వర్గానికిపోయినా వడేకులుతప్పవు' (1కార్. 2181.) అనిమూలం. 'స్వర్గానికిపోయినా విడాకులుతప్పలేదట' అనిమారినసామెత. 'వడేకులు తప్పవు' అంటే నూలువడకడం తప్పదు అనిఅర్థం.

4. ఒక దళం బదులు మరో దళం వేయడం : రెండుదళాలసామెతలో ఒకదళం అలాగేవుండి రెండోదళం మారుతుంటుంది. 'ఆలుమగలకలహం ఆరికకూడు వండినంతసేపు' అని ఒకచోట వుండగా రెండోదళం 'అద్దంమీద పెసరగింజ వేసినంత సేపు' (కాప్ 203) 'అన్నం తినేదాకానే' అని రెండువిధాలుగా మారింది.

'నేలవిడిచిన సాము తాళంవిడిచిన పాట' అని ఒకసామెత అయితే రెండోదళం 'మతివిడిచిన మాట', 'నీరువిడిచిన ఈత' అని వేర్వేరుగా మారింది. 'దశకొద్దీ దొరికాడు దిపమొలమొగుడు' అనేసామెతలోని రెండోదళం 'పుపికళ్ల మొగుడు' అనేవిధంగా మారింది.

1.6 సామెతలనుశక్తిమంతంచేసే ప్రయత్నం: రెండు విధాలు.

అ. సామెతలో ఉండే సంఖ్యనుపెంచడం.

ఆ. సామెతలోనిదళాల సంఖ్యను పెంచడం. మొదటివిధానికి ఆంగ్లంలో ఉదాహరణలున్నాయి. 'ఒకఅబద్ధము కప్పుటకు నాల్గు ఇతరఅబద్ధములాడవలసియుండును' (ఆం. వి.) 'ఒకఅబద్ధము కప్పడానికి వేయిఅబద్దాలు' (సా. సా. 89) 'ఒకరిద్దరిని చంపితేగాని వైద్యుడుకాడు', 'నలుగురిని చంపితేగాని డాక్టరుకాడు', (గృ. ల. 105)' 'నూరుమందిని చంపితేగాని వైద్యుడుకాడు' (సా. సా. 278). మొదటిసామెతలశ్రేణిలో నాల్గు 'వేయి'గా పెంచబడింది. రెండోదానిలో ఒకరిద్దరు-నలుగురు-నూరుగా పెంచబడింది. ఒకరిద్దరు....అనేదే మూలరూపం. ఒ-వైలకు యతి పడింది. వై-ఒయ్‌లాగా పలకబడుతుంది కాబట్టి యతిచెల్లిందనడంలోతప్పులేదు.

ఆ. సామెతలో వున్నదళాలకు ఒకటిగానీ, అంతకన్నా ఎక్కువగానీ దళాల్ని చేర్చి పెంచడం కొన్ని చోట్ల జరిగింది. ఒకేదళంతో సామెత వున్నపుడు అనురూపమైన మరోదళం చేర్చడంతో సామెత పెరిగింది. 'ఆశకు అంతంలేదు' అనే ఏకదళ సామెతకు సమాంతరాలు కన్నడ, తమిళ, మలయాళాల్లో ఉన్నాయి (సా. సా.53) దాన్ని శక్తిమంతంచేసేందుకు 'గోచికి దరిద్రములేదు', 'నిద్రకు సుఖంలేదు' 'నిరాశకు చింతలేదు' అని మూడువిధాలుగా వేర్వేరుదళాలు చేర్చబడ్డాయి.

రెండుదళాలసామెతకు మరోదళం చేర్చడానికి-ఉదా॥ 'ఆకలి రుచిఎఱుగదు, నిద్ర సుఖమెరుగదు' అనే రెండుదళాలసామెతకు 'వలపు సిగ్గెఱుగదు' (కార్. 56) 'చీడ సిగ్గెఱుగదు' (చి. సు.) అనే దళాలు వేర్వేరుగా కలపబడ్డాయి. 'మబ్బువిడిచిన యెండ, మగడువిడిచిన ముండ' (వ్య. సా 708) అనే రెండు దళాలసామెత 'పట్టివిడిచినమండ పటావోపాలుమెందు (వ్య. సా. పీఠిక) అనే దళాన్ని కలుపుకొని త్రిదళసామెత అయింది

రెండుదళాలసామెతకు మరోరెండుదళాలు చేరినప్రయోగం 'మబ్బు విడిచిన యెండ, మొగున్నిడిచిన ముండ, పట్టివిడిచినముంద ఎత్తి విసిరిన కుండ అనేది.

మూడుదళాలసామెత మరో మూడుదళాల్ని కలుపుకొని షష్ఠదళసామెత ఐన ప్రయోగంకూడా వుంది 'సూరన్న సుఖవాసి పేరన్న పెద్దవాడు, అయ్యాకెత్తరా కోళ్లగంప, (కార్. 2119). 'సూరన్న సుకవాసి, పేరన్నపెద్దవాడు, బుచ్చన్న బుద్ధిమంతుడు, అచ్చన అంతకంటె, కామన్న కదసాని, చేసేవారెవరు ?' (ని వేం.)

దళాలుపెరగడంవల్ల సామెత సారవంతంఅయేబదులు ఒకోసారి విస్తారం అయే ప్రమాదంకూడా లేకపోలేదు. పై సామెతే ఇందుకుదాహరణ. అందుకే ఇలాటి 'పొడిగించబడినసామెతలు ప్రాచుర్యంపొందలేదు అనాను.

1.7 ఒకేవిషయంమీద వేర్వేరుసామెతలు ; ఒకేవిషయం పైన వేర్వేరు సామెత లుండొచ్చు అంటే ఒకేసందర్భానికి సరిపోయే వేర్వేరుసామెతలుంటాయన్న మాట ఉదా॥ బొంకమంటే ఎన్నిరకాలుగా బొంకొచ్చో ఈ ఎనిమిది సామెతల శ్రేణి చెప్తున్నది. 'బొంకరా గురవా అంటే గురజాలదోమలు గుర్రిగింజలంతేసి అన్నాడట, 'బొంకరా బొంకరా పోలుగా అంటే ఎద్దుఅడుగులో ఏడుకొండ్లేనులు అన్నాడట', 'బొల్లి బొల్లి మాలబొల్లా అంటే ఎద్దుఅడుగులో ఏడు బొల్లిమేనులు అన్నాడట', (వ వ.), 'బొంకరా బొంకరా పోలుగా అంటే టంగుటూరిమిరియాలు తాటికాయలంతేసి' 'పుళగరా పుళగరా పోలుగా అంటే టంగుటూరిమిరియాలు తాటికాయలంతేసిఅన్నాడట (చంద్ర), 'ఏటి అవుతలి మిరియాలు తాటికాయలంతేసి అంటే మాఇడు మాకులే వ్రట్టలేదన్నదట', టంగుటూరిమిరపకాయలు తాటికాయలం తేసి' (రా వ 322) 'గచ్చు గచ్చురా మాలపోలిగా అంటే ఒడ్డిచెట్టు మద్ది మామరా వుంది మహాప్రభూ అన్నాడట' (నర).

అవసరానికి ఉపయోగించుకొని, అవసరంతీర్తానే వలకరించకుండా పోయే కృతఘ్నతాభావాన్ని క్రింది ఆరు సామెతలు చక్కగా చిత్రీకరిస్తున్నాయి.

'ఏరుదాటిందాకా యెంగన్నా, ఏరుదాటినాక నా పింగన్నా' (నర) 'అక్కఱతీరితే అక్కమొగుడు కుక్క', 'అక్కరపడినప్పుడు ఆదినారాయణ. అక్కఱతీరితే గూద నారాయణ', 'ఏఱుదాటి తెప్పతగలబెట్టినట్లు', 'అక్కరగడుపుకొని తక్కెడ పొయిలో పెట్టినట్లు', 'అక్కరతీరినాక ముక్కర నాది అన్నట్లు' (నర) లాంటివి. నిషిద్ధ వస్తువును పెద్దలు ఒకవేళ ఉపయోగించినా, చిన్నవాళ్లు అడుగకూడదు అని 'ఒజ్జల పుచ్చకాయవలె', 'గురువులోరి పొగచుట్ట' (చె.వేం.) అనే సామెతలు తెలుపుతాయి.

అత్త కఠినత్వాన్ని, కోడల్ని రాచిరంపానబెట్టే క్రూరత్వాన్ని ఈక్రింది ఎని మిది సామెతలు అరచేతిఉసిరికగా చేస్తున్నాయి. 'అత్తకొట్టినకుండ అడుగోటికుండ, కోడలుకొట్టినకుండ కొత్తకుండ', 'అత్త చేసినపనికి అరళ్లులేవు', 'అత్త మంచీ పేము తీపీలేదు', 'అత్త మిత్తి ఏరాలు కత్తి', 'అత్త ముండకన్న ఉత్త ముండమేలు', 'అత్తవారిల్లంటే కత్తులబోను', 'అత్తవారింటిసుఖం, మోచేతిదెబ్బవంటిది' 'అత్తింటికాపురము కత్తిమీదసాము' అనేవి.

1.8 సామెతలవ్యాప్తి-ప్రయోజనం: 'ఇందుగలడందులేడని సందేహము వలదు చక్రి' అని భాగవతం. అలాగే సామెతలు సర్వవ్యాపకాలు. లిపి వున్నాలేక పోయినా, నాగరికతవున్నా లేకపోయినా ప్రతిజాతికీ సామెతలు సహజాలంకారాలు. శీఘ్రగ్రాహకశక్తి, చమత్కారలాఘవం వుండే 'కెల్టిక్' జాతులవారికన్న, బుద్ధికుశలత తక్కువయిన 'టెంటాన్' జాతులవారికే ఎక్కువ సామెతలున్నాయి.[19] అనే విషయాన్ని పరిశీలిస్తే వివేకవంతులైన నాగరికుల్లోకన్నా వివేకంతక్కువైన జాన పదుల్లోనే సామెతలు ఎక్కువగా పుట్టి, వ్యాప్తిలోవుంటాయని గ్రహించొచ్చు.

కాసారంలో రాయివేస్తే అలలు చుట్టూవ్యాపించినట్లు, సామెత ఒకచోట పుట్టి చుట్టుప్రక్కల, దేశమంతా వ్యాపిస్తుంది. రాయిపెద్దదైతే అలలు త్వరగాప్రాకి, చాలాసేపు ప్రభావంఉన్నట్లు అంతర్గర్భితసారవంతాలైన సామెతలు దేశమంతటా విస్తృతిపొంది, చాలాకాలం ప్రజలవాడుకలో వుంటాయి.

ప్రజల్లో సాహిత్యంకన్నా సామెతలకే ఎక్కువప్రచారముంటుంది. దేశంలో నూటికి ఎనభై మందిగావున్న జానపదుల్లోనే కాదు;జనపదజన్ములైన విద్యాధికుల్లోనూ అనుకోకుండా ఎన్నోసామెతలు మాటలసందర్భంగా దొర్లుతూనేవుంటాయి.

ప్రపంచంలో అన్నిభాషల్లోనూ సామెతలున్నాయి. సుమేరియన్‌శాసనాల్లో వ్యాకరణసూత్రాలు సామెతలరూపంలో చెప్పబడ్డాయి. ప్రాచీన చైనాలో నీతిబోధకు.

హిందూదేశంలో తాత్వికార్థ వ్యాఖ్యానాలకు వేదాల్ని (Vedic Writings) సామెత లుపయోగించబడ్డాయి.

'బైబిలు'ప్రాచీననిబంధనలో సామెతలగ్రంథం (Book of Proverbs) వుంది. దీనికి సాలొమన్‌రాజు కర్త అని ఐతిహ్యం. ప్రాచీనతఃకి ష్టియనుల. పిరియన్ల, మెసపటోమియన్ల విజ్ఞానసాహిత్యం ఇది. యువతరానికి బాధ్యతల్ని నేర్ప డమే దీనిఉద్దేశం.21

స్పెయిన్‌దేశంలో ప్రతివిషయానికీ సంబంధించిన సామెతలున్నాయి.22 స్పానిష్‌భాషలో 30,000, జర్మన్‌భాషలో 145000 సామెతలున్నాయని ఒక అంచనా.23

"లక్షలాదిగాఉండే తెలుగుసామెతల్లో, ఒకలక్షసామెతలు సేకరించడానికి సంకల్పించి, కీర్తిశేషులు చిలుకూరినారాయణరావుగారు సామెతలయజ్ఞం ప్రారంభించారు. సేకరించినవాటిని అకారాదిగా సమకూర్చారు. 1948లో పెంపూడిలో సాహిత్యపాఠశాలలో ఉపన్యసించడానికి వచ్చినపుడు వారు తాము సంకలనంచేసిన సామెతలను-రెండుపెద్దమూటలతో తెచ్చారు.24 అవి విడుదవోలు వేంకటరావుగారు అన్నారు. వాటిగతి ఏమైందో తెలియటంలేదు.

ఆఫ్రికాదేశంలో సామెతలప్రాచుర్యం బహుళం. ఆఫ్రికన్లు వైనందినభాష ణల్లోకూడా వీటిని ప్రయోగిస్తుంటారు. వారిన్యాయవిధానంలో వీటిప్రమేయముంది. సామెతలు బాగాతెలిసి, సందర్భోచితంగా ప్రయోగించగలన్యాయవాదివద్దకే ముద్దాయిలు వెళ్తుంటారు. పాశ్చాత్యదేశాలలోజడ్జినీ జూరీనీ ప్రభావితంచేయడానికి న్యాయవాదులు లోగడవ్యాజ్యాల్ని నిదర్శనాలుగాపుటంకిస్తే, ఆఫ్రికన్‌న్యాయవాదులు ఆ సందర్భానికి సరిపోయే సామెతల్ని ఉద్ఘాటించి ప్రభావితంచేస్తారు.25 ఆఫ్రికాలోని 'యొరుబా'జాతిలోని గౌరవనీయుడు, వివేకివైనవ్యక్తి ఎవరైనా,ఏలాంటి సందర్భానికైనా సరిపోయే సామెతల్ని వుటంకించి సమస్యను పరిష్కరించగలడు.26

సామెతలు కొన్ని శతాబ్దాల్లో ఎక్కువగాను, కొన్నిశతాబ్దాల్లో తక్కువగాను ఆయా సంఘాల్లో ప్రాచుర్యంలోవుంటాయి. ఐరోపాదేశాల్లో మధ్యయుగాల్లో వీటి ప్రాబల్యం ఎక్కువ. ఎలిజబెత్‌యుగం (16-17 శ.) సామెతలకు స్వర్ణయుగం లాంటిది. 'జాన్‌హేవుడ్' సామెతలసంభాషణ రాశాడు (క్రీ. శ. 1546). డ్రైడన్ ఒకభావగీతాన్ని రచించాడు. కామన్స్‌సభలో పూర్తిగా సామెతల్లోనే ఒకప్రసంగం చేయబడింది. నాటి నాటకాలకు సామెతల పేర్లయ్యాయి. 16వ శతాబ్దినుంచి 19వ

శతాబ్దిదాకా పిల్లల మేలుబంతిపుస్తకాలలోనూ, కుట్టుపని నేర్చుకొనేందుకు ఉపయోగించేవస్త్రాలపైనా సామెతలు రాసేవారు. సామెతల్ని చిత్రవిచిత్రవస్త్రాలమీద, చిత్తరువులమీద, ఆయుధాలమీద చెక్కేవారు.[27] అంతేకాదు. ఎలిజబెత్‌యుగం సామెతలలో మునిగితేలింది. పండితులు, వివేకవంతులు, ఆస్థానోద్యోగులు, రచయితలే కాదు రాణిగారుసైతం సామెతలలోనే మాట్లాడేవారు. రాసేవారు.[28] కానీ 18వ శతాబ్ది ప్రథమార్థంలో సామెతలవినియోగం చాలామాత్రం తగ్గిపోయింది.[29]

సామెతలు ప్రాచీన విజ్ఞానాన్ని అందించడంవల్ల, జాతిసామూహిక విజ్ఞానాన్ని తమలో పొదువుకొనిఉండడంవల్ల, సమస్యను వీలైనంతతక్కువగా వ్యక్తీకరించి స్పష్టం చేయడంవల్ల, అట్లాంటిసమస్యలు ఇంతకుముందుకూడా వచ్చినట్లు చెప్పడంవల్ల ప్రజలపై మంచి ప్రభావాన్ని చూపుతున్నాయి.[30]

ఒకదేశంలో వాడుకలోవున్నసామెతలు ఆ దేశపువిశ్వాసాల్ని, జీవన విధానాన్ని, మిగతా దేశాలకన్నా ఆ దేశపుభిన్నత్వాన్ని తెలుపుతాయి.[31] అంతేకాదు. సామెతలు ఆయాజాతుల కేంద్రీకృతఅనుభవాన్ని కలిగివుంటాయి. కాబట్టి ఏవ్యక్తి అయినా సామెతల్ని అనుసరించి తన జీవితాన్ని క్రమబద్ధంచేసుకోగలిగితే, అతడు తప్పుదార్లుతొక్కే ప్రమాదం తక్కువ. ఇది ఎంతోసులభంగా తోచినా ఎవరూ అలా చేయడంలేదు.[32]

జానపదవిజ్ఞానం అచ్చులోకి ఎక్కినందువల్ల కొత్త సామెతలు పుట్టడంలేదు.[33] అనే అభిప్రాయముంది. ఇది పూర్తి నిజం కాదు కాకపోతే సామెతలు ఒకకాలంలో ఎక్కువగాపుట్టవచ్చు. అన్నికాలాల్లోనూ సామెతలు పుడుతూనే ఉంటాయి. కాల ప్రవాహానికి ఎదురీది నిలద్రొక్కుకునేసామెతలు కొన్నే. 'కోర్టుకు పోతివా? కొల్లకు పోతివా?' 'అర్జీలకు పనులుకావు ఆశీర్వచనాలకు బిడ్డలుపుట్టరు', 'గుడారంలో గూనిబ్రతుకు' లాంటిసామెతలు ఆధునికకాలంలో పుట్టినవే.

1.9 తెలుగుసాహిత్యం-సామెతలు : తెలుగుసాహిత్యం సంస్కృతఇతివృత్తాల్ని, రచనావిధానాన్ని, సమాసనిర్మాణాన్ని, వాక్యరచనావిధానాన్నీ అరువుతెచ్చుకొంది. పండితజనుల సమాదరాన్నే ఆశించింది. నన్నయభారతంలో సామెతలు ఐదు మాత్రమేవుండగా, దేశిసంప్రదాయాన్ని సమాదరించిన పాల్కురికిసోమనలో 193 సామెతలున్నాయి.[34] లోకటిపాటలకు దగ్గరగావుండే ద్విపదలే సామెతలకు సరిగ్గా సరిపోయాయి వృత్తాల్లో సామెతలు సాగతీయబడ్డాయి. వేణుగోపాలశతకంలోను, వేమనపద్యాల్లోను బోలెడన్నిసామెతలున్నాయి. సారంగపాణి సామెతల్ని విరివిగా

వాడాడు. క్షేత్రయ్య నానుడులనుపయోగించినంతశక్తితోనూ సారంగపాణి సామె తల్ని ఉపయోగించినాడు''35

'కందువమాటల సామెతలందముగా జేర్చి చెప్పనది తెనుగునకున్ పొందై, రుచియై, వీనుల విందై మరి, కానిపించు విబుధులకెల్లన్'36. అని సాహిత్యంలో సామెతలఅవసరాన్ని, సామెతలు సాహిత్యానికికూర్చేశోభను మొల్ల పై పద్యంలో ఉద్ఘాటించింది. ''యే కవిత్వంలో సామెతలు విశేషించి వుంటాయో ఆ కవిత్వం యెక్కువ హృద్యంగా వుంటుంది. దానిక్కారణం భాషాజ్ఞానంలేనివాళ్లక్కూడా దేశసామెతలు సుళువుగా అర్థమవడమే''37 అని చెళ్లపిళ్లవారు సాహిత్యంలో సామెతలప్రాధాన్యాన్ని పునరుద్ఘాటించారు.

**1.10 సామెతలస్వరూపం :** సామెతలస్వభావాన్ని చర్చించింతర్వాత సామెతల స్వరూపం ఎలావుంటుందో చర్చించుకోవడం అవసరమే. 'సామెత' అనేపేరు రావడానికికారణం ఇలా వుంటుంది అని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు తమ నోట్సులో రాసుకున్నారు. ''సామెతఅంటే లోకంలో చిత్రమైనవ్యవహారాలకు పోలికచెప్పడానికి పేర్కొనే కథలతోగలసామ్యత అన్నమాట. ఆకథలను 'లోకో క్తులు' అన్న సంస్కృతపదమును వాడక 'సామ్యతలు' అని వాడడానికి తెలుగు సామెతలన్నిటిలోనూ ఉండే 'అన్నట్లు', 'వలె' అన్న చివరిమాటలు ధ్వనించే సామ్యతయే కారణమేమో''38, పోలిక అర్థాన్నిచ్చే వలె. అట్లు/అట్టు. అవటము, వంటిది, చందము. మాదిరి. సామెత, సామ్యము అనేపదాలు చాలాసామెతల చివర వాడబడ్డాయి. లేదా మూడోమనిషి చెప్పినట్లు 'అన్నాడట, అన్నాడట,అన్నారట, అన్నట్లు/అన్నట్టు' అనేవి సామెతలకు అంత్యాంగాలుగా వున్నాయి. వీటినే 'లోకోక్తి సామెతలు'39 అని చేకుమళ్లకామేశ్వరరావుగారు. 'కవులవ్యవహారములో చూస్తే సామ్యము అనే కనబడుతూంది; సారంగపాణి వరకూ. ఆయనగారు మట్టుకు 'సామెత' అని వాడినాడు — 'ఉడుముకలుగులోని చెయ్యి సామితె' 'కోతి చేతి మాణిక్యము సామితె' 'చదువబెట్టినసామితె' 'ఉలవకట్టుసామితె'.40 నిజానికి 'పోలిక' అనేఅర్థంలో 'సామెత'ను రంగనాథరామాయణకర్త సారంగపాణికన్నముందే ప్రయోగించాడు.41

కార్ 'ఆంధ్రలోకోక్తి చంద్రిక'లో తొమ్మిదో సామెతచివర 'సామెత,సామిత అనివుంది.'సామ్యము' అనేది నాలుగుచోట్ల; 'అవటము''మాదిరి''చందము'ఒక్కొక చోట; 'వత్తు' (సం. వత్) మూడుచోట్ల 'కార్' లోనే కనిపిస్తున్నవి. 'వలె'

ఎడుచోట్ల; 'అట్లు' 127 చోట్ల; 'అట్టు' ఐదుచోట్ల, సాహిత్యఅకాడమీవారి 'తెలుగు సామెతలు' గ్రంథంలోవున్నట్లు అ, ఆ, ల క్రింద ఇచ్చిన 1110 సామెతల ఆధారంగా చేసిన నమూనాపరిశీలనలో తేలింది కార్ గ్రంథంలోనే తక్కినసామెతసంకలనగ్రంథాలలో లేని 'సామిత, సామ్యము, ఆవటము, మాదిరి, చందము, వత్తు' అనే సాదృశ్యబోధకాలు కనిపిస్తున్నాయి. కిలార్థకము 'అట', 'అంట' అనేవాటిలో మొదటిది 72 చోట్ల, రెండోది రెండు చోట్ల కనిపిస్తున్నాయి. అట అనేది 'అన్నది అన్నాడు, అంది, అన్నారు' అనే సమాపక క్రియారూపాలమీదకూడా కనిపిస్తున్నది. 'అన్నట్లు' 33 చోట్ల, 'అన్నట్టు' మూడుచోట్ల ప్రయోగించబడింది. ఈసంఖ్యలన్నీ 'తెలుగుసామెతలు' గ్రంథంలో మొదటి 1110 సామెతల నమూనా పరిశీలనలోవే.

నమూనాపరిశీలనలోని 1110 సామెతల్లో 'వాక్యాంతసాదృశ్యవాచకా' లుండే సామెతలు 218 కాగా, 302 చివర ఇవేవీలేనివి. అంటే సామెతలలో దాదాపునాల్గోవంతువాటికి మాత్రమే ఏదో ఒకవిధమైన 'సాదృశ్యబోధకం' చివర్లోకలపబడింది అన్నమాట.

'అట్లు' 'అట్టు' అనేవి భూతకాలికక్రియావిశేషణంపైనా, 'సామెత' అనేది విశేష్యాలమీద. లేక 'అను' అనే అనుకరణబోధకక్రియమీద కనిపిస్తున్నాయి. 'సామ్యము, వలె, మాదిరి, ఆవటము, వంటిది' అనేవి విశేష్యాలమీదనే వస్తున్నాయి. 'అట, అంట' అనేవి విశేష్యాలమీద, సమాపకక్రియలమీద;' 'అన్నట్టు, అన్నట్లు' అనేవి విషయనిషేధకవాక్యాలమీద, ప్రశ్నార్థకాలమీద కనిపిస్తున్నాయి.

1.10.1 సామెతలు క్రియారహితవాక్యాలుగానో, క్రియాసహితవాక్యాలుగానో వుండొచ్చు. క్రియారహితవాక్యాలలో సాధారణంగా అనురూపమైనరెండుదళాలుంటాయి. ఒకేదళముండేవి అరుదు. మూడు, నాల్గు దళాలుండే సామెతలు కూడా వుండవచ్చు.

'మేపే రూపు', 'కందే కాంతి' లాంటివి క్రియారహితవాక్యాల్లోవుండే ఏకదళ సామెతలు. 'అంకెకురాని ఆలు, కీలెడలినకాలు'; 'అంగట్లో అరువు తల మీదబరువు' లాంటివి ద్విదళసామెతలు. 'చుట్టుడుచాప, విసురుడుతలుపు, పెడసరపు పెండ్లాము' లాంటివి త్రిదళసామెతలు. చతుర్దళ సామెతలకు ఉదా॥లు, 'అత్తపని శిత్తపని - దినమొకకండె, నాపని రాచపని-నెలకొకకండె', 'నాడుఉంటే నవాబుసాయెబు, అన్నముంటే అమీరుసాహెబు, బీదపడితే ఫకీరుసాయెబు, చస్తే పీరూసాయెబు', షష్ఠదళవాక్యంలోవుండే సామెత - 'సూరన్న సుకవాపి, పేరన్న పెద్ద

వాడు, బుచ్చన్న బుద్ధిమంతుడు, అచ్చన అంతకంటే, కామన్న కడసారి, చేసేవారెవరు ?' (ని. వేం.) అనేది.

క్రియాసహితవాక్యాల్లో ఏకవాక్యసామెతలనుంచి పంచవాక్యసామెతలదాకా వున్నాయి. 'పీడపిగ్గెలుగదు' అనేది ఒకవాక్యంలో వుండేసామెత. 'గువ్వ గూడెక్కె-రాజు మేడెక్కె', 'గడియ పురసత్తులేదు గవ్వ ఆదాయంలేదు' లాంటివి రెండువాక్యాలుండే సామెతలు. 'గుట్టెక్కితే పుట్టెక్కితే మేటిమెట్టెక్కితే అన్నట్లు', 'అంతనాడులేదు ఇంతనాడులేదు సంతనాడుపెట్టింది ముంతంత కొప్పు' అనేవి మూడువాక్యాలుండే సామెతలకుదాహరణలు. ఐదువాక్యాలుండేసామెత ఇది. 'ఏకాదశినాడు తలఅంటుకొంటావేమి; అంటే అది నిత్యవ్రతము నేడే ఆరంభించాను అన్నాడట; మర్నాడు తలఎందుకు అంటుకోలేదంటే విన్నటితో వ్రతసమాప్తి అయినది అన్నాడట'.

1.10.2 చాలామటుకు రెండుసామాన్యవాక్యాలు కలిసి ఏర్పడ్డ సంయుక్తవాక్యాలుంటాయేగాని మూడు ఆపైన వాక్యాలుండేవి అరుదు. దీన్నిబట్టికూడా సంక్షిప్తతకు సామెతనిర్మాణంలోని ప్రాముఖ్యాన్ని గ్రహించొచ్చు.

ఒకసామెతలోని రెండుసామాన్యవాక్యాలూ క్రియాంతాలుగావుండొచ్చు. 'అంగట్లో అన్నీ ఉన్నవి - అల్లునినోట్లో శనివున్నది'; 'అంటే ఆరడిఅవుతుంది అనకుంటే అలుసవుతుంది' లాంటివి.

ఒక్కొసారి రెండుసామాన్యవాక్యాల్లోవుండే రెండుక్రియలకు బదులు రెండోవాక్యాన్ని మాత్రం క్రియాంతంగా చేయడముంది. 'అటుకులుబొక్కేనోరు, ఆకివోసుకునే నోరు ఊరుకోవు', 'అత్త మంచీ, వేసుతీపీలేదు.'

సామెతల్లో రెండుసామాన్యవాక్యాలను 'అంటే, అయినా, కంటే, ఉంటే, కాని' లాంటి పదాలు కలుపుతుంటాయి.

ఉదా॥ 'అతిరహస్యం' ఏమిటిరా ? అంటే పొగాకు తిరిపెమన్నట్లు'

'అతి వృష్టిఅయినా అనావృష్టిఅయినా ఆకలిబాధ తప్పదు'

'అతంత్రునికి ఆలుఅయ్యేదానికంటే బలవంతునికి బానిసఅయ్యేది మేలు'

'అత్త ఎత్తుకొని తింటూఉంటే అల్లునికి మనుగుడుపా ?'

'అత్త పెట్టేఆరళ్లు కనపడుతవికాని కోడలు చేసే కొంటెపనులు కనబడవు'

1.10.3 సమాపకక్రియాసహితవాక్యాల్ని ఐదువిధాలుగా విభజించొచ్చు.

అ. భూతకాలికాలు, ఆ. తద్ధర్మార్థకాలు, ఇ. విధ్యర్థకాలు ఈ. నిషేధార్థకాలు, ఉ. వ్యతిరేకార్థకాలు.

ఖ్యాత. అంకె లేనికోతి లంకంతా చెఱిచిందట.
అందఱిపుణ్యాన ఆలాయె. కొందఱిపుణ్యాన కొడుకాయె_లాంటివి.

తద్ధర్మ. అంగట్లో అన్నీ ఉన్నవి. అల్లునినోట్లో శనిఉన్నది.
అడుగుతప్పితే పిడుగుతప్పుతుంది - లాంటివి.

విధి. అంకెకురానిఆఁని ఆగ్గురుబిడ్డలతల్లిఅయినా విడువాలె.
అందఱికాళ్లకు మొక్కినా అత్తగారింటికి పోకతప్పదు - లాంటివి.

నిషేధ. అగసాలిని, వెలయాలిని నమ్మరాదు.
అగ్నిశేషం, ఋణశేషం, శత్రుశేషం, వ్రణశేషం ఉంచరాదు - లాంటివి.

వ్యతిరేక. అంటినప్పుడు ఆముదము రాచుకొన్నా అంటదు
ఉత్త మెత్తన, వేము తియ్యన లేవు - లాంటివి.

1.10.4 సామెతలు రూపనిర్మాణాన్నిబట్టి క్రింది ఆరువిధాలుగాకూడా వుండొచ్చు.
అ. ప్రశ్నార్థకాలు ఆ. ఏవార్థకాలు ఇ. ఆశ్చర్యార్థకాలు ఈ. సంబోధనార్థకాలు
ఉ. సందేహార్థకాలు ఊ. ప్రార్థనార్థకాలు

అ. ప్రశ్నార్థకాలు : రెండువిధాలు. విశేషవిషయాపేక్షకాలు, విశేషవిషయ నిర పేక్షకాలు. 'క్రియారహితవాక్యాలగురించి చెప్పినపుడు పేర్కొన్నప్రశ్నలు విషయ నిరపేక్షకాలు. అవి వాక్యాంతంలో 'ఆ' అనేరూపాన్ని చేర్చడంవల్ల ఏర్పడతాయి. విశేషవిషయాపేక్షకాలు ప్రత్యేకపదార్థక పదంద్వారా వ్యక్తమవుతాయి. ఈరకపు ప్రశ్నలు ఎందుకు, ఎప్పుడు, ఎక్కడ, ఎట్లా, ఎవరు, ఏమిటి మొదలైనరూపాల వల్ల ఏర్పడతై42. విశేషవిషయనిరపేక్షకాలకు 'అందముంటే ఆయెనా అదృష్టం ఉండవద్దా', 'అయ్య వాతపెట్టనూ బజ్జె బ్రతకనూనా' అనేవి ఉదాహరణలు. విశేష విషయాపేక్షకాలకు 'అంతా తడిసినతర్వాత చలేమిటి?' 'అంతా బాపలేఅయితే కోడి పెట్ట ఏమైనట్లు?' అనేవి ఉదాహరణలు.

ఆ. ఏవార్థకాలు : విషయాన్ని నొక్కిచెప్పేవి. 'ఏ' అనేప్రత్యయం ఏవార్థ కంగా వాక్యాంతంలో వస్తుంటుంది. అరుదుగా వాక్యమధ్యంలో రావచ్చు. 'అంద బ్రతుకూ ముండబ్రతుకూ అదవే', 'అందఱికీ అన్నంపెట్టేవాడు రైతే', 'అంతంత వాణ్ణి చూస్తే ఆవుపెయ్యే కుమ్మవస్తుంది' లాంటివి.

ఇ. ఆశ్చర్యార్థకాలు : 'అ ఆలు రావు, అగ్రతాంబూలంమాత్రం కావాలి!' 'అడ్డెడుతినేనాసవితి ఎలా తింటుందో! గిద్దెడుతినేనాసవతి ఎలా తింటుందో! అడ్డెడుతినేవలకు నా దవడలీడ్చుకొని పోయినవి' లాంటివి.

ఈ. సంబోధనార్థకాలు: 'అప్పిలేదు, గప్పిలేదు. చచ్చినట్లు తొంగోపి', 'తెలివాకరిసొమ్మా బెస్త గుర్రమ్మా' లాంటివి.

ఉ. సందేహార్థకాలు: అడుసునపాతినకంబం అటు ఒరుగునో ఇటు ఒరుగునో. ఆలిని అదుపులో పెట్టలేనివాడు అందరినీ అదుపులో పెట్టునా?

ఊ. ప్రార్థనార్థకాలు: అత్తకు నాకు అరంపేరం, అత్తనెత్తుకపో ముత్యాలమ్మా; అత్తనెత్తుకపోతే అరుగాళ్ల జీవాన్ని అర్పిస్తాను;

**1.10.5 సంభాషణ సామెతలు:** అరబిక్. గ్రీక్, రుథేనియన్, రషియన్, పోలిష్‌భాషలు సంభాషణ సామెతలకు చాలాప్రసిద్ధి 43. తెలుగులో కూడా ఇలాంటివి లేకపోలేదు. వ్యక్తులమధ్యనేగాక జంతువులమధ్య, జడపదార్థాలమధ్యకూడా సంభాషణ జరిగినట్లు చెప్పబడుతున్నాయి.

> 'ఊళ్లోకే రావద్దు రౌతా; అంటే గుర్రాన్ని ఎక్కడ కట్టేసేది; అన్నారట'.
> 'కానుగవాసాలు కవోయి రాదరుసాహెబ్ అంటే పుచ్చినవాకా వుందునా; బురాన్ సాహెబా అన్నాడట'.
> 'మొసలిబావా కడింపేరామొగాని, కాలయినా యింతేగదా' (కార్ 1837)
> 'ఏ ఊరే ఏతామా? అంటే, దువ్వూరే మూలామా అన్నదట'.
> 'కాసీపూసే చింతా, గన్నారపు నంరా, సీళ్లకడపకాడముంతా నిద్రకేమి పుచ్చుకుంటావ్'.

**1.11 తెలుగుసామెతలు-విషయవిశ్లేషణ:** సామెతల్లోవైవిధ్యం అతివిస్తృతం. వాటిని వివిధవిషయాలచట్రాల్లోకి బిగించడం కష్టసాధ్యం. అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలు లేకుండాచేయడం అసాధ్యంకాకపోవచ్చుగాని చాలాదినాలు శ్రమించి చేయాల్సినపని. నాకున్నకాలపరిమితిలో, మితజ్ఞానంతో ఒక చట్రాన్ని తయారుచేసేందుకు ప్రయత్నంచేశాను. అది ఇది :

తెలుగుసామెతల్ని 1. సార్వదేశికాలు 2. ప్రాదేశికాలు అని రెండుపెద్దవిభాగాలుగా మొదట వింగడించవచ్చు. తెలుగుదేశానికంతా సంబంధించిన సామెతలు సార్వదేశికాలు కాగా ఏదైనా ఒకప్రదేశానికి సంబంధించి చెప్పినసామెతలు ప్రాదేశికాలు. తెలుగుదేశంలో కొంతప్రాంతంలోనే వీటివ్యాప్తి వుండొచ్చు. ఒకోసారి సామెతమూలస్వరూపం అలాగేవుండి వివిధమండలాల్లో ప్రదేశాలపేర్లు మారొచ్చు (చూడు. 1.5). అలాంటివాటికి 'ప్రాదేశిక సామెతలు' అని పేరుపెట్టాము.

సార్వదేశికాలైనసామెతలు 1. ప్రాణి సంబంధి సామెతలు 2. ప్రకృతి సంబంధి సామెతలుగా విభజించబడ్డాయి. ప్రకృతిసంబంధి అంటే వాతావరణం, గ్రహాలు, నక్షత్రాలు, కొండలు, నదులు మొదలైనవాటికి సంబంధించినవి. వాతావరణంలో గాలి, వాన,ఎండ,చలి,వెన్నెల అనేశీర్షికలుంటాయి. వాన అనే శీర్షికలో ఉరుములు_మెరుపులు. తుఫానులు, వరదలు, వర్షం, అది వచ్చే లేదా రానిసూచనలు, కరువులు అనే ఉపశీర్షికలుంటాయి.

ప్రాణిసంబంధిసామెతలు మనుష్య, మనుష్యేతరప్రాణి సంబంధులుగా విభజించబడ్డాయి. మనుష్యేతరప్రాణిసామెతలవిభాగంలో జంతు, పక్షి, కీటక, జలచరాల్ని గురించిన ఉపవిభాగాలుంటాయి.

మనుష్యసంబంధిసామెతలు చాలావిస్తృతపరిధి గలిగినవి. ఈ విభాగం 1. కుటుంబవ్యవహారాలు 2. అధికారం 3. స్వభావం 4. వృత్తి 5. ధర్మం 6. ఆహారం 7. వర్తక వాణిజ్యాలు 8. ఋణ సంబంధి 9. సాంస్కృతిక సంబంధి అనే తొమ్మిది ఉపవిభాగాలు చేయబడింది.

కుటుంబవ్యవహారాల్లో కుటుంబసభ్యులమధ్య, చుట్టాలతోను ఉండే సంబంధబాంధవ్యాలు చెప్పే సామెతలుంటాయి. 1. తల్లిదండ్రులు-పిల్లలు 2. మారుతల్లి-పిల్లలు 3. ఆలుమగలు 4. కోడలు-అత్త-మామ-ఆడపడుచు-తోడికోడలు-బావ-మరది-సవతి 5. మేనత్త-మేనమామ, మేనల్లుడు-మేనకోడళ్లు 6. నాన్న-చిన్నాన్న—పెదనాన్న-దాయాదులు 7 సోదరీసోదరులు 8. వదిన-మరది-మరదలు 9. అల్లుడు-అత్త-మామ-బావమరది-మరదలు-వదినె-తోడల్లుడు 10. కుటుంబ సభ్యులు-చుట్టాలు: వీరి సంబంధబాంధవ్యాల్ని తెలిపేవి.

అధికారసంబంధిసామెతల్లో అధికారులు, పరిపాలన అనేవి రెండు విభాగాలు. అధికారులు అనే విభాగంలో రాజు, మంత్రి, తలారి, రెడ్డి, కరణం అనే అధికార్లు, ప్రజల మధ్యగలసంబంధాలను చెప్పేసామెతలు చేర్తాయి. పరిపాలన అనే విషయం పన్నులు-శిక్షలు, ప్రజోపయోగికార్యాలు అని రెండువిభాగాలు. ప్రజోపయోగికార్యాలు అనేవిషయంలో సత్రాలు, చలివేందర ఇలాంటివాటిని చెప్పే సామెతలు చేర్తాయి.

స్వభావంఅనేవిభాగంక్రింద వ్యక్తిస్వభావంలోని వివిధగుణగుణాలు తొందర-నిదానం, ఆనంద విషాదాలు, కోపం, ఓర్పు, ఈర్ష్య, పౌరుషం-పిరికితనం,కామం, దానం-లోభం, మదం, అవివేకం, డంబం, చమత్కారం, హాస్యం, అనే వాటికి

చెందిన సామెతలుచేర్తాయి. కామం ధర్మకామం, అధర్మకామం అని రెండురకాలు. ధర్మకామం భార్యాభర్తలమధ్యశృంగారం. అధర్మకామం వ్యభిచారం, వేశ్యాసంగమం.

వృత్తివిభాగంలో వ్యక్తి బ్రతుకుతెరువుకోసం వంశపారంపర్యంగా చేసే వృత్తిని తెలిపేసామెతలు వస్తాయి. వ్యవసాయం, కమ్మరం, కుమ్మరం, వడ్రంగం, చాకల, మంగల, వైద్యం, పూటకూళ్లు, దొంగతనంలాంటి వృత్తులకు సంబంధించిన సామెతలు ఈ విభాగంలోవి.

వర్ణంఅనేవిభాగంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, పంచమ వర్ణాల్ని గురించినసామెతలు చేరతాయి. శూద్రవర్ణవిభాగంలో చాలా కులాలుంటాయి.

ఆహారసంబంధిసామెతల్లో వ్యక్తి ఆహారపుఅలవాట్లు, వివిధపిండి వంటలకు సంబంధించినసామెతలు చేర్తాయి.

వర్తక వాణిజ్యాలు అనేవిభాగంలో వ్యక్తి చేసే వివిధవర్తకాలు వాణిజ్యాలకు చెందిన సామెతలుంటాయి. వివిధవర్తకవాణిజ్యాలు, సంతలు, కొలతలు-తూకాలు-నాణేలు అనేవి ఈ విభాగంలో ఉపశీర్షికలు.

ఋణసంబంధివిభాగంలో అప్పు, తాకట్టు, పూటపడటం అనే విషయాల మీద వచ్చిన సామెతలుంటాయి.

న్యాయసంబంధిసామెతల్లో తగవులు, దివాలాతీయడం, వాదిప్రతివాదులు, కోర్టుకుసంబంధించినసామెతలు చేర్తాయి.

మనుష్యసంబంధిసామెతల్లో సాంస్కృతికసంబంధిసామెతలు చాలా పెద్ద విభాగం. అందులోని ముఖ్యఉపవిభాగాలు 1. మతం 2. విద్య-కళ 3. వినోదాలు-ఆటలు 4. ఆచారవ్యవహారాలు 5. నమ్మకాలు 6. వేషభాషలు

మతం అనేవిభాగాన్ని మూర్తం, అమూర్తంగా విభజించి చర్చించడమైంది. మూర్తం అనే శీర్షికలో హిందూ, జైన, బౌద్ధ, ఇస్లాం, క్రైస్తవమతాలకు సంబంధించినసామెతలుంటాయి. హిందూవిభాగంలో శైవ, వైష్ణవ, ఇతరదేవతా పూజల్ని గురించివుండేసామెతలు చేర్తాయి. ఈవిభాగంలో రెండోదైన 'అమూర్తం' అనే శీర్షికలో సర్వ మతాల్లో ఆచరించబడే ధర్మసూత్రాలకు చెందిన హింస-అహింస, ధర్మ-అధర్మాలు, సత్య-అసత్యాలు, పాప-పుణ్యాలు, స్వర్గ-నరకాలు. అనే విషయాలకు సంబంధించిన సామెతలు చేర్చబడ్డాయి.

విద్య-కళలు అనే విభాగంలో విద్యనుగురించి, సంగీతం, చిత్రలేఖనం, నృత్యంలాంటి కళలను గురించిచెప్పే సామెతలున్నాయి.

వినోదాలు—ఆటలు అనే శీర్షిక క్రింద తోలుబొమ్మలాటలు, హరికథలు భోగంమేళాలు అనేవి చేరగా చదరంగం, జూదం, పులిజూదం, పిల్లలఆటలు లాంటివి 'ఆటలు' అనే శీర్షికక్రింద చేరతాయి.

ఆచారవ్యవహారాలు అనేవిభాగంలో పెండ్లి, చావులకు సంబంధించిన వివిధఆచారాలు, నోములు, వ్రతాలు, పండుగలు మొదలైనవి, తిరునాళ్లు, జాతరలు అనేవి చేర్తాయి.

నమ్మకాలు అనేవిభాగంలో, శకునాలు, స్వప్నఫలాలు, గ్రహచారాలు, వీటిపై ప్రజలనమ్మకాలు ఇలాంటివింకా చాలా చేర్తాయి.

వేషభాషలు అనే శీర్షికలో స్త్రీ పురుషులఅలంకరణాలు, కట్టూ బొట్టూ మొదలైనవాటికి చెందినసామెతలు, 'భాష' అనేదానిక్రింద వివిధ జాతులభాషలకు సంబంధించి చెప్పబడ్డసామెతలుంటాయి.

నిజానికి ఈ విశ్లేషణ అంతా ఒకస్థూలమైన అవగాహనతో చేసిందే. (చూడు పట్టిక నెం.2) ఈ చట్రంలో చేరనివిషయాలు కొలెడుండొచ్చు. ముమ్ముందు ఇంకా సూక్ష్మంగా విషయవిశ్లేషణ చేయాల్సివుంది.

1.12. సామెతల్లో బూతు : బూతుమాటల్ని మరుగుపరచి అనడం నాగరికుల లక్షణం. మరుగులేకుండాఅనడం జానపదులలక్షణం. జానపదగేయాలో అశ్లీల శృంగారమున్నట్లే జానపదవాఙ్మయశాఖఅయిన సామెతల్లోనూ బూతుసామెతలున్నాయి. అశ్లీలశృంగారభూయిష్ఠాలని జానపదసాహిత్యాన్ని పండితులీసడించారు. కాని ప్రాచీనసాహిత్యంలోకూడా అశ్లీలశృంగారాన్ని వర్ణించినవారున్నారుకదా ! కచకుచములను, కాముకేళిని, కసితీర వర్ణించారు. తారాశశాంకవిజయము, సారంగధర చరిత్ర,అహల్యాసంక్రందనము,చంద్రరేఖావిలాపములాంటివి. మువ్వ గోపాల పదాల్ని లౌకికదృష్టితో చూస్తే ఎన్నో అశ్లీలవిషయాలు ద్యోతకమౌతాయి. 'మరు పిల్లుచెమ్మగిల్లుట, తొడతొడసోకియుంటిమా' లాంటి ప్రయోగాలున్నాయి.44

'సంభోగించు' అనే తత్సమపదాన్ని వాడితే 'అహా!''ఓహో' అనేపండితులు దాని సమానార్థకమైన తెలుగుపదం వాడితే ఈసడించుకోవడం మామూలే. రాయలసీమలో 'సంభోగించు' అనేఅర్థంలో వాడే 'దెంగు' అనే తెలుగుక్రియారూపం దాని బూతుత్వాన్ని కోల్పోయింది. వివిధసందర్భాల్లో దొంగిలించు, తీసుకొనిపోవు ఇంటినుండి వెళ్లిపోవు, పనిజరుపుకొను అనే అర్థాలలో విద్యాధికులనబడేవారిలో తప్ప ,జానపదులు పుంస్త్రీభేదం లేకుండా నిస్సంకోచంగా సంభాషణలలో విస్తృతంగా ఈ పదాన్ని ప్రయోగిస్తూనే ఉంటారు.

సామెతలు బూతుగా కనిపించినా మంచి సందర్భాలలోనే వాడబడేవి కొన్ని వున్నాయి. ఆవిషయాన్ని ఉటంకిస్తూ చెళ్లపిళ్ల వేంకటకవి 'కొన్నిసామెతలు శుద్ధ పచ్చిబూతులుగా వుండిన్ని మంచిఅర్థాన్ని యిస్తాయి. అయితేమాత్రం యెలాగా వుదాహరించడం'45 అన్నారు.

ఆంధ్రప్రదేశ్‌సాహిత్యఅకాడమీ వారి 'తెలుగు సామెతలు' గ్రంథం మూడవ కూర్పులో కన్వీనర్‌వచనాలలో ఈవిషయంపై మరుపూరువారు ఇలారాశారు. "పది బూతులు-పదినీతులు అన్న కవిచౌడప్ప మాటలో నిండు నిజమున్నది. బూతులలో ఉన్నతీవి, జీవనము, సౌందర్యము మిగతావాటిలోలేవు. బూతులు మనసుకు సూటిగాతాకి అర్థం సులభంగాతోచి చెరిగిపోకుండా నాటుకొనిపోవును .... సంస్కృతపదము మరుగై, సభ్యమై తెనుగుమాట బయలై బూతగుచున్నది. మన ప్రబంధాలగీర్వాణాశ్లీలాలకు మనసు అలవాటుపడినదిగాని అదే తెలుగులో అనిన మనసుఇచ్చగించనివారు చాలమందిఉన్నారు."46 అని ఆవేదన వెలిబుచ్చుటమేగాక "బూతుసాటవలను ప్రత్యేకంగా పంక్తితముద్రణమన్న ముసుగుతో ప్రకటించిన భాషకు,నుడికారముకు ఎంతో సహాయకారిగానుండునని అనుకొంటున్నాను".47 అని తమఅభిప్రాయాన్ని ప్రకటించారు.

నిజానికి ఇలా ఒకసంపుటంవేయడం అవసరమే. ఎందుకంటే ఇలాంటి సామెతలలో నాగరికత సభ్యత పేర్లతో పదాల్ని మారిస్తే సామెతలలోశ్రావ్యత పోయి మామూలు వాక్యాల్లా మారిపోయి జీవచ్ఛవాలవుతాయి. ఒకకాలంలో బూతుగా వుండే ఒక పదం మరోకాలంలో అలాకాకపోవచ్చు. బూతు అనుకొని అలాంటిసామెతలను సేకరించకపోతే సామెతలలో కొంతభాగం వినష్టమైపోయే ప్రమాదముంది. నేటిఅశ్లీలసాహిత్యంతో, సినిమాసాహిత్యంతో చెడనివారు సామెతలలో బూతుమాటలుంటేనే చెడరు. బూతుమాటలు ప్రయోగించి గ్రామీణులు దుష్ప్రవర్తకులైనారా? అసలు సామెతలు కామోద్దీపకాలు కావుగదా? అంతేకాదు. జానపదులనుడికారం, పలుకుబడివి చంపివేయడానికీ, మార్చడానికీ నాగరికులకు అధికారం లేదు. అందువల్ల బూతు సామెతలు అని నాగరికులు భావించినా సరే, వాటిని ఉన్నవున్నట్లే ప్రచురించాలి. అలాంటి బూతుసామెతలసంకలనంవేసేందుకు ఏ సంస్థఅయినా జంకాల్సిన పన్లేదు అని నా దృఢవిశ్వాసం.

కుటుంబసంబంధాలను సామెతలు ఎంత విస్తృతంగా, చమత్కారంగా విజ్ఞానాత్మకంగా, సత్యసమ్మతంగా మనకు నివేదిస్తున్నాయో రెండవ ప్రకరణంలో పరిశీలిద్దాం.

సూచికలు :

1. శ్రీ సంపత్ రాఘవాచారి, తెలుగుసామెతలు (అకాడమీ) పీఠిక పు. 1
2. శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి, తెలుగుసామెతలు, (మూడవకూర్పు) (పు.39)
3. డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి, తెలుగు సామెతలు (వ్యాసం) స్రవంతి, ఫిబ్రవరి 1980
4. సామెతలు-నిర్వచనము (వ్యాసం) స్రవంతి, ఏప్రిల్ 1964 (పు. 27-31)
5. భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించిన సామెతలు (వ్యాసం) స్రవంతి, మార్చి 1968 (పు. 57-60)
6. సామెతలు (వ్యాసం) జానపద సాహిత్య స్వరూపం (పు. 64)
7. సామెతలు (పీఠిక) తెలుగుసామెతలు (ప్ర. ము.) ఆం. ప్ర. సాహిత్య అకాడమీ (పు. ౨)
8. సామెతలు (పీఠిక) తెలుగుసామెతలు (ద్వి. ము) (పు. 3-౨)
9. వ్యవసాయ సామెతలు-ఉపోద్ఘాతం (పు. 1)
10. భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించిన సామెతలు (వ్యాసం) లో ఉదాహృతం
11. సామెతలు (వ్యాసం) జానపదసాహిత్య స్వరూపం (పు. 62)
12. సామెతలు-ఛందస్సామ్యతలు (వ్యాసం) భారతి (పు. 51-54) మార్చి 1966
13. సామెతలు (వ్యాసం) జానపదసాహిత్యస్వరూపం (పు. 64,65)
14. సామెతలు (వ్యాసం) కథలు-గాథలు (సం. 2) (పు. 111)
15. సామెతలు-జానపద సాహిత్య స్వరూపం (పు. 72)
16. I am not angry, but the buffalo's tail is shorter-The New Book of Knowledge, (Vol XV. P. 487.)
17. M W. Carr - ఆంధ్రలోకోక్తి చంద్రికలో 75 కథలు, ఆం.ప్ర. సాహిత్య అకాడమీ వారి "తెలుగుసామెతలు" (ప్రథమ ముద్రణ) లో విశ్వనాథవారివి 19 కథలు; అదే గ్రంథంలో ఫుట్‌నోట్స్‌లో ఇచ్చినవి 22; అదేగ్రంథం ఆధారంగా నేను కథలున్నాయనుకునేవి 20; నా స్వంతఆకరాలు 3; కథలు-పిట్ట కథలు అనే గ్రంథంలోని 218 కథల్లో సామెతలకు ఆధారమైనవి 37; శండిలగారివి 21; శ్రీ యామిజాల పద్మనాభస్వామివి 1; 1930-32 మధ్య 'భారతి' లో ప్రచురించిన 76 పిట్టకథల్నుంచి పేర్పరచిన కథలు 16; వెరసి 214 సామెత కథలు పరిశీలించ బడ్డవి.
18. తెలుగు సామెతలు (వ్యాసం) భారతి, ఫిబ్రవరి 1955.
19. Nelson's Perpetual Loose-Leaf Encyclopedia, (Vol. X, P. 64)

20. Encyclopedia of Britannica. (Vol. XVIII) (PPs. 687-688.)
21. The world Book of Encyclopedia. (Vol XV) (PPs. – 740-1)
22 Chamber's Encyclopedia (Vol XI) (New Revised Ed.)
23 Every Man's Encyclopedia' (Vol. X) (PPs 273-274 )
24. తెలుగు సామెతలు (వ్యాసం) భారతి, జనవరి 1966 (పు. 63.)
25 The New Book of Know'edge, (Vol. XV) (P. 414)
26 African Encyclopedia (P. 414.)
27. Encyclopedia Britannica, (Vol XVIII) (PPs. 687-688)
28. The Oxford Dictionary of English Proverbs-Introduction (PPs. xiv)
29 Ibid, (PPs xviii)
30. Proverbs and Proverbial Expressions (Essay) Folk Lore and Folk Life Ed Richard M. Dorson (PPs. 122)
31. African Encyclopedia. (P 414)
32. The Oxford Dictionary of English Proverbs-Introduction (PPs. vii)
33 Encyclopedia Americans (Vol XXII) (PPs 704-705 )
34. ఆంధ్రసాహిత్యములో దేశికవితోద్యమము - పాల్కురికి సోమనాథునిపాత్ర Ph D సిద్ధాంతవ్యాసం_అప్రచురితం. (పు. 541_552)
35. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి నోట్సు పేటహాకం లైబ్రరీలో ఉంది. పేపర్లు అడ్డంగా చినిగిపోవున్నందువల్ల పుటల్లో కొంతభాగం మాత్రం లభిస్తున్నది.
36. మొల్ల రామాయణం (1-18).
37 సామెతలు (వ్యాసం) కథలు-గాథలు (సం. 2) (పు. 111)
38. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి నోట్సు.
39. తెలుగు సామెతలు (వ్యాసం) భారతి, ఫిబ్రవరి 1955.
40. శ్రీపాదగోపాలకృష్ణమూర్తిగారి నోట్సు.
41. పైదే.
42. తెలుగు వాక్యం, (పు. 12) డా॥ సి. రామారావు.
43 Dialogue Proverbs are popular in Arabic and Greek, Ruthenian, Russian, and Polish. - Encyclopedia Britannica. Vol. XVIII (PPs. 687-8.)
44. పల్లెపదాలలో ప్రజాజీవనము (పు. 412-414) డా॥ వై. రఘుమారెడ్డి.
45. సామెతలు (వ్యాసం). కథలు_గాథలు (సం. 2) చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.
46. కన్వీనర్ వచనములు, తెలుగు సామెతలు (తృ. ము.) (పు. ౪౧)
47. పైదే (పు. ౪౧)

# 2. తెలుగు సామెతలు - కుటుంబజీవన చిత్రణం

2.0 సమాజంలో కుటుంబమే కీలకమైనది. సామాజికశాస్త్రముల ప్రకార మది ప్రప్రథమ ప్రాథమికసమూహము ... రక్తసంబంధము, శారీరకమైనదగ్గర సంబంధము, అన్యోన్యాశ్రయము, నిరంతరసంబంధములు, సమానోద్దేశ్యములు మున్నగునవి కుటుంబజీవనలక్షణములు. వ్యక్తి మొదట కుటుంబమునకే చెంది యుండును.అది యాతనివ్యక్తిత్వమును తీర్చిదిద్దును. (పల్లె పదాలలో ప్రజాజీవనము (పుట. 43) డా॥ యెల్దండ రఘుమారెడ్డి.)

తల్లిదండ్రులు,అవివాహితులైన,ఆడ,మగబిడ్డలు,వివాహితులైన కుమారులు,వారి వారిభార్యాబిడ్డలు కలిసి ఒకఇంటనే నివసించుచు, ఒక వంటనే భుజించుచు, నొక్క టిగా జీవించుటయే అవిభక్తకుటుంబపద్ధతి. (పల్లెపదాలలో ప్రజాజీవనము. పు.72)

కుటుంబసభ్యులమధ్యవుండే సంబంధబాంధవ్యాల్ని తెలుగు సామెతలు ఎలా చిత్రిస్తున్నాయో పరిశీలించడం ఈ ప్రకరణ లక్ష్యం.

నా పరిశీలనలో లభించిన 1531 కుటుంబజీవితసంబంధి సామెతలు ఆధా రంగా ఈ ప్రకరణంలో విషయవిశ్లేషణ జరిగింది. శీర్షికలకు ఎదురుగా సామెతల సంఖ్యను సూచించాను. సంఖ్యాపరంగా చూస్తే ఆలుమగలకు సంబంధించినవి, తల్లిదండ్రులు - సంతానం, కోడలు-అత్తమామలకు సంబంధించిన సామెతలు మొదటి, రెండవ. మూడవస్థానాల్లో వున్నాయి.

2.1 ఉమ్మడికుటుంబం: జనపదాల్లో ఉమ్మడికుటుంబాలు నిన్నమొన్నటి దాకా తామరతంపరగా వుండేవి ఇంటిపెద్దరికం చేసేవారు సొంతవ్యాపారాలు పెట్టుకొని, కొంత వెనుకవేసుకోవడం జరగడంవల్ల అన్నదమ్ముల్లో ఒకరిమీద మరొకరికి నమ్మకం, సడలిపోయి అవిభక్తకుటుంబాలు ఛిన్నాభిన్నమయ్యాయి. కుటుంబ సభ్యుల్లో సొంతవ్యక్తిత్వంమీద మోజు పెరిగి వేరుకాపురాలే మేలని అనుకోవడం కూడ జరుగుతున్నది. ఉమ్మడికుటుంబాల్ని సామెతలు సమర్థిస్తున్నాయి. 'కొంపకు మూడువాకిళ్లు దెచ్చినట్టు' (రా ప. 690) అని విరసనగా అనడం, 'ఎతలకు ఏరు పడితే నెత్తికుంపటి అయిందట' (రా. ప. 201) అనడం ఉదాహరణలు.

కుటుంబసభ్యుల్లో ఎన్నిస్పర్ధలున్నా బయటికిపొక్క నివ్వకూడదని, కొండేలు వినరాదని కలహాలుండరాదని సామెతలు నిషేధిస్తున్నాయి 'సంసారం గుట్టు' వ్యాధి రట్టు', 'కొండంతకాపురం కొండేలతో చెడుతుంది', 'కలహమున్నకొంపలో కట్టుబట్టలుండవు' (హైసా. 7) అనేవి దృష్టాంతాలు.

**2.2 తల్లిదండ్రులు-సంతానం (395) :** తల్లిదండ్రులు కుటుంబానికి మూలాధారాలు. తండ్రిది బయటిపెత్తనం. తల్లిది ఇంటి పెత్తనం. కొడుకులు, కోడళ్లని పెళ్ళిగాని మగ, ఆడబిడ్డల్ని సమంగాచూస్తా. వారిమధ్య మనస్పర్థలు రాకుండా చూడడం తల్లిదండ్రులవిధ్యుక్తధర్మం. అంతేకాదు. వృద్ధులైన తల్లిదండ్రుల్ని సేవించడంకూడా వారి విధే. ఈ శీర్షికలో తల్లిదండ్రులు సంతానం మధ్యవుండే సంబంధాలు చర్చింపబడతాయి.

హిందూమతంలో తల్లి, తండ్రి. గురువు ప్రత్యక్షదైవాలు. కంటికగుపించని దైవానిది నాల్గోస్థానం. తల్లి తండ్రుల సేవ దైవసేవలాంటిదని, వృద్ధాప్యంలో వారిపై దయజూపనిపుత్రుడు పుట్టినా గిట్టినా ఒకటేనని పెద్దలు ఉద్ఘాటించారు. భార్యపోతే ఇంకోభార్యను తెచ్చుకోవచ్చుగాని,తల్లి పోతే మరోతల్లిని తెచ్చుకోలేము అని వివేకానంద ఉపదేశం. దీన్నిబట్టి తల్లీదండ్రీల పూజ్యార్హత ఎంతటిదో తేట తెల్లమవుతుంది. ఆ విషయాన్నే ''తల్లి, తండ్రి, గురువూ, దైవమూ'' (నర) అనేసామెత తెలుపుతుంది. 'తల్లి కడుపు చూచును. పెండ్లాం వీపు చూచును' అనే సామెత సంపాదనకు పరస్థలంపోయి తిరిగివచ్చిన కొడుకు తిండితిప్పలులేక ఎంత చిక్కిపోయాడోనని తల్లి కడుపుచూస్తుందని, మూటతెచ్చాడో లేదోనని భార్య వీపు చూస్తుందని వ్యంగ్యంగా ధ్వనిస్తున్నది. పుణ్యమో, పాపమో 'తల్లిచేసినది తనయులకు' (కార్. 2366) అనుభవానికి వస్తుందని జానపదులవిశ్వాసం. తల్లి స్వరూపస్వభావాలు పిల్లలకువస్తాయన్న సత్యాన్ని 'తల్లినిపోలినబిడ్డ నూలునుపోలిన చీర' (సాసా.27) అనే సామెత వెలిబుచ్చుతున్నది. తల్లిలేని బిడ్డలపోషణ అధ్వాన్నం అనే అంశాన్ని 'ఏనుగంత తండ్రియుండుటకంటె ఏకంత తల్లియుండుట మేలు' (హైసా. I.5) అనేసామెత బలపరుస్తున్నది. తల్లి సాధారణంగా ఇంతలో ఇంతైనా పిల్లలకుపెట్టందే తినలేదు. 'ఏకువంటిమెతుకుల్లు చేసుకొని, ఎనుముపెరుగుపోసుకొని, యమరాలిని గనుక తింటున్నాను, గాని దగ్గరికిరాకండి పిల్లలారా దడుసుకొనేరుఅన్నదట' అనే సామెత పిల్లలకు పెట్టకుండా తినే తిండిపోతు తల్లులను రచ్చకీడుస్తున్నది.

బిడ్డ రోతాపీతా సహించాల్సింది తల్లేగానిదాదికాదని. 'తల్లిరోసినపిల్లను దాదిరోయదా' (కార్. 1027) అనే సామెత తెలుపుతుంది. తనకడుపువండి సంతానం కలగాలని వివాహితయైన ప్రతి స్త్రీ కోరుకుంటుంది. అశ్వత్థప్రదక్షిణం చేస్తుంది. ముసలి మొగుడ్తోనయినా సరే సరిగంగస్నానాలు చేస్తుంది. ఈ విషయాల్ని

'అశ్వత్థప్రదక్షిణంచేసి కడుపుపట్టుకొని చూచినట్టు', 'సాటివారితో సరిగంగస్నానాలు చేస్తుంటే ముసలిమొగుణ్ణి మొనలెత్తుకొనిపోయింది' అనే సామెతలు తెలుపుతాయి. బిడ్డలుకావాలని కోరుకోడంలో బీద, ధనిక భేదం లేదని, 'నిట్రాళ్ల యిల్లయినా నిర్వంశంగాఉండరాదు' అనే సామెత చెబుతుంది. నిర్వంశంఅంటే వెదుళ్లులేకుండా అని, సంతానంలేకుండా అని రెండర్థాలు. బీదలు నివసించే నిట్రాళ్ల యిల్లుకప్పుకు వెదుళ్లుకావాలి. ఆ యిల్లు కలకలలాడేందుకు పిల్లలుకావాలి. కార్యకారణమర్మజ్ఞులు 'అర్జీలకు పనులుకావు, ఆశీర్వచనాలకు బిడ్డలుపుట్టరు' అనిచెప్పినా స్త్రీలు వినరు. 'పుణ్యంకొద్దీ పురుషుడు, దానంకొద్దీబిడ్డ' అని గట్టిగా నమ్ముతారు.

అధికసంతానం దుఃఖహేతువని సామెతలు నెత్తిననోరుపెట్టుకొని మొత్తుకుంటూనేవున్నాయి. ఉన్నఒకబిడ్డకూ ఆపదవస్తే కష్టమని,ముగ్గురుంటేబాగుంటుందని సామెతల అభిప్రాయం. 'పందికనినట్లు కంటే సరిపోయెనా, సాకిసంతరించవద్దా' (నర) అని గద్దిస్తున్నది ఒకసామెత. 'ఒకబిడ్డ బిడ్డాకాదు, ఒకగుడ్డు గుడ్డూకాదు' (నర) 'ముతకో సతకో మూడుబట్టలు,కుంటో గుడ్డో ముగ్గురుపిల్లలు' అని సామెతలంటున్నాయి.

బీదవారింటబిడ్డగాపుడ్తే అగచాట్లపాలవుతారని, అందుకే 'నెలతక్కువైనా రాజింట (కాపింట, కోమటింట) పుట్టమన్నారు' అనే సామెతచెప్తుంది. (రాజుల కాలం పోయింతర్వాత కాపింట, కోమటింట అని ఈసామెతకు పాఠాంతరాలు పుట్టి ఉండొచ్చు) తల్లికి తన 'కడుపునపుట్టినబిడ్డ కొంగునగట్టిన రూక' లాంటి ఆధారం అని సామెత.

పిల్లలను ఎత్తుమరపరాదు. వారు నడకనేర్చుకొనే వీల్లేకుండా పోతుంది. పిల్లలను చంకనవేసుకునుంటే జనపదస్త్రీలకు పనులు పంచేటు. అందుకే వారు బిడ్డకుపాలిచ్చి ఉయ్యాలకే అలవాటుచేస్తారు. ఈ విషయాన్నే 'చంకకు ఎక్కినపిల్ల చచ్చినాదిగదు' అనేసామెత స్పష్టంచేస్తుంది.

కానకకానక పిల్లలుకలిగితే గారాబంఎక్కువనే విషయాన్ని 'గారువాల బిడ్డకు గడ్డపారతో చెవులుగుట్టి నలికెపారలు తీగలేసిందట', 'అదిశెంగా (అతిశయంగా) బిడ్డపుడ్తే గెడ్డపారఎత్తుకున్నెంట చెవులకుట్నూ' (చంద్ర) అనే సామెతలు వ్యంగ్యంగా బోధిస్తాయి.

పిల్లలకు స్నానంచేయించి మిగతా అలంకారాలుచేసి బుగ్గన నల్లచుక్క పెడ్తారు, దృష్టిదోషంతగులకుండేందుకు. ఆ విషయాన్ని 'చల్లకుండకు చంటిబిడ్డకు

చాటుండాలి' అనేసామెత తెలుపుతుంది. పిల్లలు పాలుకక్కడం ఆరోగ్యచిహ్న మేనని 'కక్కినబిడ్డ దక్కుతుంది' అనే సామెత ప్రకటిస్తుంది. అధికంగా తాగిన పాలు అలా బయటికిపోవాల్సిందేనేమో.

కొడుకు పుట్టాలనే ప్రతిజంటా కోరుకోవడం మనసంఘంలో సహజం. పున్నామనరకంనుంచి రక్షించేవాడు, తలకొరివిపెట్టాల్సినవాడు, పిండాలువదలాల్సిన వాడు, వృద్ధాప్యంలో తల్లిదండ్రులకాధారమయేవాడు పుత్రుడే కాబట్టి కొడుకుపుట్టా లని కోరుకోవడంలో అసహజమేమీలేదు. అందువల్లే కొడుకు పిల్లల మధ్య తల్లి దండ్రులు అంతరంచూపడం జరుగుతున్నది. 'మొగపిల్ల బంగారుపిల్ల', 'వెల తక్కువైనా మగపిల్లవాడే మేలు' అనే సామెతలు ఒక ఎత్తైతే 'పుట్టిచచ్చినా పుత్రుడేమేలు' అనే సామెత మరోఎత్తు. ఉంటే ఒకకొడుకునా ప్రమాదవశాత్తు చని పోతే వంశం నిర్వంశం అవుతుందని 'ఒకకన్ను కన్నూకాదు, ఒకకొడుకు కొడుకూకాదు' అనే సామెత తెలుపగా, ఎంతపెద్దవాడైనా తల్లికి కొడుకు కొడుకేనని 'ఊరుకు రాజైనా తనతల్లికి పిల్లవాడే' (సా. సా. 72) అనే సామెత సత్యాన్ని వాక్రుస్తున్నది.

కొడుకు పెరిగి పెద్దవాడవుతాడు. భార్య వస్తుంది. భార్య మాటలు విని తల్లి దండ్రులను పట్టించుకోకపోవచ్చు. వారిమాటలు లెక్కపెట్టకపోవచ్చు. నిజానికి స్వయంగా ఆలోచించి సంసారాన్ని దిద్దుకోగలిగేవయస్సు, బుద్ధి కొడుకుకు వచ్చిం తర్వాత పెత్తనాన్ని కొడుకు, కోడలు చేతుల్లోపెట్టి తల్లిదండ్రులు 'రామా కృష్ణా' అనుకోవడం జరగాలి. జానపదుల్లో అలా జరిగదు కాబట్టే అత్తాకోడళ్ల మధ్య ఘర్ష ణలు ఎక్కువైపోవడం, 'అత్తాలనాడు బిడ్డలుగాని గద్దాలనాడు పిల్లలా', 'పెండ్లాము బెల్లము తల్లి దయ్యము', 'తల్లి తలనొప్పి దయ్యము' (సవ) అని తల్లిని తిట్టాల్సిరావడం తప్పడంలేదు.

ప్రపంచంలో తల్లిద్రోహి మహాపాపి. అలాంటివారు ఎందరైనా ఉంటారు. 'తల్లిచెవులుతెంపినవాడికి ముత్తవతల్లిచెవులు పెండ్రుకమాత్రం' (కార్. 1022) 'అయ్యన్న అమ్మకుమగడు విన్నన్న తల్లికిమగడు' (వినోదిని, మార్చి 1935) 'తల్లికితప్పినవానికి పినతల్లి శప్పసమానం' అనే సామెతలు అలాంటివారిని దుయ్య బడుతున్నాయి.

తల్లి అతిగారాబంతో కొడుకును క్రమశిక్షణలో పెట్టలేదని, తద్వారా కొడుకు చెడిపోతాడని, 'తోటకూరనాడే చెప్పనైతివి కొడుకా', 'ముద్దుచేసిన కొడుకు

ముకుదాడులేనికోడె' అనే సామెతలు అలాంటి తల్లులకు గుణపాఠంచెప్తున్నాయి. దొంగను రాజు శిక్షించేటప్పుడు తల్లి అనుకున్నదట.తోటకూరదొంగతనం చేసినపుడు కొడుకును వద్దని వుంటే బాగుండునుగదా అని. తల్లిదండ్రులమీదవుండే గౌరవాన్నీ ప్రేమనూ కొడుకు మాటల్లో పైకి వ్యక్తపరచకపోవచ్చు. కూతురు వెన్నలాంటి హృదయంతో తల్లిదండ్రుల్ని గౌరవిస్తుంది. ప్రేమిస్తుంది. ఆ విషయాన్ని చెప్పే సామెత 'కొఱివిపెట్టేవాడు కొడుకు, కూడుపెట్టేది కూతురు' అనేది.

సంఘంలో మగవారికున్న గౌరవం. అధికారం, స్త్రీకి లేకపోవడంవల్ల తలి దండ్రులు కూతుర్ని తక్కువగా చూడ్డం జరుగుతున్నది. ఆడపిల్ల పుట్టిందంటే 'అయ్యో ఆడపిల్లా' అని అమ్మలక్కలు దీర్ఘంతీస్తారు. అత్తమామలు పురుటిల్లు కేసి తొంగిచూడనుకూడా చూడరు. పల్లెల్లో ఆడపిల్లపుట్టిందంటే ''తోకలవడ్లు పిల్ల గొంతులోపోసి చంపకూడదా''? అంటుంటారు. ఇంతెందుకు? ఒక అమ్మాయిని పెళ్లి చేసుకొనేప్పుడు ఆ అమ్మాయి తల్లి, పినతల్లులు, అక్కగార్లు ఏ సంతానాన్ని పొందారు అని సంప్రదించే, పెళ్లిచేసుకోవడం కద్దు. ఆడపిల్ల పుట్టగానే తల్లిదండ్రులు తల వంచుకొంటారు. ఒకకూతురు పుట్టిందంటే ఒకమీసం గొరుగుకొన్నంతఅవమానంగా తండ్రి భావిస్తాడు. ఈ విషయాల్ని ప్రతిబింబించే సామెతల్లో మచ్చుకు కొన్ని: 'ఆడబిడ్డలుపుట్టినఇల్లు, ఎనుముఎపడినమడుగు, చేపలుదిన్నకడుపు-ఒకటి' (నర) 'పెత్తనం చేసేవాడు పెంటినంతానంకలవాడు అందరికీ లోకువ' అనేవి. అంతే కాదు; అబద్ధాలుచెప్పేవారికి శిక్ష ఆడపిల్లలు పుట్టడమట. 'అబద్ధాలుచెప్పితే ఆడ పిల్లలు పుడతారు' అనిసామెత. తల్లికిమాత్రం కూతురు చేదోడువాదోడుగా వుంటుంది. ఆ విషయాన్ని 'కుంచమంతకూతురు ఉంటే మంచంమీదే కూడు' అనే సామెత తెలుపుతుంది.

కొడుకులుపెరిగి కోడళ్లు వచ్చింతర్వాత తల్లి తన కూతుర్తో సమంగా కోడల్ని చూడదు. కోడలే అన్నిపనులూ చేయాలి. 'కూతురు కూర్చొని తినాలి. అదేమంటే ? ''ఈదినం ఉంటుంది రేపు అత్తవారింటికి పోతుంది. అదెందుకు చేయాలి ?'' అని సమర్థన. 'కూతురికి మంగళవారం, శుక్రవారం, కోడలికి దివ్వెలు దివ్వెలు' అనిసామెత, అభ్యంజనస్నానం కూతురికి వారానికి రెండుసార్లట. కోడలికేమో దీపావళికి ఒకసారట. 'కూతురి పురుడు కుండల్లో, కోడలిపురుడు కొండల్లో' అనే సామెతకూడా ఆ తల్లి పక్షపాతాన్నే తెలుపుతుంది.

ఒక్కతే కూతురని గారాబంగా తల్లి సాకినసందర్భాల్లో కూతురు తప్పుదోవ పట్టిన సంఘటనల్ని 'ఒకటే కూతురని వరిఅన్నంపెడితే మిద్దెఎక్కి మిండగాళ్ళను పిలిచిందట' అనేసామెత విశదీకరిస్తున్నది.

ఆడపిల్ల ఎంతత్వరగా ఎదిగి తల్లిదండ్రులగుండెలపై కుంపటిఅవుతుందో చెప్పేకథ. తండ్రీ, కూతురూ ఒక వూరికి నడిచి వెళ్తున్నారు. దారిమధ్యలో తండ్రి తిరిగిచూసేప్పటికే ఆమె పెద్దపిల్లఅయిపోయిందట. ఈ విషయాన్నివ్యంగ్యాంతరంగా 'కాడు కాలుతూఉంటే కన్నె ఎదుగుతూఉంటుంది' అనేసామెత చెప్తుంది.

కూతుళ్లకన్నమ్మ సుఖంగాఉంటుందని, కొడుకులకన్నమ్మ కోడళ్ళపోరు భరించలేదని 'కూతుళ్ళకన్నమ్మ కులుకేం చూశావు, కొడుకులకన్నమ్మ గోడు చూడు' అనేసామెత తెలుపుతుంది.

ఆడపిల్లకు పెండ్లిచేయడం ఎంతదుస్సాధ్యమో - 'ఆడపిల్లపెళ్లి, అడుగు దొరకనిబావి అంతంచూచేవే', 'అశ్వమేధయాగం చేయవచ్చుగాని ఆడపిల్లపెళ్లి చేయలేము' అనేసామెతలు పూసగ్రుచ్చినట్లు చెపుతున్నాయి. ఎవరికి పిల్లనివ్వ కూడదో, ఏ వూరికి ఇవ్వకూడదో సామెతలు బోధిస్తున్నాయి. 'రాజులకు పిల్లనిస్తే రాళ్లకిచ్చినట్లే' అనేసామెతలో అంతఃపురంలోని భోగభాగ్యాలకన్నా, అనురూప దాంపత్యమే తమకూతురికి కావాలనికోరుకునే తల్లిదండ్రులతపన ప్రతిఫలిస్తున్నది. "పెనుగొండకు పిల్లనివ్వరాదు రొద్దానికి ఎద్దునివ్వరాదు', 'పలమట్టుకు ఎద్దు నివ్వరాదు, పామట్టుకు పడుచునివ్వరాదు'' అనే సామెతల్లో పెనుగొండబావుల పాతాళగంగలు కాబట్టి ఆడపిల్లలకగచాట్లుఎక్కువని, అనంతపురంజిల్లా ప్రజల అభి ప్రాయం. పలమట్టు విషయం ఇంకా తేల్చుకోవాల్సిఉంది. ఉప్పో సప్పో చేసైనా కూతురిపెళ్లిచేయడంలోనే తల్లిదండ్రులకు సంతృప్తి. కన్నెగామిగిలిపోతే 'లేకలేక ఒకకూతురు పుడితే అది బసివిఅయినదట' అని చింతిస్తారు. (దైవమతంకోసం కన్నెగా వదిలినస్త్రీని బసవి అంటారు)

ఎంతముద్దుగా పెరిగిన అమ్మాయయినా ఎవరోఒకరికి ఆలు కావాల్సిందేనన్న నగ్నసత్యాన్ని 'దొరబిడ్డఅయినా ఒకనిఆలే', 'ఢిల్లీ పాదుషా కూతురైనా పెండ్లి కొడుకుకు లోకువే' అనే సామెతలు విశదీకరిస్తాయి.

పిల్లనిచ్చినవాడు పుచ్చుకొన్నవాడికి లోకువఅని, అల్లుడు అవమానించినా సరే కూతురుకోసం అల్లునింటికి పోకతప్పదు అని అత్తమామలు మనసు సరిపెట్టుకుంటు న్నారు. 'పిల్లనిచ్చినవాడు పిల్లి, పుచ్చుకొన్నవాడు పులి' 'పిల్లనిచ్చినచోటికి పీతిరికొద్దికి పోక తప్పదు' అనేసామెతలు పై అంశాల్ని తెలుపుతాయి.

'తల్లిచస్తే తండ్రి దాయాదిఅంట' (నర) అనేసామెతలో ఎంతో లోక జ్ఞానం ఇమిడివుంది. తండ్రి మళ్లీ పెళ్లి చేసుకుంటాడు. మారుటితల్లి వస్తుంది. వారిద్దరూ తల్లిలేనిపిల్లల్ని సరిగా పట్టించుకోరు.

క్రమశిక్షణతో పిల్లల్ని పెంచేందుకు వారి తప్పుల్ని ఎత్తిజూపి దండించడం తన విధ్యుక్తధర్మంగా తండ్రి భావిస్తాడు. తదనుగుణంగా ప్రవరిస్తాడు. ఆ విషయాన్ని 'తప్పులుపెదికేవాడు తండ్రి, ఒప్పులుపెదికేవాడు ఓర్వలేనివాడు' అనే సామెత స్పష్టంచేస్తుంది. ఈవిషయానికి దృష్టాంతంగా ఒకకథ. సంస్కృతకవి భారవి తండ్రి తనను ప్రతిసారీ ఇతరులముందు కించపరుస్తున్నాడని కోపించి, అటక మీదికెక్కి, తండ్రినెత్తిన రాయివేసేందుకు సిద్ధంగావుండినాడట. మాటలసందర్భంలో భారవి తల్లితో తండ్రి ఇలా అన్నాడట ''మనవాన్ని మాటిమాటికీ తప్పులుపడ్తున్నానని అనుకుంటున్నావేమో ? పిచ్చిదానా ! వాన్ని క్రమశిక్షణలో పెట్టేందుకే ఇలా చేస్తున్నాను. పొగిడి వాన్ని పాడుచేయదల్చుకోలేదు' అని; భారవి విన్నాడు. నాన్నపాదాలపై పడి క్షమాపణవేడి, ప్రాయశ్చిత్తమడిగాడు. 'తండ్రిని చంపబోయిన పాపం అత్తవారింటికి పోయి అంటటికట్టతెగేవఱకు ఉంటే పోవును' అన్నాడు తండ్రి. భారవి అలాగే చేశాడట.

పిల్లలందరిమీద తల్లిదండ్రులకు సమానప్రేమ వున్నా 'తండ్రికి పెద్దవాడు తల్లికి చిన్నవాడిమీద ప్రేమ' (సా) ఎక్కువట. కొడుకుచేసే అకృత్యాలకు తండ్రి కష్టాలు అనుభవింపాల్సివుంటుంది. 'కొడుకు చేసిన అధీకానికి అబ్బడు అడవి బందారాను మొయ్యలేక చచ్చినాడంట' (నర) అని సామెత. 'సూరన్న సుఖవాసి. పేరన్న పెద్దవాడు. అయ్యకెత్తరా కోళ్లగంప' అనే సామెత తండ్రిని ఏడ్పించుకొని తినే పరాన్నభుక్కులైనకొడుకులను ఏకుతుంది.

2.3 ఆలు-మగలు (532) : ఒక ఉమ్మడికుటుంబంలో మూడు అంతకన్న ఎక్కువఆలుమగల జంటయుండే అవకాశముంది. తాత-అవ్వ, తల్లి-తండ్రి, కొడుకులు-కోడళ్లు

ఆలుమగలు సంసారరథానికి రెండుచక్రాల్లాంటివారు. రెండు చక్రాలూ సమంగా వుంటేగాని బండి ముందుకునడవదు. అన్యోన్యప్రేమానురాగాల్తో, క్రమశిక్షణతో, సంసారాన్ని సంరక్షించుకొనేబాధ్యత వారిమీదే వుంది. 'పడుగూ పేక కలిస్తే గుడ్డ, ఆలూమగలూ కలిస్తే ఇల్లు', 'ఆడదిలేనిది అడవి, మగవాడులేనిది మఠము' అనే సామెతలు పై విషయాల్నే చెపుతాయి.

సాముద్రికశాస్త్రలక్షణాల్నిబట్టి ఆడికి వుండగూడని లక్షణాలు : మొగము మాడ్పు, ఈడ్పుకాళ్లు, హీనస్వరం. అలాగని 'హీనస్వరం పెళ్లాం ఇంటికి చేటు', 'ఈడుపుకాళ్లది ఇంటికి చేటు, దొడ్డికాళ్లది దోవకు చేటు, మాడుమొగమునది మొగునికి చేటు' (నర) అనేసామెతలు తెలుపుతాయి.

'పూజకొద్దీ పురుషుడు పుణ్యముకొద్దీ పుత్రుడు' అని హిందూస్త్రీలు భావిస్తారు. చాలామంది మగవారు భార్యలపట్ల తిరస్కారంగావుంటారు. ఉపేక్షిస్తారు. మాటవిననిభార్యను వదిలివేయాలని కూడా అనుకుంటారు. 'మంచముమీద ఉన్నంత సేపు మగడు, కిందికిదిగితే యముడు', 'చనువుచేసిన ఆలు చంకనెక్కు', 'ఇంట్లో భార్యకులోకువయితే అందరికిలోకువ' (సా), 'అంకెకురానిఆలిని ఆర్గురి బిడ్డలతల్లి అయినా విడువవలె' అనే సామెతలు పై అంశాన్ని తెలిపేవి.

ఆలిని మగడు గౌరవించకపోతే బయటివారు ఆమెనే గౌరవించరని, మొగుడు విడిచినముండ అసాధ్యురాలని, ఆలిమాట వింటే బాగుపడరని, ఇల్లాలుకు సిగ్గుండాలని, అమ్మకన్నా ఆలు లేదని, ఆడది ఇల్లువిడిస్తే నాశనమైపోతుందని, [illegible] పెద్దనష్టం ఆలుచావు అని సామెతలు చెప్తున్నాయి. 'మొగుడువేముండా అంటే ముష్టికి వచ్చినవారుగూడా ముండా అంటారు', 'ఇంట్లోవాళ్లు లోకువచేస్తే బయటివాళ్లు పరక నేసిరంట' (నర), 'మొయిలు విడిచిన ఎండ, మొగుడు విడిచిన ముండ, చెట్టువిడిచిన కుండ, పట్టివిడిచిన మంచా తీక్షణము' (కార్. 1831), 'ఆలిమాటవిన్నవాడు అడవిలోపడ్డవాడు ఒకటే', 'లంజకు సిగ్గున్నా, ఇల్లాలికు సిగ్గులేకపోయినా చెడుతారు', 'ఆలు బెల్లమాయె. తల్లి విషమాయె'. 'ఇల్లు విడిచిన ఆడది చెట్టువిడిచిన కోతి', 'ఇల్లుకాలినా యిల్లాలుచచ్చినా గొల్లుమానదు' (కార్.2201) అనేవి ఆ సామెతలు.

ఆలుమగల కలహం క్షణికమేనని, శృంగారం వాళ్లను దగ్గరికి చేరుస్తుంటుందని సామెతలు తెలుపుతున్నాయి. 'ఆలుమగల కలహం అద్దంమీద పెసర ఉన్నంత సేపు', 'ఆలుమగల కలహం అరికకూడు వండినంతసేపు', 'ఆలుమగల కలహం అన్నంతినేదాకనే' అనేవి ఆ సామెతలు.

ఇల్లాల్నిబట్టే ఇంటి శుచీ, శుభ్రతా వుంటుంది. 'ఇల్లుచూచి ఇల్లాలిని చూడమన్నారు' అని సామెత.

ఇల్లాలు విటుల్ని మరిగినా, ఇంటివాడు విటకత్తెల్ని మరిగినా ఆ యిల్లు సర్వనాశనమే. ఆవిషయాన్ని 'వడుచుకున్న ఇల్లు తుడుచుకపోతుంది' అనే సామెత విశదపరుస్తుంది. 'ఇంటి మొగుడు పట్టిగబ్బు, పొరుగింటి మొగుడు పూలవాసన' అనే

స్త్రీలను 'తాటిమాను తావుగాదు, తగుల్కున్నవాడు మొగుడుకాదు' (నర) అనే సామెత హెచ్చరిస్తున్నది. పెళ్లాం బిడ్డల్ని పట్టించుకోని పురుషపుంగవుల్ని పరిహసించే సామెతలు ఇవి: 'చేసుకున్నదానికి మూసుకోను లేదు, ఉంచుకొన్నదానికి ఉభయరాగాల చీర' కావాలంటాడట ఒకడు. 'ఆలుబిడ్డలు అన్నానికి అకోరిస్తుంటే లంజకు బిడ్డలులేరని రామేశ్వరంపోయాడట' మరొకడు. 'ఆలు ఆరటిపండు, తల్లి తలపుండు, చెల్లెలు చేదుగాయ, లంజ లవంగంమొగ్గ' (నర) అంటాడట వేరొకడు. 'ఆలిమీద లంజరికము, ఆకలిగాని భోజనము' (కార్ 153) లాంటిది. అవసరం లేనిది. ఒంటికి మంచిదికాదని చెప్పబడింది. ఇల్లాల్ని ఏడిపించరాదని 'ఆలు ఏడ్చిన యిల్లు, ఎద్దు ఏడ్చినసేద్యం ముందుకురావు' అనే సామెత బుద్ధిచెప్తున్నది.

'పండుగనాడుకూడా పాతమొగుడేనా' అనేసామెతకు అర్థం శ్రీ చవాను సుదర్శనరావు 'సామెతల స్రవంతి' (పుట. 68-69) లో ఇలా వివరించారు. "పండుగనాడు... ప్రజలందరు సముల్లాసముగా కాలంగడుపుతారు... ఆనాడైనను.... అన్యోన్యముగా ఉంటాడని భార్య కొండంత ఆశ పెట్టుకొంటుంది. కాని పండుగ నాడుకూడ సహజధోరణికి స్వస్తి చెప్పని మగనిప్రవర్తన ఆమెఆశను అడియాస చేయగా.నిస్పృహచెంది తన అసంతృప్తిని వెల్లడించుటకైనను పెరచి పండుగనాడూ పాతమొగుడేనా అని మధనపడుసందర్భమున ఈ సామెత ప్రచారమునకువచ్చినది"

2.4 కోడలు - అత్త మామలు (147) : అత్తా కోడళ్ళ సంబంధాన్ని చెప్పే సామెతలు 142 కాగా,కోడలు-మామ సంబంధాన్ని చెప్పేవి 5 మాత్రమే లభించాయి.

ఆడుతూపాడుతూ అల్లారు ముద్దుగా అమ్మగారింట్లో పెరిగిన కన్నెపిల్ల అత్తగారింటికి పోవాల్సివచ్చినప్పుడు 'అత్తవారిల్లంటే కత్తులబోను' గా భావిస్తుంది. కోడలిపాలికి అత్త, ఆడపడుచు, అపార్థంచేసుకుంటే భర్తా కత్తులే. కొడుకుకు కొండేలు చెప్పి తనమాట వినకుండా కోడలు చేస్తుందని అత్త అనుమానపడి సాధించను మొదలుపెడుతుంది, తనూ ఒకంటికోడలే అన్నసంగతి మరచిపోయి తన దర్పాన్ని, ఆధిక్యతను మాటిమాటికీ ప్రదర్శిస్తుంది. అందువల్ల అత్తాకోడళ్లమధ్య సామరస్యం లోపించి కుటుంబం అల్లకల్లోలమౌతుంటుంది. 'కరవమంటే కప్పకు కోపం విడవమంటే పాముకు కోపం' లాగా వాళ్ళిద్దరికీ సర్దిచెప్పలేక 'అత్తాకోడళ్ల మధ్య అబ్బాయికెక్కెక్కులు' అవుతుంది పరిస్థితి,

'అత్తింటికాపురము కత్తిమీది సాము'గా తలచే కొత్తకోడలు 'అందరి కాళ్లను మొక్కినా అత్తగారింటికి పోకతప్పదు' అని గుండె రాయిచేసుకుంటుంది.

అత్తవారింటికి వెళ్ళేతర్వాత 'అత్తమెత్తన కత్తి మెత్తన ఉండదు' అని నిర్ధారణ చేసుకుంటుంది. 'కొడుకు బాగుండాల, కోడలు ముండ మొయ్యాల' అనే అత్త ధోరణికి అదిరిపోతుంది. కోడల్ని ప్రతిక్షణం శాసించే అత్త తన తప్పును ఒప్పుగా, కోడలు ఒప్పును తప్పుగా చిత్రిస్తుంది. 'అత్త కొట్టినకుండ అడిగోడికుండ, కోడలు కొట్టిన కుండ కొత్తకుండ', 'కద్దు అనడానికూ, లేదు అనడానికు దానికే అధికారమా' (కార్, 2263) అనే సామెతలు పై విషయాన్ని విస్పష్టంచేస్తాయి. కోడలు కడుపు నిండా తిన్నా అత్త ఓర్చలేదు. ఆ విషయాన్నే 'ఆకలెత్తుతున్నది అత్తగారూ! అంటే రోకలి మింగవే కోడలా అన్నదట', 'అంబలేరు పార్తా ఉండే అత్తా అంటే కొల్త పకతో అవకడే కోడలా అన్నదట' (చంద్ర) అనే సామెతలు విశదీకరిస్తున్నాయి. 'అత్తవారింటి సుఖం మోచేతిదెబ్బ వంటిది' అనే సామెతకు వెనుక ఒక కథుంది, ఒక తండ్రి కూతుర్ని పండక్కి తీసుకెళ్తూ 'అమ్మా! నీకాపురం ఎలా వుంది? అన్నాడట, 'మోచేయితగిలినంత సుఖంగావుంది నాన్నా' అందట కూతురు మర్మంగా. తండ్రికి అప్పటికి అర్థంకాలేదు, తర్వాత ఎప్పుడో మోచేయి గోడకు తగిలి భరించలేనినొప్పి అయినపుడు అర్థంచేసుకొన్నాడట. అమ్మాయి అత్తవారింట్లో అనుభవించే సుఖమేమిటో.

'అత్తకాలం కొన్నాళ్లు కోడలికాలం కొన్నాళ్లు' కాబట్టి సాధింపులు పడ్డ కోడలు రాటుదేలి 'మొగుణ్ణికొట్టి మొగసాల కెక్కేందుకుగాని, అత్తను కొట్టి అటకెక్కేందుకు' కాని జంకదు. అప్పుడు అత్తగారికి 'కొఱ్ఱగింజంత కోడలిని చూస్తే కొండంతజ్వరం వచ్చిందట' అనేవిధంగా ఎదురుతిరుగుతుంది పరిస్థితి. మనుమరాలుగా అలరించిన అమ్మాయైనా కోడలి హోదాలో వస్తే షరా మామూలేనని 'కూతురు బిడ్డవని తెచ్చుకుంటే నాకే కొరివైనావా, నా మనుమరాలా' అని నెత్తీ నోరూ మొత్తుకోక తప్పదు అత్తగారికి. వారిద్దరిమధ్య ఆవేశకావేశాల్లో అత్త 'కోడిని తిట్టిన తిట్టు కోడలికి ఎఱుక' అవుతుంది. అత్తపేరు పెట్టి కూతురిని కుంపట్లో వేసేందుకు' గాని, 'అత్తకు నాకు ఆరంపేరం అత్త నెత్తుకపో ముత్యాలమ్మా, అత్త నెత్తుకపోతే ఆరుగాళ్ళ జీవాన్ని అర్పిస్తాను' అని గ్రామదేవతకు మొక్కుకొనేందుకుగాని జంకదు కోడలు.

'కోడలు కంటానంటే వద్దనే అత్త ఉన్నదా?' అని ప్రశ్నవేసుకుంటే అన్నిటికీ అడ్డుపెట్టే అత్త కూడా అలా అనదని, పైగా కొడుకును కనకపోతే వేరే కోడల్ని తెచ్చుకొనేందుకు సిద్ధమౌతుందని మనం జవాబు చెప్పుకోవచ్చు.

మనసులో ద్వేషంతో మరగిపోయిన కోడలు అత్త చస్తే సంతోషిస్తుందేగాని బాధపడదు. లోకంకోసం ఏడ్చినా అవి నీలి ఏడుపులేనని 'అత్తచచ్చిన ఆరునెల్లకు విట్టాడిగుంజ పట్టుకొని నిగిడి నిగిడి ఏడ్చెనంట' (నర) అనే సామెత చెప్తుంది.

'అత్తనుమెచ్చిన కోడలుంటుందా ?' (సాసా. 15) అని ప్రశ్నాసామెత. అందుకే 'అత్తలేని కోడలుత్తమురాలు కోడలులేనత్త గుణవంతురాలు' అని ప్రజలంటుంటారు.

కోడలిపై అత్త అదుపాజ్ఞలు అవసరమా ? లేదా ? అంటే అవసరమేనని సామెతల సమాధానం. కోడలు పరువుగా, నీతిగా ప్రవర్తిస్తున్నదీ, లేనిదీ, సులభంగా తెలుసుకొనేది అత్తేగాని భర్త కాదు. కాబట్టి మితమైన అత్త అదుపు కోడలికి మంచిది. కుటుంబానికీ మంచిది. 'అత్త చేపట్టిన కోడలు ఔసులవాడు చేపట్టిన బంగారం' లాగా మెరుగులు దిద్దుకొంటుందని, 'అత్త ఏలిన కోడలు, చిత్త పట్టిన వరి' లా సంసారంలో సుఖసంతోషాల్ని పండిస్తుందని సామెతలుద్ఘాటిస్తున్నాయి.

అత్తా అల్లుళ్ళ మధ్య సరసంలాగే మామా కోడళ్ల మధ్య సరసంసాగడం అరుదైనా సత్యమే. ఇంటిపెద్దరికం మామదైనప్పుడు ఎక్కువమంది కొడుకులుంటే, ఆస్తి కొంత ఎక్కువగా రాయించుకోవాలి అనే కక్కుర్తితోనో, మగడు అనాదగా వుంటేనో, కోడలు మామప్రక్కలో చేరడం జరుగుతుంటుంది. ఆ విషయాన్ని 'మతులెన్నిచెప్పినా మామపక్కనే పండుకొంటానన్నదట', 'మొగుడు విడిచినా మామ విడువడు, మామ విడిచినా దేవతార్చన బ్రాహ్మడు విడువడు' అనే సామెతలు తెలుపుతాయి.

ఏదో ఒకఇంటికి కోడలుకావడం ఎలాగూ తప్పదు గాబట్టి ఇంటి పెద్ద కోడలుగా కావాలని కోరుకుంటారు స్త్రీలు. ఇంటిపెద్దగా తోడికోడళ్లపై పెత్తనం చలాయించవచ్చు. ఉమ్మడికుటుంబాల్లో పెద్దకొడుకు తన పెత్తనంలో అంతో ఇంతో వెనుకేసుకోడం - వేరుకాపురాలు పెట్టిం తర్వాత ఆడబిడ్డల్లో సుఖంగా వుండడం జరుగుతుంటుంది. అందుకే 'కలిగినవారింట కడగొట్టుకోడలయ్యేకంటే, పేదవారింట పెద్ద కోడలయ్యేది మేలు' అనే సామెత ప్రచారంలో వుంది.

2.5 అల్లుడు - అత్త మామలు (861) : 'జామాతా దశమగ్రహః' అని సంస్కృతలోకోక్తి. (పిల్లను) 'ఇచ్చినవాడు కుక్క, చేసుకున్నవాడు చుక్క' 'పిల్లనిచ్చినవాడు పిల్లి, పుచ్చుకొన్నవాడు పులి' అనే సామెతలు అత్తమామలపై

అల్లువిధాష్టికాన్ని తెలుపుతాయి. వింతల్లో వింత. 'అల్లుడు అంటే వంకర కాడే (కాటి చెట్టు) లేచి నిలుచుంటుందట'. 'పూచికపుల్లను అల్లుడు అంటే గూటమై బిగిసి కూర్చొందట' (శ్రీపాద). అందువల్లనే 'అల్లుని మంచితనము, పొల్లునదంచిన బియ్యము లేవు', 'అల్లుడు చుట్టముగాడు ఆముదము చెట్టునీడ నీడగాదు' అను కొంటారు అత్తమామలు.

అల్లునికి అడిగినవన్నీ సమకూర్చడమేగాక అతని అప్పుకుకూడా సమకూర్చాలి. లేకుంటే రుసరుసలు. 'అల్లుడి కత్తికి రెండువైపులా పదునైతే అతని అప్పుకు ఆరువైపులా పదును' అని సామెత.

కొత్త అల్లునికి మనుగుడుపులు తినిపిస్తారు అత్తగారు. 'అల్లైడంతినడం' మనుగుడుపులకు మరోపేరు. తమకు తాహతున్నా లేకపోయినా అల్లుడికి మాత్రం పిండివంటలు, మాంసం సమకూరుస్తారు. ఆ ఇంటి అబ్బాయి, మామగారు నోళ్లు కట్టుకొని అల్లునికి విందులు గుడిపించడం అరుదుకాదు. ఈ సత్యాన్ని 'మొగుడికి మోదుగాకు, అల్లుడికి అరటాకు', 'అల్లుడికి వండిన అన్నం కొడుకును పెట్టి కొట్టుకొన్నదట' అనే సామెతలు తెలుపుతాయి. అత్తవారింట్లో తుష్టిగా తిని పుష్టిగా తయారౌతాడు అల్లుడు. 'అల్లెంగుండు' ను పైకెత్తమంటుంటారు ఆపల్లె యువకులు. ఆ ఊరి అల్లుళ్లు అందుకు సై అంటుంటారు. 'అల్లుడు పుష్టిగా ఉండేది అత్తగారింటనే'. 'అత్తవారింట అల్లుణ్ణి చూడాలి ఆముదాలచేలో అబోతును చూడాలి'. ఆముదాలచేలో గరిక బాగా పెరిగివుంటుంది. అబోతు ఎంత తిన్నా అడ్డేలేదు. మనుగుడుపుల్లో అల్లున్తో పాటు స్నేహితులో, మహాకవో వుంటారు. అల్లునికి పెట్టేందుకు బాధలేదు గాని తమకేమీ కాని తోటి పెండ్లికొడుకును కూచోబెట్టి మేపాలంటే మామగారికి బాధగదా ! 'అల్లుడిని చూపి యీయన నాకూతురు మొగుడు. తోడి పెండ్లి కొడుకును చూపి యీయన నామొగుడు, ఆరునెలల నుంచి ఉన్నాడు అన్నాడట' ఒక మామగారు వుక్రోషంతో.

చాలాచోట్ల అత్తా అల్లుళ్ల మధ్య శృంగారం నడుస్తుంటుంది. 'అత్తకు అల్లుడాశ, బాపనికి పప్పాశ', 'అల్లుడికి అత్తాశ, గొడ్డుకు దూడాశ', 'అత్తనంచుకొన్నవాడు ఆయుష్మంతుడు' అనే సామెతలు పై విషయాన్ని బలపరుస్తాయి.

'ఇల్లరికపుటల్లుడు ఇంటిల్లిపాదికి మొగుడు' అని అత్తా మామల పిర్యాదు. మానుషమున్నవాడు ఇల్లటంపోడని 'ఇల్లరికముకన్న మాలరికం మేలు' అని ఇల్లటపుటల్లుని ఆక్రోశం. ఇల్లటపల్లుని 'కట్టేలేదు, కంపాలేదు, కాచీపోయాపిల్లలేవు, పదవోయి అల్లుడా నూతిగట్టుకు' అని అత్త చవగ్గా చూస్తుందట.

**2.6 కోడలు - ఆడపడుచు (32) :** ఇంటి కోడలికి అత్తా ఆడపడుచూ బద్ధ శత్రువులు. పెళ్లికాని ఆడబడుచు, లేదా తలమాసి వచ్చిన ఆడపడుచు అమ్మకు వంత పాడుతూ, అన్నతో ఫిర్యాదులు చేస్తూ, వదినెమీద కారాలు మిరియాలు నూరడానికి వెనుదీయదు. చీరలు, నగలు తనకు తెచ్చివ్వగలిగినా, అన్నకు అడ్డుపడ్తుంటుందని ఆడపడుచు కోపం.

ఆడబిడ్డ అహంకారాన్ని, ఆయింటి కోడలిపై ఆమె చూపే అధికారాన్ని, 'పిండిబొమ్మను చేసి పీటమీద కూర్చుండబెడితే ఆడబిడ్డతనాన అదిరదిరి పడ్డదట' ఆడబిడ్డ అర్ధమొగుడు', 'అత్తపోరుకంటె ఆడబిడ్డ పోరు ఎక్కువ' (సా) అనే సామెతలు చక్కగా తెలుపుతాయి. కోడలు అత్తను ద్వేషించినట్లే ఆడబిడ్డనుకూడా ఒక దయ్యంగా భావించి ద్వేషిస్తుంది. 'ఆడబిడ్డమ్మా! అంత్రపిశాచమ్మా! వంట ఇంటిలోనికి తీసుకెళ్ళి మండే కొఱకంచుపెట్టు' అనే సామెత కోడలి కసిని వెళ్ల గక్కుతున్నది. 'ఎడపిల్ల అయినా ఏరాలితో సమానం' కోడలుకు ఆడపడుచు.

ఆడపడుచుకు అమ్మగారిల్లు స్వర్గం. తనకెంత వున్నా పుట్టింటినుంచి చీరెలు సారెలు కావాలని కోరుకుంటుంది. అమ్మగారు పెట్టిన చీరెసారెలను, నగలను ఇరుగు పొరుగులకు చూపి మురిసిపోతుంది. ఆడపడుచు 'పుంటికూర తిన్నా పుట్టిన యిల్లు, పాశము తిన్నా పరాయి యిల్లు' (హైసా III-12)గా భావిస్తుంది. ఆడపడుచు పుట్టింటినుంచి ప్రతిదీ ఆశిస్తుందని 'ఆడబిడ్డ ఆశ మూలవాసం గుంజాకు పోయే వరకు తీరదు' అనే సామెత చెపుతుంది. 'ఆడబిడ్డ ఉసూరుమంటే ఆరుతరాలు అరిష్టం' అని ప్రజల నమ్మకం.

తల చెడిన ఆడబిడ్డ పుట్టిల్లు చేరక తప్పదు. ఇంట్లో అల్లకల్లోలాలు చెలరేగక తప్పదు అనే విషయాల్ని 'ఆడబిడ్డ చెడితే పుట్టినిల్లు చేరాల. బంగారు చెడితే కంస లిల్లు చేరాల' (నర) 'ఆడపడుచు చేరిన యిల్లు అడవిలో కట్టిన యిల్లు ఒకటే' (వ.ప.)అనే సామెతలు చెప్తాయి.

తనకన్నా పెద్దదైన ఆడపడుచును కోడలు 'వదినా' అని పిలుస్తుంది. తల్లి చనిపోతే ఆడపడుచుకు పుట్టింట్లో స్వతంత్రం తగ్గిపోతుంది. అమ్మ వున్నప్పుడు నెలలతరబడి వుండగలిగేది, అమ్మలేక పోతే కొన్ని దినాలు కూడా వుండలేదు. పుట్టింట్లోనే పరాయిగా భావించుకొంటుంది. ఈ నిజాల్ని చక్కగా చెప్పేవే ఈ సామెతలు. 'తల్లి లేనిపుట్టిల్లు ఉల్లి లేనికూర', 'అండలేని ఊళ్లో ఉండదోషం, ఆశ లేని పుట్టింట అడుగ దోషం' అనేవి. చీరసారెలు కాదుగదా ఒకోసారి భోజనంపెట్టి

పంపేందుకుకూడా మరదలుకు మనస్కరించదు. 'అయ్యో! వదిన! అంతకు ముందు వచ్చిన అన్న బంతిన తిందువు. ఇంతకుముందు వచ్చిన ఏరాలి బంతిన తిందువు, ఇప్పుడేలాగు ? ఎలుక పొయ్యి ఎత్తుక పోయిందే' అని కోడలు మాటల తోనే మామిడిపండ్లు రాలుస్తుంది. వంగతోటపెద్ద వదినా అంటే వంకాయలు కోపిస్తు బడుతుందని 'ఎక్కడైనా వదినా అనుగాని వంగతోటలో వదిన అనకు' (తె.సా.సీ. పు. 12) అనిందట ఒకింటికోడలు ఆడపడుచుతో. అమ్మ వున్నప్పుడు ఆ ఇంటి కోడలిపై అధికారం చెలాయించిన ఆడపడుచు అమ్మగారిల్లంటే అంటీముట్టకుండా, ఏమీ ఆశించకుండా తటస్థురాలవుతుంది.

2.7 బావ - మరదలు - బావమరది (65) : జనపదజీవితంలో నాగరకత తలదూర్చని పల్లెల్లో ఇంకా బావా మరదళ్ల మధ్య సరసాలు-పరిహాసాలు కొనసాగు తూనే వున్నాయి. కొత్తల్లుని మీద మరదళ్లు, ఆ వరుస వుండే అమ్మాయిలు స్నానం చేసేప్పుడు కుడితినీళ్లు, పసుపు నీళ్లు చల్లడం, పీటకింద కుండపెంచికలు పెట్టి అల్లుడు పీటమీద కూర్చుంటే అవి పెళ పెళమన్నప్పుడు పెళ్లున నవ్వడం, ఈజీ చెయిరు పట్టకు ఒక కర్ర తీసివేసి, అల్లుడు కూర్చొని కూలబడితే కేరింతలు కొట్టడం, చెప్పుల్ని అటకెక్కించి వారు చెప్పినట్లు వింటేనే తిరిగివ్వడం - ఇలా ఒకటేమిటి అల్లున్ని నానారభస చేస్తుంటారు. అల్లుడు తక్కువ తిన్నాడా ! వారిని జడపట్టుకొని లాగడమో, కితకితలు పెట్టడమో, పసుపు పూయడమో చేస్తుంటాడు. ఈ సరదాలు-సరాగాలు జనపదజీవితానికూడా గతస్మృతులుగా మిగిలిపోతూండడం శోచనీయం.

మరదలు బావతో ఆడే పరిహాసాలకు 'బావా ! నీ భార్య ముండ మోసిం దంటే మొత్తో అని ఏడ్చాడంట', 'బావా బావా నీ పెండ్లాము అత్త పాలు త్రాగినావా అంటే అబ్బే నేనెందుకు త్రాగాను అన్నాడట' (సా) అనే సామెతలు సాక్షులు.

బావతో ఎంత పరిహాసాలాడినా మరదలుకు సిగ్గే. 'బట్ట విప్పి నీళ్లు పోసు కుంటూ బావగారు వచ్చారని నిటారుగా నిల్చుందట' అనే సామెత ఆమె సిగ్గును వ్యంగ్యంగా చెప్తున్నది. జనపదాల్లో 'బాత్ రూమ్స్' దాదాపు ఉండవు. ఇంటివెనుక స్నానంచేసే ప్రదేశముంటుంది. మూడువైపుల గోడలో, తడికెలో వుండొచ్చు. ఇంట్లోవైపు అడ్డేమీవుండదు. అలాంటప్పుడే మరదలు స్నానంచేస్తుంటే బావగారు పొరపాటునో, మనసులో ఏదైనా పెట్టుకునో అక్కడికి పోగలిగేది.

బావామరదళ్ల పరిహాసాలు ముదిరి ప్రణయానికి దారితీస్తుంటాయి. ఆ విషయాల్ని 'బావా అని చూడపోతే రావా అని కొంగుపట్టుకొన్నాడట' 'బావకు మరదలు పిల్లపై ఆశ', 'బట్ట చాటుపుండు బావగారి వైద్యం', 'బక్క ప్రాణం కస్త బావ చేతిలో పోయిందట' అనే సామెతలు అభివ్యక్తీకరిస్తాయి.

మరదలికి సరైన సంబంధాలు తేలేకనో, అక్కకు సంతానం లేకనో, బావామరదళ్ల ప్రణయాన్ని పురస్కరించుకొనో, వారిద్దరికి పెండ్లిచేయడం జరుగుతుంటుంది. 'ఎక్కడా లేక పోతే అక్క మొగుడే దిక్కు' అని సామెత.

బావా మరదుల సంబంధాలు పటిష్టంగా, ఆత్మీయంగా వుంటాయి. యానాదులు బావమరదిని నమ్మినట్లు అన్నదమ్ముల్ని నమ్మరు. అపాయకరమైన కొండ పేట్లనుంచి తేనె తీసేటపుడు బావమరదిని పేటుపైన కూర్చోబెట్టి, నడుముకు తాడు కట్టుకొని తేనెకోసం దిగబోతూ, బావమరది చేతికి నడుముతాడు ఇచ్చిపోతారు. అన్నదమ్ములైతే ఆస్తికోసమో, మరెందుకో తాడుతెంపి పాతాళం పంపిస్తారేమోనని వారి భయం. బావమరది తన చెల్లెలికోసం ప్రాణాలిచ్చేందుకైనా సిద్ధపడతాడు కాబట్టే ఆ నమ్మకం. ఈ సత్యాల్ని 'బావమరది బ్రతుకగోరును, దాయాది చావగోరును', 'బండెడు ధనమిచ్చినా బావమరది లేని చుట్టరికం పనికిరాదు' అనే సామెతలు నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాయి,

## 2.8 పెద్దమ్మ – పెద్దనాన్న, చిన్నమ్మ – చిన్నాన్న, సవతితల్లి (21) :

నాన్నకు స్వయాన అన్నతమ్ములైన పెదనాన్న చిన్నాన్నలమీద చాలామంది పిల్లలకు సద్భావముండదు. 'మా బత్తె చస్తే చచ్చింది గాని మా పెదనాయన బత్తె పాలివ్వక పోతే చాలు' అని సామెత.

అమ్మ చెల్లెలు పిన్నమ్మ అమ్మవలె ప్రేమగా చూస్తుంది. పినతండ్రి భార్యను పిన్నమ్మ అని పిలిచినా ఆమె అమ్మ చెల్లెల్లాగా ప్రేమగా చూడదు. ఆ అంశాల్ని 'పినతండ్రి పెండ్లాము పినతల్లి కాదు మేనమామ పెండ్లాము మేనత్తకాదు', 'పిన తల్లి పెట్టు పిచ్చిదాని పెట్టు', 'పెట్టదు పిన్నాం పోయదు పిన్నాం పిన్నానికీ నాకు ప్రాణం ప్రాణం' అనే సామెతలు చెప్తున్నాయి.

తల్లికి కూడుపెట్టడం కొడుకు విధ్యుక్తధర్మం. అలాచేయనివాడు పిన్నమ్మకు మర్యాదలు జరుపుతాడా ? 'తల్లికికూడు పెట్టలేనివాడు పినతల్లికి కడియాలు చేయించినట్లు' (చంద్ర) అనే సామెత జవాబిస్తుంది.

తల్లి చనిపోయినా, ఒకోసారి బ్రతికున్నా తండ్రి మరో పెండ్లి చేసుకోవడం జరుగుతూంటుంది. బ్రతికుంటే తల్లికి సవతిపోరు, చనిపోయుంటే పిల్లలకు సవతి తల్లి పోరు. సవతితల్లి తన భర్త మొదటి భార్య పిల్లల్ని చచ్చినా పట్టించుకోదని, పై పెచ్చు అష్టకష్టాలు పెడ్తుందని ఎన్నో జానపద కథలు వేనోళ్ల చాటుతాయి. ఆ విషయాన్ని తెలిపే సామెతల్లో మచ్చుకు కొన్ని. 'బాబుకు పెళ్లి అయిందని సంతోషిస్తే సవతితల్లి రావడానికి విచారించవలసి వస్తుంది'. (క. గా. పు. 208) సవతితల్లికి బిడ్డలు పోతేనేమి ? సొమ్ములు కాపువానికి(గొడ్లు కాచేవానికి) బక్కలు (బక్కగొడ్లు) పోతేనేమి ?', 'తన చేయి కాలుతుందని సవతిబిడ్డ చేతితో కలియ బెట్టినదట', 'మారులోకానికి పోయినా మారుతల్లి వద్దు' అనేవి.

పెదనాన్న భార్య పెత్తల్లి సరిగా పెట్టి పోషించదని' 'పెట్టు పెత్తల్లి'(ప.ప.) అనే సామెత తెలుపుతుంది.

2.9 మేనత్త - మేనమామ. మేనల్లుడు - మేనకోడలు (130) :

అమ్మ సోదరుడు మేనమామ. అమ్మ ఎంత ఆప్యాయంగా పిల్లల్ని చూచు కుంటుందో అంతకు ఇనుమిక్కిలి మేనమామ చూచుకొంటాడు. తల్లి లేదా తండ్రి చచ్చిన పిల్లలను మేనమామే సరిగా చూచుకోగలడు. ఆ విషయాన్ని 'తల్లి వెనుక మేనమామ అన్నారు', 'తల్లి చచ్చినా మేనమాముంటే చాలు' అనే సామెతలు తెలుపుతాయి. ఒక విషయం బాగా తెలిసిన వారిదగ్గర దాచబూనడం, అరగొరగా చెప్పబోవడం హాస్యాస్పదం అని 'తల్లి పుట్టిల్లు మేనమామ దగ్గర దాచినట్లు', 'అమ్మపుట్టిల్లు మేనమామవద్ద పొగడినట్లు' అనే సామెతలు చెపుతాయి. అమ్మ మేనమామల పుట్టిల్లు ఒకటే కాబట్టి అమ్మ పుట్టిల్లును గురించి మేనమామకు చెప్పడం హాస్యాస్పదం అని పై సామెతల భావం.

దేవుడు వరమిస్తానంటే ఒక అతి తెలివి మేనల్లుడు 'మా మేనమామ చెవుల్లో వెంట్రుకలు మొలిపించు స్వామీ' (నర)అన్నాడట. 'మేనమామ చెవుల్లో వెంట్రుక లుంటే మేనల్లుడికి అదృష్టం' (నర) అనే పల్లీయుల నమ్మకాన్ని పై సామెతలు తెలుపుతాయి.

మేనకోడలు, మేనమామల మధ్య వావి సరిపోతుంది. వారి ప్రణయాన్ని చెప్పేది 'ముద్దిలో పుండు మేనమామ వైద్యం' అనే సామెత.

నాన్న సోదరి మేనత్త. మేనత్త కూతురు భార్య వరుస అవుతుంది. ఎట్లాగైనా మేనత్త - మేనల్లుళ్ల సంబంధం ఉండడంకద్దు. ఆ విషయాన్ని 'పగ పెట్టి

మేనత్త అన్నట్లు', పిల్లవాడని పక్కలో వేసుకుంటే పెద్దవాడు కొట్టినట్లు కొట్టి నాడు', 'అత్తవాని అయితే ఆయుష్మంతుడు' అనే సామెతలు తెలుపుతాయి. చివరి సామెతలో చెప్పబడ్డ అత్త మేనత్త కావచ్చు. కూతురినిచ్చిన అత్తకూడా కావచ్చు.

తల్లి, తండ్రుల్తో రక్తసంబంధమున్న మేనమామ, మేనత్తల పోలిక పిల్లలకు రావడం సహజం. ఆ విషయాన్ని 'మీసాలెందుకు రాలేదంటే మేనత్త (చాలు) పోలిక' అని, గడ్డం వచ్చిందేమిరా అంటే అది మేనమామ పోలిక అన్నాడట' అనే పరిహాస సామెత తెలుపుతుంది.

మేనత్త కొడుకులు అమ్మాయికి భర్త వరుస అవుతారు. మేనరికాలు పాటించే రోజుల్లో ఒకోసారి మేన బావను అమ్మాయిలు చులకనగా చూసేవారు. 'ఉండ్రాళ్ల ఒక పిండి వంటేనా మేనత్త కొడుకూ ఒక మొగుడేనా' అని సామెత.

మేనమామకూతుర్ని అబ్బాయి చేసుకోవడంకూడా మేనరికమే. అబ్బాయికి మేనకోడల్ని చేసుకోవడం ఇష్టంలేని సందర్భాల్లో పుట్టిన సామెత 'వలచి వస్తే మేనమామ కూతురు వావి కాదన్నట్లు' అనేది.

2.10 అన్నదమ్ములు - అక్కచెల్లెండ్లు (34) : అన్నదమ్ముల మిత్రత్వం బాల్యంతోనే ఆగిపోతుందని, పెద్ద అయిన తర్వాతకూడా అక్కచెల్లెండ్ల ఆత్మీయత సాగుతుంటుందని లోక సహజమైన విషయాలను సామెతలు చెపుతున్నాయి.

'అన్నదమ్ముల పొత్తు చిన్నప్పుడు, అప్ప చెల్లెళ్ల పొత్తు పెద్దప్పుడు' అనే సామెత పై అంశాన్ని తెలుపుతుంది, 'ఈ పొద్దు చిన్నక్కకైనగతే రేపు పెద్దక్కకు' (చంద్ర) అనే సామెతను ఈ దినం అన్యాయం ఎవరికో జరిగిందని వూరుకుంటే రేపు మనకే అది జరగొచ్చని జాగ్రత్త చెప్పేందుకు వాడతారు. స్త్రీలు ఒకోసారి తమ భోగభాగ్యాలకన్నా తమ అక్క చెల్లెండ్ర భోగభాగ్యాల్ని తల్చుకుని మురిసిపోవడం కద్దు. ఆ విషయాన్ని 'అక్క భాగ్యం చూసి చెల్లెలు చెయ్యి విరగబడ్డది' (గృ. ల. 393) 'చెల్లెలి మగని చూచుకొని చేయి విఱుగబడ్డదట' అనే సామెతలు వ్యంగ్యంగా చెపుతాయి.

అక్క చెల్లెళ్లకు అన్నం పెట్టడం సోదరుల విధి. అలాచేయని వారిని నిందించిన సామెత 'అక్క చెల్లెళ్లకు అన్నంపెట్టి లెక్క వ్రాసినట్లు' అనేది. బాల్యంలో అన్నదమ్ములుగా ఆప్యాయతను పంచుకొన్నవారు పెరిగే కొద్దీ దాయాదులుగా శత్రుత్వాలు పెంచుకుంటారు. ఈ నిజాన్ని 'పుడుతూ సోదరులు, పెరుగుతూ దాయాదులు' అనే సామెత తెలుపుతుంది. ధర్మంచెప్పేందుకు బాంధవ్యం అడ్డురా

కూడదని చెప్పే సామెత. 'తమ్ముడు తన వాడైనా ధర్మం సరిగా చెప్పవలె' అనేది. అన్నదమ్ముల్లో చివరివాడైతే అందరూ జులుం చెలాయిస్తారని, తను పెద్దయ్యేటప్పటికే అన్నలు వదినెలు ఆస్తి కరగతింటారని వివరివాడి బెంగ. ఆ విషయాన్ని 'అన్నదమ్ములలో కడపటివాడికంటె అడవిలో మ్రానై పుట్టడం మంచిది' అనే సామెత చెపుతుంది.

సోదరులకు వెధవ తోబుట్టువు ఇంట్లో వుంటే చేదోడు వాదోడుగా ఉంటుంది. అందుకే 'వెయ్యి రూపాయలు కావలెనా, వెధవ తోడ బుట్టువు కావలెనా' అని అడిగితే వెధవ తోబుట్టువే కావాలన్నాడట ఒక సోదరుడు.

2.11 వదినె – మరదలు – మరదులు (1): అన్న భార్య వదినె విషయంలో ఒకే సామెత ఉంది. 'వదినె వదినె వంకాయ వదినె ఒల్లు కెంకాయ' అనేది మరదళ్లు లేదా మరదులు వదినెను పరిహాసంచేస్తూ పాడినపాటలో ఒక భాగం.

2.12 తోడికోడలు (ఏరాలు) – సవతి (16): మగని సోదరుని భార్య తోడికోడలు లేదా ఏరాలు. మగని మరో భార్య సవతి. భర్తకు కొత్త భార్య మీద మోజు. ముందు భార్యకు సవతిపోరు. ఇన్నాళ్లూ భర్తే తనువూ, మనసూ ఊడ్చిపెట్టుగా దోచుకున్న భార్య తన్ను లెక్కచేయకుండా భర్త మరో స్త్రీని పెండ్లాడినప్పుడు బావో, చెరువో చూచుకున్న సందర్భాలు జనపదాల్లో కోకొల్లలు. తనకు జరిగే అన్యాయమేగాక సవతి పిల్లలు తన పిల్లల్తోపాటు ఆస్తిలో భాగం పంచుకొంటారని ముందు భార్య ఆక్రోశం. ఆ విషయాల్ని 'నాయనకు పెండ్లి సంబరము, అమ్మకు సవతిసంకటము' అనే సామెత చెపుతుంది, కాబట్టి ఏ స్త్రీ అయినా ద్వేషంతో 'సవతికి సంకెళ్లు, నాకు పిల్లెండ్లు' అని సవతికి బేడీలు, తనకు కాలి వ్రేళ్ల ఆభరణాలు కోరుకోవడంలో ఆశ్చర్యంలేదు.

ఒకోసారి స్త్రీ సవతి ఉనికినైనా సహిస్తుందేమోగాని తోడికోడల్ని సహించలేదు. సవతి తన భర్త భార్యే. పిల్లలు పుడ్తే తన భర్తకే పుడ్తారు. అంటే ఎంతో ఇంతో సంబంధముంటుంది. తోడికోడలు తన భర్త సోదరుడు అంటే ఒక మూడో భార్య. ఆమె ఇంట్లో సరిభాగంకోసం పోరుతుంది. ఉమ్మడికుటుంబంలో 'నేనెంత అంటే నీవెంత' అనుకుంటుంటారు తోడికోడళ్లు. ఒకరు నాలుగుశేర్లు గింజలు దంచితే మరొకరు పోటీగా పదిశేర్లు అంగడింటికి పోస్తారు. ఒకామె తలనొప్పి (  ) పని చేయకుండా పడకేస్తే మరొకామె కడుపునొప్పి అని ముసుగుతన్ని పడుకుంటుంది. అందుకే 'ఇరుపోటీలతో ఇల్లు చెడె, వాయునొప్పులతో ఒళ్లుచెడె' (నర) అనే సామెత

పుట్టింది. సాధారణంగా అన్నదమ్ముల మధ్యకలహం వచ్చి గాక తోడికోడళ్ల మధ్య స్పర్థలు వచ్చే అవిభక్త కుటుంబాలు విభక్తమౌతున్నాయి, ఈ విషయాల్ని వివరించే సామెతలు; 'సవతాలికుండలోనైనా ఉడుకుతానన్నదిగాని తోడికోడలికుండలో ఉడుకనన్నదట', 'మొగుడు కొట్టినందుకు కాదు తోడికోడలు నవ్వినందుకు', 'అప్పచెల్లెలు బ్రతుక కోరితే తోడికోడలు చావకోరుతుంది' అనేవి. ఇట్లా స్పర్థలుండే తోడికోడళ్లు ఒకరి పుట్టింటికి మరొకరు పోయారంటే, వారు వెర్రి బాగులవాళ్లకిందో, సిగ్గులేని వారి కిందో జమ గట్టబడతారు, 'తోచీతోచనమ్మ తోడికోడలు పుట్టినింటికి వెడితే చూచీ చూడనట్లు చూశారట' అనే సామెత పై విషయాన్నే బోధిస్తుంది.

2.13 పెద్దలు - అవ్వ - తాత - మనుమలు - మనుమరాండ్రు (69) :

అనుభవశూన్యులైన యువతీ యువకులను మందలించి సరైన త్రోవలో పెట్టేందుకు ప్రతి కుటుంబంలోనూ పెద్ద దిక్కు అవసరం ఎంతైనా వుందని సామెతలు ఉద్బోధిస్తున్నాయి. పెద్దలంటే తల్లి దండ్రులు కావచ్చు, లేదా అవ్వా తాతలు కావచ్చు. పెద్దన్ని వృద్ధాప్యంలో సరిగా చూడవలసిన ధర్మం ఆ యింటి యువతీ యువకులమీద వుందని, అలా చూడకపోవడం పాపమని సామెతలు చెపుతున్నాయి. 'పెద్దలులేని ఇల్లు ఎద్దులకొటిక', 'పెద్దలమాట చద్దిమూట', 'పెద్దలమాట పెన్నిధి మూట'. 'పెద్దల ఉసురు పెనుబామై తగులును' అనేవి ఆ సామెతలు

కొడుక్కు పెండ్లయినప్పట్నుంచి తల్లి దండ్రులు అవ్వాతాతలు కావాలని ఉర్రూతలూగుతారు. మనుమడో, మనుమరాలో పుట్టే వాళ్లను సాకి, సంతరిస్తూ తమ వృద్ధాప్యాన్ని తాత్కాలికంగానైనా మరచిపోవచ్చునని ఆ వృద్ధుల ఆశ. కొడుకు, కోడలు తమ సలహాలను, మాటలను కాకమ్మ కబుర్లుగా తీసిపారేస్తారు. అదే మనుమడో, మనుమరాలో అయితే ఆ కాకమ్మ కబుర్లే కావాలని మాటిమాటికీ అడిగి చెప్పించుకుంటారు, వృద్ధుల వాక్చాపల్యాన్ని తట్టుకోగలిగేది పిల్లలే. అందుకే అవ్వాతాతలు పిల్లల్లో పిల్లలై పోతారు. వృద్ధాప్యం రెండో బాల్యం అన్నమాటను సార్థకంచేస్తారు.

అవ్వా తాతలకు 'వరహాకన్నా వడ్డీ ముద్దు, కొడుకుకన్న మనుమడు ముద్దు.' మనుమరాళ్లు తాతదగ్గర, మనుమలు అవ్వదగ్గర ముద్దులు గుడుస్తారు. మనుమరాళు తాతల్ని గేలిచేసే మధుర సందర్భాలకు అద్దాలు ఈ సామెతలు. 'తాతా పెండ్లంటే

తలెగరేసినాడంట' (చంద్ర). తలెగరేస్తే మనుమరాళ్లు ఊరుకుంటారా ? 'తాటిచెట్టు ఎక్కాలేవు, తాడిగొల కొయ్యాలేవు, తాతా నీకెందుకోయ్ పెండ్లాము ?' అని ఎగతాళి పట్టిస్తారు.

గతవైభవాన్ని నెమరువేసుకుంటూ ఇప్పటి పరిస్థితిని సమర్థించి ప్రయోజనం లేదని 'తాతలనాడు నేతులు తాగాం మూతులు వాసనచూడండి' అనే సామెత బుద్ధి చెప్తుంది.

వృద్ధాప్యంలో మనుమన్నో, మనుమరాండ్రనో ఎత్తుకొనే అదృష్టంలేకపోతే తాత తనే పసిపిల్లల్లాగ ప్రవర్తిస్తాడట. 'పిల్లలులేని ఇంట్లో ముసలోడు దొగ్గాడిండట', 'బాలలేని యింట్లో వృద్ధుడంబాడెనట' (హైసా. III-14). వృద్ధాప్యంలో చాలా మందికి దగ్గుతోడు. బాగా తెలిసిన వాళ్లకు ఏమైనా చెప్పబోవడం 'తాతకు దగ్గు నేర్పినట్లు' వ్యర్థమని చెపుతారు.

అవ్వను గురించి చెప్పిన సామెతల విషయం కొంత. 'ముసలమ్మ ముద్దులు' (కార్. 1780) పిల్లలకు బాగుంటాయ్ గాని పెద్దవాళ్లకు మహా చిరాకు పెద్ద దిక్కుగా 'ఇంటికి అవ్వ కొలలకు తవ్వ లవసరము' అని సామెత చెపుతున్నది. అవ్వ ఆ వయసులో నూలు ఎంత వడకగలదు ? పాపం ; అందుకే 'అవ్వ వడికిన నూలు తాతమొలత్రాటికి సరి' అనే సామెత వచ్చింది. పగలు అవ్వగారు కూర్చొనే కోడికునుకుతీయడం కద్దు. 'అవ్వకు మనుమడు అవులింత నేర్పినట్లు' అనే సామెత ఆ సంగతినే చెప్తుంది. అవ్వ తాను వీపుగోకుకోలేక మనుమడికి ఆ పని అప్ప చెప్తు తుంది. మనుమడు వచ్చీరాని అక్షరాల్ని అవ్వ వీపుమీదనే దిద్దుతాడు. ఆ వింత సందర్భాన్ని 'మనుమడు నేర్చుకొన్నట్లు, అవ్వ దురద (తుత్తర) తీరినట్లు' అనే సామెత తెలుపుతుంది.

2.14 చుట్టాలు (79) : కలిమి ఉంటేనే చుట్టాలు నెత్తిన పెట్టుకుంటారని అటు వంక బంధువులకే ఆప్యాయత లభిస్తుందని, కొత్త చుట్టరికం మధురమని, కొన్ని సందర్భాల్లో ఐన వాళ్లకన్నా కానివాళ్లే నయమని సామెతలు చెపుతున్నాయి. 'రాయి తిరిగితే (విసరురాయి) రాజ్యమంతా చుట్టాలే' (చంద్ర), 'కలిమి ఉన్నంతసేపు బలగము, కండ ఉన్నంతసేపు మిండడు', 'తలంతబలగ్గమేగాని తలలో పెట్టేవారు లేరు' (హైసా. VI-10) 'అంతా మావాళ్లేగాని అన్నానికి రమ్మనేవాళ్లు లేరు', 'అయిన వారు లోతుకుదీస్తే కానివారు మిట్టకుతీస్తారు' అనేవి పై విషయాల్ని తెలిపే సామెతలు.

ఆత్మీయతలేని చుట్టాలను గౌరవించడం జరగదు. 'ఒల్లీ ఒల్లని చుట్టం వచ్చాడు ఉడుకే ఉలవపప్పా : ఉగాదిదాకా', 'ఫరవాలేని చుట్టం వచ్చింది పాతచేట గొడుగుపట్టమన్నట్లు', 'పోరాని చుట్టము వచ్చాడు బొడ్డువంచి కోయమన్నట్లు' అని సామెతలు. చివరి సామెతలో లేత తమలపాకులు చుట్టానికి కోసివ్వడం ఇష్టంలేని ఇంటి యజమాని ఆకులు కోసే వానితో బొడ్డు వంచి కోయమన్నాడట. జాగ్రత్తగా మంచి ఆకులు కోసివ్వు బాబూ అన్నట్లుంటుంది పైకి. బొడ్డు వంచి కోస్తే చుట్టానికి తాంబూలానికి పనికిరాని ముదురాకులే గతి.

వివిధ విధాల బంధువుల్లో వారివారి గౌరవాల తారతమ్యాన్ని వివరించే సామెతలు: 'ఆలివంకవారు ఆత్మీయబంధువులు, తల్లివంకవారు తగినవారు, తండ్రి వంకవారు దాయాదులు', 'ఆలుచుట్టాలు అరుగులమింద, మొగునిచుట్టాలు మంచాల కింద' (నర), 'మగని చుట్టాలు చెప్పులు ముంగిట విడిస్తే ఆలి చుట్టాలు అర పరమ టింట్లో విడుస్తారు' అనే సామెతలు ఆ తారతమ్యాన్ని చక్కగా విశదీకరిస్తున్నాయి. ఇంట్లో పెట్టుపోతలు అంతా ఇల్లాలు ఇష్టమే కాబట్టి ఈ తారతమ్యం ఉండడం సహజం.

'వచ్చిననాడు వరాచుట్టము, మరునాడు మాడచుట్టము, మూడవనాడు ముఱికి చుట్టము' అనే సామెత మొదటిదినం చుట్టంపై చూపే ఆప్యాయత,మరురోజు సగానికి సగం తగ్గిపోతుందని. మూడో రోజున అసలే లేకుండా పోతుందనే ఒక నగ్న సత్యాన్ని చెపుతున్నది. మరీ విసుగుపుట్టి చుట్టాన్ని తరిమేయాలంటే తిండిపెట్టకుండా మాడ్చడమో, సూటీపోటీగా మాట్లాడమో, చుట్టం ఎదురుగా భార్యాభర్తలు కీచులాడు కోవడమో జరుగుతుంటుంది. ఆ విషయాల్ని 'చుట్టం ఆకలి మంచాని కెరుక', 'ఉండ మనలేక ఊడర పొమ్మనలేక పొగ' అనే సామెతలు స్పష్టంచేస్తాయి.

ఇంటివాళ్లు, చుట్టం ఒకరినొకరు పీడించుకొన్నట్లు చెప్పినసామెతలు. 'చుట్టమై చూడవస్తే దయ్యమై పట్టుకొన్నాడట', 'చుట్టంగావచ్చి దయ్యమైపట్టుకొన్నాడట' అనేవి.

కొత్త చుట్టరికం రుచైనా, పాతచుట్టరికం పథ్యం అని 'కొత్త చింతకాయ తొక్కు, కొత్త చుట్టరికము రుచి', 'పాతచుట్టం పాత చింత కాయ పచ్చడి' అనే సామెతలు వ్యక్తంచేస్తున్నాయి.

బీదపడి చుట్టాలింటికి పోగూడదని 'చెడిస్నేహితునింటికి పోవచ్చును గాని చుట్టాలింటికి పోరాదు' అనే సామెత బోధిస్తుంది.

వియ్యం సమానుల్తోనే చేయాలని, వియ్యపువారు ఒకరినొకరు సరిగా గౌర వించుకోరని 'కయ్యానికైనా, వియ్యానికైనా, నెయ్యానికైనా సమత ఉండాలి', 'వియ్యపువారింటి జాడ్యాలు ఇకిలించినాపోవు' అనే సామెతలు చెప్తున్నాయి.

దాయాదులమీద ఎవరికీ గౌరవమూ, నమ్మకమూ ఉండవు. ఆస్తి పంపకాలే ఇందుక్కారణం. దాయాదికి జ్ఞాతి అని, శత్రువని పేరుపెట్టారు. 'పాముకు విషం పండ్లలో, జ్ఞాతికి విషం కండ్లలో', 'దాసునివి బ్రతుకగోరు, దాయాది చావగోరు' జ్ఞాతి గుర్రు అంటి కర్రు వదలదు' (కాళ్. 955) అనే సామెతలు పై విషయాల్ని ప్రతిభావంతంగా చెప్తాయి.

2.15 ఇరుగు పొరుగు (19) : కుటుంబ సభ్యుల మధ్యనుండే సంబంధం తర్వాత ఇరుగుపొరుగు వారితోనే ఘనిష్ఠ సంబంధాలుంటాయి. ఇరుగుపొరుగున సాధారణంగా దాయాదులో, బంధుత్వం ఉండేవారో ఉంటారు. వీరు కొన్నాళ్ళ విడదీసినా విడదీయరానంత సన్నిహితంగా ఉంటారు. అప్పుడు 'పొరుగింటి పుల్ల గూర రుచి' గా ఉండడం కనిపిస్తుంది, వంటలు, వాయనాలు, కానుకలు ఇచ్చి పుచ్చుకుంటుంటారు గనుక. శత్రుత్వం మొదలైతే వినడూ పోట్లాటే. పిల్లిమీదో, కుక్కమీదో, కోడిమీదో చాటుగా పెట్టి స్త్రీలు తిట్టుకోవడం కద్దు. ఒకరు పడ్డెమంటే పొరుగువారు తెడ్డెం అంటారు. 'ఇంటివాడు గొడ్డు గేదె అంటే పొరుగువాడు పాడిగేదె అంటాడా' (చంద్ర) అనే సామెతలో సహజంగా ఉండేదే. పాడిగేదె అంటే పొరుగువాడు గొడ్డుగేదె అంటాడు అనే భావముంది. పక్కింట్లో వాదులాడుకుంటుంటే స్త్రీలు చెవులప్పగించి వింటుంటారు. ఆ విషయాన్ని 'పక్కఇంటిపోరు పండుగంత వేడుక' అనే సామెత తెలుపుతుంది. ఇరుగు పొరుగువారి లక్షణాల్ని చక్కగా చెప్పే సామెతలు. 'పొరుగు మండుతుంటే పొయ్యిలో ఉప్పు పోసినంట' (నర) 'పొరుగమ్మ సరి పెట్టుకుంటే ఇరుగమ్మ ఉరి పెట్టుకుందట', 'ఇరుగు ఇంగలం పొరుగు మంగలం', 'పోరిన పొరుగు రాచిన పుండు మానదు' అనేవి.

2.16 కుటుంబజీవితంలో వ్యక్తుల మధ్యనుండే సంబంధాలకు నిలువుటద్దం పట్టేవి తెలుగు సామెతలు. ఆ సామెతల వెనుక ప్రతివ్యక్తి మనోభావాలు, శరీర స్థితులు గుర్తించవచ్చు. పెద్దలు ఇంటింటికీ అవసరమని, తండ్రిప్రేమ కన్నా తల్లి ప్రేమ గొప్పదని, ఆలుమగల అన్యోన్యత కుటుంబ సౌభాగ్యానికి అవసరమని, అత్తా కోడళ్ల శత్రుత్వంతో అబ్బాయి నలిగిపోక తప్పదని, ఆడపడుచుకు పుట్టినిల్లు ఎంతో ప్రియమని, బావమరది బావల మధ్య ప్రాణానికి ప్రాణమిచ్చేంత బాంధవ్యం ఉంటుందని-ఇలా ఎన్నో లోక సహజమైన సంగతుల్ని సామెతలు ఉద్ఘాటిస్తున్నాయి.

ఇలా వ్యక్తి కుటుంబజీవితం తెలుగు సామెతల్లో ప్రతిఫలించినవిధం చూశాక, వ్యక్తి సాంఘికజీవితాన్ని సామెతలు ఎలా ప్రతిబింబిస్తున్నాయో వచ్చే ప్రకరణంలో చూద్దాం.

# 3. తెలుగు సామెతలు-సాంఘిక జీవన చిత్రణం

3.0 వ్యక్తి కుటుంబజీవితం పరిధి తక్కువైనదికాగా, సాంఘిక జీవితం పరిధి విరివైనది. ప్రతివ్యక్తీ/ఏదో ఒకకులానికి చెందివుండడం, ఆ కులానికి సంబంధించిన వృత్తిని వంశపారంపర్యంగా అనుసరించడం జానపదుల్లో వుంది. కొన్ని వృత్తులు కులసంబంధులు కావు. ఉదా॥ వ్యవసాయం, వైద్యం, భిక్షాటనం లాంటివి.

వ్యవసాయ వృత్తిపైనే 80 శాతం మంది ప్రజలు జీవిస్తున్నారు. పల్లీయులు దాదాపు అందరూ రైతులుగానో, వ్యవసాయ కూలీలుగానో వుంటున్నారు. మిగతా వృత్తుల్లో చాలామాత్రం రైతులకు కావలసిన వ్యవసాయ పనిముట్లుచేసి, లేదా రైతుల వ్యక్తిగత అవసరాలు (బట్టలుతకడం, బట్టలునేయడం, క్షౌరంచేయడంలాంటివి) తీర్చి సంవత్సరానికింత అని ధాన్యం 'మేర' గా పుచ్చుకొని జీవికను గడుపుతున్నారు. వృత్తికి, కులానికి సంబంధించిన విషయాలు వృత్తి, కులం అనే రెండు ఉపప్రకరణాల్లో చర్చింపబడ్డాయి.

ప్రజల ఆహారపుటలవాట్లు వ్యక్తి ఇష్టానిష్టాల మీదకన్నా వారికులంపై ఆధారపడ్తుంటాయి. ఉదా॥ బ్రాహ్మణులకు మాంసభక్షణ నిషేధం. వివిధ ఆహార పదార్థాలపై ప్రజల అభిప్రాయాలు సామెతల్లో ప్రతిబింబించిన తీరు 'ప్రజల ఆహారపుటలవాట్లు' అనే ఉపప్రకరణంలో గమనించొచ్చు.

ప్రజల్లో కొన్ని కులాలకు వ్యాపారం వృత్తి. ఉదా॥ కోమట్లు, బలిజలు, ఉప్పరలు. వివిధ వ్యాపారాలు, సంతలు, లాభనష్టాలు ఇంకా వ్యాపారసంబంధి విషయాలు 'వ్యాపారం' అనే ఉపప్రకరణంలో విశ్లేషించబడ్డాయి.

ధనం, ధాన్యం, ఇతర వస్తువుల పరిమాణాన్ని తెలిపేవి నాణేలు, కొలతలు. ఇవి తరానికి తరానికి మారుతుంటాయి. ఈ విషయాలు నాణేలు_కొలతలు అనే ఉపప్రకరణంలో చర్చనీయాంశాలు.

ప్రజలు సుభిక్షంగా వుండాలన్నా, క్రమశిక్షణతో మెలగాలన్నా ప్రభుత్వం, న్యాయస్థానాలు అవసరం. ప్రభుత్వాన్ని నడిపే వివిధ అధికారులపై ప్రజలకున్న అవగాహన, న్యాయస్థానాలపై ప్రజల అభిప్రాయాలు 'పరిపాలన_న్యాయం' అనే ఉపప్రకరణంలో చర్చింపబడ్డాయి.

పై విధంగా ఆరు ఉపప్రకరణాలలో ప్రజల సాంఘిక జీవనానికి తెలుగు సామెతలు ఆధారంగా ఒక రూపచిత్రణ చేసే ప్రయత్నం జరిగింది.

# 3.1 తెలుగు సామెతలు - వృత్తి

3.1.0 వృత్తి - వివరణ : జీవనోపాధికోసం కుటుంబ సభ్యులంతా వంశ పారంపర్యంగా చేసే పనిని 'వృత్తి' అని స్థూలంగా నిర్వచించుకోవచ్చు. ఒక వృత్తిని ఒక కులంవారే చేస్తూండవచ్చు. పౌరోహిత్యం బ్రాహ్మణులు, క్షురకర్మ మంగళ్ళలాగా. ఒకే వృత్తిని వేర్వేరు కులాలవారు అనుసరించొచ్చు. ఉదా॥ వ్యవసాయాన్ని కాపు, కమ్మ, బలిజ, బోయ ఇత్యాది చాలాకులాలవారు వృత్తిగా స్వీకరించినట్లు వైద్యవృత్తిని, నేతపనిని కూడా వేర్వేరుకులాలవారు అనుసరిస్తున్నారు. సంఘంలో గౌరవప్రదంగాని పడుపువృత్తిని, దొంగతనాన్ని, భిక్షాటనాన్ని కొన్ని కులాలవారు అందరో, కొందరో వృత్తిగా చేపట్టారు.

ఆంధ్రప్రదేశ్‌లో నూటికి ఎనభై మందిదాకా జానపదులే. ఆంధ్రప్రదేశ్ జనాభా 4,86,000,00 కాగా, గ్రామీణ జనాభా 3,92,000,00. పల్లెయుల్లో నూటికి తొంభై మంది వ్యవసాయం మీదనే ఆధారపడుతున్నారు. వ్యవసాయానికి అవసరమయ్యే కొయ్య పనిముట్లను వడ్రంగి, ఇనుపపనిని కమ్మరి, చర్మంపనిని మాదిగవారు చేస్తున్నారు. జానపదులకు నగలు చేసేది కంసాలి. బావులు త్రవ్వడం, చెరువులు త్రవ్వడం (కట్టడం), ఇండ్లగోడలు పెట్టేది వడ్డె, ఉప్పర్లు. బట్టలుతికే వృత్తిని చాకలి, క్షౌరంచేసే వృత్తిని మంగళ్లు చేపట్టారు. ఇలా దాదాపు వృత్తులన్నీ గ్రామజీవితంపై ఆధారపడి అన్యోన్య సహకారాన్ని అపేక్షించేవే,

పడుపువృత్తి, పూటకూళ్లవృత్తి నగరజీవితంలోవి. వైద్యం, దొంగతనం, భిక్షాటనం, జనపద నగర భేదం లేనివి.

ముఖ్యమైన వృత్తుల్ని ఈ ఉపప్రకరణంలో చర్చించి, కులా[illegible] ముడివడిన వృత్తుల్ని 'తెలుగు సామెతలు - కులం' అనే ఉపప్రకరణంలో వివరించాను. కులంతో ముడిపెట్టే వీలులేని ప్రధానవృత్తులు తొమ్మిది. ఈవృత్తులపై లభించిన తెలుగు సామెతలు 2222. ఆ వృత్తులివి: 1. వ్యవసాయం - పశుపోషణ(1891) 2. వైద్యం (31) 3. మంత్రసాని వృత్తి (8) 4. పూటకూళ్లవృత్తి (3) 5. కసాయి/కటిక వృత్తి (2) 6. కూలిపని (8), 7. పడుపు వృత్తి (122) 8. దొంగతనం (73) 9. భిక్షాటన వృత్తి (74). ఆ వృత్తులను గురించిన ప్రజల అభిప్రాయాలు సామెతల్లో ఎలా ప్రతిబింబించాయో తెలుపడం ఈ ఉప ప్రకరణలక్ష్యం.

3.1.1 వ్యవసాయ వృత్తి : తెలుగు సామెతల్లో వ్యవసాయానికి సంబంధించినవి 1469. పశుపోషణకు సంబంధించినవి 422. వృత్తుల్లోకెల్లా వ్యవసాయ

వృత్తి ఎంతో ప్రాచీనమైంది, ప్రముఖమైంది. అది ఎప్పుడు మొదలైందో ఏ వ్రాత ఆధారాలూ చెప్పలేకున్నాయి... క్రీ. పూ. 3500 సం॥ నాటి ఈజిప్టు దేశంలోని గోరీల్లో గోధుమలు కనిపించాయి.1 అంటే అంతకు ముందు ఎప్పట్నుంచో వ్యవసాయం ఉన్నట్లే గదా !

వ్యవసాయ ప్రాముఖ్యాన్ని ఉమ శివున్తో నొక్కి చెప్పిన మాటలివి. 'ఓ నాధా! భార్గవుడు భూమిని, కుబేరుడు విత్తనాల్ని, బలరాముడు నాగలిని ఇత్తురు. త్రిశూలము కఱుకోలగా చేయుము. యముని దున్నపోతును అడుగుము. నందిని జత చేతము. నేను చేనివద్దకు అన్నము తెత్తును. కుమారుడు పశువులగాయును. కాబట్టి సరివారిలో నాకు నగుబాట్లు కలిగించే భిక్షాటన వృత్తిమాని, వెంటనే వ్యవసాయము చేయుము'.2 వాషింగ్టన్ వ్యవసాయాన్ని ప్రశంపించిన విధమిది.

'కలం పట్టడంలో వుండేగౌరవం
హలం పట్టడంలోనూ వుంది
ఇది తెలుసుకొనేవరకూ
అభ్యున్నతినందలేదు ఏజాతీ'2 ఎ.

వ్యవసాయ ప్రాముఖ్యాన్ని తెలుగు సామెతలు కీర్తించిన విధమిది. 'కోటి విద్యలు కొంద్రకు లోకువే', 'వ్యవసాయజీవనమే జీవనము' అని చెప్పడమేగాక 'వ్యవసాయం రసవాదం వంటిది' (క. సా. 110) అని, 'క్షేమానికీ సేద్యానికీ చెలిమి' (వ్య. సా. 912) అని తెలుగు రైతు మనస్ఫూర్తిగా నమ్ముతున్నాడు.

3.1.1 (అ) రైతు ప్రాముఖ్యత: రైతు దేశానికి వెన్నెముక. రైతు సంఘానికీ, దేశానికీ ఎంత అవసరమో, అతని స్థితిగతులేమిటో సామెతలు అద్దంపడ్తాయి. మహారాజుకైనా, స్వాములకైనా, చదువుకున్న వారికైనా అన్నం పెట్టేవాడురైతే. రాజుగాని, ప్రభుత్వంగాని, దేశంగాని బాగుపడాలంటే రైతు బాగుపడాలి. రైతు ప్రశస్తిని చాటే సామెతలే, రైతు నిస్సహాయస్థితిని, వ్యవసాయంలో వచ్చే నష్టాన్ని కూడా తెలుపుతున్నాయి.

'అందరికీ అన్నం పెట్టేవాడు రైతే'
'పండించేవాడు పస్తుంటే పరమాత్మకూ పస్తే'
'రైతు క్షేమమే రాజుకు భాగ్యం' (క. సా. 118)
'రైతు బాగుపడితే దేశం బాగుపడుతుంది' (గోభూమి. ఉగాది సంచిక 1950)

'అన్నీ పండించిన రైతుకు అన్నమే కరువు'
'దున్నేవాడు లెక్కచూస్తే నాగలి కూడా మిగలదు'
'వ్యవసాయం ఏలినాటి శని, భార్య జన్మశని'
'ఏడ్చేటట్లుంటే వ్యవసాయం చేయి'
'వ్యవసాయం వెట్టివానిచేతిరాయి.'

**మంచిరైతు :** తెలుగుదేశంలో సేద్యంచేసే కులాలివి-రెడ్లు, కాపులు, కమ్మ, వెలమ, రాజులు, గవరలు, గొల్ల మొదలగు కులాలవారు. మోత వారలు, ఫగటలు, రాణాలు, బ్రోజులు, జాతణలు, కొండదొరలు, కోయలు, చెంచులు, బారిలి, గోరి, కుమ్మర, కూర్మ, మాల, మాదిగ, మంగల, మురాసి, పెరిక, ఉప్పరజాతుల వారున్న సేద్యాన్ని రెండవవృత్తిగా తమ కులవృత్తితోపాటు ఎన్నుకున్నారు3. తమిళదేశంలో 'వెళ్లాలన్', తెలుగుదేశంలో 'రెడ్లు' మంచిరైతులు అని సామెతలు ఉద్ఘోషిస్తున్నాయి4.

'గడ్డగడ్డకూ పుట్టెడు నీళ్లుతాగినా రెడ్డే వ్యవసాయంచెయ్యాలి'. అని సామెత.
**మంచిరైతు లక్షణాలు :** వళ్లువంచి పనిచేసే స్వభావం, స్వయంగా సేద్యం చేయడం, కూలీలను తనవెంట తీసుకవెళ్లడం, తెల్లవారుజామునే లేచి నాడికట్టడం, రెండూర్ల వ్యవసాయం చేయకుండడం అనేవి మంచిరైతు లక్షణాలని సామెతలు చెప్తున్నాయి.

'నోయ్యకుండా చేస్తే నొయ్యకుంత పండెనట' (హైసా. II-12 )
'పాటు గలిగితే కూటికి కొదవా'
'ప్రొద్దుట లేవని కాపుకు పొలం ఇచ్చేది గడ్డే'
'రమ్మనపునారి కాని పొమ్మనకూడదు కూలీలను'
'ఇరుగూరి వ్యవసాయం ఇద్దరి భార్యల సంసారం ఒకటే'

**మంచి రైతులు కానివారు :** మంచి రైతులుగా లెక్కబడని కులాల్లో మొదటిది బ్రాహ్మణకులం. అలాగే మాల, మాదిగ, దొమ్మర, చాకలి, మంగలి కులాలు కూడా వ్యవసాయానర్హాలే అని సామెతలు స్పష్టపరుస్తున్నాయి.

'బాపన సేద్యం బడుగుల నష్టం, కాపుల చదువు కాసులనష్టం'
'బ్రాహ్మణ సేద్యం చేస్తావా పల్లకి ఎక్కుతావా అంటే
బ్రాహ్మణ సేద్యం చేస్తానన్నాడట' (క. సా. 1114)

'ఏగిలిదున్నితే మాలవాని కైనా పెరుగును'
'మాలపున్నమ ముందు మాదిగ వాడైనా చల్లడు'
'గాడిదలే దున్నితే దొమ్మరులు పంటకాపులు కారా'
'చాకలి మంగలి పొత్తు యింటికి రావిత్తు'

3.1.1 (ఇ) భూమి గొప్పదనం: వ్యవసాయానికి మూలాధారమైన నేలను మాతగా, దొరలు ఇచ్చే ధనం కంటె గొప్పదిగా, తిండీ, బట్టా ఇచ్చే తల్లిగా కీర్తించడమేగాక, 'ధనలక్ష్మి, ధాన్యలక్ష్మితో దీటుకాదు' (వ్య. సా. 503) అని సామెతలు వక్కాణిస్తున్నాయి.

'జననిని ధరణిని నమ్మినవారు చెడరు' (వ్య.సా. 409)
'దొరలు యిచ్చిన పాలుకంటె ధరణి యిచ్చిన పాలు మేలు'
'పొట్టకిచ్చినా బట్టకిచ్చినా భూదేవే'

సేద్యానికి తగిన భూమి: సేద్యానికి అనువైన భూమి ఊరికి చేరువగా ఉండాలని, ఏక ఖండంగా, కుదురుగా, సారవంతంగా ఉండాలని, పల్లం తూము కింద, మెరక కొండకింద ఉండాలని సామెతలంటున్నాయి. ఊరిదగ్గరిచేను, ఏటివడ్డునచేను, పనికి రావని కొన్ని సామెతలు సకారణంగా చెప్తున్నాయి.

'చెడ్డచేను అయినా చేరువున ఉండాలి' (క. సా. 286)
'ఊరి ముందరి సేద్యం, మద్దికాడి, బద్దెల పలుపు వుంటే ఆరేండ్లు సేద్యం చేస్తానన్నదట ఎద్దు'
'చెరువుకు చేరువగాను, చుట్టాలకు దూరంగానూ ఉండవలె'
'మదురు వారమడియైనా కావాలి, మాటకారిమొగుడైనా కావాలి'
'చెడ్డభూమి అయినా ఏకఖండము మంచిది' (క. సా. 285)
'కొండకింద మెరక, తూముకింద పల్లము' (క, సా. 281)
'కడామడివాని కటారి పోటుకంటె, మొదటి మడివాని ఏకుపోటు మేలు'
'చేనికుదురు ఆలికుదురు ఉండాలి'
'పండనినేల పందుంకంటె, పండేనేల కుంచెడు మేలు'
'ఊరి దగ్గఱి చేనుకు అందఱూ దొంగలే'
'ఊళ్లోచుట్టరికము (వియ్యము) ఊరిముందరి చేను పనికిరావు'
'ఏటివడ్డున చేను చీటికి మాటికి భయం'

ఆంధ్రప్రదేశ్‌లో సేద్యానికి అనువైన నేలల్ని రంగును బట్టి ఏడు ముఖ్యమైన రకాలుగా విభజించారు. 1. డెల్టా వండ్రు నేలలు 2. తీరపు వండ్రు నేలలు 3. లోతైన నల్లరేగడి భూమి 4. మధ్య తరహా నల్లరేగడి భూములు 5. ఏ తరగతికీ చెందని నల్లభూమి 6. ఎర్రనేలలు 7. తువ్వనేలలు: ఇవిగాక ఇసుకనేలలు, చవుడు నేలలు కూడా ఉన్నాయి.[5] సామెతల్లో వివిధరకాల నేలల ప్రసక్తి వుంది. ఒకే ప్రదేశంలో కూడా నేలరంగుల్లో మార్పు వుంటుందని 'కోడి అడుగులో కోటివర్ణాల భూమి' అనే సామెత చెప్తోంది. నల్లరేగడిలో జొన్నలు పండుతాయని, రాళ్లచేను రత్నాలు పండుతుందని, చవిటినేల, ఎఱ్ఱనేల, తువ్వ, బెలుక, ఊసర, ఊదనేలలు నిస్సారాలని సామెతలు నిర్ధరిస్తున్నాయి.

'రేగడి భూమినీ, రెడ్డినీ చే విడువరాదు'
'నల్లరేగడిలో చల్లినా తెల్ల జొన్నలే పండేది'[8]
'రాళ్లచేను రత్నాలు పండుతుంది'
'రాళ్లచెలుక, రండబిడ్డ కాపువారికి కలిసి వస్తాయంట'
'చవిటిభూమిలో విత్తు యుద్ధభూమిలోవి సిపాయి ఒకటే' (క.సా.283)
'వరికి పాలచవిటినేల'
'ఊసర క్షేత్రంలో దూసరి తీగ'
'ఊసర క్షేత్రంలో అలికితే ఉల్లికోళ్ల పంట'
'ఇసుకనేల దున్ని బాగుపడడు, బంకనేల దున్ని చెడడు(వ్య.సా.91)
'యిసుక నేలలు దున్ని చెడినవాడు లేడు' (క. సా. 312)
'నల్ల నేలకు నువ్వులు ఎఱ్ఱ నేలకు కందులు'
'ఎఱ్ఱనేల పంట ఒకనాటి వంట'
'తువ్వన వేసిన ఎరువు బావనికి పోసిన నెయ్యి'
'పాటిమీద వ్యవసాయం కూటికైనా రాదు'
'పొగ తోటకు పొడి నేల' (పాటి నేల)
'బెలుక సేద్యం తురక నేస్తం'
'ఊద నేలలయందు పంట ఫలించదు' (వ్య. ము. ద. 540)

3.1.1 (ఈ) పంట పొలాల విభజన : ఆంధ్రప్రదేశ్‌లో స్థూల పంటభూమి 132.83 లక్షల హెక్టేర్లు. ఇది మొత్తం భూమిలో 48.4 శాతం.[7] తెలుగుదేశం లోని పంట పొలాన్ని తరి, ఖుష్కీ లేదా మాగాణి, మెట్ట అని రెండు పెద్దవిభాగాలు

చేయొచ్చు. 'తోట' అనే పంట పొలం మరొక చిన్న విభాగం. బావులకింద ఉండే పంటపొలాన్ని 'తోట' అని చెప్పవచ్చు. 'చేను' అనేపదానికి కోస్తాలో నీటిఆధారంతో పండించేనేల, మెట్టపొలం అని రెండర్థాలు. మెట్టపొలం అని రాయలసీమ జిల్లాల్లో ఒకే అర్థం. మడిలో పంట పెట్టడం వ్యయంతోకూడింది, ఆదాయం నమ్మకం లేనిది అని కొన్ని చోట్ల, పల్లం లాభసాటి అని కొన్నిచోట్ల. తోటపని తీరదని లాభసాటి కాదని, సామెతల్లో చెప్పబడింది.

'మడిదున్ని మనినవాడు, చేనుదున్ని చెడినవాడు లేరు'
'పల్లము దున్నినవాడు పల్లకి ఎక్కుతాడు'
'చేనిపంట చేరెడైనా చాలు'
'చేను పండాలి ఇల్లు నిండాలి'
'మెట్టదున్నినవాడు లొట్టి త్రాగినవాడు ఒకటే'
'వెలిపొలమును వెధవపిల్లను వదలకూడదు'
'చేను పండినా చేటప్పే, మొగుడుండినా మొండిమెడే'
'బావికింద దున్ని బ్రతికినవాడులేడు,
చెఱువుకింద దున్ని చెడినవాడులేడు'
'తీటగలవానికి తోటగలవానికి తీరిక వుండదు'
'మేహజాడ్యం తోటసేద్యం' (ఏనాటికీ వగదెగవు)

3.1.1 (ఉ) అదును - పదును : ప్రతి పైరూ పెట్టేందుకు ఒక నిర్ణీతకాలముంటుంది. దాన్నే 'అదును' అంటారు, అదునుదాటి పైరుపెడితే పంట సరిగా రాదు. పల్లెలలో 'ఇంట్లో పీనెగ పడినా' అదునుకు జరగాల్సినపని జరిగి తీరాల్సిందే 'ఒకనాటి అదును ఒకఏటి పంట' కాబట్టి. పైరు పెట్టేందుకు సరిపోయే తేమ వుండడం 'పదును'.

అదును-పదునుల ప్రాముఖ్యాన్ని సామెతలు వేనోళ్ల కీర్తిస్తున్నాయి. చూడండి.

'ఒకనాటి అదును ఒక ఏడాది బ్రతుకు'
'ప్రాయాన పెట్టిన పంట ప్రాయాన గన్నకొడుకు'
'అదునులో చూచి పొదలో చల్లినా పండుతుంది'
'కాలంలో విత్తనాలు కలలోనైనా చల్లాలి'
'అదును తప్పిన పైరు ముసలివాని బిడ్డలు ఒకటే,

'అదునులో వివాహము, పదునులో విత్తనము'

(గోభూమి, ఉగాది సంచిక 1950)

వరికి అదునుకాలమేదో, అదునులో చల్లకపోతే వచ్చే నష్టమేమిటో ఈ సామెతలు విశదీకరిస్తాయి. సింహంలో అయితే పలుచగా, కన్యలో అయితే వత్తుగా వరి నాటాలని సూచన వుంది.

'కన్యలో[8] చల్లితే కనుగుంటలలో కిరాపు' (వ్య. సా. 226)

'ఆషాఢానికి[9] ఆకు పోతలు (నారుమళ్లు)'

'మాలపున్నమ[10] ముందర మాదిగ వాడైనా చల్లడు'

'మిధునంలో[11] పుట్టిన మొక్క మీసకట్టున పుట్టిన కొడుకు

(వ్య. ము. ద. 452)

'సింహం[12]లో చీరి ఊడ్చడమున్ను కన్యలో కంగాపింగా ఊడ్చడమున్ను'

'రోహిణిలో విత్తుట రోటిలో విత్తుటే'

మృగశిరలో పుట్టిన పైరు మీసకట్టున పుట్టిన కొడుకు మేలు'

'ఆరుద్ర కార్తె విత్తనానికి, పెట్టిన ఇంటికి సేగిలేదు'

'అరుద్రలో అడ్డెడు చల్లితే పునాసకు పుట్టెడు పండుతుంది'

'చిన్నపుశ్యాల కార్తెలో చిట్టెడు వడ్లుచల్లితే

పుట్టెడువడ్లు పండును' (బెన్సన్. 380)

'ఆశ్లేషలో ఊడ్చినట్లయితే అడిగినంత పంట'

'మఘలో మానెడు చల్లుటకంటె ఆశ్లేషలో అడ్డెడు చల్లుటమేలు'

'పుబ్బలో చల్లినా బూడిదలో చల్లినా ఒకటే' (వ్య. సా. 601)

'పుబ్బలో పుట్టెడు చల్లేదానికంటె మఘలో మానెడు

ఆశ్లేషలో అడ్డెడుమేలు' (క. సా. 173)

'ఉత్తరలో ఛల్లిన పైరు కత్తెరలో నరికిన కొయ్య'

'ఉత్తరలో చల్లితే ఊబుకుని తినేదానికి లేదు' (బెన్సన్. 382)

'హస్తమి కార్తెలో చల్లితే అక్షింతలకైనా రావు ( ,, 384)

'హస్తలో అడ్డెడు చల్లేకంటె చిత్తలో చిట్టెడు చల్లేదిమేలు'

'స్వాతిలో విత్తనం స్వాతికోవులు అవును' (బెన్సన్. 385)

'చిత్త చిత్తగించి స్వాతి చల్లచేసి విశాఖ విసరకుంటే

అనూరాధలో అడిగినంత పండుతాను అన్నదట వరి'

ఇతర పంటల అదును కాలాన్ని ఈ కింది సామెతల్లో చెప్పబడింది.

జొన్నకు అదును

'కృత్తికలో విత్తితే కుత్తుకలు నిండవు'

'రోహిణిలో జొన్నలు, సాహిణిలో గుత్తాలు'

'ఆరుద్రతో అదను సరి'

'చిత్త చిత్తగించి, స్వాతి చల్లచేసి. విశాఖ విసరకుంటే
వీసానికి పుట్టెడు పండుతాను అన్నదట-జొన్న'

నువ్వు పంటకు అదును.

'భరణి కార్తెలో చల్లిన నువ్వుచేను కాయకు బరిగెడు గింజలు'

ఉలవకు అదును

'ఉత్తర పదును ఉలవకు అదును'

'చిత్తలో చల్లితే చిట్టెడు కావు'

'ముత్యమంత పదునుంటే మూలకార్తెలో చల్లినా ఉలవచేను కాయును'

'మూలలో చల్లిన ఉలవలు మూడు పువ్వులు ఆరుకాయలు'

ఆరిక - రాగి పంటలకు అదును

'ఆరుద్రలో వేసిన ఆరిక, ఆకులో పెట్టిన అన్నము ఒకటే'

'ఉత్తరలో చల్లితే ఊల తగులును' (రాగి)

3.1.1 (ఊ) వ్యవసాయ అవసరాలు : వ్యవసాయానికి ముఖ్యమైన అవసరాలు మూలధనం (పెట్టుబడి), ఇంటి మనుషులు, కూలీలు, పశువులు, ఉపకరణాలు, విత్తనాలు, ఎరువులు. వీటిలో ఏది తక్కువైనా కష్టమే.

మూలధనం (పెట్టుబడి) : రైతుల్లో చాలమంది వారి మాటల్లోనే చెప్పాలంటే 'కుత్తకూ, నెత్తికీ సరిపోనివారే'. ఎరువులకు, కూలీలకు, ఉపకరణాలు కొనేందుకు మూలధనం అవసరం. అది లేకపోతే రైతు ఎలా కొరగాడో సామెతలు ఇలా చిత్రిస్తున్నాయి.

'కాపు బీదరికమే పంట బీదరికం' (వ్య. సా. 268)

'సంసారి బీదగాని చేను బీద గాదు'

'చేతిలో లేనిది చేలోకి ఎలా వస్తుంది ?'

ఇంటి మనుషులు : వ్యవసాయంలో విత్తనం చల్లిన నాటినుంచీ, ధాన్యం, గడ్డి ఇంటికి చేరిందాకా ప్రతిదినమూ-ప్రతిక్షణమూ ఏదో ఒక పని ఉండనే ఉంటుంది.

కొన్నాళ్ళ రాత్రి ఏ మూడో జామునో కపిలగట్టి, ఉదయం పది గంటలదాకా తోలాలి. చెరువుకో నీళ్ల తక్కువ వచ్చేట్లుంటే నూత వేయాలి. కూలివాళ్లు దొరక నప్పుడు రాత్రిళ్ల వెన్నెల్లో కొన్ని పనులు చేయాలి. పంటను పశుపక్ష్యాదుల బారి నుంచి కాపాడుకొనేందుకూ ఇంటి మనుషులు అవసరమే. కూలీలను పొలంలోకి తీసుకవెళ్లి పనిచేయించేందుకు తప్పనిసరి. ఇంటి మనుషులు లేకపోతే సేద్యం ఎంత కష్టమో - ఇంటి మనుషుల అవసరం ఎంత ఉందో ఈ సామెతలు విడమర్చి చెప్పుతాయి.

'ఒంటరివాని పాలు ఇంటికిరాదు'

'పదిమంది కలవాడు కొండైనా పండిస్తాడు' (వ్య. సా. 555)

'పదిమంది కలవాడు పంద అయినా సేద్యం చేస్తాడు'

'పదిజనములు ఉండేవానికి జరుగును, ఒంటివానికి యము బాధే గాని శేద్యము కాదు' (బెన్సన్. 22)

'మంటిపనికైనా ఇంటివాడు వెళ్లాలి' (కి. సా. 116)

'ముప్పై ఏండ్ల జీతగాని కన్న మూడేండ్ల ఇంటిబిడ్డ మేలు' (నర)

కూలీలు : ఈనాడు పల్లెల్లో కూలీలు దొరికేదే గగనమైంది. పట్నాలు దగ్గరుండే పల్లెల్లో మరీను. పట్నాల వాళ్లు కూలి ఎక్కువ ఇవ్వగలరు. వ్యవసాయంలో కూలి కూలీలకు గిట్టక పోవచ్చు. కూలీలు ఇంటిమనిషి లేకపోతే సరిగా పనిచేయరు. వీలైనంత ఆలస్యంగా వచ్చేందుకు, వీలైనంత ముందు వెళ్లేందుకు ప్రయత్నిస్తారు. కూలీలను ఆకర్షించేందుకు మంచి కూరలు చేసి పెట్టడం, విందులు పెట్టించడం కూడా కద్దు. 'కూలివాడి ప్రొద్దా ప్రుంకవే ప్రొద్దా' అనే సామెతలో పొద్దులేని కాలంలో పని సరిగా జరుగదని, 'చాలులో చాలు వేస్తే నా పాలెక్కడ పోతుంది' (నర) అనే సామెతలో కూలీలు మెల్ల మెల్లగా పనిచేస్తారని, 'రమ్మనాలి కాని పొమ్మనకూడదు' అనే సామెతలో రైతు కూలీలను తనవెంట రమ్మనాలికాని వారినే వెళ్లి పని చేయమని చెప్పకూడదు అని స్పష్టపడుతోంది.

ఉపకరణాలు : వ్యవసాయానికి అరక, గొర్రు, గుంటక, బండి ఇత్యాది ఉప కరణాలు అవసరం. కపిల తోలేవారికి అయితే బొక్కెన, మోకులు, దాపుతాడు, పార, గడ్డపార, తొల్లికలు, కొడవండ్లు లాంటివి అవసరం. ఎరువు పొలానికి తోలేందుకు, పంట ఇంటికి తెచ్చుకొనేందుకు, ప్రయాణాలకు బండి ఎంతో అవసరం. అందుకే 'కూటికి గింజలు పనికి కొరముట్లు లేక చేసే సేద్యం రోత', 'బండి

ఎద్దులు అమ్మినవాని పని బందు' అని చెప్పబడింది. 'వేపనాగలి, కానుగ వాసాలు పనికి రావని 'అదనూ పదనూ చెరిచేది వేపనాగలి', 'కానుగ వాసాలు కదోయి కాదరు సాహెబంటే, పుచ్చినదాకా వుండనా బురాను సాహెబా అన్నాడట' అనే సామెతలు స్పష్టపరుస్తున్నాయి.

**పశువులు :** సేద్యం చేసేవాడికి పశువుల అవసరం అంతాఇంతా కాదు. వాటి గంధరము, పేడ ఎరువు. దుక్కి దున్నడానికి, కపిలతోలడానికి, బండిపనికి పశువులు కావాల్సిందే. వెలిదుక్కికి ఎద్దుల్ని, బురద దుక్కికి దున్నల్ని రైతులు ఉపయోగిస్తుంటారు. సన్నకారు రైతులు ఇంట్లో మనిషి చస్తే ఎంత ఏడుస్తారో గొడ్డు చచ్చినా అంతే. పశువుల ప్రాముఖ్యం రైతులు సామెతల్లో చెప్పుకొనే విధమిది.

'పశువులూ, పశువులూ ఉంటేనే వ్యవసాయం' (వ్య. సా. 548)

'వడ్లు, గొడ్లు ఉన్నవాడిదే వ్యవసాయం'

'సేద్యమునకు ఎద్దు పట్టు, సంసారమునకు ఆడమనిషి పట్టు'

(గోభూమి. నవం. 49)

'దుక్కిటెద్దుచావు, పక్కలో పెళ్లాం చావు వంటిది'

'ఎద్దు కొద్దీ సేద్యం, చద్దికొద్దీ పయనం'

**విత్తనాలు :** పంట పెట్టేందుకు చాలా ముందుగానే విత్తనాలు జాగ్రత్త చేసుకుంటారు రైతులు. జొన్న, సజ్జ, రాగిలాంటి వాటిని మిడి అయిన, బాగా పండిన కంకులు పక్కకు తీసి విత్తనాలు తీసుకుంటారు. వడ్లు, వేరుశెనగకాయల్లాంటివి అయితే బాగా తూర్పించి, తప్పాలు తీసివేసి జాగ్రత్త చేస్తారు. బాగా ఎండబెట్టి దొంతుల్లోను, వాడల్లోను భద్రపరుస్తారు. ప్రతి అమావాస్యకు తీసి పురుగులు పడకుండా జొన్న, సద్ద, అలసంద, మినుము, పెసరలాంటి వాటిని ఎండబోస్తారు. విత్తనాలు కల్తీ అయితే ఎంతో నష్టం. కుప్పవిత్తనాలు పనికిరావు. విత్తనాలు బాగా ఎండాలి. ఈవిషయాలన్నీ సామెతల్లో భద్రపరిచారు, తరతరాల రైతులు. విత్తనాలుగా దాచిన ధాన్యాన్ని పస్తున్నా ముట్టుకోడు రైతు. అవి తింటే కరువొచ్చిందన్న మాటే.

'విత్తనాల సంచులు మంచివి అయితే విత్తపు సంచులు నిండును'

'కుప్ప విత్తనాలు చప్పనారు'

'ఏడు ఎండల విత్తనాలు ఎంత వరపుకైనా ఆగుతాయి'

'కాలం నాటి కందిగింజ పెద్దల నాటి పెసరగింజ'

'కల్తీ విత్తనం వెల్తి గాదెలు'

ఎరువులు : మనిషికి తిండిలాంటిదే మొక్కకు ఎరువు. రసాయనిక ఎరువులు ఆధునికాలు గనుక సామెతల్లోకి ఎక్కలేదు. ఎరువుల్ని పశువుల ఎరువు, గొర్రెల మంద, ఆకుఎరువులు, మట్టి, వేపపిండి అనే విభాగాల క్రింద చర్చించుకోవచ్చు. ఎరువుల ప్రాధాన్యాన్ని రైతు గుర్తించిన విధం సామెతల్లో ఇలా వుంది. పిడకలు కాల్చే దురభ్యాసాన్ని ఖండించడం కూడా ఒక సామెతలో వుంది.

'అడుగున ఎరువుకొద్దీ పైన బంగారం' (పంట)

'చేనికి ఎరువు, మడికి మంద'

'ఎరువు పెట్టిన పొలం, ఏలుబడి అయిన కోడలు'

'ఎరువు ఉంటే వెట్టివాడూ సేద్యగాడే'

'ఎరువులేని రైతు పరువులేని రైతు'

'ఎరువులేని సేద్యం, కరువు దేవరకు వాద్యం'

'లావులేని చేను, లేగలేని ఆవు'

'ఎరువు చేయునుపకారము బంధువులు కూడా చేయలేరు' (క.సా. 319)

'ఈనాడు పిడకలమంట రేపు ఆకలిమంట' (వ్య. సా. 96)

పశువుల ఎరువు : పశువుల పేడ, గందరము, చెత్త కలిసిన ఎరువు పంటకు చాలా శ్రేష్ఠం, విలుకడమీద రెండు మూడేండ్లదాకా గూడా సత్తువనిస్తుంది. రైతు కుటుంబ సభ్యులు వీలైనంతవరకు పేడ సేకరించేందుకు ప్రయత్నిస్తారు. దాని అవసరాన్ని గుర్తించే సామెతలు ఇవి.

'పశువుల రొచ్చు గుంత, పంటకాపు గుచ్చు పాతర'

'గొడ్డె పెంట ఏడాది, ఆవులపెంట ఆరేండ్లు'

'పాడిలేని ఇల్లు, పేడలేని చేను' (జెన్‌సన్. 463)

'పశువుల ఎరువు పంటకు బాట' (వ్య. సా. 560)

గొర్రెలమంద కట్టించడం : ఊరూరికీ గొర్రెలమంద సాధారణంగా వుంటుంది. చేలలోగాని, మళ్లలోగాని రాత్రి వేళల గొర్రెలను మందకట్టిస్తారు. వాటి గందరము, మచ్చుతో చేను తడుస్తుంది, వెంటనే ఫలితాన్నిచ్చే ఎరువిది. గొర్లమంద ప్రాధాన్యాన్ని రైతులు గుర్తించినట్లు ఈ సామెతలే సాక్ష్యాలు.

'నేలను గొర్రె తొక్కినా చాలు' (వ్య. సా. 529)

'గొల్లవాడా! గొల్లవాడా! ధాన్యం ఎక్కడుంది? అంటే

నా గొడ్డె ముడ్డిలో ఉంది అంటాడు'

'మడికి మంద చేనికి ఎరువు'

ఆకు ఎరువు (పచ్చి రొట్ట) : ఆకు ఎరువుల్లో కానుగ, వేప, సుంకేసుల, తంగేడు, వెంపలి, అడవిచెట్ల ఆకు ముఖ్యమైనవి. కానుగ ఆకు అన్నిటికన్నా సత్తువ అని, వేప ఆకు వేస్తే పైరు ఎర్రబడుతుందని, సుంకేసుల ఆకు వేస్తే ఉలుగు ఎగుర్తుందని రైతులు అంటారు. కాచిన కానుగ, వేర్లతో వెంపలి వేస్తే బ్రహ్మాండంగా పండుతాను అండిట వరి పొలం. సామెతల్లో ఆకు ఎరువు శ్రేష్టత ఎలా నిరూపింపబడిందో చూడండి.

'చేనికి ఎరువు మడికి మంద'

'పూచిన తంగేడు వేసినా, కాచిన వెంపలివేసినా నేను పండుతానన్నదట వరి'

'పూచిన తంగేడు వేసిరా? కాచిన కానుగ వేసిరా? పండేందుకు అన్నదట చేను' (వ్య. సా. 613)

'వేములు వేస్తే భూములు పండును'

మట్టి - వేప పిండి : ఒకనేల మట్టి ఇంకో నేల ఉండే చేనుకు ఎరువు కాబట్టే రైతులు చెరువుమన్ను, పాటిమన్ను చేలకు తోలుతుంటారు. వేప పిండి కూడా మంచి ఎరువే.

'ఒక రకము నేల ఒక రకము నేలకు ఎరువగును' (క. సా. 338)

'జొన్న పంటకు మన్నుబలం కావాలి' (వ్య. సా. 418)

'పుట్టమన్ను ఎరువైతే పుట్ల కొద్దీ పంట'

'ఏటి మంటికి బీటి మన్ను తోడయినట్లు'

'వేప పిండి పశువుల ఎరువుకు సమానము' (క. సా. 334)

ఎండిన ఎరువులు వృథా అని, మాగిన ఎరువులు మంచివి అని సామెతలంటున్నాయి.

'ఎండిన ఎరువులు ఎందుకూ పనికిరావు' (క. సా. 316)

'మాగిన ఎరువులు బంగారములు' (క. సా. 333)

ఎరువు ఎంత వేసినా, నేల మంచిది కాక పోతే వృథా అని ఈ సామెతలు పోలికలతో సహా చెప్తున్నాయి.

'ఎరువు సతమూ కాదు వాక్కు తోడుకాదు' (బెన్సన్ 2228)

'ఎరువు వేయగానే ఊసరక్షేత్రం ఫలించునా?'

'తువ్వన వేసిన ఎరువు బాపనికి పోసిన నెయ్యి'

3.1.1 (బి) ఆంధ్రప్రదేశ్‌లో పండే పంటలు: ఆంధ్రప్రదేశ్‌లో పండే ముఖ్య ఆహారపంటలు వరి, జొన్న, సజ్జ, రాగి మున్నగునవి. ముఖ్య వ్యాపార పంటలు వేరుశనగ, ప్రత్తి, పొగాకు, మిరప మున్నగునవి. దాదాపు 75 శాతం నుంచి 85 శాతం దాకా ఆహార పంటనే పండిస్తున్నారు.[13]

తెలుగు సాహిత్యంలో ఆయా పంటల్ని గూర్చి చెప్పబడ్డ అంశాల్ని పరిశీలించేందుకు పంటల్ని ఆరు విభాగాలుగా చేశాను. అవి. 1. ఆహారధాన్యాలు (వరి జొన్న, సజ్జ, అరిక, తమిద) 2. పప్పుధాన్యాలు (పెసలు, శనగలు, కందులు, ఉలవలు, మినుములు) 3. నూనె గింజలు (ఆముదాలు, నువ్వు) 4. వ్యాపార పంటలు (చెఱకు, ప్రత్తి, పొగాకు, జనుము) 5. కూరగాయలు-దుంపలు, తదితరములు (మిరప, ఉల్లి, ధనియాలు, చేమ మొ॥వి) 6. తోటలు-పండ్లతోటలు.

ఆహార ధాన్యాలు:

వరి: ఆంధ్రప్రదేశ్‌లో వరి ఆహారధాన్యపు పంటలలో ప్రధానమైన పంట. వరి 38.51 లక్షల హెక్టేర్లలో (1975-76) పండించబడుతోంది.[14] ఆంధ్రులకు వరి అంటే ఎంత ఇష్టమో చెప్పడానికి 'వరి మొలక మొగ మొలక ఒకటి' అనే సామెతే చాలు. వరికి ఖర్చెక్కువ. ఫలితం చెప్పలేము. సారవంతమైన నేల కావాలని 'చెడిన చేను చెరుకు, రాజనాలు పండునా' అనే సామెత చెబుతోంది. 'వరి పొట్టకు పుట్టెడు నీరు' కావాలనే సామెత వరికి నీరు ఎంత అవసరమో చెప్తోంది. 'బోదనం కొట్టితే రాజనం పండును' అనే సామెత వరిపొలాన్ని బాగా చదును చేయాలంటోంది.ఇంటి మనుషులు తప్పనిసరి అనేదానికి 'దిక్కున్న వారికి వరి దిక్కు లేని వారికి జొన్న' (క. సా. 424), వరి పండించడం ఎంత కష్టమో ఒకొకప్పుడు ఎంత నష్టమో 'తరి అంటే వరి అంటారు తరి మెడకు ఉరి' అనే సామెతలు నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాయి. వడ్ల రకాలు 427 (263 + 164)[15]. 'వడ్ల పేర్లు, రెడ్ల పేర్లు చెప్పలేము' అని సామెత. వరి పంట ఏయే సమయాల్లో, ఏయే దశల్లో ఉండేదీ క్రింది సామెతలు తెలుపుతాయి. వరి ఎప్పుడు బాగా పండుతుందో కొన్ని సామెతలు చెపుతున్నాయి.

'అనురాధ కార్తెలో అనాధ కట్టయినా ఈనుతుంది'
'చిత్తకు చిరుపొట్ట'
'కార్తికానికి కరుగు మోపుతుంది'

'మూల కార్తెకు వరి మూల చేరుతుంది'

'పల్లికమ్మ[15]ఎ గడిస్తే తల్లితోన కలుస్తాను'

'ఉప్పు పళ్లు పండితే వరి పంట యెక్కువ' (వ్య. సా. 118)

'కవిలి (కలే) చెట్లు కాస్తే కారు వరి పండుతుంది'

'బలుసు పండితే వడ్లు పండును' (బెన్సన్ 365)

'నీటిముంపుకు నెవ్వరిధాన్యము' పండుతుందని ఒక సామెత (క. సా. 433).

జొన్న : మన రాష్ట్రంలో రెండవ ఆహార పంట. 23.71 లక్షల హెక్టేర్లలో (1975-76) పండించబడుతున్నది.[16] జొన్నలో రకాలు 100.[17] ఇది తక్కువ శ్రమతో పండే పంట కాబట్టే 'దిక్కున్నవారికి వరి, దిక్కులేని వారికి జొన్న' అనే సామెత వచ్చింది. జొన్న బాగా పండుతుంది అనే దానికి 'అన్నం లేకుంటే జొన్న సాగుచెయ్యి' అనే సామెత పుట్టింది. ఒకే పైరు అదే పొలంలో రెండోసారి పెడితే పండదు అనే దానికి 'జొన్న కోలడుగు జొన్నకాదు' (కార్. 391) అనే సామెత సాక్షి. బాగా పండితే జొన్న 'వెన్నుమూరెడు దంటు బారెడు' ఉంటుంది. జొన్న పండనిచోట్ల ఆరిక,కంది పండుతాయని 'పచ్చజొన్నలు, ఐతే ఆరిక, కాకుంటే కంది' అనే సామెత చెబుతుంది. జొన్నలు ఎప్పుడు పండుతాయో ఈ సామెతలు చెప్తున్నాయి. 'తెల్లపూలు పండితే తెల్ల జొన్నలు, బలుసులు పండితే పచ్చజొన్నలు పండుతాయి' (వ్య. సా. 447) 'జానలు పండితే జొన్నలు పండుతాయి'.

రాగి : రాగికే తమిదలు, చోళ్లు అని మరి రెండు పేర్లు. రాగిలో రకాలు18.[18] 3.25 లక్షల హెక్టేర్లలో (1975-76) పండించబడుతోంది.[19] రాగిని గురించి చెప్పే సామెతలివి.

'పైరుకు రాగులు, భాగ్యానికి మేకలు'

'రాగి రాగోరును'

'రాగి పైరు చెంత రమ్యమౌ వరి మొలక రంజిల్ల నేర్చునా'

'పందికి పారు లేదు తమిదకు తప్పులేదు'

సజ్జ : గంటెలు అని మరొక పేరు. జొన్న తర్వాత ముఖ్యమైన పంట. 6,22,400 హెక్టేర్లలో (1975-76) పండించబడుతోంది.[20] సజ్జలో రకాలు 41.[21] 'సద్దలు పండితే సుద్దు లెక్కువ', 'గంటెలు పండిన ఇంట, కణుజు పడిన ఇంట, కరువు లేదు' అని జానపదులు సామెతల్లో చెప్పుకొంటారు.

ఆరిక, కొఱ్ఱ, చామ, బరిగ ఇతర చిరుధాన్యాలు: నిస్సారమైన నేలల్లో కూడా

పండుతాయి ఆరిక 1,16,600 హెక్టేర్లలో, కొర్ర 4,83,500 హెక్టేర్లలో (1975-76) పండించబడుతోంది.[22] ఆరికలో రకాలు 5.[23] ఆరిక పేదవారి పంట. ఇవి పొట్ట నింపగలదే గాని బట్టనివ్వలేదు. అందుకే 'ఆరిక చల్లిన రెడ్డికి అలూమగలకు ఒకటే చీర'. మిగతా పైర్లకు వాన అదనులో పడకుంటే ఆరిక వేయొచ్చు. 'అకాలపు వాన ఆరికకూడు' అని సామెత. 'ఆరికకు చిత్తగండం, ఆడదానికి పిల్లగండం', 'ఆరిక కోస్తే ఇల్లంతా గింజలు, దంచితే దొడ్డి అంతా పొట్టు' అనే సామెతలు ఆరికను గురించి చెపుతున్నాయి. 'కొర్రల సేవ్యం (సేద్యం) కూటికైనారాదు'. 'కొఱ్ఱికు నక్క కొఱ్ఱి' అనే సామెతలు కొర్ర పంటను గూర్చి చెప్పినవి. కొర్రల రకాలు37.[24] చామల రకాలు6.[25] చామలు పండక పోతే ఇంక ఆనేల ఏ పంటకూ పనికిరాదని 'చామలు చల్లి చేను విడవాల' అనే సామెత చెప్తున్నది. 'చామచేలకు పరిగకు పోయినట్లు' అనే సామెత ఆ పని వృథా అని అంటున్నది. బరిగలో రకాలు లేవు. 'బరిగ పంట కడుపు మంట' అని రైతు నమ్మకం.

పప్పుధాన్యాలు : పెసలు, కందులు, ఉలవలు, బొబ్బర్లు, సెనగలు ఇందులో చేరతాయి.

పెసలు : పెసలు 4,82,400 హెక్టేర్లలో (1975–76) పండిస్తున్నారు. ఇవి పేదవాని పంట అని 'పేదవాడా పెసర చల్లుకో' (క. సా. 453) అనే సామెత చెపుతుంది. 'పెసరకు పైరుగాలి (దక్షిణపు గాలి) పసరానికి నోటిగాలి ప్రమాదం' అని మరో సామెత. పెసర రకాలు 21.

కంది : కంది 43,600 హెక్టేర్లలో పండిస్తున్నారు (1975-76). ఆముదాలు పండనిచోటకూడా కందులు పండుతాయని 'అయితే ఆముదాలు, కాకపోతే కంది' అనే సామెత చెపుతుంది. 'కంది పండితే కఱువు తీరును' అంటాడు రైతు. కందిలో రకాలు 29.

ఉలవ : ఎక్కువగా పశువులదాణా కోసం, అరుదుగా మనుషులకోసం. మిగతా మెట్ట పంటలు పండక పోయినా ఇది పండుతుంది. ఉలవ 2,08,300 హెక్టేర్లలో పండిస్తున్నారు (1975_76). 'ఊరు వదిలిపెట్టినా ఉలవ అడుగు వదలకూడదు' అనే సామెత, 'ఉలవ చేను పెట్టిన మగడు ఊరకుండక పత్తి చేను పెట్టి ప్రాణం మీదికి తెచ్చాడు' అనే సామెత ఉలవ సులభంగా పండుతుందని తెలుపుతాయి. నిస్సారమైన నేలలోకూడా పండుతుంది అనేదానికి 'ఉలవకాని పొలం ఊసరక్షేత్రం' అనే సామెత తార్కాణం. ఉలవలో రకాలు 13.

బొబ్బర : అలచంద అని మరోపేరు. నువ్వు పండని నేలలో కూడా బొబ్బర్లు పండుతాయని 'నువ్వు చస్తే బొబ్బర్లు' అనే సామెత తెలుపుతున్నది. బొబ్బర రకాలు 8.

సెనగలు : 73,300 హెక్టేర్లలో (1975-76) పండిస్తున్నారు. వేరే పంటలు పెట్టి చెడిపోతే సెనగలు పైరు పెట్టొచ్చు అని 'చెడదున్ని సెనగలు చల్లమన్నారు' అనే సామెత చెప్తుంది. 'శ్రావణంలో సెనగల పోరు, భాద్రపదంలో బాధల పోరు' అని సెనగల మీద మరో సామెత. సెనగల రకాలు 8.

నూనెగింజలు : నువ్వు, ఆముదాలు ముఖ్యమైనవి.

నువ్వు : 1.49 లక్షల హెక్టేర్లలో (1975-76) పండించబడుతోంది. 'నొచ్చిన వాడా నువ్వులు చల్ల మన్నట్లు' అనే సామెత ఇది బీదవారి పంట అని చెబుతుంది. కాలంలో బాగా పండుతుంది అనేదానికి 'విపరీత నూగుపంట విశేషకాలానికే విస్తారం' అనే సామెత సాక్షి. ఇది విపరీతంగా సత్తువను లాగేస్తుంది అనేదానికి నిదర్శనంగా 'నువ్వుచేలో ఏడు వరిగింజలైనా పండవు' (గ్ర. ల. 925) 'నువ్వువేసిన భూమిలో వులవైనా పండదు' (క. సా. 431) అనే సామెతలు తెలుపుతున్నాయి. నువ్వులో రకాలు 19.

ఆముదాలు : ఈ పంట 5.83 లక్షల హెక్టేర్లలో పండించబడుతోంది. 'అయితే ఆముదాలు కాకపోతే కంది' అనేది ఇది మెట్ట భూమిలో పండుతుందని తెలుపుతుంది. ఆముదపుచేను అంతో ఇంతో ఆదాయం ఇస్తుందనే దానికి 'పగటి మాషాజీకి అనుమతి ఎవరిచ్చారు అంటే నా ఆముదపు చేను ఇచ్చిందన్నాడట' అనే సామెత ఉదాహరణంగా చెప్పుకోవచ్చు. ఆముదాల్లో రకాలు 7.

వ్యాపార పంటలు : చెఱకు, ప్రత్తి, పొగాకు ముఖ్య వ్యాపార పంటలు.

చెఱకు : నీటి ఆదరువు బాగా ఉంటేనే చెఱకు. 1,35,600 హెక్టేర్లలో చెఱకు పండించబడుతున్నది (1975-76). మంచి నేల దీనికి అవసరం. పెట్టుబడి ఎక్కువ పెట్టాల్సిన పంట. ఇది పండితే దరిద్రం తీరుతుంది అని సామెతలు చెపుతాయి. చెఱకులో 2 రకాలు మాత్రమే ఉన్నాయి.

'చెడిన చేను చెరుకు, రాజనాలు పండునా'

'ధనికునికి చెఱుకు పంట దరిద్రునికి నువ్వు పంట'

'చెఱుకు పండితే కొరత లేదు' (క. సా. 418)

ప్రత్తి : ప్రత్తి 2,74,400 హెక్టేర్లలో సాగు చేయబడుతోంది. ప్రత్తి బాగా విచ్చులు తెస్తుందని, పైరగాలి తోలితే బాగా పండుతుందని ఈ పంటకు పని ఎక్కువ అని క్రింది సామెతలు చెపుతాయి. ప్రత్తి రకాలు 12.

'ప్రత్తి పైరు భాగ్యానికి రెండు [illegible]'
'పైర తోలితే ప్రత్తి ఫలించును'
'ఉలవపల్లిన మగడు ఎంచుకొనక ప్రత్తి పెట్టి ప్రాణం తీశాడు'
(వెన్సన్ 441)

పొగాకు : పొగాకు వ్యవసాయంలో ఆంధ్రప్రదేశ్‌ది ప్రథమ స్థానం. 1,58,600 హెక్టేర్లలో సాగుచేయబడుతోంది. 'పొగాకుకు పాటి నేల' అత్యవసరం. ఇందులో రకాలు 15. వాసనే పొగాకుకు ప్రాణం. 'వాసనలేని పొగాకు గూట్లో ఉన్నా ఒకటే నోట్లో ఉన్నా ఒకటే' (నర) అని సామెత.

కూరగాయలు - దుంపలు - ఇతరాలు : ఈ విభజన కింద మిరప, ఉల్లి, ధనియాలు, చేమ, గుమ్మడి, పుచ్చకాయలకు చెందిన సామెతలు చేర్చబడ్డాయి.

మిరప : మిరప పండించటంలో ఆంధ్రప్రదేశ్‌ది ప్రముఖస్థానం. 1,62,300 హెక్టేర్లలో సాగు చేయబడుతోంది. మిరపకాయల్లో చిన్నరకాలకే కారం ఎక్కువని 'గోలకొండ మిరపకాయ' (నర) 'మిరపకాయ చిన్నదని మేళమాడరాదు' అనే సామెతలు తెలుపుతాయి. మిరపలో రకాలు 10.

ఉల్లి : 12.5 వేల హెక్టేర్లలో పండించబడుతోంది. ఈ పంటకు మంచినేల అవసరం అని 'ఉల్లి ఊరినా పల్లి పూసినా మంచి నేలలోనే' అనే సామెత చెపుతుంది. 'మంచి ఉల్లి గడ్డకు మంచి బొడ్డు' అనే సామెతను బట్టి మంచి ఉల్లిగడ్డ లక్షణం తెలుసుకోవచ్చు.

ధనియాలు, చేమ : 'ధనియాల జాతి' అనే సామెతను పరిశీలిస్తే ధనియాలు చెప్పుకింద రాచి చల్లాలి అని తెలుస్తుంది. 'సోమలు తగ్గితే చేమలు ఊరును' అనేది చేమ గడ్డలకు సంబంధించింది.

గుమ్మడి, పుచ్చ తదితరాలు : గుమ్మడి, పుచ్చకాయలకు దోహదక్రియలు, కీడు పనులు తెలుపబడ్డాయి. కనుముకు కాకర, భోగికి పొట్ల బాగా కాస్తాయి. పొట్ల కాయకు పొరుగు గిట్టదు. దాన్ని రాయికట్టి చక్కచేయాలి. చిక్కుడు పాదు బాగా అల్లుతుంది. అంటున్నాయి సామెతలు.

'కాల తంతే పెరిగేది పుచ్చకాయ, కుళ్లేది గుమ్మడికాయ'

'వేలు చూపితే మురిగేది గుమ్మడికాయ, తంతే పెరిగేది పుచ్చకాయ'

'కనుముకు కాకర, భోగికి పొట్ల'

'పొట్ల పాదికి పొరుగు గిట్టదు'

'పొట్ల కాయకు రాయికడితే చక్కనగునుకాని.

కుక్క తోకకు కట్టి ఫలమేమి ?'

'చిక్కుడు గింజకు తన పాదే తెలియదు.'

తోటలు – పండ్ల తోటలు : ఆకు తోటలు, పోక తోటలు, కొబ్బరి తోటలు తోటలు అనే విభాగం క్రింద, మామిడి, అరటి, కొబ్బరి, పనస, నిమ్మ పండ్ల తోటలు అనే విభాగం క్రింద; చర్చింపబడ్డాయి.

ఆకు తోటలు : ఎక్కువగా కడపజిల్లాలో ఉన్నాయి. 'ఆకుతోట సేద్యం అన్ని అవసరాలు తీరుస్తుంది' అని, 'అమ్మకపోతే ఆకులోట, చెల్లక పోతే చెరకు తోట' (వినోదిని, మార్చి 1935) రైతును ముంచుతాయని సామెతలు చెప్తున్నాయి.

పోక తోట : 'పోకలు దక్షిణపు వైపుకు గెలలు వేయవలయును'(క.సా.465) అని ఒక సామెత చెప్తుంది.

కొబ్బరి: 'కొబ్బరికి కుడితి మృత్యువు' అని, 'గువ్వ కూర్చున్న టెంకాయ, గూబ కూర్చున్న కొంప కొరగావు' అని, 'కొబ్బరి గెల దక్షిణపు వైపు మంచిది' అని కొబ్బరితోటలకు సంబంధించిన సామెతలున్నాయి. పండ్లతోటల్లో మామిడిని ప్రధానంగా పేర్కోవచ్చు. 1.35 లక్షల హెక్టేర్లలో మామిడి తోటలున్నాయి. మామిడి కాయలు ఏయే కాలాల్లో ఎంతెంత వుంటాయో స్థానికవిశేషాల్ని పురస్కరించుకొని సామెతల్లో చెప్పబడ్డది. ఇందులో 51 రకాలు, 6 ఉపరకాలు వున్నాయి.

'సంక్రాంతికి సానవగింజంత, శివరాత్రికి శివలింగమంత, ఉగాదికి ఊరగాయ, మొలకల పున్నానికి మాగు కాయ' (నర)

'మార్గశిరాన మామిడి పూత, కోరుకొండ తీర్థానికి కోడి గుడ్డంత, వాడపల్లి తీర్థానికి వడుగుడు పళ్లు' (వ్య. సా. 815)

**అరటి :** 15.8 వేల హెక్టేర్లలో అరటిపంట వేస్తున్నారు. అరటికి నీరు ఎక్కువగా కావాలని, పని ఎక్కువని సామెతలు చెప్తున్నాయి. అరటిగెల ఉత్తరపు వైపుకు వేస్తే మంచిదని రైతుల నమ్మకం. అరటిలో రకాలు 15.

'అరటికి ఆరు గొప్పులు, నూరు తడుపులు'

'ఆరు కొత్తైనలు, మూరు సీళ్లు' (వ్య. సా. 61)
'అరటి గెల ఉత్తరపు పైకి మంచిది' (క. సా. 459)

నిమ్మ : మన రాష్ట్రంలో 32 వేల హెక్టేర్లలో నిమ్మ తోటలున్నాయి. 'నిమ్మకు నీరెత్తినట్లు' . 'నీళ్లలో నిమ్మలు బ్రతికినవి అడవిలో తుమ్మలు బ్రతికినవి' అనే సామెతలు నిమ్మకు నీరు ఎంత అవసరమో తెలుపుతున్నాయి. అంటే నిమ్మ మొదలు ఎప్పుడూ తడి ఆరరాదు అని ఆ సామెతల అభిప్రాయం. ఇందులో రకాలు 8.

పనస : 'పనస పండ్లు పడమటకు కాయవలెను' (క. సా. 465) అనే ఒక సామెత మాత్రమే ఈ పంటకు సంబంధించింది.

3.1.1 (బి) సస్యసంరక్షణ : పైరు ఎదుగూ పదునూచూచి పెట్టడమేకాదు. 'చెప్పింత వ్యవసాయం చేస్తే చెప్పినట్లే వినాలి' (క.సా.89). అంతేకాదు. 'విత్తనాలు వేస్తే విడవక వ్యవసాయము చేయవలెను'. సస్యసంరక్షణను 1. వ్యక్తిగత పర్యవేక్షణ 2. గట్లు వేయడం 3. కంచె వేయడం 4. కలుపుతీత 5. ఊరు గాలువ తీయడం 6. పశువులు, పక్షులు, కీటకాల్నుంచి రక్షించుకోవడం 7. మనుషుల బెడదనుంచి రక్షించుకోవడం అనే శీర్షికల క్రింద పరిశీలించవచ్చు.

1. వ్యక్తిగత పర్యవేక్షణ : విత్తనం చల్లిననాటినుంచి రైతు పొలాన్ని దిన దినమూ బిడ్డలా చూచుకుంటే తప్ప ఫలితం చేతి కందదు. సమయానికి నీళ్లు పెట్టడం, కలుపు తీయించడం, కూలీలచేత పనులు చేయించడంలాంటి పొలం పనులన్నీ వ్యక్తిగత పర్యవేక్షణ లేందే జరగవు. అందుకే 'ఎంచిన ఎరువేదిరా అంటే యజమాని పాదమే' అని చెప్పబడింది. 'నన్ను చూస్తే నిన్ను చూస్తానంటుంది' వరి రైతుతో అంతేకాదు. రైతు ప్రతి దినమూ పొలం చుట్టూ 'తిరిగితే వరి పొలం, తిరుగక పోతే అడవి పొలం' అని కూడా చెప్పబడింది.

2: గట్లు వేయడం : పొలంలో నీళ్ల నిలిచేందుకు, ఇతరుల పొలం నుంచి వేర్పరచేందుకు, పైరు చూస్తూ రైతు పొలంవెంట తిరిగేందుకు, మెట్టపొలం అయితే ఎద్దుల్ని మేపు కొనేందుకు గట్టు అవసరం. వరిపొలాల్లో ప్రతి 'కారూ' ఎలుకలు గట్లను తోడి వేస్తూనే ఉంటాయి. వాటిని సరిచేసేందుకు కూడా గట్లు వేయడం అవసరం. గట్టుమీద బలిసిపోయిన గడ్డిని కత్తిరించడం, వెడల్పైపోయిన 'గనిమ' ను సన్నగా చెక్కడాన్ని 'అండతీయడం' అంటారు. నిపుణుడైన రైతు అండతీస్తే గట్టు అందంగా, గిరిగీచినట్లు ఉంటుంది. అండతీసిం తర్వాత బురదతో గనిమకు పూతపూస్తారు. దీన్ని 'గనెము పెట్టడం' అంటారు. గట్టు పొలానికి

ఎంత అవశ్యకమో, అది లేకపోతే ఎంత ఇబ్బందో ఈ సామెతలు చెప్తాయి.

'మడికి గట్టు ఇంటికి గుట్టు'
'మడికి గట్టు మాటకు గుట్టు'
'అబ్బలేని బిడ్డ గట్టులేని చేను'
'చేనికి గట్టు ఊరికి కట్టు ఉండాలి'.

3. కంచె వేయడం: పశువుల్నుంచీ దొంగల్నుంచీ వీలైనంత వరకూ కాపాడేందుకు కంచె అవసరం. పొలంచుట్టూ నాటే కంపనే 'కంచె' అంటారు. విత్తనాలు చల్లక ముందే కంచెవేయాలి. 'కంచె వేసినదే కమతము' అని, 'కంచె లేని చేను కన్న తల్లిలేని బిడ్డ ఒకటే' నని, 'జెముడు కంచెకు శ్రేష్ఠం, రేగడ చేనికి శ్రేష్ఠం' అని సామెతలు కంచె ప్రాధాన్యాన్ని నొక్కి చెప్తున్నాయి. 'వెలుగు పంటను గాచు' (వ్య. సా. 853) అని కూడా రైతుల అభిప్రాయం.

4. కలుపు తీత : పైరు పెట్టినప్పటినుంచి పైరుకు అందాల్సిన ఎరువును స్వాహాచేసే పరాన్నభుక్కులు కలుపుమొక్కలు. వరిమడిలో కలుపుమొక్కల్ని పీకివేయడాన్ని 'కలుపు తీయడం' అంటారు. వరిలోని కలుపుమొక్కలు ఊదర, తుంగ, భోగావతి మొ॥నవి. మెట్ట పొలాల్లో పెరిగే కలుపు మొక్కలు గురుగు, చెంచలి, తుమ్మి, వివిధ రకాల గడ్డి. గడ్డి రకాల్లో ఒకటైన 'గరిక' చాలా మొండి జీవం. కడవేరు మిగిలినా చిగిరిస్తుంది. వరిలో కలుపుతీత ఆడకూలీలు చేస్తారు. వేరుశెనగ, మిరప, వంకాయ లాంటి పొలాల్లో 'తొల్లిక' తో గడ్డి త్రవ్వివేస్తారు. వేరుశనగలో గుంటకతోలడం కూడా అందుకే. 'వరి చెడి ఊదర బలిసినట్టు' అనే సామెతకు పిట్టకథ ఒకటి రైతులు ఇలా చెప్తారు (ఈ పిట్టకథ మా అమ్మ శ్రీమతి పి. లక్ష్మమ్మగారు చెప్పింది). శ్రీరాముడు కాపువారిని (ఇక్కడ రెడ్లు మాత్రమే) వరిమొక్కల్ని వారి బిడ్డల్ని తెమ్మన్నాడట-దీవించేందుకు. వారు ఊదరకర్రలనూ, దాసరివారి పిల్లల్ని తీసుకవెళ్లారట. రాముడు దీవించాడు. అందుకే ఊదరకంత గట్టి ఆయుస్సు-దాసరివారి పిల్లలకు రోగాలు రాకుండడం. కలుపు తీత ఆవశ్యకాన్ని చక్కనిసామెతల్లో మతపరంగానూ, కుటుంబ పరంగాను అన్వయించి చెప్పారు మన పెద్దలు. చివరి సామెత పగలల్లా నడుం వంచి కలుపు తీయడం ఎంత కష్టమో ఒక జానపద స్త్రీ చెప్పినమాటలు.

'కలుపు తీయని మడి దేవుడు లేని గుడి'
'కలుపు తీయనివానికి కసవే మిగులును'

'కలుషముతో నిండిన మనిషి కలుపుతో నిండిన భూమి
వృద్ధికి వచ్చుట కల్ల' (క. సా. 482)
'వరి చెడి ఊదర బలిసినట్లు'
'వరి వడ్డుకేసి తుంగ నాటు పెట్టినట్లు'
'కలుపు తీయని పైరు కట్ట చేయదు'
'కలుపు తీసిన పైరు కనుల పండుగ' (క. సా. 480)
'కలుపు తీసేస్తే బలుపు' (వ్య. సా. 244)
'ముళ్ల చెట్టును ముందరే గిల్లి వేయవలెను' (సా. సా. 370)
'గఱిక మేసిన గాడిద చస్తుంది గాని గఱిక చావదు'
'కడవేరు మిగిలినా గరిక చిగుర్చక మానదు'
'వంగితే తెలుస్తుందమ్మా వరిమడి కలుపు, నిలబడినవానికి నీళ్లు కారతాయా?'

**5. ఊరుగాలువ తీయడం :** మాగాణిమడినుంచి నీళ్ల బయటికి పోయేదారి ఊరుగాలువ. పైరు దాదాపు పండిన తరువాత ఎండబెడతారు, పొలంలో నీళ్లు పెట్టకుండా. పైనుంచి వచ్చి పడే నీళ్లను తీసేందుకు ఊరుగాలువలు తీస్తారు. వీటినే 'వన గాలువలు' అని కూడా అంటారు. వాటి అవసరాన్ని 'ఊరుకాలువ తీసిన మడి వాత వేసిన పశువు అక్కరకు పనికి వచ్చును' (గ్రా. ల. 816) అనే సామెత స్పష్టంగా చెపుతుంది.

**6. పశు, పక్షి, కీటకాదులనుంచి రక్షణ :** కంచెవేసి పశువులనుంచి పంటను రక్షించుకోవచ్చు, కొంత వరకు. కోతులు, చిలుకలు, కాకులు, పిచికలు మొదలైన వాటినుంచి రక్షించాలంటే జొన్న, సద్ద లాంటి పంటల వద్ద 'మంచె' వేసి 'వడిసెల'తో రాళ్లు రువ్వి తరమాల్సిందే. ఇందుకు సాధారణంగా ఆడపిల్లల్ని పంపిస్తుంటారు. కాళహస్తి మాహాత్మ్యంలో మంచెమీద నుంచి వడిసెలతో రాళ్లురువ్వే ఒక చెంచు యువతిని గురించి చెప్పబడివుంది. ఆముక్తమాల్యదలో వరి మడి కాచే గోప బాలికల వర్ణనఉంది. 'చెడ్డ చేనుకు మూడు మంచెలా' అనేది మంచెల ఆవశ్యకాన్ని తెలిపేది. పొట్టకు వచ్చిన వరి కఱ్ఱల్ని ముంగిసలు, పాములు కొట్టి వేస్తాయి. అందుకే మడిలో 'పాయలు తొక్కు'తారు. 'జనుములో పాముపోతే పాతిక నష్టం' అనే సామెత పాములు చేసే పైరు నష్టాన్ని తెలుపుతుంది. ఎలుకలు పంటను నాశనం చేయడంలో అద్వితీయాలు. ఇవి చేసే పంట నష్టాన్ని 'కోతల

కాలంలో ఎలకన్నకు ఏడుగురు పెండ్లాలు', 'తూమెడు వడ్లు తూర్పార బట్టేటప్పటికి ఏదుము వడ్లు ఎలుకలు తినిపోయినవి' అనే సామెతలు అద్దంపడుతున్నాయి. చెట్లల్లో కాయల్ని, పొలంలో కంకుల్ని నాశనం చేసేవి కోతులు. కోతులు చేసే నష్టాన్ని 'కోతుల కాలంలో కోతి బతికింది, తరువాత బతికిందీ బతుకు' అనే సామెత స్పష్ట పరుస్తుంది. పంటను నాశనం చేసే కీటకాల్లో మిడత ఒకటి. మిడతలు చేసే నష్టాన్ని బాగా గుర్తించిన రైతులు 'జడ్డిగంలోనే మిడతపోటు', 'మిడతంబొట్లు రైతుల మిత్రి' అనే సామెతల్ని సృష్టించుకొన్నారు. వరికి ఎక్కువ నష్టం చేసేది చిటకపురుగు. 'వెయ్యి పుట్ల వడ్లకు ఒక చిటకపురుగు చాలును' అని సామెత (బెన్సన్. 374).

7. మనుషుల బెడద: రెండురకాలు. 1. దొంగల బెడద 2. బంధువుల, పరిచితుల బెడద.

దొంగల బెడద: వరిమడిని 'వెన్నుకోత' కోసుకపోవడం; జొన్న, సద్దకంకుల్ని కోసుకపోవడం; వరివాదెలు ఎత్తుకపోవడం; కుప్పలోనుంచి వడ్లు దొంగిలించడం; వేరుశెనగ చెట్లు పెరుక్కపోవడం; వంకాయలు, చామంతులు, ప్రత్తిలాంటివాటిని కూడా దొంగిలించడం పల్లెల్లో సర్వసాధారణ విషయం. ఒక్కొసారి ఇంట్లో మగ వారు లేకపోతే ఆడవారు కూడా 'కావలి' పోవాల్సివస్తుంది. దొంగల విషయాన్ని సామెతలు ఎలా చిత్రిస్తున్నాయో చూడండి. చివరి సామెత ఇంటిదొంగలను బయటవేస్తున్నది.

'కంకి ఎఱ్ఱనయితే కన్నెఱ్ఱనవుతుంది'
'దొంగకు చేను పచ్చిలేదు' (కార్. 1187)
'తోకవడ్లు వెన్నుకోతకు నేస్తం'
'ఓదె కట్టె దొంగ పరిగి ఏరే వానిని బెదిరించినట్లు'
'కుప్ప పీకే దొంగ పరిగ ఏరుకునే వానిని బెదిరించినట్లు'
'చెల్లని దాన్ని చేనుకాడ బెడితే అయిన కంకులన్నీ
అమ్మగారింటికి పంపింది'

బంధువుల, పరిచితుల బెడద : వంగతోట, ఆకుతోట, మామిడితోట లాంటి తోటలు వేసినప్పుడు బంధువులకు కోపి ఇవ్వాల్సి ఉంటుంది, రైతుకు ఇష్టం ఉండదు. ఒక పైసా కూడా వారి దృష్టిలో కష్ట సాధ్యం కాబట్టి. ఒకోసారి పరిచితులో, దారిన పొయ్యే దానయ్యలో కాయల్ని అడగొచ్చు. తిరస్కరించకతప్పదు మరి.

పీల్లేక పోతే ఆకు తోటలో ముదురాకుల్నికోసివ్వడం-అలాగ తప్పించుకొంటుంటారు. ఈ విషయాల్ని చెప్పే సామెతల్లో కొన్ని.

'వంగతోటకాడ మాత్రం వదినా (బావా) అనవద్దు అన్నట్లు'
'బంధువుడవు సరేగాని పైరులో చెయ్యి పెట్టవద్దు'
'వంగతోట వానికి కనిగ్రుడ్డి, ఆకుతోటవానికి విని చెప్పడు'
'తోటల మీద వారికి, ఓటలమీది వారికి మొగమాట ముండరాదు'
'పోరాని చుట్టమువచ్చాడు, బొడ్డు వంచి తమలపాకులుకోయమన్నట్లు'

3.1.1. (ఎ) వర్షం : 'అంగట్లో అన్నీ ఉన్నా అల్లుని నోట్లో శని' ఉన్నట్లు వానలేక పోతే సేద్యం ఏ మాత్రం జరగదు. మెట్టకైనా, మాగాణికైనా అదునులో పదును వాన పడితే విత్తనాలు ఆరంభమవుతాయి. ఆంధ్రప్రదేశ్‌లో వర్షపాతం సం॥నికి సగటున 890 మి. మీ; కోస్తా ఆంధ్రలో 995.7 మి. మీ; రాయలసీమలో 670.4 మి. మీ; తెలంగాణాలో 893.2 మి. మీ.24

రైతుకు వానే ప్రాణం. అదునులో వాన రావాలని 'కప్పల దేవర' 25 చేస్తాడు. నడివీధిగంగమ్మకు కుంకుమా, పసుపూపెట్టి సాటొక్కకడవ నీరు పోస్తాడు. చెరువు నిండితే దున్నపోతునో, వేటల్నో 'అగతి' (బలి) చేస్తారు రైతులు. వాన దేవుణ్ని 'వానల్లు కురవాలి వాన దేవుడా పంచేలు పండాలి వాన దేవుడా' 26 అనో, 'కారు మేఘమా రావేరావే పువ్వుల పుబ్బల మబ్బా దిగవేదిగవే, పింజ మేఘమా ధూళి మేఘమా చెమటను ఊడ్చి దిమ్మరింపవే' 26ఎ అని ప్రార్థిస్తాడు రైతు. 'నెలకు మూడు వానలు, విండారు పంటలు' (క. సా. 25) అని తెలిసిన రైతు 'వానలుంటే పంటలు. లేకుంటే మంటలు' అని బాధపడరాడు. నిజానికి 'తల్లిముఖం చూడని బిడ్డ, వానముఖం చూడని పైరు' ఒకటే. అనవసరమైన చవిటినేలమీద వానకురుస్తుందని 'వాన బడాయి చవిటి మీద, మాల బడాయి పాటి మీద, మొగుడి బడాయి ఆలిమీద' అనే సామెత తెలుపుతుంది.

'వానరాకడ ప్రాణం పోకడ తెలియదు' అనే సామెత వానల అనిశ్చితత్వాన్ని తెలిపినా, మన పెద్దలు వారి అనుభవసారాన్ని పురస్కరించుకొని, ఏయేనెలల్లో, ఏయే కార్తెల్లో వానపడుతుందో; అందువల్ల లాభమో, నష్టమో సామెతల్లో తెలిపారు. సంవత్సరంలోని 27 కార్తెల్లో వాన వచ్చేవిధాన్ని చెప్పారు. కార్తెలకు ప్రాధాన్యం జానపదుల్లో ఎంత ఉందంటే. అదునుకాలాన్ని లెక్కగట్టడంలో కూడా వారు కార్తెల్నే పురస్కరించుకొని సేద్యపు పనులకు సిద్ధమవుతారు. ఒక్కొక్క

కార్తె ఒక్కొక్క కులం వారిది అని వారి విశ్వాసం. 'భరణి' మాదిగవారి కార్తె అని, 'ఉత్తర' కాపు వారిదని, 'హస్త' గొల్ల వారిదిగా; 'చిత్త' కురవలదిగా, 'స్వాతి' చాకలి వారిదిగా చెపుతారు నెలల్ని బట్టేగాక గ్రహాల్ని బట్టి, సూర్యుడు ఆయా రాశుల్లో సంచరించడాన్నిబట్టి, పండుగదినాల్ని, ఇంద్రధనుస్సూ, చంద్ర పరివేషం బట్టి, ఆకాశం రంగునుబట్టి, ఉరుములు మెరుపుల్నిబట్టి, మేఘాల్నిబట్టి, దినాన్ని-వేళనుబట్టి. గొల్లకంపుగాలినిబట్టి; పశుపక్షికీటకాదుల ప్రవర్తననుబట్టి; ఇంకొన్ని స్థానిక విశేషాల్నిబట్టి వాన రాకడను జానపదులు నిర్ణయించుకొన్నారు. ఆ విషయాల్ని విపులంగా వేర్వేరు శీర్షికల క్రింద పరిశీలిద్దాం.

గ్రహాల్ని బట్టి: సూర్యుడు, బుధుడు, చంద్రుడు కలిస్తే వాన వస్తుందని, శుక్ర శని గ్రహాలు కలిస్తే వాన తప్పదని, శుక్రుడు స్వాతి నక్షత్రాన్ని చేరితే వాన కురుస్తుందని, శుక్రుడు పుట్టేటప్పుడు గురుడు అస్తమిస్తే, అంగారకుడు, శని సంచరిస్తే వాన తప్పదని సామెతలు.

'పెద్దవాడు27 పదుచువాడు28 మామ29 తోన కూడిరేని
వంచనింతలేక వాన వచ్చును' (బెన్సన్. 197)
'గుడ్డివాడు30, నడ్డివాడు31, మామతోన గూడిరేని
వంచనింతలేక వాన వచ్చు' (బెన్సన్. 198)

'స్వాతిగతిః శుక్రేయ వాత వృష్టిః' (బెన్సన్. 199)
'గురోరస్తంగతే వృష్టిః వృద్ధిస్యాద్భార్గవోదయే' (బెన్సన్. 200)
'అంగారకస్య చలనేత్యాభిక్ వృష్టి వా శనైశ్చరే' (బెన్సన్. 201)

సూర్యుడు ఏయేరాశుల్లో సంచరిస్తే వానరాకడ ఎలా వుంటుందో చెప్పబడింది. కర్కాటకరాశిలో సంచరిస్తే వానవస్తుందని, సింహరాశిలో సంచరిస్తేరాదని, తులారాశిలో సంచరిస్తే ఎడతెగనివాన కురుస్తుందని చెపుతుంది క్రింది సామెత.

'కన్యాభిన్నే శరావృష్టిః అభిన్నే కర్కాటే కుధా
సింహ్మోభిన్నే అనావృష్టి: .... భిన్నే నిరంతరం' (బెన్సన్. 202)

ఏయే నెలల్లో వాన వస్తే మంచిదో, చెడ్డదో సామెతలు తెలుపుతాయి. తులా, కర్కాటక మాసాల్లో వానవస్తే పంటలు పండుతాయట. మాఘ ఫాల్గుణ మాసాల్లో వర్షం వృధా అట.

'తులా32 వృష్టిర్ధరా ధాన్యా' (బెన్సన్ 183)
'కటం33 చిందిస్తే పేరికాటకము బందు'

'మాఘ[34] మాసపు వాన మగడులేని వాన'

'ఫాల్గున[35] మాసపు వాన పదిపనులకు చెఱుపు'

కొన్ని పండుగదినాలు ఆధారంగా వాన విషయం తెలిపే సామెతలు ఈ క్రిందివి. మార్గశిర అమావాస్యకు, దీపావళికి, కార్తీక పౌర్ణమికి వానలు పోతాయి. జ్యేష్ఠ బహుళ ఏకాదశికి వరదలొస్తాయి. సంకురాత్రి మబ్బులు వృథా

'దండి అమావాస్యకు వాన తాడు తెంపుకొని పోతుంది'

'దీపావళికి వర్షాలు ద్వీపాంతరాలు దాటుతాయి'

'కార్తీక పౌర్ణమికి వానలు కడలికి పోవును' (వ.సా.242)

'కట్టుకోలు ఏకాదశికి కట్టె కంప కొట్టుకొస్తుంది'

'సంకురాత్రి మబ్బులు, మాలవాళ్ల ఉబ్బులు'

వానల విషయం కార్తెలకు అనుసంధించి 132 సామెతల్లో చెప్పబడగా, 111 సామెతల్లో మాత్రం వివిధ విషయాల్తో అన్వయించి చెప్పబడ్డాయి. రైతులు కార్తెలకు ఇచ్చే ప్రాముఖ్యాన్ని ఈ ఒక్క విషయంతోనే మనం అంచనావేసుకో వచ్చు. 27 కార్తెల్లో ఉత్తరాషాఢనుంచి ఉత్తరాభాద్ర వరకు (జనవరి 10 నుంచి మార్చి 27 దాకా) ఉన్న ఆరు కార్తెల విషయం చెప్పబడలేదు. వాటిల్లో బొత్తిగా వర్షం ఉండదు కాబట్టి. అశ్వనిలో స్వల్పంగా వర్షం వస్తుంది. భరణి, కృత్తికల్లో వాన పంటలకు మంచిది. మృగశిర కురిస్తే ముంగారు పండుతుంది. ఆరుద్ర వాన అదును వాన. పునర్వసు పుష్యమిల్లో స్వల్పవర్షం. ఆశ్లేష వాన అరికాలు తేమంతే. మఖ, పుబ్బలు వరుసైతే గొప్పకరువు. పుబ్బకెరలితే భూతం కెరలినట్లే. వృష్టికి ప్రమాణం ఉత్తర హస్తలు; హస్తమి అతి వాన కాలం. చిత్త చినుకులు ఎక్కడ పడితే అక్కడనే. చిత్త స్వాతి సందు చినుకులు చాలినంత వాననిస్తాయి. స్వాతి కురిస్తే మంచిపంట. విశాఖ వర్షం చీడలకు వృద్ధి. అనూరాధలో తడిస్తే పంటకు మంచిది. జ్యేష్ఠ చెడకురుస్తుంది. మూల కురిస్తే ముంగారి పాడు అవుతుంది. పూర్వాషాఢ వానలకు దిబ్బలు కూడా కరిగిపోతాయి. రేవతి వర్షం రమణీయం. ఇవీ, మరికొన్ని విశేషాలు క్రింది సామెతలు చదివితే బోధపడతాయి.

'అశ్వని కురిస్తే అడుగు తడవదు'

'అశ్వని కురిస్తే ఒక అశివిలోకి చాలదు' (బెన్సన్. 185)

'అశ్వని కురిస్తే అంతా నష్టం'

'భరణి కురిస్తే ధరణి పండును'

'కత్తెరలో వాన కనకపు పంట'

'కత్తెర పోటుకు కదలబారుతుంది' (వ్య.సా. 223)

'రోహిణిలో రోళ్లు చిగుర్చునన్నా చిగిరిస్తవి (వానతో)
రోళ్లు పగులనన్నా పగులుతవి' (ఎండతో)

'మృగశిర కార్తెలో ముంగిళ్లు చల్లబడును'

'మృగశిర కురిస్తే ముంగారి పండును'

'మృగశిర కురిస్తే ముసలి ఎద్దు అంకె వేయును'

'మృగశిర చిందిస్తే అయిదు కార్తెలు వర్షించును' (క.సా. 136)

'ఆరు కార్తెలకు పోతు ఆరుద్ర కార్తె'

'ఆరుద్ర కురిస్తే దారిద్ర్యము లేదు'

'ఆరుద్ర వాన అదను వాన'

'ఆరుద్ర చిందిస్తే అరవై దినాలు వఱపు'

'పునర్వసు పుష్యాలకు పూరేడు అడుగైన తడవదు'

'పునర్వసు పుష్యాల వర్షము పూరేడు పుత్తి తడవదు'
(గోభూమి, ఉగాది 1950)

'ఆశ్లేష ముసలి కార్తె ఆగి ఆగి తుంపరకురియును'

'ఆశ్లేషలో అడుగుకొక చినుకైనా అడిగినన్ని వడ్లు'

'ఆశ్లేష వాన అరికాలు తేమ' (క.సా. 159)

'మఖ పుబ్బలు వరపిచ్చె మహత్తర క్షామం వచ్చె'

'ఉత్తర చూచి ఎత్తరగంప హస్తమించి పాయనా' (బెన్‌సన్. 150)

'మఖాపంచకము సదా వంచకము' (బెన్‌సన్. 146)

'వానలకు ఋతువు మఘ' (క.సా. 160)

'పుబ్బ ఉబ్బుబ్బి కురిసినా గుబ్బచ్చి చెట్టుకింద నానదు'

'పుబ్బ కెరలితే భూతం కెరలినట్లు

'ఉత్తర ఉరిమితే ఎత్తరగంప' (బెన్‌సన్. 215)

'ఉత్తర ఉరిమి కురిసినా పాము తరిమి కరిసినాతిరగదు' (శ్రీపాద)

'ఉత్తరే పూర్వ సస్యాని, అపరసస్యానిరేవతే' (బ్రౌణ్యం)

'వృష్టి ప్రమాణం ఉత్తర హస్తలు'

'అన్ని కార్తెలు తప్పినా హస్త తప్పదు'

'హస్త ఆదివారమునాడు వచ్చింది చచ్చితిమయ్యా గొల్లవోయ
ల్లారా మీయాండ్లునైన అమ్మి అడ్డకొట్టాలు వేయించండి'
(అన్నవట గొర్రెలు) (డెన్‌సన్. 1591)

'హస్త చిత్తలు వఱపయితే అందటి పేద్యం ఒకటే'

'చిత్తవాన యాడపడితే ఆడనే' (డెన్‌సన్)

'చిత్తస్వాతి సంధించినట్లు' (ఎక్కువవానలు)

'చిత్తస్వాతులు కురవకుండా పుంటే పిగురుటాకులు కూడా మాడి
పోవును' (క.సా. 20)

'విశాఖ కురిసిన విషముపెట్టినట్లు'

'విశాఖతో మబ్బులు మజ్జిగతో భోజనము సరి'

'విశాఖ వరుషం కురిస్తే దున్నపోతులకు, మాదిగె వాండ్లకు,
ఆమిదాలకు బలం' (డెన్‌సన్. 43)

'విశాఖ వర్షం వ్యాధులకు హర్షం' (వ్య.సా. 838)

'అనూరాధలో తపిస్తే ఆడది మగవాడౌతాడు'

'జ్యేష్ఠ చెడకురియును, మూల మురుగ కురియును'

'మూలకార్తెలో కురిస్తే ముంగారు పాడు'

'గబ్బరీదు (పూర్వాషాఢ) కార్తె వర్షాలకు దిబ్బలుకూడా కరుగుతాయి,

'రేవతి వర్షం రమణీయం

దినాన్నిబట్టి. వేళనుబట్టి వర్షం విషయం చెప్పబడింది. శనివారం వానవస్తే వారం దినాలు వదలదని, సాయంత్రం వచ్చిన వాన త్వరగాపోదని, ప్రొద్దున వచ్చిన వాన నిలువదని సామెతలు. ప్రొద్దున వచ్చిన వాన త్వరగాపోదని పాఠాంతరం.

'శనివారపువాన శనివారమే విడుచును'

'ఉప్పుతో తొమ్మిది వున్నా శనివారపు జడికి శష్పం పెరగదు'
(వ్య.సా. 117)

'ప్రొద్దున వచ్చిన బంధువూ, వాన నిలువవు' (కార్. 2490)

'సాయంకాలపువాన, ముసలివాన త్వరగా పోవు' (క.సా. 271)

'ప్రొద్దు పొడుపున వచ్చిన వాన పొద్దుగూకి వచ్చిన చుట్టంపోరు'

చంద్రునిచుట్టూ గుడికట్టినతీరును బట్టి వానరాకడ ఊహించబడింది.

'చంద్ర పరివేషము వర్షయోగము'

'దూరంగుడి కట్టితే దగ్గర వాన-దగ్గర గడితే దూరపు వాన'

ఇంద్రధనుస్సు ఆధారంగా వానరాకడను సూచించే సామెతలున్నాయి. తూర్పున కొర్రు ఒడ్డితే వానలు రావని, పడమర ఒడ్డితే మంచి వర్షం పడి వడ్లు బాగా పండుతాయని; ఇంద్రధనుస్సు కనిపించిన పది దినాలకు వాన వస్తుందని; పదిహేను దినాలు కురుస్తుందని సామెతలు చెప్తున్నాయి.

'తూర్పున ఇంద్రధనుస్సు దూరాన వర్షం'
'తూర్పున కొఱ్ఱు వేస్తే దుక్కి-ఎద్దు అంకె వేస్తుంది'
'తూర్పున ధనుస్సు వేస్తే తుంగ మడిలోను, పడమర ఇంద్రధనస్సు వే_ బండ మీదను పశువులను కట్టాలి'
'తూర్పున తెర వేసింది తుంగభద్రలో దొడ్డి కట్టరా గొల్లవాడా'
'పడమట కొఱ్ఱు బడితే వందిళ్ల మీద రాజనాలు పండుతాయి'
'పడమట కొఱ్ఱువేస్తే పాడి ఆవు అంకె వేస్తుంది'
'శింగిడి లేస్తే పదిహేను దినాల వర్షం'
సింగిణి వేస్తే పది దినములకు వాన' (క. సా. 229)

ఆకాశం రంగును బట్టి వాన రాకడ సూచించబడింది కొన్ని సామెతల్లో. ఉదయపు ఎరుపు వర్షసూచకమని, సాయంత్రం ఎరుపు వరుపును తెలుపుతుందని, ఆకాశం ఎర్రబడితే వానలు వస్తాయని చెప్పబడింది.

'ఆకాశమునకు వుదయపు ఎరుపు వర్ష సూచకము' (క. సా. 229)
'నింగి సాయంత్రము ఎర్రనయితే వచ్చే వానలుకూడా రావు' (క. సా. 254)
'ఎఱ్ఱని ఆకాశానికి బఱ్ఱున వానలు'
'కన్ను ఎఱ్ఱబడ్డా, మిన్ను ఎఱ్ఱబడ్డా కారక మానదు'

మేఘాలరంగును బట్టి, అవి తిరిగే దిక్కునుబట్టి ఆగడపలు వేయడం బట్టి వాన రాకడ తెలుపబడింది. ఉత్తర, దక్షిణ, పడమటి దిక్కుల్లోను, ఈశాన్య మూలలోను మబ్బులాడితే వాన వస్తుందని; అగడపలు వేస్తే వాన వస్తుందని చెప్పబడింది. అగడపలు వేస్తే వాన రాదని 2 సామెతలు చెప్తున్నాయి.

'నల్ల మొగులు వాన కొట్టదు, నవ్వు మొగమువాడు దానము చెయ్యడు' (హైసా. VIII-I)
'అమోఘా దక్షిణా మేఘాః' (వెన్సన్. 230)

'దక్షిణాన మబ్బుసాగితే వాన తప్పదు'

'పడమరకు పార్శ్వ పిట్టంత మేఘము నడిస్తే పాతాలం బద్దలు కొట్టుతుంది' (బెన్‌సన్ 229)

'పడమట పూరేడు పిట్టంత మొయిలు, బండలు దొర్లించే వాన'
(వ్య. సా. 546)

'ఉత్తరాన మబ్బు ఏలితే ఊరకే పోదు'

'కర్తెమూల మబ్బు కారక మానదు'

'ఆకాశంలో గొర్రె త్రొక్కుడు పడితే అతి సమీపంలో వర్షం'

'ఆగడపలు వేసినవి అత్తా అంటే అట్లకు బియ్యం నాన బొయ్యి కోడలా అన్నదట'

'పులిబారలు పేశాయి అత్తయ్యా అంటే పుడిసెడు వెనక్కు తీయవే కోడలా అన్నదట'

'ఆగడపలు వేసినవి అత్తా అంటె చేరెడు వెనక్కు కోడలా అన్నదట'

ఉరుములు, మెరుపుల్ని ఆధారంగా తీసుకొని వాన విషయం తెలుపబడింది. మెరుపు వర్షసూచకమని కొన్ని సామెతలు, వరుపుకు సూచకమని కొన్ని; ఉరిమితే వాన కురవక తప్పదని కొన్ని సామెతలు చెపితే, దానికి వ్యతిరేకంగా కొన్ని. ఈ విరుద్ధ అభిప్రాయాలు స్థానిక పరిస్థితుల్నిబట్టి ఏర్పడి ఉండవచ్చు.

'పడమట మెరిసిన పది గడియలకు వర్షం' (క. సా. 256)

'పడమట మెరిస్తే పంది అయినా నీళ్లకు దిగదు'

'కార్తెమూల మెరుపు కార్తెకు బలం'

'మెఱుపు కొద్దీ వర్షము'

'వట్టి గొడ్డుకు అరుపులు మెండు, వరపుటేటికి మెరుపులు మెండు'
(కార్. 1934)

'ఉరిమితే కురియక మానదు' (క. సా. 232)

'ఉరిమిన మబ్బు తరిమిన పాము ఊరకే పోవు'

'సముద్రంపై ఉరిమితే వాన తప్పదు'

'వానకన్నా ముందు ఉరిమే ఉరుమును మాటకన్నా ముందు ఏడ్చే ఆడదాన్ని నమ్మరాదు' (నర)

'వట్టి గొడ్డుకు అరుపులెక్కువ, వానలేని మబ్బుకు ఉఱుము లెక్కువ'

గొల్లకంపు గాలి కొట్టినా, మలమీద నల్లబడినా, మొయిలు మేసినా వాన తప్పదని చెప్పబడింది.

'గొల్లకంపుగాలి కొట్టింది అత్తగారూ ! అంటే, అంటు అయినది
కుండల్లో నీరు పారబోయి కోడలా ! అన్నదట'

'మల నల్ల బడితే వాన, చన్ను నల్ల బడితే బిడ్డ'

'కనుమల మీద మొయిలు మేస్తే కళ్ల ముందర వాన'

పశువుల, పక్షుల, కీటకాల ప్రవర్తనను బట్టి కూడా వాన రాకడను పెద్దలు సామెతల్లో సూచించారు. గొర్రెలు గుంపుకూడినా, కోడి రెక్క ఆరవేసినా, కల్లు చట్టంలో పొడగువ్వ పడినా వానరాకడ అని; తూనీగలు, తుమ్మెదలు ఆడినా, ఓటి కుండలో వఱడు పలికినా, ఎండునేలమీద ఎంద్రకాయ కనబడినా, వరి పట్టుకట్టినా వర్షం తప్పదని చెప్పబడింది. 'కాకి గూడు పెడితే కడపటి వర్షం' అని ఒక సామెత.

'గొఱ్ఱెల గుంపు కూడితే గొప్పవాన'

'కోడి రెక్క ఆరవేస్తే గొప్పవాన'

'కల్లుచట్టిలో పొడగువ్వ పడితే వానరాకడ'

'తూనీగలాడితే తూమెడు వర్షం'

'తుమ్మెదలాడితే వాన తప్పదు'

'ఓటి కుండలో వఱడు పలికితే వచ్చింది వాన'

'ఎండునేల మీద ఎంద్రకాయ కనబడితే వాన తప్పదు'

'వరి పట్టు కడితే వర్షం గొప్ప'

స్థానిక విశేషాలకు అన్వయించుకొని వానరాకడను చెప్పుకోవడం జరిగింది. బందరు మూల మెరిస్తే వాన కురవదని, మంగళగిరి మూల మబ్బు కనపడినా, మేదరసాల దుర్గం మీద, వండాడి కొండన, కనుగొండన మొయిలు మేసినా వాన తప్పదని ఆయా ప్రాంతాల వారి భావన. ఉద్దగిరి గాలిదొల్లితే కరువు అని ఒక సామెత.

'బందరు మూల36 మెరిస్తే బక్క గొడ్డును అమ్మిస్తుంది'

'మేదరసాల దుర్గం మీద మేకకాలంత మొయిలు మేస్తే తుళ్లూరు,
దొండపాడు కాడ దూడ కట్ట అయినా కాదు' (బెన్సన్ 235)

(ఈ సామెతలోని ఊర్లు కృష్ణాజిల్లాలోవి)

'మంగళగిరి మూల మాడంత మబ్బు పట్టితే ఈమని జంపని ఈతలు
మోతలు' (బెన్‌సన్ 236)

'కనుకొండ మొగిలి మేసే కానుకు పడి బియ్యం' (బెన్‌సన్ 237)

'వందాడి కొండన[37] మొగిలి మే సే వాన వస్తుంది' (నర)

'ఉద్దగిరి గాలి దొల్లితే గుంటలలో నీళ్లు ఉండవు' (బెన్‌సన్ 239)

(బెన్‌సన్ : 236, 237 సామెతల్లో చెప్పబడిన ఊర్లు కృష్ణా జిల్లాలోవి. 239 లో చెప్పబడిన ఊరు నెల్లూరులోది)

3 1.1 (ఏ) ఇతర వాతావరణ విశేషాలు : ఆంధ్రదేశంలో ఏడాదికి మూడు ముఖ్యమైన కాలాలు. 1. వేసవికాలం(మార్చి - జూన్) 2. వర్షాకాలం (జూలై - అక్టోబర్) 3. చలికాలం (నవంబర్ - ఫిబ్రవరి). మే నెలలో ఉష్ణోగ్రత అధికతమం కాగా, జనవరిలో అల్పతమం.[38] వర్షానికి సంబంధించినవే గాక ఎండ, చలి, పగలు తక్కువ ఉండడం, వెన్నెల గురించి జానపదులు సామెతలు చెప్పుకున్నారు. వేసవి : పుష్యమాసంలో వేసంగి కొద్దిగా మొదలవుతుందని, శివరాత్రికి కొద్ది పెట్టగా ఉంటుందని, మాఘమాసంలో కొద్దిగా ఎండ ఉంటుందని, చెప్పబడింది. భరణి, రోహిణి, చిత్త కార్తెల్లో ఎండ అమితమని కూడా చెప్పబడింది. ఏ కాలంలోనైనా మబ్బు విడిచిన ఎండ ఎంత తీక్షణమో హృద్యమైన పోలికల్లో తెలుపబడింది.

'పుష్యమాసానికి పూసంత వేసంగి'

'శివరాత్రికి చింతాకంత వెట్ట'

'మాఘమాసంలో మదురు మీద గడ్డి ఎండుతుంది'

'భరణి ఎండలకు బండలు పగులును'

'రోహిణిలో రోళ్లు పగులును'

'చిత్త ఎండకు పిట్ట తలపగులును'

'మొయిలు విడిచిన ఎండ - మొగుడు విడిచిన ముండ - పట్టివిడిచిన మండ - యెత్తి విడిచిన కుండా - తీక్ష్ణము'

'మబ్బు విడిచిన యెండ - మగని విడిచిన ముండ-పట్టివిడిచిన మండ'

'అబ్బలేని బిడ్డ - మబ్బు విడిచిన ఎండ'

చలి విషయం కార్తెల ఆధారంగా గాక కొన్ని పండుగ దినాల ఆధారంగాను, కొన్ని నెలల ఆధారంగాను చెప్పబడింది. మహాలక్ష్మి పండుగకు కొద్దిగా, కోర్ల పౌర్ణమికి, సంక్రాతికి, శివరాత్రికి చలి ఎక్కువగా ఉంటుంది. సంక్రాంతికి కొద్దిగా చలి తగ్గుతుంది. ఉగాదికి పూర్తిగా పోతుంది.

'మహాలక్ష్మి పండుగకు మాదెత్తు చలి'

'దీపావళికి దీపమంత చలి'

'కోర్ల పౌర్ణమికి కోరల బట్టి పీకుతుంది చలి' (గోభూమి నవం. 49)

'సంక్రాంతికి చంకలెత్తకుండా చలి'

'శివరాత్రికి చంకలెత్తనీయదు'

'శివరాత్రికి చింతగింజలంత చలి'

'సంకురాత్రికి సాసవగింజంత తగ్గుతుంది, శివరాత్రికి శివాశివా అని పోతుంది' (నర)

ఉగాదికి ఊడ్చుకొని పోతుంది' (నర)

'మార్గశిరాన మహాంతమైన చలి' (వ్య. సా. 725)

'మాఘమాసములో మ్రాకులు సైతము వణకును'

'మాఘమాసపు చలి మంటలోపడ్డా తీరదు'

'ఇప్పపూతపూసేకాలం నిప్పుల్లో పడినా చలిపోదు' (నర)

వెన్నెలకు సంబంధించిన సామెతలు రెండు మాత్రమే దొరికాయి. అందులో ఒకటి స్థానికమైనది. ధూళికి సంబంధించిన సామెత ఒకటి ఉంది.

'రాత్రికి వెన్నెల పైరుకు వెన్నులు పస'

'కదిరి పున్నమంత 38 (ఎ) కాంతీలేదు, మొలకల పున్నమంత38 (బి) మబ్బూలేదు' (నర)

'ధూళి చైత్రః (బెన్‌పన్. 88)

చలికాలంలో పగలు ప్రొద్దు తక్కువ - రేయి ప్రొద్దెక్కువ అనే విషయాలు వివిధ కుటుంబ సమస్యల్తో హృద్యంగా మేళవించిన సామెతల్లో చెప్పబడ్డాయి. ఇంటి కోడళ్లకు ఇబ్బంది, పనులు పూర్తిగాక. రైతులకు ఇబ్బంది, పొలాల్లో పనులుగాక.

'ఆషాఢ మాసంలో అరిసెలు వండను పొద్దుండదు'

'కార్తీకంలో కలవారి అమ్మాయి కడవనీళ్లు తెచ్చే పొద్దుకూడా ఉండదు'

'కార్తీకమాసంలో కడవలు కడుగ పొద్దుండదు'

'మార్గశిరములో మాట్లాడడానికి పొద్దుండదు'

'పుష్యమాసంలో పూసలు గ్రుచ్చ పొద్దుండదు'

'మాగి పొద్దు మాటాడ దీరదు'

'తైమాసం (రేయి) తెగ బారెడు'

తిరవల నెలలో 38 (పి) తిరిగి చూసే కొద్దీ పొద్దు పోతుంది' (నర)
'మబ్బులో పొద్దు మగడాలని వెలుగును'
'మొగుళ్లో పొద్దు మోసపుచ్చె, కోడలి ప్రాణం కొలిమిలోకి వచ్చె'
'కూలివాడి ప్రొద్దా క్రుంకవే ప్రొద్దా'

3.1.1 (ఐ) కరువులు : 'పిలిస్తే పలుకుతుంది కరువు రాయలసీమలో, పిలవకుండా పలుకుతుంది అనంతపురంలో' అనే సామెత నూటికి నూరు పాళ్లు సత్యం. ఎత్తయిన కొండలశ్రేణులు, దట్టమైన అడవులు, జీవనదులు లేకుండడం; తక్కువ వర్షపాతం; దార్ఢ్యంలోపించిన నేలస్థితి - ఇవి రాయలసీమను ప్రకృతి ప్రసాదించిన లక్షణాలు. అందువల్ల ఇవి ఆ ప్రాంతపు స్థితిగతుల అభివృద్ధికి అడ్డంకులవడంలో సందేహంలేదు.39

కరువుల వివరాలు : క్రీ. శ. 1629 - 30 సం॥ రములలో రొట్టె ఇస్తే కన్న బిడ్డను మారుగా యిచ్చేవారట. 'జానెబనాన్' (ఒక రొట్టెకు ఒక మనిషి) అని పార్శీలో ఒక సామెత.40 1763-73 లో తెలంగాణాలో ఘోరక్షామము కలిగెను. హైద్రాబాదు నగరములో 90000 మంది చచ్చిరి ... దేశమంతా చచ్చిన వారి పుర్రెలతో నిండెను. అందుచే దాన్ని 'పుర్రెల కరువు' అనిరి.41 క్రీ. శ. 1833 లో గుంటూరు కరువు అని పిలవబడే నందన కరువు. క్రీ. శ. 1876-78 లో వచ్చిన ధాతకరువు చాలా భయంకరమైన కరువులు రాయలసీమలో 19 వ శతాబ్దిలో 6 పెద్ద కరువులు సంభవించాయి. అంటే కరువుల తరుచుదనం ఎక్కువ అవుతున్న దన్నమాట.42

కరువు రావడానికి లక్షణాలు చెప్పబడ్డాయి ఏ పంట పండితే, లేదా పండక పోతే కరువు వస్తుందో అంచనా వేయబడింది. కరువులో ఊదరజూడు, బలుసాకు తింటారని చెప్పబడింది. పస్తయినా ఉండి 'విత్తనాలు' దాచే రైతు కరువు వస్తే వాటినే తినే దుస్థితి తప్పదు అని భంగ్యంతరంగా ఒక సామెత చెపుతుంది. కరువుకు దాసరులవుతారని ఒక సామెత.

'కరువుకు గ్రహణా లెక్కువ'
'కరువుకు చింతలు కాలానికి మామిళ్లు'
'కరువుకు మామిళ్లు కాలానికి నేరేళ్లు (మారేళ్లు)'
'కలివెలు పండిన కరువు'
'వడగండ్లు పడితే వఱపు'

'కరువులో బిడ్డను అమ్మకొన్నట్లు'

'పొయ్యి అరిస్తే బంధువుల రాక, కుక్క అరిస్తే కఱవు రాక'

'సిడి పడితే43 మూన్నెళ్ల (మూడేండ్ల) వఱపు'

'వఱపుకు మెఱపులు, వట్టిగొడ్డుకు అఱపులు మెండు'

'ఊదర కూవెన్నాళ్లు, ఉద్యోగ మెన్నాళ్లు'

'బ్రతికి ఉంటే బలుసాకు ఏరుకొని తినొచ్చు'

'కరువుకు దాసరులైతే పదాలెక్కడ వస్తాయి?'

'ఏమయ్యా మావారు బాగున్నారా! అంటే అమ్మా! బాగానే ఉన్నారు. విత్తనాల వడ్లు తింటున్నారు. దాపుడు బట్టలు కడుతున్నారు అన్నాడట.' మంచికాలానికి సూచనలు కూడా సామెతల్లో చెప్పబడ్డాయి.

'నేములు కాచిన భూములు పండును'

'నేరేళ్లు నెగ్గెడి, మారెళ్లు (మామిళ్లు) మ్రగ్గెది మంచి కాలానికి'

'చింతలు పూస్తే సిరులు, మామిళ్లు పూస్తే మరణాలు'

'చీమలు చెట్టెక్కితే భూములు పండును'

3.1.1. (ఒ) రైతు సొంతంగా సేద్యం చేసుకోలేనప్పుడు పాలికి (కోరుకు, కౌలుకు) ఇస్తాడు మరొకరికి. పాలి వ్యవసాయం కూడదని, గింజలు సరిగా రావని అటు రైతు, ఇటు పాలికపు ఇద్దరి అభియోగం.

'బంధువుతో నైనా పాలి వ్యవసాయం కూడదు'

'ధ్వంసం నారాయణుడు కమతం చేస్తే పాలికి పందుం - పల్లేరు కాయలు'

'పాలికి వచ్చింది పంచామృతము'

'కోరు గింజలు కొంగులోకే సరి'

ఇంట్లో మనుషులు సేద్యం చేసేదానికి తక్కువైనప్పుడు రైతులు పాలేరును పెట్టుకుంటారు. సంవత్సరానికో, కారుకో, ఇంత డబ్బు లేదా ఇన్ని గింజలు ఇచ్చి. పాలివాని సేద్యము బాగుండదని రైతు, పాలేర్లను రైతు మోసం చేస్తాడని పాలివాడు ఒకరిపై ఒకరు నిందారోపణ చేసుకోవడం జరుగుతున్నది.

'పాలివానితో మాలదానితో సావాసము చేయరాదు'

'పాలివానికి చేసిన మేలు పీనుగకు చేసిన శృంగారము'

'అయ్యగారి చేను ఎండితే కమతగాడి మల్ల ఎండునా?'

'పాలేరు దున్నిన నాడు అప్పులపాలు'

'నాగుబాము చిన్నదనవద్దు పాలివాడు సన్నమనవద్దు'

'పాలివారిని చెఱచితివో పాడై పోతివో'

'అన్నానికి ఆవశ్యకము, పనికి మీ యదృష్టము, పరగడుపున పని చెప్పకుము, పండే లేపకుము' (హైసా. 1)

3.1.1. (ఓ) పైరు నాటే విధానం: పైరు నాటే విధానంలో తమిళులు, తెలుగువారు విభేదిస్తారు. తమిళులకు వత్తినాటు మంచిది. ఆంధ్రులకు పలుచన నాటు మంచిది.44 అన్ని పంటల్లోను కలుపుతీసేపుడు 'ఒత్తు' పీకి వేస్తారు. మెట్ట పైరులో గుంటక తోలినప్పుడు, జొన్న మడిలో మడక దున్నినప్పుడు వాటంతటవే వత్తుగా ఉన్న మొక్కలు చచ్చిపోతాయి. పలుచన నాటితే పంట బాగా పండుతుందని, వత్తుగా ఉంటే గడ్డి మాత్రమే వస్తుందని తెలుగు రైతు అంటున్నాడు.

'పలుచన పాతర్లగోడు. ఒత్తు వాములుగోరు'

'పలుచన పంట వేడుక. ఒత్తు చూపు వేడుక'

'పలుచని పైరు ఏపుగా పెరుగును' (క. సా. 441)

'ఒత్తాసి (ఒత్తువాసి) పలికిన నోరు ఎత్తుక తినవలసించె'

'దండి పైరు పంటకు రాదు'

'దండి పైరు కాదు (పెన్‌సన్ 322)

'ఒత్తు ఖాత్తును చెఱచును'

3.1.1. (ఔ) దుక్కి: విత్తనాలు చల్లేందుకు మెట్టగాని, తరిగాని పొలం దున్నాలి. ఆ దున్నడాన్ని 'దుక్కి' అంటారు ఒక్కసారి పొలాన్నంతా దున్నితే ఒక చాలు అయిందని, రెండుసార్లు దున్నితే 'ఇరుసాలు' అయిందని, మూడుసార్లు దున్నితే మూడు చాళ్ల అయిందని చెపుతారు. ఒకసాలు నిలువుగా దున్నితే రెండో సాలు అడ్డంగా, మళ్లీ నిలువుగా - ఇలా దున్నుతారు.

ఏ పంటకు ఎన్ని చాళ్లు దున్నాలో సామెతలు చెపుతాయి. పత్తికి పది, జొన్న, నువ్వులకు ఏడు, ఆముదాలకు ఆరు, ఉలవకు ఒకటి, అల్లానికి రెండు చాళ్ల అవసరం. పల్లపుపొలానికి ఏడు మెట్టపొలానికి నాలుగు చాళ్లు కావాలని సామెతలు చెప్తున్నాయి. ఈ సామెతల్ని బట్టి చూస్తే ఉలవకు దుక్కి ఎక్కువ అవసరం లేదని, పత్తికి చాలా ఎక్కువ కావాలని తెలుస్తోంది.

'పత్తికి పది చాళ్ల జొన్నకు ఏడు'

'నువ్వులకు ఏడు దుక్కులు. ఉలవలకు ఒకటే దుక్కి'

'పత్తికి పదిచాళ్ళ ఆముదాలకు ఆరు'

'ఉలవకు ఒకదుక్కి, అల్లమునకు రెండు' (క. సా. 341)

'పల్లమునకు ఏడు దుక్కులు, మెఱకకు నాలుగు దుక్కులు'

దుక్కి అవసరం : దుక్కి పొలానికి ఎంత అవసరమో సామెతలు నొక్కి చెప్తున్నాయి. 'బాగా దున్నితే బాగా పండును', 'దుక్కి దున్నితే భూమికి శాంతము (క. సా. 349) అని చెప్పబడింది. వివిధ విషయాల్తో పోల్చిచూపుతూ దుక్కి ప్రాధాన్యం వివరించబడింది. ఎద్దు దుక్కి మంచిదట, వరికి దుక్కి పుష్టి అట.

'దుక్కి ఉంటే దిక్కు ఉంది'

'దుక్కి కొద్దీ పంట, బుద్ధి కొద్దీ సుఖం'

'దుక్కి చలువే చలువ, తల్లి పాలే పాలు'

'దుక్కి సత్తువచేత దుగడంబు లేదు' (బెన్‌సన్. 281)

'ఎద్దు దుక్కి ఎచ్చైన దుక్కి (గోభూమి, నవం. 49)

'వంటికి తిండి పుష్టి - వరికి దుక్కి పుష్టి' (క. సా. 366)

సరైన దుక్కి లేకపోతే పంటకు ఎంత నష్టమో కొన్ని సామెతల్లో వివరించబడింది. దున్నడంలో లోపాన్ని ఎరువు తీర్చలేదని, సరిగా దున్నకపోతే పంట సరిగా పండదని, దుక్కికి ఊటనేల అనువుగాదని తెల్పబడింది.

'దున్నడములో లోపము యెరువులో కలిపి రాదు' (క. సా. 353)

'దుక్కిలేని చేను తాలింపులేని కూర వ్యర్థము' (క. సా. 371)

'మన్ను వెళ్లకుండా దున్నితే వెన్ను వెళ్లకుండా పండును'

'ఊటనేల దుక్కికి వస్తుందా ?' (వ్య. సా. 131)

దున్నేవిధానం మూడు రకాలుగా చెప్పబడింది. లోతుగా దున్నడం, దగ్గర దగ్గరగా దున్నడం, మట్టి చాలా మెత్తగా అయేట్లు దున్నడం. ఎరువుకన్నా. గొర్రెలమందకన్నా లోతుదుక్కి మేలని, చాలుపై చాలు దున్నితే చచ్చునేలైనా పండుతుందని, వెన్నవలె మెత్తబడినంతవరకు దున్నాలి అని సామెతలు చెప్తాయి.

'లోతు దుక్కికి ఎరువు లోకువ' (క. సా. 365 బి.)

'గొఱ్ఱెలమందకంటె లోతు దుక్కిమేలు'

'తెగిన చేను తేమ కోర్చును'

'చాలులో చాలు దున్నితే చేనికి చేను అవును'

'వెన్నలా దున్నితే వెన్నులకేమి కొదువ' (వెన్నులు కొంచలాడి)

'మన్ను మిన్ను మెత్తనయితే మనుష్యులకు బ్రతుకు'

'భూమిని చూర్ణం చేస్తే పట్టెడెరువే పుట్టెడు పండిస్తుంది'

దుక్కి బాగా చేయాలంటే నాగలికర్ర అవగాలి. అలా అయితేనే కాపు బ్రతుకు - అంటున్నాయి సామెతలు. వేపనాగలి, కానుగ వాసాలు పనికి రావని, ముందు అరకకు మంచి ఎద్దుల్ని కట్టాలని సామెతల సలహా.

'కఱ్ఱు అరిగితేనే కాపు బ్రతుకు'

'అరక అరిగితే గరిసె విరుగుతుంది'

'అదునూ పదునూ చెరిచేది వేప నాగలి'

'కానుగ వాసాలు కదోయి కాదరు సాహెబంటే పుచ్చినదాకా వుండునా
బురాను సాహెబూ అన్నాడట'

'ముందు అరకకు మొనగాళ్లను కట్టవలె'

ఎప్పుడెప్పుడు దున్నితే బాగుంటుందో సామెతల్లో చెప్పబడింది. ఏగిలి, మాగిలి అని రెండు రకాల దుక్కుల్ని గురించి తెలుపబడింది. మెట్ట పంటలు కోసిన వెంటనే పొలంలో మిగిలి ఉన్న మోళ్లు పోయేట్లు దున్నడమే ఏగిలి దుక్కి. మాఘమాసంలో (జనవరి-ఫిబ్రవరి) మెట్టపొలాన్ని దున్నడమే మాగిలి దుక్కి. తై నెలలో దున్నడం ఎంతో మంచిదని చిత్తి (ఏప్రిల్—మే) నెలలో మంచిదని సామెతలు చెప్తాయి. రైతులుగానే పరిగణింపబడని మాల, మాదిగలు కూడా ఏగిలి, మాగిలి దుక్కులు చేస్తే పంట బాగా పండుతుందట.

'ఏగిలి చేస్తే ఏలనివానికైనా పండుతుంది'

'యేగిలి దుక్కి దున్నితె యెరువు తోలవలయు'

'మాగిలి దున్నితే మరింత పంట'

'మాగిలి దున్నితే మాలవానికైనా పైరగును'

'అయిదుసార్లు గొఱ్ఱెలమంద కట్టడం తైనెల దున్నడం ఒకటే'

'చిత్తినెలలో దుక్కి పుటం పెట్టిన పుత్తడి'

**పైచాలు - పాపటం :** విత్తనం వేసిన తరువాత మూడురోజులవరకు గుంటకతో పాయడం (చాళ్ల పూడవడం) 'పైచాలు తోలడం' అంటారు. పైరులో గడ్డి, గాదం, కలుపులాంటివి పోవడానికి గుంటకతోలడం 'పాపడం' అంటారు. పైచాలు

తోలడం, పాపడం అత్యవసరమని సామెతలు చెప్తున్నాయి.

'పైచాలు లేని పైరు, పగటి అంబలి లేని మనిషి'

'పావటం పది సేద్యాల పెట్టు'

'ఏడు సార్లు పాసినచేలో పండిన కంకితో ఏడుగుర్ని చంపొచ్చు'

3.1.1 (క) నీటివనరులు : ఆంధ్రప్రదేశ్‌లో నీటిఆధారాలు నదులు, చెరువులు-సరస్సులు, బావులు అని మూడు రకాలు. నీటి అవసరం ప్రతి ఊరికీ ఎంతో ఉందని, నీటిని ఏవిధంగానైనా సాధించుకోవాలి అని క్రింది సామెతలు చాటుతున్నాయి.

'నీరు లేని ఊరు నారిలేని యిల్లు' (సా. సా. 273)

'జలములేని చోట జీవమే లేదు' (వ్య. సా. 411)

'నీటిని, దొంగను విడువరాదు' (క. సా. 507)

నదులు - ఏర్లు : ఆంధ్రప్రదేశ్‌కు 'నదీరాష్ట్రం' అనే పేరుంది. గోదావరి, కృష్ణ, తుంగభద్ర, పెన్నలాంటి పెద్దనదులు, మరెన్నో చిన్న నదులు - వంకలు, వాగులు ఉన్నాయి. వ్యవసాయానికి సంబంధించిన సామెతల్లో నదుల గురించి చెప్పబడలేదు. కాని, చిన్న ఏర్లను గురించిన ప్రస్తావన ఉంది.

'వరికి వాక దొరకు మూక'

'ఏరు మూరెడు తీస్తే కయ్య బారెడు తీస్తుంది' (కార్. 458)

'ఏటికాల్వ జూడ ఎక్కుతగ్గెడి రీతి'

చెరువులు - సరస్సులు : ఆంధ్రప్రదేశ్‌లో చెరువులు రాజులకాలంనుంచే ఉన్నాయి. తెగిపోయిన చెరువుల్ని ప్రభుత్వం బాగుపరిచింది. పాకాల చెరువు,కంభం చెరువు, కనిగిరి చెరువు చాలా పెద్ద చెరువులు. సరస్సుల్లో కొల్లేరు సరస్సు చాల పెద్దది. వర్షాకాలంలో ఇది దాదాపు 250 కి. మీ. విస్తరించి ఉంటుంది.[45] చెరువుల అవసరాన్ని, కొల్లేటి సరస్సు క్రింద వ్యవసాయాన్ని క్రింది సామెతలు పూసగుచ్చినట్లు తెలుపుతాయి.

'చెరువు ఓడు ఊరుపాడు'

'చెరువుకు చేరువుగాను, చుట్టాలకు దూరంగానూ ఉండవలె'

'రాతికట్ట పంటచెరువుకు గాక గండిగుంటకేల'

'నక్కలి మరవలు పాటితే కుక్కలు కూటి నొల్లవు'

'పాకాల చెరువును చూచి ఆనీళ్లన్నీ తానే దున్నాలని దున్నపోతు గుండె పగిలి చచ్చిందట'

'కాల్లేవి పంట కూటికే చాలదు'
'కాల్లేటి వ్యవసాయానికి కోతకూలి దండుగ'
'కాల్లేటి వ్యవసాయం గొడ్ల వినాశం'
'కాల్లేటిలో పండే పంట పంటలో లెక్కేగాని, చచ్చే దున్నపోతులకు, లెక్కలేదు'

3.1.1 (ఖ) పశుపోషణ : వ్యవసాయానికి పశువులు అత్యవసరం కాబట్టి పశుపోషణ అనే శీర్షికను ఈ ఉపప్రకరణంలోనే చర్చించడం జరుగుతుంది. 50సంవత్సరాల క్రితం భారతదేశ వ్యవసాయ పరిస్థితులపై విచారణ జరిపిన రాయల్ కమీషన్ "ప్రపంచంలో అనేక దేశాలలో ఆవులు, ఎద్లు పాలకు మాంసానికి మాత్రమే ఉపయోగించబడుతున్నాయి. కాని భారతదేశంలో మాత్రం ఎద్లు బండ్లు లాగటానికి. పొలందున్నటానికి ప్రధానంగా ఉపయోగించబడుతున్నాయి. ఎద్లే లేక పోతే యీ దేశంలో వ్యవసాయం చేయటమే అసాధ్యం, పంటను యింటికి చేర వేయడం అంతకన్నా కష్టం" అని చెప్పినమాటలు నేటికీ మనరాష్ట్రానికి అక్షరాలా వర్తిస్తాయి.46

పశువుల వివరాలు : 1972 సంవత్సరపు లెక్కలను బట్టి రాష్ట్రంలో 125.07 లక్షల ఆవు జాతి పశువులు, 70.57 లక్షల గేదె జాతి పశువులు, 83.43 లక్షల గొర్రెలు, 44.57 లక్షల మేకలు, 6.90 లక్షల పందులు, 190.47 లక్షల కోళ్ల జాతులు ఉన్నాయి ఆవు జాతి పశువులలో దేశం మొత్తంమీద 7 వ స్థానం, గేదెలు, గొర్రెలలో రెండవస్థానం మన రాష్ట్రం ఆక్రమిస్తున్నది47 .... రాష్ట్రంలో పశుసంపద విలువ 813.30 కోట్లు.48

పశువుల అవసరం : రైతులు పశువుల్ని పాడికోసం, మాంసంకోసం పెంచు తున్నారు. ఆవుల్ని గేదెల్ని పాడికోసం; ఎద్దుల్ని, దున్నల్ని సేద్యంకోసం, గొర్రెల్ని, మేకల్ని మాంసంకోసం, ఉన్ని కోసం; పందుల్ని మాంసంకోసం, కోళ్లను మాంసం, గ్రుడ్లుకోసం పోషిస్తున్నారు.

రైతులకు పశువులంటే ఎంత భక్తో, వాటి అవసరాన్ని ఎంత బాగాగుర్తించారో సామెతలు చక్కగా తెలుపుతాయి. రైతు 'గోవే తల్లి, ఎద్దే తండ్రి'గా, 'గోసేవయే గోవిందసేవ'గా (గోభూమి, నవంబరు. 1949) భావిస్తాడు. 'గోప్రదక్షిణము భూ ప్రదక్షిణ ఫలమిచ్చినట్లు' నమ్మడమేగాక 'ఆవులేనింట అన్నమే తినరాదు' అని శాసిస్తాడు. 'ఎద్దు కొద్దీ సేద్యం, చద్దికొద్దీ పయనం' ఉంటుందని, 'ఎద్దుతో వ్యవ

సాయం, ఆలితో సంసారం' లాంటిదని తలుస్తాడు. 'పాడిపసరము, పసిబిడ్డ ఒకటి' గానే సాకి సంతరిస్తాడు. 'పశువుల రొమ్ముగుంత పంటకాపు గుమ్మ పాతర' కాబట్టి 'మేపేరూపు' అని తెలుసుకొని తను పస్తున్నా గొడ్లకింత గడ్డి కొని వేసేందుకు జంకడు. 'గొడ్డువచ్చిన వేళ బిడ్డ వచ్చిన వేళ' అనే నమ్మకంతో మంచి రోజునే పశువుల్ని కొనేందుకు ప్రయత్నిస్తాడు.

ఎడ్లలో విత్తనపు కోడెల్ని ఆంబోరు లేక ఆబోతు అంటారు. ఆబోతుల్ని గురించిన సామెతలు కొన్ని ఉన్నాయి. విశృంఖలంగా తిరిగే మగవాణ్ణి 'అచ్చు బోసిన ఆబోతులాగా' తిరుగుతున్నావని తిడతారు. 'ఆబోతుకు బందెలేదు'. 'ఆబోతుతో దుక్కి-టెద్దు పోలుతుందా' అని రైతు ప్రశ్న. 'ఆబోతుగలయూర అన్ని సంపద లుండు'ను అని రైతుల విశ్వాసం. (గోభూమి, నవంబరు 1948)

సుమారు రెండేళ్ల ప్రాయంలో ఉండే ఎద్దును కోడె అంటారు. ఏయే ప్రాంతం కోడె ఎలాంటిదో సామెతలు చెప్తున్నాయి. కొన్నిరకాల కోడెలు సేద్యంలో చాలా మందం అని కూడా తెలుపుతున్నాయి. (ఈ సామెతలన్నీ గోభూమి, నవంబరు 1940 సంచికలోవి)

'ఎల్ల కోడెయే ఎచ్చైన కోడె'
'ఒంకలేని కోడె ఒంగోలు కోడె'
'మహా వేగముగలది మైసూరుకోడె'
'బాతికంటె గట్టి రాయలసీమ కోడె'
'తోలుమందముగల కోడెను తోలినానడవదు'
'దున్నముఖముగల కోడె దున్నుటకు తగదు'
'లావుతోక గల కోడె లాగినా నడవదు'

కొనాల్సినప్పుడు మంచి ఎద్దు లక్షణాల్ని రైతు తెలుసుకొని సామెతల్లో వాటిని చిరస్థాయిగా నిక్షేపించాడు. అంటు బొడ్డు, ఆవు తల ఎద్దు. కర్రెది, ఎర్ర కర్రెది, చప్పికొమ్ములది శ్రేష్టమని; ఎర్రది, కంటిపులిది మంచివికావని, ఎద్దును కొద్దిలో కొనరాదు అని రైతుకు తెలుసు.

'అంటుబొడ్డు, ఆవుతల ఎద్దుకూ, జారుబొడ్డు, చనుకట్టూ ఆవుకూ మంచివి'
'కట్టిది కస్తూరి, ఎఱ్ఱది ఎఱ్ఱమన్ను'
'ఏడూళ్ల తిరిగినా ఎఱ్ఱ కట్టిదాన్ని కొనమన్నారు'
'చెప్పుక పోయినా చప్పికొమ్ముల ఎద్దునే కొను'

'కాలుకురుచ ఎద్దును కని పెట్టి కొనవలె'

'ఎద్దును కొద్దిలో కొనరాదు బట్టను ఖరీదులో కొనరాదు'

'కంటిపులి49 ఉంటే ఇంటి పతి (యజమాని)పోయింది (మాం, వృ. కో.)

ఎద్దులు - సేద్యం : 'బిగువైన ఎద్దుదే బిగువైన సేద్యము' (గోభూమి, నవంబరు 1949). 'ఎద్దు ఏడ్చిన వ్యవసాయం, పాలేరేడ్చిన పంట పనికిరాదు' (క. సా. 81). 'పశువుల సిరివి పంటకు తేట' (దెవ్ సన్ 463) అని రైతు భావన. 'ఇంటి మనిషైనా, బర్రె పలుపైనా, బట్టకడిమైనా మరో కొంగ్రదున్నుతాము' అని ఎద్దులు అంటాయట. ఈ సామెతలో దున్నేందుకు ఎద్దుకు కావలసిన మంచి పరిస్థితులు చెప్పబడ్డాయి. 'పది దుక్కుల తర్వాత దున్నినవాడు పాపాత్ముడు' (క. సా. 38) అని రైతు నమ్ముతాడు. కాబట్టే, ఇన్నాళ్లూ తనకు బంగారుపంటలు పండించి ఇచ్చిన ఎద్దును కృతజ్ఞతతో 'అట్లు కిమిగి వదలివేసిన ఎద్దు'గా చేసి దాన్ని వృద్ధాప్యంలో పోషిస్తాడు'. ఎద్దును, ఎనుబోతును కలిపి ఏరుకట్టితే వచ్చే ఇబ్బందిని 'ఎద్దు ఎండకు లాగ, ఎనుబోతు నీడకు లాగ' అనే సామెత తెలుపుతుంది. పశువులను పరిశుభ్రంగా ఉండే చోట కట్టివేయాలని 'పాన్పు సెబ్బరైతే పసరానికి సెబ్బర' అనే సామెత చెప్తుంది. పసరిక, చొప్ప, ఉలవ పొట్టు, నారుజొన్న పశువులకు 'మంచిమేపు లని 'దుక్కులైనాయి పసరిక మేపు' (వ్య.సా. 478). 'ఎద్దునోటికి చొప్ప అందించినట్లు', 'ఉలవ పొట్లో ఎద్దు పడినట్లు' (నర), 'కారు జొన్నమేసే కోడెకు కైలాసం కావాలా' అనే సామెతలు స్పష్టపరుస్తున్నాయి. రైతు తెల్లవారు జామునేలేచి, పశువులకు గడ్డివేస్తాడు. గాటి దగ్గర కూర్చుని పశువులకు 'బుట్టమేపు' తినిపిస్తాడు. ఈ విషయాల్ని తెలిపే సామెతలు 'దుక్కి టెద్దు బుట్టమేపు వేళ గాటికి లాగినట్లు', 'వెయ్యిమేపులు వేకువజాము కట్టకు లోకువే' అనేవి. 'గొడ్డు రైతుబిడ్డ' (క.సా.26). మంచి రైతు సామాన్యంగా ఎద్దును కొట్టడు.

పాడి : 'పాడిలేని ఇల్లు పేడలేని చేను' 'పాడితో పంట ఓపదు' అనే సామెతల్లో పాడికి రైతు ఇచ్చే ప్రాముఖ్యం వెల్లడవుతున్నది. 'అప్పుచేసి ఆవును కొనవచ్చుగాని, గేదెనుకొనరాదు'. ఆవు ఒక కోడె దూడను ఈనితే రైతు కరువు తీరుతుంది కాబట్టి. 'దూడలేని పాడి దుఃఖపు పాడి'గా భావిస్తాడు రైతు. తొలిచూలు ఆవు పాలు తక్కువ ఇస్తుంది అన్న విషయాన్ని 'దూడపాలు దుత్తకే అయె' అనే సామెత విశదీకరిస్తుంది. పలుచవిగొడ్డు పాలు ఎక్కువిస్తుందని, గడ్డి బాగా పడితేనే

పాడి ఎక్కువ అని, దాయకట్టక పోతే ఆవు తంతుందని - ఇలాంటి సూక్ష్మమైన విషయాలన్నీ సామెతల్లో చెప్పబడ్డాయి. 'పలుచని గొడ్డుకు పాలెక్కువ. పిండని ఆవుకు పొదుగెక్కువ', 'పశువుపాలు కసవును బట్టే', 'దాయకట్టని ఆవు తన్నక మానదు' అనేవి ఆ సామెతలు.

ఎనుము : 'నన్నుచూస్తే నిన్ను కాస్తానంటుంది' ఎనుము రైతుతో. ఎనుమును సాకాలంటే అంత సులభంకాదు. 'ఏనుగుకు ఒక సీమ, గుఱ్ఱానికి ఒక ఊరు, బఱ్ఱెకొక బానిస' ఉండాలి. ఎనుమును కొనేప్పుడు ఎన్నిలిపాస్తుందో చూడాలి. 'పాడిని చూచి బఱ్ఱెను, తల్లిని చూచి పిల్లను తీసుకోవలెను' (సా. సా. 306). ఎవరు బడితే వాళ్లు పిండితే పశువులు పాలివ్వవు. 'పిండేవాడు పిండితే పిటుకురాయైనా పాలిస్తుంది' అనేది పాలు నేర్పుగా పిండే విధానాన్ని తెలుపుతున్న సామెత. మలపగేదె, మక్కిన బఱ్ఱెపాలు ఎక్కువ ఇస్తాయి. 'మలపగేదె మానెడుపాలు ఇచ్చును', 'మక్కిన బఱ్ఱెకు ముక్కినపాలు' (సా. సా. 252) అని సామెతలు. ఎనుముకు కుడితంటే బలే ప్రీతి. 'కుడితిమరుగు బర్రె విడిసీరు త్రాగునా', 'కుడితి పులుపే బర్రె బలుపు' అని సామెతలు. ఎనుము చచ్చేదాకా ఈనుతూనే ఉంటుంది. 'ఎనుము ముసలి ఏనాది ముసలి లేవు' అని సామెత.

ఎనుబోతులు : మాగాణిసేద్యంలో దున్నలు బాగా పనికివస్తాయి. ఇది బీదవాడి సేద్యపు పశువు. 'ఎనుబోతు పేదల యశముగోరు' అని సామెత. కొల్లేరు వ్యవసాయాన్ని గూర్చి చెబుతూ 'కొల్లేటిలో పండే పంట పంటలో లెక్కేగాని, చచ్చేదున్నపోతులకు లెక్కేలేదు' అని ఒక సామెత. 'బుధవారం పుట్టినదున్న భూమిని దున్నినా, తొక్కినా పొంగి పొంగి పండుతుంది' అని రైతు నమ్మకం.

గొర్రెలు - మేకలు : 'నేలను గొర్రె త్రొక్కినావాలు' (వ్య.సా. 529). 'కట్టకు పెట్టినా గొర్రెకు పెట్టినా చెడదు'. అందువల్లే రైతులు గొర్రెల్ని, మేకల్ని కొని జీతగాణ్ణి పెట్టి మేపిస్తుంటారు. లేదా మేపి, లాభం చెరిసగం పంచుకొనే 'సరిబాలు'49 ఎ పద్ధతికి మరొకరికి తోలిస్తారు. గొర్రెల ఎద అదును హస్తకార్తె. 'హస్తకార్తెలో వానవస్తే అడుగకనే గొర్రె కట్టు' (క. సా. 188) అని సామెత. 'ప్రాకొన్న నూతి యుదకము, మేకల పాడియును రోత' కాబట్టే వీటి పాడి అంతగా ఉపయోగించరు.

పశువుల వ్యాధులు : పశువులకు సోకే వ్యాధులు, వాటి తీవ్రత సామెతల్లో చెప్పబడింది. కొన్ని రోగాలకు వాతలు వేయడం ఒక వైద్య పద్ధతి. పశువులకు

ఆకలి పెంచేందుకు ఉప్పు, నల్లేరు కలిపిపెడతారు. కారం నీళ్లలో కలిపి 'గొట్టం'తో పోస్తారు. మూలికలు_దినుసులు సిద్ధంగా ఉంచుకొని అవసరపుడు తినిపిస్తుంటారు. కాలారా గొడ్డు తిరిగితేనే బలం అని తెలిసిన రైతులు వాటిని సాయంత్రంవేళల్లో అలా వదిలి తిరగనిస్తారు. ఈ అంశాన్ని తెలిపే సామెతలు.

'రోగాలలో గురక[50] ప్రమాదం'
'గేదె ఉండగా, దూడ ఉండగా గుంజకు వచ్చెరా గురకరోగం'
'దొమ్మ[51] లన్నిటిలో మిడిదొమ్మ[52] మిండడు'
'మాద[53] లన్నిటిలో కొమ్ముమాద[54] ప్రమాదకరం'
'గాలి కుంటు[55] అయితే కురము[56] అన్నట్లు' (వ్య.సా. 720)
'సూతికావాతం[57] వచ్చిన గొడ్డును చూడగానే మంది' (వ్యసా. 878)
'అన్ని రోగాలకూ వాతలు వాసే వైద్యుణ్ణి అవతల ఉంచు'
'ఉప్పు తిన్న కోడె ఊరిపోయింది, పప్పుతిన్న కోడె పారిపోయింది'
'మేత కన్నా మసలితేనే బలం'

కొన్ని ఊర్లలో పశువులకు శక్తికి మించినపని అయినందు వల్ల బక్కచిక్కిపోతాయి. లోతుగా ఉండే బావుల్లో కపిల తోలలేక, బంకనేలల్లో దమ్ము చేయలేక పశువులు దెబ్బతింటాయి. అందుకే చుట్టుప్రక్కల గ్రామాల రైతులు ఎప్పుడైనా ఆ ఊరి వారికి అమ్మి కష్టపెట్టబోరు.

'వెల్లటూరులో ఎద్దును, పరుచూరులో పడుచును ఇవ్వరాదు'
'ఎలమఱ్ఱుకు ఎద్దునివ్వరాదు, పామఱ్ఱుకు పడుచునివ్వరాదు'
'పెనుగొండకు పిల్లనివ్వరాదు, రొద్దానికి ఎద్దునివ్వరాదు'

**పందులు – కోళ్లు :** పై సంపాదనకోసం రైతులు కోళ్లను పెరళ్లలోను, పందుల్ని ఇతరుల కెవ్వరికైనా కొని ఇచ్చి పెంచుతుంటారు. 'కోడిని సంపాయించుకుంటే కోడితలకాయంత బంగారు సంపాయిస్తుంది' (నర) అని సామెత. అంతే కాదు. 'పందిపాత అప్పు తీరుస్తుంది. కోడి కొత్త అప్పు తీరుస్తుంది' అని జానపదుల నమ్మకం. నిరూపించబడిన సత్యం. పందుల్ని తవుడుతో పెంచుతారు. 'తాదిన తవుడులేదు వారానికి పక పందిపిల్ల' (కర్. 1045) అని సామెత. 'మేడికీ కోడికీ నిలికి లేమ' (నర). మేడిచెట్టు కాస్తానే ఉంటుంది, కోడి గుడ్లు పెడుతూనే ఉంటుంది.

3.1.2 వైద్యం : కులప్రమేయం లేకుండా ఈ వృత్తిని చాలామంది చేపట్టారు. బ్రాహ్మణుల్లో వైదీకులు, శూద్రుల్లో మంగల, మాలల్లో కొంతమంది వైద్యాన్ని వృత్తిగా చేస్తున్నారు. ఇతర కులాలవారిలోనూ ఈ వృత్తి లేకపోలేదు. వీరి మందులు చాలా మాత్రం మంత్రాలపైనో, మూలికలపైనో ఆధారపడిఉంటాయి.

'వైద్యో నారాయణో హరిః' అని సంస్కృత లోకోక్తి. ఒక తెలుగు సామెతలో వైద్యుడు మొదట దేవుడుగా, తర్వాత కష్టసుఖాలు చెప్పుకొనే చుట్టంగా, ప్రతిఫలం అడిగేటప్పుడు దయ్యంగా కనబడతాడని చెప్పబడింది.58 'ఆదిలో దైవం, ఆపైన చుట్టం, ఆఖరికి దయ్యం'. 'వాదభ్రష్టుడు వైద్యశ్రేష్టుడు' అనే సామెత అంతరార్థం ఇది. వాదమంటే రసవాదం. తగరాన్ని వెండిగా, రాగిని బంగారుగా చేసే ప్రక్రియ రసవాదం. ఈ ప్రక్రియలో విఫలమైనవారు మూలికా ప్రభావాలు బాగా తెలుసుకొని గొప్ప వైద్యులౌతారని ఈ సామెత సూచిస్తుంది.59 అనుభవమున్న వ్యక్తి చేసే వైద్యం బాగుంటుందని 'బాలజ్యోతిష్యం, వృద్ధవైద్యం' అనే సామెత తెలుపుతుంది. బాలుడైన జ్యోతిష్కుడు శాస్త్రాలపైనే ఆధారపడి ఉన్నదున్నట్లు చెప్తాడని, పెద్దవారయితే ప్రతిఫలం ఆశించి ఎదుటివారి మనసుకు నచ్చేట్లు చెబుతారే గాని ఉన్నదున్నట్లు చెప్పరని, ముసలి వైద్యులు ఎన్నో విరుద్ధ అంశాల్ని పరిశీలించి చక్కగా నివారణోపాయాలు సూచిస్తారని, అనుభవరహితులైన బాలవైద్యులయితే ఏదో ఒక మందు ఇస్తారని నేదునూరి గంగాధరంగారి వివరణ.60 ఈ విషయాన్ని 'కొత్త వైద్యునికంటె పాత రోగి మేలు' అనే సామెత బలపరుస్తుంది.

వైద్యులమీద ప్రజలకు కొంత దురభిప్రాయమున్నట్లు 'వైద్యుడు రోగం కోరు, వైశ్యుడు కరవుగోరు', 'మంగలి గొరిగి నేర్చుకొంటే వైద్యుడు చంపి నేర్చుకుంటాడు'. 'ఒకరిద్దరిని చంపితేగాని వైద్యుడుగాడు' 'నూఱుమందిని చంపితే గాని వైద్యుడుకాడు' (సా. సా. 279) 'ఎన్నో వ్రణాలుకోసినాను గాని నావ్రణ మంత తీపులేదు అన్నాడట' అనే సామెతలు సాక్ష్యమిస్తాయి.

వైద్యం అంతో ఇంతో అందరికీ తెలుసునని 'వైద్యం నేర్వనివాడు, వానకు తడియనివాడు లేడు' అనే సామెత తెలపగా, 'సంచికట్టిన వాడెల్లా వైద్యుడా ?' అని సంఘం నిలదీసి అడుగుతున్నది.

వైద్యుని హస్తవాసిమీద ప్రజలకుండే నమ్మకాన్ని 'ఆయుష్యముగల రోగి హస్తవాసి గల వైద్యుని దగ్గరకు పోవును' అనే సామెత చెప్తుంది. ఏదైనా ఒక

పనిచేసేవాడు ఆపని తను ముందు చేసి చూపాలని 'వైద్యుడు మొట్టమొదట తన వ్యాధిని పోగొట్టుకోవాల' అనే సామెత తెలుపుతుంది.

రోగం ఫలానిది అని తెలుసుకోలేని పల్లీయులు 'వైద్యుడు చెప్పింది రోగము, భాగవతుడు పాడినది రాగము' (సా. సా. 398) అనుకోక తప్పదుగదా!

3.1.3 మంత్రసాని వృత్తి : సుఖప్రసవం చేయించే ఉపాయాల నెరిగిన స్త్రీ మంత్రసాని. మంగల, చాకల స్త్రీలు గ్రామాల్లో ఈ పని నిర్వర్తిస్తుంటారు. మంత్రసానితనానికి ఒప్పుకొంటే కోతాపీతా అనగూడదని, మంత్రసాని వద్ద కాన్పు చేసుకొనే స్త్రీ తన దేహం దాచ వీలుగాదని, నొప్పులు పడేటప్పుడే మంత్రసాని గర్భిణిని చెప్పుతుందని, 'మంత్రసాని పనికి ఒప్పుకున్నపుడు పిల్ల వచ్చినా పట్టాల గడ్డ వచ్చినా పట్టాల', 'మంత్రసానికి ఒళ్లు దాచగలమా ?', 'నొప్పులెత్తుకున్నపుడే మంత్రసానికి చెప్ప సందు' అనే సామెతలు వివరిస్తాయి.

3.1.4 పూటకూళ్ల వృత్తి : పరబ్రహ్మస్వరూపంగా హిందువులు భావించే అన్నాన్ని అమ్మడం మహాపాపమని ఆంధ్రుల నమ్మకం. అయినా కాకతీయుల కాలంనుంచి నగరాల్లో పూటకూళ్ల ఇండ్లు ఉండేవని తెలుస్తున్నది. ఈ వృత్తిని బ్రాహ్మణ విధవలు జీవికకోసం చేపట్టారు.

పుణ్యంకోసం అన్నదానం చెయ్యడముండిగాని, అన్నం అమ్మే పూట కూళ్లమ్మ అలాచేయలేదని, పూటకూళ్లింట అంటులేదని, ఒక పూట తినడానికి వచ్చిన వాళ్లకు ధాన్యం ధరతో నిమిత్తం లేదని చెప్పే సామెతలు 'ఆకలమ్మ దోస మెఱుగదు, పూటకూళ్లమ్మ పుణ్య మెరుగదు', 'పూటకూళ్లింట పాత్రకు ఎంగిలి లేదు', 'పూటకూళ్లకు వచ్చిన వారికి పుట్లధర యెందుకు' అనేవి.

3,1.5 కసాయి/కటిక వృత్తి : మాంసం అమ్మడం కసాయిలేక కటిక వృత్తి. గోమాంసం అమ్మేవారు, గొఱ్ఱెమాంసం అమ్మేవారు వేర్వేరు. ముస్లింలే ఈ వృత్తిని నిర్వహిస్తున్నారు.

కీడుచేసేవారినే నమ్మే అమాయకులను గురించి చెప్పేటప్పుడు 'గొఱ్ఱె కటిక వానిని నమ్మినట్లు, గొల్లవాణ్ణి నమ్మదు' అని, అపాయకరమైన వ్యక్తికి సహాయం చేయడాన్ని 'కసాయివాడికి (కటికవాడికి) కత్తి అందించినట్లు' అనే సామెతతో చెప్తుంటారు.

3.1.5 కూలిపని : సంవత్సరానికింత ధాన్యమో, ధనమో అని ఇస్తామని ఒప్పించి యజమాని తన ఇంట్లోనే పెట్టుకుని ఒక వ్యక్తి చేత పనులు చేయించుకోవడం జీతా

నికి ఉంచుకోవడం అని, అట్లా ఉండేవాణ్ణి జీతగాడు అని అంటారు. పసులకాపరి, గొ(్రెలకాపరి, వ్యవసాయంచేసే సేద్యగాడు జీతగాళ్లే. 'జీతంలేని నౌకరు, కోపం లేని దొర' అనే సామెత జీతం ఇస్తేనే నౌకరు బాగా పనిచేస్తాడనే విషయాన్ని భంగ్యంతరంగా తెలుపుతున్నది. 'సేద్యగానికీ మొగబిడ్డా' (చంద్ర) 'జీతగానికీ మొగబిడ్డా' (నర) అనేవి రైతుల ఈసడింపులకు చిహ్నాలు.

ఏదైనా ఒకపనిని ఒకదినం చేస్తే ఇచ్చేడబ్బో, ధాన్యమో కూలి అని, ఆపని చేసేవారిని కూలీలు అని, ఆ పనిని కూలిపని అని అంటాము. పల్లెల్లో చాలమంది తమకులవృత్తుల్ని చేసుకుంటూ, తమకుండే అంతో ఇంతో భూమిని వ్యవసాయం చేసుకుంటూ, తీరిక వేళల్లో రైతుల పొలాల్లోకి కూలికి వెళ్తుంటారు. ముఖ్యంగా మాల, మాదిగలు దాదాపు భూములు లేని వారు. కాబట్టి కొన్నాళ్ల తమ రైతులకు, కొన్నాళ్లు ఇతరులకు కూలికి వెళ్తుంటారు.

ప్రతిదినమూ శ్రమపడుతున్నందువల్ల కావచ్చు, కూలీలు వీలైనంతగా పని ఎగవేసేందుకు ప్రయత్నిస్తారు. చాలామందికి కూలి గింజలు తీసుకెళ్తే తప్ప ఆ పూటకు తిండి ఉండదు. కూలి ఆ పూటకేగాని మిగలదు. ఈ విషయాల్ని 'కూలి చేస్తే కుండగాలాల, లేకుంటే ఎండగాలాల' (నర) 'కూలికుండకురాదు, అంకు పన్నుకురాదు', 'గోడపట్టుకో కూలి అడిగివస్తాను' అనే సామెతలు తెలుపుతాయి. కూలి ఇప్పించుకొని వెళ్లేటప్పటికే కట్టిన గోడపడిపోయేంత అధ్వాన్నంగా పనిచేశా రని చివరి సామెతలో వ్యంగార్థం.

కొన్ని నెలల్లో పగలు ప్రొద్దు తక్కువ. దాన్ని 'కూలివాడి ప్రొద్దు' అంటారు. దీనిపై వచ్చిన సామెత, 'కూలివాడి ప్రొద్దా కుంకవే ప్రొద్దా' అనేది. వరి నాటు తున్నపుడు, కలుపుతీస్తున్నపుడు, కోసేటప్పుడు 3, 4 అడుగుల వెడల్పుండే తావును ఒకొక కూలీ నిర్ణయించుకొని ఆయా పనులు చేస్తుంటారు. ఆ తావునే 'మునుము' అంటారు. ఈవలావలవారు కొంచెం కొంచెం తప్పించుకుంటే నడిమి మునుము పట్టినవారికి ఎక్కువపని తగుల్తుంది. ఆ విషయాన్ని 'నాలుగు మానికలిచ్చినా నడిమి మునుము పట్టరాదు' అనే సామెత తెలుపుతుంది.

**3.1.3 పడుపు వృత్తి :** మానసికోద్వేగానికి అతీతంగా (ఎమోషనల్ ఇన్డిఫరెన్స్) స్త్రీ తన దేహాన్ని పురుషుల లైంగికావసరాలను తీర్చుకుందుకు సమర్పించి అందుకు బదులుగా ధనాన్ని లేదా తదనుగుణమైనదేదైనా పొందటాన్ని పడుపుతనంగాను,

ఆపనిని వృత్తిగా సాగించడాన్ని పడుపువృత్తిగాను, ఆ వృత్తిని చేపట్టిన స్త్రీలను పడుపు కత్తెలుగాను చెప్పుకోవచ్చు[61].

మొదట దేవదాసీలుగా ఆలయాలకు సమర్పింపబడ్డ కన్యలు కాలక్రమేణా వ్యభిచారిణులుగా మారారు. వారి సంతానం అక్రమ సంతానంగా ముద్రవేయబడి సంఘంలో 'పడుపువృత్తి' చేయాల్సి వచ్చింది. అంతేగాక ఆంధ్రదేశంలో కొన్ని చోట్ల ధనికుల ఉత్సవాల్లో ఆడి పాడే భోగంకులం కూడా పడుపువృత్తి చేపట్టింది. తక్కువ కులాలనబడే వారిలో చాలమంది ధనంకోసం పడుపువృత్తిని స్వీకరించారు.

గోదావరిజిల్లాలో వేశ్యల్లో సానులు, భోగంవారు, బొమ్మలసానులు, తురక సానులు, మంగలభోగములు, మాదిగభోగములు అనే ఆరు తెగల్ని గురించి హెమింగ్‌వే ప్రస్తావించారు.

శైవుల్లో బసవి, మాదిగల్లో మాతంగి మతపరంగా వైష్ణవుల దేవదాసీలవలె మొదట మతానికే అంకితం చేయబడి తర్వాత పడుపు వృత్తిలోకి దిగినవారే.

మొదట 'గుడిసేటి' అనే పదం మంచి అర్థంలోనే ఉండి కాలక్రమేణా 'లంజ' అనే అర్థంలోకి దిగజారింది. ఈ విషయాన్ని 'లంజ లేకపోతే గుడిరంజిల్లదు, మనసు రంజిల్లదు' అనే సామెత తెలుపుతుంది.

వేశ్యకు సిగ్గు, మొగమాటం ఉండరాదు. వగలుండాలి. మెత్తని మనసు ఉండగూడదు బిడియం లేకుండాలి. ఈ విషయాల్ని 'లంజకు సిగ్గైనా ఇల్లాలుకు సిగ్గు లేకపోయినా చెడుతుంది', 'వగల్ చేసేదేంటిరా, పైస దొబ్బేటందుకు' (హైసా IV-20) 'లంజమెత్తనైతే పోతూ పినతండ్రిని చేవగొట్టిపోయినాదట' 'లంజకు పిల్ల తెగులు, మాదేకుల వాడికి మాది తెగులు' అనే సామెతలు తెలుపుతాయి.

వేశ్యకు ఒకడే మగడుండడని, విటుడిచ్చిన డబ్బునిబట్టి మక్కువ చూపిస్తుందని, వారిని నమ్మరాదని, వేశ్యలకు సంసారగుణం వస్తే రాదని చెపుతున్న సామెతలు 'లంజకు ఒకడే మొగుడా ?', 'మిండడి రూవి ఎంతో లంజ మక్కువ అంతే', 'లంజల నమ్మరాదు గింజల నమ్మరాదు', 'పట్టపురాజు చేబట్టినానే గుడిసేటి ముండ గుణం మానునా ?' 'మన్మధుడే పురుషుడైనా మాయలాడి తన మంకు బుద్ధి మానదు' అనేవి.

వేశ్యకు పెట్టిన సొమ్ము తిరిగిరాదని, వారివలపు అబద్ధమని చెప్తున్న సామెతలు. 'లంజకు పెట్టిన పెట్టు గోడకుపూసిన సున్నం తిరిగి రావు', 'భోగముదాని వలపు, బొగ్గు తెలుపు లేదు' అనేవి.

వేశ్యలు డబ్బున్న వాణ్ణే చేరదీస్తారని, వీరిలో వయసును సొగసును బట్టి రేట్లుంటాయని. పొగాకుకు, తపిటికి, పావలాకుకూడా పడుకునే అగ్గువ సరుకు ఉంటుందని సామెతలు చెప్తున్నాయి. 'వారవనిత ధనికువేరదీయగోరు' 'వగలు ఎందుకంటే పొగాకు కోసం అండిట' (రా. వ. 590) 'తవుటికి అంకాడ బోతే కూటి తపిలె కోతి కొంపోయినట్లు', 'పావలాకు పడుకుంటే పందుం బియ్యం బేపి తినిపోయిందిట' అనేవి పై విషయాల్ని తెలిపేవి.

బీద, ధనిక భేదం లేకుండా చాలమంది తమ ఆదాయాల్నిబట్టి వేశ్యలకోసం పోయేవారని, అది గౌరవప్రదంగా భావించేవారని సామెతలద్వారా తెలుస్తున్నది. 'లంజ లేందే గంజి దిగదు' (నర) 'గంజి తాగినా లంజ కావాలి', 'పయికము లేని వాడు పరస్త్రీ వర్జితుడు' (కార్. 1394), 'పావు సంపాదన గాడికి వరహా లంజ వరసగాదు', 'డబ్బులేని వానికి బోగముది తల్లివరుస' అనేవి పై విషయాల్ని తెలిపే సామెతలు. తక్కువ సొమ్మిచ్చి ఎక్కువసేపు అనుభవించిన మగవాణ్ణి ఈసడించిన సామెత' ఇచ్చేది కాసు....తాసు, (క. గా. పు. 264) అనేది. తాసు అంటే గంటన్నర కాలం.

ఊరికే వస్తే బోగం పడుచులు కావాలి అనేవారు కోమట్లు, సన్యాసులు, వారు లోభిత్వంతో. వీరు దరిద్రంతో. 'బోగంవీధి కొల్ల బోయిందంటే సన్యాసులు గోచులు విప్పుకు బయలుదేరినారంట' (రా, వ. 457) 'బోగం వీధి ఈటుపోయిందంటే కోమట్లంతాగోచులు సర్దుకున్నారట' అనేవి పై విషయానికి సాక్షులైన సామెతలు.

వేశ్య ముదిరితే కొరగాదని, విటులు రాకపోతే సంసారి అవుతుందని 'లంజ ముదిరినా ముంజ ముదిరినా పనికిరావు', 'లంజ ముదిరి సంసారి అయినట్లు' అనే సామెతలు తెలుపుతాయి.

వేశ్యల అందంపైన పటారమని, వేశ్యాసాంగత్యం రోగాలకు మూలమని చెప్పే సామెతలు 'మీద మెరుగులు, లోన పురుగులు', 'అరఘడియ సంభోగం ఆరుమాసాల సుఖరోగము', 'సంకటాలవిత్తు సానివాని పొత్తు' అనేవి.

వేశ్యలు మానాభిమానాలకు వెరవరని, వారికు వాక్చాతుర్యం మెండని ఈ సామెతలు చదివితే తెలుస్తుంది. అందులోనూ నెల్లూరు నెరజాణల వాక్చాతుర్యం మరీను. 'ఉంకు ముండ బజారు రచ్చకు వెరచునా వీరపతివ్రత వెరచుగాని', 'పిల్లా పిల్లా పెట్టనిస్తావా అని రావూరు రసికు డడిగితే లమ్మనయ్యా అన్నాదట నెల్లూరు నెలజాణ', 'తెల్లవారిన సంగతి నీకెలా తెలిసింది అని ఒక రసికు డడిగితే దయ

టికి పోవాల్సివచ్చింది అన్నదట పల్నాటిసీమ పశువు, పాపం వెంపలబారింది అన్న దట పాకనాటి సీమ వెలయాలు, రాంబూలం అపచి అయింది ఉన్నదట నెల్లూరు నెఱజాణ' అనేవి ఆ సామెతలు.

వేశ్యబిడ్డకు తండ్రి ఎవరో తెలియదని, వేశ్యకొడుకు తండ్రికి తద్దినంపెట్టడం, లంజ పితర్లకు పెట్టడం హాస్యాస్పదాలని, 'లంజబిడ్డకు తండ్రెవరు?', 'లంజ కొడుకు తండ్రికి తద్దినం పెట్టినట్లు', 'లంజ పితాళ్లకు పెట్టి ఆకాశం చూపిందట' అన సామెతలు వ్యంగ్యంగా చెప్తున్నాయి.

మొరటుగా ఏవస్తువును ఉపయోగించినా త్వరగా పాడై పోతుందని, వృద్ధ వేశ్యకు వృద్ధవిటుడే గతి అని 'బోగందాని చళ్లకు సంత నారబాయలకు గోటి గాళ్లెక్కువ', 'చళ్లజారిన ముండకు వట్టలు జారిన విటగాడు' అనే సామెతలు తెలుపుతాయి.

వేశ్యలమీద అధారపడి జీవించే పరాన్న భుక్కులు తార్పుడుగాండ్రు. 'వేద కాలంలో న్యాయనిర్ణేతలుగా గుర్తించబడ్డ యాజ్ఞవల్క్యుడు, విష్ణువు తాము వ్రాసిన సంహితలలో తార్పుడు వ్యక్తులను గురించి ప్రస్తావించి తార్పుడు వృత్తిని మహా పాపకృత్యంగా ఖండించారు[64]. వేశ్యలకన్న తార్పుడు కత్తె లేదా తార్పుడుగాడు ఒక్కోసారి ఎక్కువ సంపాదించుకోవడం, సౌకర్యాలనుభవించడం జరుగు తుంటుంది. ఆ ముచ్చట ఈ రెండు సామెతల్లో ఉంది. 'తార్చిన దానికి టంకము, వెళ్లిన దానికి ఏగాని', 'నడుమడిగే కుంటెనగానికి కంబారు, కపాయి(కైపు)సారా'

విటునికి, వేశ్యకు మధ్య పానకంలో పుడకకన్నా ఇబ్బంది పెట్టేది వేశ్య మాత. విటుని వద్ద డబ్బున్నన్నాళ్లే రానిస్తుంది. ఒకవేళ వేశ్య విటునిపై మోహం పెంచుకొని డబ్బులులేకుండా రానిస్తుంటే నిర్మొహమాటంగా చెఱకు తిని పిప్పిని బయట పారేసినట్లు నిర్ధనుడైన విటుణ్ణి మెడబట్టి నూకిస్తుంది. అందుకే వేశ్య మాత ఉండే వేశ్యను తగులుకొంటే ఇబ్బంది అని, వేశ్యమాత చస్తే మొప్పకోసం ప్రియులు చూడవస్తారుగాని వేశ్యచస్తే ఎవరూ మొహం చూపించరని 'తల్లి గల లంజను తగులుకుంటే తప్పయా', 'బోగందాని తల్లి చస్తే అందరూ పరామర్శించే వాళ్లేగాని బోగందే చస్తే తొంగిచూసేవాళ్లుండరు' అనే సామెతలు తెలుపుతున్నాయి. 'దొంగ పొరుగున కాపురం చేయవచ్చునుగాని లంజ పొరుగున కాపురం చేయ జాలము' (సా) అనేది సంసార్ల అనుభవపూర్వకంగా చెప్పిన సామెత.

వేశ్యలు సంపాదించిందంతా అలంకరణలకు, తాగుడుకూ. తార్పుడు కాం(డ్రకూ సరిపోతుంది. వృద్ధాప్యంలో కుక్క చావు చస్తున్నారు. ఆ విషయాన్ని 'రంగం (రంగూన్) సొమ్ము లంకు సొమ్ము నిలువదు' అనే సామెత తెలుపుతుంది.

వేశ్యకు వావి. వరుసల్లేవని భంగ్యంతరంగా చెప్పే సామెత 'లంజ మంచానికి తల తట్టేమి. కాళ్ల తట్టేమి ?' అనేది.

3.1.8 దొంగతనం వృ : చౌర్యం చతుష్షష్టి కళల్లో ఒకటి. ఎరుకలు బోయలు. యానాదులు నేరస్థ జాతులు. వీరిని పూర్వం రాజులు తమ స్వప్రయోజనాలకు వాడుకొనేవారు. అట్టివారిని సరిహద్దుల్లో ఉంచి పరరాజులపై ఉసికొల్పుతూ ఉండాలని కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో వ్రాశాడు.63

సమాజం దొంగతనాన్ని ఒక న్యాయమైన వృత్తిగా గుర్తించక పోయినా, పై చెప్పిన కులాలవారు అందరో, కొందరో దీనిని వృత్తిగా స్వీకరించారు.

దొంగకు భయముండగూడదని, దొంగతనం చేయబోయే ఇల్లు అను పాన్లు ఆ యింటి సేవకుని ద్వారా దొంగ తెలుసుకుంటాడని 'దొంగకు భయము లంజకు సిగ్గూ పనికిరావు', 'దొంగకు తోడు దొరకు సాక్షి', 'ఇంటివాని లేపి దొంగవానికి కట్టె యిచ్చినట్లు' అనే సామెతలు చెప్తున్నాయి.

'దొంగా మనిషే' (కార్ 1200), కొత్తగా ఊడిపడడని ప్రజలకు తెలుసు. బీదవాళ్లో, సోమర్లో, దొంగలు అవుతారన్న సత్యాన్ని ప్రజలు బాగా తెలిసికొని ఉన్నట్లు 'బీద బలిసి బందికాడైనట్లు'. 'ఒళ్లు వంగనివాడు దొంగలలో కలిసినాడట' (హైసా. VII-4) అనే సామెతలు తెలుపుతున్నాయి. భిక్షాటన అనాదలపని. దొంగతనం దొరతనం లాంటిది అని 'దొంగిలించేటంత దొర తనముండగా అడుక్కుతినేటంత అదవతనమేల ?' అని దొంగల ప్రశ్న. దొంగకుండవలసిన పరికరాల్లో కత్తి ఒకటి. అందుకే ఎప్పుడూ 'కన్నగాడు కత్తి మరువడు'.

'దొంగ సంగతి దొంగే ఎఱుగును', 'దొంగను దొంగయే పట్టవలెను' (సా. సా. 257) అందుకే దొంగల్ని బట్టేందుకు ఎరుకల్ని బోయల్ని తలార్లుగా నియమించడం జరిగేది.

ఎంత నేర్పరి దొంగ అయినా ఎపుడో ఒకసారి దొరక్కపోడు. కాని అంత వరకు దొరలాగే తిరుగుతుంటాడు సంఘంలో. ఈ విషయాల్ని 'పాత దొంగ వక్క రోజున దొరకక మానడు' (కార్. 2463) 'దొరికితే దొంగ దొరకకపోతే దొర' అనే సామెతలు తెలుపుతున్నాయి.

తను దొంగ అయితే అందర్నీ అనుమానిస్తాడని 'దొంగ కందరిమీద అను మానం', 'తను దొంగయితే పొరుగును నమ్మడు' (నర) అనే సామెతలు చెప్తాయి.

కాలం ఎదురు తిరిగినపుడు దొంగపడే కష్టాల్ని 'కన్నంలో దొంగకు తేలు కుట్టినట్లు' (గృ. ల. 387), 'దాగిపోయి తలారి ఎదుట దాగినట్లు' 'కొల్లకు పోయి పై చీర (బట్ట) పోగొట్టుకున్నట్లు' అనే సామెతలు తెలుపుతున్నాయి.

దొంగలు దొంగసొమ్మల్ని వ్యాపారులకో, ధనికులకో మురికగ్గవగా అమ్మాల్సి వస్తుంది. సరియైన ధర రాక దొంగలు పేదవారుగానే మిగులుతుంటారు. రాజు దొంగల్ని శిక్షించి వారి ఆస్తుల్ని లాక్కోవచ్చుకూడా. ఈ విషయాల్ని 'దొంగల సొమ్ము దొరలపాలు' అనే సామెత విశదీకరిస్తుంది.

గుమ్మడికాయ, పుచ్చకాయి, చేనులో పంట లాంటివి కూడా దొంగతనాలు జరుగుతుంటాయి. ఈ విషయాన్ని తెలిపే సామెతలు. 'గుమ్మడికాయల దొంగ అంటే భుజాలు తడుముకొన్నట్లు', 'పుచ్చకాయల దొంగ అంటే భుజాలు తడుము కొన్నట్లు' (రాత్రంతా అవి మోసిమోసి నొప్పులు వచ్చి) 'దొంగకు చేను పచ్చిలేదు' అనేవి. చివరి సామెతలో రైతు ఎక్కువ నష్టపోతాడు అనే విషయం ధ్వనిస్తుంది. 'ఇంగువ దొంగతనం' దొంగలు పారికి పోయేందుకు లాంటివి దారితీస్తాయి.

ఇంటి యజమాని అజాగ్రత్తగా ఉంటే దొంగతనాలు జరుగుతాయని, పేద వానికి దొంగల భయంలేదని 'దొంగను పుట్టించిన వాడు మతిభ్రష్టును పుట్టించక మానడు' (కార్. 1194) 'గోచిపాతలరాయుడు దొంగల మిందడు' అనే సామెతలు తెలుపుతున్నాయి.

దారి గట్టుమీద కూర్చొని ఒక దొంగ ప్రయాణీకుల్ని బెదిరించేవాడట 'లేస్తే మనిషినిగాను' అని. బాటసారులు భయపడి సొమ్ము అక్కడపెట్టి పారిపోయే వారట. ఈ విషయాన్ని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తమ కథలు—గాథలు(పుట.560) లో ఇలా వివరించారు. 'కొంగల మల్లాయగట్టు' అంటూ నైజాం దేశ ప్రయాణంలో తగులుతుందట. కొంగల మల్లాయి వృద్ధుడైన పిమ్మట ఆగట్టు శిఖరం అధిష్ఠించి కూర్చుండి 'లేస్తే మనిషినిగాను' అనే వాడట.

3.1.9 భిక్షాటన వృత్తి : ఆంధ్రప్రదేశ్‌లో 2 మిలియన్ల ప్రజలు భిక్షకులుగా ఉన్నట్లు ఒక అంచనా. భిక్షగాళ్లను 1. మతపరమైన భిక్షుకులు - దాసరి, జంగం 2. కులభిక్షుకులు - ఆయా కులాల ప్రజల దగ్గరే భిక్షాటన చేస్తూ వారి కులాల గొప్ప తనాన్ని, వంశావళిని, గోత్రాల్ని పొగుడుతూ, ఆయా కులదేవతలకథల్ని ప్రస్తుతిస్తూ

ఉండేవారు. పిచ్చుగుంట్ల, మాస్టీగ, వీరముష్టి, ఇత్యాదులు (వివరాలకు చూ.పట్టిక 4) 3. సంగీతమో, నృత్యమో, సాము గరిడీలో చేస్తూ భిక్షమెత్తేవారు. పగటివేష గాళ్ల, దొమ్మర్లు, ఇత్యాదులు. 4. సోది చెప్తూ, తెల్లవారుజామున వాయించే వాద్యాల నాదాన్ని బట్టి ఆయా ఇండ్లకు సంబంధించిన మంచిచెడ్డలు చెప్తూ భిక్షమెత్తే వాళ్లు. ఎరికల, బుడబుడకల ఇత్యాదులు 5. అసహ్యకరమైన, భయంకరమైన పనులు చేస్తూ భిక్షం పెట్టించుకునే భిక్షుకులు; మొండి, బంద ఇత్యాదులు 6. ఇవేవీలేకుండా భిక్షం అడుక్కునే వారు అని ఆరువిధాలుగా విభజించవచ్చు.

'వచ్చికంకులే దాసరీ అంటే రాలినకాడికి గోవిందా' అనే సామెత దాసర్ల విషయాన్ని, 'జగడమెట్లా వస్తుంది జంగమయ్యా అంటే భిక్షం పెట్టవే బొచ్చు ముండా అన్నాడట' అనే సామెత జంగాల్ని గురించి చెప్పిన సామెతలకు ఉదాహరణలు.

పగలంతా ఎండకు తిరిగితేనే తప్ప కడుపునిండదని, బ్రతిమలాడకుంటే బిచ్చంవేయరని, భిక్షపుకూడు దొరికిందాకా నమ్మకంలేనిదని, గృహస్థులు వేసే సద్దో, సారకో తినాలిగాని, ఇది కావాలి అది కావాలి అంటే కుదరదని 'నెత్తికాల నిదే బోలె నిండదు', 'అడక్కుంటే జోలె అడుక్కుపోతుంది', 'తిరిపపు కూడుకు బర్కతు లేదు, తిన్నవలకు నమ్మికలేదు'. 'అడుక్కుతినే వాడు పెరుగన్నము కోరినట్లు' అనే సామెతలు తెలుపుతున్నాయి.

బిచ్చగానికీ, బీదవానికీ ఒకరిమీద మరొకరికి కోపం అని, బిచ్చగాడు దొంగలకు భయపడాల్సిన పనిలేదని 'బిచ్చపువాణ్ణి చూస్తే బీదవానికి కోపము, (కార్. 1607) 'బీదవాడు బిచ్చపు వాడికి లోకువ', 'గోచిపాతలరాయడు దొంగల మిండడు' అనే సామెతలు వ్యక్తంచేస్తున్నాయి.

కొంతమంది భిక్షవేయకపోగా తిట్టను, కొట్టను వస్తారని, కుక్కల్ని ఉసి కొల్పుతారని 'పెట్టిపొయ్యనమ్మ కొట్టవచ్చిందట', 'నీబిచ్చం లేకపోతే మానె గాని నీ బేపిని కట్టెయ్యి అమ్మా' అనే సామెతలు చెప్తున్నాయి.

'పెట్టకపోయినా పెట్టే ఇల్లు చూపమన్నారు' భిక్షుకులు. కొత్తగా భిక్షాటన చేసేవాడు వేళ తెలుసుకోలేడు అని 'కొత్త బిచ్చగాడు పొద్దెరుగడు' అనే సామెత తెలుపుతుంది. బిచ్చగాళ్లకు పెట్టి దెప్పడం పాపమని ప్రజల నమ్మకం. 'పెట్టి దెప్పి తివో, పెద్దల తిడితివో' అనే సామెతల్లో భిక్షుకులకు పెట్టి దెప్పడం, పెద్దలను (పితరులను?) తిట్టినంత పాపం అనే అంతరార్థం ఉంది.

'ముష్టెత్తుకొనుటకంటె పస్తుండుట మేలు' అని మానుషమున్నవారు అనుకుంటారు. బిచ్చగాళ్లు ఒక ఊర్నే అంటిపెట్టుకొని ఉండరు అనే విషయాన్ని 'అడుక్కొని తినే వాళ్లకు అరవై ఊళ్లు' అనే సామెత, తిట్టినా తింటి పెడితే చాలు అనే భిక్షుకుల పరాధీనధోరణికి 'బోలెడు తిట్లయినా బొక్కెడు కొట్టులు కావు' (క. గా. పుట. 12) అనే సామెత సాక్షులు.

ఏరాజు రాజ్యానికి వచ్చినా బిచ్చగాళ్ల పరిస్థితి మెరుగుపడదని 'ఎవరు రాజైనా ఏరక తినేది తప్పదు' (చంద్ర) అనే సామెత, తక్కువవారికి అధికారం వస్తే గర్వ మెక్కువ అనే విషయాన్ని 'అడక్కతినే వాడికి బవాయిస్తే అర్ధరాత్రి గొడుగు బట్టెనంట' (చంద్ర) అనే సామెతలు చక్కగా విప్పి చెప్తున్నాయి.

**3.1.10.** ఈ ఉపప్రకరణంలో సాగిన చర్చ ఆధారంగా రెండు మూడు ముఖ్యాంశాల్ని పేర్కొనవచ్చు. వ్యవసాయ వృత్తిని గురించి సమగ్రంగానూ, మిగతా వృత్తుల్ని గురించి పాక్షికంగాను సామెతలు లభిస్తున్నాయి. వ్యవసాయ సామెతల ప్రాముఖ్యాన్ని, వాటిని రైతులు అనుసరించాల్సిన ప్రాధాన్యతను 1928 లో రాయల్ కమీషన్ గుర్తించి చెప్పిన మాటలివి. 'ఆంధ్రదేశంలో పలుతావుల్లో వ్యవసాయ విధానం చాలా ఉన్నత ప్రమాణాల్ని సాధించింది. వరి వ్యవసాయం సమగ్రత్వాన్ని అందుకొంది .... పెక్కు వ్యవసాయ సామెతల విజ్ఞానం పలు పరిశోధనలకు నిలబడి నిజమైన విజ్ఞానంగా నిరూపించుకొంది.'64 ఇలా వ్యవసాయ సామెతల ప్రాముఖ్యాన్ని ఆంగ్లేయులు చక్కగా గుర్తించి లోకానికి చాటారు.

1928 వరకు పడుపు వృత్తి చేసుకొనేవారికి అనుమతి పత్రాలు ఇచ్చేవారు. ఇప్పుడు పడుపు వృత్తి చట్ట విరుద్ధమైనా సంఘ వ్యతిరేక శక్తుల ప్రోద్బలంతో భారీ వ్యాపారంగా నిరాటంకంగా సాగుతూనేవుంది.

ఈ విధంగా సామెతల్లో వేర్వేరు వృత్తుల్ని గురించిన ప్రజల అభిప్రాయాలు నమ్మకాలు, అపనమ్మకాలు చక్కగా ప్రతిబింబితమైనాయి.

సూచికలు :

1. — predynastic tombs in Egypt, an early Sumerian house in Mesopotomia (3500 E. C.) and lake dwellings in Switzerland and Italy associated with neolithic man have yielded grains of wheat of a comparatively advanced type, which must have been preceded by long ages of culture. Flax and Barly were also grown - Encyclopedia Britannica.

2. వ్యవసాయ సామెతలు - ఉపోద్ఘాతం.

2ఎ No race can prosper till it learns that there is as much dignity in tilling a field as in writing a poem - Washington.

3. Andhra Pradesh: The Granary. P. 6

4. South Agricultural Folklore - C. Benson. Agricultural Journal of India. (P. 124)

5. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పు. 9-10.

6. త్రివేణి, పు. 203, 'నల్లదాన్ననుకున్న వేమొ - నమ్మదేమొ సీదుమనసు నల్ల రేగడి దున్ని చూడు - తెల్ల జొన్నలు పండవేమొ'

7. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పు. 9-10.

8. ఆశ్వయుజం (సెప్టెంబరు - అక్టోబరు)

9. జూన్ - జూలై

10. భాద్రపద పౌర్ణిమ

11. జ్యేష్ఠ - ఆషాఢములు (మే - జూన్)

12. భాద్రపదం (ఆగష్టు - సెప్టెంబర్)

13. 14. ఆం. ప్ర. దర్శిని.

15. మాండలిక వృత్తి పదకోశము (వ్యవసాయము)పు. 307 - 319

15ఎ. మార్గశిర పౌర్ణిమ

17. మాం. వృ. కో. (వ్యవ.) పు. 323 - 327.

18. ,, పు. 327

21. ,, పు. 322

22. ,, పు. 320

23. ,, పు. 321 - 322

24. ,, పు. 323

24. ఆం. ప్ర. దర్శిని, పుట. 8

25. వాన రాకపోతే చేసే కప్ప సంబరం. ఒక కర్రకు గుడ్డ ఉయ్యాలగట్టి దాంట్లో కప్పను పెట్టి ఇద్దరు పిల్లలు భుజానవేసుకొని పాడుతూ ఊరంతా తిప్పుతారు. (మాం. వృ. కో. పు. 419)

26. కృష్ణశ్రీ (సంపా.) పల్లెపదాలు పు. 1 ఆర్వీయస్ సుందరం, తెలుగు కన్నడ జానపదగేయాలు పు. 41-42,

26ఎ. నేదునూరి గంగాధరం (సంపా.) మిన్నేరు. పు. 343. తెలుగు కన్నడ జానపద గేయాలు - పుట. 41-42, ఆర్వీ యస్. సుందరం.

27. సూర్యుడు
28. బుధుడు
29. చంద్రుడు
30. శుక్రుడు
31. శని
32. అక్టోబర్ - నవంబర్
33. జూలై - ఆగస్టు
34. జనవరి - ఫిబ్రవరి
35. ఫిబ్రవరి - మార్చి
36. నైరుతిమూల
37. కడపజిల్లా రాయచోటి తాలూకాలో ఉంది.
38. ఆం. ప్ర. దర్శిని. పుట. 5 - 6

38ఎ. చైత్రపౌర్ణిమ
38బి. జ్యేష్ఠ పౌర్ణిమ

38సి. పెరటాశి. తిరుమలస్వామి వారి నెల, సెప్టెంబర్ - అక్టోబర్

39. "No high mountain ranges, no thick forests, the paucity of perennial rivers, a low rain fall, an enerrating climate-these are part of what nature has given to this land and no wonder its material progress is hampered" Quoted in planning and Development of Backward Regions, Govt., of A. P. (A Case Study of Rayalaseema, Vol I., P. 113 As quoted in "A Study of famines in Rayalaseema" K Srinivasulu Naidu, M. Phil., Dissertation in the Department of Economics, S V. University, Tirupati.

40. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పు. 441.

42. "A Study of famines in Rayalaseema, P. 49, 55.

43. గ్రామ దేవతల జాతరలో ఒక పెద్ద దూలమును ఏటవాలుగా ఎత్తి దాని చివరకు గొఱ్ఱెను ఒక గాలంతో వెన్నెముకకు గుచ్చి మూడుచుట్లు తిప్పుతారు. పూర్తి గాకుండా కింద పడితే 'పిడి పడింది' అంటారు.

(తె. సా. పు. 578)

44. Benson: "South Indian Folklore" - Agricultural Journal of India (P. 137)

45. ఆం. ప్ర. దర్శిని. పుట. 19

46. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పు. 267.

47. ,, పు. 267.

48. ,, పు. 278.

49. కంటిమీద తెల్లటి మచ్చ, ఇది ఒక కంటికి ఉంటే చెరుపు.
(మాం. వృ. కో. వ్యవసాయం పు. 370)

49ఎ. సరిబాలు 1. రూకల సరిబాలు, గొర్రెలు యజమానివే. వాటికి పుట్టిన పిల్లల్ని అమ్మితే డబ్బు చెరిసగం. 2. పిల్లల సరిబాలు, గొర్రెలు యజమానివే. వాటికి పుట్టిన పిల్లల్ని యజమాని, మేపేవ్యక్తి చెరిసగం పంచుకోడం.

50. మామూలుగా నల్ల గొడ్లకు వచ్చే జబ్బు: గొంతు వాపు, లోపల గుర్రు నోటి వెంబడి చొంగ (మాం. వృ. కో. (వ్యవ.) పు. 404)

51. ఊపిరితిత్తుల జబ్బు: శ్లేష్మం, గొంతు పట్టుకోటం, ఊపిరికుట్టు, ఎగపోత
(పై దే పు. 406)

52. తిరుగుతూ తిరుగుతూ గొడ్డు చచ్చిపోతుంది. దొమ్మవ్యాధుల్లో ఒకటి.
(పై దే. పు. 406)

53. శరీరంలో కొన్నిచోట్ల పెరిగే పుట్టరణం - క్యాన్సర్ (పై దే పు. 409)

54. తల్లో పుండుపుట్టి అయిదారు నెలల్లో కొమ్ము వాలిపోతుంది. (పై దే)

55. ఒక రకం అంటురోగం, గిట్టల్లో పురుగులు పడి నడవలేకపోవడం.
(పై దే పు. 403)

56. వణుకు, జ్వరం, కడుపుబ్బు, ఒళ్లు బిగుసుకుపోవడం.

57. నోటివెంబడి చొంగ, పశువు గడ్డితినదు, నడువలేదు. (పై దే పు. 402-3)

58. పసిడి పలుకులు, పు. 197.

59. పసిడి పలుకులు, పు. 196.

60. పసిడి పలుకులు, పు. 196.

61. పడుపు వృత్తి. బి. భాస్కరరావు, ఆంధ్రప్రదేశ్ దర్శిని. పు. 701.

62. „ పు. 603.

63. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పు. 699-700.

64. "that, in many places, the system of agriculture followed has attained a very high standard in matter of common knowledge, the cultivation of rice in the deltas, for eg has reached a marked degree of perfection and the wisdom of many agricultural proverbs stands unchallenged by research". Royal Commission on Agriculture in India. Report, Culcutta, Govt., of India. P. 14.

## 3.2 తెలుగు సామెతలు - కులం

3.2.0 సజాతీయ సమూహం కులం అని అమరకోశం, విశ్వకోశం. కులాలు జన్మ ప్రాతిపదికపై ఏర్పడిన సామాజిక విభాగాలుగా నిర్ణయించవచ్చు. ఇతరులతో కలియక, తమ సమూహంలోనే భోజన వివాహాదులను జరుపుకుంటూ సాంప్రదాయ సిద్ధంగా వచ్చే వృత్తినే అవలంబిస్తూ, ఇతర సమూహాలతో భిన్నమైన సామాజిక గౌరవ ప్రవృత్తులు కలిగిన ఒకసవర్ణ ప్రజా సముదాయాన్ని కులం అనవచ్చని దాష్లే అభిప్రాయం. (ఆంధ్రప్రదేశ్ దర్శిని. పు. 685)

ఆర్థికంగా లేదా రాజకీయంగా లేదా సంఖ్యాపరంగా ఏ కులం అయితే ఆధిక్యత కలిగి ఉందో అట్టికులం ఆధిపత్యకులం అని శ్రీనివాస్ అభిప్రాయం. ఆంధ్ర ప్రదేశ్ పెక్కు గ్రామాలలో రెడ్లు కమ్మవారు ఆధిపత్య కులాలవారు. (ఆం. ప్ర. దర్శిని పు. 687).

తెలుగు ప్రజల్లో ఒక్క బ్రాహ్మణుల్ని తప్ప మిగత కులాలవార్ని రెడ్లు వెలమ, కమ్మ, బలిజ కులాలవారు అంతగా గౌరవించరు. రెడ్లు, కమ్మవారు రాజ్యాలనేలేటప్పుడు క్షత్రియులుగా కవులచే కీర్తింపజేసుకొన్నారు. నిజానికి ఆంధ్ర దేశంలో 'క్షత్రియ' అనే కులం పేరు ఉండేది అగ్నికుల క్షత్రియులకే (పల్లి లేదా వన్నియ కులానికి) నని, రాజులు అనబడే కులానికి కాపు, కమ్మ, వెలమ కులాలు మూలమని థర్‌స్టన్ అభిప్రాయం.

సంఘంలో గౌరవాన్ని పెంచుకొనేందుకు ఇతర కులాలవారు రెడ్డి, నాయుడు, రావు, శెట్టి అనేవి బిరుదనామాలుగా పెట్టుకొంటున్నారు. కులాలకు గౌరవం ఆపాదించేందుకు బ్రాహ్మణ శబ్దాన్ని వాడుకొంటున్నారు. ఉదా: విశ్వబ్రాహ్మణ, నాయీ బ్రాహ్మణ, వాల్మీకి బ్రాహ్మణ ఇత్యాదులు.

మను ధర్మశాస్త్ర ప్రకారం (1 వ అధ్యాయం 88, 89, 90, 91 శ్లో.) యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతి గ్రహము, బ్రాహ్మణుల వృత్తి ధర్మాలు. క్షత్రియులకు పరిపాలన వృత్తి. వైశ్యులకు పశు పోషణ, వ్యవసాయం, వర్తకం వృత్తులు. పై మూడు వర్ణాలవారికి సేవచేయడమే శూద్రుల ధర్మం. బ్రాహ్మణకులం వంటి ప్రయోగాలున్నందువల్ల వర్ణం, కులం, ఏకార్థాలని చెప్పవచ్చు.

ఆంధ్రదేశంలో పౌరోహిత్యాది వృత్తులు బ్రాహ్మణులే చేస్తుండగా, రెడ్డి, కమ్మ, వెలమజాతులు రాజ్యాలేలి క్షత్రియులుగా చెప్పుకున్నారు. వైశ్యులకు వర్త

కమే ప్రధానమైంది. వ్యవసాయం కాపు, కమ్మ, బలిజ కులాలవారి ప్రధానవృత్తిగాను ఇతర కులాలకు రెండవవృత్తిగాను ఉంది. ఒకే వృత్తిని వేర్వేరు కులాలు చేస్తుండ వచ్చు. ఉదా॥ సాలె, దేవాంగ, తొగట, కురుబ, మాలకులాల వారికి నేతపని వృత్తిగా ఉంది. అయితే క్షురకర్మ మంగళ్ల వృత్తిగాను; కుండలుచేయడం కుమ్మరి వారి వృత్తిగాను; బట్టలుతకడం చాకలివారి పనిగాను; బంగారుపని, కమ్మరం వడ్రంగం, ఉప్పుచేయడం అనే వృత్తులు కంసాలి, కమ్మరి, వడ్రంగి, ఉప్పరల కుల వృత్తులుగానే ఉన్నవి. వేరే కులాలవారు ఈ వృత్తుల్లో ప్రవేశించలేదు.

ప్రతికులం ఔన్నత్యంకోసం ఏదో పుక్కిటి పురాణాన్ని ఆధారంగా చూపి తమ వంశపురుషుణ్ణి దేవుడిగానో, దివ్యపురుషునిగానో, మహర్షిగానో చెప్పుకుంటుంది. కొన్ని కులాల పేర్లు వారు చేసే వృత్తినిబట్టి (కమ్మరం, కుమ్మరం. ఉప్పరి) రాగా, కొన్ని ప్రదేశాన్ని బట్టి (ఒడ్డె) వచ్చాయి.

1968 అంచనాల ప్రకారం కమ్మర్లు 24,629 మంది, వాల్మీకి కులంవారు 22 354 మంది, యానాదులు 2 05,381 మంది, ఎరుకలవారు 1,28 024 మంది ఉన్నారు. 1974-75 అంచనాల ప్రకారం షెడ్యూల్డు కులాలవారు 64.63,000 మంది, షెడ్యూల్డు తెగలవారు 18,46.000 మంది ఉన్నారు. (ఆంధ్రప్రదేశ్ ఆల్మనక్)

**3.2.1 సామెతల్లో కులప్రసక్తి :** 768 సామెతల్లో కులప్రసక్తి వచ్చింది. కులాన్ని గురించిన సాధారణ విషయాలను చెప్పిన సామెతలు 67.

పూర్వం కులవృత్తిని ఎంతో గౌరవించేవారని, ఆయా కులాల భోజనం అలవాట్లను ఇతరులు ఏవగించుకొన్నా ఆ కులంవారు ఏవగించుకొనేవారు కారని, 'ఎన్ని విద్యలైనా కులవిద్యకు సాటిరావు', 'అమృతమైనను చవుల జాత్యన్నసమమె అనే సామెతలు చెపుతాయి.

అగ్రకులంవాణ్ణి బీదవాడైనా ఇతరవర్ణాలవారు గౌరవించగా, అదే కులం వారు ఈసడించుకొంటారని 'కూటికి పేదైతేనే కులానికి పేదా', 'కలిమి కులాల మిండడు', 'కలిమిగలవాదే కులముగలవాడు' అనే సామెతలు తెలుపుతాయి.

ధనవంతులౌతూనే తగ్గుకులంవారు కులం మరచి విర్రవీగుతారని భావించే అగ్ర వర్ణాలవారి అసూయ 'కూడు కలిగినవాడు కులము మరచినట్టు' అనే సామెతలో ప్రతిబింబిస్తున్నది.

అభ్యున్నతికైనా, అధోగతికైనా ఏ కులానికి ఆ కులమే కారణమని 'జాతికి జాతి తెగులు నీటికి నాచు తెగులు' అనే సామెత చెప్తుంది.

గుణం కులాన్నిబట్టి వస్తుందని, తక్కువ జాతివారికి నిక్కు, నీటు ఎక్కు వని వారిని తగు దూరంలో ఉంచాలని సామెతలు చెప్తున్నాయి. అంతేకాదు; అగ్ర వర్ణులు మిగత కులాలవారు తలెత్తి తిరగటాన్ని సహించలేరని, దిగుజాతులవారిలో కొందరికి కొందరైనా ఈ నిరంకుశత్వాన్ని ఎదిరిస్తారని చెప్పే సామెతలు ఇవి. 'కులం కొద్దీ గుణం', 'పుట్టుకతోనే బుద్ధులు కులంతోనే గుణాలు', 'కించిత్తు బట్టా కారం' (భ్రష్టాకారం) (నర), 'తక్కువ జాతికి నిక్కెక్కువ, తవ్వెడు బియ్యానికి పొంగెక్కువ', 'కులము తక్కువ వానితోటి, కుజ్జువానితోటి పరిహాసము కూడద న్నట్లు' అనేవి. తక్కువ జాతివారు కడుపునిండా తినడంకూడా సహించని సంఘటన లకు 'కులము తక్కువవాడు కూటికి ముందు', 'తక్కువజాతికి ఎక్కువ కూడైతే తిక్కతెగులు' అనే సామెతలు సాక్షులు కాగా, వారికి తాగుడు ఎక్కువని 'తప్పతాగి కులము మఱచినట్లు' అనే సామెత స్పష్టపరుస్తుంది.

ఒక కులాన్ని తిడితే అది ఆ కులంలోని వ్యక్తులందరికీ వర్తిస్తుందని 'కులానికి నా సాదు అంటే తలా గంపెడు అన్నాడట' అనే సామెత తెలుపుతుంది.

కుల విరుద్ధమైన పనులుచేసిన వారిని కుల పెద్దలు కులంనుంచి వెలివేస్తుంటారు. ప్రాయశ్చిత్తం చేసుకుంటే వారిని మళ్లీ కలుపుకుంటారు. కులం నుంచి వెలివేయ బడినవాడు ఒడ్డునబడిన చేపలా గిలగిల్లాడతాడు అనే విషయాన్ని 'కూడు వుడికిన వెనుక పొయ్యిమండుతుంది. కులం చెడ్డ వెనక బుద్ధివస్తున్నది' (శ్రీపాద) అనే సామెత చెప్తున్నది. ధైర్యస్థులు 'కులం చెడ్డా సుఖం దక్కవలె' అనగలరు.

బ్రాహ్మణుల్లో వివిధ గోత్రాల వారున్నారు. శూద్రుల్లో నిషిద్ధ వస్తువు లేదా కార్యం గోత్రంగా పిలువబడుతుంది. సగోత్రీకుల్లో వివాహాలు చేసుకోకూడదు. ఆ కుదురుకు నిషిద్ధ వస్తువుగా చెప్పినదానిని ఎట్టి పరిస్థితుల్లోనూ ఉపయోగించ రాదని 'పాత్ర మెఱిగి దానము గోత్రమెరిగి పెండ్లి' (సా. సా. 308), 'కులం చెడినా గోత్రం చెడకూడదు (నర)' అనే సామెతలు తెలుపుతాయి 'కులం కన్నా గుణం ప్రధానం' అనే సజ్జనులు నూటికో కోటికో ఒకరు.

పిల్ల అనాకారిదైనా ఆయా కులాల్లోనే పెండ్లి చేసుకొనే వారని, కులం తెలుసుకోనిదే పిలిచి పిల్లనిచ్చినా అంగీకరించేవారుకాదని, 'కులమింటికోతి అయినా మేలు'. 'కోరి పిల్లను ఇస్తామంటే కులం తక్కువ అన్నట్లు' అనే సామెతలు స్పష్టపరుస్తున్నాయి.'కులహీనమైనా గుణ హీనము కారాదు'(వప) అనేవారు అరుదు.

ఏకులం ఎక్కువ, ఏది తక్కువ అనే తర్జన భర్జనలకు పోకుండా ఈ ఉప

ప్రకరణంలో అకారాది క్రమంలో కులాల్ని చర్చించడం జరిగింది. ఆయా కులాల ప్రక్కన ఇచ్చిన సంఖ్య ఆ కులాలమీద ఉండే తెలుగు సామెతల సంఖ్యను తెలుపుతుంది.

(థర్‌స్టన్ 'The Castes and Tribes of Southern India' అనే గ్రంధాన్ని ఏడు సంపుటాల్లో సంతరించాడు. థర్‌స్టన్ అని ఉన్నచోట్ల పై పుస్తకం నుంచి ఉటంకింపు యిచ్చినట్లు. సామెత పక్కన థర్‌స్టన్ అని ఉంటే థర్‌స్టన్ ఇంగ్లీషులో ఇచ్చిన సామెతకు నా భావానువాదమని గమనించాలి)

3.2.2 ఈడిగ (4) : ఈత, తాటి కల్లుతీసే వృత్తిగల కులం. వేర్వేరు ప్రాంతాల్లో ఈడిగ, ఈంద్ర, గమళ్ల, గమండ్ల, అపిలీలు అనే పేర్లతో వీర్ని పిలుస్తున్నారు. 'ఈడ్చు' అనే ధాతువు నుంచి పుట్టింది 'ఈడిగ' పదం.వీరు తమను వ్యాసుని సంతతిగా చెప్పుకుంటారు (థర్‌స్టన్).

వారి వృత్తిని గురించి చెప్పే సామెత 'ఈడిగ వాని ఇంట్లో పాలుతాగినా కల్లే అంటారు' అనేది. వారు స్నేహానర్హులని, అపనమ్మకస్థులని 'కొని తింటూ ఉంటే కోమటి నేస్తం, ఇచ్చితీసుకుంటూ ఉంటే ఈడిగ నేస్తం', 'వ్రాసే వాణ్ణీ కోసే వాణ్ణీ, గీసే వాణ్ణీ నమ్మరాదు' అనే సామెతలు చెపుతాయి.

3.2.3 ఉప్పర (5) : ఉప్పు చేసేవారు. బావులు, చెరువులు తవ్వడం, మంటి గోడలు పెట్టడం చేస్తుంటారు. రూపురేఖల్లోను, చేసే పనుల్లోను ఆచార వ్యవహారాల్లోనూ ఒడ్డెలకు దగ్గరగా ఉంటారు. వారి స్త్రీలు కష్టజీవులు. భర్తతో పాటు మట్టి పని చేస్తారు. ఆ విషయాన్ని 'ఉండి ఉండి ఉప్పరిని తగులుకుంటే తట్టకాక తన్ను తగిలిస్తున్నాడు', 'ఉండి ఉండి ఉప్పరవానితో పోతే చచ్చేదాకా తట్టల మోతే' అనే సామెతలు వివరిస్తాయి. రెంటికీ చెడిపోవడాన్ని 'ఉప్పర సన్యాసం ఉభయ భ్రష్టత్వం', 'కోమటి వైష్ణవము ఉప్పర సన్యాసము' అనే సామెతలు చెపుతాయి. కులవృత్తి పోగొట్టుకొని కూడా సన్యాసి కాలేక ఉభయ భ్రష్టులౌతారట.

3.2.4 ఎరుకల(8) : సంచార జాతి. కొరవ కొరచ అని కొన్నిప్రాంతాల్లో, ఎరుకల అని దత్తమండలాల్లో వీరిని పిలుస్తారు (థర్‌స్టన్). 'ఎరుకోయమ్మ ఎరుక' అంటూ స్త్రీలు సోదిచెప్తుంటారు కాబట్టి ఎరుకల వాళ్లు అనే పేరు వచ్చిఉంటుంది. పగలు స్త్రీలు సోది చెప్పే నెపంతో ఇండ్ల ఆనుపాన్లు తెలుసుకొంటారని, రాత్రిళ్లు మగవారు దొంగతనాలు చేస్తారని చెప్పబడింది. వీరు అపనమ్మకస్థులు అని 'ఎరుకలోని మాట యాడికి నిజము?' (నర) అనే సామెత తెలుపుతుంది. అడవిలో కరివేపాకు కోసి

ఊర్లలో అమ్ముకుంటుంటారు. కరివేపాకు కోసేటప్పుడు ఏదో వాగుడు వాగకపోతే కరివేపాకు వాసన పోతుందట. ఆ విషయాన్నే 'చెవిగోసిన మేక, కరివేపాకుకోసే ఎరుకలవాడు ఊరకుండరు' అనే సామెత చెప్తుంది.

ఎరుకలవారి సోదె మీద కొందరికి నమ్మకంలేదు. 'గద్దెకు పోతే సుద్దులు తక్కువ' (నర) అంటారు. వీరు బాగా తాగుతారు. పంచాయతీలో వభ్యులందరికి కల్లు పోయించాల్సిందే. పోయించకపోతే 'కల్లు లేకపోతే వట్టినోట మాట్లాడగూడదు' (థర్‌స్టన్) అని వారి ప్రతిజ్ఞ. వారిని కొన్ని ప్రాంతాల్లో తలార్లుగా పెట్టుకుంటారు, 'దొంగను బట్ట దొంగే కావాలని'.

ఎరికల, యానాది ఇలాటి జాతుల్లో బహు భార్యాత్వం ఉంది. కాన్పు అయిన స్త్రీకి సవతులు విషంలాంటిదిస్తారేమోనని కాన్పు అయిన స్త్రీ బదులు ఆమె భర్త పథ్యం ఉంటాడు. ఈ విషయాన్ని 'సింగి నీళ్లాడితే సింగడు ఇంగువ తిన్నట్లు' అనే సామెత తెలుపుతుంది. ఎవరింటైనా భోజనం, పెరుగు తించే దొంగతనం చేయరు, పెరుగులో ఉప్పు వేస్తారు కాబట్టి అలా దొంగతనం చేస్తే 'తిన్న ఇంట్లో దొంగతనం చేసినట్లవుతుంది' అని వారి విశ్వాసం. ఎరుకలు శవాన్ని వీలైనంత తొందర తొందరగా ఇతరుల కంటబడని చోట పూడ్చివేస్తారు. ఈ విషయాన్ని 'కోతిశవం, కొరవ సమాధి కనిపించవు' (థర్‌స్టన్) అనే సామెత తెలుపుతుంది.

3.2.5 ఒడ్డె (8) : మట్టిపని వీరి వృత్తి. రాళ్లు కొట్టడం, బావులు తవ్వడం, చెరువు కట్టలువేయడం కూడా చేస్తారు. ఒరిస్సా నుంచి పూర్వమెప్పుడో వచ్చిన వారు. ఒరిస్సా ప్రజల్ని ఓఢ్ర, ఒడ్డె అని తెలుగువారు పిలుస్తారు కాబట్టే ఈ కులం వారికి 'ఒడ్డె' అనే పేరు వచ్చింది.

వీరు కష్టజీవులు. స్త్రీ పురుష తారతమ్యం లేకుండా కష్టపడి పనిచేస్తారు. పుష్టిగా తింటారు. తాగుతారు. కాబట్టి వచ్చిన డబ్బులు వచ్చినట్లే ఖర్చయిపోతాయి. డబ్బు మిగలక పోవడానికి శివునిశాపం కారణంగా చెప్పుకుంటారు. శివుడు, పార్వతి భూమి మీద నడుస్తుండగా ఎండకు వారి చెమట బిందువులు రాలాయి. శివుని చెమటనుంచి పార, పలుగుతో వడ్డె పురుషుడు, పార్వతి చెమట నుంచి తట్టతో వడ్డె స్త్రీ పుట్టిందని ఐతిహ్యం (థర్‌స్టన్). డబ్బులకోసం యజమానుల్ని పీకు పీడిస్తారు. పరుషంగా మాట్లాడతారు. ఈ విషయాల్ని 'వడ్డోడికి పెండ్లాము పెద్దది కావాల (తట్ట ఎత్తను), కాపోడికి గొడ్డు పెద్దది కావాల' (నర). 'వడ్డెవానికి బిడ్డ అయి పుట్టే దానికంటె ధరణీపతికి దాసి అయి పుట్టేది మేలు', 'కొండంత

సంపద కూడినా పొగమంచుల్లాగా కరిగిపోతుంది'(థర్స్టన్). 'ఒడ్డె పీకుడూ ముడ్డి పీకుడూ ఒకటే', 'నాగుబాముకు కోరల్లో విషం, ఒడ్డెలకు నాలుకపై విషం' (థర్స్టన్) అనే సామెతలు తెలుపుతాయి. ఒడ్డెలు ఎత్తు తక్కువ గుడిసెల్ని వేసుకుంటారని. 'ఒడ్డెలు గుడిసెల్ని నెత్తినే పెట్టుకొని ఉంటారు' (థర్స్టన్) అనే సామెత తెలుపుతుంది.

3.2.6 కంచరి (2) : కంచుపని చేయడం వీరి వృత్తి. పంచాణంవారిలో ఒక కులం. 'ఒరగ బెట్టి తాగేది చెటిచెరా కంచరవాడు' అనేది రంధ్రం పడిన చెంబునో, తట్టనో ఇవ్వగా చెడగొట్టడమేగాని, బాగుచేసివ్వలేదని ఎవరో అన్న సామెత. కంచు పనిలో సుత్తితో కంచు పాత్రలను బాదుతుంటారు. బోలెడంత శబ్దం వస్తుంటుంది. (దీనికి సజీవమైన ఉదాహరణ: తిరుపతిలో ఉండే గాలివీధి. దాన్ని 'గోలవీధి'గా నేను పిలుస్తుంటాను ముద్దుగా) 'కంచరి వారింటి పిల్లలు తాటాకు చప్పుళ్లకు బెదరరు' అనే సామెత పై విషయాన్నే తెలుపుతుంది.

3.2.7 కంసల (27) : కంసల, కంచర, కమ్మర, వడ్రంగి, శిల్పి (కాసె) అనే ఐదు కులాల్ని పంచాణంవారు, విశ్వబ్రాహ్మణులు అని అంటారు. వారు తమని బ్రాహ్మణులతో సమంగా భావించుకొని బ్రాహ్మణుల ఆచార వ్యవహారాల్నే పాటిస్తారు. విశ్వకర్మ కొడుకులు కమ్మరాచార్య, వడ్లాచార్య, కంచరాచార్య, కాసాచార్య, అగసాలాచార్య అనేవారు. వారి సంతతే పంచాణంవారు (థర్స్టన్). కంసల అగసాలె, విశ్వకర్మ సమానార్థకాలు. బంగారు, వెండి పనిచేయడం వీరి వృత్తి.

'విశ్వకర్మ లేనిది విశ్వంలేదు' అనే సామెత వారి అవసరాన్ని గుర్తించి చెప్పేది. కంసాలిని మిగతా వర్ణాలవారు ససేమిరా నమ్మరు, అంతో ఇంతో బంగారు కాజేస్తారని, రేపురా, మాపురా అని తిప్పుతుంటాడని. వీరు కాలంలో బాగుంటారు. కరువులో చెడిపోతారు. కరువులో ప్రజలకుతిండికే లేకుంటే బంగారేం కొంటారు? నగలేం చేయిస్తారు? బంగారు పనిచేసేందుకు కంసాలివారి ఇండ్లలో చిన్న చిన్న కుంపటి పొయ్యిలు దండిగా ఉంటాయి. ఆ విషయాన్ని పరిహసిస్తూ చెప్పిన సామెత ఒకటుంది. 'సూదేటు వాణ్ణి, సుత్తేటువాణ్ణి, కండేటు వాణ్ణి నమ్మరాదు', 'అగసాలినీ వెలయాలినీ నమ్మరాదు', 'తల్లి పుస్తె బంగారమైనా అగసాలి దొంగిలించకుండా ఉండలేడు', 'ఇచ్చి తిరిగితే కోమటి, తీసుకొని తిప్పేది కంసాలి', 'కంసాలి పెళ్లికి ఇల్లంతా పొయ్యిలే' అనేవి పై విషయాల్ని చెప్పే సామెతలు.

విశాఖపట్నం కంసాలులిండ్లలో మాలలు తప్ప మరెవ్వరూ భోం చెయ్యరు. 'అన్ని కులాలకన్నా అగసాలివాడు ఏడు వీశెలు తక్కువ' (థర్స్టన్) అని ఇతర కులాలవారి నమ్మకం.

మిగతా వర్ణాల వారు కంసాలుల ఇండ్లలో భోంచెయ్యరు అనే దానికి 'కంసాలికూడు కాకులు కూడ ముట్టవు' అనే సామెత సాక్షి.

చెవులు మొదట కంసాలి చేతనే కుట్టించుకొనే సాంప్రదాయాన్ని 'నా చెవులూ కంసాలే కుట్టాడు' అనే సామెత తెలుపుతుంది.

3.2.8 కమ్మ (17) : కమ్మ, కాపు, రెడ్డి, వెలమ, తెలగ కులాల్ని గురించి చెప్తూ రూపురేఖల్లోనూ, ఆచార వ్యవహారాల్లోనూ, సాదృశ్యాలు ఎక్కువ వున్నందు వల్ల ఈ కులాలు ఒకే ద్రావిడ జాతి నుంచి విడిపోయి ఉండవచ్చునని ఫ్రాన్సిస్ (మద్రాస్ సెన్సెస్ రిపోర్ట్, 1901) చెప్పారు.

కమ్మవారు మొదట సైనికులుగా ఉండి తర్వాత రైతులుగా మారారట. కమ్మ శబ్ద వ్యుత్పత్తిని గురించి 8 ఐతిహ్యాలున్నాయి. అందులో నాలుగు: 1. ఋషులు రాక్షసులపోరు పడలేక విష్ణుని ప్రార్థించగా, లక్ష్మీదేవి తన చెవికమ్మ తీసి బిఁణెలో పెట్టి ఇచ్చి వంద సంవత్సరాలు పూజించమంది. వారు అలాగే చేయగా గడువు తీరింతర్వాత 500 మంది వీరులు పుట్టి రాక్షసులను చంపారు. తర్వాత ఋషులకోరికపై రైతులయ్యారు. 2. రాజా ప్రతాపరుద్రుని ఒక అమూల్యమైన కమ్మ శత్రువులచేతబడగా కాపుల్లో ఒక తెగ దాన్ని గెల్చుకొచ్చినందువల్ల కమ్మ వారుగా ప్రసిద్ధిపొందారు. 3. స్త్రీలఘోషాను తీసివేసేందుకు కమ్మలో (తాటాకు) ఒప్పందం చేసుకొని, ఒప్పుకొన్నవారు కమ్మవారు ఒప్పుకోకుండా విడిపోయిన వారు వెలమలు. 4. తల్లి కమ్మలు లాక్కునిపోయినవారు కమ్మవారు అని, కాపులు (చేతి ఆభరణాలు) లాక్కుని పోయినవారు కాపులు అని ఒక ఐతిహ్యం. (నా పరిశోధక విద్యార్థి శ్రీపార్థసారథి నాయుడు చెప్పింది.)

కమ్మవారు మంచి రైతులు. కష్టశీలురు. ఈ విషయాన్ని 'కమ్మవారికి భూమి భయపడుతుంది' (థర్స్టన్), 'కమ్మవారి చేతులు కట్టినా నిలువవు' (థర్స్టన్) అనే సామెతలు వివరిస్తాయి. వీరు నల్లనేలలుండే చోటే ఉంటారు అని 'తుమ్మ ఉన్నచోటనే కమ్మ ఉండును' అనే సామెత చెప్తుంది.

వీరు అవిశ్వాస పాత్రులని, గుట్టుగా ఉంటారనే దానికి 'కమ్మనీ తుమ్మనీ నమ్మరాదు', 'కమ్మ గుటు కడపదాటదు' అనే సామెతలు సాక్షులు.

'కమ్మవాండ్లుచేరితే కడమ జాతులు వెళ్లతవి' (థర్‌స్టన్) అనే సామెత వీరిచే పీడింపబడిన దిగుజాతులవారన్నది.

వీర్ని పిసినార్లుగా చెప్పిన సామెతలు 'కమ్మసీచు కడిగినా పోదు, కాకిచిప్ప పెట్టి గోకినా పోదు', 'కమ్మత్యాగంబు భువిలోన నమ్మకమ్మ' అనేవి.

గంపకమ్మ అనేది కమ్మల్లో ఒక శాఖ. స్త్రీలు కుడిపైట వేసుకుంటారు. ఇద్దరక్క చెల్లెళ్లు చెరువులో స్నానంచేస్తూ ఉంటే రాజు చూశాడనీ, ఒకామె గంప చాటుకు, మరొకామె గోడచాటుకు వెళ్లిందని. వారి సంతతే గంపచాటు, గోడచాటు కమ్మలని ఒక ఐతిహ్యం (మద్రాస్ సెన్సెస్ రిపోర్ట్, 1891). గంపకమ్మవారి నవవధువులు అత్తారింటికి గంపలో సూడిదలు తీసుకవెళ్తారు (హెమింగ్‌వే). 'నిండి దరిజేరనీయదు గుండ్లకమ్మ (నది) కలిగి తిననీయదు గంపకమ్మ' అని వీరిపై సామెత.

పల్లెల్లో ఆధిపత్యంకోసం కాపు-కమ్మ కులాల మధ్య తెగని వైరం. 'కసు మాలపు కమ్మకులము కంపనాకాలదు, కట్టెనా కాలదు' అనే సామెతకు 'కసు మాలపు కాపుకులము కంపనా కాలదు, కట్టెనా కాలదు' అనేది తిప్పి కొట్టిన బాణం. సలిలంకమ్మ లంజం(సలిలం కం లం జలం)అని అమరం చదివితే కమ్మలంజలేం కాపులంజలెందుకు కాకూడదు అన్నాడట' అనే సామెత ఈ రెండు కులాల వైష మ్యానికి పతాక.

నాయుడు అనేది కమ్మల బిరుదనామం. కాని దీన్ని బలిజ, బెస్త, బోయ, ఏకరి, గవర, గొల్ల, కాలింగి, కాపు, ముత్రాచ, వెలమ కులాలవారు కూడా చేర్చు కొంటారు (థర్‌స్టన్). ఈ విషయాన్ని 'నానా కూళ్ల వాళ్లు నాయుళ్లైనట్లు', 'చక్కగా కూకోరా చాకలి నాయడా అంటే విన్నావటోయ్ ఈడిగ నాయుడా మంగలి నాయుడి సరసం అన్నాడట' అనే సామెతలు చెపుతాయి.

3.2.9 కమ్మరి (4) ఇనుపపనిముట్లు తయారుచేయడం వీరి వృత్తి. కాలిన ఇనుమును సాగగొట్టి వివిధ పనిముట్లుగా మార్చేందుకు మనిషి కుది మట్టంగా దృఢంగా ఉండాలని, 'కమ్మరమునకు కురచ వడ్రమువకు పొడవు మేలు', 'వడ్రం గానికి వదులు నాణ్యము కమ్మరానికి బిగువు నాణ్యము' అనే సామెతల్లో చెప్ప బడింది. ఒక వస్తువు తయారయ్యే చోటనే దాన్ని అమ్మజోవటం హాస్యాస్పదం అని 'కమ్మరి వీధిలో సూదులమ్మినట్లు' అనే సామెత తెలుపుతుంది.

3.2.10 కాపు, రెడ్డి (8) కాపు అంటే కాపాడేవాడు. రెడ్డి అంటే ప్రభువు

(స్టూవర్ట్). అప్పటి మద్రాస్ ప్రెసిడెన్సీలో బహు సంఖ్యాకమైన కులం 20) లక్షలు) అని థర్స్టన్ (1919). తమిళదేశంలో వెల్లాలన్, తెలుగుదేశంలో కాపులు వ్యవసాయం ప్రధాన కులవృత్తిగా గలవారు. మంచిరైతులుగా పేరెన్నిక గన్నవారు.

రెడ్లలో ఎన్నో తెగలున్నట్లు 'వడ్లపేర్లు చెప్పొచ్చుగాని రెడ్ల పేర్లు చెప్ప లేము' (థర్స్టన్)' రెడ్లకు, వడ్లకు పేర్లుచెప్పలేము' అనే సామెతలు తెలుపుతాయి. ముఖ్యమైనవి 14 తెగలని (పంట పద్నాలుగు కాపులు) థర్స్టన్ చెప్పాడు. పంట, పాకనాటి, మోటాటి, పెడగంటి, అయోధ్య, మురికినాటి, కొడిది, దేసూరి, యర్లం అనేవి అందులో కొన్ని.

పంటకాపులు మాగాణి ప్రాంతంలోనే ఉంటారని, వారి ఇంటికి పోతే ఏదో ఒక పనిపెడ్తారని, 'స్వాతికొంగ, పంటకాపు నీళ్లున్నచోటే ఉంటారు', 'పనిలేకుంటే పంటోళ్లింటికిపో, పందిటి గుంజకు కూడ పనిచెపుతారు' అనే సామెత లంటున్నాయి. పంటలో రెండు శాఖలు కాటంరెడ్డివారు, పెరమారెడ్డివారు. వీరిలో వీరికి పడదని కాబోలు, 'కాటంరెడ్డోరి కూడు తిని పెరమారెడ్డోరి పసులు గాచినట్లు' అనే సామెత పుట్టింది. పాకనాటి కాపులుగా చెప్పుకోడం ఘనమైనదని 'సాగితే పాకనాటివారు సాగక పోతే మోటాటివారు' అనే సామెత తెలుపుతుంది. 'దేసూరు రెడ్లపొందు (పొత్తు) దెయ్యపు పొందు (పొత్తు)' అని సామెత చెప్తుంది. మున్నూటి కాపులను గురించి 'మున్నూటి కులానికి ముప్పులేదు మొండికాలికి చెప్పులేదు' అనే సామెత వివరిస్తున్నది.

మందిబలం ఉండాల్సిన వ్యవసాయం రెడ్లు బాగా చెయ్యగలరని; వారికి సేద్యం అచ్చివచ్చినట్లు చదువు అచ్చిరాదని; తిండిపెట్టేరెడ్లే తిండిలేక మాడాల్సి వస్తుందని; కూతురు, కోడలు తేడాలేకుండా అందరూ సేద్యంపనులు చేయాల్సిందే నని; కాపు పీలైనంతవరకు హజారానికి గాని కోర్టుకుగాని పోడని సామెతలు చెప్తు న్నాయి. 'నేల దున్ని బ్రతికేవాడే రెడ్డి' (థర్స్టన్), 'గడ్డ గడ్డకూ గ్రుక్కెడు నీళ్లు తాగినా రెడ్డే వ్యవసాయం చెయ్యాల', 'బాపన సేద్యం బత్తెపుచేటు, కాపుల చదువుల కాసులచేటు', 'కాపు తిండిలేకనే కాలధర్మం పొందుతాడు' (థర్స్టన్), 'కాపుకు కూతురు, కోడలు తేడా లేదు' (థర్స్టన్), 'కాపు హజారానికి (కోర్టుకు) పోడు' (థర్స్టన్) అనేవి పై విషయాల్ని తెల్పే సామెతలు.

నల్లరేగడినేల కాపుకు అచ్చివస్తుంది. తమిళదేశంలో వీరు నల్లరేగడి ప్రాంతాల్లోనే ఉన్నారు. అందువల్లనే తమిళులు తమాషాగా వీర్నిగురించి చెప్పిన సామెత 'వడుగన్ (ఉత్తరదేశీయుడు) కు దేవుడు స్వర్గం ఇస్తానంటే స్వర్గంలో నల్లరేగడి ఉందా? అంటాడట' (థర్స్టన్) అనేది.

'కాపు అందర్ని కాపాడ్తాడు' (థర్స్టన్), 'చెడి కాపు పొరుగు చేరు బ్రతికి కమ్మ పొరుగు చేరు', 'ఉచ్చికాయంత బలిజోడు ఉంటే ఊరంతా చెడు తుంది, కందిగింజంత కాపోడుంటే కలిగ్గం (కలియుగం) బాగుపడ్తుంది' (నర) అనేవి రెడ్లను ప్రశంసిస్తున్న సామెతలు.

రెడ్లున్న ఊరిలో రేచులున్న కొండలో ఏమీ బతకవు', 'కాప కక్ష, కమ్మ కక్ష' (నర), 'కాపు వానికి కంది గింజకు సత్యంలేదు', (బెన్‌సన్ 416) 'కాపు కక్కసం కంసాలి కువాడం', 'కాపోన్ని కందిగింజను వేపట్లో ఏసి ఏంచినా పాపం పోదు' (నర) అనే సామెతలు కాపుల్తో అంతో ఇంతో పీడింపబడిన ఇతర వర్గాల వారు అన్న సామెతలు.

గ్రామ మునసబును రెడ్డి అంటారు. సాధారణంగా కాపువారే రెడ్డి ఉద్యోగం చేస్తుంటారు. రెడ్డి అధికారాన్ని, ప్రజల అభిప్రాయాల్ని 'పరిపాలన' అనే ఉప ప్రకరణంలో చర్చించాను.

కాపుల తిండిని గురించి 'కాపువాని పొట్ట, తమలపాకుల కట్ట తడపకుండా ఉండలేరు' (పప) 'మదేకాపోనికి మజ్జిగా సంగటి' (నర) అనే సామెత తెలుపు తాయి. కాపులు తమ కులస్తుల్లో ఒకరే పనిచేస్తే అందరూ ఆ పనే అనాలోచితంగా చేస్తారని 'కాపుదాటా, గొర్రెదాటా' (నర) అనే సామెత చెపుతుంది.

**3.2.11 కుమ్మర (25) :** ఇది కుంభకార శబ్దభవం. కుమ్మర్లు తాము శాలి వాహన సంతతి వారుగా చెప్పుకుంటారు. శాలివాహనుడు ఒక బ్రాహ్మణునికీ, కుమ్మరకన్యకు పుట్టినవాడు. కుండలుచేయడం వీరి వృత్తి. పూర్వం రాజుల ఇండ్లలో వంటవాళ్ల (మద్రాస్ సెన్సెస్ రిపోర్ట్ 1891) (స్టూవర్ట్). ఇప్పటికీ రైతుల ఇండ్లలో పెండ్లిండ్లలో వీరే వంటలు చేస్తుంటారు.

తగుచోట్ల విశిష్ట వస్తువులుండవని 'కుమ్మరి ఆవములో యత్తడి ముంత దొరుకునా' (కార్ 647), 'కుమ్మరావంలో రాగి ముంతలు ఏరగలమా?' అనే సామెతలు తెలుపుతాయి.

'ముక్కు కోస్తే మూన్నాళ్ళకొస్తుంది, కొప్పు కొయ్యరా కుమ్మరి మొగుడా' అనే సామెత వీరి అమాయకత్వాన్ని తెలుపుతుంది. వీరికి ఆవమే పెన్నిధి కాబట్టి 'కుప్పకాలితే మా అప్పుతీరుతుంది' అని అంటారు. ధనవంతులైన అగ్రవర్ణ స్త్రీలు బయటికి రాక పోవచ్చుగాని బీద వారైన కుమ్మర స్త్రీలు బయటికి రావడం విశేషం గాదు అని 'కుమ్మరవారింటి కోడలు ఆవంకట్టకు రాక ఎక్కడికి పోతుంది?' అనే సామెత చెప్తున్నది.

చిన్నదయినా పెద్దనష్టం కలిగిస్తుందని. నిర్మాణానికి ఏండ్లు పడితే వినాశానికి క్షణాలు పడుతుందని 'కుమ్మరావంలో గచ్చకాయవేసినట్లు' (గచ్చకాయ పగిలి కుండల్ని పగలగొడుతుందట), 'కుమ్మరికి ఒక యేడు, గుదియకొక పెట్టు' అనే సామెతలు విశదీకరిస్తున్నాయి.

కుమ్మర్లకు కుండలోకి ధాన్యం లేకపోవచ్చుగాని, కుండలుంటాయని 'కుమ్మరి వానికి కుండలు కఱవు, మాదిగకు చెప్పులు కఱవు ఉండవు', 'కుమ్మరికి కుండ కఱవా, కమ్మరికి తెడ్డు కఱవా?' అనే సామెతలు తెలుపుతాయి.

కుమ్మర స్త్రీలు కుడిపైట వేసుకొంటారు. అందానికి ఎడమ పైట వేసు కొన్నా పెండ్లిలో మాత్రం తప్పనిసరిగా కుడిపైటే వేసుకుంటారు. (మాండలిక వృత్తిపదకోశం, కుమ్మరం-పీఠిక) 'కులానికి కుడిపైట, అందానికి ఎడమ పైట' అనే సామెత పై విషయాన్ని తెలిపేదే.

3.2.12 కురవ (4) : గొర్ల పెంపకం, ఉన్నితీసి కంబళ్లనేయడం వీరి వృత్తి. 'కురు' అంటే కన్నడంలో గొర్రె అని, వాటిని మేపేవారు కురుబలని ఒక నిర్వచనం. వీరు మేపుతున్నారు కాబట్టి వాటికి కురుబ గొర్రెలు అనిపేరు వచ్చినట్లు కొందరం టారు. తమిళ కురుంబు అనే పదంనుంచి వచ్చిందని మరొక నిర్వచనం.

వీరు గొల్లలవలె అమాయకులనే విషయాన్ని 'కురవ తిక్క రాగి రొట్టె, పుర్రుబెల్లం, (నర) అనే సామెత తెలుపుతుంది. సుగాలీదయ్యం, కురవ దయ్యం పడ్తే వదలవనే ప్రజల నమ్మకానికి 'కులంగాదు తలంగాదు కురవోళ్ల పిల్ల దయ్యమై పట్టిందట' అనే సామెత సాక్షి.

3.2.13 కోమటి (87): వైశ్య శబ్దానికి సమానార్థకం తెలుగులో 'కోమటి' అనేది. వ్యాపారం చాలామాత్రం వీరిచేతిలోనే ఉంది. ఈ పదానికి వివిధ నిర్వచ నాలు : 1. కోమతి: నక్కజిత్తులమారి, 2. గోమతి: పాలుపాల్యము, 3. గోవు మనసు కలవాడు, 4. కన్యకాపరమేశ్వరీ పురాణాన్ని బట్టి: దావానలం

చుట్టు ముట్టినపుడు గోవువలె అరుస్తూ శిష్టని వేడినారు కాబట్టి గోమతి పేరు వచ్చింది. 5. గోవునుంచి ఉద్భవించినారు కాబట్టి 6. ఒక గర్భవతిని గోవు పొడిచిన కొట్టంలో కోమట్లు సమావేశమైనారు కాబట్టి 7. గోదావరికి స్థానికనామం గోమతి. దీని తీరంలో వీరిసంఖ్య ఎక్కువ కాబట్టి సంస్కృత గోమతి, తెలుగులో కోమటి అయి ఉండొచ్చునని థర్స్టన్ సిద్ధాంతం. వైశ్యుల బిరుదనామం శెట్టి/చెట్టి/శ్రేష్ఠి.

సామెతలు ఆధారంగా కోమట్ల స్వరూప స్వభావాల్ని ఇలా వింగడించొచ్చు. వీరిలో గౌరవర్ణం వారు అరుదు స్థూలకాయులు. పిరికివారు. అధికారులుగా అసమర్థులు. యుక్తిపరులు. తెలుగు భాషాభిమానులు. అపనమ్మకస్థులు, పొదుపరులు. దానపరులు, కళారాధకులుకారు. గుప్తవ్యాపార భాషగలవారు. ధనవంతులు. 'ఎఱ్ఱ కోమటినీ, నల్ల బ్రాహ్మణ్ణీ నమ్మరాదు', 'షావుకారు చతికిల బడితే పీట వెల్లకిల బడింది', 'కోతి పులిగాదు కోమటి దొరగాడు', 'కోమటి ఎంత పేద అయినా నిమ్మకాయంత బంగారు ఉంటుందన్నట్టు' అనేవి పై విషయాల్ని నిరూపించే సామెతలు. కోమట్లు ధనవంతులు కాబట్టే 'చెడినా సెట్టి సెట్టే చిరిగినా పట్టు పట్టే', 'నెల తక్కువైనా కోమటింట పుట్టమన్నారు' అనే సామెతలను ప్రజలనుకుంటుంటారు.

కోమట్లు పరదేశం వెళ్లేందుకు జంకరు అనే విషయాన్ని 'కొంగ కాక చెఱువని లేదు కోమటికాక ఊరని లేదు' అనే సామెత తెలుపుతుంది. వాగు పరదేశంలో ఉన్నా భాషాభిమానంతో 'తెలుగు శేట అరవ అధ్వాన్నం' అని చెప్పుకుంటారు.

వారి పిరికితనానికి మెతక దనానికి సాక్షులు 'కోమటి పిరికి కొట్టితే వురికి' (కార్. 726), 'నాలుగు కాళ్ల జీవాలలో మేకమెత్తనిది, రెండుకాళ్ల జీవాలలో కోమటి మెత్తన', 'కోమట్ల కొట్లాట గోచి ఊగులాట' అనే సామెతలు.

కోమట్లు విశ్వాసపాత్రులు కారని 'కోమటి విశ్వాసము' (కార్. 728) 'కోడికి కళాసం లేదు కోమటికి విశ్వాసం లేదు' అనే సామెతలు, సరియైననేస్తాలు కారనేందుకు 'కొని తింటూ ఉంటే కోమటి నేస్తం, ఇచ్చి తీసుకుంటూ ఉంటే ఈడిగ నేస్తం' అనే సామెత ఉదాహరణలు.

కోమటి సాక్ష్యం నమ్మేందుకు వీలుగానిదని 'గోడమీద పిల్లి వాటము కోమటి సాక్ష్యము', 'ముందు చూస్తే అయ్యవారి గుఱ్ఱంగా వుంది వెనుక చూస్తే సాహెబు గుఱ్ఱంగా ఉంది' అనే సామెతలు సాక్షులు.

కోమటి యుక్తికి, తెలివైన సంభాషణకు 'శెట్టిగారూ, మాలో ఎవరు బాగుంటారు ? అని లక్ష్మీదేవి, జ్యేష్ఠాదేవి వచ్చి అడిగితే 'చిన్నక్కలోపలికి వస్తే

బాగుంటుంది. పెద్దక్క బయటికి పోతే బాగుంటుంది అన్నాడట'. అంటే యుక్తిగా పిరిని ఆహ్వానించి దరిద్రాన్ని వెళ్లగొట్టడమన్నమాట. 'అరే ! పెంట తినే కోమటీ! అంటే ఏమోయ్ బెల్లం తినే సాయెబు అన్నాడట'. ఇందులో బెల్లం అంటే శిశ్నం అనే దురర్థం కూడా ఉంది.

కోమట్ల వ్యాపారాన్ని గురించి చెప్పిన సామెతల్లో వారి గుప్త వ్యాపార భాషను, సొమ్ము నాణ్యాన్ని సరిగ్గా నిర్ణయించే సామర్థ్యాన్ని గురించి, లాభ దృష్టిని గురించిన సామెతలున్నాయి. వారి గుప్త వ్యాపార భాషలో పాతిక ($\frac{1}{4}$) నుంచి వేయిదాకా సంఖ్యలకు గుప్త సంజ్ఞలున్నాయి. ఉదా॥ 'గాలంతో బేరం మొదలు పెడ్తే మూలంతో ముగుస్తుంది' (థర్స్టన్). గాలం అంటే పది (వరహాలు) మూలం అంటే ఐదు (వరహాలు). 'చెల్లీ చెల్లడములకు చెట్టిగారున్నారు' (దారి దోపిడి గాంధ్రతో), 'వరదబోయిన సెట్టి లాభాన వస్తాడు' (చి.సు.) అనేవి. చివరి రెండు సామెతలు కోమట్ల యుక్తి సంభాషణకు ఉదాహరణలు.

సర్వనాశనాన్ని చెప్పేటప్పుడు 'కోమటి ఇల్లు కాలినట్లు' అని చెపుతారు. కోమటికి ధనం ఎంతుందో బతికుండగా బయటికి తెలియదు అనే దానికి 'చచ్చిన తరువాత తెలుస్తుంది శెట్టిగారి బండాలము' (కార్. 2326) అనే సామెత; ఎప్పుడూ వ్యాపార గొడవల్లో ఉండే కోమటికి కళారాధన కుదరదని 'బంగారువంటి కోమటి సంగీతముచేత బేరసారములుడిగెన్' అనే సామెత తెలుపుతున్నాయి.

కోమట్లు-వేశ్యల పొత్తును 'వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు', 'భోగం వీధి ఈటు పోయిందంటే కోమట్లంతా గోసులు సర్దుకొన్నారట' అనే సామెతలు వివరిస్తాయి.

కోమట్లకో దానగుణంలేని విషయాన్ని 'వైశ్యుల పెండ్లిలో వితరణ లేదు' 'ఉల్లిపాయ పెట్టిన కోమటి ఊరంతా ధారపోసినట్లు' అనే సామెతలు విశ్లేషిస్తున్నాయి.

కోమట్లకు లౌకిక దృష్టి ఎక్కువ, భక్తి తక్కువని 'శెట్టిగారూ తుమ్మితే ఏమనుకుంటారు? అని త్రిమూర్తులు మారువేషంలో వచ్చి అడిగితే, జలుబుచేసిందని అనుకుంటారు అన్నాడట' (రామా! కృష్ణా! అని ఇష్టదేవతను అనుకోవడం పరిపాటి), 'కోమటి భక్తుడుగాడు తగరం కత్తిగాదు', 'కోమటి వైష్ణవము, ఉప్పర సన్యాసము' అనే సామెతలు చెపుతాయి.

'కోమట్ల బొంగురుగొంతును చెప్పేవి 'కొండమీద దెబగుబలేమంటే కోమట్ల రహస్యాలు ...న్నట్లు' (కార్. 685), 'కొలమ కవతలగట్టున కోమట్లు

గుసగుసలాడితే ఇవతలగట్టున వినబడిందట' (థర్స్టన్) అనే సామెతలు.

ఉల్లి కోమట్లకు నిషిద్ధమనే విషయాన్ని 'ఉల్లిదిన్న కోమటి ఊరకున్నట్లు' (నోరు తెరిస్తే కంపని) అనే సామెత తెలుపుతుంది.

మిగతా కులాలవారికి వీరిమీదుండే కసికి 'ధనియాల జాతి' అని నిందించడమే ప్రమాణం.

కోమట్లు ఇతరులదురంతాలకు బలై పోయే ఉదంతాలకు 'ఊరి శని వచ్చి పీరిశెట్టిని కొట్టినదట', 'ఊరి పిడుగు వచ్చి పీరిశెట్టిని కొట్టుకొని పోయినది' (కార్.353) అనే అన్యాయపురికథల్లో చెప్పబడిన సామెత ఉదాహరణలు. 'లావుశెట్టిగారు కొర్రకు సరిగ్గా సరిపోతారు' (థర్స్టన్) అనే సామెతకూడాపై విషయాన్నే తెలుపుతుంది.

3.2.14 క్షత్రియులు : రాజులు అనే పేర్తో ఒకకులం ఉంది. క్షత్రియులమని వీరు చెప్పుకుంటారుగాని కాదని వెలమ, కాపు, కమ్మ కులాలనుంచి వచ్చినవారని థర్స్టన్. రాజులను కులంగా చెప్పే సామెతలు ఇక్కడ లేనందువల్ల పరిపాలన అనే శీర్షిక కింద కులసంబంధంలేని రాజుల్ని గురించి చర్చించాను.

3.2.15 గాండ్ల, తెలిక (9) : నూనె తీయడం వీరి వృత్తి. హిందూశాస్త్రాల ప్రకారం నువ్వులనుంచి నూనె తీయడం మహాపాపమని, దేవతలకు దీపారాధనలో నూనె ఉపయోగిస్తారు కాబట్టి పాప పరిహారమవుతున్నదని గాండ్లవారి నమ్మకం. చాలా లాభదాయకమైన పనిని చెప్పేటప్పుడు 'తెలికవానికి నువ్వు పండినట్లు' అని; నిత్యమూ అవసరంగా ఉండే వస్తువును 'తెలికలవాడి ముడ్డి కింద రాయివలెనే' (కార్. 114) అని; ఆత్మీయులు తిట్టుకొన్నా, తిమ్ముకొన్నా మళ్లీ ఒకటైపోయి మధ్య వాళ్లని వేరుచేస్తారు అనే దానికి 'నూగులూ నూనే ఒకటే గాండ్లోడు వేరే' (నర) అనే సామెత; గాండ్లవారికి ఆశ ఎక్కువని 'గాండ్లవాని ఆశ గోతం పట్టదు' అనే సామెత తెల్పుతున్నాయి.

3.2.16 గొల్ల (31) : వీరు తమది శ్రీకృష్ణుని కులమని చెప్పుకుంటారు. వీరినే యాదవులంటారు. పశుపోషణ; గొర్రెల, మేకల పెంపకం; పాలు అమ్మడం వీరి వృత్తులు. గొల్ల శబ్దం గోపాల శబ్దం నుంచి వచ్చిందని ఒక నిర్వచనం.

గొల్లలు నమ్మకస్తులు, అమాయకులు. వీరి అమాయకత్వాన్ని చెప్పే జానపద కథలు కోలెదన్ని. ఈ విషయాలు చెప్పేసామెతల్లో మచ్చుకు కొన్ని: 'అతీసే ఉరేదో త్వరగా తీసెయ్యండి, నా మేకల కాపుకు వేళదాటిపోతుంది అన్నాడట'(కండిల)

'గొర్రె పిల్లను చంకలో పెట్టుకొని ఊరంతా వెదికినట్లు' (నర), 'ఎంత మంచి గొల్లోనికయినా వేపకాయంత వెర్రి ఉంటుంది' (నర) అనేవి.

లాభ దృష్టితో పాలల్లో నీళ్ల కలపడం తప్పనిసరిగా జరుగుతూనే ఉంటుంది. 'గొల్లవాడు తండ్రికైనా పాలల్లో నీళ్ల కలపక మానడు' (థర్స్టన్)అని సామెత. 'గొల్లంపుగాలి తోలితే గొల్లవాడు దుత్తలో నీళ్ల బారబోస్తాడు.' గొల్లంపు గాలితోలితే పెద్ద వర్షం వస్తుందని ఈ సామెత తెలుపుతుంది.

వీరు పేదలు. వీరి సంపాదన తిననూ, కుడవనూ మాత్రమే సరిపోతుంది. 'గొల్లవాని కొమ్ము హెచ్చనూ హెచ్చదు తగ్గనూ తగ్గదు' అని సామెత.

గొల్లవాడు గొర్రెమీద కోపం తెచ్చుకుని రాయి విసిర్తే, కాలువిరిగి తానే మూపున మోయాల్సి వస్తుంది. ఈ విషయాన్ని 'గొర్లవాని కోపము మెడ మిందికి బరువు' (నర) అనే సామెత చెప్తుంది. వందలాది గొర్రెల్లో ఏది ఏదో తెలుసుకోగలడు గొల్లవాడు. 'గొల్లల గోత్రాలు గొర్రెల కెఱుక, గొర్రెల గోత్రాలు గొల్లల కెఱుక' అని సామెత.

'గొల్లవాడు గొర్రెలకాపలా కోసం కుక్కల్ని పెంచుతాడు. అవే గొల్ల కుక్కలు. పొలాల్లో రాత్రివేళలో గొర్రెలను మంద కట్టిస్తారు. గొల్లలకు పగలంతా వాటిని మేపడం, రాత్రి కాపలాకాయడంతో సరిపోతుంది. గొల్లలు ఊర్లోకి వచ్చేదే గగనం. ఆ విషయాలకు 'గొల్లింట గుఱ్ఱాలు కుక్కలు, ఆవులు ఆడుబిడ్డలు', 'గొల్లకుక్క ఊరు మరిగినా గొల్లోడు ఇల్లు మరిగినా కష్టము' (నర) అనే సామెతలు సాక్షులు.

3.2.17 చండాలులు (3) : శూద్రుడు, బ్రాహ్మణ స్త్రీకి పుట్టినవారు చండాలులని మనుధర్మశాస్త్రం. హరిజనులకు జాతివాచకంగా వాడుతున్నారు. 'కర్మ చండాలుని కంటె జాతి చండాలుడు మేలు', 'చట్రాతిలో నీరు చండాలవాటికలో బ్రాహ్మణ గృహం ఉంటుందా?' అని సామెతలు. మొదటి సామెతలో కులంకంటె గుణం ప్రధానమని, రెండవదానిలో ఒకటి అధోగతిలో ఉన్న కులం, మరొకటి అన్నిటి కన్నా పైనున్న కులం అని తెలుస్తున్నది.

3.2.18 చాకల (41) : చాకల శబ్దం 'చాకు' (ఉతుకు) శబ్దంనుంచి వచ్చింది. బట్టలుతకడం వీరి వృత్తి. పెండ్లిండ్లకు, దేవుని ఉత్సవాలకు కాగడాలు పట్టడం, పల్లకీలు మోయడం కూడ వీరిపనులే. దేవతా ఉత్సవాల్లో కోళ్లను, పొట్టేళ్లనూ నరికడం, తల కానుకగా తీసుకోడం చేస్తూంటారు. కాపు స్త్రీలు అత్తగారింటికిగాని,

చుట్టాలిండ్లకుగాని వెళ్లేటప్పుడు కానుకలు, పిండి వంటలు ఇత్యాది మోసుకొని, అంగరక్షకుడుగా చాకలి వెళ్తుంటాడు (థర్స్టన్).

పల్లెల్లో కొన్ని కొన్ని ఇండ్లకు ఒక చాకలి 'ఇంటిచాకలి'గా నిర్ణయమై ఉంటాడు. మాసిన బట్టల్ని ఉదయం తీసుకెళ్లడం, ఉతికి సాయంత్రం వెనక్కి వ్వడం, రెండు పూటలా భోజనం పెట్టించుకు వెళ్లడం జనపదాల్లో సంప్రదాయం. వీరు రైతుల బట్టలే కట్టుకుంటారు ఎవరి బట్టలైనా మొలకు చుట్టుకొని ఉతుకుతారు. ఈ విషయాల్ని 'వండిన కూడు వడకనిబట్ట', 'చినిగినవానిదే చినుగుతుంది చాకలివాని కొడుకు చందమామ', 'రాయడిది తలది, చాకలిది మొలది' అనేసామెతలు చెపుతాయి.

బెదిరించేవాడికిగాని చాకలి సరిగా ఉతకడని, కొత్త చాకలి మెప్పుకోసం బాగా ఉతుకుతాడని 'ఉతికే వాడికి (కొట్టేవాడికి) గాని చాకలి ఉతకడు', 'చాకలి కొత్త మంగలి పాత' అనే సామెతలు తెలుపుతాయి,

మంగళ్లు. చాకళ్లు ఒకరింట్లో ఒకరు భోంచెయ్యరు. ఎవరికి వారే ఉన్నతుల మని భావిస్తారు. లేచిపోయిన భార్యను చాకళ్లు తిరిగి తెచ్చుకొంటారని తాము వదలి వేస్తామని మంగళ్లు అంటారు (ఆం. ప్ర. ద. పు. 692). ఈ కులాల మధ్య వైష మ్యాన్ని చెప్పే సామెతలు 'చాకలి అత్తా, మంగల మామా' (కార్. 861), 'చాకలి వాడె భార్యకు మంగలివాడు విడాకులిచ్చినట్లు', 'చాకిరీ చేసే చాకలికి లేదుగాని గొరిగే కొంతయ్య కిస్తారు' అనేవి. 'మంగలికొండోజి మేలు మంత్రుల కంటెన్' అన్న రాయల చాటువును ఈ చివరి సామెత తలపింపచేస్తుంది. ఈ రెండు జాతులు కలిసి వ్యవసాయం చేస్తే 'చాకలి మంగలి పొత్తు ఇంటికి రాదిత్తు' అని సామెత. చద్ది అన్నం సారం చాకలికి తెలుసునని (చద్దిఅన్నం రైతులు చాకళ్లకు పెడతారని, పొద్దునే ఉతకను బోతూ చద్దిఅన్నంతిని పోతారని). ఉతికేటప్పుడు ఏవో లల్లాయి పదాలు పాడుకున్నా అది సంగీతంకాదని, 'చద్ది మూటలో సారం చాకలి ఎఱుగును' 'చాకిరేవు ఒక చోట ఏలపాట ఇంకొక చోట', 'సంగీత విద్యకు చాకల ఎల్లి' అనే సామెతలు తెలుపుతాయి.

చాకళ్లు మిగతాకులాలవారికి బట్టలు అరువుగా ఇస్తారనే విషయాన్ని 'చాలీ చాలని దానికి చాకింట గుడ్డలు శానా వున్నవి' (కార్. 864) అనే సామెత తెలుపుతున్నది.

గ్రామస్థులవ్యాధులు ఎవరికి తెలియకపోయినా బట్టలుతికే చాకళ్లకు తప్పక తెలుస్తుందని 'ఊరి గబ్బు చాకలి ఎఱుగును, ఉద్యోగి జబ్బు బంట్రోతు ఎఱుగును'

అనే సామెత, ఎంతమంది బట్టలైనా ఒకరివి మరొకరికి మార్చకుండా సరిగా జోడించి తెచ్చిచ్చే చాకలి చదివినవారికన్న నయమని 'చదివినవానికన్న చాకలివాడు నయము' (కార్. 847), 'చదివినతనికన్న చాకలితతి మేలు' అనే సామెతలంటున్నాయి. వీరికి సంతానమెక్కువ అనే విషయాన్ని 'చాలీచాలని దానికి చాకలి సంతు అన్నట్లు' అనే సామెత తెలుపుతున్నది. కాపు కన్నెలు సమర్తాడినపుడు ధరించిఉన్న చీర చాకలికివ్వడం ఆనవాయితీ అని 'ఆడకాడక సమర్తాడితే చాకలోడు కోక ఎత్తుకొని పోయినాడట' అనే సామెత చెపుతుంది.

చాకలి పురుషులకు పై వర్ణాలస్త్రీలతోను. పై వర్ణాల పురుషులకు చాకలి స్త్రీలతోను ఉండే అక్రమ సంబంధాల ముచ్చట 'సాగినమ్మ చాకలివాడితో పోతే అది వ్రతమేమో అనుకున్నారట', 'చాకలిదానితో సహవాసం చేస్తే గాడిద వచ్చి గర్వపడిందట' అనే సామెతల్లో ఉంది.

భాగవతాలు ఆడేటప్పుడు కాగడాలు పట్టడం చాకళ్ల పని. వాద్యాలువాయించడం మంగళ్లపని. వారు సరిగా వెలిగించకపోతే, వీరు సరిగా వాయించకపోతే 'పైకము బాగోతపువారికి తిట్లు చాకలి మంగలివారికి' వస్తాయి. 'రెంటికి చెడ్డ రేవడువలె' అనేది ఉభయ భ్రష్టుత్వాన్ని చెప్పే చక్కని కథా సామెత. నీటబడిన గుడ్డను తీసుకొని రాబోతే గట్టున గుడ్డలు దొంగలెత్తుకొని పోయినారు. కొట్టుకొని పోయినది అట్లేపోయినది. ఇట్లు చాకలి రెంటికీ చెడినాడు. (తె. సా. పు. 516)

3.2.19 **తంబళి (8):** తెలుగు మాట్లాడే దేవాలయ అర్చకులు. గోదావరి కృష్ణా, నెల్లూరు జిల్లాల్లో బ్రాహ్మణులుగా, మిగతాచోట్ల శూద్రులుగా పరిగణింపబడుతున్నారు (మ. సె. రి. 1901). శంకరాచార్యులు తమిళ బ్రాహ్మణులను శివాలయ అర్చకులుగా నియమించగా తెలుగువారు 'తంబళ' (తమిళం) అని పిలిచారని అందువల్ల 'తంబళ' అనే పేరు వచ్చిందని ఒక నిర్వచనం (థర్స్టన్). వీరు బ్రాహ్మణులతో కలిపి భోంచేస్తారు.

తంబళ్లు దొరతనానికి పనికిరారని, తలతిక్క వాళ్లని, జ్యోతిష్యం తెలియదని చెప్పే సామెతలు ఇవి· 'బోడి పెత్తనం తంబళ దొరతనం', 'ఆడ పెత్తనం తంబళి దొరతనం', 'తంబళి అనుమానం తలతిక్కతో సరి'(గుండుకొమ్ములఎద్దును చూచి ఆ కొమ్ముల నడుమ తన తల దూరుతుందా దూరదా అని సందేహించి సందేహ నివృత్తికై దాని కొమ్ములలో తలదూర్చి, అది పరుగుదీయగా చిత్రహింసను నుభవించినాడు.అంటేవాని అనుమానము వానితలతిక్కను వదిలించింది అన్నమాట

పదబంధపారిజాతము), 'తంబళ్ల అక్కయ్య మోదుమూడి వెళ్లనూ వెళ్లాడు తిరిగి రానూ వచ్చాడు', 'అగ్రహారంలో తంబళి (శ) జోశ్యం' అనేవి.

3.2.20 తొగట : (1) అద్దకం మొదటి వృత్తి. తర్వాత నేతపని చేపట్టి నారు. తొగట వారు కడపజిల్లాలో ఉన్నారు. ముతక వస్త్రాల్ని మాత్రమే నేస్తారు (థర్స్టన్). వారిని గుఱించి ఒకే ఒక సామెత, వారి గర్వాన్ని గురించి ఉంది. ఊరి ముందర తవటనిక్కు సవటనేల వాన నిక్కు (నర) అనేది.

3.2.21 తోటి/వెట్టి (4) : వీధులూడ్చడం, అనాథశవాల్ని తీసిపారెయ్యడం, సత్రాల్ని శుభ్రంచేయడం వీరి పనులు. గ్రామ సేవకులు. నమ్మకస్తులు. తోటికన్న వెట్టి అనేది గౌరవం కొంచెం ఎక్కువున్న పదం. రెడ్డి తోటిచేత రెవిన్యూ ఆదా యాన్ని ఉంచుతాడు గాని మరొకర్ని నమ్మడు.

'తోటిలా పనిచేస్తే దొరలాగా అనుభవిస్తారు' (థర్స్టన్) అనే సామెత వారి కష్టజీవిత్వాన్ని, 'వెట్టివాడు పీనుగ కుస్తీలు పట్టుకోనీ' (థర్స్టన్) అనే సామెత వారి శవవాహకత్వాన్ని తెలుపుతాయి. వానకోసం గ్రామ జాతరలో శుక్రుని ఉప్పుడుగత్తె 'కోడుంబావి' విగ్రహాన్ని పూజించి, అంత్యక్రియలు జరిపేదినం వెట్టి గుండు కొట్టించుకోవాల్సి ఉంటుంది. 'గ్రామ శాంతికి బోడితల గొరుగు కోవడం' అనే సామెత పై విషయాన్ని తెలుపుతుంది. 'రాజుకు సంపద ఎంత ఉన్నా వెట్టి (గుఱ్ఱాలకు) గడ్డి మోపు ఇవ్వాల్సిందే' (థర్స్టన్) అనేది వెట్టిపై అధికార్ల నిరంకుశత్వానికి గుర్తు.

3.2.22 దూదేకుల (7) : ముస్లింలుగా మార్చబడిన హిందువులు లేదా మహమ్మదీయ పురుషులకు, హిందూ స్త్రీలకు పుట్టినవారు (ఫ్రాన్సిస్). పింజారివాళ్ల అని మరోపేరు. దూదేకి, పరుపులు కుట్టడం వీరి వృత్తి. దాన్ని బట్టే దూదేకుల, పింజారి అనే పదాలు వీరి కులనామాలయ్యాయి. వీరికి ఉర్దూ సరిగారాదు. ఈ విష యాల్ని తెలిపేవి. 'లంజకు పిల్ల తెగులు దూదేకులవాడికి దూది తెగులు', 'పింజారి పొందు లంజ పొందు', 'పింజారి పీకులాట కురువ గుద్దులాట', 'కాకర బీకర కాకు జాతారే, అంటే దూబగుంటకు దూదేకను జాతారే అన్నాడట' అనే సామెతలు. చివరి సామెతలో ఉర్దూ తెలుగు భాషలు మిశ్రితాలయ్యాయి. దూదేకులవారు నమ్మక మైన జీతగాళ్లుకాదని 'దుడ్డుకు ఒక్కడైనా దూదేకులవాణ్ణి జీతానికి వుంచుకోకు' అనే సామెత తెలుపుతుంది.

3.2.23 దొమ్మర (3) : సాముగరిడీలు చేస్తూ దేశాటనలో బ్రతికే ఒక జాతి. వీరు హరిజనులకన్న కొంచెం పై మెట్టున సంఘంలో ఉండేవారు. వీరి స్త్రీలకు వ్యభిచారం వృత్తి. 'చెప్పేవి శ్రీరంగనీతులు దూరేవి దొమ్మర గుడిసెలు', 'ఉమ్మడి సొత్తు దొమ్మర మేళము' అనే సామెతలు పై విషయాన్ని తెలుపుతాయి. దొమ్మర మేళము అంటే వాయిద్యాన్ని ఒకడు వాయించేటప్పుడు మరొకడు గరిడీ విద్యలు చేస్తాడు. ఇలా వాయిద్యాన్ని మార్చుకొంటుంటారు. దొమ్మర్లు ఊరి బయట ఎత్తు తక్కువ గుడిసెల్లో నివసిస్తారనే విషయాన్ని కూడా మొదటి సామెత పరోక్షంగా తెలుపుతుంది. వీరు దొంగతనాలు చేస్తారు. వీరికి దొంగల గుప్తభాష ఉంది. భిక్షుకులైన వీరు వ్యవసాయం చేయలేరు అనే విషయాన్ని 'గాడిదలే దున్నితే దొమ్మరులు పంటకాపులు కారా' అనే సామెత చెప్తుంది.

3.2.24 పిచ్చుగుంట్ల (1) : భిక్షుకులు, కాపు, కమ్మ, గొల్ల కులాలవారి వంశావళులు ఏర్పరచడం, గోత్రాలు చెప్పడం వీరి వృత్తి. వీరి భిక్షుకత్వాన్ని చెప్పే సామెత 'పిచ్చుగుంట్ల వాని పెండ్లి ఎంత? పెడాకులెంత?' అనేది.

3.2.25 బండ (4) : భుజంమీద బండ పెట్టుకొని భిక్షం పెట్టకపోతే తల పగుల గొట్టుకుంటామని బెదిరించి భిక్షమడుక్కునే జాతి. వాంతి చేసుకుంటూ, దుమ్ములో పడి పొర్లుతూ అసహ్యంగా ప్రవర్తిస్తారు. 'మొండి వాని హితుడు బండవాడు' అనే సామెత వీరితో సమానమైన మొండిజాతిని గురించి కూడా చెపుతున్నది (చూ. మొండి. 3.2.37).

3.2.26 బలిజ (9) : కాపు కులంనుంచి చీలిపోయినవారు. వీరిని మిశ్రమజాతిగా చెప్పుతారు (స్టువర్ట్స్). బలి అంటే యాగం. జ అంటే పుట్టినవారు. యాగాన్నుంచి పుట్టినవారు అని ఐతిహ్యం. వ్యాపారం వృత్తి. వృత్తి ధర్మంగా వీరు యుక్తి ప్రయోగించక తప్పదు గాబట్టి అవిశ్వాసపాత్రులుగా 'ఉచ్చికాయంత బలిజోడుంటే ఊరంతా చెడిపోతుంది' (నర) అనే సామెతలో చెప్పబడింది.

మద్యమాంసాల్ని బలిజలు విచ్చలవిడిగా సేవిస్తారు అని 'బలిజ పుట్టుక పుట్ట వలె బతాయి (సారా) బుడ్డి కొట్టపలె' అనే సామెత తెలుపుతుంది. వీరు వైష్ణవులు అనే సంగతిని 'బలిజల విత్తము పట్టె దాసరి పాలు' అనే సామెత తెలుపుతుంది.

గాజుల వ్యాపారంచేసేవారు గాజుల బలిజలు. పార్వతికి పసుపు, గాజుల కోసం శివుని జటా జూటం నుంచి పుట్టిన వ్యక్తి గాజుల బలిజ మూల పురుషుడని ఐతిహ్యం (థర్స్టన్). పార్వతి శాపంవల్ల గాజులమ్మే వారికి డబ్బునిలవదట.

'గాజుల బేరము భోజనానికి సరి' అనే సామెత పై విషయాన్నే తెలుపుతుంది.

బలిజలలో భోగం బలిజ ఒక తెగ. జక్కుల బలిజల్లో (తెనాలి, కృష్ణా జిల్లాల్లో) తమ కుటుంబాల్లో ఒక కన్యను వేశ్యగా సమర్పించే ఆచారం ఉండేదని, ఆమధ్యనే మానుకున్నారని (1901) థర్స్టన్. జమీందారిణుల సఖులుగా ఉండే కన్యలను ఆదపాపలు అంటారు. వారు వ్యభిచారిణులయ్యే వారు. వారి సంతతి కృష్ణా, గోదావరి జిల్లాల్లో బలిజలుగా పిలువబడతారు. డబ్బుంటే 'బలిజ' గా గౌర వించేవారని, లేకపోతే 'భోగం' వారుగా ప్రజలు పరిహసించే వారని 'బతికితే బలి జోడు, లేకపోతే బోగమోడు' అనే సామెత చెపుతుంది.

3.2.27 బుడబుడకల(1) : ఒక భిక్షుకజాతి. బుడుబుడుక అనేది వారు వాయించే చిన్న డమరుకంలాంటి వాద్యం. తెల్లవారుజామున బుడుబుడుక వాయించుకుంటూ, అది మ్రోగేవిధాన్ని బట్టి ఆ ఇంటివారికి మేలోకీడో చెపుతూ భిక్షాటనచేస్తారు. 'బుడ బుక్కల వాని పెండ్లి ఎంత? బుడ్డిలో చమురు ఎంత?' అనే సామెత వారి భిక్షుక వృత్తిని తెలిపేది. బిచ్చగాడు కాబట్టి పెండ్లి వైభవంగా చేసుకోలేడు గదా!

3.2.28 బూచీ (1) : ముద్రాచలో ఒక తెగ బూసీ. 'బూసీలకు బెదురునా బుగుడూరు సంత' అనేది సామెత. విశ్వనాథ సత్యనారాయణగారు 'బూచీలకు ఎదు రుగా బుగుడూరు సంత' అనే సామెత ఇచ్చి బూచీలు అంటే పోర్చుగీసువారు అని వివరించారు.

3.2.29 బెస్త (3) : చెరువుల్లో, కాలువల్లో చేపలు పట్టడం, వేటాడ్డం వృత్తులు. బెస్త అనే శబ్దానికి వ్యుత్పత్తి చెప్పలేము. తాము సూతమహాముని సంతతిగా చెప్పు కుంటారు (థర్స్టన్). పల్లకీబోయీలుగా పనిచేసేవారు. పల్లకీలు మోస్తూ ప్రజలు పలికేవారేమో 'బెస్త పెగ్గెలు ఊబమగని విరదాళ్లు' అనే సామెత వచ్చింది. వీరి వృత్తిని చెప్పేది 'చిన్నచేపను పెద్ద చేప మింగితే పెద్ద చేపను బెస్తవాడు మింగు తాడు' అనే సామెత.

3.2.30 బోయ (4) : బోయవారు వాల్మీకి సంతతివారని ఐతిహ్యం. తమని వాల్మీకులు, వాల్మీకి బ్రాహ్మణులుగా చెప్పుకుంటారు. వీరు పూర్వం రాజుల, పాళె గార్ల సైనికులు. ఇప్పుడు చాలా మాత్రం దొంగలు, దోపిడీదార్లు(థర్స్టన్).'బోయ వాడికొకడే ప్రభువా, బోగందానికి ఒకడే మగడా?' అనే సామెత వీరు ప్రభువుల్ని సేవించేవారని తెలుపుతుంది. వీరిమీద ప్రజలకు అపనమ్మకం. 'బోయోనికి బువ్వ పెట్టరాదు, మునగచెటుకు నీళ్లు పోయరాదు' (రా. ప. 461) అని సామెత. ఇంటి

ముందర మునగబెట్టు ఉంటే అరిష్టమని జానపదుల నమ్మకం. 'ముందుపోయే ముత్రాచ వానిని, వెనుక వచ్చే బోయవానిని, ప్రక్కను వచ్చే పట్రాతి వానిని నమ్మరాదు'అనే సామెతలో వెనుక వచ్చే బోయవాడు కొట్టి కీడు చేస్తాడనే భావం ఉండొచ్చు.

3.2.31 బ్రాహ్మణ (109): ప్రాచీనకాలంనుంచి అగ్రవర్ణంగా పరిగణింప బడిన కులం. బ్రహ్మ ముఖం నుంచి బ్రాహ్మణులు. బాహువులనుంచి క్షత్రియులు, ఊరువులనుంచి వైశ్యులు, పాదాలనుంచి శూద్రులు పుట్టినట్లు ఋగ్వేదం పురుష సూక్తంలోని మంత్రం చెప్తుంది.

ఆంధ్ర బ్రాహ్మణుల్లో పెద్దశాఖలు నాలుగు: 1. వైదీకులు, 2. నియోగులు 3. తంబల 4. ద్రావిడదేశంనుంచి వలసవచ్చినవారు. పౌరోహిత్యానికి, శ్రాద్ధాలకు నియోగుల్ని పిలవరు. నియోగులు మంత్రులుగా, కరణాలుగా అధికారం చేబట్టినవారు.

వైదీకులు, నియోగులు ఒకరిపై ఒకరు విసురుకున్న నిందా సామెతల్లో మచ్చుకు కొన్ని: వైదీకులు వైద్యం కూడా చేస్తారు. వీరు వైద్యం చేసేటపుడు తీసుకునే ప్రతిఫలం రోగి చనిపోతే వైతరిణి గోదానం ఇచ్చినట్లుగానూ, బతికితే వైద్యకట్నంగానూ సరిపోతుందని నియోగుల పరిహాసం. 'వైదీకి వైద్యంలో చచ్చినా ఒకటే బ్రతికినా ఒకటే' అని సామెత. వైదీకులు తాలబూలం వేయరు అనే విషయాన్ని భంగ్యంతరంగా 'వైదికునిచేతి విడెమాయె వనిత బ్రతుకు' అనే సామెత తెలుపుతుంది.

నియోగులు తాము దాతలని చెప్పుకోగా, వైదీకులు వార్ని భిక్షుకులుగా చిత్రించారు. 'నియ్యోగి లేని చావడి దయ్యాలకిరవు గాక దాతల కిరవా?', 'నియోగపు ముష్టికి బనారసుసంచి' అనేవి పై విషయాల్ని తెలిపే సామెతలు. కఠిన హృదయులు అని 'నియోగిజాతి నిమ్మకాయ్యజాతి' అనే సామెత తెల్పుతుంది.

ఒకే సామెత ద్వారా పిల్లిమీద నెపంపెట్టి రెండుశాఖలు పరస్పరం నిందించుకొన్న విధం. 'వైదికపు పిల్లీ ప్రత్తిపలుకవే అంటే మ్యావ్‌మ్యావ్ అన్నదట', 'ఒత్తిపలుకవే నియోగి పిల్లీ అంటే మ్యావ్ మ్యావ్ అన్నదట' (నర) అనేది. ఇతర వర్ణాలు ఈ రెండు శాఖల్ని కలిపి తిట్టిన సామెత 'తెలగాణ్యపు టెక్కు, నియోగి నిక్కు' అనేది.

యజ్ఞంచేయించడం, పౌరోహిత్యం నెరపడం, పంచాంగశ్రవణం, మధుకర వృత్తి, యాయవారం (ధాన్యయాచన), వైద్యం, విదూషకత్వం బ్రాహ్మణుల

వృత్తులు. ఈ విషయాల్ని విప్పిచెప్పే సామెతలు 'పన్నెండు ఆమడల మధ్య బ్రాహ్మణుడు లేకపోతే యజ్ఞం చేయిస్తానన్నాడట', 'రాజు పాపం పురోహితుని కొట్టుక పోవును', 'చచ్చేదాకా వైద్యుడు వదలడు, చచ్చినా పంచాంగం బ్రాహ్మడు వదలడు', 'ఉపనయనంనాటి మాట ఉన్నది సుమతీ' (భవతీ భిక్షాందేహి అనేది), 'మొగుడూ పెళ్లాంపోట్లాడియీయాయవారం బ్రాహ్మణ్ణిచావగొట్టినట్లు', 'వైదీకివైద్యంలో చచ్చినా ఒకటే బ్రతికినా ఒకటే', 'పరాశికాల బాపనయ్యకు పాముగరిస్తే మందు లేక మరణమైనాడు' అనేవి. బ్రాహ్మణులు వ్యవసాయానికి అనర్హులు అని చెప్పే సామెతల్లో మచ్చుకుకొన్ని: 'బాపన సేద్యం బడుగుల నష్టం', 'బాపన సేద్యం బాల వైద్యం', 'బాపనసేద్యం బత్తెపుచేటు, కాపుల చదువులు కాసులచేటు' అనేవి. బ్రాహ్మలు సాధారణంగా గౌరవర్హులు. అలా ఉండకపోతే మోసగాళ్ల అని ప్రజల నమ్మకం. 'బాహ్మణులలో నల్లవాణ్ణీ, మాలల్లో యెర్రవాణ్ణీ నమ్మరాదు' (కార్. 1642), 'నల్లబాపడు నాభికంటె విషము' అనే సామెతలు.

ఆచారాలు ఎక్కువగా పాటించేది బ్రాహ్మణులే. ఉదయమే నదిలోనో, చెరువులోనో చన్నీటి స్నానంచేయడం, సంధ్యావందనం చేయడం, మడిగట్టు కోవడం, జందెంవేసుకోవడం అనేవి వారి ఆచారాల్లో కొన్ని. 'బాహ్మడికీ బట్ట గొడ్డుకీ చలేమిటి' 'బ్రాహ్మణునిమీద సంధ్య కోమటిమీద అప్పు నిలువవు', 'చెట్టుకు మడిగుడ్డ కట్టి ఉన్నది లే దొంగ చెట్టెక్కడు అన్నదట సోమిదేవమ్మ', 'జగమెటి గిన బ్రాహ్మడికి జందెమెందుకు' అనే సామెతలు పై విషయాలనే నివేదిస్తాయి.

బ్రాహ్మలు అధికార్లయితే భరించేది కష్టం అని 'బాపన కొలువు తెల్ల గుఱ్ఱపు శాదవ కష్టం', 'బాపలలో చిన్న బెస్తలలో పెద్ద' (పనులు పెట్టుదురు) అనే సామెతలు చెప్తున్నాయి. బ్రాహ్మణులు మృదు హృదయులు. క్షణిక కోపులు. 'కప్పకాటు లేదు బాపనపోటు లేదు', 'బాపనోళ్ల కోపం వరిగడ్డిశాకం' అని సామెతలు.

బ్రహ్మహత్య పంచమహాపాతకాల్లో ఒకటి రెండు విధాలా ఆపద వచ్చేటపుడు చెప్పే సామెత 'ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య' అనేది.

రాజులకాలంలో పన్నులేకుండా బ్రాహ్మణులు అనుభవించేందుకు అగ్ర హారాలు, భూములూ ఇవ్వగా తర్వాతర్వాత అవి పరాధీనాలయ్యాయి. బల వంతులు బాపన సొమ్మును హరించారు. 'అంటు ముట్టరాని అగ్రహారము' (కార్.5 'అగ్రహారం పోతే పోయిందిగాని అక్టు అంతా బాగా తెలిసింది', 'బలవంతుల సొమ్ముగాక బాపడిసొమ్మా' అనే సామెతలు పై అంశాలకు సాక్షులు.

శ్రాద్ధసమయంలోను, తదితరపుణ్యదినాల్లోనూ బ్రాహ్మణులకు దానాలివ్వడం హిందూ మతపరమైన ఆచారం. రానురాను బ్రాహ్మణులమీద గౌరవం తగ్గినకొద్దీ వారికిచ్చే దానాలు మనస్ఫూర్తిగాగాక మొక్కుబడిచెల్లించినట్లు జరుగుతుండడాన్ని సామెతలు తేటతెల్లంచేస్తాయి. 'చెడిపోయిన బ్రాహ్మడికి చచ్చిపోయిన ఆవుదానం', 'పాడు అయిపోయిన కూరలు బాపడికి' (కార్. 2092), 'కూరగాయలు చెడిపోయిన వంటే బర్రెలకు వేయమన్నాడట. అవి తినవంటే పిలిచి బ్రాహ్మడికివ్వమన్నాడట' అనేవి. బ్రాహ్మణులు దానం గ్రహించేటప్పుడు కొసరుతారు అని, 'ఆశాపాతకబాపడు గోచిపాతలో తూమెడు కట్టుకున్నాడట' అనే సామెత చెప్తుంది.

వారం వర్జ్యం అంటే బ్రాహ్మణులకు చాలా నమ్మకం అనే విషయానికి 'వస్తానయ్యా బాపనయ్యా అంటే, వద్దే ముండా వర్జముంది అన్నాడట', 'భ్రమిసి బాపనయ్యను పోతే శుక్రవారం చూపరాదన్నాడట' అనే సామెతలు సాక్షులు.

బ్రాహ్మణులు భోజన ప్రియులు. ఆ విషయాన్ని చెప్పే సామెతల్లో (16) మచ్చుకు కొన్ని. పప్పు వారికి చాలా ప్రియం, 'పసరం ఒంటిపూట పడ్డా బ్రాహ్మణుడు ఒంటిపూట పడ్డా మానెడు', 'తప్పు ఒప్పు దైవమెఱుగును పప్పుకూడూ బాపడెఱుగును', 'బాపడికి పప్పాశ, అత్తకు అల్లుడాశ' (కార్. 2500) అనేవి.

బ్రాహ్మణవిధవలు శిరోముండనం చేయించుకునే విషయాన్ని తెలిపే సామెత, 'ఆయన ఉంటే మంగలినైనా పిలుచుకొచ్చేవాడు కదా అని వాపోయినట్లు' అనేది. నిజానికి భర్తేఉంటే మంగలి అవసరం (గుండు గీకేందుకు) రాదు. గుండు గీకేందుకు మంగలిని పిలుచుకొచ్చేందుకు ఎవరూలేని సందర్భంలో తెలివితక్కువగా ఒక బ్రాహ్మణవిధవ అనుకొన్నమాటలివి.

మత్స్య, మాంసాలు ఆంధ్ర బ్రాహ్మణులకు నిషిద్ధం. అరుదుగా జాతి చెడ్డవారు వీటిని భుజిస్తారని 'అపశబ్దాలేమిటోయ్ అంటే మచ్చాలు దినేనోట సొచ్చాతెలా వస్తాయి అన్నాడట', 'అంతా బాపలే అయితే కోడిపెట్ట ఏమైనట్టు' అనే సామెతలంటున్నాయి.

'బాపనవావి బండవావి' అనే సామెత అంతరార్థం పరిశీలనార్హం. శాస్త్రాలు ఊచముట్టుగా చదివిన వాణ్ణి శాస్త్రి అంటారు. యజ్ఞంచేసిన బ్రాహ్మణ్ణి సోమయాజి అంటారు. కొంతమంది బ్రాహ్మణులు శాస్త్రాలు చదువకపోయినా శాస్త్రి అనే బిరుదనామం తగిలించుకోవడం కద్దు. ఈవిషయాన్ని 'శాస్త్రులవారింట పుట్టి సోమయాజులవారింట మెట్టి, లవణమంటే దూడరేణమని ఎఱుగనా! అన్నదట', 'పుట్టు శాస్త్రులా,

పెట్టు శాస్త్రిలా' (పేరుపెట్టిన శాస్త్రి అనుట) అనే సామెతలు తెల్పుతాయి.

ఒంటి బ్రాహ్మణుడుగాని, నంబిగాని ఎదురైతే అపశకునంగా జానపదులు భావిస్తారు. ఈ విషయాన్ని 'నంది బ్రాహ్మణుడెదురైనా, నాగుబాము ఎదురైనా, చెవులపోతెదురైనా చేటు తప్పదు' (నర) అనే సామెత చెపుతుంది.

3.2.32 భట్రాజు/భట్టు (2) : రాజుల పరాక్రమ గాథల్ని వారి ఆస్థానాల్లో ప్రశంసిస్తూ ఉండిన జాతి. పోయినతరంలో వీరు ఉపాధ్యాయులుగా ఉండినవారు. వీరికి సంబంధించిన సామెతలు 'బ్రాహ్మణింట్లో పుట్టితి, భట్టింటిలో పెరిగితి, కోమటింటిలో చస్తి', 'ఎక్కువయిన సొమ్ము బ్రాహ్మలకిత్తునా, భట్లకిత్తునా?', 'పంక్తిలో ముందు భట్రాజును కూర్చోపెట్టమన్నారు' (సా) అనేవి.

3.2.33 మంగలి (41) : మంగల, భజంత్రీలు, కళ్యాణకులం, అంగారకులు అనేవి సమానార్థకాలు. క్షురకర్మ వీరి వృత్తి. బ్రాహ్మణ పురుషునికి, వైశ్య స్త్రీకి పుట్టినవారి సంతతిగా ఈ కులాన్ని చెప్తారు. శుభకార్యాల్లో మంగళ వాయిద్యాలు వాయించడం, క్షురకర్మ చేయడం చేస్తారు. కాబట్టి మంగల అనే పేరు వచ్చింది. తమిళమంగళ్లకన్న తెలుగు మంగళ్లు తామెక్కువని అంటుంటారు. వారు సర్వాంగ క్షౌరం చేస్తారు. వీరు చేయరు కాబట్టి (థర్స్టన్).

పాత మంగలిఅయితే అనుభవంమీద క్షౌరం బాగా చేస్తాడని 'మంగలి పాత చాకలి కొత్త' అనే సామెత, పొద్దుపోని పనుల్ని 'బిగుడు మాల్ని ముండ బీటికి ముగ్గు పెట్టెనంట, పంగమాల్నిమంగలోడు పిల్లి తలగొరిగెనంట' (చంద్ర), 'పని లేని మంగలి పిలిచి తలగొరిగినాడంట' అనే సామెతలు తెలుపుతాయి.

ఒకఅవసరానికి బాగా ఉపయోగపడే వస్తువు మరొక అవసరానికి ససేమిరా పనికిరాదని, మంగలికత్తి చాలా వాదరగా ఉంటుందని 'ఆతులు గొరిగే మంగలి కత్తి మాకులు తెగుతుందా? (నర)', 'అభిమానానికి మంగలి కత్తులు మింగినట్లు' అనే సామెతలు చెప్తున్నాయి.

తెలుగు మంగళ్లు జానపదులకు అధోంగక్షౌరం చేసుకొనేందుకు కత్తుల్ని ఇస్తారు. ఆ విషయాన్ని వ్యంగ్యంతరంగా తెలిపేది 'మంగలివాని కత్తికి తన చేతి లోనూ విశ్రాంతి ఉండదు. ఇతరులచేతిలోనూ విశ్రాంతి ఉండదు' అనే సామెత.

పల్లెల్లో రైతులగోళ్లు కత్తిరించడం, కాలిముల్లు తీయడం మంగళ్లే చేస్తుం టారు. ఈ విషయాన్ని 'మంగలిని చూచి దుస్నపోతు కాలుకుంటినట్లు' (ప. ప.) అనే సామెత వ్యంగ్యంగా తెలుపుతుంది.

గౌరిగేటప్పుడు ఎంత గొప్పోనికైనా తలపైన మంగలి చేయిపెట్టక తప్పదు అని 'మనుషులందరి తలల పైనా మంగలిచేయి' అనే సామెతంటున్నది.

'మంగళంబుచేయు మంగలి హీనుడా? అనే ప్రశ్న మంగలికి సంఘంలో ఉండే తక్కువ అంతస్థును తెలుపుతుంది.

3.2.34 మాదిగ (29) : అస్పృశ్యులుగా, హరిజనులుగా పిలవబడేవారిలో ఒక కులం. చర్మంతో చెప్పులు ఇత్యాది వస్తువులు కుట్టడం వీరి వృత్తి. రైతులకు బొక్కెనలు, చెప్పులు, ఎద్దులకు పట్టెడలు కుట్టివ్వడం; వ్యవసాయంలో తమ కుటుంబంతో రైతు కుటుంబానికి తోడుపడడం, రైతు ఇంట్లో గొడ్లు చనిపోతే తీసు కెళ్లి, చర్మాన్ని రైతుకివ్వడం చేస్తుంటారు. కడపజిల్లాలో వీరు 'మేము పెద్దింటి వాళ్లం' అని చెప్పుకుంటారు (థర్స్టన్). స్త్రీలు ఎడమపైట వేసుకుంటారు.

హరిజనుల్లో మరో తెగ మాలలు. వారికీ, వీరికీ పసేమిరా పడదు. పల్లెలు కూడా వేరువేరుగా కట్టుకుంటారు. ఒకరి బావుల్లో నీళ్లు మరొకళ్లు తాగరు. మాది గలు వేసే 'చిందు' చూస్తేనే మాలలు కొట్లాటకు సిద్ధమౌతారు. మాలలు మాదిగల ఇండ్లముందుగా ఊరేగింపు వెళ్లకూడదు.

ప్రతి సవర్ణులపల్లెకు కొంచెం ఎడంగా ఒక మాదిగపల్లె ఉండడం సర్వసాధా రణం. వీరి ఊర్లకు ప్రత్యేకంగా పేర్లుండవు. సవర్ణులపల్లె పేరుకు మాదిగపల్లె, మాలపల్లె, అని అనుబంధంచేరుస్తారు. ఉదా॥ పెద్దకాల్వపల్లె మాదిగపల్లె, అబ్బవరం పల్లె మాలపల్లె.

వీరిలో గౌరవర్ణం వారుండటం అరుదు. 'ఎఱ్ఱ మాదిగను, నల్ల బాపని నమ్మ రాదు' అని సామెత. వీరు రైతులకు మాదిగతనం ఊర్లవారీగాను, ఇండ్లవారీగాను చేస్తారు. ఈ విషయాన్ని 'కత్తి, ఆరెలేదు, ఏడూళ్ల మాదిగ తనము' అనే సామెత చెప్తుంది. మాదిగలు ముడిచర్మాల్ని పదునుచేసి చెప్పులు కుడ్తారు అనే విషయాన్ని 'గొడ్డువాడు గొడ్డుకేడిస్తే, గొడారివాడు తోలు కేడ్చెనంట'(గొడ్డు తప్పిపోయిందని రైతు ఏడిస్తే, అది ఊర్లో ఉంటే చర్మం వచ్చుగదా అని గొడారివాడు ఏడ్చాడట. సామెతల (సవంతి,పు.50 ) 'గొడారివద్ద తోలుకొన్నట్లు' అనే సామెతలు చెప్తాయి.

మాలవారు మాటల్లో చతురులని, మాదిగవారు తెలివితక్కువగా మాట్లాడ తారని 'మాలవానిమాటవిని మాదిగవాడు మల్ల పగులగొట్టుకున్నట్లు', 'మాదిగోణ్ణి మాట్లాడిచ్చికొట్టాల, మాలవాణ్ణి మాట్లాడందే కొట్టాల (నర)' అనే సామెతలు తెలుపుతాయి.

వీరు ఉదయమే లేవరు. పనికి పిలిస్తే మళ్లీ వస్తామని తిప్పుతుంటారని, వీరికిచ్చిన అప్పు తిరిగిరాదని సామెతలు చెప్తున్నాయి. 'మాదిగమంపు మాపిటిదాకా, కాపు మంపు కపిలవేళ దాకా', 'మాదిగ మల్లి కంసాలి ఎల్లి', 'దున్నక వేసిన ఆముదాలు, మాదిగకిచ్చిన అప్పు తిరిగి రావు' (నర) అనేవి ఆ సామెతలు.

అందరూ కాకపోయినా వీరిలో కొందరైనా సవర్ణులపై తిరుగబడిఉంటారు కాబట్టే 'మాపటేలప్పుడు ఎండ, మాదిగోని పొగురు ఒకటి' (నర) అనే సామెత వచ్చింది.

వీరి శోచనీయమైన జీవితానికి 'మాదిగవాని బ్రతుకు మదురుమీది గడ్డి ఒకటి' అనే సామెత అద్దంపడుతుంది. మదురుమీద మట్టి తక్కువవుంటుంది. నీళ్లు నిలవవు. కాబట్టి గడ్డి అతిత్వరలో ఎండిపోతుంది. అలాగే వారి జీవితాలుకూడా.

నీతినియమాల్లేని ఇంద్రియాసక్తిని చెప్పేటప్పుడు 'మాదిగమంచానకు కాళ్ల వైపూ తలవైపూ వక్కటే' (కార్. 173) అనే సామెత ప్రయోగిస్తారు.

కుక్క సాధారణంగా మాంసప్రియం. మాదిగపల్లె చుట్టుపట్ల మాంసం, బొమికలు దొరుకుతాయి. అందుకే 'మన్యం మఱిగిన మనిషి, మాదిగాడ (మాదిగ పల్లి) మఱిగిన కుక్క వెనక్కిరావు'.

గ్రామదేతకు పూజారి ఆసాదివాడు. జాతరనాడు గ్రామదేవతకథను చెప్తూ బూతులు అంటుంటాడు. 'ఆసాదికూతలకు అర్థంలేదు, గుడ్డికంటికి చూపులేదు' అనే సామెత పై విషయాన్నే తెలుపుతుంది. ఆసాదికూతలు అంటే 'బూతుమాటలు' అనే అర్థం వ్యాప్తిలోకి వచ్చింది.

పూనిగొల్లల పెండ్లిలో గంగపూజ చేస్తారు. ఇందుకోసం మాదిగ సంగీతగాళ్లయిన 'పంబలవాళ్ల'ను పిలుస్తారు. గంగపూజలో వారు పాడేపాటల్లో బూతులే ఎక్కువగా ఉంటాయి. ఈ విషయాల్ని 'బూతురేగినా పంబరేగినా ఆగదు', 'బాస పీచురేగితే ఒళ్లు పంబరేగుతుంది' అనే సామెతలు విశదీకరిస్తాయి.

మాదిగల కులదేవత మాతమ్మ. ఆ దేవతకు ముడుగట్టినకన్య మాతంగి లేక మాత, జాతర్లో దేవతముందు నృత్యంచేయడం, దేవాలయ సంబంధి పనులుచేయడం మాత పనులు. 'మాతకు గజ్జలాడితే మాదిగకు శివమెక్కుతుంది' అనే సామెత పై విషయాన్నే తెలుపుతుంది.

వీరు వ్యవసాయానికి అనర్హులని 'మాలపున్నమ ముందు మాదిగవాడైనా చల్లడు' అనే సామెత వ్యతిరేక విధానంలో చెప్తుంది.

3 2.35 **మాల** (53) : 'మల'(కొండ) శబ్దంనుంచి 'మాల' అనే పేరు వచ్చి ఉంటుందని థర్స్టన్. 'మైల' శబ్దంనుంచి వచ్చిందని బ్రౌన్. నేతపని, వీధులూడ్చడం, పాకీపని, చచ్చినవారికి గుంత త్రవ్వడం, కాటికాపరితనం ఇత్యాదిపనుల్ని చేస్తారు. సవర్ణులపల్లెలకు కొంచెందూరంగా మాలపల్లెలుంటాయి.

మాలపల్లెలను గురించి చెప్పిన సామెతలు 'ఊరంతా ఉల్లిపూస్తే మాలపల్లి మల్లెపూసె', 'మాలపల్లెలో మంగళాష్టకాలు'(అనేవి పెండ్లికి సంబంధించిన మంత్రాలు ఉండవని).

మాలల తిండిని, తాగుడును గురించిన సామెతల్లో గొడ్డుమాంసం తింటారని, మారు.పెట్టించుకోరని, పుష్టిగా తింటారనే విషయాలు తెలిస్తాయి. 'మాలకు మాంసం గొడారికి తోలు', 'మారులేనితిండి మాలతిండి ధారలేని తిండి దయ్యపు తిండి', 'మాలజంబం మల్ల (మూకుడు) మీద వాన జంబం ఊసరమీద', 'మేకలు తప్పించుకొంటే తుమ్మలు మాలలు తప్పించుకొంటే ఈదులు' అనే సామెతలు పై విషయాల్ని తెలుపుతాయి, మాలపల్లె మరిగితే కుక్కలు వదలవని (మాంసం మరిగి) 'మాలవాడకుక్క మఱి అన్నమెఱుగునా?', 'మాలవాడను కుక్క మరిగిన చందము' అనే సామెతలు చెప్తాయి. మొదటిసామెతలో మాలవాడలో కూడుకన్న మాంసమే ఎక్కువ ఉంటుందని తెలుపుతుంది. హీనమైన భోజనాన్ని సవర్ణులు మాలతిండి అనడం కద్దు. 'మాలకూటికిపోయినా నీళ్లపప్పే' అనే సామెత ఈ విషయాన్నే వ్యక్తంచేస్తుంది.

మాలల మాటచాతుర్యాన్ని మెచ్చుకొన్న సామెతల్లో మచ్చుకుకొన్ని. 'బొల్లి బొల్లి మాల బొల్లా అంటే ఎద్దు అడుగులో ఏడు కొఱ్ఱమేనులు అన్నాడట', 'మాల బిడ్డ మాటచూడు, మల్లెచేను రాక చూడు' అనేవి. మాలవాణ్ణి మాట్లాడిస్తే మాటల్లో దొరకడని 'మాలవాన్ని మాట్లాడించేదే కొట్టాల మాదిగవాన్ని మాట్లాడిచ్చి కొట్టాల' (నర) అనే సామెత సవర్ణులనుకొనేది.

రైతుల మాటలకు మాలలు పొంగిపోవడం, వారి మాటనిలకడలేనితనం వివరించే సామెతలు. 'సైరా మాలోడా, అంటే పరమెత్తి (బండిపరం) పైన వేసుకున్నాడట', 'మాలమాట నీళ్లమూట' (హైసా. X-17) అనేవి.

మాల మాదిగలు ఏమాత్రం పురోగమిస్తున్నా చూచి సహించలేరు సవర్ణులు. వారిని హద్దుల్లో ఉంచాలని సవర్ణుల తాపత్రయం. ఈ విషయానికి సాక్షులు 'మాలదాన్ని ఎంకటమ్మా అంటే మరికాస్త ముందరింట్లోకి వచ్చిందట', 'మాలదాన్ని

ఎంకటమ్మా అంటే మరికాస్త ముందరింట్లోకి వచ్చిందట', 'మాలదాన్ని వెంకటమ్మా అంటే మరింత బిగుసుకున్నదట', 'ఆడికొచ్చీ ఈడికొచ్చీ మాల మూలకొచ్చెనంట' (నర) అనే సామెతలు. అందుకే 'మాలలకు మంచాలు బాపలకు పీటలా?' అనే ప్రశ్నించుకొన్నారు సవర్ణులు.

అబద్ధం చెప్పినవాణ్ణి నిందించినపుడు ఆ కులాన్ని పేర్కొనడం జరిగింది. 'మాటతప్పినవాడు మాలవాడు' (కార్ 1705). సేవక వృత్తిలో ఉండే వీరికి సేవ కులా? అని 'కూలి బంటుకొక మాల బంటు, మాలబంటుకొక మడే బంటు' (నర) అనే సామెత ప్రశ్నిస్తోంది.

వీరు నేతపని చేస్తారుగాని సాలెవారినేతలాగా బాగుండదు అనే విషయాన్ని 'సగం సాలెనేత, సగం మాలనేత', 'లంజలగ్గం(లగ్నం) చెరిస్తే మాలెత(మాలది) మగ్గం చెరిచిందట' అనే సామెతలు వ్యక్తంచేస్తాయి.

మాలవారు జీతానికిగాని, కూలికిగాని సరిగా పనిచేయరని 'మాలవాడు చేసినట్లే ఉండాలి సంసారి చెడినట్లే ఉండాలి' అనే సామెత తెలుపుతుంది.

మాలలు భాగవతాలాడతారని. అవి అంత రక్తిగట్టవని 'అడపెత్తనము మాల భాగవతము' అనే సామెత చెప్తుంది.

సవర్ణులు తమ మాలిన్యాన్ని కడిగివేసే పాకీవారినే పరిహసించిన సామెత 'పాకీదానితో సరసంకంటె అత్తరు సాయిబుతో కలహంమేలు' అనేది.

స్థానబలం లేకపోతే కులం బలాన్నివ్వదు అని 'ఒక ఊరి కాపు ఇంకొక ఊరికి మాల' అనే సామెత 'తస్మాత్ జాగ్రత్త!' అంటోంది.

3.2.35 ముత్తరాచ (4) : విజయనగరరాజులకాలంలో సరిహద్దుల్ని కాపాడేందుకు నియమించబడి పాళెగార్లుగా గౌరవింపబడినవారు. ముది (వృద్ధ), రాచ అనే శబ్దాలనుంచి ముత్తరాచ శబ్దం వచ్చిందని; ముతరాజు అనేవాని సంతతివారు అని వేర్వేరు నిర్వచనాలున్నాయి (స్టువర్ట్). యయాతిరాజు సంతతి వారుగా చెప్పుకుంటారు(థర్స్టన్). మొదట తాము క్షత్రియులేనని, వేటకుపోయివస్తూ కొలనులో ఇంద్యాస్తో చేపలుపడ్తూండగా బ్రాహ్మలు చూసినందువల్ల, అప్పటినుంచి తమకులం దిగజారిపోయిందని ఒక ఐతిహ్యం. ఆ విషయాన్ని చెప్పే సామెత 'ముత్తెమంటి ముతరాచకులం చేపలు దిని చెడిపోయినట్లు' అనేది. నెల్లూరుజిల్లాలో వేటగాళ్లుగాను, చేపలు పట్టేవాళ్లుగాను, తలారులుగాను ఉన్నారు (నెల్లూరు మాన్యువల్). నమ్మి రైతు వీరి వెంటపోతే కావాల్సే తప్పుదారి తీస్తారని 'ముందు వచ్చే ముత్రాచవానిని

వెనుక వచ్చే బోయవానిని, ప్రక్కన వచ్చే పత్రాతివానిని నమ్మరాదు'(సు.ర,1775) అనే సామెత చెపుతున్నది.

3.2.37 మొండి (5) : ఒక భిక్షుకజాతి. కుడిచేతికి ఇనుపకడియాలు వేసుకొని ఆచేతిలోనే ఇనుపపిడిఉండే కసాయికత్తి లాంటిది పట్టుకొని వాయిస్తూ, చిన్నచిన్న గాయాలు చేసుకొని, ప్రజల్ని బెదిరిస్తూ భిక్షం అడుక్కుంటారు. 'మొండివాని హితుడు బండవాడు', 'మొండికి సిగ్గులేదు మొరడుకు గాలిలేదు' అనే సామెతలు ఈ రెండు తెగల బిచ్చగాళ్లు చేసే పనులను అసహ్యించుకొనేవి. 'మొండివాడు రాజు కంటె బలవంతుడు'అనే సామెత రాజు వేసేపన్ను తప్పించుకోవచ్చుగాని మొండివానికి దాన మివ్వడం తప్పించుకోలేము అనే విషయాన్ని తెలుపుతుంది. 'పాపీ చిరాయువు' అని హిందువుల నమ్మకం గాబట్టి,'మొండికీ బండకూ నూరేండ్లాయుస్సు'అట. ఒకరిని మించిన వారు ఒకరైన గురుశిష్యులను 'మొండిగురువు బండ శిష్యుడు' అంటుంటారు.

3.2.38 మొదలియారు (3) : దేవదాసీ పుత్రులు, కైకోలన్‌లూ ఉత్తరజిల్లాల మద్రాస్ ప్రెసిడెన్సీలోని వెల్లాలవాళ్లు పెట్టుకొనే బిరుదనామం మొదలియారనేది (థర్‌స్టన్).మద్రాస్‌లో వీరు ఎక్కువగా ఉన్నారని, వీరు డంబాచారంగా ఉంటారని సామెతలు చెప్తున్నాయి. 'చెన్నపట్టణములో మొదలారుల ప్రపంచము బైటసీమలో బ్రాహ్మణుల ప్రపంచము' (బ్రౌణ్య నిఘంటువు, తెలుగు - ఇంగ్లీషు), 'ము (మొ)దలియారి జంభం ఆముదానికి చేటు', 'ము (మొ)దలియారుకు ఏమున్నదంటే ఒక గుడ్డిపుబండి, ఇద్దరు ముండలు, ఇంత బుడ్డ అన్నాడట' అనేవి ఆ సామెతలు.

3.2.39 యానాది (7) : చాలా ప్రాచీనం అని అర్థాన్నిచ్చే అనాది శబ్దంనుంచి 'యానాది' శబ్దం పచ్చిందని థర్‌స్టన్ అభిప్రాయం, వీరి ప్రధానస్థావరం నెల్లూరు దగ్గరి శ్రీహరికోట. చాలా అనాగరకులు. ఆ విషయాన్ని 'యానాదివాడు గుద్ద కడిగినట్లు' (చాలా అపురుఅనుట), 'యానాదివాడు గుద్దకడగనుపోతే ఏట్లో నీళ్లు ఎండిపోయినాయంట' (నర) అనే సామెతలు తెలుపుతాయి. వీరికి అడవిచెట్ల విషయం చక్కగా తెలుసుననేదానికి 'అడవిచెట్టుకు యానాదివాడు పెట్టినదే పేరు' అనే సామెత చెప్తారు. వీరు మట్టమధ్యాహ్నం బయట రోకలి నిలిపి, నీడ అటు ఇటూ పడకుండా ఉన్నపుడు పెండ్లిలో తాళిబొట్టు కట్టిస్తారు (తెలుగు సామెతలు పు. 506). కాబట్టి శుభదినం అనే ప్రసక్తి లేదు. ఆ విషయాన్ని 'యానాదిలగ్నానికి ఏనాడైనా ఒకటే' అనే సామెత తెలుపుతుంది. యానాది స్త్రీలు వృద్ధాప్యంలోకూడ పిల్లల్ని కంటూనే ఉంటారని 'ఎనుము ముసలి ఏనాది ముసలి లేవు' అనే సామెత తెలుపుతుంది.

రెడ్డియానాదులు పంటరెడ్లదగ్గర వంటవాండ్లు. 'కొంచెం తిననుంటే మాట వినరని 'ఎంద్రకాయ కొవ్వినా యానాది కొవ్వినా కలుగులో ఉండరు' అనే సామెత చెప్పగా యానాదివాణ్ణి ఏపనికైనా పిలుచుక వెళ్తాంటే వెనుకెనుకే తప్పించుకొని పారిపోతాడు అని 'ముందు నడిచే ముతరాచవాణ్ణి, వెనక వచ్చే యానాదివాణ్ణి నమ్మ రాదు' అనే సామెత తెలుపుతుంది.

3.2.40 వడ్రంగి/వడ్ల (3) : కొయ్యపని వీరి వృత్తి. నాగళ్లు, గుంటకలు, గొర్రులు ఇత్యాది వ్యవసాయ పనిముట్లను, బండి, తలుపులు ఇత్యాది కొయ్య సామానులను చెక్కేందుకు పెద్దబాడిస నుపయోగిస్తారు. అందుకోసం బాడిసను కొంచెం వదులుగా పట్టుకొని (నైస్‌గా వచ్చేందుకు) చెక్కుతాను. మనిషి పొడవుగా ఉంటేనే ఈ పనికి బాగుంటుంది. ఈ విషయాన్ని 'వడ్రంగానికి వదులు నాణ్యము, కమ్మరానికి బిగువు నాణ్యము', 'కమ్మరమునకు కురచ, వడ్రమునకు పొడవు మేలు' అనే సామెతలు తెలుపుతాయి.

3.2.41 వెలమ (8) : విజయనగర సామ్రాజ్యకాలంలో మేనకావలిగార్లుగా వచ్చి పాలెగార్లుగా ఉన్నతపదవిని పొందినవారు. బలిజల్లో ఒక తెగ అంటారు. కాని బలిజలు ఒప్పుకోరు (స్టూవర్ట్) కమ్మకులానికి సంబంధించినవారని, ఘోషా మాని వేయాలని కమ్మమీద ఒప్పందం రాసుకొని ఒప్పుకున్నవారు కమ్మలని, ఒప్పుకో కుండా ఘోషాను పాటించేవారు వెలమలని ఒక ఐతిహ్యం (థర్‌స్టన్).

వెలమలు మిగతావర్గాలవారిని పీడిస్తారని, వితరణగుణం లేదని, వారి చెలిమి కత్తిమీద సాము అని, ఏదైనా అడగాల్సివస్తే ఊచమట్టుగా కావాలంటారని,రోగం వస్తే పైకి చెప్పుకోరని సామెతలు తెల్పుతున్నాయి. 'వెలమలున్న ఊరు కొంగ లున్న మట్టి ఒకటి', 'వెలమలవితరణ సాతానిశాస్త్రవాదము', 'వెలమమెచ్చిన ముచ్చట చెప్పు, అలిగిన ప్రాణహాని దెచ్చు', 'వెలమవారి పెండ్లికొడుకు మారడుగ నేరడు ఉన్నదంతా ఊడ్చిపెట్టు', 'ఎనుము కొచ్చినా ఎలమకొచ్చినా తిరగదు' (నర) అనేవి ఆ సామెతలు.

3.2.42 శూద్రులు (1) : బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులుకానివారు శూద్రులు. వీర్లో అంతులేని కులాలు. సంఘంలో ఆ కులాల గౌరవా గౌరవాలు ప్రాంతాన్నిబట్టి, సంఖ్యనుబట్టి, ధనాన్నిబట్టి నిర్ణయమౌతుంటాయి. శూద్రులు అని పేరుపెట్టి చెప్పిన సామెత ఒకటే. వారి భోజన ప్రియత్వాన్ని చెప్పేది 'శూద్రపొట్టా తమలపాకుల కట్టా, పొగాకు వట్టా ఎప్పుడూ తడుపుతూ ఉండాలి' అనేది.

3.2.43 సాలె/దేవాంగ (35): నేతపని సాలెవారి వృత్తి. సాలె శబ్దం సంస్కృత 'సాలికా' (నేతగాడు) అనే శబ్దంనుంచి వచ్చింది. కంసల పురుష, కుమ్మర స్త్రీకి పుట్టినవారు సాలెవారు అని ఆంధ్ర పద పారిజాతము. దేవతల వస్త్రాలకోసం మార్కండేయముని విష్ణువును ప్రార్థించి,ఇంద్రునికి యజ్ఞంచేసినపుడు యజ్ఞకుండంలో నుంచి భావన ఋషి పుట్టాడు. అతని సంతతి సాలెవారు (థర్స్టన్). కరువైనా, కాలమైనా వారికిబ్బందిలేదని 'జీతగాడికి నేతగాడికి చావులేదు' అనే సామెత, విశ్వాస పాత్రులుకారని 'నేసేవాన్ని నమ్ముకొని పొలిమేరజగడం ఒప్పుకున్నట్లు' అనే సామెతలు తెలుపుతాయి. చాలామంది రైతుల లేదా పర్తకులవద్ద నూలు తీసుకొని బట్టలు నేసిస్తారు కాబట్టి వీరికి గుడ్డకరువు అని 'నేసేవానికి గోసికి కరువు కుమ్మ రోనికి కుండకు కరువు' (నర) అనే సామెత తెలుపుతుంది.

మగ్గంమీదికి పడుగు సిద్ధంచేయాలంటే 1920 నూలు పోగుల్ని వీధిలో పడు గుగా అల్లేందుకు చాలామంది కావాలి. గంజినీళ్ల పడుగువేసేటప్పుడు అవసరం. అందువల్ల వీధిలో ప్రజల రాకపోకలకు అడ్డంకావడం, వీధి రోతకావడం జరుగు తుంది. ఈ రెండు విషయాల్ని 'చెట్టి భాగాల్తో చెడె, సాలె ఒంటిగాడై చెడె' (థర్స్టన్) అనే సామెత, 'ఏటు ఇరుకుచేయాలంటే జమ్ము, వీధి రోత చేయా లంటే సాలె' (థర్స్టన్) అనే సామెత తెలుపుతాయి. చేసేపనిని మధ్యలో ఆపి సాలెవాని వెంటపోతే తిరిగి రా వీలుకాదని 'చేసే చేసే పని వదిలి నేసేవాని వెంట పోయినట్లు' అనే సామెత తెలుపుతుంది. పనికి ఆటంకంచేసే దాన్ని దగ్గరుంచుకో గూడదు అనే విషయాన్ని 'నేతగాడికేలరా కోతిపిల్ల' (కార్. 1338)అనే సామెత చెప్తుంది. కోతి ఒకగంతువేస్తే దారాలన్నీ తెగిపోతాయి కాబట్టి.

నూలు తెగితే ఎంగిల్తో అతకడం సాలెవారికి వరమట. 'సాలెవాని ఎంగిలి ముప్పదిమూడుకోట్లు దేవతలు మెచ్చారట' అనే సామెత ఆ విషయాన్ని తెలుపగా నేత పని మిగతా కులాలవారు కూడా చేసినా సాలెవారికే నేతలో నైపుణ్యం ఎక్కు వని 'సగం సాలెనేత, సగం మాలనేత' అనే సామెత చెపుతుంది.

బట్టనేసేందుకు కాళ్లతో కొయ్యమీటల్ని నొక్కాలి కాబట్టి కాలు కురుపైతే సాలెవాడికి చచ్చేంత ఇబ్బంది అని 'కుక్క తలగాయంతో బాగుపడదు, సాలె కాలి గాయంతో బాగుపడడు' (థర్స్టన్) అని సామెత.

సాలెవారు వైష్ణవులు. సాతానిని గౌరవిస్తారు. జంగాన్ని గౌరవించరు అనే

విషయాన్ని 'సాలె జాంద్ర సభామధ్యే సాతాని పండితోత్తమః'(సాతాని కులస్థుడైన చిన్నయసూరిని నిరసిస్తూ బ్రాహ్మణులు నిందించిన శ్లోకంలో ఇది ఒక భాగం.) 'సాలెకు జంగానికీ సయోధ్య కుదురుతుందా? అనే సామెతలు తెలుపుతాయి.

కన్నడ, తెలుగుభాషల్ని మాట్లాడే నేతపనివారిని దేవాంగులు అంటారు. దేవతలకు, మానవులకు వస్త్రాలకోసం శివుడు సృష్టించిన ఒక శక్తి దేవలన్. అతని సంతతివారే దేవాంగులు. దేవతల, మనుషుల అంగాల్ని కప్పే బట్టలునేస్తారు కాబట్టి దేవాంగులనే పేరు వచ్చింది. దేవాంగులు చాలామంది లింగాయతులు. దేవాంగులు, పద్మసాలీలు ఒకే వీధిలో ఉన్నా ఒకరి బావుల్లో నీరు ఇంకొకరు త్రాగరు. మతాలు వేరే కాబట్టి. దేవాంగుల మతాన్ని 'జంగాలపాలు దేవాంగుల విత్తము కాపు విత్తము పంజుకానిపాలు' అనే సామెత పరిహసిస్తున్నది. నేతనేసే ఇల్లు రోతగా ఉంటుందనో లేక వీరిని నమ్మరాదనో 'దేవుడు చెఱుపని ఇల్లు దేవాంగి చెఱుపు తాడు' అనే సామెత ప్రయోగంలో ఉంది.

నూలుతీయడం సాలెవారే కాకుండా వేరే కులాలవారుకూడా చేసేవారు. దారంతీసేందుకు అవసరమయ్యే ఏకులు, కదురు, నేతపనికుపయోగించే ఆసు అనేవి సామెతల్లో చోటుచేసుకున్నాయి. ఉదా॥ ఏచంక నాకినా ఏమీ లేదుగాని, ఏకు చంక నాకితే ఏగాని లాభముంది', 'ఆరాటపుకదురు ఏ రాటానబెట్టినా బరబర' (బు. రా) 'ఆసు పోసినట్లు తిరుగుతున్నాడు' అనేవి (కులాలు-కొన్ని వివరాలు నెం. 4 పట్టికలో చూపబడ్డాయి).

3 2.44 జాతులు (17) : అరవ, మలయాళ, కన్నడ, తురక జాతుల వార్ని గురించిన సామెతలున్నాయి. తురకల్ని గురించి 'తెలుగు సామెతలు -మతం' ఉప ప్రకరణంలో ప్రస్తావించబడింది.

ఆంధ్రుల ప్రక్కరాష్ట్రం అరవలది. వీరు దేశమంతటా వ్యాపించిఉన్నారని 'అరవలేనిదేశం కాకిలేని ఊరు లేవు' అనే సామెత చెపుతుంది. వీరిమీద ఆంధ్రులకు సదభిప్రాయం లేదు. 'అరవ చెరచు పాము కరచు' అని ఆంధ్రుల నమ్మకం. అరవమంగళ్లు సర్వాంగ క్షౌరంచేస్తారు. ఆ విషయాన్ని 'అరవచాకిరి మంగలి అందరికీ దొరకదు' అనే సామెత తెలుపుతుంది. చెవులకు పెద్ద రంధ్రాలుండటం అందంగా అరవస్త్రీలు భావిస్తారు. ఆంధ్రుల అందుకు విరుద్ధం. 'అరవచెవులకేల అరిది వజ్రపుకమ్మ' అని ఆంధ్రుల ప్రశ్న. అరవలు గట్టిగా మాట్లాడ్తారని 'అవతలవీధిలో అల్లరి ఏమిటంటే అరవల (అవరల) ఏకాదశి అన్నట్లు' అనే సామెత,

వీరు తిండి ప్రియులని 'అరవల పొట్ట తమలపాకుల కట్ట తడుపుతూనే వుండాలి' అనే సామెత, కపటమైన కూలి ఏడుపుకు 'అరవ ఏడుపు' (కార్. 123) అనే సామెత తెలుపుతున్నాయి.

ఆంధ్రులు 'పొత్తుకు మలయాళం, సంబంధానికి సాంబారు' అనే సామెతలో మలయాళీల్ని గురించి కూడా చెప్పారు.

తమిళ, కన్నడ. తెలగుభాషల శ్రావ్యతలోని తారతమ్యాన్ని 'కన్నడ కస్తూరి, అరవ అధ్వాన్నము. తెలుగుతేట' అనే సామెత విశదీకరిస్తున్నది.

3.2.45 సామెతలను సంఖ్యాపరంగా చూస్తే బ్రాహ్మణులు, కాపులు. కోమట్లు ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాల్లో ఉన్నారు. నిందింపబడడంలో అన్ని కులాలు చేరినా బ్రాహ్మణ, కాపు కులాలకు మాత్రమే ప్రశంసా సామెతలు ఉన్నాయి. అటు అగ్రవర్ణాలను ఇటు అధోవర్ణాలను మధ్యవర్ణాలవారు వారు నిందించి ఉండొచ్చు.

కులసంబంధి సామెతల్లో అగ్రవర్ణాల ఆధిపత్యం, అహంకారం, దిగుజాతుల వారి లోటుపాట్లను నిశితంగా విమర్శించడం కనిపిస్తున్నది. అంతేగాక ఒకకులం మరోకులంపై విసిరిన నిందాసామెతలు ఎక్కువగా ఉన్నాయి. ఆయా కులాలవారికి ఆరోపింపబడిన అవగుణాల్లో అంతో ఇంతో సత్యం ఉండొచ్చుగాని, అవి పూర్తి నిజాలు అని చెప్పేందుకు వీలు లేదనవచ్చు.



## 3.3 తెలుగు సామెతలు - ప్రజల ఆహారపుటలవాట్లు

3.3 'అన్నం పరబ్రహ్మస్వరూపం' అని, అన్న మదంతోనే అన్ని మదాలు వస్తాయని, తినే ఆహారాన్ని బట్టే గుణాలు వస్తాయని పెద్దలమాటలు. ప్రజల ఆహారపుటలవాట్లను వైయక్తికం, ప్రాంతీయం, కులానుగతం అని స్థూలంగా విభజించవచ్చు. కులానుగతం అంటే ఆయా కులాలకు నిషేధించిన మాంసం, చేపలులాంటివి తినకపోవడం. ప్రాంతీయం అంటే ఆయా ప్రాంతాల్లో పండే ధాన్యాన్ని ప్రధానాహారంగా వినియోగించుకోవడం మాగాణిలో వరి, రాయలసీమ తెలంగాణాల్లో రాగి, జొన్న, సజ్జ, ఆరికెలులాంటివి. వైయక్తికం అంటే నిషేధించినవి తినడం; నిషేధంలేకున్నా తినకపోవడం ఇత్యాది. వ్యక్తుల ఆహారపుటల వాట్లను బట్టి సంఘంలో వారి అంతస్తు; బీద, ధనిక తారతమ్యం; కులం నిర్ణయించ వచ్చు. పప్పు అంటే బ్రాహ్మణులు; అంబలి, గంజి అంటే బీదలు; సన్నన్నం అంటే ధనికులు చప్పున గుర్తుకొస్తారు.

ప్రజల ఆహారపుటలవాట్లను గురించి చెప్పిన 849 తెలుగు సామెతలు నా పరిశీలనలో లభించాయి. ఈ ఉప ప్రకరణానికి అవే ఆధారం.

3.3.1 (అ) ఆహార ధాన్యాలు (14) : ఆంధ్రులకు ఎక్కువగా పండేది - వారు తినేది - వరి, కొర్రలు, చోళ్లు, ఆరికలు. వడ్లను ఎండబెట్టడం, దంచడం అనే విషయాలను 'వడ్లతోగూడ దాగర ఎండినట్లు', 'బియ్యం దంచినదానికి బొక్కిందే దక్కుట' అనే సామెతలు తెలుపుతాయి. బియ్యంఉంటే కుటుంబాన్ని ఎవరైనా పోషించొచ్చు అని 'గాదెనిండా బియ్యముఉంటే కరువునా కాలానా నా భార్యా బిడ్డల్ని నేనే రక్షిస్తానన్నాడట' అనే సామెత చెపుతుంది. 'బోలెడు తిట్లయినా బొక్కెడు కొఱ్ఱలు కావు' అన్నది ఒక భిక్షుకుడన్న మాట. జొన్న సంగటి, చోళ్ల అంబలి, ఆరికఅన్నం చేయాలంటే ఆ ధాన్యం విసరాలి. అందుకోసం వేర్వేరు విసరురాళ్లు ఉంటాయి అని 'చోళ్లు విసిరే తిరగలి జొన్నలు విసరునా?', 'చోళ్లు విసరే తిరుగలి ఆళ్లు విసరునా? అనే ప్రశ్నా సామెతలు తెలుపుతున్నాయి.

3 3.1 భోజన సంబంధి విషయాలు (137) : 'అన్ని దానాల కన్నా అన్న దానం గొప్పది' (నర) అని పెద్దలంటారు. 'అన్నంపెట్టిన తల్లి అన్నపూర్ణాదేవి' (గృ. ల. 753) గా గౌరవిస్తారు అన్నార్తులు. అన్నంతోనే ప్రాణం ఉందని,అన్న మదం అన్ని మదాల్ని తెస్తుందని, అన్నం చట్టరికాన్ని పెంచుతుందని, ప్రీతితో

పెడితేనే తినేవారికి తృప్తి అని, అన్నంతిన్నవారు అన్నదాతల్ని మరిచిపోరని చెప్పే సామెతలు. 'అన్నమయం ప్రాణమయం' (కార్. 2153), 'అన్నమదము వల్ల అన్నిమదములు కలుగుతవి' (కార్ 2052), 'కూడు ఎక్కువైతే కువ్వాడమెక్కువ', 'అన్నము చుట్టరికము, దుడ్డు పగ' (నర), 'ప్రీతితో పెట్టినది పిడికెడైనా చాలు', 'అన్నం తిన్నవాడు తన్నులు తిన్నవాడు మరచిపోరు' అనేవి.

చాలామంది జానపదులు మేడలు, మిద్దెలు కావాలని దురాశపడరు. 'కూటి కుండే కోటికున్నట్లు' భావిస్తారు పల్లెల్లో ప్రతి స్త్రీకి వంటచేయడం వచ్చిఉంటుంది. పల్లెల్లో ఆరేడు సంవత్సరాల ఆడపిల్లలకు కూడ వంటచేయడం నేర్పిస్తారు. లేక పోతే పనులు జరగవు. ఆవిషయాన్నే 'కూడు వండని ఆడది మంచమల్లని మగ వాడూ ఉండరు' అనే సామెత తెలుపుతుంది. అన్నం అయేంతవరకు వేచిఉన్నా, వడ్డనలో ఆలస్యంభరించలేరని 'ఏటిగట్టునా కూటి గట్టునా ఓపిక పట్టలేరు' అనే సామెత చెపుతుంది. తాను బాగా తినగలిగే స్త్రీ యే ఇతరులకు పెడుతుందని చెప్పే సామెత 'తిన నేర్చినమ్మ పెట్టనేరుస్తుంది' అనేది. తిన్నవాళ్లను తినమనిపిలవడం మర్యాదకోసమే అనే విషయాన్ని 'తినివచ్చినవానికి అన్నము, బోడిగుండుకు ఆము దము పెట్టినట్లు' (నర) అనే సామెత విశదపరుస్తుంది. భోంచేసేందుకు ముందు సిద్ధంకావాలని. భోజనంవద్ద మొహమాటం పనికిరాదని చెప్పే సామెతలు 'భోజ నానికి ముందు స్నానానికి వెనుక' (కార్. 1651), 'ఆహారంపట్ల వ్యవహారంపట్ల ములాజా పనికిరాదు' (రా. ప. 155) అనేవి.

తిండిపోతుల ముచ్చట సామెతల్లో ప్రతిబింబించిన తీరు ఇది: 'వాములుతినే స్వాములకు పచ్చిగడ్డి ఫలహారము' (రా. ప. 613) అట. 'అర్ధశేరు బియ్యం తింటావురా? అంటే మూడుమెతుకులు విడిచి పెడతానన్నాడట' ఒకడు. 'ఆరుగురి బత్తెం ముగ్గురు తిన్నారు అమ్మ వచ్చి అందలంలో కూర్చున్నది ఎవరు మోస్తారో మోయండి' అన్నారట తిండిలేక ఎండిన బోయీలు. 'ఓనగలమ్మ తిండి తీర్థాలలో బయటపడుతుంది'. రకరకాల పిండివంటలు తీర్థాలలో కొని పల్లీయస్త్రీలు తింటారని పై సామెత తెలుపుతుంది. 'ఎక్కువగా తిన్న పొట్ట ఏకులు పెట్టిన బుట్ట చిరుగవు' అని తిండిపోతుల ధైర్యం. తినాలని ఆశ ఉంటుందేగాని తినలేక పోయిన వారిని ఉద్దేశించి 'కళ్లు కావాలంటాయి కడుపు వద్దంటుంది' అనే సామెత ప్రయోగి స్తారు. పిల్లలు ఎక్కువ అన్నం పెట్టించుకొని తినకుండా వదిలివేసినప్పుడు తల్లులు అంటుంటారు ఈ మాటల్ని. చాలామంది 'తిండికి ముందుకోపు పనికి వెనుకకోపు'గా

'తిండికి పిడుగు, పనికి బిడుగు'గా, 'తిండికి తిమ్మరాజు, పనికి పోతురాజు'గా ఉంటారని సామెతలు చెపుతాయి. వారికి 'సిగ్గు చెడ్డా బొజ్జపెడితే చాలును'. 'ఊటగ తింటే బూకలవాడు. కొంచెం తింటే ఏతలవాడు' అంటుందట లోకం.

మితాహారం, ఒంటిపూటతిండి ఆరోగ్యానికి మంచిదని సామెతలు తిండి పోతుల్ని మందలిస్తున్నాయి. 'బొక్కెడు తిన్నమ్మ బూరుగమాను, చేరెడు తిన్నమ్మ చెక్కపేడు', 'ఒక్కపూటతింటే యోగి, రెండుపూటలు తింటే భోగి, మూడు పూటలు తింటే రోగి' (నర) అని సామెతలు.

కూడుడికిందో లేదో చూసేందుకు ఒక మెతుకు పట్టి చూస్తారని,మూసిపెడితే ఉక్కకు భోజనం పాసిపోతుందని, పాసిపోతే పక్వానికి రాదు అని సామెతలంటు న్నాయి. 'వండినకుండలో వకమెతుకు పట్టి చూడడము' (కార్. 1921), 'మూసి పెడ్తే పాసిపోతుంది' (నర), 'పాసిపోయినకూడు పక్వానికి వస్తుందా' (నర)అనేవి ఆ సామెతలు. అన్నం కుండలో అలాగే ఉంటే ఉక్కకు పాసిపోతుందని ఏదైనా గిన్నెలోకి తోడి పైన తెల్లని గుడ్డవేయడం, కూరలకైతే కుండకు వాసెన గుడ్డ కట్టడం జనపదాల్లో సర్వ సామాన్యం.

3.3.1 విందు-పంక్తి భోజనం (19) : అతిథులకు మూడుపూటలు పెడ్తేనే విందు అని, తరువాతకూడా చుట్టం అక్కడే ఉంటే చవక అవుతాడని, మందు తప్పనిసరిగా మూడు పూటలు తీసుకోవాలని, తగ్గకపోతే మానెయ్యొచ్చని 'విందూ మందూ మూడు పూటలు' (కార్. 2605)అనే సామెత చెప్తుంది. అతిథికి విందుచేయకుండా గృహస్థు ఒకడే తినగూడదని 'విందులేని కూడు మందు' (కార్. 1973) అనే సామెత తెలుపుతుంది. 'విందు భోజనంచేస్తే మిట్టచేనుకు ఒడ్డు వేపినట్లుండాలి' (రా.ప.615) అంటారు తిండి పుష్టి గలవాళ్లు. మిట్టచేనుకు ఒడ్డువేస్తే నీళ్ళు మడిలో తెక్కక ఊదుకొని ఉంటాయి. అంటే పొట్ట ఉబ్బేటట్లు తినాలన్నమాట. 'విందు మర్నాడు మందు (కుందు)' అనే సామెతలో విందుకు ఖర్చుపెట్టి మర్నాడు ఇబ్బందిపాలవు తారనే అభిప్రాయం ఉండొచ్చు. పంక్తి భోజనాల్లో ముందువాళ్లకు అన్నీ వమ కూరడం, వెనుకవాళ్లకు కొన్ని తక్కువకావడం జరుగుతుంటుంది. వడ్డన కొంద్రు తెలిసినవాళ్లయితే ఈ యిబ్బంది ఉండదని, కానీ బంతిలో అసమానతచూపించడం మంచిది కాదని సామెతలు చెపుతున్నాయి. 'పెద్దఅమ్మ బుద్ధిలోఉంటే ఏబంతినైనా పెడుతుంది', 'వడ్డించేవాడు మనవాడైతే కడపటి బంతిని కూర్చొన్నా ఒకటే', 'బంతిలో వలిపిక్కెరెం పనికిరాదు' (నర), 'బంతిలో బలపక్షం పనికిరాదు'

(తె. సా. పీ. పు. 30) అనేవి ఆ సామెతలు.

3.3.1 భోజనవేళ (4): 'గూటిలో దీపం నోటిలో కవళం' (తె. సా. పీ. పు. 12) అనే సామెత జైనులు దీపాలు పెట్టీ పెట్టకమునుపే భోజనం చేస్తారు అనే విషయాన్ని తెలుపుతుంది. కొంతమంది చాలా పొద్దుపోయేవరకు భోంచేయరని 'అందరూ మంచాలదగ్గరకు వెళ్లేవరకు మేము కంచాలదగ్గరకైనా వెళ్లలేమూ' అనే సామెత చెపుతుంది.

3.3.1 (ఉ) పళ్ళు తోముకోవడం (14): 'ఏమిరా పళ్ళు తోముకోకుండా తింటున్నావు'?, అంటే 'పులి అట్లాటిది మొగం కడుక్కోకుండా తింటుంది' అంటుంటారు తమాషాకి. కొంతమంది పళ్ళుతోముకోకుండానే భోంచేస్తారని. భోజనం ఎప్పుడు తిన్నా ముందే నోరు కడుక్కొని ఉండడం మంచిదని, పొలాల్లో తడి యిసుక తోనే జానపదులు పళ్ళు తోముకుంటారని సామెతలు చెపుతున్నాయి. 'కంపు పెట్టుకొని గంపెడు తిన్నట్లు', 'కడిగిన నోరు అడిగిన పిల్ల', 'తత్సమయా నికి తడియిసుకే సరి అని పలుదోమినట్లు' అనేవి.

(ఊ) ఆకలి-రుచి (41): తినే పదార్థాలు వేరయినా ఆకలి ఒకటేనని, రుచి లేనిది తిన్నా ఆకలికి అమృతంలా ఉంటుందని. ఆకలి ఎక్కువయితే ఎంగిలని కూడా ఏవగించుకోరు అని, అవిటిగాలికాలం ఆకలి ఎక్కువవుతుందని 'అరయ తిండ్లు వేరు ఆకలి ఒకటే', 'ఆకొన్నకూడె అమృతము, తా కొంకక ఇచ్చువాదె దాత', 'కాలేకడుపుకు మాడో మక్కో' (నర) 'ఆకలి కొన్నవాడు యెంగిలికి యేవ గించడు' (కార్. 2174) 'అవిటిగాలి మల్లితే ఆకలి జాస్తి' (నర) అనే సామెతలు తెలుపుతున్నాయి.

తినేపదార్థం చూసేందుక్కూడా బాగుండాలని, మనిషి మనిషికీ రుచి వేరుగా ఉంటుందని, చిన్ననాలుక ఎన్నోరుచులను తెలుపగల శక్తిమంతం అని, రుచి ఎలా ఉందో అడిగి తెలిసికొనేది కాదు, తిని తెలుసుకోవాల్సిందేనని, ఆకలెక్కువైతే రుచిని పట్టించుకోమని సామెతలు చెప్తున్నాయి. 'కంటికి ఇంపితమవుతే కడుపుకు ఇంపితమవుతుంది' (రా. ప. 221), 'బుర్రకు వక గుణము జిహ్వకు వక రుచి' (కార్ 1616), 'తులము నాలుకకు తొంబై రుచులు', 'తినబోతూ రుచులడిగినట్లు', 'తింటేగాని రుచి తెలియదు, దిగితేగాని లోతు తెలియదు', 'ఆకలి రుచి ఎఱుగదు, వలపు సిగ్గెఱుగదు', 'ఆకలి రుచిఎఱుగదు నిద్ర సొగసెఱుగదు' (నర) అనేవి పై విషయాల్ని చెప్పే సామెతలు, అలవాటు మీద ఏదయినా తిని భరించ

వచ్చని. ఒక వస్తువు లభించకపోతే దాన్ని మంచిదికాదంటామని 'తినగ తినగ వేము తియ్యనై యుండు', 'అందిన తియ్యన, అందకున్న పుల్లన' అనే సామెతలు తెలుపుతాయి.

3.3.1 (ఋ) వంటగత్తె – వండే స్త్రీలు (15) : ధనికులు వంటకత్తెను పెట్టుకొంటారు. కొంతమంది వంటగత్తెలకు వంట సరిగా చేయడం రాదని, వంటా పెగా వచ్చినామె ఇంటాపెగా హోదా పెంచుకొన్న సందర్భాలున్నాయని, 'వంట లక్కను వయిలుబండిమీద తెచ్చి తోటకూరకు ఎసరెంత? అంటే చంక చేతెడు పెట్టమన్నదట', 'వంటాపె అని తెచ్చుకుంటే ఇంటాపై కూర్చొన్నదట' అనే సామెతలు తెలుపుతాయి. తోటకూరకు కడిగిపెట్టిన నీరే చాలునని, ఆ స్వల్ప విషయం కూడా వంటకత్తెకు తెలియదని పరిహాసం. వంట సరిగా చేయలేని స్త్రీలే పొగడ్తలు కోరుకుంటారని, సంపాదించలేని మగవాళ్లు మంచితిండి కావాలంటారని, చేయలేనమ్మకు చేష్టలు ఎక్కువని చెప్పే సామెతలు: 'వండలేని అమ్మకు వొప్పులు మెండు, తేలేని అయ్యకు తిండి మెండు' (కార్. 1920), 'చేయలేనమ్మకు చేష్టలు మెండు, వండలేనమ్మకు వగపులు మెండు' అనేవి. 'నెప్పరగత్తె (నేర్పరి స్త్రీ) పప్పులు (పిండివంటలు) వండితే వడిగలమ్మ ఒళ్లో పెట్టుకొని పోయిందట'.

3.3.1 (ఋా) భోజనానికి మరుగు (4) : భోంచేసేటప్పుడు ఇతరులుచూస్తే దృష్టి దోషం తగుల్తుందంటారు. వైష్ణవులు భోజనంచేసేటప్పుడు తెర వేసుకొంటారట. వాసన చూచినా, నాకినా ఆ భోజనం మంచిదికాదట. 'తలుపు వేయని భోజనము' (పప). 'బోటికి నీటు కూటికి చాటు', 'నాకి చూచిన మూచూచిన భోజనము నింద్యము (బ్రౌ. ని.) అనేవి పై విషయాల్ని తెలిపే సామెతలు.

3.3.2 వంట పరికరాలు – భోజన పరికరాలు : వంటచేయడానికి అవసరమైన పొయ్యి, దాలి, కుండలు, తెడ్డు, అబకలాంటి సామగ్రిని గురించి భోంచేసేందుకు అవసరమైన కంచం, విస్తర్లను గురించి సామెతలు చెప్పిన విషయాలు ఈ శీర్షికలో చర్చనీయాంశాలు.

పొయ్యి – దాలి, కుంపటి (5) : వంటచేసేందుకు అవసరమైనది పొయ్యి. పిడకలప్రోగుతో చేసిన తాత్కాలిక పొయ్యి దాలి. చలికాచుకొనేందుకు నిప్పులుంచేది కుంపటి. బొగ్గులు ఇందులో వేసి మండిస్తారు. ఉన్నవాళ్లు ఇటుకల్తోనూ, లేనివాళ్లు మట్టితోను పొయ్యిలు వేసుకుంటారు. పొయ్యి త్రవ్వడం ద్రోహానికి గుర్తు. ఈ విషయాల్ని తెలిపే సామెతలు: 'ఇంటింట ఒక ఇటుక పొయ్యి, మాయింట ఒక

పట్టి పొయ్యి', 'భోజనానికి వచ్చి పొయ్యి త్రవ్వినట్లు' అనేవి. 'దాలి భోంచేస్తావా? పొయ్యి భోంచేస్తావా?' (సా) అనే సామెతలో పొయ్యి, దాలి వంట వండేందు కుపయోగిస్తాయేగాని, అవి భోజనపదార్థాలు కావని చెప్పబడింది. 'ఆర్భాటానికి ఆరు కుంపట్లు, ఒక దుంపదాలి' అనే సామెత అనవసరార్భాటాన్ని సూచిస్తుంది.

కుండలు (12) : వంటకోసం కాగబెట్టే నీరు ఎసరు. గింజలు సిద్ధంగాఉంటేనే ఎసరు ప్రయోజనం ఉంటుంది. లేకుంటే వృథా. తక్కువమందికయితే చిన్నకుండలో, ఎక్కువమందికైతే పెద్దకుండలో ఎసరు పెడతారు. ఈ కుండ ఇంత బియ్యం ఉడుకుతుందని గృహిణులు తెలుసుకొనే ఎసరుపెడ్తారు. 'నీపై ఎసలేదు నాపై పస లేదు ఏడుసేర్ల తప్పేలకెసరు పెట్టమన్నట్లు' అనే సామెత పై విషయాన్ని తెలుపు తుంది. రోగాలు వచ్చినా ఇంట్లో తిండి ఖర్చు తగ్గలేదని 'అత్త కొక రోగం, మామ కొక రోగం అడ్డెడు తప్పేలాకు ఏరోగం లేదు' (గృ. ల. 312) అని ఒక కోడలి ఆక్రోశం. కూడు ఉడక్కపోతే కుండది తప్పుకాదు. కట్టెలదో, మంటదో, బియ్యా నిదో కాబట్టి కుండనేంచేసినా ప్రయోజనం లేదని 'కూడు ఉడకలేదని కుండట్టుకు కొట్టాడట' అనే సామెత తొందరపాటును, తెలివితక్కువతనాన్ని సూచిస్తుంది. ఇంట్లో ఒక పొంత పొయ్యి, ఒకటో రెండో సాదాపొయ్యిలు వేసుకుంటుంటారు. సాదా పొయ్యికి మూడువక్కల గోడలుంటే, పొంత పొయ్యికి రెండు వైపులే గోడలుంటాయి. ఒక వైపు పొంతబాన పెడ్తారు. వంటకు పెడితే పొంతలో నీళ్లు కాగుతుంటాయి. పల్లీయులు చలికాలం ఉదయంలేస్తూనే పొంతలో కాగిన నీళ్ల నోట్లో పోసుకుని పుక్కిలించడానికి, మొగం కడుక్కోవడానికి ఉపయోగిస్తారు. ఆ విష యాన్ని 'పొయ్యెపెగ పొంతకుండకు తగలకపోతుందా' అనే సామెత తెలుపుతుంది.

తెడ్డు - అబక (10) : వంట కలియదిప్పే కొయ్య గరిటె తెడ్డు. టెంకాయ చిప్పతో చేసిన కొయ్య గరిటె అబక. సంగటి గెలికే కొయ్యను తెడ్డు కట్టె అని, అబకను చిప్పకట్టె అని కడపమండలంలో అంటారు. గొప్ప వార్తో కలిసి ఉన్నా వారి విలువ అవివేకులు తెలుసుకోలేరని చెప్పే సందర్భంలో 'ఎనిపిన తెడ్డు చవులేమెరుగును' అనే సామెత వాడ్తారు. సాధనముండగా అనవసర ప్రయా సలు పడే తెలివి తక్కువను 'తెడ్డుండగా చేయి కాల్చుకున్నట్లు' అనే సామెత ఎత్తి చూపుతుంది. మారుతల్లి తెడ్డుతోగాక సవతికూతురి చేత్తో కలియబెట్టిందట ఉడికే వంటను. తప్పుచేయొద్దని చెప్పినవారే చేస్తే 'కోడలికి బుద్ధిచెప్పి అత్త తెడ్డు నాకినట్లు' అనే సామెతతో బుద్ధిచెప్తారు. తెడ్డునాకడం ఓగు చేష్టగా స్త్రీలు భావిస్తారు.

కూరలు, అంబలి, గంజిలాంటి ద్రవపదార్థాలు వేరే పాత్రల్లోకి వేసేందుకు అబక వాడుతారు. అబకలోకి రావాలంటే ముందు ఆ పదార్థం పాత్రలో ఉండాలి గదా! 'చట్టిలో ఉంటే అబకకు వస్తుంది' అని సామెత. 'అంబటేరు పార్తా ఉంది అత్తా అంటే కొల్తపకతో అపకదే కోడలా అన్నదట' (చంద్ర) ఒక అత్త, కోడలి తిండి విషయంలో అత్త చూపే నిర్బంధాన్ని ఈ సామెత చక్కగా వ్యక్తీకరిస్తుంది.

(ఈ) ఇతర పరికరాలు (8): మూకుళ్లు, కత్తిపీట, ఉట్టి అనే వాటిని గురించి చెప్పిన సామెతలున్నాయి. 'ముందువారికి మూకుళ్లు, వెనుకవారికి నాకిళ్లు', 'మహా మహావాళ్ళు మన్నుమూకుళ్ళు అయితే నీవొక జల్లి మూకుడువి', 'చమురున్న పెంకు ఎప్పుడూ పేలదు', 'కత్తిపీటకు పళ్ళు పులుస్తాయా' అని ఆసామెతలు. కట్టెలు లేనప్పుడు జొన్న, లేదా పద్దదంట్లు పొయ్యిలో పెట్టి మంటవేయడం కద్దు. ఆవిషయాన్ని 'సంబరం మరేమీ లేకపోయినా పొయ్యికాడ సందెడుదంట్లు (రా. వ. 774) అనే సామెత తెలుపుతుంది. వండేందుకు పదార్థాలేమీ లేకపోయినా దంట్లు మాత్రం ఉన్నాయి అని పై సామెత భావం.

పాత్రలు పెట్టుకొనేందుకు ఇంట్లో వ్రేలాడగట్టిన చిక్కాలను ఉట్లు అంటారు. పిల్లులు, ఎలుకలు, కుక్కలు భోజనపదార్థాల్ని కాజేయకుండా ఉండేందుకు ఇవి అవసరం. రెంటికీ చెడ్డదాన్ని 'ఉట్టికి, చట్టికి రెంటికి చెడ్డట్టు' అనే సామెత చెప్తుంది. పైలాపచ్చీసుగా తిరిగేవాణ్ణి వానికేం 'ఉట్టి మీద కూడు, ఊరి మీద నిద్ర' అంటుంటాం.

(ఉ) భోజనంచేసే సాధనాలు (21): మొన్న మొన్నటివరకు బ్రాహ్మణుల్లో ఆచారవంతులు విస్తర్లలోనే భోంచేసేవారు. సన్నిహితులకు కంచాల్లో, మిగిలిన వారికి విస్తర్లలో పెడ్తుంటాము. చుట్టాలను సరిగా చూడనివారు అందుకు వ్యతిరేకంగా చేస్తారని ఒక సామెత అంటున్నది. గొప్పవారు అన్నీ తెలిసి ఎగిరెగిరి పడరని, భోజనంతో నిండిఉన్న విస్తరితో పోలుస్తాము. విస్తర్లు మర్రి, మోదుగ, బాదం ఆకుల్తో కుడుతుంటారు. జమ్మిఆకులు చాలా చిన్నవి. అసంభవమైన కార్యాన్ని జమ్మిఆకుతో విస్తరికుట్టడంగా అంటారు. ఈ విషయాల్ని 'అయిన వాళ్లకు ఆకులలోను, కాని వాళ్లకు కంచాలలోను', 'ఏమీ లేని ఆకులు ఎగిసి పడితే అన్నీ వున్న ఆకులు అణిగివుంటవి' (కార్. 454) 'జమ్మి ఆకుతో విస్తరి కుట్టినట్లు' అనే సామెతలు తెలుపుతాయి. ఆత్రగాడు విస్తరి కుట్టినంతసేపు కూడా ఉండలేడని, పొలాల దగ్గర అన్నం పల్లెల్లో చద్ది కట్టిన గుడ్డలో తింటారని చెప్పే సామెతలు: 'అవసర

గాడికి ఆకులో పెడితే నాకు బోకిలో పెట్టుమన్నట్లు', 'గొంగట్లో అన్నంతింటూ వెంట్రుకలు ఏరినట్లు' అనేవి. గొంగట్లో వెంట్రుకలు ఏరుతుంటే వస్తూనేఉంటాయి.

(ఊ) వండడం (11): అన్నం బాగా అవాలంటే పొయ్యి బాగా మండాలి సెగ దగలాలి. కాని పొయ్యి అవసరమున్నప్పుడు మండకుండా తర్వాత మండు తుంది. మసిపాత్రలు అంటుకోవడంవల్ల స్త్రీలు అంతో ఇంతో మసిపూసుకోక తప్పదు. మంట బాగుంటే అరిసెలు బాగా కాల్తాయని కడప మండలంలో అందు కోసం చింత పేళ్లే వాడతారు. ఈ విషయాల్ని తెలిపే సామెతలు 'అన్నం ఉడికి నాక పొయ్యి మండుతుంది'. 'సెగ లేనిదే అన్నముడకదు, శ్రద్ధ లేనిదే చదువు రాదు' (నర). 'వండా లేదు వార్చా లేదు ముక్కున మసెక్కడిదే అన్నాడట', 'మంట జోరైతే వంటా జోరే' (నర) అనేవి.

(ఋ) ఇల్లు (2): సాధారణంగా ఇంట్లోనే భోంచేస్తారు. అలాగాక గోడ మీద పెట్టుకొని తినడం తెలివితక్కువ అని 'ఇల్లు ఉండగా ఇదుపున పెట్టుక తిన వలెనా' అనే సామెత తెలుపుతుంది. ఒక ఊరికి అన్నంవేళలోగా చేరుకోగలమని ఇంటి దగ్గర భోంచెయ్యకుండా చద్ది తీసుకోకుండా వెళ్లి ఆ వేళకు అక్కడికి చేర లేక పోతే, 'ఇంటి కూటికీ దోవకూటికీ చెడినట్లు' బాధ పడుతారు. దోవ కూడు అంటే చద్ది కూడు.

3.3 3 భోజనం-వివిధాలు (7): కాస్త ఉన్న వాళ్లు బియ్యం తినగా; జొన్న రాగి, కొర్రు, అరిక బీద వాళ్ల తింటారు. వరి అన్నం, సంగటి, అంబలి, గంజి, జావ పై ధాన్యాలతోనే చేస్తారు. అవి కూడా దొరకని నిరుపేదలు తవుడు తిని,కలి త్రాగి బ్రతకాల్సి వస్తుంది. కరువుల్లో బలుసాకు తిని పేదలు ప్రాణం నిలపెట్టు కొంటుంటారు.

(అ) వరి అన్నం: బియ్యంలో సన్న బియ్యం నాణ్యమైనది. తౌడే దొరకని వానికి సన్నబియ్యం ఎలా దొరుకుతాయని 'తా బోతే తౌడు దొరకలేదుగాని,రాయరా సన్నాలకు చీటీ అన్నాడట' అనే సామెత వ్యంగ్యంగా బడాయిని దుయ్యబడుతుంది. మంచి కూరల్లేకున్నా వరి కూడు రుచిగానే ఉంటుందని, 'కూరలేక పోయినా వరి కూడు', 'సన్న బియ్యం చాయపప్పు', 'సన్నన్నం చిన్న చేపలు. కొర్రు బియ్యం కోడిచారు' అనేవి చెపుతున్నాయి. పెద్దలు సంగటి తింటున్నా పిల్లలకు వరి కూడు పెట్టడం గారాబానికి చిహ్నం. 'ఒక్కడే కొడుకని వరి కూడు పెడితే మీట్రిచ్చి మిండగాడయినాడట', 'ఒక్కతే కూతురని వరి అన్నం పెడితే మిద్దె ఎక్కి మిండల

పిలిచిందట'. అనే సామెతలు పై విషయాన్ని తెలిపేవి. అన్నమే లేక పోతే వరి అన్నం కావాలనడం బడాయికి గుర్తని 'అన్నం లేక పోతే వరి అన్నం, బట్టలేక పోతే పట్టు బట్ట' (ని. వే.) అనే సామెత తెలుపుతుంది.

(అ) కొర్రన్నం, సంగటి (9) : కొర్ర గింజలు చాలా చిన్నవి. కొర్రన్నం లోకి కోడిచారు అయితే బాగుంటుందని ఒక సామెత. కొర్రన్నంలోకి చారులాంటివి వేసుకోవాల్సిందే. లేకపోతే గొంతునబడుతుంది. జొన్న నూకల సంగటి తినేందుకు మెత్తగా ఉంటుంది. ఈ విషయాల్ని 'కొర్రగింజంత కోడలిని చూస్తే కొండంత జ్వరం వచ్చిందట', 'సన్న అన్నం చిన్న చేపలు, కొర్రన్నం కోడిచారు', 'ఊర్లో పెండ్లిఅయితే అంకుముండలకు రాగిసంగటి దిగబడదు', 'నోటికి మెత్తన నూకల సంకటి' (సా) అనే సామెతలు తెలుపుతాయి. రాగి సంగటి బండమీద వేసి దొర్లించి గుండ్రని ముద్దలుగా చేస్తారు. అది దొలుపుడు ముద్ద. పచ్చి మిరపకాయలు, ఉప్పు, ఉల్లిగడ్డ వేసి కచ్చా పచ్చాగా దంచి పచ్చికారాన్నే ఆముద్దలో వేసుకొని తింటారు. ఆ కారం నలుపుడు కారం. అవి రెండూ ఒక దానికొకటి సరిపోయేవి అనే అర్థంలో 'దొలుపుడు ముద్దకు నలుపుడుకారం' అనే సామెత వచ్చింది.

(ఇ) చద్ది అన్నం (17) : రాత్రిపూట అన్నంలో నీళ్ల పోసి పెట్టి ఉదయం మజ్జిగవేసుకొని తింటారు. సేద్యపుపనులకు పోయేవాళ్ళు ఉదయమే చద్దితినిపోతారు. ప్రయాణాలు వెళ్లేటప్పుడు రాత్రే అన్నం సిద్ధంచేసి ఊరుగాయో పచ్చడో వేసి చద్దిగుడ్డలో మూటగట్టి పెడ్తారు. ఒక తిండిపోతు అబ్బాయి 'చక్కిలాలు తింటావా చద్ది తింటావా అంటే చక్కిలాలూ తింటాను, చద్దీ తింటాను, అయ్యతోటి వేడీ తింటాను అన్నాడట' (కార్. 838). చద్దికి ఊరగాయ అవసరాన్ని 'ఊరగాయలేని చద్ది ఉప్పులేని పప్పు' అనే సామెత తెలుపుతుంది. ప్రయాణం వెళ్లేటప్పుడు చద్ది తప్పనిసరి అని 'ఎద్దులేని సేద్యం చద్దిలేని పయనం' (వ్య. సా. 69) అనే సామెత, చద్దిఅన్నం వేళకు తినకపోతే చెడిపోతుందని 'చెప్పిన బుద్ధీ కట్టిన సద్దీ ఎంతకాలం నిలుచును?' అనే సామెత, వానలు సరిగా లేకపోతే ఆరికచద్దే గతి అని 'అకాలపు వాన ఆరికచద్ది' (రా. ప. 19) అనే సామెత తెలుపుతున్నాయి.

(ఈ) అంబలి-గంజి-జావ-కలి (33) : పిండి, నూకలు వేసి జావగా కాచినది అంబలి. చోడిపిండితో చేసిన ద్రవపదార్థం గూడా అంబలే. అంబలి బీదలు తాగు తారని సామెతలను బట్టి చెప్పవచ్చు. 'అంబలా అంటే మొగాలే చెపుతాయి అన్నట్లు', 'అంబలి తాగేవాడికి మీసాలెగ బెట్టే వాడు ఒకడా?', 'అంబలికి ఉప్పు

అబ్బదంటే పిండివంటమీద పోయిందట మనసు' అనే సామెతలు పై విషయానికి సాక్షులు. మంచితిండి అనుకోకుండా అబ్బినపుడు 'అంబలితినువేళ అమృత మబ్బినట్లు' అనే సామెత ప్రయోగిస్తారు. 'దుమ్ముపోసి అంబలి కాచినట్లు' (కార్ 2398) అనే సామెత వ్యర్థప్రయత్నాన్ని తెలుపుతుంది. 'ముందటివానికి ముంతంబలి వెనుకటివానికి తెడ్డంబలి' అనే సామెత ముందువానికి అంబలి సరిపోయేట్లు లభిస్తుందని, వెనుకటివానికి తెడ్డుతో పోసే అంబలి, అంటే చాలా కొంచెం అంబలి మాత్రం దొరుకుతుందని చెప్తుంది.

బియ్యం వార్చిన నీరు గంజి, బీదవాళ్ల గంజి. ఉప్పువేసుకొని తాగుతారు. కరువుల్లో బియ్యం నూకను గంజిగా కాచి అన్నార్తులకు పోస్తుంటారు. 1952 వ సంవత్సరము కరువును రాయలసీమలో గంజి కరువు అంటారు. 'ఎద్దులా కష్టపడినా గంజికి దోవలేదు', 'గతి లేనమ్మకు గంజే పానకం', 'కాలే కడుపుకు మండే గంజి' అనే సామెతలు ఇది బీదవారి ప్రాణాధారం అని తెలుపుతున్నాయి. 'గంజి ముంతకు విలువలేదు గంగ చలువకు తిరుగులేదు' (యె. ర.) అనే సామెతలో గంగ చలువ అనేది కల్లు చలువ అయి ఉండొచ్చు. 'లోకువ దానికి నూకల జావ' అనే సామెత జావను గురించి చెప్పిన సామెత.

బియ్యం కడిగిన నీళ్ల కడుగునీళ్లు. దీన్ని గంజిలో కలిపితే కలిఅవుతుంది. నిరుపేదలకిది ఆహారం. యానాదులు కట్టెలు అమ్మేవాళ్లని, రైతుల ఇండ్లల్లో ఈ పుల్లనీళ్లు పోయించుకొని లొట్టలు వేసుకుంటూ తాగేవాళ్లని థర్స్టన్. 'పుల్లనీళ్లకే పుణ్యమనేవాడు' అల్పసంతోషి. కడుగు త్రాగితే కడుపు నిండదని, కలి కావాలని కోరుకునేవాళ్ల ఇంకేమీ దొరకనివాళ్ళేనని 'కడుగు త్రాగినవాని కడుపేమి నిండురా', 'కలిపోసి పెట్టినా ఉట్టివంకే చూపు' అనే సామెతలు చెపుతున్నాయి.

(ఉ) తవుడు (14): పేదలు తవుడును రొట్టెగాను, సంగటిగాను చేసుకుని తింటుంటారు. ఏ పదార్థమైనా తినే సమయానికి ముందే సిద్ధంచేసుకోవాల్సి ఉంటుందని 'తనకు అని తవ్వెడు తవుడు ఉండే ఆకటివేళకు ఆరగించవచ్చును' (కార్. 978) అనే సామెత తెలుపుతుంది. బడాయిపడే వార్ని హేళనచేసే సామెతలు 'తానూ ఒక మనిషేనా, తవుడూ ఒక రొట్టేనా' (కార్. 1054), 'తవుడు తింటూ ఒయ్యారమా', 'తౌడుతినేవాడికి మీసాలెగ బెట్టే వాడొకడా' అనేవి. ఒక వస్తువును కోరి, అది లభించకపోతే అంతకన్న తక్కువదాన్ని కోరే సందర్భాన్ని 'నూకల కేక్చి యేడ్చి తఫుడుకేడ్చినాడట' అనే సామెత తెలుపుతుంది. సులభంగా

అయేపనికి కష్టపడడం వృథా అనే సందర్భంలో 'తవుడు తిని చచ్చేవానికి విషం పెట్టేవాడు వెట్టివాడు' అనే సామెత ప్రయోగిస్తాము.

(ఊ) బలుసాకు (2) : కరువులో ఏదీ దొరకనపుడు ఈతగడ్డలు, తాటిగుంజూ, బలుసాకు, జాదారాకు తిని నిరుపేదలు ప్రాణం నిలుపుకొంటారు. ఆ విషయాన్ని 'బ్రతికిఉంటే బలుసాకు ఏరుకుని తినవచ్చు' అనే సామెత స్పష్టీకరిస్తుంది.

3.3.1 కూరలు (71) : కూరలను గురించి చెప్పిన సామెతల్లో కూరలేనిదే భోజనంకాదని, కూరల్లో పప్పు అన్నిటికన్న మిన్నని చెప్పబడింది. వంకాయలాంటి కాయగూరలు, తోటకూర ఇత్యాది ఆకుకూరల ప్రస్తావన సామెతల్లో ఉంది.

(అ) కూరల అవసరం (11) : భోజనంలో కూరల అవసరాన్ని చెప్పిన సామెతల్లో కూడు చల్లారేదాకా కూర నంజుతుంటామని, కూరలేనిదే అది భోజనమే కాదని, కూర వండుకోవాల్సిందే తప్ప వేరేవిధంగా రాదని, తినబోతూ కూరలరుచి అడగడం హాస్యాస్పదం అని చెప్పిన సామెతలున్నాయి. 'కూడు వేడైతే కూరాకు నంజినట్లు', 'కూడు లేక కూర దిన్న ఆకలి దీరునా', 'కూరలేని తిండి కుక్క తిండి'. 'చట్టిలోకి కూరాకు ముద్దిలోకి మేకు తెచ్చుకొంటే గాని రావు', 'కుడవబోతూ కూరలరుచి అడగడమెందుకు' అనేవి. సొంతంగా వండుకొనేవారు ఒకటి కన్నా ఎక్కువ కూరలు వండుకోలేరని వ్యంగ్యంగా చెప్పేసామెత 'వండు కున్నమ్మకు ఒకటే కూర, అడుక్కతినే అమ్మకు అరవై ఆరుకూరలు' అనేది.

(ఆ) పప్పు (21) : పప్పు అంటే బ్రాహ్మణులకు మిక్కిలిప్రీతి అని 'అత్తకు అల్లుడాళ బాపనికి పప్పాళ' అనే సామెత తెలుపుతుంది. ప్రతిదినం పప్పు వండు కోవాలంటే సాధ్యంకాదు, ఖరీదు ఎక్కువ కాబట్టి. ఆవిషయాన్ని చెప్పే సామెత 'అప్పా : పప్పు వండవే చెడేవాడు బావ ఉన్నాడు గదా' అనేది. పప్పురుచిని, అవ సరాన్ని 'సన్నబియ్యం చాయ పప్పు', 'పప్పుతో పదికబలాలు తింటే పులుసెందుకు బుగ్గిలోకా', 'పప్పులేని పులగం, ఉప్పులేని దప్పళం' అనే సామెతలు తెలుపుతాయి. పెసరపప్పు, బియ్యం కలిపే పులగం వండుతారు. కందిపప్పేకాకుండా పెసర, ఉలవపప్పుతోకూడా వండుతారు. 'మొదలు లేదు మొగుడా అంటే పెసరపప్పు వండవే పెండ్లామా అన్నాడట' (సా), అని సామెత. కొన్ని చోట్ల నీళ్లలో పప్పు ఉడ కదని 'ఆ నీళ్లకు ఈ బేళ్లు ఉడకవు' (నర), 'ఒల్లీ ఒల్లని చుట్టము వచ్చాడు, ఉడ కవే ఉలవపప్పా ఉగాది దాకా' అనే సామెతలు విశదీకరిస్తాయి.

(ఇ) కూరగాయలు (23) : వంకాయలు, అరటికాయ, గుమ్మడి, బీర,

కాకర, ములగ, నేతిబీర, సొరకాయలను ప్రస్తావించిన సామెతలున్నాయి. లేత వంకాయ రుచిగా ఉంటుంది. అప్పుడప్పుడే కోసి వండితే వంకాయ బాగుంటుంది. అరటికాయ కోసి 2, 3 దినాలు పెడితే బాగుంటుంది. మంచి గుమ్మడికాయలు తోట దగ్గరే అమ్ముడు పోతాయి. పేరుకు తగినట్లు లేని కాయ నేతిబీరకాయ. కాకరకాయకు ముండ్లు (గరకలు), బీరకాయలో పీచు ఉంటాయి. ఈ విషయాల్ని చెప్పే సామెతలు: 'వగలమారి వంకాయ సెగలేకనే సగమయినది' (కార్.1924), 'వంకాయరుచి తోటవాడెఱుగును అరటికాయరుచి రాజెఱుగును', 'మన గుమ్మడి కాయలు మంచివైతే బజార్లో ఎందుకు దొర్లుతుంటాయి', 'పేరు నేతి బీరకాయ, చీరి చూస్తే నేతి చుక్క లేదు', 'బీరకాయకు తగినపీచు, కాకరకాయికు తగినముండ్లు ఉంటాయి' (నర), 'ములగకాయకు తగినముండ్లు, కాకరకాయకు తగిన కరకులు', 'సోద్యం సొరకాయ గుడ్డుపెట్టిందట' అనేవి. సొరతీగల్ని ఇండ్లమీదికి అల్లిస్తారు. అవి అక్కడే కాయలు కాస్తాయి అనే విషయాన్ని 'వీర పతివ్రత ఇల్లెక్కొనాడితే ఇంటిమింది సొరకాయ ముద్దెత్తుకునాడిందంట' (చంద్ర) అనే సామెత చెపుతుంది.

(ఈ) పులుసుకూరలు (21): పప్పుతో పోలిస్తే పులుసుకూరలు రుచి తక్కువని సామెతలు చెపుతాయి. 'ఒకనికి యిగురుకూర యిష్టము, ఇంకొకనికి పులుసు కూర యిష్టము', 'బెదిరించి బెండకాయ పులుసు పోసినట్లు', 'పొరుగింటి అట్లకు తిమ్మనము కాచుకున్నట్లు' (తిమ్మనం అంటే మజ్జిగ పులుసు) అనే సామెతలు పులుసుకూరల్ని చెప్పేవి. పప్పులో చింతపులుసు వేసి చేస్తే పుల్లగూర. పులుపు వేయకుండా చేసేది తియ్యగూర. కడపమండలంలో వీటి వినియోగం ఎక్కువ. ఇతరులఇంట్లో చేసినకూరను రుచిగా భావిస్తారని,మనవద్దనున్నది ఇస్తేనే ఇతరులువారి వద్ద ఉండేది ఇస్తారని 'పొరుగింటిపుల్లగూర రుచి', 'ఇందమ్మ తియ్యగూర అంటే ఇందమ్మ పుల్లగూర అన్నట్లు' అనే సామెతలు తెలుపుతాయి. 'ఎఱ్రగడ్డచారు రుచి కరంకాదని, కంచుపాత్రల్లో కళాయిపోతే చిలుముపట్టి కూర చెడుతుందని 'ఏనాడు లేదు ఎఱ్ఱగడ్డచారు', 'అరిగినకంచు మురిగినచారు' అనే సామెతలు తెలియజేస్తాయి.

కాచనిపులుసు పచ్చి పులుసు. అందులోని ఉల్లిగడ్డ ముక్కల్ని నంజుకుంటూ వరి, కొఱ్ఱ అన్నం తింటారు. పచ్చిపులుసులో ఉల్లి, మసాలా వస్తువులు వేచేస్తే రుచి. పచ్చిపులుసులో కారం, ఉప్పు, పులుపు ఎక్కువగా ఉంటాయి కాబట్టి ఎక్కువగా తాగితే విరేచనాలయ్యే ప్రమాదముంది. ఈవిషయాన్ని 'పదివేస్తే పచ్చిపులుసు

లేక పోతే పాడుపులుసు' 'పౌరుషానికి పచ్చిపులుసు తాగినట్లు' అనే సామెతలు విశదీకరిస్తున్నాయి.

(ఉ) ఆకుకూరలు (11): తోటకూర, గోంగూర, (పుంటికూర), దొగ్గలి, నేలవేము, పాయలాకు అనే ఆకుకూరల ప్రస్తావన సామెతల్లో ఉంది. తోట కూరకు ఎసరు అక్కర్లేదని, గిల్లి వేస్తుంటే పెరిగే తోటకూరవంటిది సిగ్గుఅని, పులుపుగాఉండే గోంగూరలో చింతపండువేయడం వృథాఅని, పుట్టినింట్లో ఏదితిన్నా రుచికరమేనని, దొగ్గలాకు, నేలవేము కూరల్లో వేసేందుకు పనికిరావని, అరుదుగా పేయలాకు వేస్తారని సామెతలను బట్టి తెలిసిన విషయాలు. 'తోటకూర కడిగి పెట్టిన యెసరే చాలును' (కార్. 1134), 'సిగ్గనగా తోటకూరవంటిది' (బ్రౌన్, పు. 493), 'గోంగూరలో చింతకాయ వేసినట్లు', 'పుంటికూర తిన్నా పుట్టినయిల్లు, పాశము తిన్నా పరాయియిల్లు' (హైసా. III-12), 'దగ్గరకుపోతే దొగ్గలకూరకైనా కొరగాదు', నీరెంతపోసినా నేలవేము కూరగాదు', 'బంకచెక్కలు జింకతోలు పాయిలకూర' అనే సామెతలు పై విషయాల్ని తెలుపుతాయి. పాయలాకు ఉడికితే బంక బంకగా ఉంటుంది.

(ఊ) ఉప్పు-కారము (26): కూరల్లో కారంకోసం మిరియాలు, మిరప కాయలు వాడతారు. మిరియాలు చిన్నవి. చిన్న మిరపకాయలు కార మెక్కువ. కారం, ఉప్పు అన్ని కూరలకు అవసరమే. ఉప్పుతింటే దప్పికెక్కువ. పచ్చిమిరప కాయలు, ఉప్పు నలగగొట్టుకొని బీదలు తింటుంటారు. ఉప్పు, కారం, పులుసు కామాన్ని పెంచుతాయి. ఈ విషయాల్ని తెలిపే సామెతలు: 'బొంకరా బొంకరా పోలుగా అంటే టంగుటూరి మిరియాలు తాటికాయలంతేసి అన్నాడట', 'కారములేవి కూర ఉపకారములేవి మనుష్యుడు', 'కాయ చిన్నదైతే కారము తక్కువా' (సాసా,129) 'దొలుపుడు ముద్దకు నలుపుడు కారము', 'ఉప్పు తిన్నవాడు నీరు త్రాగక తప్పదు', 'ఉప్పులేదు కారము లేదు అమ్మతోడు కమ్మగుంది', 'ఉప్పు పులుసు కారము తినే శరీరానికి ఊపిరి ఉన్నంతవరకు ఉండనే ఉంటుంది కామము' అనేవి. 'ఉప్పుతో తొమ్మిది పప్పుతో పది' అనే సామెతలో వంటకు తప్పనిసరి వస్తువుల్లో ఉప్పు ఒకటిగా పేర్కొబడింది.

(ఋ) ఉల్లి-వెల్లుల్లి-మసాలా వస్తువులు (33): కూర రుచికోసం వేసే సా... లో ఉల్లి, వెల్లుల్లి చేర్తాయి. ఉల్లి ఘాటైనవాసనకు పేరు. ఉల్లికూరలో త అనే విషయాన్ని 'ఉల్లి ఉంటే మల్లి కూడా వంటలక్కే' (కార్. 305)

'తల్లి లేనిపిల్ల ఉల్లి లేని కూర', 'ఏమీ ఎఱుగని ఎల్లిపాయె దొంతులేస్తే దొల్లిపోయె'. అనే సామెతలు తెలుపుతాయి.

తాళింపులో వేసే మసాలా ద్రవ్యాల్లో ఉల్లి, వెల్లుల్లి, ఆవాలు, జిలకర, మిరియాలులాంటివి ఉంటాయి. జీలకర్ర పేరులో కర్ర ఉందిగాని, నిజంగా వస్తువులో లేదని, ఆవాలు శరీరానికి బలమని సామెతలు చెపుతాయి. 'జీలకఱ్ఱలో కఱ్ఱ లేదు', 'ఆవతిన్నమ్మకు యేవపారినదట' (కార్. 206) అనేవి. తిరగబోత వుంటేనే కూరలకు రుచి అని వివిధ విధాల నొక్కి చెప్తున్న సామెతలు: 'తిరిగి వచ్చిన భార్య తిరుగబోత వేసిన కూర బహు రుచి', 'గుడ్డకు జాడింపు కూరకు తాళింపు' (వ్య. సా. 476) అనేవి.

(ఋా) ఊరుగాయ-పచ్చడి (14) : భోంచేసేప్పుడు ఏదైనా నంజుకుంటూ తినడం సర్వ సాధారణం. ఊరగాయ చద్దికి చాలా ముఖ్యం. అల్లప్పచ్చడి, ఆవకాయ, ఉస్తికాయ, ఉసిరికాయ ఊరుగాయల్ని గురించి సామెతల్లో ప్రస్తావన ఉంది. పాత, కొత్త చింతకాయ పచ్చళ్ల మధ్య తారతమ్యాన్ని చక్కగా చెప్పిన సామెతలున్నాయి. 'నాలుగేళ్లు నంజుకొని నడిమేలు గుంజుకో' (నర) అనేది నంజుకొనేందుకు పిల్లలు ఏదైనా కావాలన్నప్పుడు తల్లులనే మాట. 'తొఱ్ఱోడు మెచ్చేది ఊరిబిండి', 'ఊరగాయ లేని చద్ది ఉప్పులేని పప్పు' (సా), 'కుళ్లు ముండకి అల్లం పచ్చడి అన్నట్లు', 'ఆడవారికి ఆవకాయ మగవారికి బోడిపెంకలు', 'ఉస్తికాయ ఊరనెంత, నంజ పెట్టనెంత', 'అడవి ఉసిరిక్కాయకు సముద్రపు ఉప్పు కలిపినట్లు', 'పాతచుట్టం పాత చింతకాయ పచ్చడి', 'కొత్త చింతకాయ తొక్కు కొత్త చుట్టరికము రుచి' అనేవి పై విషయాల్ని తెలుపుతాయి.

3.3.5 మాంసం-చేపలు (27) : బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యేతరులకు మాంసం, చేపలు నిషేధంలేదు. బ్రాహ్మణులు, వైష్ణవులు, వైశ్యులు దొంగచాటుగా ఇవి తింటున్నట్లు సామెతలు సాక్ష్యమిస్తున్నాయి. అడవులు దగ్గరగా ఉండేవారు ఏ పక్షినో, కుందేల్నో తెచ్చుకొని మాంసం దినమూ తింటుంటారు. వరి అన్నం లేకపోయినా గంజిలోనయినా సరే వారికి నంజుడు ఉంటుంది. ఆవిషయాన్నే 'నంజుడు లేకపోతే గంజి దిగదు' (నర) అనే సామెత చెపుతుంది. మాంసం, చేపల పంపకాల్లో పట్టింపు ఎక్కువని, మాంసంతినేప్పుడు ఆనందంగావున్నా డబ్బులిచ్చేప్పుడు మూతి ముడుచుకొంటారని, మాంసం కండబలాన్ని పెంచుతుందని, ఎముకలు రుచి అని, మాంసంతిన్నా తిన్నట్లు పైకి కనిపించవలసిన పన్లేదని, సులభంగా తెంపగలిగే

పొట్టపేగును కూడా తెంపలేనివాడు అర్భకుడని సామెతలు తెలుపుతున్నాయి. 'మంచి వానిబుద్ధి మాంసంకాడ తెలుస్తుంది' (నర), 'నీచుకాడ చూడరా పాచుగాడి గుణం' 'చీలు అంటే సిబ్బి ఎత్తుకొని పొయ్యి దుడ్డు అంటే నాకొద్దు నేను పిల్లోన్ని మా నాయన ముసిలోడు అన్నాడట' (నర), 'బొక్క కొరుకంగ భోగము లెక్క జెప్పంగ దుఃఖము' (హైసా X-17), 'మాంసం మాంసాన్ని పెంచుతుంది', 'పుంటికూరలో పుడక రుచి మాంసంలో బొక్క రుచి' (హైసా-I-15), 'కండలు తినేవాడు ఎముకలు మెడేసుకోడు' (రా. ప. 682), 'ఉడికిన పొట్ట పేగు గూడ తెంపలేవు' (నర) అనేవి.

కోడితునకల రుచిని, కొర్ర బువ్వకు కోడి చారుకు ఉండే అనుబంధాన్ని, కోడిని కోసి దాయాదుల్ని పిలవకపోతే వచ్చే నిష్ఠూరాన్ని, 'కోటి వంటల కన్న కోడి తునకలు మేలు' (నర), 'సన్న బువ్వ చిన్నచేపలు కొఱ్ఱ బువ్వ కోడిచారు', 'కోడిని కోసి గోత్రానికంతా పగ ఐనట్లు' అనే సామెతలు చక్కగా చెప్తాయి. 'ఓర్చితే కోడిగుడ్డు చట్టెడు' అనే సామెతలో బ్రహ్మాండమంత అర్థం ఇమిడిఉంది. కోడిగుడ్డును తినివేయకుండా పొదగబెడితే ఆ గుడ్డునుంచి పుట్టిన కోడి మాంసం తినవచ్చునని ఆ సామెత భావం. 'గుడ్లూ కోడినీ తిని గూడెక్కి కూతవేసేవాళ్లు' (నర) ఈ లోకంలో బోలెడు మంది.

చేపలు తినేవారి నోట మాటలు స్వచ్ఛంగా రావని శాకాహారులంటారు. సన్నచేపలు రుచిగా ఉంటాయి. 'మచ్చాలుదినే నోట సొచ్చాలు ఎట్లా వస్తవి అన్నా డట', 'సన్నబియ్యం చిన్నచేపలు, కొఱ్ఱ బియ్యం, కోడిచారు' అని సామెతలు.

మాంసం తిన్న తర్వాత పళ్లసందున చిక్కుకున్న మాంసం ముక్కల్ని పుల్లతో కుట్టి తీసివేసుకుంటారు. ఆ విషయాన్ని 'చిన్నపుల్ల అయినా పల్లుకుట్ట పని వస్తుంది' అనే సామెత చెప్తుంది. మనింట్లో పచ్చిపులుసుతో దిన్నా మాంసం దిన్నట్లు పైకి భేషజంగా ఉండాలని చెప్పే సామెత 'పచ్చిపులుసు తిని పల్లుకుట్టు కుంటా రావాలి' (నర) అనేది.

**3.3.6 వివిధ వంటకాలు (133) :** కుడుములు, రొట్టెలు, పిండివంటలు, పాయసం, దధ్యన్నం, ఉప్పుపిండి, పులగం, పేలాలు, వడియాలు, అప్పడాలు, చక్కిలాలు, జంతికలు, బుడ్డకారాలు, గారెలు, వరుగులు, అట్లు, నానబాలు శెనగలు తదితరాలను గురించిన సామెతలున్నాయి.

**(అ) కుడుములు (7):** అందరూ సులభంగా చేసుకొనేవంట. సద్దలతో కుడు

ములు చేస్తారు. ఇవే ఉండ్రాళ్లు. తీపిపూర్ణము లోపల పెట్టి చేసిన భక్ష్యాలు కుడాలు. 'కుడుములు వండని ఆడదీ, కూని (స) రాగం తీయని మగవారు ఉండరు'. 'కుడుము చేతికిస్తే పండుగనేవాడు' అల్ప సంతోషి.

(ఆ) రొట్టెలు (15): కొంతమందికి రొట్టెలు ప్రధానాహారం. సజ్జ, జొన్న, రాగిపిండితో రొట్టెలు చేసుకుంటారు. బియ్యప్పిండితోనూ అరుదుగా చేసుకుంటారు. తవుడుతో రొట్టెచేసుకొనేది నిరుపేదలు. రొట్టె పరిమాణం పెట్టేపిండినిబట్టి ఉంటుం దని, రొట్టె రుచి నేయిపడితే ఎక్కువవుతుందని, పెద్ద మొత్తాల వాడికన్న చిన్న మొత్తాలవాడు ఎక్కువ సంపాదిస్తాడని, డంబాలు పలికే వారికి ఇంటివద్ద తినేదానికి ఏమీ వుండకపోవచ్చునని సామెతలంటున్నాయి. 'పీకుడుగానికి బియ్యపురొట్టె, మూతి కడుగ నేతిబొట్టు', 'తానూ ఒక మనిషేనా, తవుడూ ఒక రొట్టేనా' (బురా) 'పిండికొద్దీ రొట్టె', 'రొట్టె విఱిగి నేతిలో పడ్డట్టు', 'రొట్టెలవాడికంటె తునకల వాడు ఘనుడు' (కార్ 1885), 'వొట్టిమాటలే గానీ రొట్టెమీదికి తేమ లేదు' (రా. ప. 772) అనేవి ఆ సామెతలు.

(ఇ) అట్లు (16): అట్లు, పెసరట్లు, దోసెల ప్రస్తావన సామెతల్లో ఉంది. అట్లు స్త్రీలు సులభంగా చేసే వంట. ఒక మనిషివుంటే చాలు. ముగ్గుపిండి బియ్యపు పిండి మాదిరి తెల్లగావున్నా అట్లకు పనికిరాదు. పెసరట్టు రుచికరం. దోసెకు తూట్లు పడడం సహజం. ఈ విషయాల్ని 'అట్లు వండనేరని అత్త ముందర గారెలు వండ నేరని కోడలు మహామేధావి యట' (గృ. ల. 4), 'అట్లు వండే అత్తకు అరవై ఆరు ఎత్తులు పెట్టినట్లు', 'ముగ్గుపిండి అట్లకు పనికి వచ్చునా?', 'పెనమే మెఱుగును పెసరట్టు రుచి', 'ఎవరింటి దోసెకైనా తూట్లే' అనే సామెతలు తెలుపుతాయి.

(ఈ) గారెలు (8): మినప్పప్పుతో చేసే వడలు గారెలు. రుచికరాలు. కడుపు పట్టేట్టుంటే గారెలు ఎన్నయినా తినగలిగే వాళ్లున్నారు. ఎక్కువ తింటే రుచికరాలైన గారెలుగూడ అరుచికరాలు అవుతాయి. ఈవిషయాల్ని తెలిపేవి 'ఆవగింజకు సందుంటే అరవై గారెలు అప్పుడే తిననా', 'కడుపునిండినవానికి గారెలు చేదు' అనే సామె తలు. 'గారెలు వండాలే పెళ్లామా అంటే వేలు చూపినట్టు' అనే సామెత చమత్కా రంతో నిండి ఉంది. ఒక మగడు గారెలు వండవే పెళ్లామా అంటే ఆమె వేలు చూపిందట. మగడు అర్థంగాక తెల్లమొగంవేశాడు. భార్య కిలకిలా నవ్వి గారెకు రంధ్రం పెట్టేందుకు వేలుంది. మరి సరుకులో? అందిట.

(ఉ) చక్కిలాలు, జంతికలు, కారాలు (17): చక్కిలాలు పిల్లలకు ప్రాణం

అనే విషయాన్ని 'బిడ్డ చక్కిలంవలె యెండిపోయినాడంటే చక్కిలాలు యిమ్మని యేడ్చినాడట' (కార్. 1609) అనే సామెత, ఇద్దరిలోనూ లోపం ఉన్నపుడు ఒకరి నొకరు వేలెత్తి చూపుకోవడం హాస్యాస్పదం అని 'చక్కిలాన్ని చూపి జంతిక నవ్విందట' అనే సామెత; నమలి తినాల్సిన బుడ్డకారాలు తొర్రివాడికి పెట్టడం వృధా అని 'తొర్రోనికి బుడ్డకారాలు పెట్టినట్టు' (రా. ప. 353) అనే సామెత చెప్తాయి.

(ఊ) అప్పడాలు-అటుకులు-వడియాలు-పేలాలు-వరుగులు (11) :
నంజుకొనేందుకు ఉపయోగించేవి. అప్పడాలు చాలా పలుచగా ఉంటాయని 'తలుపులు మింగేవానికి అప్పడాలు లొటలొట', 'కుడుము మింగేవానికి అప్పడాలు ఒక లెక్కా' అనేవి తెలుపుతాయి. అటుకులు రుచిగా ఉండి, ఎక్కువగా తింటే కడుపు నొప్పిని తెస్తాయని 'అటుకులు బొక్కే నోరు ఆడి పోసుకొనే నోరు ఊరుకోవు', 'అటుకులు తింటే ఆయెనా కడుపులో కుట్టెత్తినప్పుడు కదా' అనే సామెతలు చెప్తున్నాయి. పేలాలు మంగలంలో వేయించేటప్పుడు చిటపట ఎగురుతుంటాయని, తడిగుడ్డలో పేలాలు వేయించడం అసాధ్యమని 'మంగలంలోని పేలాల వలె', 'తడి గుడ్డలో పేలాలు వేయించినట్లు' అనే సామెతలు తెలియజెపుతాయి. బడాయి మనుషుల బండారాన్ని 'తా దిన తవుడు లేదు వారాంగనకు వడియాలట' అనే సామెత బయట వేస్తున్నది. వరుగులు దాగరలో ఎండబెడ్తారని 'వరుగుతో కూడ దాగర ఎండవలసినట్లు' అనే సామెత చెపుతుంది.

(ఊ) పులగం, పాయసం, దధ్యన్నం, ఉప్పిండి, పేలపిండి (22) :
బియ్యం పెసరపప్పు గలిపి పులగం వండుతారు. దానిపై మళ్లీ పప్పు వేస్తే తిన లేము అని 'పులగంమీద పప్పు పుల్లయ్య వేమారం' (పప) అనే సామెత తెలుపుతుంది. పాయసం, పరమాన్నం సమానార్థకాలు. పాయసం రుచి నెయ్యితో పెరుగుతుంది. పాయసం పెట్టినా పారతంత్ర్యం పనికిరాదు. మాటలు చెప్పేవానికి పెరుగు అన్నం, పనిచేసినవానికి వేణ్ణీళ్ల అన్నంపెట్టడం లోకంలో రివాజు. ఈ విషయాల్ని చెప్పే సామెతలు: 'పాయసంలో నెయ్యి ఒలికినట్లు', 'బందెలో పాయసం కంటె బయట సజ్జరొట్టె మేలు', 'తాటోటుగానికి దధ్యన్నము, విశ్వాసముకలవానికి వేణ్ణీళ్ల అన్నము' (కార్. 2370) అనేవి. ఉప్పుపిండి (ఉప్మా), పేలపిండి, పళ్లు లేని వారికి తిన మెత్తగా ఉంటాయి. 'తొత్తి మెచ్చేది ఉప్పుపిండి'. 'బోసినోటికి పేలపిండి ప్రీతి'. స్వార్థపరులకు 'పరులసొమ్ము పేలపిండి, తమసొమ్ము దేవుడి సొమ్ము'.

(ఋ) పిండివంటలు (27) : బూరెలు, అరిసెలు, హోళిగలు (బొబ్బట్లు) పోరెలు, మండిగలు, బక్షీలు సామెతల్లో ప్రస్తావించబడ్డాయి. భక్ష్యాలంటే ప్రీతి ఉన్నఒకన్ని గురించి 'పది భక్ష్యాలు తినే లక్ష్మయ్యకు ఒక భక్ష్యము లక్ష్యమా' అనే సామెత ప్రస్తావిస్తున్నది. బూరెలో పూరణం ఉంటుందని, బూరె రుచికరం, నేయిపడితే ఇంకా ఎక్కువరుచి అని 'కారణంలేని కార్యం, పూరణం లేనిబూరె, వీరణంలేని పెండ్లి ఉండవు', 'తంతే బూర్లగంపలో పడ్డట్టు', 'పూసుకురావే బూరె ముక్కా అంటే నేనూ వస్తానే నేతిచుక్కా అన్నట్లు' అనే సామెతలు తెలియ జెప్తున్నవి. నిప్పటి (అతిరసాలు) పరిమాణం పెట్టే పిండిని బట్టి ఉంటుందని, నేతి అతిరసాలు రుచికరాలని, 'పిండి కొద్దీ నిప్పటి', 'నేర్పుగలమ్మ నేతిలో అత్తి రసాలు కాలిస్తే ఓర్పుగలమ్మ ఒడిలో గట్టుకొనిపోయిందట' అనే సామెతలు విశదీ కరిస్తున్నాయి. హోళిగల్లో నేయివేసుకుంటే ఇంకా రుచిఅని 'నీ హోళిగ నేతిలో పడ అన్నట్లు' (రా. ప. 399) అనే సామెత, బొబ్బట్లు ఐతే బాగుంటుందని 'నూరు కొరడాదెబ్బలైనా ఒక బొబ్బట్టుకు సరిరావు' అనే సామెత చెప్తున్నాయి. మండి గెలకు గోధుమల అవసరాన్ని 'మనసు మండిగెలు చేసుకుంటే గోధుమలెవరిస్తారు' అనే సామెత నిర్ద్వంద్వంగా చెపుతున్నది. 'ఇరుగింటమ్మ బక్షీలకు పొరుగింటమ్మ నెయ్యిగాచుకొన్నదట' అనే సామెతలో బక్షీలు వండుకోవాలిగాని పొరుగును నమ్మితే వీలుగాదు అనే విషయాన్ని వ్యంగ్యంగా బోధిస్తున్నది.

'భార్య చేతి పంచభక్ష్యపరమాన్నాల కన్న తల్లి చేతి తవిటిరొట్టె మేలు' అని ఒక సామెత సందేశం. ఎన్ని పిండివంటలున్నా తన కలవాటైన పదార్థమే కావాలనే సందర్భాన్ని 'పంచభక్ష్య పరమాన్నములు పెడితే రామచంద్రవొన్నెడి (?) తెమ్మన్నాడట' అనే సామెత చెపుతుంది.

(ఎ) పప్పులు (20) : వేయించిన శనగపప్పు, ఉలవలు, ఉడకేసిన అనుములు, నువ్వులు, పచ్చి పెసరకాయలు. తేగలు చిరుతిండ్లుగా తింటుంటారు. శనగలు తినేటపుడు చేతికి రోతేమీ కాదని, శెనగలు ఉలవలకన్నా రుచి అని, పిల్లలుఏడిస్తే పప్పులు పెట్టి పోరు మాన్పుతారని, 'శనగలు తిని చెయ్యి కడుక్కొన్నట్లు', 'శెన గలు తింటూ వులవలని చెప్పి పత్తివిత్తులు చేతిలో పెట్టేవాడు' (కారొ. 2071) 'పప్పులు పెట్టి పోరు మాన్పినట్లు', 'పిల్లోడు ఏడ్చేది పప్పు గింజలకే' (నర) అనే సామెతలు తెలుపుతున్నాయి. నోరూరుకోకుండా వేంచిన ఉలవలు ఒకటొకటే తింటుంటే బాగుంటుందని, అనుములగుగ్గిళ్ల తింటే అపాన వాయువులు ఎక్కువని,

పచ్చి పెసరకాయలు రుచికరాలని, తేగలు పిల్లలకు ఇష్టమని చెప్పే సామెతలు : 'తులవనోరుకు ఉలవలు ఏంచాల' (నర), 'అనుములు తిన్న తర్వాత అపాన వాయువులకు వెరిస్తే ఎట్లా', 'పెసర పెదవి సోకినా ఆడదాని తొడ సోకినా విడువ బుద్ధి కాదు' (రా. ప, 432), 'తేగంటి బిడ్డంటే తేగ తెమ్మని ఏడ్చినదట' అనేవి.

3.3.7 పాలు, తత్సంబంధి పదార్థాలు (100) : పాలు శిశువుల ప్రధానాహారం. పెద్దలకు బలవర్ధకం. స్త్రీ పుష్టిగా ఉండి శిశువుకు పాలు చాలక పోతే 'ఒడ్డూ వాసా లకమేగాని బిడ్డకు పాలు లేవు' (నర) అని ఎగతాళిగా అంటుంటారు. పాలకింద పిడకలు కాకుండా పేళ్లు వేస్తే పొంగిపోతాయని, పాలరుచిని పంచదార పెంచుతుందని, పాలరుచి తెడ్డుకు తెలియదని, తెల్లగాఉన్న వన్నీ పాలుకావని, పాలకు మించి తీపు లేవని, ఒక బొట్టు మజ్జిగే పాలను పెరుగుగా మారుస్తుందని సామెతలు తెలుపుతున్నాయి. 'పాల క్రింద పేళ్లు, నీళ్ల క్రింద దాళ్లు' (సా) 'పాలలో పంచదార ఒలికి నట్లు', 'అడ్డము దిడ్డము తిరిగెడి తెడ్డెరుగునే పాలతీపి', 'తెల్లగావుంటే పాలు నల్లగా వుంటే నీళ్లు' (కార్. 2385), 'పాలకు మించిన తీపి లేదు. పల్లకీకి మించిన సొగసు లేదు' (సా.సా.316), 'కడివెడు పాలకు ఒక మజ్జిగ బొట్టు'అనేవి.

పేరీ పేరని పెరుగు రుచి అని, పెరుగు పెత్తనం చెరుస్తుందని, అన్నం పెరుగు కలుస్తాయి కాని వడ్లూ పెరుగు కలవవని, మజ్జిగే పోయనివారు పెరుగు అసలే పోయరని, మజ్జిగపోసేవారు చివరికి నిష్ఠూరమౌతారని(నీళ్ల మజ్జిగ పోసినారు అని), తిరిపెం మజ్జిగకు వచ్చినవానికి గేదె వెలతో పనిలేదని, మజ్జిగ చిలకడం పల్లీయ స్త్రీలకందరికీ తెలుసునని, కూడి వచ్చే సమయంలో కూలి పోవడం 'వెన్న వచ్చేటపుడు బాన వగలడం' లాంటిదని సామెతలు చెపుతున్నాయి 'వచ్చీరాని చన్ను పేరీ పేరని పెరుగు', 'పెరుగు పెత్తనం చెఱచును', 'వడ్లూ, పెరుగూ కలిసినట్లు' (సా సా. 385), 'తా బోతే మజ్జిగ లేదంటే పెరుగుకు చీటి వ్రాయమన్నాడట', 'ఇల్లు ఇచ్చిన వానికి మజ్జిగ పోసినవానికి మంచి లేదు', 'తిరిపం మజ్జిగ కొచ్చి ఎనుము బేరం చేసినట్లు', 'వెన్నబడే సమయానికి బాన పగిలినట్లు' అనేవి సామెతలు. అడగవచ్చిన సంగతి అడక్కుండా దాచేస్తుంటే 'చల్లకు వచ్చి ముంత దాచనేల' అంటాము.

సులభంగా అయ్యేపనికి 'వెన్నలో వెంట్రుకలు దీసినట్లు' అనే సామెత; వృథా పనులకు 'వెన్నను సన్నగా మారినట్లు' అనే సామెత; బలప్రయోగంతో పనులు జరుగుతాయని 'అగ్గిచూపితే వెన్న అడక్కుండా కరుగుతుంది' అనే సామెత;

ఒక వస్తువు చేత పెట్టుకొని, ఆవస్తువుతో సిద్ధమయే మరో పదార్థంకోసం వెదకడం తెలివితక్కువ అని 'ఉట్టిమీద వెన్న పెట్టుకొని ఊరంతా నేతికి దేవులాడినట్లు' అనే సామెత, జున్ను వెన్న కన్నా రుచిగా ఉంటుందని 'జున్ను రుచి వెన్నకబ్బునా ?' అనే సామెత చెపుతున్నవి.

రొట్టెకు, అట్లకు, పాయసానికి, అతిరసాలకు నేయి కలిస్తే నే రుచి యినుమ డిస్తుందని 'రొట్టె విఱిగి నేతిలో పడ్డట్లు', 'పాయసంలో నెయ్యి ఒలికినట్లు', 'పొరుగింటి అట్లకు నెయ్యి కాచినట్లు' అనే సామెతలు తెలుపుతున్నాయి. నేతి కుండ నేలపెట్టి ఉత్తకుండను ఉట్టి మీద పెట్టినట్లు', 'నెయ్యి కార పెట్టవలె కయ్య దాట కొట్ట వలె' (సా), 'మెరుగు వెయ్యకగాని మృదువు కాదన్నము (కాశీ. 1807) అనేవి నేయి అవసరాన్ని చెపుతాయి. 'మా తాతలు నేతులు దాగారోయ్ మా మూతులు వాసన చూడండోయ్' అని బడాయిలు పలకడం వృధా అని ఒక సామెత మందలిస్తున్నది. పంచదారో లేదా బెల్లమో వేసి పానకం చేస్తారు. 'గతి లేనమ్మకు గంజే పానకం' అనే సామెత పేదలు పానకం చేసుకోలేరు అని, 'పానకంలో పుడక' అనే సామెత అన్నిటికీ అడ్డొచ్చే వారిని ఉద్దేశించి చెపుతుంటారు.

'కాఫీ లేనిది కాకియైనా కదలదు ఈ రోజుల్లో' (గోభూమి.50)అనే సామెత ఆధునికమైంది.

**3.3.8 మధుర పదార్థాలు (33) :** తీపి పదార్థాల్లో తేనె, చెరకు, దాన్నుంచి తయారయే చక్కెర, బెల్లం అనే వాటిని గురించిన సామెతలున్నాయి.

**తేనె (6) :** తేనె తుట్టెను రేపినవాడు తేనె తియ్యక పోడని, తేనె తీసినవాడు చేతికంటిన తేనెను నాకుకోక మానడని, తేనెపోసి పెంచినా వేప చేదుగానే ఉంటుం దని 'తేనె తుట్టెను రేపి, తియ్యని తేనె వదిలి పోదురా'. 'తేనె తీసినవాడు చేయి నాకకపోవునా', 'తేనె బోసి పెంచినా వేపకు చేదు పోదు' అనే సామెతలు విశదీకరిస్తున్నాయి.

**చెరకు - చక్కెర - బెల్లం (30) :** చెరకు తిన్న నోటితో చేదు తినడం అసహ్యమని, ప్రేయసిమాటలు చెరకు రసంకన్నా తీపని 'చెఱకు దిన్ననోరు చేదార గించునా', 'చెలిమాట చెరకు ఊట' అనే సామెతలు తెలుపుతాయి.

రుచికరమైన తిండి తిని, రుచిలేని తిండి తినడం చాలా కష్టమని, కొంత మందికి పరుల సొమ్ము చక్కెరలాగా ఉంటుందని, చక్కెరలో తేనె కలిస్తే రుచి పెరుగుతుందని 'చక్కెరదిన్న నోటితో తవుడు బొక్కినట్లు', 'పరులసొమ్ము పంచ

దార తన సొమ్ము విషదార' (సా), 'చక్కెర పందిట్లో వాన కురిసినట్లు' అనే సామెతలు వ్యక్తం చేస్తున్నాయి.

తీపికి చిహ్నంగా బెల్లాన్ని చెపుతారు. అన్నిటికన్నా తీపు బెల్లం అని, అంతకన్నా ప్రాణం తీపు అని, ఇతరుల సొమ్ము పొడి బెల్లంలా తినేవాళ్లున్నారని, తల్లిని నిష్ఠూరంగా, పెండ్లాన్ని ప్రేమగా చూస్తారని, బెల్లం వండిన పొయ్యి వద్ద ఈగలు ముసుర్తుంటాయని, బెల్లం కొట్టిన గుండ్రాయికి దాని రుచి తెలియదని చెప్పే సామెతలు: 'ప్రాణము తీపా, బెల్లము తీపా'(కార్.1578), 'ఇంటిసొమ్ము విప్పపిండి పొరుగింటి సొమ్ము పొడి బెల్లం', 'తల్లి విషం పెండ్లాం బెల్లం', 'బెల్లము వండిన పొయ్యి ఇంగువ కట్టిన గుడ్డ', బెల్లము కొట్టిన గుండ్రాయి వలె' అనేవి.

3.3.9 పండ్లు - కాయలు (22) : పనస, ద్రాక్ష, అంబాలప్పండు, రేనిపండ్లు అనే పండ్లను గురించి; దోస, టెంకాయ, తాటి, వెలగ, చింతకాయల్ని గురించి సామెతలున్నాయి. 'పనసపండు మీద ఈగలు వ్రాలినట్లు', 'అందని ద్రాక్ష పండ్లు పుల్లన' అని ఏదైనా ఒక వస్తువు దొరక్కపోతే నిరాశతో అంటారని, 'కొంత మందికి నోరు అంబాలపు (అప్పాలపు) పండు చెయ్యి బలుసు ముల్లు' అని సామెతలు చెపుతాయి. 'పీతిలో రేనిపండు అంటే అద్దుకొని తింటానన్నాడట'(నర) ఒక రోతగాడు. దోసకాయలు కడుపులో గడిబిడి చేస్తాయని' 'దోసకాయలు తిన్న కడుపు దొంగలు పడ్డ ఇల్లు ఒకటే' అనే సామెత చెప్పగా, ఏడ్చే దాని బిడ్డకు అరటిపండ్లు చూపినట్లు' అనేది ఏడ్చేఆమెతోపాటు ఆమె పిల్లనూ ఏడ్పించిన సందర్భానికి ఉదాహరణ.

అసాధ్యమైన కార్యాన్ని చెప్పినపుడు 'నమలకూడని నారికేళము'(కార్.1233) అనే సామెత ప్రయోగిస్తాము. 'ముంజలుదిన్న వాని కంటే మోరులు తిన్నవానికి తంటా' అని ఒక సామెత చెపుతుంది. మామిడికాయల పులుపు కత్తికి ఎలా తెలుస్తుందని 'మామిడికాయలు తరిగితే వాదర పులుస్తుందా?' అని సామెత ప్రశ్న. కొంత మంది 'తినేవి తిప్పకాయలు వెళ్ల గ్రక్కేవి వెలగకాయలు' అని ఒక సామెతంటుంది. చింతకాయలు తింటే పండ్లు పులుపెక్కి ఘనపదార్థాలు తినలేమని 'చింతకాయలు తిన్ననోరి కొట్టులు తిననగునా?' అనే సామెత చెప్పగా. కూరల్లో పులుసుకోసం చింతకాయ తప్పనిసరి అని 'చింత లేదు చింత లేక పోతే పులుసు లేదు' అనే సామెత తెలుపుతున్నది.

**3.3.10** ఈ విధంగా తెలుగు సామెతలు శాకాహారుల, మాంసాహారుల ఆహార పదార్థాల్ని గురించి సోదాహరణంగా చెప్తున్నాయి. రకరకాల ఆహారపుటలవాట్లను, శాకాహారులకు పప్పు ప్రాధాన్యాన్ని, మాంసాహారులకు కోడిమాంసం ప్రాధాన్యాన్ని సామెతలు చెప్పినతీరు హృద్యంగమంగా ఉంది. అంతే కాదు; ఏయే ఆహార పదార్థాలు రుచికరంగా ప్రజలు భావిస్తున్నారో, ఆ రుచి వచ్చేందుకు ఏయే పదార్థాలు ఆ వంటల్లో ఉండాలో కూడా సామెతల్లో విపులంగా వివరించబడి వుంది. అంటే ఒక వైపు వ్యంగ్యంగా వేరే విషయాల్ని తెలుపుతూ, ఆహారానికి సంబంధించిన సాధారణ విషయాల్నికూడా వింగడించుకొనే వీలుండేటట్లు తెలుగు సామెతలు సృష్టించబడ్డాయి.



# 3.4 తెలుగు సామెతలు - వ్యాపారం

3.4 వ్యాపారసంబంధి తెలుగు సామెతలు నా పరిశీలనలో 110 లభించాయి. అవి ఆధారంగా వ్యాపార విషయాలు, వివిధవ్యాపారాలు, బేరం-అమ్మకం-ధర, లాభ నష్టాలు, అంగడి-సంత, కొసరు, తేరసొమ్ము, సుంకం అనే శీర్షికల కింద విభ జించుకొని వివిధ విషయాల్ని వింగడించే ప్రయత్నం ఈ ఉపప్రకరణలో చేశాను.

3.4.1 వ్యాపార విషయాలు (4): ఒక వస్తువు వ్యాపారం చేయాలనుకుంటే అది అమ్ముడుపోతుందో లేదో ముందే తెలుసుకొని కొనాలి అని 'విలుచుటకుముందే విక్రయించే సుళువు చూడాలి' అనే సామెత హెచ్చరిస్తున్నది. ఉమ్మడి వ్యాపారం పనికిరాదు, ఒకర్ని మోసంచేసేందుకు మరొకరు ప్రయత్నిస్తారు. బాధ్యత మోసు కోరు. ఆ విషయాన్ని చెప్పే సామెత 'ఉమ్మడిబేరం ఉమ్మడి సేద్యం ఇద్దరికీ చేటు' అనేది. సంవత్సరాని కొకసారి లెక్కలు చూసుకొని వ్యాపారంలో లాభనష్టాల్ని బేరీజు వేసుకుంటారు. వ్యాపారం సరిగా జరక్కపోతే లెక్కల్లో నష్టాలు కనబడ తాయి-అని 'లెక్కలు చూచిననాడు బొక్క పగులును' అనే సామెత తెలుపుతుంది.

3.4.2. వివిధ వ్యాపారాలు (21): ఉప్పు, కప్పురం, పప్పు, టెంకాయలు, తమలపాకులు, నూనె, నెయ్యి, పువ్వులు, కట్టెలు, ఎద్దులు, గాజులు, ప్రత్తి, గంధం, కూర, కట్టెలు, కుండలు, బానిసలు, ముత్యాలు-ఇవీ వ్యాపార వస్తువులు. ఈ వ్యాపారాల్లో ఏది సంఘంలో గౌరవప్రదమో, ఏది కాదో సామెతలు చెపుతాయి.

మిగతా వ్యాపారాలు చేయలేకపోతే తక్కువ పెట్టుబడితో బ్రతుకు తెరువు కోసం చేయగలిగేది ఉప్పు వ్యాపారం. వర్షం వస్తే ఉప్పు, పప్పు వ్యాపారులకు నష్టం. టెంకాయలు, తమలపాకుల వ్యాపారులకు పోయేదేమీ లేదు. ఆ విషయాల్ని చెప్పే సామెతలు 'ఊపిరి ఉంటే ఉప్పుకల్లు అమ్ముకొని బ్రతుకవచ్చు' 'ఉప్పువాడు ఏడిశాడు. పప్పువాడు ఏడిశాడు, బొండాపు కాయలవాడు పొర్లి పొర్లి ఏడిశాడు', 'ఉప్పోడు ఏడ్చినాడు, పప్పోడు ఏడ్చినాడు, తమలపాకులవాడు తమాం ఏడ్చినాడంట' (నర) అనేవి. నూనె కుండల్లో నింపి, బండ్లలో తీసుకెళ్లేవారు. బొండాపు కాయలు కూడా బండ్లలోనే తీసుకెళ్లేవారు, బండ్లు బోల్తాపడి నూనె కుండలు పగిలి నూనె వ్యాపారి ఏడ్వడం సహజం. బొండాపు కాయలవాడు ఏడ్వాల్సిన పన్లేదు - ఆర్భా టానికి తప్ప - అని 'నూనె పోగొట్టు కొన్నవాడు యేడ్చినాడు, బొండాపకాయలు వాడూ పొర్లి పొర్లి యేడ్చినాడు' (కార్. 1323) అనే సామెత వెక్కిరిస్తుంది.

పువ్వులు, గంధం అమ్మడం సంఘంలో గౌరవ ప్రదంగాను, కట్టెలమ్మడం అవ మానకరంగానూ ఉండేది. ఈవిషయాల్ని 'పూవులమ్మిన చోటనే కట్టెలనమ్మినట్లు' 'గంధం అమ్మినచోటే కట్టెలమ్ముట' అనే సామెతలు అభివ్యక్తం చేస్తాయి. ఎక్కె-ద్దుల వ్యాపారం పాత గుడ్డల వ్యాపారం లాభసాటి కావని 'వరహాను ముప్పావు చేసుకవచ్చినా మాయింటాయన ఎద్దుల బేరగాడైనాడంతే చాలు అన్నదట', 'ఎక్కె-ద్దుల వ్యాపారం పాత గుడ్డల వ్యాపారం ఒకటి' (నర) అనే సామెతలు సాక్ష్య మిస్తున్నాయి. గాజుల వ్యాపారం తిననూ, కుడవనూ సరిపోయేదేనని, గాజుల బలిజలకు ఇది శాపమని చెప్పబడది. 'గాజుల బేరం భోజనానికి సరి' అనే సామెత ఆ విషయాన్ని తెలిపేది. గోచి ధరించే సింగడికి, పంజె(బిచ్చగాడు)కు ప్రత్తిధర అవ సరం మేమున్నదని'సింగడికేలరా ప త్తిబేరము','పంజెకేలరా ప్రత్తిధర'(కార్.1360) అనే సామెతలు ప్రశ్నిస్తాయి.

ఇంట్లో కుండలమ్ముకొని తినడం దారిద్ర్యచిహ్నంగా 'కూడిన కొద్ది కుండ లమ్ముకొని తిన్నట్లు అనే సామెత తెలుపుతుంది. 'నెయ్యి అని అరచి నూనె అమ్మినట్లు' అనే సామెత అది వ్యాపార లక్షణం కాదని హెచ్చరిస్తున్నది. బానిసల వ్యాపారాన్ని 'మున్నూరు రూపాయలిచ్చియైనా ముసలిదాన్ని కొనాలి' అనే సామెత, ఉప్పూ కప్పురం ఒకేలాగున్నా, ఉప్పు విలువకన్నా కప్పురం విలువ చాల ఎక్కు-వని 'ఉప్పు కప్పురంబు నొక్క- పోలిక నుండు' (సా.సా. 68) 'కప్పురమిచ్చి ఉప్పు కొన్నటు' అనే సామెతలు తెలుపుతున్నాయి. ప్రాచీనమైన వస్తువుల మార్పిడి పద్ధతిని నిరూపించే సామెతలు: 'పిత్తు పిత్తమంటే బియ్యానికి సరిసరి అన్నదట', 'కప్పురమిచ్చి ఉప్పు కొన్నట్లు', రేగుబండ్లకు ముత్యాలమ్ము కొనుట' అనేవి. చివరి రెండు సామెతలు తక్కు-వ విలువైనవాటికి ఎక్కు-వ విలువైనవి మార్పిడి చేయడం అవివేకమని చెపుతాయి. ధరల్లో అనుకోని మార్పులు వచ్చి నష్టం వచ్చే వ్యాపారం ఆముదాల వ్యాపారం అని తెల్పే సామెత 'ఆముదాల వ్యాపారం, కామెర్ల రోగం నమ్మరానిది' అనేది.

3.4 3 బేరం-ధర (37) : ఎద్దుమీద రెండువైపుల సరుకులు వేసేందుకు గోనెలా కుట్టిన సంచి అసిమి. అసిమిలోని మంచి సరుకుచూపించి తగ్గుసరుకు అమ్మి వ్యాపా రులు మోసంచేసేవారని 'అమ్మేదొకటి అసిమిలోదొకటి' అనే సామెత చెపుతుంది. వచ్చినబేరాన్ని పోగొట్టకూడదని చెప్పే సామెత 'కాళ్ల ముందుకొచ్చిన బేరము కాశీకి పోయినరాదు' (సా) అనేది. ఏదైనా సరకు ప్రియంగా ఉంటే అంగడిదాకా

రాదని 'అగ్గువ అయితే అంగడికి వస్తుంది' అనే సామెత, అగ్గువ అయితే ఇంకా అగ్గువవుతుందని కొనరని, ప్రియమయితే ఇంకా ప్రియమవుతుందేమోనని అమ్మరని 'అగ్గువకొన నీదు ప్రియం అమ్మనీదు' అనే సామెత, అగ్గువ సరుకులో నాణ్య ముండదని 'అగ్గువబేరం నగ్గు నగ్గు' అనే సామెత తెలుపుతున్నాయి. బేరంలో బెట్టు లేకుంటే నష్టం వస్తుందని 'అడిగినట్లిస్తే కడిగినట్టు పోతుంది' అనే సామెత, సరుకు మిక్కిలి అవసరమున్నవాడు ధర ఎక్కువైనా పెడతాడు అని 'ఆకలి అయినవాడు ధర చెడగొడతాడు' అనే సామెత, ధనిక వ్యాపారి బేరం తగ్గడని 'కడుపు నిండిన బేరము' అనే సామెత చెప్తున్నాయి వస్తువును ఉత్పత్తి చేసేవానికి న్యాయమైన ధరరాదని, వారుకొనే వస్తువులకు మాత్రం ఎక్కువ వెలపెట్టాలని 'అమ్మబోతే అడవి, కొనబోతే కొరవి' అనే సామెత, కొన్న అంగడిలో మారు బేరం నష్టకారి అని 'కొన్న అంగడిలోనే మారు బేరమా' అనే సామెత అంటున్నాయి.

బేరం చేసేప్పుడు పెట్టుబడిపైన లాభం వచ్చేట్లు చూసుకోవాలి అనే విషయాన్ని 'తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డబేరం' అనే సామెత తెలుపుతుంది. 'తట్టలో బేరం బుట్టలోకి వచ్చింది' అనే సామెతను వ్యాపారంలో నష్టం వచ్చిందనడానికి ఉపయోగిస్తారు. ఇంకో ఊరిలో ఒక వస్తువు అగ్గువగా ఉన్నా దాన్ని కొని తేవాలంటే తమ ఊరిలో కన్నా ధర ఎక్కువవుతుందని 'కానికి టెంకాయ ఇస్తారని కాశీకి వెళ్లినట్లు', 'ఏ ఊరికి వెళ్లినా తెడ్డు ఏగానే' అనే సామెతలు తెలుపుతాయి. కానీకి బెల్లం, ఉప్పు, ఏగానికి తెడ్డు కొనవచ్చని 'ఏ కానీకి బెల్లం? ఏ కానీకి ఉప్పు? అని అడిగినాడు ఒక శిష్యుడు', 'ఏ ఊరికి వెళ్లినా తెడ్డు ఏగానే' అనే సామెతలు చెప్తున్నాయి. పెట్టే డబ్బులు పెట్టి పనికిరాని సరుకుకొనడం అవివేకం అని 'ఇచ్చింది ఇచ్చి పుచ్చినదాన్ని కొన్నట్లు' అనే సామెత పరిహసిస్తుంది.

ధరలు ఎవరి చెప్పు చేతల్లోనూ లేవని, ధర తక్కువై ఎక్కుతుందని, చౌకయితే దుబారా చేస్తారని 'ధరకు దొర యెవడు?', 'పెరుగుట విరుగుట కొరకే ధర తగ్గుట ఎచ్చుకొరకే', 'చౌక దూబర తిండికి కారణం' అనే సామెతలు తెలుపుతాయి.

**3.4.4 లాభనష్టాలు (10):** వ్యాపారంలో లాభం కాదు, సరిగదా: పెట్టుబడి గూడా పోయే ప్రమాదం ఉన్న విషయాన్ని చెప్పే సామెత 'మొదటికే మోసమైతే లాభానికి గుద్దులాటట' అనేది. వ్యాపారంలో వచ్చినలాభం మరో విధంగా పోయి

నపుడు 'గంపలాభం చిల్లి తీసినట్లు', 'ఎద్దు లాభం గుద్దలో పోయిందట' (నర) అనే సామెతలు తెలుపుతాయి. చిల్లర మార్చేటపుడు పెట్టే నష్టాన్ని వట్టం అంటారు. ఒకోసారి లాభంకన్నా ముజరా ఎక్కువ పెట్టాల్సి వచ్చినపుడు 'పాతిక వట్టం పరక లాభం' అనే సామెత ప్రయోగిస్తారు. వ్యాపారులు తమ లాభాన్ని చస్తే చెప్పరు అనే విషయాన్ని వెల్లడించే సామెత 'ఎంతయ్యా ఇవ్వాళ బేరంలో లాభమంటే ఎటిగినవాడు వెట్టి వాడు రాలేదన్నాడట' అనేది. నష్టంవచ్చే సందర్భాల్ని చెప్పే సామెతల్లో మూడు: 'అసలు పిసలయింది' (నర), 'వ్యాపారం జోరుగా సాగుతుంది రెండో బట్టను అమ్మి డబ్బు పంపమన్నట్లు', 'లాభం గూబలలోకి వచ్చింది' అనేవి. చివరి సామెతలో గూబల్లోకి రావడం అనే దానికి 'కార్' వివరణ ఇది. నెయ్యి వ్యాపారికి చెవిలో పోటు రాగా కాచి చెవిలో వేసుకున్న నేయే లాభమట. అంటే నష్టమన్న మాట. బ్రౌన్ నోట్సు ఇలా చెప్తుంది. లాభం అనే మాట చెవి గూబలకు వినబడ్డమేగాని నిజంగా లాభం రాలేదు. అని. 'గోనెలకు అంకీలు లాభం' అనే సామెతలో గోనెకు ఒక అంకీ లాభంరావాలని అభిప్రాయమేమో. గోనె అంటే ఎద్దు మోసే బరువుగాను. అంకీ అంటే ఎద్దు మోసే బరువులో ఒక వైపుదిగాను అర్థం చెప్పబడ్డది. అంటే గోనె సరుకు అమ్మితే అందులో సగం (అంకీ) లాభం రావాలన్నమాట. 'లాభం లేనిదే శెట్టి వరద బోడు' అనే సామెత కోమటి ఎట్టి పరిస్థితిలోనైనా లాభం సంపాదించుకోగలడు అని చెప్తుతుంది.

3.4.5 అంగడి-సంత (18) : కాకతీయులకాలంనాటికే సంతలున్నట్లు సాహిత్యాధారాలున్నాయి. సంతలు సాధారణంగా వారంలో ఒక నిర్ణీతదినంనాడు నిర్ణయించిన స్థలంలో జరుగుతుంటాయి.

'అంగడి అమ్మేది నేర్చుకున్నట్లు' (రా. ప. 667) అనే సామెతలో అంగడి అమ్మడం వర్తకులు తమ పిల్లలకు నేర్పిస్తూ ఉండే విషయాన్ని తెలుపుతుంది. కొనేవారు ఎంత జాగ్రత్తగా ఉన్నా అమ్మేవారు మోసంచేస్తారు అని 'కొనేవాడికి కోటి కళ్లయితే అమ్మేవాడికి అవిటి దొకటే చాలు' అనే సామెత, అంగడి అమ్మేవాడు వికారంగా ఉంటే కొనే వాళ్లు రాకపోవచ్చునని 'వికారమువాడు దుకానము పెట్టితే వచ్చిన గిరాకి అటె మరలి పోయెనట' అనేది చెప్తున్నాయి. అంగడిలో చిల్లర తప్పక దొరుకుతుంది అనే విషయాన్ని తెల్పే సామెత 'అంగడిలో చుంగుడు దొరకదా? అనేది. అంగట్లో సరుకు ఎక్కువైతే ఇంటి ముందుకే వస్తుందని 'అంగట్లో ఎక్కువైతే ముంగిట్లోకి వస్తుంది' అనే సామెత చెప్పగా, ఏ పూట

కాపూట కొని తినే వార్ని 'అంగడి బియ్యం తంగెడికట్టెలు' అనే సామెత సూచిస్తున్నది.

సంతకు వచ్చే సరుకులో నాణ్యముండదని 'రోసి వేసినది రాశికి వచ్చినది' 'అది మంచి సరుకైతే అంగడివీధి కెందుకెక్కుతుంది' అనే సామెతలంటున్నాయి. ఇంటి వద్దకే వచ్చే గాజులకోసం సంతకు చీటీరాయడం బడాయి తప్ప మరేమీ కాదని 'లచ్చి గాజులకు సంతకు చీటి వ్రాసి పంపినట్లు' (రా. ప. 365) అనే సామెత చెప్తుంది. సంతలో జాగ్రత్తగా ఉండాలి అని, డబ్బులు పోతాయనే చింత లేనివారికి మాత్రం ఇబ్బందిలేదని 'చింతలేనమ్మ సంతలో నిద్రపోయిందట' అనే సామెతతెలుపుతుంది. సంతలో తొడతొక్కిడిగా. గందరగోళంగా ఉంటుందని, అట్లాంటిచోట్ల చింతలేని వారే నిద్రపోగలరని కూడా ఈసామెత తెలుపుతుందొచ్చు. 'బూచీలకు బెదురునా బుగుడూరు సంత' అనే సామెతను వివరిస్తూ బూచీలు అంటే పోర్చుగీసువారని, 'బూచీలకు ఎదురుగా బుగుడూరు సంత' అనే పాఠాంతరాన్ని విశ్వనాథ సత్యనారాయణగారు సూచించారు.

3.4.6 కొసరు (8) : ఒక వస్తువు కొనినప్పుడు పెచ్చుగా ఇచ్చేది కొసరు. కొన్నదగ్గర కొసరవచ్చుగాని, ఇది కావాలని అడిగి ఇప్పించుకొన్నచోట కొసర గూడదు అని 'కొన్నదగ్గర కొసరుగాని కోరినదగ్గఱ కొసరా?' అనే సామెత చెపు తుంది. కొంటే వచ్చింది చాలునని, అంతో యింతో ఇచ్చే కొసరుకు ఆశపడగూడ దని 'కొంటే లేనిది కొసరితే వస్తుందా?' అనే సామెత, అసలుకు గతి లేనపుడు కొసరడం అవివేకం అని 'అసలుకు గతిలేకుంటే కొసరడిగినట్లు' అనే సామెత, కొసరి వేయించుకున్న కూర రుచి అని 'కొసరినకూరలో గాని పస ఉండదు' అనే సామెత తెలుపుతాయి. తక్కువ విలువగల వస్తువు కొని ఎక్కువ విలువగల వస్తువును కొసరడం అవివేకం అనే విషయాన్ని వ్యంగ్యంగా చెప్పే సామెతలు: 'కొన్నది వంకాయ కొసరింది గుమ్మడికాయ', 'వెండిబేర మాడుతూ బంగారు కొసరినట్లు' అనేవి. ఈ సామెతలు విలువైన వస్తువుకు కొసరుగా విలువ తక్కువ వస్తువు వర్తకులు ఇచ్చేవారు అనే విషయాన్ని చెపుతుందొచ్చు.

3.4.7 తేర సొమ్ము (6) : తేరగా వచ్చేదాన్ని సంతోషంగా, అజాగ్రత్తగా అనుభవించడం లోక సహజం. తేరసొమ్ము చాలాకాలం ఉండదు. ఈ విషయాల్ని 'తేరగాడి కేమి తెలుసు లంజ ముడ్డి నొప్పి', 'తేరగుఱ్ఱం తంగేడు బరికె', 'తేర

సొమ్ము ఊరికే పోతుంది', 'తేరసొమ్ము బీరపీచు' అనే సామెతలు తెలుపుతాయి. చివరి సామెత తేరసొమ్ము బీరపీచులా వ్యర్థం అని చెప్తుంది. (కార్).

3.4.8 సుంకం (5) : కొన్ని సరుకులు అమ్ముకునేందుకు ప్రభుత్వానికి కట్టాల్సిన పన్ను సుంకం. చాలామంది సుంకం ఎగరేసే ప్రయత్నం చేస్తారని 'చూస్తే సుంకం చూడకుంటే బింకం' అనే సామెత, ప్రతి దానికీ పన్ను వేసిన సందర్భాల్లో 'చూచిందెల్లా సుంకము పాపిందల్లా పంకము' అనే సామెత ప్రయోగిస్తారు. ప్రభుత్వం నిరంకుశత్వంగా పన్ను వేయడాన్ని 'నెత్తిన మూటకు సుంకమడిగినట్లు' 'దారికి సుంకం చెల్లించమన్నట్లు' అనే సామెతలు నిరసిస్తున్నాయి.

3.4.9 వ్యాపార గుప్తభాష (1) : వ్యాపారులకు గుప్త భాష ఉంది. పాతిక (1/4) నుంచి వేయిదాకా మారు సంఖ్యలున్నాయి. ఉదా : 'గాలంతో బేరం మొదలు పెడితే మూలంతో ముగుస్తుంది' (థర్స్టన్). ఇద్దరు వ్యాపారులు సంప్రదించుకొంటూ పదివరహాలు బేరం చెప్పి ఐదు వరహాలకు అమ్మెయ్యొచ్చు అనుకుంటున్న విషయాన్ని తెలిపే గుప్త వ్యాపార భాషలో ఉండే సామెత పైది.

వస్తు పరిమాణాన్ని తెలిపే కొలతలు, ధనపరిమాణాన్ని నిర్ణయించే నాణేల సంగతి తర్వాతి ఉపప్రకరణంలో పరిశీలిద్దాం.



# 3.5 తెలుగు సామెతలు - నాణేలు, కొలతలు

3.5 వస్తుపరిమాణం నిర్ణయించేవి కొలతలు. ధన పరిమాణం నిర్ణయించేవి నాణేలు. నాణేలు, కొలతలు తరతరానికి మారుతుండవచ్చు. నాణేల్లో మొదట వరహాలు; తర్వాత రూపాయలు - అణాలు; ఇపుడు రూపాయలు-పైసలు; కొలతల్లో పూర్వం శేరు, వీశె, గజాలు కాగా; ఇప్పుడు లీటరు, కిలో గ్రాము, మీటర్లు. కొలతల్లో నిర్దిష్టమైనవి, అనిర్దిష్టమైనవి అని రెండు రకాలు. కొలతలో ఒక నిర్ణీత ప్రమాణాన్ని చెప్పేవి నిర్దిష్టమైనవి. అనిర్దిష్టమైనవి దాదాపు పరిమాణాన్ని చెప్పేవి. నిర్దిష్టమైన కొలతకు శేరు, తవ్వ-పుట్టి ఇత్యాదులు ఉదాహరణలు. పుటికెడు, గాదెడు, గోరంత, ఆకాశమంతలాంటివి అనిర్దిష్ట పరిమాణాలు.

నాణేలు-కొలతలకు సంబంధించి నా పరిశీలనలోని తెలుగు సామెతలు 352. అవి ఆధారంగా ధనం-నాణేలు, ధాన్యం కొలత, ద్రవపదార్థాల కొలత, ఆహార పదార్థాల పరిమాణం, వస్తు పరిమాణం, బట్టలు-నూలు కొలత, ఎత్తు, లోతు పొడవు, దూరం, లావు, తూకం, కాలం, సంఖ్యలు, దారిద్ర్యం అనే శీర్షికల కింద విషయాల్ని వింగడించి ఈ ఉప ప్రకరణంలో చూపాను.

3.5.1 ధనం-నాణేలు : ధనం. నాణేల ప్రసక్తి ఉన్న సామెతలు 111. ధన పరిమాణాన్ని చెప్పేందుకు ప్రతి తరంలోనూ కొన్ని నాణేలుంటాయి. కొన్ని ఎక్కువ విలువను, కొన్ని తక్కువ విలువను సూచించేవి. బంగారు, వెండి, రాగి వరుసగా విలువనుబట్టి ముద్రించే నాణేల ముడిపదార్థాలు. ధన సామాన్యవాచిగా ఏదో ఒక నాణెం-ముఖ్యంగా చిన్న నాణెమే చెప్పబడింది. ఉదా॥ దుడ్లు, డబ్బులు, కాసులు, పైకం. పైసలు ధనాన్ని సూచించినవి. కాసులు, పైసలు బహువచనంలోను, దుడ్డు, డబ్బు ఏక, బహువచనాల్లోను, పైకం అనేది ఏకవచనంలోను, ధనం అనే అర్థంలో వాడబడ్డాయి. చలామణిలో లేకపోయినా పాత నాణేల పేర్లు ప్రజల వాడుకలో ఉంటాయనేందుకు సాక్షులు డబ్బులు. దుడ్లు, పైకం అనేవి.

సొమ్ము, ధనం అనేవి ఏనాణేనికీ పేర్లు గాకపోయినా 'ధనం' అనే అర్థంలో సార్వకాలికంగా వాడబడతాయి. ధనం, సొమ్ము సమానార్థకాలు. వీటి ప్రసక్తి 12 సామెతల్లోవుంది. ఇన్ని ఎక్కువ రూపాయలు అనకుండా 'బండెడు' అనడం తెలుగు నుడికారం సొంపు. 'రంగము (రంగూన్) సొమ్ము అంకు సొమ్ము నిలువదు' అనే సామెత వదుపువృత్తిలో వచ్చే సొమ్ము నిలవదని చెపుతుంది. సొమ్ము

ఎలా పోయేదీ కనబడదు అని తెలిపే సామెత 'సొమ్ము పోయేటప్పుడు, తట్టు తగిలేటప్పుడు మతి ఉండదు' అనేది. 'అనిత్యాని శరీరాణి అందని సొమ్ము మనకే రాని' అనే తేరగాళ్ల సమాజంలో కోకొల్లలు

నాణేలను గురించి చెప్పిన సామెతల్లో చాలా మాత్రం (16) వేశ్యకిచ్చే ధనాన్ని గురించిగాని, పనిచేసిన, మాటలు చెప్పేవారికి లోకం చూపే విలువల్ని గురించి(6)గాని చెప్పబడినవే.

నకిలీ నాణేలు తయారుచేయడాన్ని యెట్టుకొట్టడం అంటారు. నకిలీ నాణేల బెడద నాటినుంచి నేటిదాక నిరంతరంగా వస్తూనే ఉంది. నిజమైన నాణేలకుండే ముద్రాచిహ్నాల కన్నా నకిలీవాటికే ఎక్కువ ముద్రా చిహ్నాలున్నట్లుగా సామెతలు తెలుపుతాయి.

సామెతల్లో కనిపించిన 26 నాణేల విషయాల్ని అకారాద్యనుక్రమణికలో వివరించడం జరుగుతుంది. వివిధ నాణేల పేర్లు: అడ్డగ, అణా, అరకాసు. అర్ధ రూపాయ, ఏగాని, కాని, కాసు, గవ్వ. చవలం, టంకం, డబ్బు, డిమ్మిడి, దుగ్గాని, దుడ్డు. పాతిక, పావలా, పైకం, పైస, మాడ, ముచ్చవలం, రువ్వ. రూక, రూపాయ, వరహా, వీసం, సుస్కాని.

**అడ్డగ (2) :** రూకలో అర్ధం. రెండణాలు. పాతిక అంటే అణా. 'అరువులు చెప్పినవానికి అడ్డగ పనిజేసినవానికి పాతిక' (నర), 'అదె వస్తే అడ్డగ వాడై పోతే రూక' అనే సామెతలు అడ్డగను గురించి చెప్పినవి.

**అణా (2) :** రూపాయలో పదహారోభాగం. అర్ధ రూపాయికి ఎనిమిదణాలు. ఒక అమాయకుడు 'అయ్యేది లేదు పొయ్యేదిలేదు వీరభద్రప్పా'. నా ఎనిమిది అణాలు నాకిచ్చి నీ అర్ధ రూపాయ నీవు తీసుకో' అన్నాడట. 'బాతాకానీ వానికి బారనా నాకూ బారనానేనా ?' అని సామెత. 'బారనా' అంటే పన్నెండణాలు.

**అరకాసు :** చూ. కాసు.

**అర్ధ రూపాయ :** చూడు. రూపాయ.

**ఏగాని-దుగ్గాని-కాని-సుస్కాని (9) :** అణాలో ఆరవ భాగం ఏగాని లేక దుగ్గాని, రెండు పైసల విలువకలది. దుగ్గానికన్న సుస్కాని పెద్దదని తెలుస్తున్నది. రూపాయలో 64 వ భాగం. అణాలో నాల్గో భాగం. 'ఏమీ దొరకనమ్మకు ఏగాని దొరికితే ఎందులో బెడుదునే ఎంకటమ్మా అన్నదట', 'దుగ్గాణి ఉంటే దున్న

పోతంత సత్తువ' (శ్రీపాద), 'సాకులు చెప్పినవానికి సొసుకొాని, ఇల్లు కప్పిన వానికి దుగ్గాని' (హైసా. VIII-19), ఇదీ లోకంతీరు. 'కాని మందం కోటిదుఃఖం' అనే సామెత చిన్నతప్పయినా పెద్దదుఃఖాన్ని తెస్తుందని చెప్తుంది. కానికి మరోపేరు బొట్టు. 'బిట్టా బాతా డౌలేగాని నాబట్ట దగ్గర బొట్టు కూడా లేదన్నట్టు' అని సామెత.

కాని : చూడు. ఏగాని.

కాసు : (24) దుగ్గానిలో నాల్గో భాగం. రాగి నాణెం. ధన వాచిగా 'కాసు' వాడబడింది. ఉదా: 'కాసులేనివాడు కడు బ్రహ్మచారియౌ', 'కడ జాతిగాని కాసులుగల వాడే రాజు' అనేవి. పూర్వం కోటీశ్వరులు ఒక్కొక్క కోటికి ఒకొక జెండా ఇంటిపైన ఎత్తేవారట. ఆ విషయాన్ని, ఆడంబరాలు చూపే పేదవాన్ని హేళనచేస్తూ చెప్పిన సామెత 'కాసుకు గతిలేదు కోటికి కొడి ఎత్తినాడు' అనేది. నకిలీ నాణేల ప్రసక్తి 'చెల్లనికాసుకు గరుకులు మెండు' అనే సామెతలో వుంది. విలువ తక్కువది కోరుకున్నపుడు విలువైనది దొరకడం అదృష్టం అని 'కాసును వెతకంగ రత్నమును గన్న రీతి' అనే సామెత తెలుపుతుంది. తక్కువ విలువైనదానిపైన ఎక్కువ ఖర్చు పెట్టడం అవివేకం అని 'మూడుకాసులదానికి ముప్పావలా బాడుగా' అనే సామెత చెపుతుంది. అణాలో 12 వ భాగం రువ్వ. 'కాసుకుండకు రువ్వ లక్క' వృధా అని ఒక సామెత. వీసం రూపాయలో 16 వ భాగం. 'కాసుగలమ్మ కట్టా విప్పా, వీసం గలమ్మ విడవా ముడవా' అనే సామెతలో వీసం ప్రసక్తి ఉంది. తక్కువ ఆదాయం పనికిపోయినపుడు ఎక్కువ నష్టం వస్తే 'కాసుకు మూతి నాకనుబోతే మూడు నూర్ల ముంగర పోయిందట', 'అరకాసు పనికి ముప్పాతిక బాడుగ' అనే సామెతలంటారు. మూడు పావలాలు ముప్పాతిక. కాసులు వాడుకలో లేకపోయినా ధనవాచిగా ఇప్పటికీ వాడుకలో వున్నట్లు 'చేతిలో కాసు నోటిలో దోసె' (సా.సా. 208) అనే సామెత సాక్ష్యమిస్తుంది. ఎక్కువ తక్కువ విలువల ప్రస్తావన 'అవ్వ అరకాసు తలగొరగను మూడు కాసులు' అనే సామెతలో ఉంది.

గవ్వ (13) : తక్కువ విలువగల నాణెంగా గవ్వను వాడేవారు. 'గడియ పుర సత్తు లేదు గవ్వ ఆదాయంలేదు', 'చతురతకు జాణగాదే గాని చేతిలో చిల్లి గవ్వ లేదు' అనే సామెతల 'గవ్వ' ప్రసక్తి ఉన్నవి.

చవలం (1) : నాలుగు డబ్బులు. వరహాలో ఎనిమిదో భాగం. టంకంలో నాల్గో భాగం. గుఱ్ఱం కన్నా జీను ఖరీదు ఎక్కువా ? అనే వ్యంగ్య విషయాన్ని

'గుఱ్ఱం చవలం జీను ముచ్చవలం' అనే సామెత తెలుపుతుంది. ముచ్చవలం అంటే మూడు చవలాలు.

టంకం (1) : పదహారు డబ్బుల బంగారు నాణెం. 'తార్చినదానికి టంకం, వెళ్లినదానికి ఏగాని' అనే సామెత న్యాయంగా ఎక్కువడబ్బు రావలసిన వేశ్యకు తక్కువడబ్బు ముట్టున్నదనే సత్యాన్ని తెలుపుతున్నది.

డబ్బు (9) : అణాలో మూడో భాగం. ధనవాచిగా 'డబ్బు' ను వాడతారు. ఉదా॥ 'డబ్బు సభ కట్టును, ముద్ద నోటిని కటును' (హైసా. IV-9), 'డబ్బు పోయె శని పట్టె' (సా). లోభి చిన్న మొత్తాన్ని గూడా ఇవ్వడని 'లోభిని చంప వలెనంటే డబ్బు అడగితే చాలును' (కార్. 1913) అనే సామెత చెపుతుంది.

దమ్మిడి - పైస (10) : అణాలో 12 వ భాగం దమ్మిడి. రాగి నాణెం. దీనికే పైసా అని ఇంకొక పేరు 'దమ్మిడీ కల్లుకు ఊరంతా గంతులు', 'దమ్మిడీ ఆదా లేదు క్షణం తీరిక లేదు' అనే సామెతలు దమ్మిడీ తక్కువ విలువను తెలుపుతున్నాయి.

పైసలు ధనసూచి అనే విషయాన్ని 'పైసా పైసా ఏంచేస్తావంటే ప్రాణం వంటి మిత్రుణ్ణి పగ చేస్తానంది', 'వగల్ చేసేదెందుకు పైస దొబ్బేటందుకు' (హైసా. IV-20) అనే సామెతలు చెపుతాయి. పైసా అన్నిటికంటె తక్కువ విలువైన నాణెం. 'బడాయి ఏమిర అన్నయ్యా అంటే పైసా లేదుర తమ్మయ్యా అన్నాడట' అని సామెత.

దుగ్గాని ; చూ. కాని.

దుడ్డు (2) : రెండు లేదా నాల్గు అణాల విలువచేసే నాణెం. 'దుడ్డూ దుగ్గాని లేని నా బట్ట దువ్వింది దువ్వెందే' అనే సామెత పైసలు లేకున్నా సరసాలాడే విటుని వేశ్య దుయ్యబట్టిన పలుకులు.

పాతిక . చూ. రూక.

పైకం (2) : డబ్బులో నాలుగోవంతు. 'చచ్చినా పైకం తప్పదు అచ్చమ్మా ఇక తిట్టకు', 'పయికము లేని వాడు పరస్త్రీ వర్జితుడు' అనే సామెతలో ధనవాచి.

పైస : చూడు. దమ్మిడి.

బొట్టు : చూ. ఏగాని.

మాడ (3) . అర్ధ వరహా, ఒక వస్తువుకు చాలా ఎక్కువధరను పెట్టిన సంద

ర్భంలో 'రోకలి మూడు మాడలు' (కార్. 1888) అనే సామెత ప్రయోగిస్తారు. మాడల ప్రస్తావన ఉన్న మరో సామెత. 'శరణార్థిని లింగప్పా అంటే కందులు మూడు మాడలు అన్నాడట. చిన్నా పెద్దా బాగున్నారా అంటే పప్పు లక్క వలె ఉడుకుతుందన్నాడట' అనేది.

ముచ్ఛవలం : చూ. చవలం.

రువ్వ : చూ. కాసు.

రూక - పావలా - పాతిక (1$\frac{1}{4}$) : రూక రెండు లేదా నాల్గణాల బంగారు లేదా వెండి నాణెం. చిన్నరూక రెండణాలు. చెల్లని రూకకు గీతలెక్కువని, ఏమీ లేని విటకాడు ఎక్కువ సరసాలాడతాడని, స్త్రీలు కొంగున నాణేలు ముడి వేసు కుంటారని చెప్పే సామెతలు: 'చేతకానమ్మకు చేష్టలు మెండు, చెల్లనిరూకకు గీతలు మెండు', 'రూక యివ్వని విటకాని వోటు మెండు', 'తన కొంగున కట్టిన రూక, తన కడుపున పుట్టినబిడ్డ' అనేవి. 'యెట్టు గొట్టిన రూక గుట్టు విడిచిన లంజ' అనేది నకిలీ రూకకు సంబంధించింది.

'పావలాకు పడుకుంటే పందుం బియ్యం బేపి తినిపోయిందట', 'మూడు పావలాల గుడ్డ, ముప్పైరూపాయల కుట్టు' అనేవి పావలాను గురించి చెప్పిన సామెతలు. చిన్న నాణెం దొరికినా సంతోషించే అల్ప సంతోషులకు ఉదా: 'పాతిక గల అమ్మకు పాతి పెట్ట లేవ దీయ' అనేది. 'బట్ట పాతిక బందె ముప్పాతిక' 'పాతిక వట్టం పరక లాభం' అనేవి పాతికను చెప్పేవి.

రూపాయ (3) : చెల్లని రూపాయకు గీతలెక్కువని, పనిచేసినవానికన్నా మాటలు చెప్పినవానికి లోకంలో ఎక్కువ ముట్ట జెప్తుతుంటారని చెప్పే సామెతలు: 'చెయ్యగానని వారికి మాటలు మెండు, చెల్లని రూపాయకు గీతలు మెండు', 'అద్దద అనేవానికి అర్ధరూపాయ, మొద్దుగొట్టేవానికి పెద్ద దుడ్డు'. అర్ధరూపాయలో సగమో, పాతికో అవుతుంది దుడ్డు. పెద్దదుడ్డు అంటే సగం అర్ధరూపాయేమో!

వరహా (10) : వరాహం గుర్తుండే బంగారు నాణెం. నాణేల్లో విలువైనది, మూడున్నర రూపాయ విలువచేసేది. కరుకు వరహాలు నాల్గు రూపాయలు విలువ చేసేవి. 52.56 గురిగింజల యెత్తు బంగారు. బారిముద్ర రూక అంటే వరహా మాదిరిగా చేసిన నకిలీనాణెం. అది వరహాతో పోలదు అని 'బారిముద్ర బారి ముద్రే కరుకు కరుకే' (బ్రౌ. ని.) అనే సామెత తెలుపుతుంది. చుట్టం విలువ మొదటిదినం కన్నా మర్నాడు సగం తగ్గుతుందని, మూడో దినానికి పూర్తిగా పడిపోతుందని

'వచ్చిననాడు వరా చుట్టము, మరునాడు మాడ చుట్టము, మూడవనాడు మూలికి చుట్టము' అనే సామెత సూచిస్తున్నది. అర్ధవరహా మాడ. ఎక్కువ విలువైన వేశ్య పొందు తక్కువ సంపాదన పరుడికి లభించదు. కాబట్టి పరువుకోసం ఆ వేశ్య తనకు వరుస కాదన్నాడట ఒకడు. వేశ్యకు వావి వరుసలు లేవు. ఈ విషయాన్ని చెప్పే సామెత 'పావు సంపాదనగాడికి వరహా లంజ వరుసకాదు' అనేది. నకిలీ వరహాకు గరుకులు ఎక్కువని 'కల్ల పైడికి గరుకులు మెండు' అనే సామెత చెప్తుంది. పైడి అనే పదం వరహాకు రూపాంతరంగా ఈ సామెతలో వాడారు.

వీసం (5) : వీసం అంటే వస్తువులో 16 వ భాగం. ఇక్కడ వరహాలోనో, రూపాయలోనో 16 వ భాగంగా చెప్పుకోవాలి. 'వీసంగల అమ్మ విడువా ముడువా', 'కాసు గల అమ్మి కట్టా పెట్టా' అనే సామెతలు అల్ప సంతోషులైన బీద స్త్రీల నుద్దేశించి చెప్పినవి. తక్కువ సొమ్మిచ్చి ఎక్కువ విలువగల సరుకు నడిగినపుడు 'వీసం యిచ్చి వాసానికి ఒడ్డినట్లు' అనే సామెత ప్రయోగిస్తారు.

సుస్కాని : చూ. కాని.

చిల్లర (1) : చిన్నపాటి నాణేల్ని 'చిల్లర' అంటారు. చిల్లర కూడ బెడితే సిరి ఎక్కువవుతుంది అని 'చిల్లర శ్రీ మహాలక్ష్మి' అనే సామెత తెలుపుతుంది.

3. 2 ధాన్యం కొలత (45): ధాన్యం కొలతలో 17 నిర్దిష్ట ప్రమాణాలున్నాయి. అడ్డెడు, అద్దెడు, ఇరుస, ఏదుం, కుంచం, గిద్ద, చిట్టి, తవ్వ, తూము, పందుం పరా, అర్ధము, పల్లా, పుట్టి, మానిక, ముప్పందుం, సవాసేరు, సేరు, సోల అనేవి. అనిర్దిష్ట ప్రమాణాలు గాదెడు, పిడికెడు, బొక్కెడు అనేవి. ఒకసారి కొలిచినధాన్యం మరోసారి కొలిస్తే తరుగు వస్తుందని 'కొలిచినదాన్నే మళ్లీ కొలిస్తే తరుగును' అనే సామెత తెలుపుతున్నది.

అడ్డెడు (3) : కుంచంలో సగం అడ్డెడు. 'అడ్డెడు వడ్లు అళకు పోతే తూమెడు వడ్లు దూడ తినిపోయింది' అనే సామెతలో దీని ప్రసక్తి ఉంది.

అద్దెడు (2) : సోలలో సగం. తక్కువాదాయం వచ్చే పనికిపోయి ఎక్కువ ఆదాయం నష్టపోయిన సందర్భంలో 'అద్దెడు వడ్లకు అతులు పెరకనుబోతే గాదెడు వడ్లు గాడిద మేసిపోయిందట' (నర) అనే సామెతను ప్రయోగిస్తారు. అద్దలో అర్ధం గిద్ద. అద్ద పాత్ర పెద్దది. గిద్ద పాత్ర చిన్నది. 'ఆరేండ్ల పిల్లవాడు అద్దలో గిద్ద పేస్తే అదీ అపురూపమే' అని సామెత. పెద్ద పాత్రలో చిన్నది వేయడం అపురూపం కాదు. కాకపోతే గారాబం అలా అనిపిస్తుంది.

ఆర్దము : చూ. తూము.

ఇరుస : చూ. తూము.

కుంచం (7) : నాలుగు మానికల ప్రమాణం. 'మంచు కుంచాల కొలిచినట్లు' అనేది అసాధ్యకార్యాన్ని సూచిస్తుంది. ఒక పేద స్త్రీ బడాయితనాన్ని 'కుంచెడున్న మ్మకు కూర్కుపుట్టదు' అనే సామెత, చిన్న అదాయానికి పోతే వచ్చిన పెద్దనష్టాన్ని 'కుంచెడు గింజలు కూలికి పోతే తూమెడు గింజలు దూడలు తిని పోయినవట' అనే సామెత సూచిస్తున్నవి. నాలుగైదేండ్ల పాపను కుంచమెత్తు అని చెప్పే సామెత 'కుంచమంత కూతురుంటే మంచంమీదే కూడు' (తల్లికి) అనేది.

గిద్ద : చూడు. అద్దెడు.

చిట్టి : చూ. పుట్టి.

తవ్వ (15) : రెండు సోలలు. ఇంట్లో అన్నం వండేందుకు ధాన్యాన్ని తవ్వతో కొలుస్తారు అని 'ఇంటికి అవ్వ కొలతకు తవ్వ అవసరము' అనేసామెత చెప్తుంది. అసలే లేదంటే తవ్వెడు ఇమ్మని అడగడం హాస్యాస్పదం అని, భోజనం వేళకు ముందే ధాన్యం సిద్ధంగా పెట్టుకోవాలి అని తెలిపే సామెతలు 'తమాము లేదంటే తవ్వెడైన అడిగినట్లు' (హైసా. V-9), 'తనదని తవ్వెడు తవుడున్నా ఆకటి వేళ తినవచ్చు' అనేవి.

తూము (4) : 12, 16, 24, 25 మానికలు వేర్వేరుచోట్ల తూముగా పిలువ బడుతున్నాయి. రెండు ఇరుసలు ఒక తూము. రెండు తూములు ఇద్దుం. మూడు తూములు ముత్తుం. నాలుగు తూములు నల్తుం. ఐదు తూములు ఏదుం. ఆరు తూములు ఆర్దుము. పది తూములు పందుం. ఇరవై తూములు పుట్టి. మానవతి మానిక ధాన్యం ఖర్చుపెడితే దూబరదిండి తూమెడు ఖర్చు పెడుతుందని 'దూబర దిండికి తూమెడు, మానవతికి మానెడు' (హైసా. VI-11) అనే సామెత చెపు తుంది. ఉమ్మడికుటుంబంలో ఒకరిని కొనకుండా మరొకరు ధాన్యం అమ్మి సొమ్ము చేసుకుంటారని 'అంతా ఆర్దుము అమ్మితే అత్తను గానక కోడలు ముత్తుము అమ్మింది' అనే సామెత తెలుపుతుంది. పనిచేయనివానికే లోకులు ఎక్కువిస్తారని 'ఇపుడు వచ్చిన వానికేమో ఇరస, అప్పుడు వచ్చినవానికి అద్దెడు' అనే సామెత అభిప్రాయపడుతున్నది.

పందుం : చూ. పుట్టి.

పరా : చూ. పుట్టి.

పల్లా (1) . 100 కిలోగ్రాముల ధాన్యం బస్తా పల్లా. 'మాటల సత్రానికి నా దొక పల్లా' అనే సామెతలో దీని ప్రసక్తి ఉంది.

పుట్టి (10) : 20 తూములు పుట్టి. తూమునుబట్టి పుట్టి కొలత వేర్వేరు చోట్ల వేర్వేరుగా ఉంటుంది. 240, 320, 480, 500 మానికలు వేర్వేరు చోట్ల పుట్టిగా చెప్పబడ్డాయి. 240 మానికలు చిన్నపుట్టి, 480 మానికలు పెద్దపుట్టిగా కడప మండలంలో వాడుక. పుట్టిలో సగం పందుం. కుంచంతో పుట్టిని కొలుస్తారు. చిట్టితో కొలవడం అసాధ్యం కాదు కాని దినాలు పడుతుంది చిట్టి పావులో నాల్గో భాగం. 'పుట్టిని చిట్టితో కొల్చినట్లు' అనే సామెత పైవిషయాన్నే తెలుపుతుంది. 'తన పుట్టి పిచ్చగా వుంటే పొరుగు పందుం పరాకొలిచినాడట' (కార్. 990) అనే సామెతలో చెప్పిన 'పరా' అనేది సున్నంలాంటివి కొలిచే కొలపాత్ర. 'తడిసి ముప్పందుం మోసేకంటే తడవక పందుం మోసేది మేలు' అనే సామెతలో ముప్పందుం అనేది ఒకటిన్నర పుట్టి కొలత. ధాన్యం కొలతనే కాకుండా అమూర్తమైన 'పుణ్యం' ను గురించి చెప్పినపుడు కూడా వాడబడిన సామెత 'పుణ్యం పుట్టెడు పురుగులు తట్టెడు' అనేది.

మానిక (5) : కుంచంలో నాలుగో భాగం. తక్కువ ఆదాయానికి పోతే ఎక్కువ నష్టం వచ్చిన సందర్భంలో ప్రయోగించిన సామెత 'మానెడు గింజలకు పనికిపోతే కుంచెడు గింజలు దూడ తినిపోయిందట' అనేది

ముప్పందుం చూ పుట్టి.

సవాసేరు : చూ సేరు

సేరు (3) : సేరు రెండు సోలలు. సేరులో ఆరో బాగం సవాసేరు. 'సేరుకు సవాసేరు అన్నట్లు', 'సవాసేరులో ఛోడి పరాచికమా' అని సామెతలు.

సోల (1) : తవ్వలో సగం. దోనె చిన్న నీటి పాత్ర పెద్దవస్తువు చేయబోయి చిన్న వస్తువును చేసిన సందర్భాన్ని తెలిపే సామెత 'దోనె చెయ్యబోయి సోల చేశాడట' అనేది. కొలపాత్రలు కొయ్యతో చేస్తారని కూడా ఈ సామెత ద్వారా తెలుస్తుంది.

అనిర్దిష్ట పరిమాణాలు (4): ఎక్కువ ధాన్యాన్ని గాదెడు అని, తక్కువ ధాన్యాన్ని బొక్కెడు, పిడికెడు అని చెప్తారు. గాదెలో గింజలు గాదెలోనే ఉండాలి, బిడ్డలు

గారకాయల్లా ఉండాలి', 'ఎన్ని బూతులైన పిడికెడు కొట్టులతో సరికావు', 'దోసెడు తిట్లయినా బొక్కెడు కొట్టులు కావు' అనేవి పై విషయాల్ని తెలిపే సామెతలు.

3.5.3 ద్రవ పదార్థాల కొలత (9) : గిద్ద, చిట్టెడు, తవ్వ, దోసెడు (?) పావు, పుట్టెడు, మానెడు అనే నిర్దిష్ట ప్రమాణాలు; గోరంత, బానెడు, ముంతెడు అనే అనిర్దిష్ట ప్రమాణాలు ద్రవపదార్థాల కొలతను తెలిపేవి. 'పుట్టెడు ఆముదము రాసుకొని పొర్లాడినా అంటేదే అంటుతుంది అంటంది అంటదు' అనే సామెతలోని 'పుట్టెడు' ఎక్కువ అనే అర్థంలో వచ్చింది. 'ఆముదము కొలిచిన తవ్వ ఎప్పుడూ జిడ్డే', 'నూనె కొల్చిన గిద్దకు జిడ్డుకాదా', 'బోసిపంటికి దోసెడు నూనె ఎట్లా తెత్తును ఏగాని' అనేవి పై విషయాల్ని చెప్పేవి. పాల కొలతలో మానెడు, చిట్టెడు అనేవి ప్రసక్తిలో వున్నట్లు 'మానెడు పిండవచ్చునుగాని, చిట్టెడు తిరిగి ఎక్కించలేము' అనే సామెత తెలుపుతుంది. నీటి కొలతను చెప్పినవి గోరంత, ముంతెడు, బాన, పావు అనేవి. 'గోరంత నీరైనా గోతులుచేస్తుంది', 'ముంతెడు నీళ్లకు ఉలిక్కిపడితే బానెడునీళ్లు నీబావ పోసుకుంటాడా', 'పరకతో కొట్టి పావుతో నీళ్లిస్తా' (నర) అనే సామెతలు ఈ విషయాన్ని చెప్పేవి.

3.5.4 ఆహార పదార్థాల పరిమాణం (37) . తిండి దండిగా తినడం అనే విషయాన్ని మిట్టచేను ఒడ్డుపేసినట్లు, పీట పగిలేటట్లు, మొలతాడు తెగేటట్లు అనే అనిర్దిష్ట ప్రమాణాల్తోను; పుట్టెడు, పందుం, ఏదుం అనే అనిర్దిష్ట ప్రమాణాల్తోను చెప్పబడింది. పుట్టెడు, పందుం, ఏదుం నిజానికి ఎవరూ తినలేరు. ఎక్కువ అనే అర్థంలో అన్వయించుకోవాలి. 'విందుభోజనం చేస్తే మిట్టచేనుకు ఒడ్డువేసినట్లుండాల' (రా. ప. 615), 'పీట పగిలేటట్లు, మొలతాడు తెగేటట్లు తింటేనే ప్రీతైన తిండి', 'పొట్టకు పుట్టెడు తిని అట్లకు ఆదివారం రమ్మన్నట్లు', 'పందుందిన్నా వరగడుపే, ఏదుం తిన్నా ఏకాదశే' అనే సామెతలు పై విషయాల్ని చక్కగా తెలుపుతాయి. అన్నం అతి కొద్దిగా ఉన్నప్పుడు 'మెతుకు' అని చెప్తారు. 'ఉన్న ఒక్క మెతుకు కాస్త గంజిలో పోయినట్లు' అని సామెత.

వంట చేసే పాత్రలకు కొలత ఉంటుంది. పాత్ర పరిమాణాన్నిబట్టి అడ్డెడో, తవ్వెడో బియ్యం అందుల్లో వేస్తారు. 'నీపై ఎసలేదు నాపై పసలేదు, ఏడు పేర్ల తప్పేల కెసురు పెట్టమన్నట్లు', 'అత్త కొక రోగం మామకొక రోగం, అడ్డెడు తప్పేలాకు ఏ రోగం లేదు' (గ్ర. ల. 312), 'అడ్డెడు వండిన బుడ్డెడాయె' (బుడ్డి ఒక పాత్ర) అనే సామెతలు పై విషయాన్ని తెలిపేవి.

ఎక్కువ తిండి తిన్నారని చెప్పేందుకు అడ్డెడు, గిద్దెడు, తవ్వెడు, అర్ధశేరు బియ్యంతో వండిన అన్నం తిన్నట్లు 'వండేది అడ్డెడు, ఓగెంగా తిను అల్లుడా అంటే, అన్నంపై ద్వేషమెందుకు ఉన్నదంతా ఊడ్చి పెట్టత్తా అన్నాడట', 'అడ్డెడు తినే నా సవితి ఎలా తింటుందో, గిద్దెడు తినే నా సవితి ఎలా తింటుందో, తవ్వెడు అడ్డెడు తినే వఱకు నా దవడ లీడ్చుకు పోయినవి', 'అడ్డెడు తినేవాడికి ఆలెందుకు, ఇద్దుము మోసేవానికి ఎద్దెందుకు' అనే సామెతలు పై విషయాల్ని సూచిస్తున్నాయి.

అంబలి, కూరలాంటి ద్రవపదార్థాల కొలతలు : ఇరస, అబక, అరసోల అనేవి. 'ఇత్తు యిసిరి, ఇరస అంబలికాచి, ఇంటికి నలుగురిని పిలిచి ఇందు(విందు) చేసినట్లు', 'అంబటేరు పార్తా ఉందే అత్తా అంటే కొల్లపకతో అపకదే కోడలా అన్నదట' (చంద్ర), 'మొగవాళ్లకేమి మొద్దులవలె ఉన్నారు. ఆడవాళ్లకు అరసోల కందిపప్పు వేయమన్నదట' (సా) అనే సామెతలు పై కొలతల్ని చెపుతున్నాయి.

తిండిలో ఎక్కువ పరిమాణానికి వాములు, ఆకాశం, అడ్డగోడ, గంపెడు గడ్డివామి, చాటెడు, దోసెడు, బుక్కెడు అనేవి చెప్పబడగా, తక్కువ పరిమాణానికి పట్టెడు, పిడికెడు, చేరెడు, పురిసెడు, అరచేతి గుంతెడు అనేవి చెప్పబడ్డాయి. ఇవన్నీ అనిర్దిష్ట ప్రమాణాలే. 'వాములు తినే స్వాములవారికి పచ్చగడ్డి ఫలహారము' (రా. ప. 613), 'ఆకలి ఆకాశమంత, నోరు సూది బెజ్జమంత', 'అడ్డగోడంత రొట్టె గడ్డివామంత తొక్కు', 'కంపు పెట్టుకొని గంపెడు తిన్నట్లు'. 'చేటెడు తిని చెడితి, వాకిలి దాటి పడితి', 'పొట్టకు పట్టెడు కూటికే సుమా' (క. గా. పు 221) 'ప్రీతితో పెట్టినది పిడికెడైనా చాలు', 'బుక్కెడు తిన్నమ్మ బూరగమ్రాను, చేరెడు తిన్నమ్మ చెక్కపేడు', 'చద్ది పురిసెడు, ఊరగాయ దోసెడు', 'ఆయన పెట్టినది అరచేతి గుంతెడు గోకి నోట్లో వేసుకోరా గోవిందుగా' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి.

గంజి, అంబలి ఎక్కువైతే బానెడు; తక్కువైతే పురిసెడు, చేరెడు, పట్టెడు అని చెప్పబడింది. 'నా ముందఱ బానెడు గంజా', 'పోరులేని గంజి పురిసెడైన చాలు', 'చావదీరనంత పని అయినా చారెడు గంజికి దోవ లేదు', 'చింతలేని అంబలి చేరెడే చాలు', 'పాపమని పట్టెడంబలి పోస్తే ఉప్పులేదని అలిగి పోయినాడట' అనే సామెతలు పై కొలతల్ని చెప్పేవి.

ఒక్కసారి నోట్లో పెట్టుకొనే అన్నం పిడచ కబళం. పెద్ద పిడచలు చేసుకొని తినడం తిండిపోతుల లక్షణం. ఈ విషయాల్ని 'పప్పుతో పది కబళాలు తింటే

పులుసెందుకు బుగ్గిలోకా', 'తక్కెడిజ చాతురి తాలఫల ప్రమాణముల్' అన్నే సామెతలు తెలుపుతున్నాయి. పిడచలు తాటికాయంతేసి ఉన్నాయట. ఎంత వింత ?
**3.5.5 వస్తు పరిమాణం (22)** వస్తువుల పరిమాణాన్ని ఆకాశం, తిప్ప, కొండ, గుమ్మడికాయ, దూలం, రోలు, కాలు, వేలు, ఓపినంత, గొంగెడు, గంపెడు, ఏనుగంత అనేవి చెప్పగా తక్కువ పరిమాణాన్ని బుట్ట, అవగింజ, నలుసు, వేలు, గోరు, తగరం, కొఱ్ఱగింజ, అరచేతిలో ఉప్పు, గంటెడు, ఏకంత అనేవి చెప్తున్నాయి. ఇవన్నీ అనిర్దిష్టప్రమాణాలే 'తట్టలో కాపురం బుట్టలోకి వచ్చె, బుట్టలో కాపురం బూడిదలో కలిసె', 'తినగా తినగా తిప్పకూడా కరిగి పోతుంది' (సా. సా. 238) 'తన్ను తప్పించి ఆకాశమంత పిడుగు పడమన్నట్లు', 'గుమ్మడికాయ పొయ్యేదారి యెరగడు ఆవగింజ పోయ్యే దారి అడ్డె పట్టి చూస్తాడు' (రావ్. 785). 'గుమ్మడికాయలో ఆవగింజంత', 'తన కంట్లో దూలం పెట్టుకొని పరుల కంట్లో నలుసులెంచినట్లు', 'వేలంత చోటిస్తే రోలంత నష్టం', 'వేలు పెట్టేందుకు చోటిస్తే కాలు దూర్చినట్లు', 'గోరంతను కొండంత చేయడం', గోరు వాచిన వేలంత, వేలు వాచిన కాలంత, కాలు వాచిన రోలంత, రోలు వాచిన ఎంత', 'ఒకరిదైతే ఓపినంత తనదైతే తగర మంత', 'ఏనుగంత తండ్రి ఉండే కంటె ఏకంత తల్లి ఉండుట మేలు', 'కొఱ్ఱగింజంత కోడలిని చూస్తే కొండంత జ్వరం వచ్చిందట', 'అంకె అయితే గొంగెడు (గొంగలి పట్టేంత) తెమ్మన్నానుగాని, మంచెగుంజలపాలు కమ్మన్నానా', 'అరచేతిలో ఉప్పుపెడితే ఆరునెలలు తలచుకోవలెను', 'గంటెడు నాలుక ఆడించడం కంటె గంపెడు తల ఊగించడం మేలు' అనేవి పై విషయాల్ని తెలిపేవి.

మనిషి బలహీనతను అరమనిషి సత్తువ, కాకి పీకను కండలేదు అనే పోలికల్లో చెప్పబడింది. 'అరమనిషి సత్తువ ఆర్గురి ఆక్రోశం', 'కాకి పీకను కండలేదు ప్రతివానితో జగడం' (రా. ప 683) అనేవి పై విషయాన్ని తెలిపే సామెతలు.
**3.5.6 బట్టలు-నూలు-కొలత (6) :** పదలం, ఏకు, తాను ఆధారంగా బట్టలు, నూలు కొలత చెప్పబడింది. 'ఏకు దారము, ఏగాని పుస్తె'. పుస్తె కట్టేతాడుకు ఒక ఏకుతో తీసిన దారం చాలు. పంతులు నూలు పోగా బరువు అరవీశె ఉండాలని పరిహాసంగా చెప్పే సామెత 'పదలం నూలు పోగా లేనిదే పంతులుగాడు' అనేది. బట్టల పొడవును చేతితో కొలవడాన్ని మూర వేయడం అంటారు, మూర వేయాలంటే గుడ్డ పట్టుకొనేందుకు వ్రేళ్లు అవసరం, అసాధ్యమైన విషయాన్ని 'మొండిచేతుల్తో

మూరవేసినట్లు' (నర) అనే సామెత చెపుతుంది. తాను 18 నుంచి 60 మీటర్ల పొడవు. 'ఆ తానులోదే ఈ పేలిక' అనే సామెతలో దీని ప్రస్తావనుంది.

3.5.7 ఎత్తు-లోతు (16) : తాటిచెట్టు, తారాజువ్వ చాలా ఎత్తును, కుంచం అనేది మిక్కిలి పొట్టిని సూచిస్తాయి. తాటి ఎత్తు ఎగిరినానంటే మువ్వెత్తు ఎగురు అన్నట్లు', 'తాటంత వానిని తలదన్నే వాడుంటాడు', 'కుంచమంత కూతురుంటే మంచంమీదే కూడు' అనేవి పై విషయాల్ని తెలిపే సామెతలు.

దిగకుండా లోతు తెలియదు. నిండా మునిగితే చలి వుండదు. మనసు లోతు కనుక్కోలేము. మనసులోపలి మర్మాన్ని 'లోతు' అనడం విశేషం. 'తినకుండ రుచులు దిగకుండ లోతులు తెలియవు'. 'పూరా మునిగిన వానికి చలియేమి గాలి యేమి?' (కార్. 1501), 'లోవి లోతు చూడనగును గాని మనసు లోతు చూడ లేము' (గ్ర్య. ల. 213) అనేవి పై విషయాల్ని తెలిపేవి.

లోతును తాటి ప్రమాణం, తలబంటి, కుత్తుకలబంటి, చంక లోతు, మొల బంటి, మోకాలిబంటి, గడ్డంలోతు, పుక్కిలిలోతు అనే కొలతలు చెపుతాయి. 'తల మునిగి తాటి ప్రమాణం అయింది' (ప. వ.), 'తాళ్లకు తలబంటి అయితే వెంపలికి ఎంత బంటి అన్నట్లు', 'కుత్తుకల బంటి తామర (లకు) తూండ్లకు.' (నీళ్ల), 'చంకలోతు దిగినవానికి చలేమిటి?,' 'మొలబంటి లోతు దిగితే చలి లేదు' (సా.సా. 379), 'మొలబంటి దుఃఖంలో మోకాలిబంటి సంతోషం', 'అడ్డంపడితే గడ్డంలోతే బోర్లపడితే పుక్కిలి లోతే' అనేవి। పై కొలతల్ని చెప్పేవి. మోకాలి బంటి అనేది ద్రవ పదార్థం కాని, మూర్త పదార్థం కాని దుఃఖాన్ని సంతోషాన్ని చెప్పడం విశేషం.

3.5.8 పొడవు (10) : ఆకాశం, బారెడు, మూరెడు, ఎక్కువ పొడవుకు; బెత్తెడు, జానెడు, మూరెడు తక్కువ పొడవుకు కొలతలు. 'ఆకాశం పొడవు ఆకాశమే ఎగురు', 'ఏటు మూరెడు తీస్తే కొలను బారెడు తీస్తుంది'. 'జానెడు యింట్లో మూరెడు కర్ర' (కార్. 948), 'జానెడింట్లో బారెడు కట్టె కొట్రా మొగుడా ఎట్ల గొడతావో' (నర), 'పిల్ల బెత్తెడు పేరు మూరెడు', 'సంసారం జానెడు ఖర్చు బారెడు' అనేవి పై విషయాల్ని తెలిపేవి. పిల్ల బెత్తెడు, జానెడింట్లో .... .... అనే సామెతల్లో ఈ కొలతల్ని ఆలంకారికంగా గ్రహించాలి. సంసారం జానెడు.... అనే సామెత అమూర్త పదార్థానికి కొలతల్ని అన్వయించిన సందర్భం.

3.5.9 దూరం (11) : ఎక్కువ దూరాన్ని ఆమడతో, తక్కువ దూరాన్ని

అడుగుతో చెప్పబడింది. చింతాకంత అనేది కూడా తక్కువ దూరాన్ని తెలి పేదే. ఊరు చివరి పొలిమేరరాయి తక్కువదూరాన్ని చెపుతుంది 'అరదానికి ఆయనకు ఆమడ దూరం', 'అనపచేను ఆమడుండగానే బుజ్జి పిత్తులు బారెడేసి' (వి. వేం.). 'అడుగు తప్పితే అరవై ఆరు గుణాలు', 'దుష్టుని చూస్తే ఒక అడుగు దూరముగా ఉండవలెను' (బురా). 'నుయ్యి దాటే వానికి చింతాకంత ఎడమైనా ఎడమైనట్టే', 'బుద్ధిమంతుడని సద్ది కడితే బొంద్రాయి దగ్గరనే భోంచేసినాడట' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి. మనం చూపే ఆప్యాయతను బట్టే అవతల వాళ్లానని 'అ ఊరికి ఈ ఊరు ఎంత దూరమో ఈ ఊరికి అ ఊరు అంతే దూరం' అనే సామెతలు చెపుతుంది. పైసామెతల్లో ఆమడకు వాచ్యార్థం కాక వ్యంగ్యార్థమే ఉంది. బుజ్జిపిత్తులు బారెడేసి అనే సామెతలో 'బారెడు' అపానవాయువుల శబ్ద దైర్ఘ్యాన్ని బోధిస్తుంది.

3.5.10 లావు (2) : లావును రోకలితోను, సన్నాన్ని వెంట్రుకతోను పోల్చి చెప్పబడ్డాయి. ఉదా॥ 'వెంట్రుకకన్న ఏడు పాళ్ల సన్నం. రోకలికన్న ఏడుపాళ్ల లావు', అని సామెత. లావుగావున్నపుడు వంపు కనిపించదు. 'లావు మీద వంపు తెలియదు' అనే సామెత. ఎక్కువ ఆస్తి ఉండే వానికి అప్పులు ఎక్కువున్నా పైకి కనబడవు అని రెండో సామెత లోని వ్యంగ్యార్థం.

3.5.11 తూకం (6) : వస్తువులు తక్కెడలో పెట్టి తూస్తారు. కృతఘ్నతకు చిహ్నం 'అక్కర గడుపుకోని తక్కెడ పొయ్యిలో పెట్టినట్లు' అనే సామెత. మణుగు ధడియం, పదలం, ఎత్తు. మాషం అనేవి వస్తువుల బరువును చెప్పే కొలతలు. రెండువీశెలు ఒక ఎత్తు లేకం ధడెం. ఎనిమిదివీశెలు ఒక మణుగు. ఐదు గురిగింజల ఎత్తు మాషం. తక్కెడకు ఒక వైపు పెట్టిన నిర్ణీతమైన బరువు కట్టు (?). 'మణుం గొట్టగా మాషం చిక్కినాడు', 'ఎత్తుకు యెత్తు భారమునకు భారము చెడిపోయినది' (బ్రౌ. ని.) 'తడిసిన తక్కెడ ఎండిన దఢా', 'కట్టు దూది బరువా కట్టు రాయి బరువా అన్నట్లు' (సా) అనేవి పై కొలతల్ని తెలిపే సామెతలు.

3.5.12 కాలం (49) : సంవత్సరం, నెల, పూర్ణిమ, అమావాస్య, దినం, పూట, ఘడియ, తాను, నిమిషం, క్షణం అనేవి కాలాన్ని తెలిపే నిర్దిష్టమైన కొలతలు. కోళ్లు కూసే వేళను తెల్లవారే సమయంగా, కాళ్లు కాలే వేళ మధ్యాహ్నంగా, నక్షత్ర దర్శనం, పొద్దుక్రుంకడం, గూట్లో దీపం పెట్టడం, సాయంకాలానికి చిహ్నంగా, మంచాల దగ్గరకు పోవడం రాత్రి పదిగంటల సమయానికి చిహ్నంగా, జానపదులు

కాలాన్ని కొలిచే అనిర్దిష్టమైన కొలతలు. 'అరవై ఏళ్లయినవి చదువుకోక మట్టి కొట్టుకుంటానా' అనే సామెతలో అరవైయేండ్లు వృద్ధాప్య సూచకం. 'ముప్పయి యేండ్ల ఆడదీ మూడేండ్ల మొగవాడు వకటి' (కార్. 1776) అనే సామెతలో వీళ్లిద్దరి బలం సమానమని చెప్పబడింది. ఇది స్త్రీలను పరిహాసం చేసిన సందర్భమే గాని సత్యంగాదని బ్రౌన్ నోట్సులో రాసుకున్నాడు.

ఎక్కువకాలానికి ఆరునెలలు అని చెప్పడం సామెతల్లో ఉంది. 'ఆఁ అంటే ఆరు నెలలు', 'అత్త చచ్చిన ఆరు నెలలకు నిట్టాడి గుంజ పట్టుకొని నిగిడినిగిడి ఏడ్చెనంట' (నర) అనే సామెతలు పై విషయాన్ని నిరూపించేవి.

పూర్ణిమ, అమావాస్యలు 15 దినాలను వాచ్యంగా, వెలుగు చీకట్లను వ్యంగ్యంగా సూచిస్తాయి. 'పూర్ణిమనాడు కొంగు బట్టుక పిలిస్తే రానిది అమావాస్య నాడు కన్ను గీటితే వస్తుందా', 'పున్నమినాటి పురుషుడు అమావాస్య నాటి ఆడ పడుచు' అనే సామెతలు పై విషయాల్ని చెప్పుతాయి. రెండో సామెత అంతరార్థం ఏమో ?

వణుకుప్రాయం వృద్ధాప్యాన్ని కులుకుప్రాయం యవ్వనాన్ని సూచిస్తున్నట్లు 'అయ్యకు వణుకుప్రాయం, అమ్మకు కులుకు ప్రాయం' (నర) అనే సామెత ద్వారా నిరూపించొచ్చు.

ఎల్లుండి అంటే రేపు తర్వాత వచ్చే దినం. దీని ప్రసక్తి 'ఎందుకు ఏడుస్తావురా పిల్లవాడా అంటే ఎల్లుండి మా అమ్మ కొడుతుంది అన్నాడట' అనే సామెతలో ఉంది.

దినం పగలు, రాత్రి అని రెండు సమభాగాలుగా విభజించబడింది. 'పగలు చెయ్యి ఊపితే రానిది రాత్రి కన్ను గీటితే వస్తుందా?', 'పట్టపగలు పిలిస్తే దిక్కులేదు గాని అర్ధరాత్రి కన్ను గీటితే వచ్చిందట' (చంద్ర) అనే సామెతల్లో పగలు, రాత్రుల ప్రస్తావనుంది.

దినాన్ని రెండు లేదా మూడు పూటలుగా చెపుతారు. 'మాటసుట్టమేగాని పూట చుట్టంగాదు' అనే సామెత ఒక పూటైనా ఇంటికి పిలిచి అన్నంపెట్టని చుట్టానికి అన్వయించేది. 'ఒక పూట తింటే యోగి, రెండు పూటలు తింటే భోగి, మూడు పూటలు తింటే రోగి' (నర) అనే సామెత ఆరోగ్య సూత్రం. దాన్ని బలపరచేది 'పూటలు మూడు భోజనం ఒకటి' అనేది.

ఘడియ 24 నిమిషాలు, అర ఘడియ 12 నిమిషాలు. తాసు ఒకటిన్నర

గంటలు. ప్రాచీనులు దినాన్ని జాములు, ఘడియలు, విఘడియలుగా లెక్కించేవారు. 'గడియ పురసతు లేదు గవ్వరాకడ లేదు' (హైసా. V-7) 'ఇచ్చేది కాసు....తాసు' (క. గా. పు. 264), 'అరఘడియ సంభోగము, ఆరు నెలల సుఖరోగము' (పప) అనే సామెతలు పై కొలతల ప్రసక్తి ఉండేవి. అరనిమిషం, క్షణం తక్కువ కాలాన్ని సూచించేవి. 'అర నిమిషం తీరికాలేదు, అరకాను సంపాదనా లేదు', 'క్షణం తీరుబాటు లేదు పైసా సంపాదన లేదు' (నర) అనే సామెతలు పై విషయాల్ని చెప్పేవి.

కోడి కూపిం తర్వాతకూడా ఇంకా రాత్రి కొంత మిగిలి ఉంటుందని 'కొక్కొరోకో అనగానే తెల్లవారినట్లా', 'కోళ్లకూయగా లేచినా కాళ్లకాలే వలుకు అవుతుంది' 'కాకులు లేచినప్పుడు లేచి కాకరకాయల కూర చేసి కాలే కాలే అన్నం వండి ఆదరా బాదరా అస్తమానవు పేళకు వడ్డించానన్నట్లు' (గ్ర. ల. 52), 'నాంచారమ్మ వంట నక్షత్ర దర్శనము ఒక్కసారే', 'ప్రొద్దెపుడు క్రుంకునా, ముద్దెపుడు మ్రింగుదునా', 'గూట్లో దీపం నోట్లో కడి' (రా. ప. 273), 'అందరూ మంచాల దగ్గరకు వెళ్లే వరకూ మేము కంచాల దగ్గరకైన వెళ్లలేమా' అనే సామెతల్లో పల్లీయుల కాల నిర్ణయానికి సహజ సంకేతాలున్నాయి.

చిటికె. గోరంత అనేవి తక్కువకాలాన్ని సూచించేవి. 'చిటికెలో పందిరి వేసినట్లు', 'గోరంత ఆలస్యం కొండంత నష్టం' అని సామెతలు.

3.5.13 సంఖ్యలు (16): సున్న, ఒకటి, మూడు, నాలుగు, ఆరు, తొమ్మిది, పది. ముప్పైఆరు, తొంబై. నూరు, లక్ష, కోటి అనే సంఖ్యలు సామెతల్లో ప్రస్తావించబడ్డాయి. హళ్లి అన్నా సున్నే (బ్రౌన్). అవసరమున్నా లేకపోయినా వస్తువుల్ని ఎంచవలసిందేనని 'ఏళ్లోవేసినా ఎంచి వెయ్యవలెను' అనే సామెత సలహా ఇస్తున్నది. 'సున్నకు సున్న హళ్లికి హళ్లి', 'జిహ్వకొక రుచి పుఱ్ఱె కొక బుద్ధి', 'చెట్టుమీదిది చేతికి వచ్చివప్పేగాని, ఇక తొమ్మిదయితే పదవుతాయి', 'ఏమిటి కేమీ లేదు మూడిటికెసరు', 'మల్లీ మల్లీ మంచానికి కాళ్లెన్ని అంటే మూడున్నొక్కటి అన్నదట', 'ఆర్భాటానికి ఆరుకుంపట్లు, ఒక దుంపదాలి', 'ఉప్పుతో ముప్పైఆరూ ఉంటే వట్టి ముండైనా వండుతుంది' (గ్ర.ల.580), 'తొలిపిల్లకు తొంబై అంగీలు మలిపిల్లకు నూరు తొడగ లేదు', 'నూటికి పెట్టి కోటికి గొరిగించినట్లు', 'లచ్చ ఉంటే కోటి లక్షణాలు', 'కూటికుంటే కోటికున్నట్లు' అనేవి సంఖ్యల ప్రస్తావన

ఉండే సామెతలు. ముప్పై ఆరు, తొంభై. కోటి అనేవి ఎక్కువ సంఖ్యలను దృష్టిలో పెట్టుకొని ప్రయోగించినవి.

3.5.14 దారిద్ర్యం(11) : గోచి, బిత్తల దారిద్ర్యానికి కొలతలు. 'తలకు మించిన శిక్ష, గోచికి మించిన దారిద్ర్యం లేదు', 'గోచికి మించిన దారిద్ర్యం లేదు ఈతకు మించిన లోతు లేదు', 'దిసమొలవానికి దిగంబరుడు బట్ట కట్టినట్లు'. 'దెస బత్తలవానికి బరిబత్తలవాడు బావమరది', 'గోచి లేనోనిది రాజ్యమంతా' (నర) అనే సామెతలు దారిద్ర్యాన్ని చెప్పేవి.

3.5.15 నిర్దిష్టమైనకొలతల్ని ఒకవైపు వాడుతూనే గ్రామీణులు అనిర్దిష్టమైన కొల తల్ని కూడా సృష్టించుకొన్నారు. తమ చుట్టూ ఉండే వస్తువుల్ని (గాదె, చట్టి) ప్రకృతిని (ఆకాశమంత, కొండంత) ఆధారంగా కొలతలు నిర్ణయించుకొన్నారు. తెల్లవారే గుర్తులు కోడి కూయడం, కాకులు అరవడం. వాటి ఆధారంగానూ, చుక్కలు ఆకాశంలో ఉండే తీరునుబట్టి రాత్రి సమయాన్ని, సూర్యుడు ఆకాశంలో ఉండే తీరును బట్టి పగటి సమయాన్ని తెలుసుకొనేవారు. ఇలాంటి అనిర్దిష్ట ప్రమాణాలు జానపద సాహిత్యంలో ఒక భాగమైన సామెతల్లోకి కూడా ఎక్కాయి.

పరిపాలన, న్యాయం అనే అంశాల్ని తెలుగు సామెతలు ఆధారంగా తర్వాతి పుట ప్రకరణంలో పరిశీలిద్దాం.



# 3.6 తెలుగు సామెతలు - పరిపాలన, న్యాయం

3.6 పరిపాలనం, న్యాయం అనే విషయాలకు సంబంధించిన 393 తెలుగు సామెతలు నా పరిశీలనలో లభించాయి. పరిపాలన రాజు చేతిలో ఉండేది. మంత్రి, సేనాపతి మొదలైన రాజోద్యోగులు, రెడ్డి, కరణం, తలారిలాంటి గ్రామోద్యోగులు రాజు అనుమతితో పరిపాలన సాగించే వారు. రాజులకాలంలో న్యాయానికి సంబంధించి, ఆంగ్లేయుల కాలంలో ఏర్పాటైన కోర్టులగురించి ఈ ఉపప్రకరణంలో చర్చ వుంటుంది.

3.6.1 రాజు (119) : రాజుకు సంబంధించిన సామెతల్లో చాలామాత్రం రాజు నిరంకుశత్వాన్ని, వ్యభిచారాన్ని, దుర్గుణాల్ని గురించి చెప్పినవే. ప్రజా కంటకులైన రాజులు ఒకరు పోతే మరొకరు రాజ్యానికి వచ్చేవారని, ప్రజలకు రాజువల్ల ఉపకారం చింతాకంత కూడా ఉండేది కాదని సామెతలు చెప్తున్నాయి.

ఆంధ్రదేశంలో రాజులయినవారు క్షత్రియులు గాకున్నా, సుక్షత్రియులమనిపించుకొనేందుకు సూర్య చంద్ర వంశస్థులైనట్లుగా చెప్పుకొనేవారు. జందెం ధరించేవారు. ఈ విషయాన్ని 'రాచతనానికి జందెపుపోచా గుర్తు' అనేసామెత తెలుపుతుంది.

రాజు ఊరేగింపుకుముందు దారులు శుభ్రంచేసేవారని, ప్రజల్లో అందగత్తెలను రాజు కోరేవాడని 'రాజురాకడ లేదు త్రోవ నూకుడు లేదు', 'ఊళ్ళోకి రాజాగారు వస్తున్నారంటే పెండ్లాము వంక అనుమానంగా చూచినట్లు' అనే సామెతలు చెపుతాయి. భోగభాగ్యాలకోసం రాజుల్ని ప్రియులుగా, భర్తలుగా సామాన్య స్త్రీలు కోరేవారని 'రాజును చూచిన కంటితో మొగుణ్ని జూచి మొత్తుకొన్నట్లు', 'అరసుణ్ని నమ్ముకొని పురుషుని పోగొట్టుకున్నట్లు' అనే సామెతలు తెలుపుతాయి.

జాతి, సంఘంలో స్థానంతో నిమిత్తంలేకుండా, డబ్బున్నవాడే రాజు అని 'రాజును పేద అనరాదు, ఎద్దును సాధువనరాదు', 'వేసరపుజాతిగాని, దాసి కొడుకైనగాని కాసులు గలవాడే రాజు', 'కదజాతికాని కాసులుగలవాడే రాజు' అనే సామెతలు తెలుపగా; రాజులేని రాజ్యం అరాచకం పాలవుతుందని 'నాధుడు లేని రాజ్యం నానాదారుల' అనే సామెత చెపుతుంది.

రాజు నీచపుపనిచేస్తే గొప్పదిగా మెచ్చుకోవడం, అదేపని సామాన్యులు చేస్తే దుయ్యబట్టడం జరిగేది. ఆవిషయాన్ని 'పేదవాడు పెంట తింటే ఆకలని, మా రాజు తింటే మందుకని అన్నట్లు', 'చక్రవర్తి చేస్తే శృంగారం, చాకలి చేస్తే వ్యభి

చారం' అనే సామెతలు తెలుపుతాయి. రాజులకు రత్నాలమీద, వేశ్యలమీద ఉండే వ్యామోహాన్ని చక్కగా చెప్పే సామెతలు 'రాజుల సొమ్ము రాళ్లపాలూ లంజల పాలూ' (కార్. 2758), 'రాజులసొమ్ము రాళ్లపాలూ సానిదాని సొమ్ము అగసాళ్ల పాలు' (శ్రీపాద) అనేవి. బహుభార్యాత్వం ఉన్న రాజులకు పిల్లనిస్తే ఆమె సుఖ పడేది ఏమీలేదని పిల్ల తల్లిదండ్రుల పలుకులు 'రాజుకు పిల్లనిస్తే రాళ్లకిచ్చినట్లే' అనేవి.

కావ్యాలివ్వని రాజును పండితులు నిందించినసామెత 'అతిలోభి రాజుకు అడ గనివాడే పండితుడు' అనేది. రాజుల చిత్తం చంచలమని 'దొరల చిత్తం చెట్ల నీడ-నిలుకడ లేనివి' అనే సామెత, ఒక నిరంకుశుడైన రాజు పోతే అంతకు మించినవాడు వస్తాడని, రాజు ఏంచేసినా అది న్యాయంగా చెలామణి అవుతుందని, రాజు ప్రజలనుంచి సదా ధనాన్ని కోరుతూనే ఉంటాడని 'తలదన్నేవాడు పోతే తాడి తన్నేవాడు వస్తాడు', 'గొఱ్ఱెను తినేవాడు పోతే బఱ్ఱెను తినేవాడు వచ్చినట్లు', 'రాజు కత్తికి రెండు వైపులా వాదరే', 'రాజు చేసిన కార్యాలకు, రాముడు చేసిన కార్యా లకు ఎన్నికలేదు', 'కోమటి ఏవేళ క్షేమమే కోరును, ధారుణీపతి ధనము గోరు' అనే సామెతలు వుటంకిస్తాయి.

స్థాన భ్రష్టుడైతే రాజుకూడా రాణించడని 'ఒకూరి రాజు ఒకూరి బారిక' (ప.ప.) 'ఆ ఊరి దొర ఈ ఊరికి తలారి' అనే సామెతలు తెలుపుతాయి. కష్టాల్లో ఉన్న రాజును అంటిపెట్టుకొన్న నమ్మకస్థులైన ఉద్యోగులకు, రాజు మళ్లీ రాజ్యం సంపాదించుకొన్నప్పుడు కృతజ్ఞతతో ఉన్నతపదవుల్ని ఇస్తాడని 'మిగిలినసున్నాన్ని, నొగిలిన రాజును వదలరాదు' (కార్. 2542) అనే సామెత చెపుతున్నది.

రాజు క్రూరుడని, రాబందు, పాములతో సరిపోల్చతగినవాడని, రాజుతో పగ సహించరానిదని ప్రజలనమ్మకం. 'రాబందుకూ రాజుకూ తేడా లేదు', 'రాజు చెలిమి పాము చెలిమి వంటిది', 'రాజుకు కంటను, పాముకు పంటను విషము', 'పేదవాని స్నేహం మహారాజు విరోధం సహింప రానివి' అనే సామెతలు పై విష యాల్ని తెలిపేవి.

రాజు బాలుడైతే రాజ్యాన్ని సరిగా ఏలలేడని 'బహునాయకము, బాల నాయ కము, స్త్రీ నాయకము' (చెరుపు) అనే సామెత సూచిస్తుంది. వంశపారంపర్యంగా రాజత్వం వస్తుంది. బాలుడైనా రాజుకొడుకైతే మంత్రులు, ఇతర రాజోద్యోగులు సింహాసనంమీద కూర్చోపెడతారు. ఈ రాజోద్యోగులు ప్రజలపై నిరంకుశ పెత్తనం చెలాయిస్తారు అని కూడ ఈ సామెత చెపుతుంది.

రాజునుబట్టే ప్రజల్లో న్యాయ ధర్మాలుంటాయని, రాజు న్యాయం తప్పితే అసహాయులైన ప్రజలు ఏమీ చేయలేరని, రాజు నీతి తప్పితే రాజ్యంలో ఈతి బాధలు తప్పవని చెప్పే సామెతలు 'రాజు ఎంతో ధర్మమంతే' (కార్. 1859), 'భూమికి రాజు న్యాయంతప్పితే గ్రామమువారందరు యేమి చెయ్యగలరు' (కార్. 1648), 'రాజు నీతి తప్పితే నేల సారం తప్పుతుంది' అనేవి.

ప్రజల అండ రాజుకుండాలని, కాని ప్రజలకష్టాల్ని ఆదుకొనే రాజులు అరుదని, కాపులు కష్టపడి రాజుకు సంపదలిస్తున్నారని 'ప్రజలమాటే ప్రభువు కోట', 'ఎండిన ఊళ్లగోడు ఎవరికి కావాలి, పండిన ఊళ్లకు అందఱూ ప్రభువులే', 'ఎవ రేలితేనేమి, వడ్లు దంచక బియ్యం రావు', 'కాపులకష్టం భూపులసంపద' అనే సామెతలు విశదీకరిస్తాయి. ప్రజలకు పరిపాలనలో ప్రమేయం లేదని, రాజ్యం ఎవ రేలినా వారి స్థితిగతులు మారవని, పై సామెతలద్వారా మనం తెలుసుకోవచ్చు. ప్రజలకు రాజుల భోగభాగ్యాలు నోట్లో నీళ్లూరించేవి కాబట్టే 'నెల తక్కువైనా రాజులింట పుట్టాలన్నారు' అనే సామెత ప్రజల నాలుకలమీద ఆడుతున్నది.

విక్రమార్కుడు, వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు, మలరాజు, మాణిక్యరాజు, ఆనంద మహారాజుల ప్రస్తావన సామెతల్లో వుంది. 'విక్రమార్కుని వంటి రాజు ఉంటే భట్టివంటి మంత్రి అప్పుడే ఉంటాడు', 'వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తులా భారం తూగితే కరెడ్లకామక్క వంకాయలభారం తూగిందట', 'అటునుంచి నరుక్కు రమ్మన్నారు', 'మలరాజుగారింట భోజనము, మాణిక్యరాజుగారింట పడకానట' (గృ. ల. 13), 'మలరాజింటికి మనుమడగబోతే మరొక చెంపన వాయించారట', 'ఆనంద మహారాజును ఎఱిగినవారికి అగ్రహారం ఉండబోదు' అనేవి పై రాజుల ప్రస్తావన కలిగి ఉండే సామెతలు. వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు వందమంది దొంగల్ని పట్టి వరుసగా నిలబెట్టి నరికిస్తుండగా, ఒక చివరుండేవాడు 'అటు వైపు నుంచి నరుక్కురమ్మన్నాడు' అట. అటువైపునుంచి అందర్నీ నరుక్కుంటూ వచ్చి ఈ చివరివాణ్ణి కూడ నరికేశారని ఐతిహ్యం. అటునుంచి కొంతమందిని నరికిం తర్వాత రాజు జాలిపడి వదిలేస్తే తను బతికిపోతానని ఆ మాటలన్న దొంగ ఆశ నిరాశయింది.

ఆంగ్లేయులపరిపాలనలో రాజులు పేరుకు రాజులేగాని, వారి ఆడంబరాలకు సరిపోయే ధనం మిగిలేదికాదు. ఆవిషయాల్ని 'మహారాజులమే గాని పొయ్యిరాజడు' 'ఇంట్లో ఈగలమోత బయట పల్లకీలమోత', 'రాజ్యాలు ఉడిగినా లక్షణాలు

పోలేదు', 'చేసేవి నాయకాలు అడిగేవి తిరిపాలు పెట్టకుంటే కోపాలు', 'పొగాకు అడుక్కోవాల అందలం బయటపెట్టరా అన్నట్లు', 'ఆదివారం అందల మెక్కనూ లేదు, సోమవారం జోలే కట్టనూ లేదు.' అనే సామెతలు పూస గుచ్చినట్లు చెపుతాయి.

3.6.2 రాణివాసం(19) : రాజులబహుభార్యాత్వాన్ని,సామాన్యకుటుంబంలోనుంచి వచ్చిన స్త్రీ రాణిఅయిం తర్వాత చూపించే అహంకారాన్ని, తొత్తు దొరసాని కాబోదని సామెతలంటున్నాయి. 'రాజులకు పిల్లనిస్తే రాళ్లకిచ్చినట్లే', 'వంకరటింకరకాయలు ఏమిటంటే చిన్ననాడు అమ్మిన చింతకాయలు అన్నట్లు', 'ఇత్తడి పుత్తడికాదు తొత్తు దొరసానికాదు' అనేవి పై విషయాల్ని చెప్పేవి. ఒకర్ని పొగిడితే తత్సంబంధులైన ఇతరుల్ని నిందించినట్లే అవుతుందని చెప్పే సామెత. 'రాజుగారి పెద్ద భార్య పతివ్రత అన్నట్లు' అనేది. ఈమాటలంటూనే రాజుగారి చిన్న భార్య పతివ్రత కాదని రెండవ అర్థం వస్తుందని చెపుతారు. దొరసానే కష్టాల్లో ఉంటే దాసీలకు భోగాలుండవు అని 'దొరసానికి వల్లె దొరకకపోతే తొత్తుకు తొగరు చీరా' అనే సామెత, ఉన్నవారిని ఈర్ష్యతో అనుకరించి పేదలు హాస్యాస్పదమయ్యే సందర్భాలకు 'రాజుగారి భార్య మేడ యెక్కితే కుమ్మరివారి కోడలు గుడిశె యెక్కినది' (కార్.857). 'వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు తులాభారం తూగితే కరెడ్ల కాముక్క వంకాయల భారం తూగిందట' అనే సామెతలు సాక్షులు.

3.6.3 నగరి-దివాణం (9) : నగరి, దివాణం చుట్టుప్రక్కలకు పోయేందుకే ప్రజలు జంకేవారు. పులికన్నా నగరివారు క్రూరులని, నగరి కొలువుచేయడం కష్టమని, కొలువుకన్నా బిక్షమెత్తడం మేలని, ఎంత నమ్మకంగా కొలువుచేసినా మన్నన ఉండదని సామెతలు చెప్తున్నాయి. 'మింటికన్నా పొడవు నగరికన్న ఛాష్టీకం లేవు', 'పెద్దపులి తరిమినా దేవిడీముందుకు పోరాదు', 'తెల్ల గుఱ్ఱపు శాడవ నగరికొలువు కష్టము', 'కొలువుకన్నా గోషాలమే నయను', 'పీనుగకు చేసిన శృంగారం నగిరికి చేసిన కొలువు' అనేవి పై విషయాల్ని స్పష్టపరుస్తున్నాయి.

రాజాస్థానం ముందుగా వెళ్లేందుకు ప్రజలు భయపడేవారని 'పెద్దపులి తరుముక వచ్చినా హజారము ముందరికి పోరాదు' (కార్.1524), 'సర్కారుకు చాటుగా ఉండాలి, షావుకారుకు ఎదురుగా ఉండాలి' అనే సామెతలు తెలుపుతాయి. రాజు బలవంతుడు కాకపోతే రాజాస్థానం అరాచకంగా వుండేదని 'దిక్కు లేని దివాణంగా వున్నది' (కార్. 1158) అనే సామెత చెపుతుంది, రాజసభ ప్రజలకు న్యాయం

చేయలేనప్పుడు పై సామెతను, 'దివాణంలో దిక్కులేదు అంబటికి ఉప్పులేదు' అనే సామెతను ప్రజలు చెప్పుకొనేవారు.

3.6.4 కోట-పేట (14) : శాఖానగరం పేట. కోట పెద్దదిగా కట్టుకోవాలని, 'భయానికి తగిన కోట కట్టుకోవలె' అనే సామెత తెలుపుతుంది. 'పేటకు పోయిన సొమ్ము కాటికి పోయిన పీనుగ తిరిగి రావు' (సా) అనేది ప్రజలకు అనుభవైక వేద్యం. పేటకు కోట శృంగారం అని, కోట చక్కదనాన్ని గమిడి చెప్తుందని, గూఢచారులు కోళ్ల బేరానికెళ్లి కోట రహస్యాల్ని రాబట్టేందుకు ప్రయత్నించే వారని, రాజు ఓడిపోయినప్పుడో, కోట వదిలిపెట్టి యుద్ధానికి పోయినప్పుడో కోటను దొంగలు కొల్లగొట్టేవారని సామెతలు వివరిస్తున్నాయి. 'మాటకు మాట శృంగారం, పేటకు కోట శృంగారం', 'కోట చక్కదనం గమిడి చెప్పినట్లు', 'కోళ్లబేరానికి వెళ్లి కోటలో కబుర్లడిగినట్లు', 'కోటలో కొల్ల వంకధారలో పోయినది' అనేవి ఆ సామెతలు. కొన్ని రాజ్యాల్లో న్యాయంకూడా అన్యాయంగా పరిగణించబడే దన డానికి 'అన్యాయపురిలో ఆలూమొగుడికి రంకు' (కార్. 79) అనే సామెత సజీవ సాక్షి.

3.6.5 రాజప్రతినిధులు : స్థానిక నాయకులుగా కాకతీయుల కాలంనుంచి పాలెగాండ్రు వుండేవారు. శత్రురాజులనుంచి పొలిమేరల్ని రక్షించడం. రాజుకు అవసరం వచ్చినప్పుడు సైన్యాల్ని పంపడం పాలెగాండ్ర పని. పూర్వం రాజులు సామాన్యంగా బ్రాహ్మణులేన్ని మంత్రులుగా నియమించుకొనేవారు. పాలెగాండ్లు ఈ సాంప్రదాయాన్ని పాటించేవారు గాదని 'నారగంటి పాళెగాడికి మంగలి చెంగడు మంత్రంట' (చంద్ర) అనే సామెత తెలుపుతుంది. నారగంటిపాళెం చిత్తూరు మండలంలోది.

3.6.6 రాజోద్యోగులు (16) : రాజోద్యోగుల్లో మంత్రి మొదటివాడు. మంత్రాలోచనకు ప్రతిరాజు మంత్రి మీదనే ఆధారపడేవాడు. రాజుకు గుండెబలం, మంత్రికి బుద్ధిబలం ఉండాలని 'ధైర్యం లేని రాజు యోచనలేని మంత్రి' అనే సామెత; రాజును బట్టే మంత్రీ, పరివారమూ ఉంటారని, రాజ్యం అందువల్ల అల్లకల్లోల మవుతుందని 'అకటావికటపు రాజు అవివేకపు ప్రధాని చాదస్తపు పరివారము' అనే సామెత చెపుతున్నాయి. అధికారబలంతో మంత్రులు ప్రజల్ని పీడించేవారని 'రాజు కిద్దరు మంత్రులు, ఒకని పేరు లంచాలు, రెండవవాని పేరు మంచాలు' (తె. సా. పీఠిక, పు. 37) అనే సామెత నిరూపిస్తుంది.

పోలీసు అధికారి కొత్వాలు ఆజ్ఞ ఊరిలో అడ్డులేకుండా చెల్లుతుందని వ్యంగ్యంగా చెప్పే సామెత 'అడవినక్కకు కొత్వాలు ఆజ్ఞా' అనేది.

రాత్రివేళ గ్రామాల్లో దివిటీలతో గస్తీ తిరగడం, అపరాధులను పట్టుకోవడం తలార్లపని. నాటి గ్రామాల్లో పోలీసు తలారి 'దూరబోయి తలారి ఇంట్లో దూరినట్లు', 'తలారి పగ తలతో తీరును' అనే సామెతలు తలారి ఉద్యోగ ధర్మాన్ని తెలిపేవి.

ఊరి కావలావ్యక్తి నిగాదారుడు. 'నిగాదారుని పెళ్లాం నీళ్లకొస్తుంది సావిట్లో వాళ్ల చాటుకు జరగండి అన్నదట' అనే సామెతలో నిగాదారుడు పల్లె ప్రజలపై పెత్తనం చూపిస్తుండేవాడని, అతని అధికారం ఆధారంగా అతని పెళ్లాం అహం పెంచుకొనేదనే విషయాలు తెలుస్తాయి.

ప్రభుత్వాజ్ఞల్ని గ్రామాల్లో అమలుపరిచేవాడు అమలుదారుడు. దొరతనం వారికియ్యవలసిన ధనాన్ని రాబట్టే అధికారి పారుపత్తెందారు. వ్యాపార వస్తువుల మీద పన్ను వసూలుచేసేవాడు సుంకరి. 'అరవై ఊళ్ళకు అములుదారుడు కూడ ఆలికి దాసుడే' అనే సామెత ప్రజలకు అములుదారుడు తెచ్చే ఆజ్ఞలు తిరుగులేనివని చెపుతుంది. 'పన్నెండూండ్ల పారు పత్తెంగాడికి పనితీరికే ఉండదు', 'సుంకర మోటుకు మాట నిలుకడ లేదు', 'సుంకరివద్ద సుఖ దుఃఖాలు చెప్పుకొన్నట్లు' అనే సామెతల్లో పారుపత్తెందారు, సుంకర్ల విషయం ప్రస్తావించబడింది. సుంకరులు దుర్మార్గులని భద్ర భూపాలుడు నీతిశాస్త్రముక్తావళి 151 పద్యంలో చెప్పాడు. (ఆం. సా. చ. పు. 100) సుంకరి వద్ద సుఖదుఃఖాలు చెప్పుకొన్నా ప్రయోజనంలేదని పై సామెత అభిప్రాయం.

హర్కారాలు అంటే వార్తాహరులు. ఆపస్తంభులు. ఆశ్వలాయనులు బ్రాహ్మణుల్లో రెండు శాఖలు. 'ఆపస్తంభులా, ఆశ్వలాయనులా అంటే ఆపస్తంభులమూ గాము, ఆశ్వలాయనులమూగాము, అప్పారావుగారి హర్కారాలము అన్నారట' అనే సామెత హర్కారాలను గురించి చెప్పేది.

ఉద్యోగికి జీతంవుండాలి. గోలుకొండ ఉద్యోగం ఎదుగూ బొదుగూలేనిది. ఆ విషయాల్ని 'గ్రాసములేని కొలువు, జీతములేని పని చక్కగా చేయబడవు' 'గ్రాసంలేని కొలువు, రసంలేని కావ్యము', 'గ్రాసంలేని కొలువు మీసంలేని బ్రతుకు', 'గోలుకొండ ఉద్యోగం గొఱ్ఱె తోక ఒకటి' అనే సామెతలు అభివ్యక్తంచేస్తాయి.

3.6.7 రాజసేవకులు (5) : **రాజు వెంట భటుడు తప్పనిసరిగా వుండాలని,**

రాజసేవకుల్లో కొంతమంది పనిదొంగలని 'భటుడు వెంట లేక ప్రభుడు శోభింపడు' 'ఒక రాజుకు ముగ్గురు సేవకులు. ఒకడు పిలిస్తే పలుకనివాడు. ఇంకొకడు స్తంభం చాటుగాడు, మరొకడు అదే పోతగాడు' అనే సామెతలు తెలుపుతున్నాయి.

3.6.8 సైన్యం (44): సైన్యాధిపతి, జెట్టీలు, బంట్లు, ఫౌజులు, గుర్రాలు, ఆయుధాలు సైన్యానికి సంబంధించినవి. సేనాధిపతి దళవాయి. సేనాధిపతిలేకపోతే సేన సరిగా యుద్ధంచేయదు. ఈ విషయాల్ని 'రండ రాజుకు గొండడు దళవాయి', 'దొరలేని మూకలు' (కార్. 2410) అనేసామెతలు తెలుపుతాయి. 'నూఱుగుఱ్ఱాలకు అధికారి ఇంట భార్యకు ఎందు పూరి' అనేసామెత ఒక ఆలిదాసుణ్ణి హేళనచేసేది.

భటులను, సిపాయిలను జెట్టీలనేవారు. వారికి ప్రత్యేక వస్త్రధారణ ఉన్నట్లు 'జట్టి అలంకరించుకొనే వరకు కోటలో గుండు (శత్రువుల ఫిరంగి గుండు) పడె' (ఆం సా. చ పు 181) అనే సామెత తెలుపుతుంది.

సైన్యం వరుసను ఫౌజు అంటారు. ఎక్కువ మంది భటులుంటే తప్ప ఫౌజులుగా విభజించే వీలులేదు. ఆ విషయాన్ని భంగ్యంతరంగా 'ఆరుగురు బంట్లు మూడు ఫౌజులు' అనే సామెత తెలుపుతుంది. అతిథులకు మంచాలు వాల్చి కూర్చో మనడం ఆతిథ్య చిహ్నం. అధికసంఖ్యలో ఉండే సైనికులకు అలాటి మర్యాద చేయలేము అని 'దండుకు మంచం వాల్చగలమా' అనే సామెత అంటున్నది.

జీతానికుండే బంట్లుగాక, అవసరార్థం కూలికి బంట్లను రాజులు నియమించు కొనేవారు అనే సంగతిని 'కూలి బంటు కొక మాలబంటు మాలబంటుకొక మదే బంటు' (నర) అనే సామెత చెపుతున్నది.

బంటుకు ఉండాల్సింది రోషం, శౌర్యం. అవి లేనప్పుడు వారి ఆయుధాలు 'చూపుడు కత్తులే' అవుతాయి. ఆ విషయాల్ని 'రోసంలేని బంటుకు మోసంలేదు', 'సాహసంలేని వాడికి కత్తి సరిగా తెగదు', 'రతిలో సిగ్గు, రణములో భీతి కొర గావు' అనే సామెతలు సూచిస్తాయి.

సైన్యంలో గుర్రాల అవసరం ఎంతోవుంది. సైన్యంలో అశ్వాలకు కందకం దాటేది నేర్పిస్తారు. యుద్ధసమయంలో కొన్నిటిని అద్దెకు తీసుకొనేవారు కూడా. ఆ గుర్రాలకు ఆశ్విక బలంలోని వాటంత నైపుణ్యం ఎలా వుంటుంది? ఆ విష యాన్ని 'అద్దెకు వచ్చిన గుఱ్ఱాలు అగడ్తలు దాటుతవా' అనే సామెత అభివ్యక్తం చేస్తుంది.

యుద్ధం రాకముందే ఆయుధాలు సిద్ధంచేసుకొని వుండాలి. తుపాకికి మందు

గుండు అవసరం. 'ఒక ఆయుధంనుంచి అంతకన్నా శక్తివంతమైన మరో ఆయుధం తయారవుతుంటుంది. ఈసంగతుల్ని 'లడాయి వచ్చినప్పుడా కత్తులు చేసుకోవడం', 'మందూలేదు గుండూలేదు తుపాకిపట్టుక కాల్చుమన్నట్లు', 'తుపాకి కడుపున ఫిరంగి పుట్టినట్లు' అనే సామెతలు చక్కగా తెలుపుతాయి.

3.6.9 అధికారం (50) : అధికారంలోకి వస్తూనే మంచి మనిషైనా మారి పోతాడని, అధికారి కఠినంగా వ్యవహరించాలని, అధికారంపోయిన తర్వాత ఎవరూ పలకరించరని, ఒక్కొసారి అధికారికన్నా సేవకుడే పటాటోపంగా వుంటాడని, అధికారి తను విన్నమాటలను బట్టే న్యాయ నిర్ణయం చేస్తుంటాడని, అధికారికి విన యంగా ఉండక తప్పదని సామెతలు చెపుతున్నాయి.

'మనిషి మంచి చెడ్డలు తెలుసుకోవాలంటే అతనిని అధికార పీఠంలో పెట్టాలి', 'ముదిత చను మెత్తనైనా అధికారం మెత్తనైనా రోతురు', 'అధి కారాంతమునందు చూడవలెగా అయయ్య సౌభాగ్యముల్', 'అధికారి అరుమూర బంటు పదిమూర', 'అధికారికి చెవులుంటాయిగాని కళ్లుండవు' 'కాలితో చూపితే తలతో చెయ్యవలెను' (కార్. 599) అనేవి పై విషయాల్ని తెలిపేవి. నీచునికి అధికార మిస్తే ప్రజల్ని కష్టపెడతాడని 'దౌలత్తున దిరిగినా గులాము గులామే' అనే సామెత తెలుపుతుంది.

బాలులకు, నీచులకు పెత్తనమీరాదని, కొంతమంది తమకున్న అధికారం కన్నా ఎక్కువ అధికారాన్ని చెలాయిస్తారని, తమంతకు తామే పెత్తనంమీద వేసు కుంటారని, నోరుంటే తప్ప పెత్తనం సాగదని చెప్పే సామెతలు: 'పిల్ల పెత్తనం పల్లెటూరి సావాసం', 'గొద్దెకు పెత్తనమిస్తే గోదావరంతా తేలియాడిందట', 'ఎక్క డిదిరా ఈ పెత్తనం అంటే మూలనుంటే నెత్తిన వేసుకున్నానన్నాడట', 'నెత్తిన నోరుంటే పెత్తనం సాగుతుంది' అనేవి.

జీతం తక్కువైనా ఆర్భాటంగా ఉండేవాళ్ళి 'ఈ సంబడానికేనా ఇంత ఆర్భాటం', 'ఈ సంబరానికేనా ఇంత వగిరింపు' అనే సామెతల్తో పరిహసించడం కద్దు. జోడు కాగడాలు వెలిగించుకోవడం అధికార చిహ్నం. 'నీకు జోడు కాగడా లెవరిచ్చారంటే నా ఆముదపు చేను ఇచ్చింది అన్నాడట' (క.గా.పు. 976) అనే సామెత పై విషయాన్ని సూచించేది.

అధికారంవుండేవాడు బలవంతుడు. బలవంతునికి అందరూ భయపడతారు. బలవంతుని చేతి పచ్చిగడ్డయినా ఆయుధమేనని, బలవంతుని చేయిపడితే ఫ్రీకి చావో,

శరణమో ఏదో వొకటి గతి అని, బలవంతుని ఇంట బానిసనైనా ఎవరూ ఏమీ చేయలేరని సామెతలు చెప్తున్నాయి. 'బలవంతునికి పచ్చి గడ్డే ఆయుధము' (సా. సా. 347), 'బలవంతుని చేయిపడితే బావి అయినా చూచుకోవాలి, చంక అయినా చేరాలి', 'బలవంతునింట బానిసనైనా చెరుప వెరుతురు' అనేవి పై విషయాల్ని తెలిపేవి. కామందువద్ద సేవకుడు పడేబాధను 'పైన మంట కింద మంట. కడుపులో మంట. కాలు నిలిపితే కామందు తంట' అనే సామెత వెళ్ళగక్కుతున్నది.

అధికారం వస్తే సిరి అబ్బుతుంది. సిరి అహాన్ని పెంచుతుంది. ధనికులు ఒకరికొకరు సహాయం చేసుకొంటారు. పేదవాడు ధనికులైన ఉద్యోగులకు, రాజుకు కానుకలివ్వాల్సి వుంటుంది. (నైజాంనవాబు ఇంట్లో పెండ్లి జరిగితే ప్రజలను ఆహ్వానించేవాడని, ప్రజలంతా కానుకలు తెచ్చేవారని, ఎంతోధనం సమకూడేదని అంటుంటారు. 'ఉన్నవాడు ఉన్నవాడికే పెట్టును, లేనివాడు ఉన్నవాడికే పెట్టును' అనే సామెత పై విషయాన్ని తెలిపేది 'నదమంత్రపు సిరి నరముమీది పుండు భరింపరానివి'. 'చీపురు కట్టకు సిరివస్తె కోడి ఈకతో గొడుగు పట్టేనట' (హై. సా. III-8) 'చీరపోతుకు సిరి వస్తే గోలకొండకాడికి గొడుగు పట్టమన్నాడట', 'కొత్త కలిమిసేవ కత్తిమీద సాము', 'ఎన్నడులేని కల్మిగల్గెనా, వెన్నున కద్దమడుగు, కొనవేళ్లకు ముచ్చెలు దొడుగు' అనే సామెతలు నదమంత్రపు సిరివచ్చినవాని అహంకారానికి నిలువుటద్దం పడతాయి. సేవకుడు గొడుగు పట్టడం అధికార చిహ్నం.

3.6.10 దానాలు-ధర్మ కార్యాలు (8) : వేదవిదులైన బ్రాహ్మణులకు స్వల్పమైన పన్నుతో ఇచ్చే మాన్యం శ్రోత్రియం. పన్నులేకుండా ఇచ్చేది మాన్యం. శ్రోత్రియం. మాన్యాలివ్వడం, సత్రాలు. చలిపేంద్రలు పెట్టించడం రాజులు-రాజోద్యోగులు చేసేవారు. వాటి విషయం సామెతల్లో చెప్పబడింది. 'పుంజులూరు శ్రోత్రియందారు' అనే సామెత అతడు యతిమతం మనిషి అని చెపుతుంది. 'మాసొమ్ము మాకిచ్చుట మడిమాన్యము లిచ్చుట' (కర్. 2541) అనే సామెత ఇచ్చిన సొమ్ము తిరిగిఇవ్వని వానిని నిలదీసి అడిగేటప్పుడు ఉపయోగించేది.

యాత్రికులకు. బీదలకు ఉచితంగా అన్నంపెట్టే ఏర్పాట్లు సత్రంలోఉంటాయి. అందులో భోంచేసేందుకు ఎవరి అనుజ్ఞ అక్కరలేదు. ఆ విషయాన్ని తెలిపే సామెత 'సత్రం కూటికి సర్కారు సెలవెందుకు' (రా. ప. 651) అనేది. నీళ్ల దొరకనిచోట్ల, ముఖ్యంగా నగరాల్లో, వేసవిలో చలివేంద్రలు ఏర్పాటుచేస్తారు. 'చెరువు ముందు చలివేంద్రయా' అనే సామెత పై విషయాన్ని వ్యక్తంచేస్తుంది.

ప్రజలకు ఉపయోగకరమైన వాటిని ధ్వంసంచేసే ప్రజాకంటకులుంటారని 'చలి వేంద్ర కుండలకు తూట్లు పొడిచినట్లు' అనే సామెత తెలుపుతుంది.

3.6.11 పన్నులు-జరిమానాలు (23) : చేసిన అపరాధానిగ్గాను అపరాధినుంచి అధికారి పుచ్చుకొనే ధనాన్ని 'దండుగ' అంటారు. దివాణానికి పన్ను కొందరు ఎగ వేసేవారని, ద్రోహులసొమ్ము జరిమానాగా దొరలు ఊచముట్టుగా లాగుకునేవారని, తాళ్లపన్ను ఉండేవని, పరుల పొలాల్లో మేసిన పశువులను బందెల దొడ్డికో తోలి, యజమానిచేత బందె వసూలు చేసేవారని సామెతలు తెలుపుతున్నాయి.

'పనిచేయనివాడు ఇంటికి దొంగ, పన్నివ్వనివాడు దివాణానికి దొంగ', 'పాపి సొమ్ము పరులపాలు ద్రోహి సొమ్ము దొరలపాలు', 'మాఢ పన్ను కొలకు మహిషంబు నమ్మితి, మడమనూరి వృత్తి మూల వృత్తి', 'తాగేవాడు తాళ్లపన్ను కడ తాడు', 'రాచవారి పసులకు బంది లేదు', 'దండుగకు రూపాయలు తద్దినానికి కూరలు దొరకకుండ పోవు', 'ధర్మానికి దండుగు లేదు వెట్టికి పైసా లేదు' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి.

నల్లంచి ఒక పక్షి. దురాయి అంటే రాజాజ్ఞ. రాజాజ్ఞను ప్రజలు అడుగు దాటరు అనే విషయాన్ని వ్యంగ్యంగా 'నల్లంచి దురాయి పెట్టితే నిలుస్తుందా' అనే సామెత చెపుతుంది. అట్లే జడపదార్థమైన త్రోవ దొరతనాన్ని లెక్క చేయదని 'త్రోవ దొరతన మెఱుగదు, నిద్ర సుఖమెఱుగదు' అనే సామెత తెలుపుతుంది.

.6.12 తహశ్శీలుదారు, గ్రామాధికార్లు, గ్రామసేవకులు (62) :

తాలూకాలో పన్ను వసూలుచేసే అధికారి తహశ్శీలుదారు. మామూలు అంటే పంట పన్ను. మామూలుదారుడు అంటే పన్ను వసూలు చేసేవాడు. తాశీల్దారుకు రైతు అన్ని సౌకర్యాలు సమకూర్చేవారని వ్యంగ్యంగా 'తవుడు బొక్క తాశీల్దారుడు మీసాలెగబెట్ట మామూల్‌దారుడు' అనే సామెత తెలుపుతున్నది.

గ్రామాధికార్లు రెడ్డి, కరణం. రెడ్డినే పటేలు, బుగత అంటారు. పన్నిద్ద రాయగాండ్లలో రెడ్డి, కరణం, తలారి వున్నారు. సాధారణంగా రెడ్డిది కాపుకులం కరణం నియోగి బ్రాహ్మణుడు.

ప్రజలకు రెడ్డి, కరణాలంటే అంతులేని అపనమ్మకం. పట్టరాని ద్వేషం. ప్రజల్ని వీరు పీడిస్తారు గనుక. రెడ్డికి జీతం ఎక్కువుండదు. అందువల్ల 'దౌలు దస్తు పెండ్లాము పస్తు' గా ఉంటుంది వీరి పరిస్థితి. పల్లెల్లో రెడ్డి అంటే చాలా భయం. 'రెడ్డి వచ్చినాడు మొదటినుంచి పాడుమన్నట్లు' (కార్. 1878), 'రెడ్డొచ్చె మొద

లాడుమన్నట్లు' అనే సామెతలు ఊర్లో ఆట ఆడినా, పాటకచేరి జరిపినా రెడ్డి వచ్చి అనుమతిఇవ్వనిదే మొదలు పెట్టరని, మొదలుపెట్టినా రెడ్డి వస్తే ఆపి మళ్లీ మొదలు పెట్టాల్సిందే అని చెపుతాయి. పల్లెల్లో తగవులు తీర్చేవాడు రెడ్డి అని 'టంగుటూరు పెద్దరెడ్డిని తగవు దీర్చమంటే తనకూ యిద్దరున్నారన్నాడంట' (రా. ప. 323) అనే సామెత తెలుపుతుంది. రెడ్లు ప్రజలకు ఏదో ఒక పని పెడతారని 'పని లేక పటేలు ఇంటికి పోతే గోడకు పూత పెట్టమన్నాడట' అనే సామెత, ఒక గ్రామం రెడ్డి అధికారం ఆ గ్రామంలోనేగాని ప్రక్క గ్రామంలో చెల్లదనేందుకు 'ఒక ఊరి రెడ్డి ఇంకొక ఊరికి పసుల పోలుగాడు' అనే సామెత సాక్షులు, రెడ్డి, కరణం లేని ఊళ్లో చాకలివాడే పెద్ద' (రా.ప.763) అనే సామెత అధికార్లు లేనపుడు సామాన్య ప్రజలే అధికారం చెలాయిస్తారంటున్నది. బుగత యింట్లో పెళ్లి అయితే అందరికీ పనులు పెడతారని 'బుగతోరింట్లో పెళ్లి బుగ్గలు తిప్పుకు మల్లి' అనే సామెత తెలుపుతుంది. 'రెడ్డధికారియైన గ్రామ రైతుల జెరచున్' (ఆం. సా. చ. పు. 355) అనే సామెత రైతులకు రెడ్డి మీదవుండే అపనమ్మకాన్ని తెలిపేది.

గ్రామాలలో పొలాలకు, పన్నులకు సంబంధించిన లెక్కలు రాసేవాడు కరణం. కరణం, కాపు కలిసి ప్రజల్ని ఏడిపిస్తారని నిరూపించే సామెతలు: 'కరణానికీ కాపుకే జత, ఉలికీ గూటానికీ జత', 'కరణాలు కాపులు ఏకమైతే కాకులు గూడ ఎగరవు' అనేవి.

కరణాన్ని కాటికి పోయినా నమ్మరాదు అనే సామెతకు దృష్టాంతం 'దోమాడ కరణంలాగా చచ్చి సాధించాడు' (శండిల) అనేది. దోమాడ కరణం మరణిస్తూ ఆ ఊరి హిందువులతో ప్రక్క ఊరి పొలిమేరలో తన్ను కాల్చమన్నాడట. వారు అలాగే చేస్తుండగా ఆ ఊరి మహమ్మదీయులు వచ్చి పోట్లాడారట. అందుకే 'దోమాడ కరణం చచ్చి సాధించినాడు' అనే సామెత పుట్టింది.

కరణం సాధువు కాదని 'కరణం సాధుగాదు, కాకి తెలుపు లేదు' అనే సామెత, గ్రామంమీద నూరు వరహాలు దండుగను విధించినా కరణంమీద కాను కూడాపడదని-గ్రామంమీద దండుగ రాజుతో వేయించేది కరణమే కాబట్టి- 'ఊరు మీద నూరు పడ్డా కరణం మీద కానుపడదు' (కార్.354) అనే సామెత, కరణాలు లంచగొండులని 'మేత కరణమే గాని కూత కరణంగాదు' అనే సామెత చెపుతున్నాయి. లెక్కలు వ్రాయగా వ్రాయగా కరణం నైపుణ్యం పెరుగుతుంటుందని 'వ్రాయగా వ్రాయగా కరణము, దగ్గగా దగ్గగా మరణము' అనే సామెత, కరణం

ఫిర్యాదు చేస్తే పెద్ద ఆపదైనా వస్తుంది, లేకపోతే ఏమీకాదని 'కరణం గంటమెత్తితే కంఠానికి రావాలి, లేకుంటే కంఠానికి రాదు' అనే సామెత, డబ్బులు అవసరం వచ్చినపుడు కరణం పాతకవిలె బయటికి తీసి ఎవరిమీద ఏ జరిమానా వేయాలి అని ఆలోచిస్తాడని 'ఆకలిగొన్న కరణం పాతకవిలె బయటికి తీశాడట' అనే సామెత తెలుపుతున్నాయి.

కరణంతో విరోధపడితే రైతుకు సేద్యం సాగదని 'కరణంతో కంటుపడితే కాడి కదలదు' అనే సామెత, ప్రజల నిందలకు కరణం ఏమాత్రం జంకడని 'తిట్టుకు భయపడే కరణం ముట్టుకు భయపడే మడివేలు ఉండరు' (రా. ప. 342) అనే సామెత, తన ఊరిలో పెత్తనం చెలాయించే కరణం ప్రక్క ఊరి ప్రజలకు కాగితం పులి అని 'ఒకఊరు కరణం ఒకఊరి వెట్టి' అనే సామెత వివరిస్తాయి.

బంట్రోతు, వెట్టి గ్రామ సేవకులు. 'దొరే దొంగయితే బంట్రోతు కన్నగాడగును', 'డబ్బు దస్కం లేదుగాని డవాలు బంట్రోతు' అనే సామెతలు బంట్రోతుకు సంబంధించినవి. 'వేడి నీళ్లకు వెట్టి మూటకు వెనకకు పోగూడదు' అనే సామెత వెట్టిని గురించి చెప్పినది. (వెట్టిని గురించిన మరిన్ని వివరాలకు చూ. తెలుగు సామెతలు-కులం).

**3.6.13 న్యాయం-న్యాయస్థానాలు (24) :** విజయనగర సామ్రాజ్య కాలంలో గ్రామాల్లో పంచాయతీ సభలుండేవి. గ్రామతలారే పోలీసు. న్యాయస్థానాలు పంచాయతీ సభలు. అన్నిటికన్నా పై న్యాయస్థానం రాజాస్థానం. అపరాధి మంచిగా నేరాన్ని ఒప్పుకోకపోతే పంచాయతీముందు హాజరుపర్చి నేరాన్ని ఒప్పించేవారని 'రచ్చబల్ల కాడకు పిలిస్తేగాని రాజీకి రారు' అనే సామెత చెపుతుంది. గ్రామంలో పంచాయతీ చేసే స్థలం చావడి. చావడిలో ప్రజలు పత్రాలు రాసుకొనేవారు. నిరక్షరాస్యులు వేలికి కందెన పూసుకొని ముద్రవేసేందుకు బోద పుల్లల్తో కందెన తెచ్చుకొనేవారు. ఆ విషయాన్ని 'చావడిముందటి కొంప కదపా పుల్లలకు సరి' అనే సామెత తెలుపుతుంది.

శిక్షల్లో ఉరిశిక్షకు మించింది లేదు. 'తలకు మించిన ఆజ్ఞలేదు' (కార్.1000) అని సామెత. మరణదండనను తెలిపే మరోసామెత 'గాడిదను చంపి గల్లుకు పోయినట్లు' (నర) అనేది. ఇక్కడ గాడిద అంటే నీచుడని వ్యంగ్యార్థం. అపరాధులకు 'మెడకు బెండు కాలికి గుండు' (నర) వేసేవారని తెలుస్తున్నది. 'ఉల్లిగడ్డలు కట్టు

కొని ఊరేగినట్లు' (రా. ప. 671) అనే సామెత ఉల్లిగడ్డల్తో ఊరేగించడం అవమానకరమైన శిక్ష అని తెలుపుతుంది.

ఆంగ్లేయులకాలంలో కోర్టులు ఏర్పడ్డాయి. కోర్టుకుపోయిన వాది, ప్రతివాదులిద్దరూ నష్టపడతారని, సాక్షులు, ప్లీడర్లు మాత్రం బాగుపడుతారని, వ్యాజ్యానికి కోర్టుఖర్చులు తడిసిమోపెడవుతాయని సామెతలు చెపుతున్నాయి. 'దారిన పొయ్యే వ్యాజ్యం కొని తెచ్చుకొన్నట్లు' (కార్. 1151), కోర్టుకెక్కినవాడు గాడిద నెక్కినవాడు ఒకటే' (తె. సా. పీఠిక పు. 7), 'కోర్టుకు పోతివా కొల్ల బోతివా' (నర), 'కోర్టుకెక్కి గెలిచినవాడు ఇంట్లో ఏడిస్తే ఓడినవాడు వీధిలో ఏడుస్తాడు' అనే సామెతలు కోర్టుకు పోయినవారి దురవస్థల్ని ప్రతిబింబించేవి.

సాక్షి ప్రతిసారీ అంతో ఇంతో డబ్బు అడగడం మామూలు. డబ్బివ్వక పోతే సాక్ష్యం సరిగా జెప్పకపోవచ్చు. సాక్షి బాధలు పడలేకనే 'సాక్షి కాళ్లు పట్టు కోవడంకన్న వాది కాళ్లు పట్టుకోవడం నయం' అని ప్రతివాది అంగలారుస్తుంటాడు. ప్లీడర్లను దోపిడీదార్లుగాను, పీడించేవారిగాను సామెతలు చిత్రిస్తున్నాయి. 'న్యాయ మమ్ముకవాడు దోవలు దోచువాడు ఒకటి', 'కోర్టుకెక్కినవాడు ఒకడు ఆవుకొమ్మును, ఇంకొకడు తోకను పట్టుకొంటే, మధ్య వకీలు పొదుగు దగ్గర కూర్చుంటాడు' అనే సామెతలు పై విషయాల్ని ప్రతిభావంతంగా చెప్పేవి.

3.6.14. ఈ ఉపప్రకరణంలోవి కొన్ని ముఖ్యాంశాలు ఇవి: రాజు నిరంకుశుడు. ప్రజలకు పరిపాలనలో ప్రమేయంలేదు.రాజునుంచి ఉపకారం లేదు.అధికారదర్పంతో రాజోద్యోగులు ప్రజల్ని పీడించేవారు. రాజులు యుద్ధాల్లో అద్దెకు గుర్రాల్ని తెచ్చుకొనేవారు. రెడ్డి, కరణం అంటే ప్రజలకు అపనమ్మకం, ద్వేషం. కోర్టుకు పోతే వాది ప్రతివాదు లిద్దరూ నష్టపోతారు. ప్లీడర్లు, సాక్షులు బాగుపడతారు అనేవి.

తెలుగు ప్రజల సంస్కృతి సామెతల్లో ఎలా ప్రతిబింబిస్తున్నదో తర్వాతి ప్రకరణంలో చూద్దాం.



# 4. తెలుగు సామెతలు - సాంస్కృతిక జీవన చిత్రణం

4.0 ఒక జాతిని మరియొక జాతినుంచి వేరుగా నిరూపించే చిహ్నాల్లో ఆ జాతి మత విశ్వాసాలు. వారి ఆచార వ్యవహారాలు, వేషము. భాష, జాతి, నివాసదేశము ముఖ్యమైనవి. (ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి. పుట. 9) విద్య-విజ్ఞానం-కళలు, వినోదాలు,విలాసాలు-ఆటలు, నమ్మకాలు అనే అంశాల్ని పైవాటితో జోడించవచ్చు. అంటే ఈ పై చెప్పబడిన అంశాల సమిష్టి స్వరూపం ఒక జాతి సంస్కృతిగా రూపొంది, ఇంకొక జాతినుంచి ఈ జాతిని వేరు చేస్తున్నదన్నమాట.

సంస్కృతిలో ప్రాముఖ్యమైన మతం, విద్య-వైద్యం-కళలు, వినోద విలాసాలు, ఆటలు, ఆచార వ్యవహారాలు, ప్రజల నమ్మకాలు, వస్త్ర భూషణాలంకరణలు అనే అంశాల్ని వేరువేరు ఉప ప్రకరణాలుగా విభజించి ప్రజల సాంస్కృతిక జీవనాన్ని పరిశీలించడం జరిగింది. పై అంశాల్లో అలౌకిక జీవితానికి సంబంధించినది మతం. ఆచార వ్యవహారాలు, నమ్మకాలు లౌకికా లౌకిక జీవితాల్లో ఉపయోగించేవి. విద్య, వైద్యం, కళలు, వినోద విలాసాలు_ఆటలు, వస్త్ర భూషణాలంకరణలు లౌకిక జీవితానికి చెందినవి.

ఆంధ్రుల వివిధ మతాలు. ఆ మత విశ్వాసాలు ప్రజలపై చూపించిన ప్రభావం, మతకలహాలపై సామాన్యుని అవగాహన, సామెతలు ఆధారంగా 'మతం' అనే ఉప ప్రకరణంలో చర్చించాను.

విద్య అవసరం, విద్యపై ప్రజల అభిప్రాయాలు. గురు శిష్యులసంబంధం, వైద్య విజ్ఞానాన్ని ప్రజలు సామెతల్లో నిక్షిప్తం చేసినతీరు, కళలపై ప్రజలకుగల రప దృష్టి 'విద్య, వైద్యం, కళలు' అనే ఉప ప్రకరణంలో తేటతెల్లం చేయబడ్డాయి.

ప్రజల్లో ఉండే వివిధ మత, కులాచారాలు, వాటి స్వరూప స్వభావాలు, ఆచార వ్యవహారాలు ప్రజలపై చూపే ప్రభావం 'ఆచార వ్యవహారాలు' అనే ఉప ప్రకరణంలో చర్చనీయాంశాలు.

ప్రజల వివిధ నమ్మకాలు-వాటిపై ఆధారపడి వారు తమ ప్రవర్తనను దిద్దుకొనే విధం 'నమ్మకాలు' అనే ఉపప్రకరణంలో తెలుపబడింది.

కాయకష్టంచేసే జానపదులు అంతోఇంతో ఆనందాన్ని, విశ్రాంతిని పొందేది వినోదాలు, విలాసాల్లోనే. పిల్లలకు శారీరక అభివృద్ధిని ఇచ్చేవి ఆటలు. వీటి విషయం 'వినోద విలాసాలు_ఆటలు' అనే ఉపప్రకరణంలో చర్చింపబడింది.

# 4.1 తెలుగు సామెతలు-మతం

4.1 మతం : దేవునకును, మనుజునకును, నిరవధికునకును, సావధికునకును మధ్యగల సంబంధమే మతమనబడుచున్నది.[1] మనుష్యునిలో సహజముగానున్న దేవత్వమును అభివ్యక్తీకరించునది మతము.[2] సత్యసాక్షాత్కారమే మతమను విషయము వేదాంతమందలి ప్రథమ సూత్రము.[3]

ఆత్మయందు దేవునిసాక్షాత్కారము పొందుటయే సమస్తమతముల లక్ష్యము. మతములన్నియు ఆత్మ నిత్యమైనదనియు, దాని స్వతస్సిద్ధమైన తేజస్సు తగ్గినదనియు, ఈశ్వర జ్ఞానముచేత దాని పూర్వపు పరిశుద్ధతను తిరిగి పొందవలసియున్నదనియు బోధించుచున్నవి.

మతం ఒక జాతి సంస్కృతిని సర్వవ్యాప్తము చేయగల శక్తి మంతము. హిందూ, బౌద్ధాలు హైందవసంస్కృతిని దక్షిణేతరదిశలకు వ్యాపింపజేసినవి. ప్రసిద్ధ నాగరికతలన్నీ హిందూ, బౌద్ధ, క్రైస్తవ, ఇస్లాం మతాల చుట్టూ వ్యాపించి ఉండినవే.[4]

1975–76 అంచనాల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో హిందువులు 88% ముస్లింలు 8%, క్రైస్తవులు 4%, సిక్కులు 0.03%, బౌద్ధులు 0.02% ఉన్నారు. (ఆంధ్రప్రదేశ్ అల్మనక్)

4.1.1. తెలుగు సామెతలు – మతం : మత పూజా సంబంధిపీ, ధర్మసంబంధిపీ ఐన తెలుగుసామెతలు 1214 లభించాయి. వైదిక (750), వైష్ణవ (241), శైవ (124), జైన (2), ఇస్లాం (94), క్రైస్తవ (3) మతాలకు సంబంధించిన సామెతలు ఇందులో ఉన్నాయి. మతాన్ని పొగడేవానికన్నా తెగడే సామెతలేఎక్కువ.

4.1.2 హిందూమతం : విదేశీయులు వైదికమతానికి పెట్టిన పేరే హిందూమతం. హిందూమతం క్రీ. పూ. 3000 సం॥ నాటికే ప్రచారంలో ఉంది. క్రీ. శ. 2000 నాటికి ఋగ్వేదం ప్రచారంలో ఉంది. ఋగ్వేదమంత్రాల్లో ఉరుములు-మెరుపుల్తో కూడిన వర్షాన్ని, వాయువును, సూర్యచంద్రులను, నక్షత్రాలను ప్రార్థించినవి ఉన్నాయి. బ్రాహ్మణాల కాలంలో (క్రీ. పూ. 1200 – 1000) బ్రహ్మ ప్రధాన దైవం. ఉపనిషత్తుల కాలంలో (క్రీ. పూ. 800) ఆత్మ-బ్రహ్మముల ప్రసక్తి వచ్చింది. క్రీ. పూ. 500 సం॥కు ముందే జైనమతం, క్రీ. శ. 500 ప్రాంతంలో బౌద్ధమతం వైదికమతంపై తిరుగుబాటుగా పుట్టినవి క్రీ. పూ. 100 – క్రీ.శ. 100 సం॥ మధ్యకాలంలో శివుడు, విష్ణువు ప్రధాన దైవాలుగా ప్రాముఖ్యాన్ని పొందారు.[5]

జొత్తరాహువులైన అంధ్రులతోపాటు వైదికమతం క్రీ. పూ. 600 సం॥ నాటికే తెలుగుదేశంలో ప్రవేశించింది.

(అ) దైవసంబంధి సామెతలు :

దేవుడు : హిందూమతానికి దేవుడొక్కడే. కొందరు శివుడని, కొందరు విష్ణువని పూజిస్తారు. శివుడు, విష్ణువు అనే పేర్లు లేకుండానే 'దేవుడు'గా స్తుతించబడినాడు. తెలుగు సామెతల్లో దేవుని ప్రశంస (69) ఎంతో ఉంది.

అనుకోనిఅదృష్టం వచ్చినప్పుడు 'మ్రొక్కబోయిన దేవుడు యెదురుగా వచ్చినట్లు' (బ్రౌన్. పు. 843) అనే సామెతను, దేవుడే ప్రతి ప్రాణికీ బ్రతుకు తెరువు చూపిస్తాడని 'పుట్టించినవాడు పూరి మేపునా' అనే సామెతను, ఒకలోపం కలుగజేసిన దేవుడు మరోవిధంగా సరిదిద్దుతాడని' 'కండ్లు పోగొట్టిన దేవుడు యిండ్లు చూపక మానడు' (హైసా-1-6), 'కండ్లు చెరిపిన దేవుడు మతి యిచ్చినట్లు' (సాసా. 111) అనే సామెతలు చెప్తున్నాయి. దేవుని అనాధరక్షకత్వాన్ని 'పొట్టి వానినెత్తి పొడుగువాడు కొట్టె పొడుగువానినెత్తి దేవుడు కొట్టె' (హైసాI-17) అనే సామెత సమర్థిస్తుంది. 'దిక్కులేని వారికి దేవుడే దిక్కు' అని ఒక సామెత అభయమిస్తుంది.

దేవుని దయ లేకపోతే పురుషకారం పనిచేయదని, దేవునిదయ పురుష ప్రయత్నం ఉంటేనే కలుగుతుందని, మనిషి తలచిందానికి దేవుడు విరుద్ధంగా తలవొచ్చని, దేవుని దయ ఉంటే ఎంతటిఆపదలైనా పటాపంచలౌతాయని, లేకుంటే చిన్న ఆపదలే పెద్దవవుతాయని సామెతలు చెప్తున్నాయి. 'దేవుడు చిన్నచూపు చూస్తే యెవరేమి చేయవచ్చును?' (బ్రౌన్.పు 387), 'దేవుడిచ్చునేగాని వండి తిని పించునా?' (కార్. 1183) 'పురుషకారం లేక దైవం అనుకూలించదు', 'హోరు గాలిలో దీపంపెట్టి, ఓరి దేవుడా! నీ మాహాత్మ్య మన్నట్లు', 'తాను ఒకటి తలిస్తే దైవం ఇంకొకటి తలిచినట్లు'. 'పులినాకి విడుచు దైవము గలవానిని', 'దైవబలము కలుగనివేళ కలహించి గొట్టె కరచు' అనేవి ఆ సామెతలు.

కపటభక్తులను 'చిత్తం చెప్పులమీద, ధ్యానం దేవునిమీద', 'కట్టె దేవుని దగ్గఱ, కన్ను లంజపైన' అని సామెతలు నిలదీస్తాయి. దేవుని పేరు చెప్పుకొని తినేవార్ని 'దేవుని పెళ్లికి అందరూ పెత్తనగాండ్లే', 'దేవునిది పేరు ఇతరులది నోరు' (బంగోరె) అనే సామెతలు నిరసిస్తాయి. గొప్పవారు చిన్న కానుకలతోనే ఎక్కువ ఫలమిస్తారని, దేవునికి శక్తికొలది సమర్పించడమే చాలునని, 'కొండంత దేవుడికి

గోరంత బెల్లం నైవేద్యం', 'కొండంత దేవుడికి కొండంత పత్రి పెట్టగలమా?' అనే సామెతలు ఓదారుస్తాయి.

కష్టాల్లో దేవునికి ముడుపుకట్టడాన్ని 'దేవుడికి ముడుపు దెయ్యానికి మంత్రము' అనే సామెత, దైవదర్శనానికి దేవునికన్నా పూజారే అడ్డంకి అని 'దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడు' అనే సామెత తెలుపుతాయి. దేవుడు కూడా డబ్బుకు అమ్ముడుపోతున్నాడనే పేద ప్రజల ఆక్రందనను 'డబ్బు ముడ్డిలో దేవుడున్నాడు', 'పైసాలో పరమాత్ముడున్నాడు' అనే సామెతలు వ్యక్తంచేస్తాయి.

**వివిధ దేవతలు:** దేవతల్ని గురించి చెప్పిన సామెతల్లో వినాయకుడు, అగ్ని, యముడు అనే దేవతల ప్రస్తావన ఉంది. పండితులకు ఏదైనా చెప్పబోవడం 'దేవతలకు పంచాంగం చెప్పినట్టు' (ఆం. వి.) అని ఒక సామెత అంటుంది. వినాయకునికి ఉండ్రాళ్ల ప్రియమని. ఆయన విగ్రహాన్ని బెల్లంతోకూడా చేస్తారని, విఘ్నాధిరాజుకే విఘ్నాలుంటాయని తెలిపే సామెతలు 'వినాయకుడి మీది భక్తా? ఉండ్రాళ్ల మీది భక్తా'?. 'బెల్లపుపిళ్లారికి ముడ్డిగిల్లి నైవేద్యంపెట్టినట్లు'?. 'విఘ్నేశ్వరుని పెండ్లికి వేయి విఘ్నాలు' అనేవి. చేతకాని శిల్పం 'వినాయకుని చేయబోయి కోతిని తయారు చేసినట్లు' (సాసా 391) ఉంటుందని సామెత.

యమునికి, మృత్యువుకు సంబంధించిన సామెతల్లో సాహసవంతుడు యమునికి భయపడడని, ఎన్ని పంచాంగాలు చూసినా మృత్యువు ఆసన్నమయ్యేకాలాన్ని నిర్ణయించలేమని, మృత్యువు అనుక్షణమూ పొంచి ఉంటుందని చెప్పే సామెతలు: 'యముడికి శివుడికి వెరువనివాడు', 'మృత్యువు పంచాంగం చూచి పనిచేయదు', 'వస్తావు వస్తావు నా కొరకు. వచ్చి కూర్చున్నాడు నీ కొరకు' అనేవి. చివరి సామెత చేపతో ఎర అన్నమాటలు. ఇంటిముందు కళ్లాపిచల్లి, ముగ్గువేయడాన్ని మతంతో జోడించి 'ముగ్గు వేయనివారిని యముడు జాంబవంతుని వెంట్రుకలు పెరుకబెడతాడట' అనేసామెతలో జానపదులుచెప్పారు. జాంబవంతుడుఎలుగుబంటి.

**గ్రహాలు – గ్రహచారం:** సూర్యుడు. చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు. శని, రాహువు, కేతువు నవగ్రహాలు. ఇందులో కొన్ని క్రూరగ్రహాలు. కొన్ని శుభగ్రహాలు. క్రూరగ్రహాల్లో అంగారకుడు; శని ముఖ్యులు. గ్రహాలు సరిగా చూడకపోతే వ్యక్తికి కష్టనష్టాలు వస్తాయని 'నవగ్రహాలు వక్రించినట్లు' (కార్. 2423). 'గ్రహచారం చాలక రావాలకు పోతే జన్మనక్షత్రం జూచి నెత్తిగొరిగిరట' అనే సామెతలు చెపుతున్నాయి.

శని ఏడేళ్లు పడతాడని, తీర్థయాత్రలుచేసినా, సముద్రందాటినా శనిని తప్పించు కోలేమని, ఎక్కువగా నిద్రవస్తూంటే శనిపట్టినట్లు అని చెప్పే సామెతలు : 'శని బడితే ఏడేళ్లు. నేను పడితే పద్నాలుగేళ్లు' (గృ ల 28), 'ఎక్కడికి పోయినా ఏలిన నాటిశని తప్పదు', 'శని అష్టమాన్నుంటే కాలబెట్టి నేల రాస్తాడు', రామేశ్వరం పోయినా శనేశ్వరం తప్పలేదు','వారాశి దాటినను శని మారకుడై పట్టి చంపు', 'శనేశ్వరానికి నిద్ర ఎక్కువ, దరిద్రానికి ఆకలెక్కువ' అనేవి. ప్రమాదాల్ని కొని తెచ్చుకొనే అవివేకుల మనస్తత్వానికి 'కదగాపోయే శనేశ్వరుడా! మా యింటిదాకా వచ్చి మరీ పొమ్మన్నట్లు' అనే సామెత అద్దం లాంటిది.

సూర్యనమస్కారాలు చేసే ఆచారాన్ని, గొప్పవార్ని అవమానించే వ్యక్తి తనే అవమానం పాలవుతాడని 'కండ్లుపోయిన తర్వాత సూర్యనమస్కారాలా?' 'సూర్యునిమొగాన ఉమ్మేస్తే తనమీదనే పడుతుంది' అనే సామెతలు వివరిస్తాయి.

విదియనాటిచంద్రుని మొదటిగా చూచినపుడు నూలుపోగు అర్పించడం అనే ఆచారాన్ని 'నెల బాలుడికి నూలుపోగు', 'చంద్రునకు నూలుపోగన్న సామెత, (కుచేలో. 1-109) అనేవి చెపుతాయి. గొప్పవారిని గౌరవించేప్పుడు మనమిచ్చేది చిన్నకానుక అని సవినయంగా చెప్పేందుకు ఈ సామెతను ఉపయోగిస్తుంటాము.

అజ్ఞానంనుంచే విజ్ఞానం ఆవిర్భవిస్తుందని 'నక్షత్రాలు శాశ్వతజ్యోతులైనా చీకటిలోనే వెలిగేది' అనే సామెత తెలుపుతుంది. హిందువులు చంద్రతారా బలాని కిచ్చే ప్రాముఖ్యాన్ని 'చెడిన ముండకు చంద్రతారాబలము' (శ్రీపాద) అనే సామెత తెలుపుతుంది.

**గ్రామ దేవతలు :** గ్రామ దేవతలు ప్రాచీన ద్రావిడదేవతలని తర్వాత ఆర్య దేవ తలతో వారికి సంబంధం ముడిపెట్టడం జరిగిందని పండితుల అభిప్రాయం. వారు గ్రామాన్ని అంటు వ్యాధులనుంచి, అదృశ్య దుష్టశక్తులనుంచి కాపాడతారని జాన పదుల నమ్మకం. ప్రతి ఊరిలోనూ ఒక గ్రామదేవత ఉండనే ఉంటుంది. ఒకోసారి ఆ గ్రామంపేరుతోనే దేవతపేరు ఉండొచ్చు. ఉదా: అద్దంకి లోని గ్రామదేవతను అద్దంకమ్మ అని, మల్లూరులోని గ్రామదేవతను మల్లూరమ్మ అని అంటారు. సంవ త్సరానికొకసారిగానీ, ఏదైనా అంటువ్యాధి ప్రబలినపుడుగాని ఆ దేవతకు జాత చేసి కోళ్లను, గొర్రెల్ని, దున్నల్ని బలిఇచ్చి శాంతపరుస్తారు.

తెలుగుసామెతల్లో ప్రసక్తికి వచ్చిన స్త్రీదేవతలు 17 మంది. మగదే తలు ఐదుగురు: అంకమ్మ, అంకాళమ్మ, అక్కమ్మ, అల్లూరమ్మ, ఎరుకలమ్మ, ఎల్లమ్మ.

ఎల్లవారమ్మ, కావేరి, కామాక్షమ్మ. గంగమ్మ, గంగానమ్మ. గొంతెమ్మ. దిబ్బాలమ్మ, పోలేరమ్మ, మహంకాళి, మారెమ్మ, వేషాలమ్మ స్త్రీ గ్రామదేవతలు. చెన్నారాయుడు,పోతురాజు,బండెన్న, భైరవుడు, హనుమంతరాయుడు పురుషగ్రామదేవతలు.

అంకమ్మ : వ్యాధుల్ని, ముఖ్యంగా కలరాను పోగొట్టే దేవత: సాధారణంగా పంచములు మాత్రమే పూజించేదేవత. అంకమ్మ శివమెత్తినవారికి ఆగబోగాలుంటాయని. అంకమ్మ శివమెత్తితే అడ్డులేదని, అర్ధరాత్రివేళ అంకమ్మ శివమెత్తుతుందని, వైభవాలు అంకమ్మకు, పొలికేకలు పోలేరమ్మకు' అని 'సామెతలు తెలుపుతున్నాయి. 'ఆగభోగాలు అంకమ్మ శివాలు', 'ఏలాపువెట్టి పట్టినా అంకమ్మ సివమెత్తినా అడ్డు ఉండదు', 'అర్ధరాత్రివేళ అంకమ్మసివాలు' అనేవి ఆ సామెతలు.

అంకాళమ్మ : పోతురాజు ఏడుమంది చెల్లెండ్లలో ఒకామె. ఆమెకు నైవేద్యం ఎక్కువగా కావాలని కాబోలు 'వెంకన్నబండి చూచిన అంకాళమ్మకును పైతమర గుండె పడున్' అనే సామెత చెపుతుంది.

అక్కమ్మ : ఈమెను గురించిన వివరాలు తెలియరాలేదు. 'అక్కమ్మ గుమ్మాలు ఎక్కాలేము, దిగాలేము', 'అక్కమ్మశ్రాద్ధానికి అధిశ్రవణము'7 అనేవి ఆమెను గూర్చిన సామెతలు.

అల్లూరమ్మ : అల్లూరమ్మజాతరకు చాలాగొర్రెల్ని బలిఇస్తారు. అందువలన గొర్రె అయినా, పిల్ల అయినా 'మాడ' అని 'అల్లూరమ్మ జాతపకు 'తల్లీ మాడ, పిల్లా మాడ' అనే సామెత చెపుతున్నది.

ఎరుకలమ్మ : ఏరూరిఎల్లలో వెలసిఉన్నట్లుగా 'ఈ ఎల్ల ఎరుకలమ్మ ఏరూరికి చుట్టమా? అనే సామెత తెలుపుతుంది. ఈ గ్రామం పొలిమేరలో ఉండే ఎరుకలమ్మ వేరే ఊరికి చుట్టముకాదుగదా అనే అర్థమిస్తుందేమో పరిశీలించాలి.

ఎల్లమ్మ : ద్రావిడదేవత (బ్రౌన్). పోతురాజు చెల్లెలు. ఒక గ్రామంలో వెలసిన పోతురాజు ఎల్లమ్మగాజులు తొమ్మిదింటిని ఒక చేతిలో ధరించిఉన్నాడు (వైట్ హెడ్). ఎల్లమ్మకే ఏకవీర రేణుకాదేవి అని మరి రెండుపేర్లు. ఈమె నగ్నదేవత. గొడ్రాండ్లకు బిడ్డలనిస్తుందని ఆలంపురీమాహాత్మ్యమనే లిఖిత పుస్తకంలోఉన్నది (ఆం.సా.స.పుట 51). ఆ దేవతముందు నైవేద్యం ఎక్కువగా పోయాలి. 'ఏనుగుల మ్రింగు ఎల్లమ్మకు పీనుగులు పిప్పళ్లు' అని సామెత. బవనీండ్లు జవనిక వాయిస్తూ రాత్రంతా ఎల్లమ్మకథ చెపుతారు.కథ అయిపోయేటప్పటికి తెల్లవారుఝాముకావస్తుంది.

ఆమె కొడుకుచేత నరకబడుతుంది. 'ఎల్లమ్మ బ్రతుకు తెల్లవారితే తెలుస్తూంది' అని సామెత.

**ఎల్లవారమ్మ :** ఎల్లవారమ్మ నెల్లూరి దగ్గరి ధర్మరాజుగూడెంలో ఉంది. ఊరి బయటిపొలాల్లో ఉన్న నలుగురు గ్రామదేవతల శిలల్లో ఒకటి (వైట్ హెడ్). ఎల్లారమ్మ, ఎల్లమ్మ ఒకరేనా అనేది పరిశీలించాల్సిన విషయం. 'ఎల్లవారమ్మల బ్రతుకు తెల్లవారితే ఎల్లవారమ్మల బ్రతుకు ఒకటే' అనే సామెతలు ఈ గ్రామ దేవతకు సంబంధించినవే.

**కాటేరి :** పొలిమేరదేవత. అతిసారం, కలరాలకు అధిదేవత (బ్రౌన్). స్త్రీల రక్తస్రావవ్యాధికి ఈమే కారణం. కాపులు, కరణాల్లాంటి ప్రజాపీడకులకు ఈమె దేవత. 'కాపు మంత్రులకు కాటేరి దైవము' అని సామెత.

**కామాక్షమ్మ :** కురిమెళ్లలో వెలసిఉన్నట్లు పేరునుబట్టి తెలుస్తున్నది. కామాచ్చి యమ్మ సౌమ్యమైన దేవత. ఈమె బ్రాహ్మణకన్యగా పుట్టి, అష్టశక్తుల్లో ఒక శక్తి అయింది (వైట్ హెడ్). బ్రాహ్మణ యిండ్లలో కామేశ్వరికథను ప్రొద్దుననగా మొదలు పెట్టి సాయంత్రంవరకు చెప్పకొనేవారని, దీన్నిబట్టే 'అక్కలు లేచే వరకు నక్కలు కూసె' అనే సామెత వచ్చిందని సురవరం ప్రతాపరెడ్డి. 'కుమ్మెతక్కపూజ కుచ్చితే కురిమెళ్ళ కమాక్షమ్మ కులికి వస్తుంది' అని సామెత.

**గంగమ్మ :** గంగమ్మ జలదేవత. గాలిగంగలని మరోపేరు. గంగమ్మజాతరలో మేకపోతులను, దున్నపోతులను బలియిచ్చే ఆచారముంది. గంగమ్మ మశూచికం నుంచి ప్రజలను కాపాడే దేవత. ఏలూరులో గంగమ్మనే మహాలక్ష్మి గాను. చామలమ్మ (కాళి) గాను పిలుస్తారు (వైట్ హెడ్). చేతకానివ్యక్తి చెడకతప్పదని 'ఈతరానమ్మను గంగమ్మ ఎత్తకపోతుంది' (నర) అని, ఎవరింట్లోనైనా అమ్మవారుపోస్తే ఆయింటినుంచి తమలపాకులు, కొత్తబట్టలు, పసుపుకుంకుమలు లాంటి మంగళ వస్తువులు తెస్తే గంగమ్మ (ఆ వ్యాధి) వెనువెంటనే వస్తుందని చెప్పేందుకు 'గంగమ్మ వెనకంబడితే వస్తుంది' (నర) అని చెపుతారు. కొవ్వుపట్టి కోరి కోరి ఆపదలుతెచ్చుకొనేందుకు 'గాడుపట్టిన గంగమ్మా మాయింటిదాకా రామ్మా అన్నాడంట' (నర) అనే సామెత చెపుతారు. బలవంతుని ఇష్టమేగాని బలహీనుల ఇష్టము పనిచేయదనడానికి 'గంగమ్మ యిచ్ఛలా? పొట్టేలి యిచ్ఛలా?' (నర) అనే సామెత ప్రయోగిస్తారు.

గంగానమ్మ : గంగమ్మ మరోపేరే అయి ఉండొచ్చు. గంగమ్మకు జంతుబలి యిచ్చేప్పుడు, మాలల్లో ఒకతెగ అయిన 'ఆసాదులు' గంగను గురించి పాడుతుంటారు. గంగానమ్మ పేరు చెప్పుకొని నరికిన దున్న పోతుల్ని, నైవేద్యాన్ని తింటారని 'అట్టూపిట్టూ ఆసాదివానిది, రట్టూ రవ్వా గంగానమ్మది', 'అంటూసొంటూ ఆసాదివానిదీ రట్టూరవ్వా గంగానమ్మది' అనే సామెతలు తెలుపుతాయి. మనలో తప్పుంటే తప్ప ఏదేవతా పీడించలేదని 'కాలువంగిన గాని గంగానమ్మ అయినా పట్టదు' అని, ఈదేవత తిండికి ప్రాకులాడుతుందని 'పాటిమీద గంగానమ్మకు కూటి మీదనే లోకం' అనే సామెతలు చెపుతున్నాయి. ఆనాడు తురకలదాడి గ్రామదేవతల విగ్రహాలపై కూడా ఉండేది. 'గంగానమ్మ నెత్తిమీద తురకోడు కాలుపెడితే కాపువాణ్ణి తీయమన్నదట' (నర) అని సామెత. గొప్పవాళ్లు దిగజారిపోవడాన్ని 'గాడుపట్టిన గంగానమ్మ పూజారితో పోయినట్లు' అనే సామెత తెలుపుతుంది.

గొంతెమ్మ · పాండవులతల్లి కుంతీదేవిని 'గొంతెమ్మ' అనే గ్రామదేవతగా జానపదులు కొలుస్తున్నారు. సంవత్సరాని కొకసారి గొంతెమ్మ పండుగ జరుపుకొంటున్నారు. పాండవులు అడవుల్లో ఉన్నప్పుడు తన కొడుకులకు రాబోవు ఐశ్వర్యాన్ని గురించి కుంతి కలలు కంటుండేదట. అందుకే అసాధ్యమైన, ఎక్కువైన కోరికల్ని గొంతెమ్మకోర్కెలు అంటారు. 'గొంతెమ్మకోరికలు-ఎండమావులనీళ్లు', 'గొంతెమ్మకోరికలు గాలిమేడలు కట్టడం ఒక లెక్కాపక్కా' అని సామెతలు.

దిబ్బాలమ్మ ఒక గ్రామదేవత. దిబ్బాలమ్మ మీది భక్తినీ, తప్పుచేసిన భర్తమీద కోపాన్నీ ఒక పల్లెపడుచు వెల్లడించే సామెత 'దిబ్బాలమ్మకు దీపంపెడితే పంది మొగుడు వచ్చి పడదోసిపోయె' అనేది.

పోలేరమ్మ : పొలిమేర దేవత. పోతురాజు భార్య (బ్రౌన్). వాళ్లిద్దరి దాంపత్యాన్ని వ్యంగ్యంగా చెప్పే సామెతలు. పోలేరమ్మ పెండ్లిలో పోతురాజు పెత్తనం', 'పోలేరమ్మది చినగదు, పోతురాజుది విరుగదు' అనేవి. 'పూజాది బలిసి పోలేరమ్మచండ్లు పట్టుకొన్నాడంట', 'ఉడుము కొవ్వి పోలేరమ్మను పట్టుకొన్నదట' అనే సామెతల వెనక ఏవో కథలున్నట్టుంది.

మహాంకాళి : వేదాల్లో కనిపించే గ్రామదేవత ఈమె ఒకటే. అష్టశక్తుల అవతారమే కాళి. మహిషాసురమర్దని. ఈమెకే ఉగ్ర మహాంకాళి, వీర మహాంకాళి అని మరి రెండు పేర్లు. ఈమె ఉగ్రదేవత. కలరా దేవత. చమత్కారిత్వం ఉగ్రత్వానికి

విరుగుడు అని చెప్పే సందర్భంలో 'మాటలతో మహంకాళిని నవ్వించొచ్చు' అనే సామెత ప్రయోగిస్తారు.

**మారెమ్మ** : పోతురాజు చెల్లెండ్లలో ఒకామె. కలరా లాంటి అంటువ్యాధులకు దేవత (బ్రౌన్). చెట్టుకొట్టి మీద తోసుకొనేవార్ని వెక్కిరించేది 'దారినబోయే మారెమ్మా మా ఇంటిదాకా వచ్చి పో అన్నట్లు' అనే సామెత. ఇతర గ్రామదేవతల నైవేద్యానికి ఈమె నైవేద్యానికి భేదం ఉందేమో? 'పుతపుతల మారెమ్మకు పాడి కూడేగాని గడ్డకూడు కాదు' అని సామెత.

**వేషాలమ్మ** : తిరుపతిలో వెలసి ఉన్న గ్రామదేవత. గంగజాతరనాడు ప్రజలు రకరకాల వేషాలు వేసి జాతరచేసుకుంటారు కాబట్టి వేషాలమ్మ అనే పేరువచ్చిందట. ఈమె నైవేద్యాన్ని గురించి 'ఏనిగెల్దినే వేశాలమ్మకు ఓనిగెలు పిండాకూడంట' (చంద్ర) అనే సామెత చెపుతుంది.

**పోతురాజు** : తెలుగు కన్నడ, మహారాష్ట్ర దేశాల్లో పూజింపబడే గ్రామదేవత. ఆ యా వూర్ల స్త్రీగ్రామదేవతలకు ప్రధానరక్షకుడు. పెద్దమ్మ, ఈసోందమ్మ, మారమ్మ, అంకాళమ్మ, మాకాలమ్మ, వనుకొత, ఎల్లమ్మ, అరికమ్మ, కాళియమ్మ, అనే ఏడుగురు చెల్లెండ్లకు అన్న (వైట్‌హెడ్). గ్రామ రక్షకుడు. ప్రజలుండే ఊరికి పోతురాజు కావలి అని 'దేవుడు లేని ఊళ్లో మంచపుకోడే పోతురాజు', 'కుక్కలుండే ఊరికి నక్కే పోతురాజు' (చంద్ర) అనే సామెతలు చెపుతాయి. ప్రతిఊరికి ఒకపెద్ద ఉండాలని, లేకపోతే 'పెద్దలేని ఊరికిపోతురాజే పెద్ద' అనే సామెత, పోతురాజు శివంపడ్తాడని, అతనికి పొట్టేళ్ల బలిఇస్తారని 'పుట్టుకొరుతూ ఉంటే పోతురాజు శివమాడినట్లు', 'పోతురాజు ఇష్టమా? పొట్టేలు ఇష్టమా?' అనే సామెతలు తెలుపుతాయి.

ఏ గ్రామదేవత జాతర జరిగినా అందులో పోతురాజు ప్రవేశం ఉంటుంది. కడపజిల్లాలో కొన్నిప్రాంతాల్లో ఈయన్ని 'పోతులరాజు' అంటారు. దాదాపు మూడడుగుల ఎత్తులో, వివిధరంగులు పూసి నెత్తికి రుమాలుచుట్టి కొయ్యతో చేయబడిన విగ్రహమిది. ఒక మోకాలు ముడిచి నిల్చున్న భంగిమలో, ఒక చేతిలో కత్తితో ఉంటాడు పోతురాజు. బాకలిపూజాకి తప్పెట్లకనుగుణంగా పోతురాజును ప్రతిష్టించిన పీఠాన్ని నెత్తిని పెట్టుకొని చిందులుతొక్కుతాడు.

**బండెన్న** : ఏడుమంది అక్కదేవతలకు అన్న. దెయ్యాలు పట్టినవారికి అక్కదేవతల్ని పూనకంవచ్చేట్లు చేస్తే దెయ్యాలు పారిపోతాయని పల్లీయుల నమ్మకం. బండెన్న

శివంపట్టి దయ్యాలను తోలివేస్తుంటాడు. 'బందన్న పెండ్లికి బడితెపూజ' అనే సామెత అంతరార్థం ఆలోచించాల్సిందే.

భైరవుడు : శివుని మరోపేరు. కాని శివునికన్నా తక్కువగా పూజింపబడే మూర్తి. 8 మంది భైరవులున్నారు (బ్రౌన్). భైరవుడు అక్కడక్కడా గ్రామ దేవతగా పూజింపబడుతున్నాడు. కడపజిల్లా, రాయచోటితాలూకాలో యండపల్లె దగ్గర (రాయచోటి-కదిరి బస్ రూట్లో ఐదోమైలులో) భైరేనిగుట్ట ఉంది. ఒక ప్రాచీనమైన భైరేనిగుడి ఆగుట్ట కానుకునే భైరేనిచెరువూ ఉన్నాయి. ఏటా భైరేని తిర్నాల జరుగుతుంది. తంబళి ఇక్కడ పూజారి యండపల్లెగ్రామంలో ఎవరింట్లో నైనా పెండ్లి జరిగితే రెండువారాల్లోగా వెళ్లి అక్కడ పొట్టేలిని బలిఇచ్చి భైరవుని పూజిస్తారు కారణం వివరించలేం కానీ 'పాపాలకు భైరవుడు పాపన్న' అనే సామెత ఉంది.

హనుమంతరాయుడు: హనుమంతునికే మరోపేరు. పూజార్లను నిరసిస్తూ చెప్పిన సామెతల్లో హనుమంతరాయని ప్రసక్తి 'అరడి హనుమంతరాయనిది అర్ధశేరు బియ్యం పూజారిది' అని ఉంది. గొప్పవారికి ఏదైనా చెప్పబోవడం 'హనుమంతు నికి కుప్పిగంతులు నేర్పినట్లు' హాస్యాస్పదమవుతుంది.

చెన్నారాయడు : మాచెర్ల చెన్నడు, చెన్నకేశవుడు, చెన్నారాయడు ఒకరే కావచ్చు. 'హక్కు హనుమంతరాయనిది, అనుభవం చెన్నారాయనిది' అనే సామెత అంత రార్థం పరిశీలించాల్సివుంది.

దేవర్లు : ఇంటిదేవర్లు, పొలం దేవర్లు అని రెండువిధాలు. ఇంట్లో ఒక చిన్నకట్టపై దేవరను బెట్టి విలువుకొని మొక్కులు చెల్లించుటకు తీనె బెట్టుట యని అందురు (ఆం.సా.చ.పు. 318). పొలందేవర్లు పంటపొలాల్లోనూ, పాటిదేవర్లు శ్మశానం లోనూ, పాడుబడినప్రదేశాల్లోను వెలసిన దేవర్లు. ఈ దేవర్లు పై చెప్పిన గ్రామ దేవతల్లో ఎవరైనా కావచ్చు, కాకపోనూ వచ్చు. ఇంటిదేవరకు నైవేద్యం పెట్టిన తర్వాతనే బయటిదేవర్లకు అనే విషయాన్ని 'ఇంటిదేవర ఈడిగిలబడితే పొరుగు దేవతకు జాతరట', 'ఇంటిద్యావర ఇగిలిస్తే గూటిద్యావర గుగ్గిలానికి ఏడ్చినాడట', ఇంటిదేవర ఈగిచప్తే పొలందేవర గంపజాతర అడిగినాడట' అనే సామెతలు వ్యక్తం చేస్తాయి. ఇంటిదేవరకు నైవేద్యం పెట్టే విషయాన్ని 'అంటక ముట్టక దేవరకు పెడుతున్నామ, ఆశపడకండిబిడ్డలారా! అవతలికి పొండి అన్నదట' అనే

ఒక యెత్తు' అనే సామెత; అనామకుణ్ణి 'అగస్త్యభ్రాత ఎవడంటే హనుమాయమ్మ మొగుడు అన్నాడట' అనే సామెత వ్యక్తపరుస్తున్నాయి.

స్వాములు-సన్యాసుల్ని హిందువులు ఎంతో గౌరవంతో చూస్తారు. కపట సన్యాసులే ఎక్కువగా ఉండడంవల్ల సన్యాసుల్ని నిందించే సామెతలే ప్రచురంగా ఉన్నాయి.

కావి బట్టలు ధరించడం, బూడిద పూసుకోవడం, జడలుతాల్చడం తల బోడి చేయించడం లాంటివి సన్యాసుల బాహ్య స్వరూప లక్షణాలు. ఈ బాహ్య లక్షణాలే పరిపోవని, నిజమైన వైరాగ్యం అవసరమని 'కావి కట్టిన వాడల్లా సన్యాసియా' (సా. సా. 132), 'సన్యాసీ సన్యాసీ రాసుకుంటే బూడిద రాలిందట', 'తపము పండిన మీద జడలు తాల్చడమెందుకు?', 'వృధా బోడవైతివి, పొందవైతివి' అనే సామెతలు తెలుపుతాయి.

సన్యాసుల జాతి నెంచరాదని, సన్యాసులనింద చేయిరాదని, సన్యాసుల బొంకులు కూడా సత్యాలవుతాయని, పైపై సన్యాసం ఉభయభ్రష్టమని చెప్పే సామెతలు: 'పాని నీతి సన్నాసి జాతి తెలియవు', 'పరనింద గ్రహక్షయం, యతి నింద కులక్షయం, 'కలిగినమ్మ అంకు, కాషాయ బొంకు', 'ఉభయ భ్రష్టుత్వం, ఉపరి సన్యాసం' అనేవి.

కావి బట్టలు కట్టడమేగాని కామాన్ని, కల్లును, భంగును సన్యాసులు వదల లేదని 'బోగంవీది కొల్లబోతాందంటే సన్నాసులు గోసులిప్పుకోని పరుగెత్తినారంట' (నర), 'సన్యాసుల మధ్య కల్లు కుండలు మాయమైనట్లు', 'చిలుం పట్టనివానికి చిత్తం కుదరదు' అనే సామెతలు ఉద్ఘాటిస్తున్నాయి. 'సన్యాసిపెళ్లాం అటు విధవా గాదు, ఇటు పునిస్త్రీ కాదు' అని, భగవధ్యానంతో, రోగాల్తో, భోగాల్తో 'యోగికీ, రోగికీ, భోగికీ నిద్రలేదు' అని సామెతలు అంటున్నాయి.

(ఇ) పూజా సంబంధి: దైవ పూజాసంబంధి సామెతలు ఈ శీర్షిక కింద పరిశీలించబడతాయి.

1. ధూప, దీప, నైవేద్యాలు - తీర్థం - ప్రసాదం: దేవునిముందు గుగ్గిలం ధూపంవేయడం, దీపం పెట్టడం, నైవేద్యం సమర్పించడం పూజలో ఒక భాగం. తీర్థమూ, ప్రసాదమూ భక్తులకు పంచి పెడతారు. 'దూపం వేస్తే పాపం పోతుంది' అని, 'కది గండం కాచును, వత్తి మిత్తి గాచును' అని, 'దియ్య లేని యింట్లో దినానికి పాతిక నష్టి' (నర) అని సామెతలు తెలుపుతాయి.

నైవేద్యం పేరుకు దేవునికేగాని తినేది మనమేనని, 'దేవునికి చూపులు, మనకు మేపులు' అనే సామెత చెపుతుంది. అవకాశవాదులు గాలికి పోయే పేలపిండి భగవదర్పితం' అంటారని ఒక సామెత.

పవిత్ర వస్తువు స్పర్శవల్ల సామాన్య వస్తువుకూడా పవిత్రమౌతుందని, ఒక పనికి మరోపనికి సంబంధంలేకుండా కొందరు చేస్తుంటారని 'శంఖులో పోస్తే తీర్థం పెంకులో పోస్తే నీళ్లు', 'తీర్థమునకు తీర్థము ప్రసాదమునకు ప్రసాదము' (శ్రీపాద) అనే సామెతలు చెపుతున్నాయి. చాలామంది ప్రసాదం పంచే వేళకు భక్తికోసం గాక భుక్తికోసమే వస్తారని 'ప్రసాదానికి ముందు, పనికి వెనుక' 'ప్రయాణాలు అబద్ధం, ప్రసాదాలు నిబద్ధం' అనే సామెతలు తెలుపుతాయి.

2. తిష్ఠ-నిష్ఠ : నిశ్చలంగా కూర్చోగలిగితేనే నిష్ఠ (ఏకాగ్రత) కుదుర్తుందని, వ్యభిచారిణులకు నిష్ఠ అనవసరం అని సామెతలు వ్యంగ్యంగా చెపుతున్నాయి. 'తిష్ఠ కుదిరితేగాని నిష్ఠ కుదరదు' (నర). 'నెల అంకులాడికి నిష్ఠ మెండు', 'నిష్ఠ నీళ్ళు పాలు గుద్ద మాలపాలు' (నర) అనేవి ఆ సామెతలు.

3. మూల విగ్రహాలు-ఉత్సవ విగ్రహాలు : ప్రతి గుడిలోనూ మూల విగ్రహాలు, పవిత్ర దినాల్లో ఊరేగించేందుకు ఉత్సవ విగ్రహాలూ ఉంటాయి. రాజులో, ప్రజలో దేవునికి కానుకలు సమర్పిస్తుంటే మూల విగ్రహాలకూ, ఉత్సవ విగ్రహాలకూ వస్త్రాలంకారాలకూ కొదవుండదు. సమాజంలోవలెనే ధనిక దేవుళ్లు, బీద దేవుళ్లు ఉంటూనే వున్నారు. ప్రధాన వ్యక్తికే గౌరవం లేకుంటే అనుచరునికి అసలే వుండదనే సందర్భంలో 'గుళ్లో దేవుడు గుద్ద బోర్లించుకొని ఉంటే వాకిట్లో దేవుడు వల్లె కావాలన్నాడట' (నర). 'అసలు దేవుడు మూలబడితే హనుమంతరాయణికి తెప్ప తిరునాళ్ళట'. 'మూల విగ్రహాలు ముష్టి ఎత్తుకుంటూంటే ఉత్సవ విగ్రహాలకు దధ్యోధనమట' అనే సామెతలు వివరిస్తున్నాయి. 'బొమ్మకు మొక్కినా నమ్మక ముండవలె' అని ఆస్తికులంటుండగా, విగ్రహారాధన వృథా అని 'కొయ్య బొమ్మను వేడ కోరికలిచ్చునా' (శ్రీపాద) అని కొంతమంది వాదన.

4. యజ్ఞం-హోమం : దేవతల్ని సంతోషపరచడానికి చేసే పూజ యజ్ఞం. ప్రాచీనకాలంలో యజ్ఞంచేయడమనేది చాలామందికి జీవితాశయంగా, అత్యంత అదృష్ట కార్యంగా ఉండేది. యజ్ఞంలో బలిపశువుల్ని కట్టివేసే స్తంభం యూప స్తంభం. దానికీ పవిత్రత ఉంది. ఈ విషయాల్ని 'పుట్టిన యిన్నాళ్లకు పురుషుడు యజ్ఞము చేసెను' (కార్. 1477). 'కని కని కొజ్జెవ్వడింట కంబము చేసెన్'

అనే సామెతలు తెలుపుతాయి. యజ్ఞంలో ఎంగిలితినడం ఒక తంతు. 'శ్రాద్ధానికి అంటు లేదు యజ్ఞానికి ఎంగిలి లేదు' అని సామెత.

హోమం వేల్చేటప్పుడు గృహిణి పూర్తి పవిత్రతను పొందేందుకు, అంతకు ముందు ఎపుడైనా తాను రంకుతనం చేసి ఉంటే చెప్పాల్సి ఉంటుంది. తండ్రికి తద్దినంలో పిండం పెట్టే కొడుకు తను ఒక వేళ తన తండ్రి బీజానికిగాక మరొకని బీజానికి పుట్టినా, లోకములో తనకు ఎవరు తండ్రిగా పరిగణింపబడుతున్నాడో అతనికే పిండం చెందాలని మంత్రం చదువుతాడు ఈ విషయాల్ని 'అలు రంకు దెలుప నఖిల యజ్ఞంబులు తల్లి రంకు దెల్ప తద్దినంబు'. 'యజ్ఞంచేసి రంకు తెలుపుకొన్నట్లు' అనే సామెతలు విశదీకరిస్తాయి.

యజ్ఞంలో అగ్నిహోత్రంలో నేయిలాంటి వాటిని సమర్పిస్తారు. ఉన్న విషయాన్ని ఎగసన దోయడాన్ని 'అగ్నిలో ఆజ్యం పోసినట్లు' అని, వృథా పనులను చేయడం అనే విషయాన్ని 'బూడిదలో చేసిన (పోసిన) హోమంవలె', 'నీటిలో హోమం చేస్తారా' (సా. సా. 271) అనే సామెతలు విప్పి చెపుతాయి.

**5. మంత్రాలు–సంధ్య :** ఉదయ, మధ్యాహ్న, సాయం సంధ్యల్లో బ్రాహ్మణులు సూర్యునికి మంత్రాలతో చేసే ప్రార్థన సంధ్యావందనం. బ్రాహ్మణులు చాలా మంది అలవాటు ప్రకారమేగాని. చిత్త శుద్ధితో చేయడంలేదని 'సంధ్యావందనం చేస్తే పుణ్యంలేదుగాని చెయ్యకపోతే పాపం లేదు' (కార్. 2633), 'మంత్రంరాని సంధ్యకు మరి చెంబుడు నీళ్లు'. చదువూ, సంధ్యా లేదుగాని సంతానం మాత్రం మెండు' అనేవి తెలుపుతున్నాయి.

మంత్రాలు శక్తిమంతాలు అని జానపదుల నమ్మకం. ఇప్పటికీ తేలుమంత్రం, పాముమంత్రం, దిష్టిమంత్రం పల్లెల్లో వేయించుకొంటూనే ఉన్నారు. ప్రతి మంత్రానికి 'ఓం' అనే ప్రణవాక్షరం ముందుండి తీరుతుంది అని 'ఓంకారము లేని ప్రజ్ఞ' అనే సామెత చెపుతుంది. మంత్రాలను నమ్మనివారు చెప్పిన సామెతలు 'మంత్రాలకు మామిడికాయలు రాలుతాయా?', 'మంత్రాలకు చింతకాయలు రాలవు' (నర) 'మంత్రజలముకన్న మంగలి జల మెచ్చు' అనేవి.

**6. ఉపవాసం, నోములు, మొక్కులు, పొర్లుదండాలు, అమావాస్యకూడు:**

కొన్ని కొన్ని పవిత్రదినాల్లో ఒక్క పొద్దు (ఉపవాసం) ఉండడం హిందూ మత సంప్రదాయం. తిండిపోతులు ఒక్క పొద్దు విషయం పట్టించుకోరని, కొంత మంది మధ్యలోనే ఉపవాసం మానేస్తారని, 'ఒక్క పొద్దుమాట కుక్క ఎఱుగునా?',

'వేలునాకి వ్రతము చెలుచుకొన్నట్లు' (శ్రీపాద) అనే సామెతలు తెలుపుతాయి.

స్త్రీలు తమ పసుపు కుంకుమలకోసం చేసే వ్రతాలు నోములు. నోములు నోచినవారికే ఫలితం దక్కుతుందని, నోములు చేసినా తప్పుడు పనులు చేస్తే ఫలిత ముండదని 'నోచినవారి సొమ్ములు నో(య) మ్మని వారికి వచ్చునా?', 'నూరు నోములు ఒక రంకుతో పోయినవి' (బ్రౌన్. పు. 864) అనే సామెతలు వ్యక్తీకరిస్తున్నాయి.

ఏదైనా కోరిక నెరవేరాలనిగాని, ఆపద తొలగాలనిగాని దైవానికి మొక్కుకుంటారు డబ్బు వేస్తామనో, నిలువుదోపిడీ ఇస్తామనో, కల్యాణోత్సవం చేయిస్తామనో. కాని ఆపదలు పోతూనే మరచిపోవడం మానవ నైజమని ఆపద మొక్కులు సంపదకుంట్లూ, (శ్రీపాద) అనే సామెత ఎత్తి పొడుస్తుంది.

గర్భగుడి చుట్టూ పొర్లుతూ దండాలు పెట్టడం భక్తులు చేస్తుంటారు. దేవుని వద్ద అలా చేయాలిగాని 'బూర్లె గంప కాడనా పొర్లు దండాలు?' అని ఒక సామెత గద్దిస్తుంది.

అమావాస్యనాడు ఒంటిపూట భోజనం తినాలని హిందూమతం సంప్రదాయం. అందువల్ల భోజనం రుచికరంగా వండుకొంటారు. అలాంటి విందు భోజనం ప్రతి దినమూ దొరకదు గదా అని 'అమావాశ్యకూడు నిత్యం దొరుకునా?' (కార్.2160) అని సామెత ప్రశ్న.

7. తిరునాళ్లు, జాతరలు, తీర్థాలు, గుండం: ఒక నిర్ణీత దినంనాడు దేవునికి చేసే ఉత్సవాలకు జాతరలని పేరు రాయలసీమ ప్రాంతంలో గ్రామ దేవతల జాతర్లనుకూడా గంగమ్మ తిర్నాల, పల్లాలమ్మ తిర్నాల అనే అంటుంటారు.

తిరునాళ్లకో, జాతర్లకో అంతో ఇంతో డబ్బు కూడబెట్టుకొన్న జనం ఆ ఉత్సవాన్ని చూడ్డానికే కాకుండా, ఇష్టమైన తీపి వంటల్ని ఇష్టమైనంత తినేందుకే వెళ్తుంటారు. తమకున్న గుడ్డల్లో మంచి గుడ్డలు కట్టుకొని వీలైనంత దర్జాగా వెళతారు. పెద్దలు ఆభరణాల్ని ధరించిపోవద్దని సలహాలు ఇస్తుంటారు. ఈ విషయాల్ని చెప్పే సామెతలు 'తిరునాళ్లకు పోతవా? తిండికి పోతావా?' (కార్. 2379), 'తీరు తీరు గుడ్డలు కట్టుకొని తిరునాళ్లకు పోతే ఊరికొక గుడ్డ ఊడిపోయిందట', 'తిరునాళ్లకు పోతూ తీపి పామ్మన్నారు, పెండ్లికి పోతూ పెట్టుకు పామ్మన్నారు' అనేవి. జాతర్లమీది పిచ్చి జానపదుల్లో చాలా ఎక్కువని, జాతర స్థలాన్ని అక్రమ కామ సంబంధాలకు కొందరు వినియోగించుకొంటారని 'జనమద్దు జాతర మద్దు',

'మిండని నమ్ముకొని జాతరకు పోయినట్లు' అనే సామెతలు చాటతాయి.

పుణ్యంకోసం స్నానమాడే నది తీర్థం. నిర్ణీతదినాల్లో ఆస్థలాల్లో చేసే ఉత్స వాల్ని తీర్థాలు అంటారు. తీర్థాల్లో జానపదులు బాగాతింటారని 'తినా కుడువా తీర్థం పోవాలి, తిండికి మాడ పెండ్లికి పోవాలి' అనే సామెత చెపుతుంది. ఉమ్మడి కుటుంబంలో ఏవైనా పిండివంటలు చేసినా, అందరూ ఇష్టమొచ్చినంత తినే వీల్లేదు అనే విషయాన్నికూడా ఈసామెతలు చెపుతాయి.అంతర్వేది తీర్థానికి బాగా జనంకూడ తారని అంతర్వేది తీర్థంలో మావెధవ మేనత్తను చూశావా?' అనే సామెత తెలుపు తుంది. పవిత్ర తీర్థంలో మునిగినా అపవిత్రుడు పవిత్రుడు కాడనేదానికి 'గంగలో స్నానంచేసినా కాకి కొంగ అగునా?' (సా.సా.164) అనే సామెత; అనాధల మీద దేవుని దయ ఉంటుందని 'భాగీరధి పిచ్చుగుంటు మీద పారినట్లు' అనే సామెత, పుణ్యంకోసమని వెళ్తుంటే పుణ్యమే ఎదురుగా రావడాన్ని 'ఆడబోయిన తీర్థమెదురై నట్లు' అనే సామెత తెలుపుతాయి. గంగలో స్నానం ఆడడం, తుంగానదీ తీర్థం సేవించడం చేయాలి అని 'గంగాస్నానం, తుంగాపానం' అనే సామెత తెలుపగా, పవిత్రనదిలో స్నానంచేయడానికి ఎవరి ఆజ్ఞ అవసరంలేదని 'కృష్ణాస్నానానికి కొండు భట్లు ఆజ్ఞ' అనే సామెత చెపుతున్నది.

చేసిన కర్మ ఏనదిలో మునిగినా తప్పదు అని 'నర్మదలో మునిగినా కర్మము తప్పదు' అనే సామెత, పెన్నలో మాన్యం చెప్పడం వృథా అని 'పెన్నలో మాన్యం కాశిలో దానం చేసినట్లు' అనే సామెత చెప్పబడ్డాయి. మాఘమాసంలో స్నానాలు చేయడం పవిత్రం అని, మాఘస్నానాలు చేస్తారేగాని కామానికి బానిసలు అని 'చేసేవి మాఘస్నానాలు, దూరేవి బొమ్మర గుడిసెలు' అనే సామెత చెప్పబడింది. సముద్రస్నానం పుణ్యప్రదమని హిందువుల నమ్మకం. అయినా ఎడతెగకుండా వచ్చే కెరటాలు ఆగిందాకా ఉండలేంకదా అని 'సముద్రములో కెరటాలు అణిగిన తరువాత స్నానం చేదా మనుకున్నాడట' అనే సామెత తెలుపుతుంది.

గుండం : వీరశైవులు నిప్పుల గుండంలో దూకి ప్రాణత్యాగం చేసుకొనేవారు. ఆ విషయాన్ని 'గుడి మీదనుండి పడినా గుండాములో పడినా ఒకటే' అనే సామెత తెలుపుతుంది. శైవేతరులు 'మిండని చూచి గుండములో పడతానన్నట్లు' అనే నిందా సామెతను సృష్టించారు.

8. ఉపాకర్మ-ఔపోసనం: సంస్కారపూర్వకంగా వేదాధ్యయనాన్ని ఆరం భించడం ఉపాకర్మ. బ్రాహ్మణ గృహస్థు ప్రాతఃకాలంలో చేసే అగ్ని ఉపాసనే

ఔపోసనం. 'ఉన్న కర్మతో అఘోరిస్తుంటే ఉపాకర్మ వచ్చిపడ్డది' అని, 'అలవాటు లేని ఔపోసనం చేస్తే మూతి మీసాలు కాలినవి' అనేవి వీటికి సంబంధించిన సామెతలు.

9. అశ్వత్థ ప్రదక్షిణం: రావిచెట్టు చుట్టూ ప్రదక్షిణం చేస్తే సంతానం కలుగుతుందనే విషయాన్ని 'అశ్వత్థ ప్రదక్షిణంచేసి, కడుపు పట్టి చూచుకొన్నట్లు' అనే సామెత తెలుపుతున్నది.

10. నాగపూజ : నాగపూజ చాలా ప్రాచీన కాలంనుంచే ఉంది. నాగ ప్రతిమల్ని పూజిస్తూ. నాగుపాముల్ని చంపడం భక్తా? అని ప్రశ్నిస్తున్నది 'జాతినాగుల చంపుతూ ప్రతిమ నాగులకు పాలు పోసినట్లు' అనే సామెత. స్థలాన్నిబట్టి మనం భ్రమపడుతుంటామని 'పుట్టమీద తేలుకుట్టినా నాగుమయ్య మహిమేనా?'(కార్.1472) అనే సామెత అంటున్నది.

11. గోపూజ: హిందువులకు గోవెంతో పవిత్రమైనది. 'గోవే తల్లి ఎద్దే తండ్రి'గా భావించే గ్రామీణులు 'పూజలన్నిటిలోనూ గోపూజే గొప్పది' (వ్య.సా. 612) గాను. 'గోసేవయే గోవింద సేవ' (గోభూమి. నవం. 1949) గాను. 'గోప్రదక్షిణము భూప్రదక్షిణ ఫలమిచ్చినట్లు'గాను భావించడమేగాక 'ఆవు లేనింట అన్నమే తినరాదు' అనే నిశ్చయంగలవారు.

12. పురాణం : ఆయాదైవాల మాహాత్మ్యాల్ని. భక్తులకథల్ని పురాణాలుగా చెప్పడం, జానపదులు వినడం జరుగుతూనే ఉంటుంది. పురాణం విన్నపుడుమాత్రం అందరికీ మంచి చేదామనిపించడం, తర్వాత అంతకు ముందటి రాగద్వేషాలు చూపిస్తుండడం మామూలే అన్న విషయాన్ని 'పురాణం విన్నప్పుడు పుట్టెడు బుద్ధులు, అవతలపోతే అపర బుద్ధులు' అనే సామెత నిరూపిస్తున్నది.

(ఉ) హిందూ మత సిద్ధాంతాలు – ఆచారాలు:

ఈ శీర్షికలో పునర్జన్మ. విధి, బ్రహ్మరాత-ఆయుస్సు, మరణం, దయ్యాలు-భూతాలు, పాప పుణ్యాలు-స్వర్గనరకాలు, కర్మ-చెడుకాలం, దానం-ధర్మం, ఇలి-బలి, పేరంటం అనే విషయాలు పరిశీలింపబడతాయి.

1. పునర్జన్మ: పునర్జన్మ సిద్ధాంతం హిందూమత మూల సిద్ధాంతాల్లో ఒకటి. ఈ జన్మలో చేసిన పాప పుణ్యాల్నిబట్టి మరుజన్మ ఉంటుందని,హిందువులు నమ్ముతారు. 'మూడు జన్మల సంగతి చెప్పగలను. పూర్వజన్మలో ఇచ్చి పెట్టుకోలేదు కనుక ఈజన్మలో దేవుడు నాకీయలేదు. కనుక ముందు జన్మలో నాకేమీ ఉండదు', 'పెట్టిన

వారికి పుట్టినదే సాక్షి, పెట్టనివారికి పుట్టినదే నిజము' (కార్. 1511) అనే సామెతలు పై విషయాన్నే వివరిస్తాయి.

2. విధి: విధి అంటే బ్రహ్మ అనీ, కాలం అనీ అర్థాలు. విధికి అడ్డు లేదని, అది మనిషి వెంటనే ఉంటుందని చెప్పబడింది. 'విధివస్తే పోదలడ్డమా?', 'వ్యాధికి మందుగాని విధికి మందా?', 'ఎక్కడకు పోతావు విధమ్మా అంటే వెంటనేవస్తాను పదమ్మా అందట' (కార్. 376) అనే సామెతలు పై విషయాల్ని చెపుతాయి. విధి ఫలానా సమయంలో, ఫలానా స్థలంలో వస్తుందని తెలిసి. ఎంతోదూరంగా తప్పించుకొని వెళ్లినా, మళ్లీ విధి వాణ్ణి ఆ సమయానికే. ఆస్థలానికే ఈడ్చుకు వచ్చి బలి గొంటుందని 'విల్లూరి మర్రి కింద విధి వున్నది' (కార్. 1984) అనే సామెత వెనుక ఉండే కథ తెలుపుతుంది (కార్. పు. 344). 'మనసు విధిని బట్టే పని చేస్తుంది', 'విధిననుసరించే మది' (సా.సా. 388) అని సామెతలు.

3. బ్రహ్మ-బ్రహ్మరాత-ఆయుస్సు-మరణం :

సృష్టికర్త అయిన బ్రహ్మగూడా కామానికి దాసుడే అని, బ్రహ్మ ప్రాణుల నుదుట ఆయుస్సు రాస్తుంటాడని, దాన్ని చెరుప వీలుకాదని, బలహీనులను బాధపెట్టిన బలవంతుల్ని బ్రహ్మ నాశనంచేస్తాడని. బ్రహ్మరాతను బట్టే మంచీ చెడ్డా మన జీవితాల్లో జరుగుతుంటాయని సామెతలంటున్నాయి. 'బ్రహ్మకైన పుట్టు రిమ్మ తెగులు', 'రాజు తలిస్తే దెబ్బలకు కొదువా? బ్రహ్మ తలిస్తే ఆయుస్సుకు కొదువా', 'నొసటి మీది వ్రాత మలిమిన పోవునా'. 'నొసట వ్రాసిన వ్రాలు కన్న నూరేండ్లు చింతించినా యేమీ లేదు' (కార్. 2450). 'వ్రాత వెంటగానీ వరమీడు దైవంబు', 'వ్రాత దైవమంత్రు చేత పౌరుషమంత్రు' అనేవి ఆ సామెతలు. మనిషి ఊహలకన్నా రాతే బలవత్తరమని 'ఊహ ఊళ్లేలమంటే రాత రాళ్లు మోయమన్నది' అనే సామెత చెపుతుంది. బ్రహ్మ దీవెనలు, వాక్కులతో సమమైనవి బాలుర దీవెనలు, వాక్కులూ నని 'బాలుర దీవెనలు, బ్రహ్మ దీవెనలు', 'బాలవాక్కు, బ్రహ్మ వాక్కు' (నర) అనే సామెతలు వివరిస్తున్నాయి.

బ్రహ్మ మానవునికి నూరేండ్లు ఆయుస్సు ఇస్తాడని, అయితే దినదినమూ గండాలుంటాయని 'దిన దిన గండం నూరేండ్లాయుస్సు' (బ్రౌన్. పు. 191) అనే సామెత చెపుతుంది.

పుట్టిన ప్రతి ప్రాణీ గిట్టక తప్పదని, పాపికన్న పుణ్యవంతుడు ముందే దైవసన్నిధి చేరుకుంటాడని, ఏకాదశి నాడు చస్తే మంచిదని, అమావాస్యనాడు చస్తే

చెడ్డదని, మంచివానికి చావు అనాయాసంగా వస్తుందని, ఉపవాసమున్నా మంచివాని ప్రాణానికి నలభై దినాల దాకా భయంలేదని సామెతలు తెలుపుతున్నాయి. 'పుట్టుట గిట్టుట కొఱకే', 'పాపీ చిరాయువు, సుకృతీ గతాయువు', 'మంచివానికి వచ్చెనా మరణ కాకితము' (కార్. 1659), 'అన్నీ తెలిశినమ్మ అమావాశ్యనాడు చస్తే ఏమీ తెలియనమ్మ ఏకాదశినాడు చచ్చిందట', 'మంచివాని చావు మరణంలో తెలుస్తుంది', 'మంచి ప్రాణానికి మండలందాకా భయంలేదు' అనేవి పై విషయాల్ని ప్రతిభా వంతంగా వుటంకించే సామెతలు.

4. దయ్యాలు-భూతాలు : హిందువులకు దేవుళ్లంటే ఎంత భక్తో, దయ్యాలు, భూతాలంటే అంత భయం. అపమృత్యువు వాతపడినవారు దయ్యాలై తిరుగుతారని వారి నమ్మకం. జానపద కథల్లో ఎక్కడచూచినా దయ్యాల ప్రసక్తే. చాలామంది స్త్రీలను దయ్యాలు పట్టి పీడిస్తుంటాయి. వాటిని మంత్రగాళ్లద్వారానో, గ్రామ దేవతలద్వారానో తరిమి వేసేందుకు పల్లీయులు ప్రయత్నిస్తుంటారు. అక్క దేవతల్ని బట్టిస్తేనో, వీరనాగమ్మ తిర్నాలకు తీసుక పోతేనో దయ్యాలు పోతాయని కడపజిల్లా రాయచోటి తాలూకా ప్రజల నమ్మకం. అతిగా తినడాన్ని దయ్యపు తిండి అని, పజ్జిగలేని తిండి దయ్యపు తిండి అని, దయ్యాలు బిడ్డలకు పడితే మరణమేనని 'కూరలేని తిండి కుక్కతిండి దారలేని తిండి దయపు తిండి'(నర) 'దయ్యాల ముందర బిడ్డలు బ్రతుకుతారా' అనే సామెతలు తెలుపుతాయి. ఒక చెడ్డవాణ్ణి మరో చెడ్డవాడు కొట్టడాన్ని 'ఊబల నోట్లో దాబలు కొడితే దాబల నోట్లో దయ్యాలు కొట్టినాయంట' అనే సామెత చక్కగా చెపుతుంది. 'బుచ్చిరెడ్డి అనే భూతానికి రామిరెడ్డి అనే రక్ష రేఖ', 'బావి త్రవ్వగా భూతం బయటపడినట్లు', 'భూతాలకు బుద్ధిలేదు వరునకు బద్ధం లేదు' అనేవి భూతాలకు సంబంధించిన సామెతలు.

5 పాప పుణ్యాలు – స్వర్గ నరకాలు : పాపం చేసినవారికి నరకం, పుణ్యం చేసిన వారికి స్వర్గం వస్తాయని హిందూ మత గ్రంథాలు చెపుతాయి. పాపముంటేనే భయం అని, ఎవరి పాపం వార్నే చెరుస్తుందని, పాపి ఎక్కడికి పోయినా పాపం పోదని, పరసతిని కోరినవాడు పాపి అని, దేవునికి దీపాలు పెట్టినా పాపాలుపోవని చెప్పే సామెతలు ఇవి: 'పాపము వుంటే భయము 'పల్లము వుంటే నీళ్లు' (కార్. 2464), 'తన పాపము తన్నే కొట్టును' (సా.సా. 216), 'పాపి సముద్రానికి పోతే అరికాలు తేమ కాలేదట', 'పాప జాతి నరుడు పరసతి గోరు', 'చేసిన పాపాలకు పెట్టిన దీపాలకు సరి' అనేవి ఆ సామెతలు. కుక్కను చంపడం గొప్ప

పాపం. 'కుక్కను చంపిన పాపం గుడి కట్టినను పోదు' (బురా). అని సామెత 'చేటుకాలానికి చెడ్డబుద్ధులు' పుడతాయని మరో సామెత.

కొద్ది పుణ్యమైనా చిత్తశుద్ధితో చేస్తే గొప్ప ఫలితం ఉంటుందని 'చిత్తశుద్ధి కలిగి చేసిన పుణ్యంబు కొంచెమైన నదియు కొదువ గాదు', 'పుణ్యానికి పుట్టినదే సాక్షి. బావికి నీళ్లే సాక్షి' అనే సామెతలు చెపుతున్నాయి.

ఇహంకన్నా పరంకోసమే పాటు పడాలనేది హిందూతత్త్వం. 'ఇహం మన్ను, పరం పైడి' అనే సామెత ఆ విషయాన్ని చక్కగా ప్రతిబింబిస్తున్నది. చిన్నపని చేయలేని వారు పెద్ద పని ఎలా చేయగలరు అనేదానికి 'ఉట్టికెక్క లేనమ్మ 'స్వర్గానికి ఎక్కునా?' అనే సామెత, పవిత్రమైన స్థలానికి వెళ్తూ నీచ వస్తువుల్ని వెంట తీసుకెళ్లడం, పరలోకానికి లౌకిక విషయాల్తో పోవడం అనే విషయాల్ని 'స్వర్గానికి పోతూ చంకన ఏకుల రాట్న మెందుకు?' అనే సామెత ప్రశ్నిస్తుంది. స్వర్గం చాలా ఆనందకరంగా ఉంటుందని జానపదులు తమకు తెలిసిన పట్నంతో పోల్చి 'బతికి పట్నం చూడాలి, చచ్చి స్వర్గం చూడాలి' అనుకుంటారు.

ప్రపంచవ్యాప్తంగా ఉండే అన్ని మతాల్లోనూ పరహింస పాపం అని చెప్ప బడింది. ఆ విషయాన్నే నరకభీతి కలుగజేస్తూ 'నరికినవానికి నరకం అంట' అనే సామెత బోధిస్తుంది. మంచికి సూటిదారి. చెడుకి పక్క దారులు అనేందుకు 'నరకానికి నవద్వారాలు, నాకానికి ఒకటే అని; పరనింద పాపమని 'నవ్వుతూ తిడితివో నరకాన బడితివో' (కాల్. 2425) అనే సామెత తెలుపుతున్నాయి.

6. కర్మ – చెడుకాలం : చేసిన కర్మను బట్టే ఫలితముంటుందని 'ఊరువిడిచి పొరుగూరికి పోయినా పూనిన కర్మ పోదు' అనే సామెత, చెడుకాలంలో మనిషి ఆపదల పాలవుతాడని, దానికి బలవంతులే అక్కరలేదని 'కాని కాలానికి కత్తే పామై కఱుస్తుంది', 'చేటు కాలమైన చెరుప నల్పుడె చాలు' అనే సామెతలు విశదీకరిస్తు న్నాయి. 'ఎవడెవడు చేసుకున్న కర్మ వానికి కొట్టుకుంటుంది' (నర) అనే సామెత చెడ్డ చేసే వార్ని 'తస్మాత్ జాగ్రత్త' అంటోంది.

7. దానం – ధర్మం – ఆచారం: శ్రాద్ధాల్లోనూ, ఇతర మత కార్యాల్లోనూ, బ్రాహ్మణులకు దానమివ్వడం హిందూమత సాంప్రదాయం. శ్రాద్ధాల్లో గోవును దానం చేయాలని, ఆ గోవు తోక పట్టుకొని పితరులు వైతరణీ నదిని దాటుతారని హిందువులు నమ్ముతారు. గోదానం చేయలేనప్పుడు దానికి మారుగా ఏదైనా కొద్ది మొత్తం తీసుకొని గోదానంలాంటివి తమకు చెందినట్లుగా బ్రాహ్మణులు మంత్రాలు

పరించడం కద్దు. ఆ విషయాల్ని 'నూరు వరహాలకు నూలు పోగన్నట్లు', 'నూటికి నూలు పోగు, కోటికి గోవుతోక', 'గోవు తోక పట్టుక పోనా' (ఆం. వి.), 'దశ దానాలకు తోటకూర కట్ట' అనే సామెతలు తెలుపుతున్నాయి. ఒక చెడ్డ పనిచేసి దాని చెడు ఫలితాన్ని పోగొట్టుకొనేందుకు దానాలు చేసేది వృథా అని 'గోవధ గావించి గోరోజనము రోగార్తుల కిచ్చిన పుణ్యాత్ముడగునా?', 'గోవులను గోసి చెప్పులను దానము చేసినట్లు', 'చెఱువులు తెంచి చేపలు పంచినట్లు' అనే సామెతలు నిర్ద్వంద్వంగా ప్రకటిస్తాయి.

వంశ పరంపరగా వచ్చే సంప్రదాయాన్ని రక్షించుకోవాలని అగ్రవర్ణులు తాపత్రయ పడుతుంటారు. కానీ పైకి ఆచారం, లోపల అనాచారం చాలమందిలో ఉంటుందని 'ఆచారం చెప్పిన పెద్ద మనిషి ఆకూటికే', 'ఆచారం ఆదరి పడ్డది ధూపార్తి త్రుళ్లి పడ్డది, కొత్త కుండ తేరా నె(మె)త్తాళ్ల వండుకుందాం' అనే సామెతలు నిరూపిస్తాయి. నె(మె)త్తాళ్ల ఒకరకం చేపలు.

8. ఇలి - బలి : ఈగలకు వేసే బియ్యపు నూకల్ని ఇలి అని, కాకులకు వేసే ఆహారాన్ని బలి అని మతపరంగా అంటారు. లోభిని గురించి, అధార్మికున్ని గురించి చెప్పేందుకు 'వానియింట్లో యిలిబిక్షము బలి బిక్షము పుట్టదు'(కార్.1968) అనే సామెత ప్రయోగిస్తారు.

9. పేరంటాలు : పెండ్లి అయి భర్త జీవించివున్న స్త్రీని పేరంటాలు అంటారు. స్త్రీలు తమ ఇండ్లలో చేసుకొనే వ్రతాలకు పేరంటాండ్లను పిలవడం పరిపాటి. వచ్చినవారికి పిండివంటల్లాంటివి (వాయినాలు) ఇవ్వడం అనే ఆచారాన్ని 'మూసిన వాయినం ముత్తైదు వలె' అనేసామెత తెలుపుతున్నది.

(ఈ) హిందూమత గ్రంథాలు: వేదాలు, ఉపనిషత్తులు (వేదాంతం), భగవద్గీత, రామాయణం, భాగవతాలు హిందువుల పవిత్ర గ్రంథాలు. తిరుగులేని మాటను వేదంగా 'వాడు చెప్పింది వేదము' అనే సామెత చెపుతుంది. 'ఆస్తి గలిగిన అన్నం భట్టు ఆలి ప్రక్కన పడుకొని అరుణం చదివెనట' అనే సామెత అరుణం అనే వేద భాగానికి సంబంధించింది. 'వెలివాడలో వేదఘోషయా' అనేది బ్రాహ్మణేతరులకు వేదపఠనాధికారం లేదని, 'దర్శనంబులారు దైవంబు ఒక్కడే' అనేది వేర్వేరు స్వరూపాల్లో చెప్పబడినా దేవుడు ఒక్కడే అని చెపుతున్నవి. అర్థంకాని విషయాన్ని వేదాంతంతో పోల్చి 'మాట్లాడేవానికి వినేవానికి అర్థంకానిదే వేదాంతం' అనే సామెత చెపుతారు. చాలామంది పండితులు తిండిపోతులే గాని భగవద్గీతాపార్థా

యణం చేయడంగాని, సామాన్య ప్రజలకు బోధించడంగానీ చేయరని, హిందూ మత గ్రంథాలే తెలియని కపట పండితులు లేకపోలేదని 'బ్రతికిన బ్రతుక్కు భగవద్గీతా పారాయణమా?', 'భగవద్గీత పుచ్చుకొంటారా అంటే కడుపునిండింది ఇంక తినలేను అన్నాడట' అనే సామెతలు వ్యంగ్యంగా చెపుతాయి.

(ఎ) హిందూమత స్థావరాలు : గుడి, మఠం, సత్రం హిందూమత స్థావరాలుగా చెప్పుకోవచ్చు. దైవ నివాసం గుడి దైవ భక్తుల నివాసాలు మఠాలు, సత్రాలు. ఒకోసారి గుడిలోనూ దైవ భక్తులు కాలక్షేపం చేస్తూ ఉండవచ్చు.

పుణ్యంకోసం పోతే చావు వచ్చిందని, అనుకోని ఆపదను 'గుడివచ్చి మీద బడ్డట్టు' (బ్రౌన్) అనే సామెతతో సూచిస్తారు. 'గుడిలోనుండి గుడిరాళ్లను దీయు నీచులుంటారని; 'రాజులేని ఊళ్లు, పూజలేని గుళ్లు' ఒకలాంటివేనని, పలువురు సన్యాసులకు గుడి ఆశ్రయమైనందున 'ఊళ్లో ముద్ద, గుళ్లో నిద్ర' అనే సామెత; గుడి నిర్మాణం అభేద్యంగా ఉంటుందనో, ఇంట్లో ఆలు, పిల్లల పోరు వుండగా, గుళ్లో దేవునిపోరు ఉండదనో గాని 'ఇంటికన్నా గుడి పదిలం' అనే సామెత వచ్చాయి. 'గుడి ముందరఙ గుడిసెలు నిలుచునా' (సాసా. 168) అనే సామెత అంతరార్థం అవగతం కాలేదు. కృతఘ్నతకు చిహ్నమైన సామెత 'గుడినుండి గుడి రాళ్లు దీసేవారు' అనేది. పవిత్రమనుకోకుండా గుడి సొమ్మును కాజేసిన వార్నో, దేవాలయాల్ని పడగొట్టేవార్నో గురించి చెప్పేది 'గుడి మింగేవాడొకడయితే గుడిలో లింగాన్ని మింగే వాడింకొకడు, గుడిని గోపురాన్ని మ్రింగేది మరి యొకడు' అనే సామెత.

సన్యాసులు మొదలైన వారుండే గృహాన్ని మఠం అంటారు. శైవులకు మొదట విద్య, శైవదీక్ష ఇచ్చినవి మఠాలు. వీటిపోషణ రాజులు, ధనికులు. మొదట మతపరంగా మఠాల నాశ్రయించినా రానురాను తిండికోసం శైవులమని చెప్పుకొంటూ చాలామంది మఠాల నాశ్రయించారు. 'మంది చేరితే మఠానికి చేటు' అని 'పెద్దలులేని యిల్లు, సిద్ధులులేని మఠం' అని సామెతలు.

అనాడు సత్రాల్లో ఉచిత భోజనం పెట్టేవారని 'సత్రం భోజనం మఠంనిద్ర' అని; 'సత్రంకూటికి అయ్యంగారి సిఫార్సా' (చంద్ర), 'సత్రం కూటికి సర్కారు సెలవెందుకు' అనే సామెతలు సత్రాల్ని గురించి చెప్పేవి.

4.1.2 వైష్ణవమతం : విష్ణువు దేవతా సార్వభౌముడని భావించి కొలిచే మతం వైష్ణవం. హిందూమతంలో ఒక శాఖే ఇది. వేదాల్ని, ఆళ్వార్ల ద్రావిడ వేదాల్ని

సమంగా చూస్తారు వైష్ణవులు. క్రీస్తు పూర్వం వైష్ణవాన్ని సాత్వతం, భాగవతం అనే వారు. వాసుదేవుడు ప్రధాన దైవం. క్రీ. శ. నాలు గైదు శతాబ్దాల్లో దీనికి రాజాదరణ లభించి, విష్ణ్వాలయ నిర్మాణాలు జరిగాయి. పంద్రెండవ శతాబ్దినాటికి భక్తి ప్రధానమైన. కుల భేదం రూపుమాపిన వైష్ణవం తమిళదేశం నుంచి ప్రాకి జైన, శైవ మతాల్తో పోటీ పడింది. శైవ-వైష్ణవ కలహాలు 12—14 శతాబ్దాల్లో కోకొల్లలుగా జరిగాయి. విజయనగర రాజుల్లో సాళువ నరసింహరాయలు, తర్వాతి తుళువ, ఆరవీటి వంశస్థులు పరమ వైష్ణవులు. ఇప్పటికీ వైష్ణవ మతానికి ఆదరణ సన్నగిల్ల లేదు.

వైష్ణవ మత ప్రసక్తి ఉన్న సామెతలు (అ) దైవ సంబంధి (ఆ) భక్త సంబంధి (ఇ) మత చిహ్నాలు (ఈ) పూజాసంబంధి (ఉ) పుణ్యక్షేత్రాలు (ఊ) మత పవిత్రదినాలు అనే శీర్షికల కింద వింగడించి వివరించబడ్డాయి.

(అ) దైవ సంబంధి : ఈ శీర్షికలో విష్ణువు, శ్రీరాముడు, వేంకటేశ్వరుడు, రంగనాథుడు, అప్పన్న, పెరుమాళ్లు, మహాలక్ష్మి, జ్యేష్ఠాదేవి అనే దైవాలకు సంబంధించిన సామెతలున్నాయి.

1. విష్ణువు: విష్ణు సంబంధి సామెతల్లో పొగడే వాటికన్నా తెగడేవే ఎక్కువ. వైష్ణవేతరులు ఈర్ష్యతో 'విధవగమనుండు చూడంగ విష్ణుడాయె' అనే సామెతను పుట్టించారు. అంతరార్థం విధవతో పోయేవాడు అని; బాహిరార్థం పక్షిరాజుపై వెళ్లే వాడు అని. దౌర్భాగ్యులకు స్వామి పేరు అతికించడం. ఊత పదాలుగా వాడడం కూడా జరిగింది. 'దౌర్భాగ్యదామోదరుడు', తోకంటి నారాయణా అన్నట్లు' (నర) 'రమాపతే సీతాపతే పొద్దునలేస్తే పొట్టే గతి' లాంటివి. 'నలుపు నారాయణమూర్తి' అనేది స్వామి వొంటి రంగును తెలుపడమేగాక నలుపును ఈసడించుకొనేవారికి వ్యతిరేకంగా చెప్పటంకూడా ఉంది. మాధవసేవ మానవసేవ చేయడమేనని, నర కంలో నారాయణుడుండడని 'మానవసేవే మాధవసేవ', 'నరకంలో నారాయణు డుండునా? అనే సామెతలు తెలుపుతాయి.

2. శ్రీరాముడు : విష్ణువు అవతారాల్లో రామావతారం ఒకటి. రామునిగురించి, ఆయన చరిత్రను గురించి సామెతలున్నాయి. 'శ్రీరామరక్ష నూరేండ్లాయుస్సు' అనుకొనే భక్తునికి 'నిధి చాల సుఖమా రాముని సన్నిధి సుఖమా?' అనే ప్రశ్న రానే రాదు. సంస్కృత నామాల్ని విభక్తుల్తో కలిపి నేర్చుకొనేటప్పుడు 'రామ' శబ్దంతో మొదలు పెడుతుంటారు. తిండిపోతులకు 'కన్నులు కంచాలమీద, నోరు

రాఘః రామౌ రామాః' అని సామెత హేళనచేస్తున్నది. 'రాముడున్నాడు రాజ్య ముంది' అనే భక్తులు రామునిపై భారంవేసుకొని ఉంటే 'రాముడు రాజ్యం చేస్తే నేమి? రావణుడు రాజ్యం చేస్తే నేమి?' అనేది నాస్తికుల ప్రశ్న. అవకాశవాదులు 'రాఘవా స్వస్తి రావణా స్వస్తి' అంటారని, వైష్ణవద్వేషులకు 'రామాయణం రంకు, భారతము బంకు, భాగవతము బొంకు' అని సామెతలు చెపుతున్నాయి.

3. శ్రీ వేంకటేశ్వరస్వామి : 15, 16 శతాబ్దాలనుంచి నేటిదాకా తిరుగులేని దైవంగా, అధికాదాయంతో, దేశ విదేశ భక్తుల్ని తన సన్నిధికి రప్పించుకొనే స్వామి వేంకటేశ్వరుడు. సముద్రమట్టానికి 2800 అడుగుల ఎత్తున ఏడు కొండల పైన తిరుమలలో వెలసి ఉన్నాడు. దిగువ తిరుపతిలో గోవిందరాజస్వామివారు వేంచేసివున్నారు. కొండమీది కెక్కుతూనూ, దేవాలయంలోనూ, 'గోవింద' అని నామ స్మరణచేయడం పరిపాటి. 'ముడుపులు వేంకటేశ్వరుడికి, కేకలు గోవిందునికి', 'గోల గోవిందుడిది అనుభవం వేంకటేశ్వరునిది', 'వేడుక వెంకటేశ్వరుడిది గోల గోవిందుడిది' అనే సామెతలు ఈ విషయాన్నే తెలుపుతాయి. 'వంగాడి కొండ వణికింది, సాకిబండ సాగింది, పాలకొండ పదిరింది, మొట్టికొండ మోటుకొనింది' (వర) అనే సామెత అంతరార్థం కడపజిల్లా రాయచోటి తాలూకాలో ఇలా చెప్పు కుంటారు. వెంకటేశ్వరస్వామి వెలిసేందుకు వంగాడికొండమీద అడుగు పెట్టగా వణికిందని, సాకిబండమీద కాలుపెట్టగా సాగిందని, పాలకొండమీద పాదం మోపగా పదిరిందని, మొట్టికొండ (శేషాచలం) మోటుకొని నిలబడినందువల్ల అక్కడ వెలి శాడని జానపదుల కథ. పాలకొండపైన స్వామి ఒకపాదం ఉండగా, మరోపాదం శిల్పులచేత చేయించి ఇప్పటికీ స్థానికులు పూజ చేస్తున్నారు.

4. శ్రీరంగనాథుని ప్రసక్తి : 'కలిపి కొట్టరా కావేటిరంగా' అనే సామెతలో మాత్రమే ఉంది.

5. సింహాద్రి అప్పన్న : సింహాద్రిలో వెలసిన నరసింహమూర్తి హిరణ్య కశిపుని చంపిన ఉగ్రనరసింహుడని. ప్రహ్లాదుణ్ణి చంపేందుకు సింహాద్రి కింద వేయగా స్వామి ఒక వైపుకు వంచాడని, అందుకు చిహ్నంగా అక్కడ స్వామిని ప్రహ్లాదుడు ప్రతిష్ఠించాడని ఐతిహ్యం. స్వామి తాపాన్ని పోగొట్టేందుకు, స్వామి ఉగ్రస్వరూపం భక్తుల్ని కాల్చివేయకుండేందుకు, స్వామివిగ్రహానికి చందనం పూత వేసి ఉంటారు. సంవత్సరానికొకసారి వైశాఖమాసంలో అక్షయ తృతీయనాడు మాత్రం స్వామి నిజ స్వరూపాన్ని భక్తులు దర్శించుకోవచ్చు. అప్పని ప్రాచీనతను

'అప్పుకి కాలమునుంచే లేదు ఉప్పువేసిన గంజి' అనే సామెత, భక్తి లేని వార్ని శిక్షిస్తాడని చెప్పేందుకేమో 'అప్పను చూడబోతే తెప్పలు బోయినవి' అనే సామెత చెపుతారు.

6. పెరుమాళ్లు : స్వామి తమిళనామం పెరుమాళ్. 'ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడు' అనే సామెత, 'ఇంటి గుట్టు పెరుమాళ్ల కెరుక' ఏది దేనికి మాతృకో చెప్పలేము. దేవుని చేరాలంటే కష్టపడి తీరాలని 'పెన్న దాటితే పెరుమాళ్ల సేవ' అనే సామెత తెలుపుతుంది. పెన్న దాటింతర్వాతనే నెల్లూరులో వెలసిన 'పళ్లికొండ పెరుమాళ్లు' (శయనరంగనాథస్వామి) ను దర్శించుకోవచ్చునని ఈ సామెత తెలుపుతున్నది.

7. మహాలక్ష్మి – జ్యేష్ఠాదేవి : స్వామి పెద్ద భార్య జ్యేష్ఠాదేవి పెద్దమ్మ. చిన్న భార్య లక్ష్మీదేవి చిన్నమ్మ. చిన్నమ్మ సిరినిస్తుందని పెద్దమ్మ దరిద్రాన్ని తెస్తుందని, సిరివస్తే దరిద్రం పోతుందని, సిరి వెంటనే దరిద్రం ఉంటుందని 'చిన్నమ్మ సింహద్వారాన వస్తే పెద్దమ్మ పెరటి దారిని పోతుంది', 'పెద్దమ్మా ! నీ వెక్కడికంటే చిన్నమ్మా! నీ వెంటనే ఉంటానన్నదట' అనే సామెతలు తెలుపుతాయి. సంస్కృత భాషా దుర్వినియోగాన్ని, లక్ష్మీనిందను 'లంజా అంటే లక్ష్మీదేవి అన్నట్లు' అనే సామెత తెలుపుతుంది.

(అ) భక్త సంబంధి : పన్నెండుగురు ఆళ్వార్లు ద్రావిడ దేశంలో పుట్టి భక్తి ప్రధానమైన వైష్ణవ మతాన్ని వ్యాప్తి చేశారు. వారి తర్వాత వైష్ణవ సంప్రదాయాన్ని పరివ్యాప్తం చేసినవారు ఆచార్యులు నాథముని, పుండరీకాక్షుడు, యామునాచార్యులు, రామానుజాచార్యులు మొదలైనవారు. వీరి తర్వాత అయ్యంగార్లు ఆ మతాన్ని తెలుగుదేశంలో 13, 14 శతాబ్దుల్లో ప్రచారం చేశారు.

ఈ శీర్షిక కింద ఆచార్యులు, అయ్యవార్లు, ఉపాధ్యాయులు, శ్రీవైష్ణవులు, సాతాని, దాసర్లు, గురువులు–శిష్యులు అనే వివిధ విష్ణుభక్తుల గురించిన సామెతల చర్చ ఉంటుంది.

1. ఆచార్యులు : వైఖానస ఆగమ పండితులు భట్టాచార్యులను, భాస్కరాచార్యులను (శ్రీరామానుజాచార్యులను) నిరసిస్తూ చెప్పిన సామెతలివి: 'భట్టాచార్యుల పట్టాఉ కాగానే తిరుచూర్ణపు బుఱ్ఱలగునా', 'భాస్కరాచార్యుల (భాష్యకారాచార్యుల) వెంట్రుకలైతే మాత్రం పీణకు తంతులవుతవా?' అనేవి. కృష్ణరాయల గురువైన తాతాచార్యులు తిరుదీక్ష నిచ్చేందుకు ముద్రలు వేసేవారు. మరిగంటివారు

రాఘః రామౌ రామాః' అని సామెత హేళనచేస్తున్నది. 'రాముడున్నాడు రాజ్య ముంది' అనే భక్తులు రామునిపై భారంవేసుకొని ఉంటే 'రాముడు రాజ్యం చేస్తే నేమి? రావణుడు రాజ్యం చేస్తేనేమి?' అనేది నాస్తికుల ప్రశ్న. అవకాశవాదులు 'రాఘవా స్వస్తి రావణా స్వస్తి' అంటారని, వైష్ణవద్వేషులకు 'రామాయణం రంకు, భారతము బొంకు, భాగవతము బొంకు' అని సామెతలు చెపుతున్నాయి.

3. శ్రీ వేంకటేశ్వరస్వామి : 15, 16 శతాబ్దాలనుంచి నేటిదాకా తిరుగులేని దైవంగా, అధికాదాయంతో, దేశ విదేశ భక్తుల్ని తన సన్నిధికి రప్పించుకొనే స్వామి వేంకటేశ్వరుడు. సముద్రమట్టానికి 2800 అడుగుల ఎత్తున ఏడు కొండల పైన తిరుమలలో వెలసి ఉన్నాడు. దిగువ తిరుపతిలో గోవిందరాజస్వామివారు వేంచేసివున్నారు. కొండమీకి ఎక్కుతూనూ, దేవాలయంలోనూ. 'గోవింద' అని నామ స్మరణచేయడం పరిపాటి. 'ముడుపులు వేంకటేశ్వరుడికి, కేకలు గోవిందునికి', 'గోల గోవిందుడిది అనుభవం వేంకటేశ్వరునిది', 'వేడుక వెంకటేశ్వరుడిది గోల గోవిందుడిది' అనే సామెతలు ఈ విషయాన్నే తెలుపుతాయి. 'వండాడి కొండ వణికింది, సాకిబండ సాగింది, పాలకొండ పదిరింది, మొట్టికొండ మోటుకొనింది' (వర) అనే సామెత అంతరార్థం కడపజిల్లా రాయచోటి తాలూకాలో ఇలా చెప్పు కుంటారు. వెంకటేశ్వరస్వామి వెలిసేందుకు వండాడికొండమీద అడుగు పెట్టగా వణికిందని, సాకిబండమీద కాలు పెట్టగా సాగిందని, పాలకొండమీద పాదం మోపగా పదిరిందని, మొట్టికొండ (శేషాచలం) మోటుకొని నిలబడినందువల్ల అక్కడ వెలి శాడని జానపదుల కథ. పాలకొండపైన స్వామి ఒకపాదం ఉండగా, మరోపాదం శిల్పులచేత చేయించి ఇప్పటికీ స్థానికులు పూజ చేస్తున్నారు.

4. శ్రీరంగనాథుని ప్రసక్తి : 'కలిపి కొట్టరా కావేటిరంగా' అనే సామెతలో మాత్రమే ఉంది.

5. సింహాద్రి అప్పన్న : సింహాద్రిలో వెలసిన నరసింహమూర్తి హిరణ్య కశిపుని చంపిన ఉగ్రనరసింహుడని. ప్రహ్లాదుణ్ణి చంపేందుకు సింహాద్రి కింద వేయగా స్వామి ఒక వైపుకు వంచాడని, అందుకు చిహ్నంగా అక్కడ స్వామిని ప్రహ్లాదుడు ప్రతిష్ఠించాడని ఐతిహ్యం. స్వామి తాపాన్ని పోగొట్టేందుకు, స్వామి ఉగ్రస్వరూపం భక్తుల్ని కాల్చివేయకుండేందుకు, స్వామివిగ్రహానికి చందనం పూత వేసి ఉంటారు. సంవత్సరానికొకసారి వైశాఖమాసంలో అక్షయ తృతీయనాడు మాత్రం స్వామి నిజ స్వరూపాన్ని భక్తులు దర్శించుకోవచ్చు. అప్పని ప్రాచీనతను

'అప్పు కి కాలమునుంచే లేదు ఉప్పువేసిన గంజి' అనే సామెత, భక్తి లేవి వార్ని శిక్షిస్తాడని చెప్పేందుకేమో 'అప్పను చూడబోతే తెప్పలు బోయినవి' అనే సామెత చెపుతారు.

6. పెరుమాళ్లు : స్వామి తమిళనామం పెరుమాళ్. 'ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడు' అనే సామెత, 'ఇంటి గుట్టు పెరుమాళ్ల కెరుక' ఏది దేనికి మాతృకో చెప్పలేము. దేవుని చేరాలంటే కష్టపడి తీరాలని 'పెన్న దాటితే పెరుమాళ్ల సేవ' అనే సామెత తెలుపుతుంది. పెన్న దాటింతర్వాతనే నెల్లూరులో వెలసిన 'పళ్లికొండ పెరుమాళ్లు' (శయనరంగనాథస్వామి) ను దర్శించుకోవచ్చునని ఈ సామెత తెలుపుతున్నది.

7. మహాలక్ష్మి – జ్యేష్టాదేవి : స్వామి పెద్ద భార్య జ్యేష్టాదేవి పెద్దమ్మ. చిన్న భార్య లక్ష్మీదేవి చిన్నమ్మ. చిన్నమ్మ సిరినిస్తుందని, పెద్దమ్మ దరిద్రాన్ని తెస్తుందని, సిరివస్తే దరిద్రం పోతుందని, సిరి వెంటనే దరిద్రం ఉంటుందని 'చిన్నమ్మ సింహద్వారాన వస్తే పెద్దమ్మ పెరటి దారిని పోతుంది', 'పెద్దమ్మా ! నీ వెక్కడికంటే చిన్నమ్మా! నీ వెంటనే ఉంటానన్నదట' అనే సామెతలు తెలుపుతాయి. సంస్కృత భాషా దుర్వినియోగాన్ని, లక్ష్మీనిందను 'లంజా అంటే లక్ష్మీ దేవి అన్నట్లు' అనే సామెత తెలుపుతుంది.

(ఆ) భక్త సంబంధి : పన్నెండుగురు ఆళ్వార్లు ద్రావిడ దేశంలో పుట్టి భక్తి ప్రధానమైన వైష్ణవ మతాన్ని వ్యాప్తి చేశారు. వారి తర్వాత వైష్ణవ సంప్రదాయాన్ని పరివ్యాప్తం చేసినవారు ఆచార్యులు నాధముని, పుండరీకాక్షుడు, యామునాచార్యులు, రామానుజాచార్యులు మొదలైనవారు. వీరి తర్వాత అయ్యంగార్లు ఆ మతాన్ని తెలుగుదేశంలో 13, 14 శతాబ్దుల్లో ప్రచారం చేశారు.

ఈ శీర్షిక కింద ఆచార్యులు, అయ్యవార్లు, ఉపాధ్యాయులు, శ్రీవైష్ణవులు, సాతాని, దాసర్లు, గురువుల-శిష్యులు అనే వివిధ విష్ణుభక్తుల గురించిన సామెతల చర్చ ఉంటుంది.

1. ఆచార్యులు : వైఖానస ఆగమ పండితులు భట్టాచార్యులను, భాస్కరాచార్యులను (శ్రీరామానుజాచార్యులను) నిరసిస్తూ చెప్పిన సామెతలివి: 'భట్టాచార్యుల పట్టెలు కాగానే తిరుచూర్ణపు బుడ్డిలగునా', 'భాస్కరాచార్యుల (భాష్యకారాచార్యుల) వెంట్రుకలైతే మాత్రం పీణకు తంతులవుతవా?' అనేవి. కృష్ణరాయల గురువైన తాతాచార్యులు తిరుదీక్ష నిచ్చేందుకు ముద్రలు వేసేవారు. మరిగంటివారు

తెలంగాణంలో వైష్ణవ దీక్షను ఇచ్చేవారు. అద్దంకివారి విషయం ఏనాటిదో తెలియ లేదు. కానీ అక్కడా వైష్ణవపీఠం ఉండి వుండేది అని తెలుస్తున్నది. ఈవిషయాల్ని 'తాతాచార్యులవారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు', 'మరిగంటివారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు', 'అద్దంకివారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు' అనే సామెతలు విపులీకరిస్తాయి.

2. అయ్యవార్లు/అయ్యంగార్లు/ఉపాధ్యాయులు :

వైష్ణవమత వ్యాప్తి చేసే గురువులు. వీర్నే గాకుండా వీరి భార్యల్నీ వాహనాల్నీ నిందించిన సామెతలున్నాయి. 'అయ్యవారయ్యవారు అటికంత, అయ్యవారి పెండ్లాము పుటికంత, పుటిక తీసుకొనిపోయి మూలయింట్లో పెట్టితే నక్క యెత్తుకొని పోయింది నారాయణా' (కార్. 2163), 'అయ్య తిరుపతి, అమ్మ పరపతి', 'ఆచారి గుఱ్ఱం బహు దొడ్డ గుఱ్ఱం నామాల సంచి మోయలేక చచ్చె', 'ఉండే వెల్లా ఉండగా వుపాధ్యాయుల భార్యకు దడిబియ్యము' అనేవి పై విషయాల్ని చెప్పే సామెతలు. గొడ్డూ గోదా లేకుండా ఉండే యింటిని 'అయ్యవార్లగారి నట్టిల్లు వలె' అని పోలుస్తారు.

1. నంబులు : వైష్ణవ దేవాలయాల్లో పూజారులు. వీరు బ్రాహ్మణుల్లో తక్కువగా చూడబడేవారు. దేవాలయాలకు భక్తులిచ్చే చమురు, నైవేద్యం, వీరు సొంతానికి ఉపయోగించుకొనేవారని 'కుడువకూడు, తిన గుగ్గిళ్లు, తలకు చమురు, తరుణి గల నంబితనమే మేలు' అనే సామెత తెలుపుతున్నది. గుడిసొమ్ము ఏదైనా పోయినా వారికేం బాధ, బాధ్యతా లేదు అనే విషయానికి 'గుళ్లో గంట పొతే నంబి శంఠం పోయె' (నర) అనే సామెత, శుభకార్యానికి నంబి ఎదురు రావడం అపశకునం అని చెప్పే సామెతల్లో మచ్చుకు ఒకటైన 'నంబీ, 'తంబళీ, నాగుబాము, చెవులపిల్లి యెదురైతే చేటు వస్తుంది' (కార్. 1217) అనే సామెత ప్రత్యక్ష సాక్షులు.

దేవుని ఊరేగింపులో తేరుమీద నంబి ఉండి స్వామికి భక్తులు సమర్పించే టెంకాయలు కొట్టడం, కర్పూరం వెలిగించడం చేస్తూంటాడు అనే విషయాన్ని 'దేవుని తేరు యీడ్వలేకున్న ధర్మకర్త నంబి నాయాలు బరువైనాడుగాని దేవుడే అయితే నా వెంట్రుకకు కట్టి లాగనా అన్నాడట' అనే సామెత తెలుపుతున్నది. నంబులు మీసం ఉంచుకొనేవారని, బ్రాహ్మణుల్లో గౌరవాన్ని పొందటానికి యజ్ఞాలు చేసేవారని, అయినా వారికి గౌరవం పెరిగేది కాదని 'మున్నూరు వరహాలు పోయే

మూతి మీసాలు పోయె। నంబి సోమయాజులు అన్నమాట తప్పదాయె' అనే సామెత తలో ఒక నంబి ఎంతో ప్రయత్నించి కూడా గౌరవం పొందలేక ఆవేదనతో అన్న మాటలు వినిపిస్తున్నాయి. నంబి శివదేవాలయాల్లోను అర్చకుడుగా ఉండేవాడు అనే దానికి 'గుడికో లింగం పోతే నడుమ నంబికేం నష్టం' అనే సామెత సాక్షి.

సాతానులు : వైష్ణవార్చకులు సాత్తని, సాత్తిన అని రెండు శాఖలు. సాత్తని వారు నెత్తి బోడిగా గొరిగించుకొని జందెం లేకుండా ఉండేవారు. అసందర్భానికి ఉదాహరణగా 'సాతాని జుట్టుకు సన్యాసి జంధ్యానికి ముడివేసినట్టు' అనే సామెత, అనైకమత్యానికి 'సాతాని పీకులాటవలె' అనే సామెత వచ్చాయి. అన్ని కులాల వార్ని తమలో కలుపుకుంటారు కాబట్టి సాతానుల్లో పీకులాట తప్పదు అనే విషయాన్ని ఈ సామెత తెలుపుతున్నది. సాతానులను కించపరిచేందుకు 'సాలె సభకు సాతాని పెద్ద వుల్లివనానకు జోరీగ కోకిల' అనే సామెత ప్రయోగింపబడింది. సాతాని వాని గర్భాదానంలోని అవకతవకల్ని 'చుట్టుడు చాప, విసురుడు తలుపు, పెడసరపు పెండ్లాము', 'సాతాని గర్భాదానం'' అనే సామెతలు తెలుపుతున్నాయి.

దేవదాసీలు : శైవులు బసివిరాండ్రను తయారుచేసి, వ్యభిచారిణులను చేయగా వైష్ణవులు ముద్రవేసి 'దేవదాసీ' లను సిద్ధం చేశారు. గుడిలో దైవపూజా సమయంలో నృత్యం చేయడం, దైవ పరిచర్యలు చేయడం వీరి పనులు. రాను రాను వీరు వ్యభిచారిణులుగా తయారయ్యారు. 'గుడిమేళం కాదు గుద్ద తిప్పను, ఇది నగరి మేళం నడుము విరుగుతుంది', 'లంజ లేకపోతే గుడి రాజిల్లదు' ప్రజల మనసు రంజిల్లదు' అనే సామెతలు ఇందుకు తార్కాణాలు. గుడిచేటి అనే పదం కాల క్రమేణా వ్యభిచారిణి అనే పదానికి పర్యాయపదం అయిపోయింది.

దాసర్లు : శూద్ర కులస్థులైన విష్ణు భక్తులు దాసర్లు. వీరికి భిక్షాటనమే వృత్తి. 'బూటాలకం దాసరికి బుర్ర నిండా నామాలే' అనేది అతని ఆకారాన్ని, 'రోకలి పాట దాసరి పాట', 'పాచి పండ్ల దాసరికి కూటిమీదనే ఆలాపన' అనేవి అతడు తెల వారు జామునే భిక్షకు వెళ్తాడని, భిక్షాటనతో అతనికి కడుపు నిండకపోవచ్చును అనేదానికి 'దాసరి పాట్లు పెరుమాళ్లకు యెరుక' (కార్. 1154) అనే సామెత తార్కాణాలు. భిక్షగా ఏదిచ్చినా దాసరి పుచ్చుకుంటాడు అనేదానికి 'పచ్చి కంకులే దాసరి అంచే రాలిన కాడికే గోవిందా అన్నట్టు' అనే సామెత; దాసర్లు కల్లు తాగు తార నిందకు 'ఊరంతా ఊరిముఖం దాసరి తాళ్లముఖం' అనే సామెత ప్రయోగించబడ్డాయి. వీరు పాడినకీర్తనలే మళ్లీ పాడతారని 'పాడిందే పాడరా పాచిపండ్ల

దాసరి' అనే సామెత, కరువుకాలంలో చాలామంది భిక్షంకోసమే దాసర్లుగా మారతారని 'కరువుకు దాసరులైతే, పదాలెక్కడ వస్తాయి' అనే సామెత వ్యక్తపరుస్తున్నాయి.

**శ్రీ వైష్ణవులు :** శ్రీ వైష్ణవుల్ని మద్యమాంసాలు తినేవారుగా చిత్రించిన సామెతలు వైష్ణవేతరులు పుట్టించినవి. 'చుట్టూరా శ్రీ వైష్ణవులే చూస్తే కల్లుకుండ లేదు', 'అందరూ శ్రీ వైష్ణవులే బుట్టెడు రొయ్యలెగిరి పోతున్నాయి' అనేవి ఆ సామెతలు. వైష్ణవుల ఇంట్లో పిల్లిని హేళనచేస్తూ, వైష్ణవుల్ని భంగ్యంతరంగా నిందించిన విధాన్ని 'ఒత్తిపలకవే వైష్ణవ పిల్లీ అంటే మ్యావ్ మ్యావ్ అన్నదట' అనే సామెత తెలుపగా, వైష్ణవుల్ని నరభక్షకులుగా శైవులు చిత్రీకరించిన విధాన్ని 'నిన్ను శ్రీ వైష్ణవుడు నమలి తినా' అనే సామెత తెలుపుతుంది.

**గురు-శిష్యులు :** గురువుల గురించి, గురుశిష్య సంబంధాన్ని గురించి చెప్పిన సామెతల్లో 'గురువులేని విద్య గుడ్డి విద్య' అని, కుత్సితునికి గురుభక్తి ఉండదని, గురువు కెగ్గుచేయడం కృతఘ్నత అని 'కుత్సితునకు నేల గురుదేవతా భక్తి', 'గురువు కెగ్గు చేసినవాని కృతఘ్నత్వమెంత?' అనే సామెతలు చెపుతాయి. గురువులను గురించి చెడ్డగా చెప్పిన సామెతల్లో 'ఉపాధ్యాయులు యేమి చేస్తున్నారంటే అబద్ధాలు వ్రాసి దిద్దుకొంటున్నారు అన్నాడట' (కార్. 325) అనే సామెత, గురువుకు రేగినా గుఱ్ఱానికి రేగినా పట్టేది కష్టం' అనే సామెత ముఖ్యమైనవి. సమర్థునకు నేర్పింపబోవడం 'గురువునకు తిరుమంత్రం చెప్పినట్లు' వృథా యని ఒక సామెత. గురువు నిషిద్ధ వస్తువును ఉపయోగించినా శిష్యుడు ఎదురు తిరిగి అడగరాదని, తానూ ఆ నిషిద్ధకార్యాన్ని చేయరాదని 'ఒజ్జలు పుచ్చకాయ వలె', 'గురువు లోరి పొగచుట్ట' (క. గా.) అనే సామెతలు బోధిస్తాయి. పాముతో పంతుల్ని పోల్చిన సామెత 'పాముకు విరుగుడుంటే పంతులకుండదా' అనేది. స్వాములు కపటులు అని 'పాములలో మెలగవచ్చుకాని సాములతో మెలగడం కష్టం' అనే సామెత. తప్పులేకుంటే శిష్యుడు గురువునైనా ఎదిరించవచ్చునని 'తనలో తప్పు లేకుంటే గురువుతో గుద్దులాడవచ్చునట' (హైసా. X-12.) అనే సామెత తెలుపుతున్నాయి.

**(ఇ) వైష్ణవ మత చిహ్నాలు :** ఈ శీర్షికలో నామాలు, శఠగోపం, ముద్ర అనే మతచిహ్నాలను చెప్పే సామెతల్ని గురించి ఉంటుంది. నామాల్నే 'పుండ్రాలు' అని కూడా అంటారు. వీటిని శరీరంపై పన్నెండు తావుల్లో దిద్దకోవడం వైష్ణవా

చారం. నొసలు, ఉదరం, హృదయం. కంఠమూలం, పార్శ్వద్వయం, బాహుద్వయం, కర్ణద్వయం, పృష్ఠభాగం, వెన్నెముక – ఈ పంద్రెండు శరీరభాగాల్లో వైష్ణవులు ధరించే తిలకాన్నే పుండ్రాలు అంటారు. పుండ్రాలు తీర్చే పవిత్రమైన మట్టినే 'తిరుమణి' అంటారు.

వైష్ణవునిగా నమ్మించేదుకు ద్వాదశపుండ్రాలు బదులు ఇబ్బడిగా పెట్టుకొన్నా అంబటి మెతుకులే గతి అయ్యాయని ఒక కపట వైష్ణవుని బాధ. 'ఈఅంబటి మెతుకులకేనా ఇరవై నాలుగు నామాలు' అనే సామెతలో వ్యక్తమవుతున్నది. భోజనం అయిన తర్వాత నామాలు దిద్దుకుంటారు అనే విషయాన్ని 'నీమం కోసం నామం పెడితే నామం నా కొంప దీసింది' అనే సామెత తెలుపుతుంది. వైష్ణవులు అవినీతి పరులు అని నిందించిన సామెతల్లో నామాల ప్రసక్తి ఉన్నవి: 'నామాలవారేగాని నీమాల (నియమాల) వారుగారు', 'నామము హెచ్చిన కామము తగ్గునా?', 'నొసట నామాలు నోట బండ బూతులు'. 'నన్ను ముట్టుకోకు నామాల కాకీ' అనేవి. చివరి సామెతలో వైష్ణవుణ్ణి చండాలునితోను, కాకితోను పోల్చడం జరిగింది. తిరుమణి ధరించడానికి ఎంతో నైపుణ్యం కావాలి అనే విషయాన్ని 'తిరుమణి పెట్ట నేరిస్తే తీర్థాలు గడిచినట్లు', 'అచ్చ తిరుమణి ధారి అయితే పుల్లపట్టడంలోనే తెలుస్తుంది' అనే సామెతలు తెలుపుతాయి. శిష్యునికి నామాలు తీర్చడం గురువు నేర్పుతాడు. శిష్యుడు గురువును మోసంచేయడాన్ని 'గురువుకు పంగనామాలు పెట్టినట్లు' అనే సామెత నిరసిస్తున్నది. తిరుమణిని వ్యంగ్యంగా నిందించేది 'తీటమ్మా తీటమ్మా నీ నొసలే మయ్యింది అంటే తిరుమణి పెడితే పొక్కింది అన్నదట' అనే సామెత.

విష్ణుని ఆయుధాలైన శంఖచక్రాల చిహ్నాల్ని రెండు భుజాలపైనా కాల్పించుకోవడం ముద్రాధారణ అని, ఆ చిహ్నాల్ని ముద్రలని అంటారు. ముద్రవేయించుకొన్నవారు ఏ కులమైనా వైష్ణవులే అవుతారు. విజయనగరరాజుల కాలంలో ముద్ర వేయడం బలవంతంగా కూడా జరిగేదని 'తాతాచార్యుల ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు' అనే సామెత తెల్పుతుంది. అట్లే మరిగంటి వారి ముద్ర, అద్దంకివారి ముద్రను గురించిన సామెతల్ని ఇంతకు ముందే చెప్పుకొన్నాం కూడా.

(ఈ) పూజా సంబంధి : వైష్ణవ పూజా సంబంధి శీర్షికలో గరుడసేవ, దాసంగం, అష్టాక్షరి నామ జపం, తిరువాయి మొళి, తులసి పూజ, సాలగ్రామ పూజ అనేవి చేరతాయి.

కంచి వరదరాజస్వామికి చేసే గరుడసేవ ఆయనకే తగునని ఇతరులకు

అనర్థమని 'ఈ మొద్దు మొగానికా ఆ గరుడసేవ' అనే సామెత నిరూపిస్తుంది.

ఏకాదశి పండుగకు ఒక్క ప్రొద్దులుండి, కొత్త కుండలో వంట, పాయసం లాంటివి వండుకొని, పళ్లేలు వేయడాన్ని 'దాసర్లు పెట్టడం, దాసంగం పెట్టడం' అంటారు. తిరుమలకొండ మీదగాని, కొండకిందగాని దాసంగం పెడ్తారు. లేదా తమ వూరికి వెళ్లిన తర్వాత వారం తిరిగేటప్పుడు మారు పళ్లేలు వేసుకుంటారు. గరుడకంబం దాసర్లను పిలిచి విందు చేస్తారు. ఈ విషయాల్ని 'ఎగువా దాసంగం, దిగువా దాసంగం' అనే సామెత తెలుపుతున్నది.

'ఓం నమో నారాయణాయ' అనే అష్టాక్షరి వైష్ణవులకు పవిత్ర మంత్రం. అనర్హునికి అష్టాక్షరి ఉపదేశం చేయడం వ్యర్థం అనే భావంలో ఘంటా కర్ణునికి అష్టాక్షరి ఉపదేశం చేసినట్లు' అనే సామెత ప్రయోగిస్తారు.

నమ్మాళ్వారు గానంచేసిన 1002 పాశురాలను 'తిరువాయిమొళి' అంటారు. శ్రీరంగంలో ముక్కోటి ఏకాదశి మొదలు పదిదినాలు తిరువాయి మొళి పారాయణ చేస్తారు అనే విషయాన్ని 'శ్రీరంగంలో పుట్టిన బిడ్డకు తిరువాయిమొళి నేర్పాలా?' అనే ప్రశ్నా సామెత తెలుపుతుంది.

'ఒక్క తులసీ దళము చేతను, ఉద్ధరిణెడుజలము చేతను భక్తవత్సలుడైన శ్రీమన్నారాయణుడు భక్తులకు విక్రయింపబడుచున్నాడు' అని గౌతమ తంత్రము10. ప్రతియింటా తులసికోట ఉంటుంది మంచివారి మధ్య చెడ్డవాడూ ఉంటాడని చెప్పేందుకు 'తులసి వనములో గంజాయి మొక్కవలె' అనే సామెత, పవిత్రమైన తులసికోటను అవమానించకూడదు అనే దానికి 'తులసికోటలో ఉమ్మేశినావేమిరా అంటే యజ్ఞవేదిక అనుకొన్నాను అన్నాడట' అనే సామెత సాక్ష్యాలు.

విష్ణుమూర్తి చిహ్నితమైన శిలను సాలగ్రామం అంటారు. గండకీ నదీ తీరంలో దొరికే ఒక విధమైన ప్రతిరాయిలోను (ఇదే సాలగ్రామం) విష్ణువున్నాడని వైష్ణవుల నమ్మకం.11 'నూరు దున్నపోతుల్ని గడిగేవాడికి ఒక సాలగ్రామం కడగడం లెక్కా' అనే సామెత దీనికి సంబంధించింది.

పుణ్యక్షేత్రాలు: వైష్ణవ పుణ్యక్షేత్రాల్లో తిరుపతి, శ్రీరంగం, సింహాద్రి, మంగళగిరి ముఖ్యమైనవి.

15, 16 శతాబ్దాల్లో వైష్ణవానికి కేంద్రం తిరుపతి. తిరుపతికి వచ్చిన భక్తులు తలనీలాలర్పించడం అనవాయితీ. ఆ విషయం మీద పుట్టిన సామెత 'సిగ్గు విడిస్తే రాయలకూడు, తిరుపతికిపోతే బోడితల' అనేది.ఆపదల్లో తిరుపతి వెంకన్నకు భక్తులు

మొక్కుకోవడం సాధారణం అనే విషయాన్ని 'తిరుమలయ్య సలహా తిరుపతి వెంకన్న మొక్కు' అనే సామెత, పవిత్రమైన వైష్ణవ క్షేత్రంలో పుట్టినా నీచులు ఉదాత్తులుకాబోరని 'తిరుపతిలో పుట్టగానే తురక దాసరి అగునా?', 'తిరుపతిలో పుట్టగానే దున్న గోవిందా అంటుందా' అనే సామెతలు వివరిస్తాయి.

శ్రీరంగం మరో గొప్ప వైష్ణవ పుణ్యక్షేత్రం. ఆళ్వార్లలో ఒకరైన చూడి కొడుత్తమ్మ శ్రీరంగనాథుని పెండ్లాడిన పూరిడి. 'శ్రీరంగంలో పుట్టిన బిడ్డకు తిరువాయిమొళి నేర్పాలా' అనే సామెత ఆ క్షేత్రంలో వైష్ణవ మత సర్వ వ్యాపిత్వాన్ని నిరూపిస్తుంది. శ్రీరంగంలో స్వామి దర్శనానికి నడుంపై ఏ బట్టాలేకుండా వెళ్ళి దర్శించుకోవాలి అనే ఆచారాన్ని, తిరుపతిలో తలానీలాలర్పించే ఆచారాన్ని నిరసిస్తూ వైష్ణవ ద్వేషులు సృష్టించిన సామెత 'సిగ్గు విడిస్తే శ్రీరంగము అంతకు విడిస్తే బోడితల' అనేది. శ్రీరంగాన్ని నిందించిన మరో సామెత 'చెప్పేవి శ్రీరంగ నీతులు-దూరేవి దొమ్మరి గుడిసెలు' అనేది.

సింహాద్రి : సింహాద్రి కూడా వైష్ణవులకు పుణ్యక్షేత్రం. ఇంతకుముందే దీన్ని గురించి వివరించాను (చూ. అ. 5).

మంగళగిరి : మంగళగిరిలో పానకాలస్వామి వెలసి ఉన్నాడు. ఆ తిరునాళ్లలో స్త్రీకి భద్రత లేదనేందుకు 'మావాళ్లు వద్దన్నందుకు మంగళగిరి తిరునాళ్లకు వచ్చినందుకు ఇలాగే కావాలి అన్నదట నిర్బంధించబడిన ఆవిడ' అనే సామెత సాక్షి.

(ఉ) వైష్ణవుల పుణ్యదినాలు: శ్రీ వైష్ణవులకు కార్తీక శుద్ధ ఏకాదశి చాలా పవిత్రదినం. ఏకాదశినాడు ఉపవాస ముంటారు. ఆనాడు మరణిస్తే వైకుంఠం వెళ్తారని వైష్ణవుల విశ్వాసం. ఏదుం తిన్నా ఏకాదశే, పందుంతిన్నా పరగడుపే', 'ఏమీ ఎరుగనివాడు ఏకాదశినాడు చస్తే అన్నీ తెలిసినవాడు అమావాస్యనాడు చచ్చినాడట' అనేవి పై విషయాల్ని తెలుపుతున్నాయి.

(ఊ) వైకుంఠం: విష్ణు భక్తులు చనిపోయి విష్ణు నివాసమైన వైకుంఠం వెళ్తారని. వైకుంఠం ఆనందనిలయమని 'అరచేతిలో వైకుంఠం చూపినట్లు' అనే సామెత చెప్తుండగా, ఈ మతాల పట్టింపులేని తుంటరి ఎవడో కల్పించిన సామెత 'వట్టలు గీరుకొన్నంత సుఖం వైకుంఠంలో గూడా ఉండదు' అనేది.

(ఋ) మధ్య వైష్ణవం: రాజుల ప్రాపుకోసమో, అధికారుల ఆలంబనకోసమో వేరే మతం నుంచి వైష్ణవానికి మారినవారి వటాటోపాన్ని 'కొత్త వైష్ణవుడికి నామాలు పొడుగు', 'మధ్య వైష్ణవుడు నామాలకు పెద్ద' అనే సామెతలు చక్కగా

ప్రతిబింబిస్తాయి.

4.1.3 శైవమతం: క్రీ.శ. మొదటి శతాబ్దినుంచి శైవం ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉంది. క్రీ. శ. 6 వ శతాబ్దినాటికి విష్ణుకుండినుల కాలంలో శివాలయాలుం దేవి. క్రీ.శ.11 వ శతాబ్దంనుంచి, తమిళదేశంనుంచి భక్తి ప్రధాన శైవం ప్రచారంలోకి వచ్చింది. పదవ శతాబ్దినుంచి పద్నాలుగవ శతాబ్దిదాకా శైవం అత్యున్నతదశ ననుభవించింది. శైవభేదాలలో ఒకటైన వీరశైవం కన్నడదేశంనుంచి వచ్చింది. వేద ప్రామాణ్యాన్ని, బ్రాహ్మణాధిక్యాన్ని నిరసించి, లింగం కట్టినవారందరిదీ లింగవంత కులమని చెప్పిన మతమిది. ఈమతస్థులనే వీరశైవులని, లింగాయతులని పిలుస్తారు. ఈమత దీక్షనిచ్చే సన్యాసులు జంగములు, జంగమదేవర్లు.

శైవమతానికి సంబంధించిన సామెతల్ని (అ) దైవ సంబంధి (ఆ) భక్త సంబంధి (ఇ) మత చిహ్నాలు, (ఈ) శైవ పుణ్యక్షేత్రాలు (ఉ) శైవ వైష్ణవ ద్వేషాలు అనే శీర్షికల కింద విశ్లేషించి పరిశీలించాను.

(అ) దైవ సంబంధి: శైవం అనే పేరులోనే వీరికి శివుడు ప్రధాన దైవమని తెలుస్తుంది. శివుని సార్వభౌమత్వాన్ని 'చెప్పినంత చేసేవారు శివుని కన్న లేరు' అని; సర్వ చరాచర ప్రపంచం శివుని ఆజ్ఞమీదనే నడుస్తున్నట్లు 'శివుని ఆజ్ఞ లేనిదే చీమయినా కుట్టదు', 'హరుని ఆజ్ఞలేక ఆకులల్లాడునా' అనే సామెతలు చెప్తున్నాయి. 'వంకాయ వంటి కూరలేదు శివుని వంటి దైవము లేడు' అని శైవకవి ఎవరో చెప్పగా, ఇవేవీ పట్టని జానపదుడెవరో హరిహరాభేదాన్ని సూచిస్తూ 'ఎద్దు నెక్కిన వాడే లింగడు, బొల్లి గద్ద నెక్కిన వాడే రంగడు' అని పాడుకొన్నాడు. శివుని సర్వవ్యాపిత్వాన్ని 'ఇతరులెరుగకున్న ఈశ్వరు డెరుగడా' అనే సామెత చెప్పగా, చిత్త శుద్ధి లేని శివపూజ వృధా అని 'చిత్తం శివునిమీద, భక్తి చెప్పులమీద' అనే సామెత; తనవారికెంత ఉన్నా తనది కాదు అనే దానికి 'ధనపతి సఖుడైనా శివుడు బిక్షమెత్తవలసి వచ్చింది' అనే సామెత పుట్టాయి. రైతును శివున్తో పోల్చిన విచిత్ర సన్నివేశం 'ఎద్దు మీది వాడు ఎప్పుడోగాని, ఎద్దు వెనకవాడు యిప్పుడే యిస్తాడు' (వ్య. పా. 172) అనే సామెత.

శివుని ఆకృతి లింగ రూపంలో ఉంటుంది. చెక్కబడే వస్తువును బట్టి లింగాలు వివిధ రకాలు. సైకత లింగమైన ఏకామ్రేశ్వర స్వామికి అభిషేకముండదు. 'మంటి దేవునికి మజ్జనమే సాక్షి' అని సామెత.

ద్రాక్షారామంలో ఉండే భీమేశ్వర స్వామి లింగం భూమిపై 15 అడుగుల

ఎత్తు, మూడు అడుగుల వర్తులం కలిగి ఉండే స్ఫటికలింగం. పొడుగ్గా వుండే వ్యక్తుల్ని 'దాక్షారామ భీమన్నలా ఎంత పొడుగో' అంటుంటారు.

(ఆ) భక్త సంబంధి : ఈ శీర్షికలో జంగాలు, తంబళి, బసవి, బసవడు అనే భక్తుల గురించిన సామెతల పరిశీలన ఉంటుంది.

జంగాలు వీర శైవులు. బసవని అనుయాయులు. శైవులు వీర్ని కైలాసం నుంచి దిగి వచ్చిన శివుని అవతారాలుగా భావిస్తారు. శివుడు అవ్యక్త లింగమని. జంగం సాకార లింగమని వారిభావన. వీర శైవం ఉచ్ఛదశలో ఉన్నపుడు జంగాన్ని ఎంతో పవిత్రునిగాను, శైవేతరుల్ని నీచులుగాను చిత్రించే సామెతలు వెలిశాయి. 'కుక్క మొరిగితే జంగం పరపతి పోతుందా' అనేది అలాంటి సామెతల్లో ఒకటి. వీరశైవులలో జాతి, కులభేదం లేదు. 'జంగమైన వెనుక జాతినెంచగరాదు' అనే సామెత పై విషయాన్నే తెలిపేది. జంగాలది భిక్షాటన వృత్తి అని 'ఇల్లు కాలింది జంగమయ్యా అంటే నాజోలె కప్పెర నావద్దనే ఉన్నవి లే అన్నాడట' అనే సామెత చెపుతుంది. జంగాల్ని నిందించిన సామెతల్లో వారిని కులం చెడిన పతితులుగాను, అపనమ్మకస్తులుగాను చిత్రీకరించడం జరిగింది. 'జాతి చెడ్డవాడు జంగము', 'లింగ ధారికన్న దొంగలు లేరయా' అనేవి ఆ సామెతలు. జంగానికి సంసారం ఉంటే ఊరికే బరువు అని 'జంగానికి పిల్లలు పుడితే ఊరివారి గోడు పోసుకున్నారట' అనే సామెత చెపుతుంది. జంగాల్లో గుణుపూరు జంగాలను, కొండూరు జంగాలను గురించిన ప్రసక్తి సామెతల్లో ఉంది. 'గుణుపూరు జంగాలు అమ్మకు ఇల్లు కట్టినట్లు', 'కొండూరు జంగాలు, తరుణాయి సన్నాసులు' అనేవి ఆ సామెతలు.

తంబల జాతివారు దేవాలయ సత్ర భోజనాలకుగాను విస్తర్లను కుట్టి తెచ్చే వారని, తర్వాత శివాలయాల్లో పూజారులైనారని ఆంధ్రుల సాంఘిక చరిత్ర. జ్యోతిషం చెప్పడం ఒక బ్రాహ్మణజాతికే తగునన్న నమ్మకంపై 'నంబికవిత్వంబు తంబళ జోస్యంబు', 'అగ్రహారములో తంబళి జ్యోస్యమా' అనే సామెతలు పుట్టాయి. 'తంబళ అనుమానము తలతిక్క' అనే సామెత వెనుక కథ ఉంది.

శైవులు మతముపేర బసివిరాండ్రను జన్నవిడిచిరి. బసవని పేర స్త్రీలను పెండ్లి చేయక వదలి వారిని వ్యభిచారిణులుగా జేసిరి.12 అని సురవరం ప్రతాపరెడ్డి వట్కాలు.

బళ్లారి జిల్లాలో ఆసాదులు హరిజనులలో ఒక తెగ. వారు 'మాదిగ' వారింట భోజనం చేయడమూ, వారి కన్యలను పెండ్లి చేసుకోవడం జరుగుతుండేది. కాని

ఆసాదులు తమ ఆడబిడ్డల్ని దాదాపు అందరినీ పెండ్లి చేయకుండా దేవతకు 'బసవి' గా నివేదించేవారు. వారు తర్వాత వ్యభిచారిణులయ్యేవారు.[13] మతంకోసం ఇలా చేసినా తమ ఆడబిడ్డ భర్తా, పిల్లలతో కలకలలాడే అవకాశం పోయిందని విలవిల లాడిన తల్లిదండ్రుల గోడు 'ఉండే ఒక బిడ్డా బసివి అయినట్లు' అనే సామెత తెలుపుతుంది.

శివుని వాహనమైన వృషభాన్ని శైవులు పవిత్రంగా చూస్తారు. నంది వీర శైవ మతప్రవక్త బసవడుగా జన్మించాడని. వృషభాన్ని బసవడుగా పూజిస్తారు. శైవద్వేషులు బసవని 'బసవ దేవునికి బడితె పూజ' అని నిందించారు.

(ఇ) శైవ మత చిహ్నాలు : శివ చిహ్నమైన లింగాన్ని మెడలో ధరించడం, బూది పూసుకోడం, రుద్రాక్ష మాల ధరించడం శైవమత చిహ్నాలు.

లింగధారణకు బ్రాహ్మణ పూజారిని గాక జంగాన్ని ఆహ్వానించి, విందు చేస్తారు. లింగధారణ నిరాడంబరంగా కొన్నినిమిషాల్లోనే జంగం నిర్వర్తిస్తాడు.[14] లింగం ధరిస్తూనే ప్రతివాడూ కులభేదాల కతీతుడై 'లింగవంతకులం' వాడౌతాడు.

శివరూపాన్ని ఏ రూపంలోనైనా దర్శింపవచ్చని 'తెగించిన వానికి తెడ్డే లింగము' అనే సామెత, స్థాన భ్రష్టులైతే రాణించరు అనేందుకు 'తెగితే లింగడు రాయి' అనే సామెత తార్కాణాలు. దొంగకు భయపడి పరుగెత్తిన ఓ బాటసారికి మెళ్లో లింగం మాటిమాటికీ తగిలి బాధపెట్టిందని వ్యంగ్యంగా 'దొంగ పోటు కన్న లింగ పోటు ఎక్కువ' అనే సామెత చెపుతుంది.

శైవులు బూది పూసుకోవడాన్ని హేళన చేస్తూ పుట్టిన సామెత 'కొత్త భక్తురాలు ఉడుగు ఊబిది పూసికొని నొసలు కాలెనే పేరమ్మా అన్నదట' అనేది. శైవులు రుద్రాక్షమాలల్ని ధరిస్తారు. శైవులు కాముకులు అని 'మెడలో రుద్రాక్షలు మదిలో మదిరాక్షులు' అనే సామెతలో శైవేతరులు నిందించారు.

(ఈ) పూజావిధానం : శివుని మారేడు దళాలతో పూజ చేస్తారు. దీన్నే 'పత్రి' అని కూడా అంటారు. పూజలో పత్రి అవశ్యకాన్ని 'పత్రిలేని పూజ పత్రం లేని అప్పు' అనే సామెత చెపుతుంది. ముస్లింలు ఈ పూజను 'మాదర్ చోద్ దేవుడికి ఛాంచేదు పత్రి' అనే సామెతలో నిరసించారు.

(ఉ) శైవుల పుణ్యక్షేత్రాలు: శైవుల పుణ్యక్షేత్రాల్లో మిక్కిలి ప్రసిద్ధి పొందింది కాశి. ఇది హిందువులందరికీ పవిత్ర క్షేత్రమే. దక్షిణ హిందూదేశంలో తమిళ దేశంలోని రామేశ్వరం, తెలుగుదేశంలోని శ్రీశైలం, కాళహస్తి ప్రసిద్ధ

శైవ క్షేత్రాలు.

హిందువుల పుణ్యక్షేత్రాలను గురించిన 30 సామెతల్లో కాశీ ప్రసక్తి ఉన్న సామెతలు 21. పుణ్యతీర్థాల్ని గురించిన 32 సామెతల్లో 14 సామెతలు గంగానదిని గురించినవి.

కాశీ ఆంధ్రదేశం నుంచి చాలా దూరమని, పూర్వకాలంలో అక్కడికి వెళ్లి తిరిగి రావడం దాదాపు అసాధ్యమే నని; కాశికి పోయినపుడు అక్కడ తమ కిష్ట మైన ఏదైనా ఒకవస్తువును త్యాగంచేసి రావాలని, అక్కడనుంచి గంగాతీర్థం కావ ళ్లతో తెచ్చేవారని. (వాటినే కాశి కావళ్లనేవారు), 'వాకిలి దాటగానే వారణాసి ఎంత దూరమన్నట్లు', 'కాశికి పోయినవాడు కాటికి పోయినవాడు ఒకటే', 'కాశీలో బెండను వదిలినా ముండను వదలలేదు', 'కాశికి పోవడము వకటి కావడి తేవడము వకటి' (కార్. 611) అనే సామెతలు తెలుపుతాయి. పవిత్ర స్థలానికి పోయి అప విత్ర వస్తువు తెచ్చుకోవడాన్ని, కాశి పవిత్రతను కించపరిచే ఉద్దేశ్యంతో శైవేతరుల్లు 'కాశికి పోయి కుక్క బొచ్చు తెచ్చినట్టు' (కార్. 610), 'కాశికి పోయి గాడిద గుడ్డు తెచ్చినట్టు' (కార్. 612) అనే సామెతలు సృష్టించారు. పుణ్య క్షేత్రాలకు వెళ్లినా నీచుడు పవిత్రుడు కాడనేందుకు 'కాశికిపోయినా కట్టికుక్క గంగి గోవు అవుతుందా', 'చేసిన పాపం గోచిలో పెట్టుకొని కాశికి పోయినా తీరదు-కాటికి పోయిన తీరదు' అనే సామెతలు చెపుతున్నాయి.

పుణ్యక్షేత్రాలకు వెళ్లినా మనసు పవిత్రం కాలేదు అనడానికి 'రామేశ్వరం వెళ్ళినా అంకు మగడు తప్పలేదట' అనే సామెత తార్కాణం.

కాశి కన్నా కాళహస్తి గొప్పదనీ 'కాశిలో కన్ను మూసినా రాని పుణ్యం కాళహస్తిలో కాలు పెడితే వస్తుంది' అనే సామెత వ్యక్తపరుస్తుంది.

(ఈ) శైవుల పవిత్ర దినాలు : శైవులకు శివరాత్రి పవిత్ర దినం. ప్రతి సంవత్సరం మాఘ కృష్ణ చతుర్దశి నాడు ఈ పండుగ చేస్తారు. ఆ దినం పగలంతా భక్తులు ఉపవాస ముండి, రాత్రి అంతా నిద్ర మేల్కొంటారు. దీనినే జాగర ణమంటారు. అరుదుగా వచ్చే సదవకాశాన్ని 'జన్మానికో శివరాత్రి' (గ్ర. అ. 118) అనే సామెతతో పోలుస్తారు. 'సిగ్గులేని శివరాత్రికి ఏటా జాగారమే' అని శైవేతరుల నింద.

(ఋ) శైవ, వైష్ణవ ద్వేషాలు : 12 - 14 శతాబ్దాల మధ్య శైవ వైష్ణవా లొక దానితో నొకటి పోటీ పడ్డాయి. 'లింగము కట్టిన వారందరిది ఒకే లింగవంత

నాకుతుంటే నబాబుకు నాట్యాలా?' అనే సామెత తెలుపుతుంది. తెలుగులో ఇక్ష్వాకులనాటిది అని ప్రాచీనతను గుర్తించినట్లు 'నవాబు సాత్తుల్లాఖాన్ అవ్వ నాటిది' (కార్. 1242) అనే సామెత తురకలకు సంబంధించి చెపుతారు. సాహెబ్ అనే గౌరవ నామాన్ని వారు ఏ పరిస్థితుల్లోనూ వదిలి పెట్టరు అని 'నాడు వుంటే నవాబు సాయెబు. అన్నము వుంటే అమీరు సాయెబు. బీదపడితె ఫకీరు సాయెబు, చస్తే పీరూ సాయెబు' (కార్. 2430) అనే సామెత తెలుపుతుంది.

మహమ్మదీయులలో ఒక తెగ అయిన నవాయతీలు భోజన ప్రియులు అన డానికి 'నవాయితీ పొట్ట, తమలపాకుల కట్టా తడుపుతూనే వుండవలెను'(కార్.1243) అనే సామెత సాక్షి. పఠానులు అనే ముస్లిం తెగ క్రూరత్వానికి. అప్పులిచ్చి నిర్దాక్షిణ్యంగా వసూలు చేసుకోడానికి ప్రసిద్ధి. ఫకీరులు అంటే ముస్లిం సన్యాసులు. ఈ విషయాన్ని 'నేను పఠానులకు బాకీ, నాకు ఫక్కీరులు బాకీ' అనే సామెత వివరిస్తుంది. బీద ముస్లింలు హిందువుల ఇండ్లలో చాకిరీ చేసేవారని 'మాబూసాహెబ్ పెండ్లామైతేనేమి బాబూసాహెబ్ పెండ్లామైతేనేమి మన యింట్లో పాచిపని మతకం లేకుండ చేస్తే చాలు' అనే సామెత తెలుపుతుంది.

ముస్లింమత ప్రవక్త మహమ్మద్ మనుమడు హుస్సేన్ సంతతివారు సయ్యదులు. మియ్యా అనేది వారి గౌరవ నామం. దూదేకుల జాతి వారు మిశ్ర జాతి ముస్లింలు. తురకల్లేని ఊళ్లో దూదేకులవాడు మహమ్మదీయుడుగా చలామణీ అవుతాడని 'తురక లేని ఊళ్లో దూదేకులవాడు సయ్యదు మియ్యా' (కార్.1100) అనే సామెత చమత్కరిస్తున్నది.

తెలుగులో 'సన్నాసీ', 'ఫక్కీర్' నిందావాచకాలు. 'తురకలుండే వీధిలో ఫకీరు సాయెబు స్వాములవారు' (ఆం.వి.), 'ఫకీరువాణ్ణి తెచ్చి పరుపులో కూర్చుండ పెట్టితే లేచి లేచి మసీదులోకి పోయాడట' అనేవి ఫకీర్లను గురించిన సామెతలు.

(అ) తురకల స్వరూపం - ఆచారాలు - అలవాట్లు :

హిందువుల స్వరూపానికి ముస్లింల స్వరూపానికి భేదం ఉంది. హిందువులు జుట్టు పెంచుతారు. ముస్లింలు గుండు గీయించుకుంటారు. హిందువులు గడ్డం తీసేసి మీసాలు ఉంచుకొంటారు. ముస్లింలు గడ్డం పెంచుకొని మీసాలు తీసేస్తారు. హిందువులకు గోత్రాదు, ఇంటిపేరు ఉంటుంది. ఇవి తురకల కుండవు. ఈ భేదాల్ని పురస్కరించుకొని హిందువులకు విరుద్ధమైన స్వరూపాలు, ఆచారాలుండేవారు కాబట్టి వార్ని నమ్మకూడదని ఆంధ్రులు సామెతల్లో చెప్పుకొన్నారు. ఇప్పటికీ జన

పదాల్లో ఏమీ లేనివాణ్ణి 'వానికి ; జుట్టూ లేదు మొలత్రాడూ లేదు' అని నిరసనగా అంటుంటారు. 'ఇంటికి పేరు, తలకు జుట్టు, మొలకు మొలతాడు లేని తురకను నమ్మరాదు' అని సామెత. బోడి తలతో వుండే వితంతువును నవాబుతో పోల్చిన సామెత 'నవాబుతల బోడి అయితే నా తలకూడ బోడి - అని వితంతు విఱ్ఱవీగిన దట' అనేది. 'గడ్డం అల్లా యొక్క కాంతి'18 అని ముస్లింల నమ్మకం. వారి గడ్డం మీద హేళనగా పుట్టిన సామెత 'బడె సాహెబు గడ్డము బారెడుంటేమి ; మూరె డుంటేమి' (హైసా. IV-17) అనేది.

బీబీలు (ముస్లింస్త్రీలు) బంగారు కుట్టు పోగులు చెవి చుట్టూ కుట్టించుకుంటారు. హిందువులు చెవి తమ్మలకు, గూబలకు మాత్రమే కమ్మల్ని, గూబ్బారీలను అలం కరించుకుంటారు. ఇప్పుడు గూబలకు ఆభరణాలు వేసుకోటంలేదు. హిందువులు రత్నాల కమ్మల్ని ధరిస్తుండగా ముస్లింలు దారపు పోగుల్లాంటి బంగారు పోగులు ధరిస్తారని హేళనగా 'సాయెబుకు ఎంత దవులతు వచ్చిన బీబీలకు కుట్టుపోగులే' అనే సామెత పుట్టింది.

హిందువులకు గోవు, గంగిరెద్దు పవిత్రమైనవి. హిందువుల్లో హరిజనులు తప్ప గోమాంసం తినరు. తురకల గోమాంస భక్షణ, మద్య పానాల్ని నిరసించే సామెతలు 'తురకవాడకు గంగెద్దు పోతే కోసుకొని తిన్నారట', 'తురకలు తప్పించు కొంటే ఈదులలో మేకలు తప్పించుకొంటే తుమ్మలలో' (ఈదులు,ఈతచెట్లు - కల్లు తీసేవి), 'తురక దాసరికి ఈత మజ్జిగ' (కల్లు) అనేవి.

ముస్లింలు ప్రార్థనకో కాని, ఏదైనా జంతువును మాంసం కోసం చంపేటప్పుడు గాని, ఏ కార్యమైనా మొదలుపెట్టేటప్పుడుగాని 'బిస్మిల్లా ఇర్రహమాన్ ఇర్రహీం' (In the name of Allah, the most merciful and beneficial) అనే వారి పవిత్ర మత గ్రంథమైన 'కొరాను' లోని మొదటి వాక్యం పఠిస్తారు. ఈ పఠించడాన్నే 'బిస్మిల్లా' అంటారు. బలవంతంగా మార్చబడ్డ వారు ముస్లింల భయంతో 'బిస్మిల్లా' అని ఒకసారి అనే బదులు ఎక్కువ పార్లన్నారని కాటోలు 'ముద్ద ముద్దకూ బిస్మిల్లానా' అనే సామెత వచ్చింది. బిస్మిల్లా చేయని జంతు మాంసం ముస్లింలు తినరు. బిస్మిల్లా చేసినదాన్ని 'హల్లాల్' అని, చేయని దాన్ని 'ముర్దార్' అని అంటారు. చేపల్ని అల్లాయే హల్లాల్ చేసి ఉంటాడని వారి ఐతిహ్యం. ఆ విషయాన్ని వ్యంగ్యంగా 'మునిగింది ముర్దారు తేలింది హలాలు' అనే సామెత వ్యక్తం చేస్తున్నది.

(ఇ) ముస్లింల మత స్థావరాలు : ముస్లింల మత స్థావరాలు మసీదులు, దర్గాలు. మసీదులు వారి పూజామందిరాలు. దర్గాలు (హిందూస్థానీ.దర్‌గాహ్)ఆ యా ప్రాంతాలకు సంబంధించిన ముస్లిం భక్తుల సమాధులు. ఇతరుల్ని మోసం చేసి మంచి కార్యం చేయడం వృథా అని 'మందిని ముంచి మసీదు గట్టినట్లు' అనే సామెత అంటున్నది. ముస్లింలు తెలుగు ప్రజల్ని కొల్లగొట్టి మసీదుల్ని కట్టారు అనేది చారిత్రక సత్యం. హిందూ దేవాలయాల్లో పంచలోహ విగ్రహాలు. విగ్రహాలకు నగలు ఉంటాయి. వీటిని కొల్లగొట్టి సొమ్ము చేసుకొనే అవకాశముంది. మసీదుల్లో విగ్రహాలుండవు, కొల్లగొట్టేందుకు విలువైన వస్తువులూ ఉండవు అని చెప్పే సామెత 'తలారికి దండుగ భయము లేదు మశీదుకు దొంగ భయము లేదు' అనేది. ప్రార్థన చేయ బోతే కీడు సంభవించిందని 'నమాజు చెయ్యబోతే మసీదు మెడను బడ్డది' అనే సామెత తెలుపుతుంది.

దర్గాలవద్ద సంవత్సరాని కొకసారి ఉత్సవం చేస్తుంటారు. దాన్ని 'ఉర్సు' అంటారు. కర్నూలు నవాబుల పరిపాలనలో ఉండేది. ఆ మండలంలోని బనగాన పల్లిలో 'ఉరుసు' ఎంతో వైభవంగా జరిగేదని 'బనగానపల్లి ఉరుసు నా వెంట రావె నరసు' అనే సామెత చెప్పుతుంది. ఉరుసులకు హిందువులుకూడా వెళ్తుంటారు అనే విషయాన్ని కూడా ఈ సామెత తెలుపుతుంది. ఉరుసు బాగా జరుగుతుందని. చూడ బోయే వారికి డబ్బులు అవసరమని 'ఉరుసుకు పోవాలంటే కరుసులకు కావాలి' అనే సామెత చెపుతుంది.

(ఈ) ముస్లింల పుణ్య క్షేత్రాలు : ముస్లిం మత ప్రవక్త జన్మస్థానమైన సౌదీ అరేబియాలోని 'మక్కా' ప్రపంచ వ్యాప్తంగా వున్న ముస్లింలకు పుణ్యక్షేత్రం. ముస్లింల ఐదు పవిత్ర మత కార్యాల్లో జీవితకాలంలో ఒకసారైనా మక్కా దర్శించడం ఒకటి. మక్కాకు వెళ్లివచ్చిన వార్ని 'హాజీ' లంటారు. హాజీలయిన తర్వాత మోసాలు చేయగూడదని ఒక నియమముంది. మత ద్వేషాల్లో ఈ విషయాన్ని నిందించిన సామెతలు 'మక్కాకు పోయినా టక్కరి తనం మానలేదు', 'మక్కాకు పోయి కుక్క (బొచ్చు) మలం తెచ్చినట్లు' అని హిందువులు, 'కాశికి పోయి కుక్క పెప్పాలు తెచ్చినట్లు' అని ముస్లింలు పరస్పరం నిందించుకొన్నారు.

(ఉ) ముస్లింల పండుగలు : రంజాన్, మొహర్రం మొదలైనవి ముస్లింల పండుగలు. మొహర్రాన్నే 'పీర్ల పండుగ' అంటారు. ఇందులో హిందువులు కూడా ఉత్సాహంగా పాల్గొంటారు. ఇమాం హుస్సేన్, అతని అనుచరులు 72 మంది మత

సిద్ధాంతాలకోసం నాటి ఖలీఫా యాజీద్ సైన్యంతో 'జీహాద్' (మతయుద్ధం) చేస్తూ, 'షహీద్' (ఆత్మాహుతి) అయిపోయిన దినం మొహరం నెలలో పదో రోజు. వీరినే 'పీర్లు' (ఋషులు) అంటారు. ఏదైనా లోహంతో చేయి ఆకారంలో గాని, కత్తి ఆకారంలోగానీ పీర్లను చేస్తారు.

పీర్లను సంవత్సరం పొడుగునా పెట్టెల్లో దాచి, మొహర్రం నెలలో 'సందు' (నెలవంక) కనిపించినప్పుడు పెట్టెలు దించి పీర్లకు పూజ చేస్తారు. పదో నాడు నిప్పులగుండం సిద్ధం చేసి కణ కణలాడే నిప్పులమీద పీర్లను ఎత్తుకొని భక్తులు నడుస్తారు. 'సందుచూసి పెట్టెలు దించినట్లు' అనే సామెత బాహిరార్థం మొహర్రం నెలలో చందమామ మొదట కనిపించిన రోజున ముస్లింలు పీర్లు ఉండే పెట్టెలు దించుతారని. అంతరార్థం వీలుచూసి దొంగతనం చేస్తారని. పీరు లేవాలంటే ఊదు (సాంబ్రాణి పొగ) వేయాలని 'ఊదు వేయనిదే పీరు లేవదు' అనే సామెత చెపుతుంది. కొన్ని గ్రామాల్లో ముస్లింలు బీద వారయినప్పుడు ముల్లాలు (మత గురువులు), మౌల్వీలు (మత గ్రంథ బోధకులు) తిండికే అవస్థ పడతారని, పీర్ల పండుగ సరిగా జరగదని 'మౌల్వీలు మదురు మేస్తుంటే పీర్లకు పిండి వంటలా ?, 'ముల్లాలు తిండికి లేక మొత్తుకుంటుంటే పీర్లకు పంచదార' అనే సామెతలు వివరిస్తాయి.

**4.1.5 జైన మతం :** జైనమతం క్రీ. పూ. నాల్గవ శతాబ్దంలోనే ఆంధ్రదేశంలో ప్రవేశించి, నాడు రాయలసీమలో మంచి ప్రచారాన్ని పొందింది. 12, 13 శతాబ్దాల్లో శైవంతో పోటీపడింది. ఆ నాటి పండిత సభలలో ఓడింపబడిన మతస్తులు చంపబడేవారు. వారి వసతులు ధ్వంసమయ్యాయి. విజయనగర రాజులకాలంలో జైనం ఉన్నా పూర్వపు ఉన్నతిని పొందలేక పోయింది.

జైనానికి సంబంధించిన సామెతలు రెండు మాత్రమే లభించాయి. రెండూ వారి అహింసను గురించి హేళన చేసేవే. 'జైనవాని చేతి పేను వలె', 'నోట్లో ముద్ద గూట్లో దీపం' అనేవి. దీపం చాలాసేపు పెడితే పురుగులు దీపంలో కాలి చస్తాయని త్వరగా తిని పడుకొనేవారు జైనులు అనే విషయాన్ని రెండో సామెత తెలుపుతుంది.

**4.1.6 క్రైస్తవ మతం :** 18 వ శతాబ్ది ప్రారంభంలో ఆంధ్రదేశంలో ప్రవేశించింది. 1701 చిత్తూరుజిల్లా పుంగనూరులో ఒక వెలమ కుటుంబం ఫాదర్ మాట్వింగ్ వల్ల క్రైస్తవ మతాన్ని స్వీకరించింది. 1805 వరకు రోమన్ కాథలిక్

మతం, 1805 తర్వాత ప్రొటెస్టెంట్ మతం వ్యాప్తిలోకి వచ్చాయి. ఇప్పుడు ఆంధ్రదేశంలో 14 లక్షల క్రైస్తవులున్నారు.

క్రైస్తవులకు సంబంధించిన సామెతలు మూడు మాత్రమే లభించాయి. అందులో మొదటిది బైబిలు సూక్తికి అనువాదం 'సూది బెజ్జంలో ఒంటె దూర వచ్చును గాని భాగ్యవంతుడు స్వర్గం చేరలేడు' అనేది. రెండోది 'చేసిన పాపం చెబితే పోతుంది' అనేది. ఇది Confession అనే రోమన్ కాథలిక్ ఆచారం నుంచి వచ్చిన సామెత కావచ్చు. 'గుడి దగ్గరైతే గురుత్వం దూర మౌతుంది' అనే సామెత Nearer the Church farther the devotion అనే దానికి భావానుసరణ.

తర్వాతి ఉపప్రకరణంలో ప్రజల విద్య, వైద్యం, కళలు తెలుగు సామెతల్లో ఎలా ప్రతిబింబించాయో పరిశీలిద్దాం.



సూచికలు :-

1. వివేకానంద సంపూర్ణ గ్రంథావళి : సం. 2. పుట. 276
2. ,, ,, సం. 2. పుట. 162
3. ,, ,, సం. 2. పుట. 276
4. ,, ,, సం. 2. పుట. 385
5 The Eleven Religions - Proverbial Lore P. 138-141.
6. చంద్రలగ్నాత్ గోచారంలో శని జన్మ - అష్టమ స్థానములందు సంచరించు నాటి ఫలితం 2½ సం॥ ఒక్కొక్క భావానికి వంతున 7½ సం॥లు. దీనిని ఏల్నాటి శని కూడ అందురు.
7. అధిశ్రవణము : పాచనము (వంట) వండించుట.
8. ఓంకారము వేదముల యొక్క సారభూతము .. ఇదియే ప్రణవము .... ఓంకారమునందు సమస్త జగత్తును ఇమిడి యున్నదని వేదములు చెప్పు చున్నవి. (బ్రౌన్. 171-72)
9. ఈ గర్భాదానంలో ముగ్గను సరుకొనే లోపల చాప చుట్టుకొని పోవుచుండును. చాపను సరిచేయు లోపల పెండ్లికూతురు సిగ్గుతో పై దొలగి పోవుచుండును. తొలినాడు చాపే పడక అగుట సాతానులలో వాలాయము (ఆం. ప్ర. సా. అకాడమీవారి తెలుగు సామెతలు పు. 573).
11. తులసీదళ మాత్రేన జలస్య చులుకేన చ
విక్రీణతే స్వమాత్మానం భక్తేభ్యో భక్తవత్సలం - గౌతమ తంత్రము.
11. The Visnuits for instance believe that their God is present in every Salagrama - a black fossile found in the Gandak river - ... P. 113. (Visnuism and Saivism - A Comparison.)
12. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట. 46
13. The Village Gods of South India., P. 44
14. A Hand Book of Vira Saivism., P. 40
15. మన మతములు - సంప్రదాయములు - పుట. 35
16. మన మతములు - సంప్రదాయములు - పుట. 36
17. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట. 104
18. The beard is the light of God. (Arabic Proverb)
(The Eleven Religions. P. 180.)

## తెలుగు సామెతలు - విద్య, వైద్యం, కళలు

4.2 'విద్యలేనివాడు వింత పశువు' అని ఆర్యోక్తి. విద్య అవసరాన్ని సామెతలు చక్కగా చెపుతున్నాయి. చదువుతోపాటు సాము ప్రయోజనాన్ని. శాస్త్రిలను గురించి చెప్పిన సామెతలున్నాయి.

సామెతల్లో వైద్య విజ్ఞానం గురించినవి, ఆరోగ్య, అనారోగ్య లక్షణాల్ని వివిధ వ్యాధుల్ని, వాటి ఔషధాల్ని తెలిపిన సామెతలున్నాయి.

కవిత్వం, నృత్యం, సంగీతం, చిత్రలేఖనం, శిల్పం అనే లలితకళల్ని గురించి తెలుగు సామెతల్లో ప్రస్తావించబడింది

నా పరిశీలనలో అందిన సామెతలను ఆధారంగా చేసుకొని విద్య, వైద్యం, కళలు అనే మూడు అంశాల్లోని వివిధ విషయాల్ని వింగడించడానికి ఈ ఉప ప్రకరణంలో ప్రయత్నం జరిగింది.

4.2.1 విద్య అనే అంశంలోని శీర్షికలు_విద్యపై ప్రజల అభిప్రాయాలు, అక్షరాభ్యాసం, చదువులో మందకొడి తనం, హంసపాదు, బడి,గురు శిష్యులు, శాస్త్రిలు, సాము అనేవి. విద్య అనే అంశం ప్రసక్తిలో ఉన్న సామెతలు 77.

(అ) విద్యపై ప్రజల అభిప్రాయాలు (14) :

'యెరికె పిడికెడు ధనము' (బ్రౌన్) అనే సామెత విద్య అవసరాన్ని నొక్కి చెప్పేది. పూర్తిగా అర్థంచేసుకోనిదే చదువు వృధా అని, చదువుతో బుద్ధి, సంస్కారం, వినయం అబ్బాలని, అర్థముకాని చదువు వ్యర్థము' (నర), 'బుద్ధిలేని చదువు బూడిద హోమము' (గృ. ల. 168), 'సంస్కారం లేని చదువు కాయగాయని చెట్టు వంటిది', విత్తం, కొద్దీ విభవము, విద్య కొద్దీ వినయము, అనే సామెతలు తెలుపుతాయి.

చదువుకు శ్రద్ధ అవసరమని శైశవం దాటి యవ్వనం వచ్చేలోగానే చదువు పూర్తి కావాలని, వివాహం అయితే విద్య రాదని చెప్పే సామెతలు : 'పెగలేనిదే అన్నముడకదు, శ్రద్ధలేనిదే చదువురాదు' (నర), 'చదువు చన్ను విడిచి చన్ను పట్టుకొనే లోపలే రావాలి', 'వివాహం విద్య నాశనం శోభనం సర్వనాశనం' (నర)అనేవి.

పూర్వం విద్యార్థులు కఠిన బ్రహ్మచర్యం అవలంబించి విద్యాభ్యాసం పూర్తి చేసుకొనేవారు. విద్య రాజవశ్యమని, డబ్బు సంపాదించని చదువు వ్యర్థమని 'వినయం లోక వశీకరం, విద్య రాజవశ్యం', 'డబ్బురాని విద్య దరిద్రానికి' అనే సామెతలు అభిప్రాయపడుతున్నాయి.

పెద్దలు సేద్యం పనులకుపోతే కాపుల పిల్లలు ఇంటి దగ్గర ఉండడమో, పొలాల దగ్గర కావలి ఉండడమో చేస్తుంటారు. గొల్లలు, కురవలకు తెలివి మందం అని ప్రజల అభిప్రాయం. అందుకే బాపన సేద్యము బత్తెము చేటు, కాపుల చదువులు కాసుల చేటు', 'గొల్లని సాహిత్య విద్య' అనే సామెతలు పుట్టాయి.

పూర్వం విద్య అంటే అమరకోశం, ఆంధ్ర నామ సంగ్రహం లాంటి నిఘంటువులను ముఖస్థం చేయించడం, భారత రామాయణాది కావ్యాలు నేర్పించడం. అమరకోశ ప్రాముఖ్యానికి అద్దం పట్టే సామెత 'అమరము నెమరుకు వస్తే కావ్యాలెందుకు కాల్చనా' అనేది.

(అ) అక్షరాభ్యాసం (11): తెలుగు అక్షరాలను 'ఓనమాలు' అంటారు. శైవ ప్రాబల్యంతో 'ఓం నమశ్శివాయః', జైన ప్రాబల్యంతో 'సిద్ధంనమః' అనేవి వచ్చి అక్షరాభ్యాసం 'ఓం నమశ్శివాయ సిద్ధం నమః' అని మొదలవుతుంది. షడక్షరీ మంత్రమైన 'ఓం నమశ్శివాయః' ను యథాతథంగా పిల్లలకు ఉపదేశించడం బాగుండదనేమో కొద్దిగా మార్పుచేసి 'ఓ నమఃశివాయః' అని అక్షరాభ్యాసం చేసి ఉంటారు. తెలుగు అక్షరమాలకు 'ఓనమాలు' అని రావడానికి కారణం ఇదే. నిరక్షరాస్యుల్ని ఓనమాలు కూడా రానివాళ్లు అంటారు. 'ఓంకారము రానివాడు వడ్డు గుణించినట్లు' (కార్. 486) అనే సామెత చదువులో మొదటి అక్షరాలే రానివాడు వడ్డీ లెక్క కట్టగలడా' అని వ్యంగ్యంగా ప్రశ్నిస్తున్నది.

విద్య రాకున్నా ఒయ్యారం చూపేవాన్ని 'ఓకు ఎన్ని వంకరలో తెలియని వానికే ఒయ్యారము' అనే సామెతతో మందలిస్తాము. ఓనమాలు తప్ప చదువు రాని వానిని 'ఓనమాలే బుక్కులు, ఒకటి రెండే లెక్కలు' అనే సామెత వెక్కిరిస్తుంది. ఓనమాలు అనే బదులు 'అ ఆ లు' అనడం అర్వాచీనం కావచ్చు. 'అ ఆ లు రావు అగ్ర తాంబూలం మాత్రం కావాలి' అని సామెత.

తెలుగులో ఓనమాలు రావు అనేదానికి సమానార్థకంగా పండితులు సంస్కృతం రాని వారిని హేళన చేసే సామెతలు 'చా అంటే తూ అనలేడు' (కార్. 860), 'కిం అంటే కం అనలేడు' (కార్. 616) అనేవి. చ అంటే మరియు, తు అంటే అయితే, కిం అంటే ఏమి, కం అంటే ఎవరిని అని అర్థాలు.

(ఇ) విద్యలో మందకొడి తనం (13): పిల్లల్తో మొదట ఇసుకలో 'గుంట ఓనమాలు' దిద్దించడం, తర్వాత బలపంతో పలకపై వ్రాయించడం జరిగేది. పలక, బలపాలు ఉపయోగించే సంగతిని, ఒక బాలుని మందకొడి తనాన్ని కలిపి చెప్పేది

'చదువు చేరెడు, బలపాలు దోసెడు' అనే సామెత.

జానపదుల్లో కులవృత్తులు చేసుకోకుండా చదివే వారిని మొన్న మొన్నటిదాకా హేళన చేసేవారు. ఏదైనా ఒక విషయం అడగడం, అది చెప్పలేక పోతే 'బో సతికి నావులే' అని వెక్కిరించడం ఉండేది. ఆ విషయాల్ని వివరించే సామెతల్లో మచ్చుకు కొన్ని : 'చదువవేస్తే ఉన్న మతి పోయినట్లు', 'చదువక ముందు వరవర అంటే చదివిన వెనుక వడవడ అన్నాడట', 'చదువక ముందు కాకర కాయ, చదివిన వెనుక కీకరకాయ అన్నాడట' అనే సామెతలు. చాకలికి చదువు లేక పోయినా ఒక ఇంటి గుడ్డలు ఇంకొక ఇంటిలో ఇవ్వకుండా చక్కగా జోడించి తెస్తాడు. అందు కనే జానపదులు 'చదివిన వాడికన్న చాకలి వాడు మేలు', 'చదివినతనికన్న చాకలి సతి మేలు' అంటారు.

(ఈ) హంసపాదు (4): అక్షరం తప్పు ఉన్నచోట హంసపాదం ఆకారంలో ఉంచే గుర్తు. ఇది వాక్య మధ్యంలో ఉండడం సాధారణంగాని, ప్రారంభంలో ఉండడం రాయన కాని అసమర్థతను సూచిస్తుంది. అంతేకాదు; ఆదిలో అభ్యంతరం అపడం అపశకునంగా కూడా భావిస్తారు. ఆ విషయాన్ని 'అడుగులోనే హంసపాదు' (కార్. 42) అనే సామెత తెలుపుతుంది.

నెల్లూరు పండితుడు నేలటూరు పార్థసారధి అయ్యంగారు 'ఆమ్నాయ కళానిధి' పేర ఆంధ్ర భారతం ఉద్యోగ, స్త్రీ, శాంతి పర్వాలకు టీకా రాస్తూ మొదటి పద్యం 'శ్రీయన గౌరి నాఁబరగు' అనే పద్యంలో గౌరికి అర్థం చెప్పకుండా వదిలి వేయగా పూండ్ల రామకృష్ణయ్యగారు 'అముద్రిత గ్రంథ చింతామణి' పత్రికలో 'ఆమ్నాయ కళానిధికి ఆదిలోనే హంసపాది' అనే శీర్షికతో విమర్శించాడు. ఈ సామెత అప్పటినుంచి పండిత లోకంలో ప్రచారంలోకి వచ్చింది.2

(ఉ) బడి-గురు శిష్యులు (24): చదువుకు మూలస్థానం బడి. ప్రాణం పోసేవారు తల్లి దండ్రులు కాగా, మరో ప్రాణం లాంటి విద్యను దానం చేసేవాడు గురువు. అందుకే తల్లిదండ్రుల తర్వాత ప్రత్యక్ష దైవంగా గురువు కీర్తించబడ్డాడు. పిల్లల్ని శిక్షించడానికి బెత్తం అత్యవసరమని 'బడికి బెత్తం, మడికిగెత్తం' అనే సామెత చెపుతుంది. 'స్పేర్ ది రాడ్ స్పాయిల్ ది ఛైల్డ్' అనే ఆంగ్ల సామెతకు అది దగ్గరగా ఉంది. అంతో ఇంతో చదువు కున్నవారు పల్లెలలో బడి పెట్టుకొనే వారు. ఆ విషయాన్ని 'బతుకలేనివాడు బడిపంతులైనట్లు' అనే సామెత తెలుపుతుంది.

బుద్ధి చెప్పే గురువు దండించినా ఓర్చుకోవాలి అని, పూర్తిగాని పనివి గురు

వుకు కూడా చూపగూడదని 'బుద్ధి చెప్పినవాడు గుద్దిన మేలయా', 'కొరతగా ఉండే పని గురువులకైనా చూపకు' (సా.సా. 162) అనే సామెతలు చెపుతాయి. అస మర్థుడు-తిండిపోతైన గురువు, మొద్దు శిష్యునికి సంబంధించిన పరిహాస సామెతల్లో మచ్చుకు కొన్ని : 'శిష్యున కెక్కడ సందేహమో గురువు కక్కడే అనుమానం', 'నీవు గుద్దరా శిష్యా అంటే నీకన్న తక్కువ తిన్న దెవరు అన్నాడట', 'నా కాళ్లకు చెప్పులున్నవా అంటే నక్షత్ర మండలం మధ్య ఎక్కడా కనబడలేదు అన్నాడట' (బిఱ్ఱుగా తిని తల వంచలేక) శిష్యుడు తనకన్నా గొప్పవాడు కావాలని సద్గురువు కోరతాడు. ఆ విషయాన్ని 'గురువును మించిన శిష్యుడు' అనే సామెత, విద్య నేర్పినవారితో పోటీకి దిగగూడదని 'గురువుతో గుద్దులాటా' (కార్. 791) అనే సామెత చెపుతున్నాయి. 'తనలో తప్పు లేకుంటే గురువుతో గుద్దులాడవచ్చు' అనే సామెతకు ప్రత్యక్ష సాక్షులు భీష్మ పరశురాములు. గురుద్రోహం కూడదని పల్లీయు లకు సహజమైన మొరటుదనంతో చెప్పిన సామెతలు: 'గురువు గుద్దకు సున్నం పెట్టేవాడు' (నర), 'గురువు గుద్ద దెంగి ఎద్దు పొడిచిందని చెప్పేవాడు' (నర) అనేవి.

(ఊ) శాస్త్రాలు (7) : ఇది ఇట్లే చేయాలి అని శాసించే నియమన గ్రంథాలు శాస్త్రాలు. ఇవి ఆరు. తర్కము, వ్యాకరణము. ధర్మము, మీమాంస. వైద్యము, జ్యోతిషము అనేవి. కొక్కోక శాస్త్రం. గజశాస్త్రం గురించిన సామెతలు న్నాయి. కొక్కోక శాస్త్రం అంటే శృంగార శాస్త్రం.

అనుభవమే శాస్త్రం అని, శాస్త్రం తెలిసినవారే అనాచారం పాలవుతారని, శాస్త్రం తప్పనిసరిగా సత్యాన్ని చెప్పక పోవచ్చని, ఏదంటే అది వాగితే శాస్త్రం కాదని, 'అనుభవమే శాస్త్రం మాటలే మంత్రాలు', 'సకల శాస్త్రాలు, నిలబడి మూత్రాలు', 'శాస్త్రం తప్పు వచ్చేది నిజం', 'కొక్కోక శాస్త్రి విదులు నరసన్నుతు లందుదురు గాని భక్తిశాస్త్రి సంవిదులుగారు', 'గజశాస్త్రివేత్తలకు గజారోహణం వస్తుందా', 'కల్లు లొట్టెడు దాగి కై పెక్కి వదిరిన శాస్త్రివాది కాదు' అనేవి పై విషయాల్ని తెలిపే సామెతలు వైద్య విజ్ఞానం గురించిన వివరణ ప్రత్యేక శీర్షికలో చేయబడింది.

(ఋ) సాము (4) : ప్రాచీనులు చదువుతో బుద్ధిని, వ్యాయామంతో శరీరాన్ని తీర్చి దిద్దుకొనేవారు. చదువు-సాము అనేది జంటపదం. 'వానికి చదువూ లేదు సామూ లేదు' అని ఇప్పటికీ జానపదు లనే మాటలు సాముకు ప్రాచీను లిచ్చిన ప్రాధా

న్నాళ్ళన్నీ నొక్కి చెపుతాయి. ఒళ్లు వంచి సాము నేర్వాలని, వయసు పెరిగితే ఒళ్లు వంగదని 'చదువుకు ముదురు, సాముకు లేత' అనే సామెత తెలుపుతుంది.

'సాము నేర్చిన వానికే చావు గండం' అనేది కత్తిసాము నేర్చిన వారు యుద్ధాల్లో పాల్గొని వీర స్వర్గ మలంకరించే వారని చెపుతుంది. తాము నేర్చుకొన్న సామును దుష్ప్రయోగం, నిష్ప్రయోగం చేసేవార్ని దుయ్యబట్టే సామెతలు: 'ఆరు నెలలు సాము చేసి మూలనున్న ముసలమ్మను పొడిచినట్లు', 'అయ్య సామెల్లా ఇంట్లోనే' అనేవి.

4.2.2 వైద్యం (481) : 'ఆరోగ్యమే మహాభాగ్యం' అన్నారు పెద్దలు. మన ఆరోగ్యాన్ని కాపాడుకొనేందుకు ఆరోగ్య విషయాలు, అనారోగ్య లక్షణాలు, వివిధ వ్యాధులు, వాటి ఔషధాలు తెలియడం అవసరం. ఈ విషయాలు, ఆయుర్వేద వైద్య విధానాలు 481 తెలుగు సామెతల్లో విపులంగా బోధించ బడ్డాయి.

వైద్యం అనేఅంశాన్ని రోగం-రోగి చర్మవ్యాధులు, కురుపులు-గాయాలు, దంత వ్యాధులు, జలుబు-దగ్గు, జ్వర సంబంధి వ్యాధులు, ఊదు, పైత్యం- విరేచనాలు, ఆసనరోగాలు, నొప్పులు, కంపు, గర్భ సంబంధి విషయాలు, మరికొన్ని ఇతర రోగాలు, అంగ వైకల్యం, మానసిక వ్యాధులు, ఆహారం-అజీర్ణం, ఔషధాలు అనే 19 శీర్షికల కింద విభజించి విషయ నివేదనం చేయడం జరిగింది,

(అ) రోగం-రోగి (56) : రోగాన్ని బయటికి చెప్పుకోవాలి అని, అన్నీ సాగితే రోగం దర్జాగా ఉంటుందని, ఏగేవాళ్లంటే రోగాలు కోరుకుంటారని, దిగులు పెద్ద వ్యాధి అని, అనుమానం రోగం కన్నా ఎక్కువ కీడు చేస్తుందని 'రోగము రట్టు సంసారము గుట్టు' (గృ. ల. 414), 'అన్నీ సాగితే రోగమంత భోగం లేదు', 'ఏగేవాళ్లంటే చచ్చేంత ఆపతి పడతారు' (నర). 'దిగులును మించిన వ్యాధి విశ్వాసాన్ని మించిన ఔషధం లేదు' (నర), 'చితి చచ్చినవానిని చింత బ్రతికిన వానిని కాలుస్తుంది', 'ఆయుస్సు తీరినవాడు ఆరు నెలలకు చస్తే అనుమాన పడిన వాడు అప్పుడే చస్తాడు' అనే సామెతలు తెలుపుతున్నాయి. రోగికి కోప మెక్కువ. 'వ్యాధి వచ్చినవాడు వెట్టి బట్టిన వాడు ఒకటే' అని సామెత. 'చచ్చేరోగికి మందు లేదు' అనే సామెత వైద్యుడు ఆయుస్సు పోయ లేడు గదా అంటుంది.

(ఆ) చర్మ వ్యాధులు (27) : చిడుము, తీట, గజ్జి ఒకే చర్మవ్యాధిని చెప్పే పదాలు. కుష్ఠు, పొడలు కూడా చర్మ రోగాలే. చర్మ రోగాలకు దురద ఒక లక్షణం. దురద గోకిన కొద్దీ ఎక్కువవుతుంది. తీట వస్తే ఎందరిలో ఉన్నా సిగ్గు

విడిచి గీరుకోక తప్పదు. వంకాయ బజ్జి తింటే గజ్జి వస్తుంది. దరిద్రునికి చీడ వ్యాధి పుడుతుంది. తల్లికి బొల్లివుంటే పిల్లలకు కూడా రావచ్చు. పొడలవానివి నమ్మ కూడదు. పెద్ద రోగం అని పేరు పొందిన కుష్ఠు తీట ముదిరితే వస్తుంది. దురద గొండి (తీట కంతిరాకు) తో రుద్దుకుంటే దురద పుడుతుంది.

ఈ విషయాల్ని వ్యక్తం చేసే సామెతలు: 'గోకి దురద తెచ్చుకొన్నట్లు', 'ఇనుము, తీట, పేము పట్టిన చెయ్యి వూరకుండదు' (కార్. 255), 'ఆకలి రుచెరుగదు' నిద్ర సుఖం ఎరుగదు, చీడ సిగ్గెరుగదు' (చి. సు.), 'వంకాయ బజ్జి ఒళ్లంతా గజ్జి', 'సిరిపోయి చీడ పట్టుకొన్నట్లు' (నర), 'తల్లికి బొల్లివుంటే పిల్లకు చుక్క అయినా ఉంటుంది', 'పొట్టి వానిని పొడల వానిని నమ్మరాదు' (సా.సా.333) 'తీట ముదిరి కుష్ఠు అయింది' (సా), 'పెడత్రానికి పెద్దరోగమునకు మందు లేదు', 'ఊరు కుండ లేక ఒళ్లు ఉమ్మెత్తాకుతో (దురద కొండితో) రుద్దుకొనినట్లు' అనేవి. బొల్లి వంశ పారంపర్యం కాదని. తీట ముదిరి కుష్ఠు కాదని వైద్య శాస్త్రం నిరూపించింది. ఆ రోగాలపై జానపదుల అభిప్రాయాలవి.

(ఇ) కురుపులు-గాయాలు (14): పుండ్లు ఒరిసినపుడు ఉప్పు, కారంలాంటివి పడితే నొప్పి ఎక్కువౌతుంది. పుండు బాగైనా కనమలల్లే ఉంటాయి. నరంమీది పుండు భరించరానిది. సుండు అనేది చిన్న పుండు మండి అనేది పెద్ద పుండు. పుండు సెలపొయ్యేచ్చు. పుండుకు రక్ష (అగ్ని వైద్యం) వేస్తారు. గోకుడు నీళ్లు పోసుకుంటే పుండ్లు పుడతాయి.

ఈ విషయాల్ని 'ఒరిసిన పుండుపై ఉప్పు చల్లినట్లు', 'పుండు మీద కారం చల్లినట్లు', 'పుండు మానినా బెండు మానదు', 'నడ మంత్రపు సిరి నరంమీది పుండు భరింపరానివి', 'సుండు చూడనీయదు మాడి మాననీయదు', 'మానిన పుండు మళ్లీ సెలపోసినట్లు', 'పుండొక చోట వుంటే రచ్చొక చోట వేస్తే ఎట్లా' (ప.వ), 'గోకుడు నీళ్లు పోసుకుంటే గోకుడు పుండ్లు పుడతవి' (సా). అనేవి తెలుపుతాయి.

గోరు చుట్టు పుండుగా లేచే గోరుచుట్టు విపరీతమైన నొప్పి. దానికి చిన్నగా తగిలినా నొప్పి భరించేది కష్టం. మెడ చుట్టూ గడ్డలు లేచే వ్యాధి గండమాల. గడ్డగా ఉండి లోపల చెడు రక్తం చేరి నెత్తురు గడ్డ అవుతుంది. ఇది మెత్తని కండ ఉండే చోటనే పుడుతుంది. ఆ విషయాల్ని అభివ్యక్తం చేసే సామెతలు: 'గోరుచుట్టుపై రోకటి పోటు', 'మందు మాకిడి గండమాల మాన్పగలేరు చక్క జేయ గలరె నక్క మోర', 'అయము అరునెల్లు వెదుకు తుంది నెత్తురు గడ్డ' (నర) అనేవి.

కంతి మరో విధమైన గడ్డ. పైకి చూసేందుకు బలుపులా కనిపించినా కంతి వాపే కాని బలుపుకాదు. కంతిని కోసి తీసి పేయవలసిందే. ఈ విషయాలు 'కంతి బలుపు కాదు, చింత తీరిక కాదు', 'ఎవరి కంతి కోస్తే వారికే నొప్పి' అనే సామెతలు తెలుపుతున్నాయి. వాపు, బలుపు ఒకే విధంగా ఉన్నా ఒకటి కాదు అని 'వాపును చూచి బలుపనుకొన్నట్లు' అనే సామెత చెపుతుంది.

నారి కురుపు ఒక పట్టాన మానదు. నారి కురుపుల్లో దారంలాగా వచ్చేది తెగితే పుండు మానదు. అందుకే 'తెగిన నారి, తెగిన నారి, తెగిన నారి-మూడూ ప్రమాదమే' అనే సామెత వచ్చింది. అల్లెత్రాడు తెగినా, స్త్రీ తెగించినా ప్రమాదమే గదా !

గాయం తగిలినపుడు సున్నం పెట్టి నెత్తురు కారకుండా ఆపుతారు. చిన్న గాయం అయితే మరే మందూ లేకుండానే ఎండి పోతుంది. తగిలిన కాలికే తగలడం సహజం. శరీరంలో కొన్ని ముఖ్య ప్రదేశాల్ని ఆయువు పట్టు, ఆయం అంటారు. కణత, జననేంద్రియాలు, డొక్క ఇలాంటివి. ఆయంలో గాయం తగిలితే బ్రతి కేది కష్టం. ఏదైనా గాయం ఆయం తప్పించి తగిలితే, గాయం తగిలినందుకు బాధ పడకుండా ఆయంలో తగలనందుకు సంతోషిస్తారు. ఈ విషయాల్ని 'తెగిన వేలికి సున్నం కూడా పెట్టదు', 'తగిలిన కాలికే తగులును, నొగిలిన కొంపే నొగులును,, 'ఆయం తప్పితే గాయమంత సుఖం లేదు' అనే సామెతలు చక్కగా సూచిస్తాయి.

(ఈ) దంత వ్యాధులు (5) : కృత్రిమ దంతాల్ని బెన్నులు అంటారు. విలాస ప్రియులు బంగారు పండ్లు కట్టించుకుంటారు. కృత్రిమ దంతాలు భోజనం నమిలేందుకు సహజ దంతాలంత పటుత్వంగా ఉండవు. పన్నులో పురుగు చేరినా, దవడ వాచినా నొప్పి భరించేది కష్టం. 'పన్నులు లేక బెన్నులు పెట్టినారు. పన్ను లుంటే పందుం తిననా ? అన్నాడట', 'పాచి పండ్లోడు చేర్పి పెడ్తే బంగారు పండ్లోడు దార బోసెనంట' (చంద్ర), 'పురుగు చేరిన పన్ను పలవింప చేయదా', 'దవడ రేగినా దడ్డు రేగినా ఆపేది కష్టం' అనే సామెతలు పై విషయాల్ని చెపు తాయి. పాచి పండ్ల వాణ్ణి హేళన చేసే సామెత 'పాచి బలిస్తే పంటికి బలం మట్టి బలిస్తే ఒంటికి బలం' అన్నేది.

(ఉ) జలుబు-దగ్గు (21) : తరచు వచ్చే జబ్బు పడిశం. పడిశం పడితే వాసన తెలియదు. మందు లేక పోయినా కొన్ని రోజులకు తగ్గి పోతుంది. ముక్కిడీ వాళ్లకు పడిశం పడితే మరీ ఇబ్బంది. కొంతమందికి పడిశం పడే జ్వరమూ,

దగ్గా రావచ్చు. ఈ విషయాల్ని చెప్పే సామెతలు: 'తలకాయ ఉన్నంత సేపూ పడిశం పోదు' (నర), 'పడిశం ముక్కోడికి పారి జాతా తేల' (నర) 'జలుబు విచారణ లేని జబ్బు', 'జలుబు మందు తింటే వారం దినాలు ఉంటుంది, తినక పోతే ఏడు దినాలుంటుంది', 'ముందే ముక్కిడి పైన పడిశము', 'పడిశము పది రోగాల పెట్టు' అనేవి.

దగ్గు దాచేందుకు వీలుకానిది. దగ్గు వస్తే ఆయాసంతో డొక్కలు ఎగుర వేస్తారు. వృద్ధులకు దగ్గు తరచుగా వస్తూంటుంది. శొంఠి కషాయం దగ్గును తగ్గిస్తుంది. కొన్ని రకాల దగ్గులు ముదిరి ప్రాణాపాయం కలగవచ్చు. ఈ విషయాల్ని 'దగ్గు, పిగ్గు దాచినా దాగవు', 'దగ్గేవాని దగ్గర డొక్కలు ఎగర వేసినట్లు', 'తాతకు దగ్గులు నేర్పినట్లు', 'దగ్గుతూ పోతే శొంఠి పిరెము (నర), 'రాయంగ రాయంగ కరణం దగ్గంగ దగ్గంగ మరణం' అనే సామెతలు చక్కగా అభివ్యక్తీకరిస్తాయి. అంగిటి ముల్లు గొంతు వ్యాధి. కొండ నాలుకకీ వ్యాధి వస్తుంటుంది. దీన్నే 'కిర్నాలుకయింది' అంటుంటారు. 'ముది ముప్పున (ముసలి ముప్పందాన)అంగిట ముల్లు', 'కొండ నాలుకకు మందు వేస్తే ఉన్న నాలుక కాస్తా ఊడి పోయిందట' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి.

(ఈ) జ్వర సంబంధి వ్యాధులు (18) :
జ్వరం చాలా ఎక్కువై పోతే సన్నిపాతం వస్తుంది. వాత పిత్త శ్లేష్మాలనే త్రినాడుల దోషంలో కలిగే మోహ రోగం సన్నిపాతం. అజీర్ణం ఉంటే జ్వరం వస్తుంది. జ్వరం కాస్తే నోరు చేదవుతుంది. జ్వరానికి పల్లెల్లో యంత్రాలు వేస్తుంటారు. మంత్రాలు రాగి రేకుపై రాసి ముగ్గు వేసి ఒక బొమ్మను చేసి పూజచేసి ఆ రేకును చుట్టి తాయెత్తులో పెట్టి గాని, రాగి రేకు మడిచి మూడు రంగుల దారం దానికి చుట్టి గాని రోగికి దండకో మెడకో కడ్తారు. జ్వరం మనుషుల్ని కృశింప చేస్తుంది. జన్నె రోగం వచ్చిన వానికి అసందర్భ ప్రలాపాలుంటాయి. జన్నె రోగికి బ్రె జొన్న పెడితే అపాయం. పసిరికలు అయితే కళ్లు, ఒళ్లు పసుపు పచ్చగా మారుతాయి. వారి కళ్లకు సామెతలో చెప్పినట్లు లోకం పచ్చగా కనబడుతుందో లేదో కాని, రోగం ముదిరితే లోకం కళ్లకు వాళ్ళు పచ్చగా కనపడ్డం ఖాయం.

పల్చని మజ్జిగ కామెర్ల వ్యాధికి పథ్య వస్తువు. పై విషయాల్ని వివరించే సామెతలు ఇవి: 'కడుపు నిండా గారెలు తింటే వంటి నిండా జ్వరము' (శ్రీపాద) 'జ్వర జిహ్వకు పంచదార చేదు', 'జరుగుబాటుంటే జ్వరమంత సుఖం లేదు'

'జ్వరం వచ్చి కొదు చచ్చింది యంత్రాలు మోసి మోసి' (రా. ప. 320), 'నరణ వంటి వాడికి జ్వరం వస్తే చేయి చూచినవాడు బ్రతుకడు', 'సంపద గలదేని సన్ని పాతము పూను', 'జన్నె రోగికి బట్టె జున్ను పెట్టినట్లు', 'మోదుగ పువ్వు అందము, పసిమి రోగము మిసిమి', 'కామెర్ల రోగికి కనబడేదంతా పచ్చనే', 'పచ్చ కామెర్లకు పల్చని మజ్జిగయే పథ్యం' (గ్ర. ల. 956) అనేవి.

(బు) ఊదు (5): కొన్ని రోగాల్లో మీగాళ్ళు, చేతులు, మొగమూ ఊదు తాయి. ఊదు కామెర్లు అనే వ్యాధి కామెర్ల వ్యాధిలో ఒక రకం. 'ఊదు మొగము వాడా ఊరు వెళదామా అంటే రెప్పలార్చే వాడా రేపు పోదాము అన్నాడట' (నర), 'ముఖము చూస్తే కనబడదా మీగాళ్లవాపు' అనే సామెతలు ఊదును గురించి చెప్పేవి.

(బూ) పైత్యం (6): వాతం పిత్తం శ్లేష్మం అనేవి మూడు ధాతువులు. పిత్తం వలన కలిగే వ్యాధి పైత్యం. పిత్తంతో పిత్త జ్వరం కూడా వస్తుంటుంది. పైత్యానికి కళ్ళు తిరగడం, చక్కెర చేదు అనిపించడం లక్షణాలు. లంఖణాల్తో పైత్యం తగ్గుతుంది. ఈ విషయాల్ని 'చాల్తీలు, శకణ్ణాలు చెదేస్తే పైత్యం పదేసే వయస్సు', 'పైత్యరోగికి పంచదార చేదు', 'లంఖణాలకు పెడితే గాని వదలదు' (రా. ప. 567) అనే సామెతలు తెలుపుతున్నాయి. చాల్తీలు అంటే కోడిగపు మాటలు, చేష్టలు, శకణ్ణాలు అంటే కొంటె పనులు. అవకతవకగా ప్రవర్తించేవార్ని పైత్యం ఎక్కువైందా? అంటుంటారు. ఆ విషయాన్ని 'వెట్టి వేయి విధాలు, పైత్యం పదివేల విధాలు' అనే సామెత తెలుపుతుంది.

(ఎ) విరేచనాలు (4): కొన్ని రోగాలు తగ్గేందుకు భేది మందు ఇస్తారు. రోగానికి మందు తినబోయే ముందు భేది కిచ్చి కడుపు శుభ్రం చేసిన తర్వాతనే మొదలు పెడ్తారు. వాంతులు విరేచనాలు వచ్చి చస్తే కలరా అని, బతికితే అతి సారం అంటారని సామెతలు తెలుపుతాయి. 'పిత్త సత్తువ లేదు పాసనాలకు మందట', 'బతికితే అతిసారం చస్తే కలరా అన్నట్లు' అనేవి పై విషయాల్ని తెలిపే సామెతలు.

(ఏ) ఆసన రోగాలు – సుఖ రోగాలు (17)

ఆసన రోగాల్లో స్త్రీలకు వచ్చే గూద, మగవాళ్లకు వచ్చే బుడ్డ ముఖ్యమైనవి. సవాయి. స్త్రీ జననేంద్రియంలో పుండు సుఖరోగ సంబంధులు. గర్భాశయం దిగ జారడం గూద. వృషణాలకు-వచ్చే వ్యాధి బుడ్డ. వక్రంగా దూకితే బుడ్డ వస్తుందని

'వేసినదే ఒక గంతు దిగినదే ఒక బుడ్డ' అనే సామెత, వృషణ పరిమాణం పెరగటాన్ని 'బుడ్డ ఎంత పెద్దదైనా ముక్కాలి పీట గాదు బడ్డు ఆయుధము గాదు' అనే సామెత చెపుతున్నాయి. గోచిని బుడ్డ గోచి అనడం ఉంది. కడప మండలంలో గోచిని పుట్ట గోచి అంటారు. 'బుడ్డ గోచిని మించిన దరిద్రం లేదు. 'చావు కన్న మించిన కష్టం లేదు' అని సామెత. గూద వ్యాధి బాధ ఎక్కువని 'ఉలుకున్నమ్మకు అలుకెక్కువ, గూద ఉన్నమ్మకు బాధ ఎక్కువ' అనే సామెత చెపుతుంది.

సెగ (గనేరియా) స్త్రీ నుంచి పురుషునికి. పురుషుని నుంచి స్త్రీకి సంక్రమించే సుఖ వ్యాధి. వేశ్యలకు ఈ వ్యాధి ఉండి విటులకు వస్తుంటుందని 'అర గడియ భోగం ఆరు నెలల రోగం', 'సొగసైన లేమకు సెగ రోగమున్నట్లు' అనే సామెతలు చెప్తాయి. ముందు జాగ్రత్త అవసరమని, వస్తే మాన్పుకోవడం కష్టమని 'సంకటాలు తగిలించుకొని మీసాలు పీక్కుంటే ఏమవుతుంది' అనే సామెత ప్రశ్నిస్తుంది. 'బట్ట చాటు పుండు బావగారి వైద్యం', 'ఆసనంలో పుండు అల్లుని వైద్యం' అనేవి స్త్రీల ఆసన వ్యాధులకు సంబంధించినవి.

(ఐ) నొప్పులు (7) : తల నొప్పి, మెడల నొప్పులు, వాయువు నొప్పుల ప్రస్తావన సామెతల్లో ఉంది. తలగడ తిరగవేస్తే తలనొప్పి. మెత్తలు ఎంతవేస్తే మెడల నొప్పులు పోవని, తలనొప్పి భరించరానిదని, వాయువు నొప్పుల్తో వళ్ళు చెడిపోతుందని చెప్పే సామెతలు : 'తలగడ తిరగవేస్తే తలనొప్పి తీరునా', 'మెత్తలు ఎండకు వేస్తే మెడల నొప్పులు పోతాయా?', 'తనదాకా వస్తేగాని తలనొప్పి బాధ తెలియదు', 'ఇరు పోటీల్తో ఇల్లు చెడె వాయువు నొప్పుల్తో ఒళ్ళు చెడె' (నర) అనేవి.

(ఒ) కంపు (8) : నోటి కంపు. దేహం కంపు, అపాన వాయువు వాసనలను గురించిన సామెతలున్నాయి. తన నోటి కంపు తనకు తెలియదని, తన కంపు తన కిష్టమని, నిశ్శబ్దంగా అపాన వాయువు వదిలినా దుర్వాసన పోదని 'ఎవడి నోటికంపు వాడికి తెలియదు', 'మనిషి గబ్బు మారు మారు నాగబ్బు తీరు తీరు' (రా.ప.484), 'కిట్టుతో కిట్టు కలిస్తే కంపేడకు పోతుంది' అనే సామెతలు తెలుపుతున్నాయి.

(ఓ) గర్భ సంబంధి విషయాలు (20) :
ముట్లు అవుతున్నపుడే స్త్రీకి బిడ్డలు పుట్టే అవకాశం ఉంది. పిండం ఆరోగ్యంగా పెరగాలంటే గర్భవతి పుష్టిగా ఉండాలి. గర్భవతులయిన స్త్రీలకు రక రకాల కోరికలుంటాయి. కోరిక తీరకపోతే పిల్లలకు అంగ వైకల్యం వస్తుందని, గర్భవతికి

కాళ్లూ చేతులూ మొగం వాస్తాయని పల్లీయుల నమ్మకం. ప్రసవ వేదన భరించలేక కేకలు వేస్తారు. పురిటిగది వంటింటికి దూరంగా ఉండాలి. కాని తల్లి గారాబంతో కూతురికి వంటింట్లో నైనా పురుడు పోస్తానంటుంది. ఏడవ నెలలో పుట్టే నెల తక్కువ బిడ్డ దుర్బలంగా వుండి, బతికే అవకాశం తక్కువగా ఉంటుంది. అప్పుడే పుట్టిన బిడ్డకు ఆముదము తాగిస్తారు-శిశువు కడుపులో ఉండే మాలిన్యం పోవాలని. ఒళ్ళు కంతా పూస్తారు. కాన్పు సమయంలో స్త్రీకి మంచం ఉంటే బాగుంటుంది. బాలింతకు ఆక లెక్కువ. కానీ మితాహారం ఇచ్చి ఇంగువ తినిపిస్తుంటారు. ఎరికల, యానాదుల్లో బాలింతకు బదులు ఆమె మొగుడు పథ్యం ఉంటాడు - సవతులు బాలింతకు పథ్యపు వస్తువుల్లో విషంలాంటి దేమైనా పెడతారేమోనని.

పై విషయాల్ని వివరించే సామెతలు - 'ముట్లుడిగిన దానికి (సతికి) మగ బిడ్డ పుట్టినా దన్నట్లు', 'మొదలు దుర్బలం అందులో గర్భిణీ' (కార్. 1829), 'ఓపనివారు కోరనిదీ ఒంటనివారు అడనిదీ లేదు' (కార్. 489), 'అమ్మా అమ్మా నొప్పు లెత్తుకున్నపుడు నన్ను లేపవే అంటే అలాగా పడుకో బిడ్డ, ఊటగా నొప్పు లెత్తుకుంటే నీవే లేపుతావు అందట', 'కూతురి పురుడు కుండల్లో, కోడలి పురుడు కొండల్లో', 'నెల తక్కువైనా రాజులింట పుట్టమన్నారు' (ప.ప.), 'ఆముద మున్న చోటే నీళ్లాడినట్లు', 'మంచమున్న దగ్గతే నీళ్లాడమన్నట్లు', 'ఈనిన పేగులకి ఇల్లిల్లూ చాలదు' (వి. వేం.), 'పింగి కంటే (నీళ్లాడితే) పింగడు పథ్యం చేసినట్లు' (ఇంగువ తిన్నట్లు) అనేవి.

(ఔ) మరి కొన్ని వ్యాధులు (14): 'మనిషి కాటుకు మందు లేదు' అని 'చచ్చేటప్పుడు సంది మంత్రము' (సు. ర. 671) వృథా అని సామెతలంటున్నాయి. జరా భారంతో నరాల పటుత్వం తప్పి వణకు వస్తుంటుంది అని 'ముసలమ్మా బుఱ్ఱ వణికిస్తావేమి అంటే ఊరకుండి నేనేమి చేస్తానన్నదట' అనే సామెత, అసంతర్పపు అసాధ్యపు పనిని 'బట్టతలకు మోకాటికి ముడివేసినట్లు' అనే సామెత. చలికాలం బయట పడుకుంటే ప్రాణాపాయం కావచ్చునని 'బడాయికి బైట పడుకుంటే పక్క నరాలు యిక్క లాక్కు వచ్చాయట' (ప. ప.) అనే సామెత, వృషణాల ఆయువు పట్టని 'తిట్టా వద్దు కొట్టా వద్దు పట్టలు పిసికితే వాడే చస్తాడు' (నత) అనే సామెత చెపుతున్నాయి.

నపుంసకత్వాన్ని చెప్పే సామెత 'ఊబ నా మొగుడు ఊళ్లో ఉన్నా ఒకటే దంతులో ఉన్నా ఒకటే' అనేది. 'మునసతి ముప్పంటాన తునుమతోగం వచ్చినట్లు'

అనే సామెత తెల్ల బట్ట, తెల్ల కోకలు అని పిలువబడే స్త్రీలను పీల్చి పిప్పి చేసే వ్యాధిని గురించి తెలిపేది. తెల్లబట్ట వ్యాధి ఒకోసారి క్యాన్సర్‌కు దారి తీస్తుందని కూడా అంటారు.

(క) అంగ వైకల్యం (107): గుడ్డి, కుంటి, మూగ, చెవిటి లాంటి అంగ వైకల్యాలకు సంబంధించిన సామెతల్లో విషయ వివరణ ఇది:

అంధత్వానికి సంబంధించిన సామెతలు 72. కండ్లు ప్రాణికి ఎంత అవసరమో 'కండ్లు లేక పోతే కలియుగం లేదు' (సా) అనే సామెత చక్కగా వ్యక్తం చేస్తుంది. కన్యాశుల్కం తక్కువని అంధురాల్ని పెండ్లాడితే ఇబ్బంది అని, అంధుడు సరిగా పని చేయలేడు కాబట్టి మళ్లీ వేరే వాళ్లు చేయాల్సి ఉంటుందని, అంధ నేత్రానికి మందు లేదని, కన్ను పూవు పూచి గాని, కాయ గాచి గాని అంధత్వం రావచ్చునని, అంధునికి కర్ర జారిపోతే తిరిగేది కష్టమని, అంధ నేత్రానికి అలంకరణ అనవసరమని, కన్నుకు వచ్చే వ్యాధులకు వాతలు వేసి బాగు చేస్తారని సామెతలు చెపుతున్నాయి.

'ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెండ్లాడితే దొంతి కుండలన్నీ పగుల గొట్టినట్లు', 'గుడ్డి వాని పనికి ముగ్గురు పంచేటు' (నర). 'గుడ్డి వానికి గుడ్డివాడు దారి చూపితే యిద్దరూ గోతిలో పడతారు' (కార్. 2309), 'నైజ గుణానికి గుడ్డి కంటికి మందు లేదు', 'ఓ కన్ను పూవు కన్ను, ఇంకొక కన్ను కాయ కన్ను', 'గుడ్డివాడు కోల కోల్పోయినట్లు', 'గుడ్డి కంటికి కాటుక పెట్టినట్లు', 'కన్ను పోక తలికే వాతేసుకోవాల' (నర) అనేవి పై విషయాల్ని స్పష్టం చేస్తాయి.

పాక్షిక దృష్టి ఉంటుంది కాబట్టి 'గుడ్డి కన్న మెల్ల మేలు'గా తలుస్తారు. పల్లీయులు రాత్రి వేళల పంటకు కాపలా వెళ్లాల్సి ఉంటుంది, కాబట్టి రేజీకటి ఉంటే కష్టమవుతుందని 'కాపురానికి కడగండ్లు మగనికి రేజీకట్లు' అనే సామెత తెలుపుతుంది. 'తెల్లార్తే పగలు చీకటోడ్ని రేజీగటోడు ఏరా తారాడ్తా వన్నేంట, రాత్రి రేజీకటోడ్ని పగలు చీకటోడు ఏరా పడి లేస్తావన్నేంట' (చంద్ర) అనే సామెత రేజీకటి, పగలు చీకటి వ్యాధుల్ని చెప్పగా 'కుడి కన్నుకుదెయ్యడం ఎడమ కన్ను ఎగరెయ్యడం' అనేది కంటి నరాల వ్యాధి సంబంధమైన సామెత.

కుంటి తనానికి సంబంధించిన సామెతలు 16. కాళ్లు లేని వాన్నే కుంటివాడు అంటారు. చేతులు కుంటి చేతులు కావచ్చు. మొండి చేతులు కావచ్చు. ఈడ్పుగాళ్లు ఈడ్పు చేతులు పాక్షిక కుంటి తనానికి చెందినవి. అంధుడు, పంగువు ఒకరి సహా

కారం మరొకరు పొంది ప్రయోజనం పొందొచ్చునని, కుంటి కాలుకు తోడు పక్ష వాతం వస్తే లేచి నడిచేదే గగన మవుతుందని, కుంటి చేతులవాడు తను స్వయంగా తినలేడని, కుంటివారిని ఎంతసేపు మోసినా నిష్ఫూరమేనని సామెతలు అభిప్రాయ పడుతున్నాయి. 'అంధునికాలు పంగునకు ఆధారమైనటు', 'మొదలే కుంటి కాలు, దానికి తోడు పక్షవాతం', 'కుంటి చేతులవాడు నువ్వులు తిన బెదిరించినట్లు', 'కుంటివాన్ని ఎంత దూరం మోసినా నిష్ఠూరమే' (నర) అనేవి. మోదకాళ్ల, ఈడ్పు కాళ్ల, ఈడ్పు చేతులకు సంబంధించిన సామెతలు: 'మొండి చేతుల పెండ్లానికి మోదకాళ్ల మొగుడు', 'ఈడ్పు గాళ్ళు ఈడ్పు చేతులు ఇతదేనమ్మా ఇల్లటపుటల్లుడు' అనేవి.

గూనికి సంబంధించిన సామెతలు 8. గూనికి తోడు గుఱ్ఱపు వాయువు3 వస్తే కదిలేదే కష్టమని, వ్యక్తి గూని ఐనా ప్రేమ గూని కాదని, ఒకసారి గూని వస్తే చక్కబడదని, గూనివాడు పడుకొనే వల్ల అతనికి తప్ప ఇతరులకు తెలియదని సామెతలంటున్నాయి. 'గూనికి తోడు గుర్రపు వాయువు' (కాశీ. 801) 'తల్లి గూనిదైతే తల్లి ప్రేమ గూనిదౌతుందా', 'గూను వీపు కుదురు అవుతుందా', 'గూని వాడు పడుకునే వల్ల గూనివాడికే తెలుసు' అనేవి ఆ సామెతలు.

మూగ, చెవుడు వ్యాధులకు సంబంధించిన సామెతలు 12. మూగవాడు మాట్లాడ్డం అసాధ్యం. మూగవాని ముందు ముక్కు గోక్కుంటే అతనికి తల నొప్పి వస్తుందట. కాబట్టి కోపగించుకుంటాడు. చెవిటి వాళ్ళు రహస్యాలోచన చేయడం హాస్యాస్పదం. చెవిటి వాని ముందర శంఖం ఊదడం వృథా. ఆ విష యాల్ని చెప్పే సామెతలు: 'ముక్కు లోని వెంట్రుక కొప్పులోనికి వచ్చి మూగ వాడు అమ్మా అన్ననాటికి చూదాంలే', 'మూగవాని ముందు ముక్కు గోక్కున్నట్లు', 'చెవుడు చెవుడు అంటే తవుడు తవుడు అన్నట్లు', 'మూడు పుట్ల చెవిటి వానికి ఆరు పుట్ల చెవిటివాడు ఆలోచన చెప్పినట్లు', 'చెవిటోడి చెవులో శంకూదినట్లు' (చంద్ర) అనేవి.

(2) మానసిక వ్యాధులు (13): పిచ్చి, తిక్క, వెర్రి, ఉన్మాదం సమానార్థ కాలు. అసందర్భమైన పనులు చేయడం, అసందర్భ ప్రలాపాలు చేయడం, ఎవరి మీదంటే వారిమీద అక్కసు వెళ్ళ గ్రక్కడం, ఎప్పుడూ ఎటంటే అటు తిరుగు తుండడం పిచ్చి లక్షణాల్లో కొన్ని. 'పిచ్చి కుదిరింది రోకలి తలకు చుట్టమన్నా డట' అనే సామెత పిచ్చివాని అసందర్భ ప్రలాపాన్ని, 'వెఱ్ఱివానిచేతిరాయి తగిలెనా

తగులును, తప్పినా తప్పును' అనే సామెత పిచ్చివాడు ఉన్మాదంలో ఏమైనా చేయ వచ్చునని, 'తిక్కాది తిన్నాళ్లప పోతే తొక్కి చంపినారట' (నర) అనే సామెత తిక్కవాళ్లను సమాజం బాధించే విషయాన్ని వివరిస్తుంది.

(గ) ఆహారం - అజీర్ణం (44): ఉగాది నుంచి మాల పున్నమ దాకా వీచే గాలి ఆవిటి గాలి. ఆవి, ఆవిరి అంటే ఉష్ణం. ఆవిటి గాలి వీస్తే ఆకలి ఎక్కువవు తుందని, బావుల్లో నీళ్లు, కుండల్లో గింజలు అయి పోతాయని పల్లీయుల అనుభవ సిద్ధమైన సత్యం. 'ఆవిటి గాలికి ఆకలి జాస్తి' (నర) అనేది పై విషయాన్ని తెలిపే సామెత.

ఆయుర్వేదం మితాహారాన్ని విధించింది. అన్ని రోగాలకు కారణమైన అజీర్ణం తెచ్చుకొన్నవాణ్ణి 'అయి పుట్టిన పియ్యి తింటాడు' (నర) అని పల్లీయులు నిందిస్తారు. 'ఒక పూట తింటే యోగి, రెండు పూటలా తింటే భోగి, మూడు పూటలా తింటే రోగి' (నర), 'పిడికెడు తిన్నమ్మ పీటకోడు లాగుంటే చాటెడు దిన్నమ్మ చక్కపేడులాగా ఉంది' (నర), 'బహు తిండి బహు నాశనం' అనే సామెతలు మితాహారాన్ని విధించేవి.

అటుకులు, తీపు, చక్కెర ఉదర వ్యాధులు తెస్తాయని, అటుకులు దిన్నల్లి కడుపు కుట్టుకు ఓర్చుకో గలదా', 'నోటికి తీపి, పొట్టకు చేటు', 'నోట్లో చక్కెర కడుపులో కత్తెర' అనే సామెతలు చెపుతున్నాయి. అజీర్ణం ఉంటే కడుపులో మంటతో ఆకలి ఎక్కువౌతుందని, వాంతికి ముందు కడుపులో తిప్పుతుందని, శిశు వులు పాలు వాంతి చేసుకోవడం ఆరోగ్యానికి మంచిదేనని 'అజీర్ణానికి ఆకలి మెండు', 'కడుపులో తిప్పంది కక్కొస్తుందా', 'కక్కిన బిడ్డ దక్కుతుంది' అనే సామెతలు తెలుపుతున్నాయి.

మితాహారంతోపాటు తిన్నది అరిగేందుకు శరీర పరిశ్రమ, అపుడపుడూ విశ్రాంతి అవసరం అని 'చేపినమ్మ చేవ చేయనమ్మ చెదలు', 'నీటికి ప్రవాహం దేహానికి పరిశ్రమ ఎంతో అవసరం', 'విశ్రాంతి లేక బంగారు తిన్నా బూడిద పాలు' (గృ. ల. 881) అనే సామెతలు వివరిస్తున్నాయి.

(ఘ) ఔషధాలు (68): ఔషధాల్ని గురించి చెప్పిన సామెతల్లో విషయాలు ఇవి: అన్ని వస్తువులూ ఔషధంలా పనికి వస్తాయని, మందులు తియ్యగా వుండ వని, మనో వ్యాధికి ఔషధం లేదని, మందు మూడు పూటలు వరుసగా తింటే తప్ప గుణం కనిపించదని, ఔషధం సాయంత్రం సేవించాలని, మందు బాగా పని

చేయాలంటే బాగా నూరాలని సామెతలు చెపుతున్నాయి. 'ఔషధం కానిది అవనిలో లేదు', 'కమ్మని రోగాలు తియ్యని మందులు', 'మాటలే మంత్రాలు మాకులే మందులు', 'మనసులోని వెతకు మందు లేదు' (రా. ప. 483), 'మందు అయినా విందు అయినా మూడు నాళ్లు' (సా. సా. 351), 'ఔషధానికి సాయంత్రం మంచిది' అనేవి పై విషయాల్ని తెలిపేవి.

ఏ వ్యాధికైనా కొన్ని అపథ్యపు వస్తువులుంటాయి. అవి తింటే ఆ వ్యాధి ఎక్కువై పోతుంది. మందులకు కూడా అపథ్యపు వస్తువులు ఉంటాయి. మందు గుణాన్ని విరిచి వేస్తాయి. కాబట్టి ఆయుర్వేద వైద్యంలో మందు సేవించడంతో పాటు తప్పనిసరిగా కొన్ని దినాలు పథ్యం ఉండాల్సి వుంటుంది. అరటికాయ, లేత గుమ్మడికాయ లాంటి కాయలు ఆరోగ్యానికి చెడ్డ చేస్తాయి.

పథ్యానికి సంబంధించిన విషయాల్ని చెప్పే సామెతలు ఇవి: కొన్ని వ్యాధులకు ఉప్పు, కారం, పులుసు మానేయాలి. దాన్నే చప్పిడి పథ్యం అంటారు. 'చప్పిడి చేస్తే జబ్బు కుదురుతుంది' (ప.ప.), 'ఔషధానికి అపథ్యానికి చెల్లు, రోగం పై పెచ్చు', 'పథ్యం చెడరాదు సత్యం తప్పరాదు', 'అరటికాయ ఆరు నెలల రోగం', 'లేత గుమ్మడికాయ విష తుల్యం' అనేవి. రోగిని అభోజనంగా ఉంచడం లంఖణం చేయించడం. లంఖణాలు చేస్తే జీర్ణాశయ శక్తి మెరుగై మందు అవసరంకూడా లేకుండా రోగం బాగౌతుందని చెప్పబడింది. 'లంఖణం పరమౌషధమ్' (ప.ప.) అని సామెత.

ఉల్లి- వెల్లుల్లి, కరక్కాయలు, కాయము, పిప్పళ్లు, పెన్నేరు గడ్డ, దొండాకు పసరు, తిప్ప తీగ, ఉత్తరేణు, మారేడు, వాయలాకు, పాయలాకు, మాచికాయ, జాజికాయ అనే వస్తువుల ప్రసక్తి సామెతల్లో వుంది.[4]

నీరుల్లి వాత దోషాన్ని రక్త పైత్యాన్ని, మూల వ్యాధిని రక్త విరేచనాల్ని పోగొట్టుతుంది. నీరుల్లి, ఉమ్మెత్త వేరు కలిపి నూరి నూనెలో వెచ్చజేసి గాయాలపై కడితే పుండు మానుతుంది. ఇంత ప్రయోజనకారి కాబట్టే 'ఉల్లి చేసిన మేలు తల్లి అయినా చేయదు' అనే సామెత పుట్టింది.

వెల్లుల్లి శూలలను, మందాగ్నిని హరిస్తుంది. క్షయ, కర్ణరోగాల్లోను వెల్లుల్లి ఉపయోగపడుతున్నది. వ్యాధి ముదిరిందో ఏమోగాని 'ఆశపడి వెల్లుల్లి తిన్నా రోగము అట్లాగే ఉన్నది' అంటున్నాడొకడు.

కరక్కాయ, పువ్వు, పండు, పిందె చాలా ఉపయోగమైనవి. దాని రసా

యనం త్రిదోషాల్ని హరిస్తుంది. శ్వాస, కాస, ఉదర రోగం, క్రిమి రోగం, గుల్మం, హృద్రోగం, గ్రహణి, కామిల, పాండు రోగం వీటన్నిటికి అమోఘంగా పని చేస్తుంది. కాబట్టే ఆయుర్వేదంలో 'దశ మాతా హారీతకీ' । అని సంస్కృత లోకోక్తి. 'కరక్కాయ కన్న తల్లి', 'ముస్నూట యిరవై నాలుగు రోగాలకు మూడు గుప్పిళ్ల కరక్కాయ పొడి' (రా. ప. 508) అనే సామెతలు వచ్చాయి.

కాయం అనేది బాలింతలకిచ్చే ముఖ్యమైన మందు. శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, పిప్పలి పొడి లేక కట్టె. కటిక రోహిణి, తెల్ల జీలకఱ్ఱ, వాము, చాయ పసుపు కొమ్ము. దుంప రాష్ట్రిం లేక కళింగ రాష్ట్రిం-ఇవి దోరగా వేయించి వేడి నీళ్లతో మెత్తగా నూరి ఆ ముద్ద ఆవు నేతిలో వేయించి, పాత బెల్లం కూడా వేసి లేహ్యంలాగా తయారు చేస్తారు. దీన్నే 'కాయం' అంటారు. ఇది చనుబాలను వృద్ధి పరుస్తుంది. బాలింత దేహం లోని నీటిని హరిస్తుంది. ప్రసవమైనపుడు కలిగిన నొప్పుల్ని పోగొడ్తుంది.

పిప్పలి త్రిదోషాల్ని హరిస్తుంది. పిప్పలి కట్టె, మిరియాలు పాలతో నూరి తాగితే పాలు పడతాయని హారీతక సంహిత చెపుతున్నది. శొంఠి, పిప్పలి, మిరియాలు చేరని కషాయంగాని, ఔషధంగాని, లేహ్యంగాని లేదు. కాయం, పిప్పళ్లు బాలింతకు అత్యవసరం కాబట్టే 'కడుపు చేసినవాడే కాయమూ, పిప్పళ్లూ తెస్తాడు' అనే సామెత ప్రజల్లో పుట్టింది.

పెన్నేరు పేరులేని రోగాలకు పెట్టిన మందు. పెన్నేరు దుంప వాత, కఫ దోషాల్ని ఉన్మాదం, యక్ష్మల్ని హరిస్తుంది. ఆధునికుల మతాన పెన్నేరు బలకర మైనది. 'పేరు లేని వ్యాధికి పెన్నేరు గడ్డ మందు' అనే సామెత పై విషయాల్ని బలపరుస్తుంది.

ఉత్తరేణి వేరుతో ప్రతిదినం పండ్లు తోమితే పంటి జబ్బులుండవు. ఆ విషయాన్నే 'ఉత్తమం ఉత్తరేణి, మధ్యమం మారేడు, కనీసం కందిపుల్ల' అనే సామెత చెపుతుంది.

తిప్ప తీగ వాత, పిత్త, శ్లేష్మమనే త్రిదోషాల్ని పోగొట్టి ఏవ్యాధీ రాకుండా కాపాడి జరా మరణ వర్జితుని చేస్తుందని భావ ప్రకాశిక. 'త్రిదోషహారం తిప్ప తీగ' అని సామెత.

వాయిలాకు గుల్మం, వ్రణం వీటిని హరిస్తుంది. [పాయిలాకు కాక చేసే స్వభావం కలిగి వ్రణాల్ని పిగుల జేస్తుంది. 'వాస్తే వాయిలాకు, పాస్తే పాయలాకు'

(సా) అని సామెత.

అల్లం ముడికించి ఎండబెడ్తే శొంఠి అవుతుంది. సాధారణంగా శొంఠి లేని కాషాయముండదు. వాత కఫాత్మక వ్యాధుల్ని తగ్గిస్తుంది. అందుకే 'అరి తీరె, అల్లము శొంఠి ఆయె', 'శొంఠిలేని కషాయమా' అనే సామెతలు వచ్చాయి.

శిశువులకు వ్యాధి నిరోధకంగా వాడేవి దొండాకు పసరు, కోడి రాళ్ళు, ఏది పొట్ట, మాచికాయ, జాజికాయ, తేలు పొగ అనేవి. దొండాకు చలువ చేస్తుంది. విరేచనం కలిగిస్తుంది. వాతాన్ని పోగొడుతుంది. అపుడే పుట్టిన శిశువుకు దొండాకు పసరు పోస్తారు. 'చిన్నపుడు తాగిన దొండాకు పసరు కక్కుతావు' అని సామెత 'కోడి కడుపులో ఉండే రాళ్ల పొట్టలోనుంచి రాళ్లు తీసి నీళ్లలో గలగరించి శిశువులకు పోస్తారు. 'కోడి రాళ్లు పోస్తే కోడి అరిగించుకున్నట్లు అరిగించుకుంటాడు. (నర) అని పల్లీయులు నమ్ముతారు. అందుకే కాబోలు, 'రాళ్లు తిని రాళ్లుజీర్ణం చేసుకుంటాడు' అనే సామెత వచ్చింది. ఏదు పంది పొట్టలోని కసురు తెచ్చి పిల్లలకు పోస్తారు. 'ఏది పొట్ట పోస్తే ఏది తిన్నా అరగించుకొంటారు'(నర)అనిసామెత.

జాజి కాయలో చమురు, కొవ్వు, మత్తు పదార్థం ఉన్నాయి. పిల్లలు గాఢ నిద్ర పోయేందుకు జాజికాయ, మాచికాయ పోస్తారు. 'జాజికాయ పోస్తే జోకొట్టి నట్లు నిద్ర పోతారు' (నర), 'మాచికాయ పోస్తే మతి చెడినట్లు నిద్ర పోతారు' (నర) అని సామెతలు. తేలును జంపి శిశువులకు పొగ వేస్తారు. 'తేలును పొగ వేస్తే తేలు కుడితే సలుపుండదు' (నర) అనే సామెత పై విషయాన్ని తెలుపుతుంది.

ఆముదం, నూనెకూడా మందుగా ఉపయోగిస్తున్నాయి. అజీర్ణానికి ఆముదం వాడతారు. ఉమ్మెత్త, నీరుల్లి కలిపి నూరి నూనెలో వెచ్చజేసి గాయాలపై కడితే పుండు మానుతుంది. ఈ విషయాల్ని 'ఆకలి లేదంటే ఆముదం పుచ్చుకోవాల్సిందే' (గృ. ల.). 'పుండు మీదికి నూనె లేదంటే బూరెలు వొండే పెళ్లామా అన్నట్లు' అనే సామెతలు వివరిస్తున్నాయి.

కొన్ని వ్యాధులకు అగ్ని వైద్యం (వాత పెట్టడం) చేయడం ఉంది. పసిరికలకు చాలా ఊర్లల్లో రోగి మణికట్టు మీద ఇనుప కడ్డీ కాల్చి గుండ్రని ముద్ర వేస్తారు. అదే రక్ష. రక్ష వేయించుకొనేందుకు తిరుపతి దగ్గర 'కొట్టాల' అనే గ్రామానికి రోగులు తిరునాళ్ల ప్రజల్లాగా వెళుతుంటారు. అగ్ని వైద్య సంబంధి సామెతలు 'అన్నీ అయిన తరువాత అగ్ని వైద్యం', 'కీలెరిగి వాత పెట్టాలి', 'కన్ను పోక తలికే వాతేసుకోవాలి' (నర) అనేవి.

పశువ్యాధుల్ని గురించి పశుపోషణ అనే శీర్షికలో చెప్పబడింది. (చూ.పు 95_6)

4.2.3 కళలు (169) : కళలు అనే అంశాన్ని కవిత్వం-పాండిత్యం, సంగీతం, నృత్యం_నాటకం, చిత్రలేఖనం, శిల్పం అనే నాలుగు శీర్షికల కింద విభజించుకొని విషయ వివరణ చేశాను.

(అ) కవిత్వం - పాండిత్యం (47): లలిత కళల్లో మొదటిది కవిత్వం. కవిత్వం రసానందానికే కాక సంఘ సంస్కారానికి కూడా ఉపయోగపడింది. కవిత్వానికి రెండు వైపులా పదునుంది. కవిత్వం ప్రజల్ని విప్లవ సన్నద్ధులను చేసింది. అందుకే కత్తి కన్న కలం వాడి అని లోకం ఒప్పుకుంది. ఆ విషయాన్ని నిర్ధారించేవి: 'కత్తి వాడా కలం వాడా', (దార్. 533), 'కత్తి పోటు తప్పినా కలం పోటు తప్పదు' అనే సామెతలు. కవిత్వం పూర్వ జన్మ సంస్కార విశేషాన్నిబట్టి వస్తుంది. కవికి తెలియని సంగతి లేదు అనే విషయాల్ని 'వనితగాని, కవితగాని వలచి రావాలి', 'రవి గాంచనిచో కవి గాంచ నేర్చు నెయ్యెడన్' అనే సామెతలు తెలుపుతున్నాయి.

కావ్యం రసవంతంగా ఉండాలి. లేకపోతే రసానందాన్నిచ్చే కావ్య ప్రయోజనం నెరవేరదు. ఆ విషయాన్ని చక్కగా చెప్పిన సామెత 'గ్రాసం లేని కొలువు రసం లేని కావ్యం' అనేది. తెలుగు పద్యాల్లో యతి ప్రాసలకు మిక్కిలి ప్రాధాన్యత ఉంది. పద రూపాన్ని మార్చి ఐనా యతి ప్రాసలు సరిగా కూర్చాల్సిందే. ఆ విషయాన్ని 'కవిత నేర్పు యతి కూర్పే తెలుపుతుంది', 'పదము తప్పినా ప్రాస తప్పరాదు' అనే సామెతలు తెలుపుతాయి.

రాజాస్థానాల్లో పండితులకు, కవులకు పీటంపెట్టి అర్హతను నిర్ణయించి గౌరవించేవారు. వాదం అంటే భయపడే పండితులు 'నాదముంటే గంట వాదముంటే తంట' అనుకోవచ్చు. కావ్య, శాస్త్రాల్ని క్షుణ్ణంగా తెలిసినవారు పండితులు. అల్ప విద్వాంసుల్ని, పండితమ్మన్యుల్ని నిందించిన సామెతలు. 'అల్ప విద్వాంసుడు ఆక్షేపణకు పెద్ద', 'అపండితుని కంటె అర్ధ పండితుడే అపాయకరం' అనేవి. పండితమ్మన్యుని నెత్తికి చెప్పు లెక్కించడమే శిక్ష. 'పండితమ్మన్యునకు పాదుకా పట్టాభిషేకం' అని సామెత. గొప్ప పండితుల పుత్రులు తండ్రులంత వాళ్లు కావడం లేదు గాబట్టే 'పండిత పుత్రుడు శుంఠ' అనే సామెత వచ్చింది. పాండిత్య వివేకాల తారతమ్యం ఇది: 'పాండిత్యానికి తనకంతా తెలుసునన్న అహంకారమున్నది, వివేకానికి తనకేమీ తెలియదన్న వినమ్రత ఉన్నది', సభ మెచ్చుకొంటేనే పండి

తులు తమ ప్రయోజకత్వం నిరూపింపబడినట్లనుకునేవాళ్లు. విద్యా ప్రసంగాలు ఉంటే తప్ప సత్సభ కాదని చెప్పబడింది. ఈ విషయాలు తెలిపే సామెతలు: 'రాజు మెచ్చినది ప్రయోజకత్వము సభ మెచ్చినది మాట, మగడు మెచ్చింది సత్కాళ త్రము' (అం. వి.), 'విద్యా ప్రసంగముం సరసజ్ఞతలేని సభల సభ గాదు గ్రామ రచ్చ గావి' అనేవి.

(ఆ) సంగీతం (82) : కవిత్వం ఆస్వాదించడానికి హృదయ సంస్కారం కావాలి. సంగీతానికి ఇవేమీ అక్కర లేదు. పండిత పామరులు, చిన్నా పెద్దలు, చివరికి జంతువులు గూడా సంగీతం విని ఆనందిస్తాయి. ఆ విషయం తెలిపే 'పశువులు శిశువులు గాన రసం ఎరిగినట్లు' అనే సామెత 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గాన రసం ఫణిః' అన్న సంస్కృత సామెతలో కొంత భాగానికి తెలుగు సేత. ఈ విషయాన్ని బలపరిచేది 'సర్వ జనీనమైన భాష సంగీతము' అనే సామెత. సంగీతం పాడేందుకు ప్రజల ముందుకు రావాలని, అందుకోసం కుటుంబ స్త్రీలు ముందుకు రాలేరని, వేశ్యలే అందుకు తగిన వారని సిద్ధాంతం చేస్తూ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు 'సగం చచ్చి సంగీతము అంతా చచ్చి హాస్యము' (క. గా. పు. 209) అనే సామెత ఉటంకించారు. గానానికి మొదలు శ్రుతి[5]. 'శ్రుతి లేని పాట సమ్మతి లేని మాట' అనే సామెత శ్రుతి ప్రాధాన్యాన్ని చెప్పేది. పాట రాకున్నా పాడుదామనే వేడుక ఉండడం సహజమని 'రాని పాట పాడ వేడుక, బోడి తల అంట వేడుక' అనే సామెత చెపుతుంది. పాటకు ఇద్దరుండాలి అని 'ఒకరు పాడిన పాట కంటే ఇద్దరు ఏడిస్తే ఇంపుగా ఉంటుంది' అనే సామెత నొక్కి చెప్తున్నది.

పక్షులలో కోకిల సంగీతానికి ప్రతినిధి. పంచమ స్వరంలో కోకిల గళం విప్పితే ప్రకృతే మైమరచిపోతుంది. వసంతంలో కోకిల కల కూజితాలు వీనులకు తేనె సోనలు. కోకిల సంగీత విషయంగా ఉండే సామెతలు, 'ఒకే కోకిల వసంతాన్ని కొని రాదు', 'కోకిల కూత వినుటకు చద్ది అన్నము కట్టుక పొమ్మన్నారు' అనేవి.

మనలోని భావములను తీవ్ర మొనర్చునది రాగము. కాని 'రాగము' అను పదము ప్రత్యేక స్వరముల పెంపకమునకు వాడవచ్చును. పూర్తిగా తయారైన బింబముల గానమునకు తీర్చినపుడు దానిని రాగమనవచ్చును[6]. జనక రాగములు 72. శ్రుతిని పొడిగించి ఏదో ఒక రాగము లోకి మలుచుకోవచ్చునని 'శ్రుతి మించి రాగాన పడినట్లు' అనే సామెత చెపుతుంది. రాగాలాపన కర్ణపేయంగా, శాస్త్రీయంగా

ఉండాలంటే అనవరత అభ్యాసం అవసరం. స్త్రీ కంఠంలో లాలిత్యం, మాధుర్యం ఉంటాయి కాబట్టే రాగాలాపనకు స్త్రీ గళం బాగుంటుంది. ఏదో ఒక కూని రాగం మగవాళ్లు తీస్తూనే వుంటారు. రాగాలాపన చేసిన తర్వాత శాస్త్రీయమైన కీర్తన పాడితే సమంజసంగాని పల్లె పదాల్లో వంత పదాలుగా వచ్చే 'తుమ్మెదలో' లాంటివి పాడితే పరిహాసాస్పదం అని సంగీతజ్ఞులు అంటారు. పల్లె పాటలకు శాస్త్రీయమైన రాగాలాపన లేదన్న విషయం కూడ ఇందులో తెలుసుకోవచ్చు. పై విషయాల్ని చక్కగా వివరించే సామెతలు: 'తియ్యగా తియ్యగా రాగం, మూల్గగా మూల్గగా రోగం', 'ఆడశోకం మగ రాగం ఒకటే', 'కుడుములు వండని ఆడదీ కూనరాగం తీయని మగవాడూ ఉండడు', 'కొండంత రాగం తీసి పిచ్చికుంట్ల పాట పాడినట్లు', 'కొండంత రాగం తీసి తుంబదీలో అన్నట్లు' అనేవి. 'లోకో భిన్న రుచి' కాబట్టి ఆయా రాగాల్లో రసానందం పొందిన సంగీతజ్ఞులు అఠాణ, నాట, బేగడ, భూపాల, మధ్యమావతి, సురట రాగాల్ని ప్రశంసించిన సామెతలున్నాయి.7

అఠాణ రాగానికి ఆరోహణలో సరిమపనిస, అవరోహణలో సనిదాపమగా రిస అనే స్వరాలుంటాయి. ఇది 29వ మేళకర్త రాగమైన ధీర శంకరాభరణం నుంచి పుట్టిన జన్య రాగం. దీన్ని ప్రశంసించిన సామెత 'తింటే బరాణ వింటే అఠాణ' అనేది. సరిగమ పదనిస స్వరాలు ఆరోహణగా, సనిపమరిస స్వరాలు అవరోహణగా ఉండే రాగం నాట. సరిమపనిస ఆరోహణగా, సనిదపమ గపమరీస అవరోహణగా ఉండే రాగం సురట. సంగీత కచ్చేరీలు నాటతో ప్రారంభం చేసి సురటతో ముగిస్తారని 'ఆదిలో నాట అంతంలో సురట వలె' అనే సామెత తెలుపుతుంది. నాట మధ్యాహ్న వేళ, దేశాక్షి ప్రభాతవేళ ఆలాపిస్తారని మనుచరిత్రలో (3.57) చెప్పబడింది. సురట 28 వ జనకరాగమైన హరికాంభోజికి జన్యరాగం. సగరిగమపధనీ దపస ఆరోహణలో, సనిదపమగరిస అవరోహణలో ఉండే రాగం బేగడ. 'వింటే బేగడ వినాల తింటే మీగడ నాల' అని సంగీత విదుల అభిప్రాయం. ఇది 29 వ జనకరాగమైన ధీర శంకరాభరణానికి జన్యరాగం.

మేలు కొలుపు రాగం భూపాల రాగం దీనికి అరోహణ సరిగపదస, అవరోహణ సదపగరిస అనే స్వరాలు. సంగీతం తెలియనివారి అవకతవకల్ని 'సాయం కాలం భూపాలరాగ మన్నట్లు' అనే సామెత పట్టిస్తుంది. సరిమపనిస ఆరోహణలో, సనిపమరిస అవరోహణలో ఉండే రాగం మధ్యమావతి. ఈ రాగమంటే దేవతలకు ప్రీతిఅని 'అసురులకు మద్యపానం సురలకు మధ్యమావతి' అనేసామెతఅంటుంది.

రాగము, తాళము, మన కర్ణాట సంగీతము యొక్క ప్రాణములు. 'తాళము' అనగా సంగీతమును కొలుచు కొలతబద్ద. సంగీత గానమును కూడ చాల విధము లైన తాళములచే వాటి వాటిని వేరు వేరుగా కొలుచుచున్నారము. తాళం వేసే సాధనాలు కంచుతో చేయబడిన తాళపు చిప్పలు. వీధి నాటకాల్లో ఇద్దరు తాళాలు వాయిస్తుంటారు. ఆ విషయాన్ని 'అందానికి రెండు బొందులు, ఆటకు రెండు తాళాలు' అనే సామెత చెపుతున్నది. 'దరిద్రుడి సంగీతానికి ఘూమ్యాకాళాలే తాళపు చిప్పలు' అనే సామెతలో దరిద్రుడి సంగీతం అంటే ఏడుపే అనే భావం ఉంది.

వీణ, తంబురా, మద్దెల, డోలు, రండోలు, వీరణం అనే వాద్యాల ప్రసక్తి సామెతల్లో ఉంది. అరసికుని దగ్గర వీణ వాయించడం వృథా అని, తంబుర విని ఆనందించింది గాక తలూపిన దానికి తంబూరా ఇమ్మనే గడుసువాళ్ళున్నారని, మద్దెల వ్రేళ్లతో వాయించేది కాబట్టి వ్రేళ్ళు ఒక్కొసారి పగుల గొట్టుకోవచ్చునని, చర్మవాద్యం కాబట్టి చర్మం చిరిగితే మద్దెల ఓటు పలుకుతుందని, నాట్యకత్తె అడు గుల గతికి మద్దెల దరువులు అవసరమని, డోలు, రండోళ్ల పరిమాణం పెద్దదని, వీరణాలు పెద్దగా శబ్దిస్తాయని సామెతలు చెపుతున్నాయి.

'దున్న దగ్గర వీణ వాయించినట్లు', నీవు పాడిన దానికి నేను విన్నదానికి సరిపోయింది తలూపిన దానికి తంబురా పెట్టి పో', 'సెబాస్ మద్దెలకాడా అంటే ఐదు వ్రేళ్లూ పగుల గొట్టుకున్నాడట', 'అరు నెలలు వాయించిన మద్దెల ఓటిదా గట్టిదా అన్నట్లు'. 'ఆడ లేనమ్మ మద్దెల పైన బడి కొట్టుకున్నట్లు', (చంద్ర), 'తల్లూర్చే దానికి తావు లేకుంటే మెడకి డోలొకటి' (చంద్ర), 'తానేగ దారి లేదు మెడను రండోలొకటి' (అం. వి.), 'కానకుండా కన్నె డిచ్చేనుగాని వినకుండా వీరణాలు వాయించగలవా' అనేవి. పెండ్లిలో వధువు, వరుని పక్షంవాళ్లు ఒకరిపై ఒకరు గంధం పొడి చల్లుకోవడం ఉంది. 'గంధ పొడిలో బూరగ పట్టినట్లు' అనే సామెతలో పై విషయం తెలుపబడింది.

దేశి సంగీతంగా చెప్పబడే జానపద సంగీతాన్ని గురించిన సామెతలు : దంపుడు పాటలు ప్రాచీనమైనవి. శ్రమ తగ్గించుకొనేందుకు పాడుకొనేవి. ఇవి తరువో జలో ఉంటాయని విన్నకోట పెద్దన. 'మామూలుగా సువ్విపాటలనేవి ఇంట్లో సమర్తాడినపుడు పాడుతారు. నువ్వులు, బెల్లం, కొబ్బెర వేసి దంచి చిమ్మిలి ఉండల్ని చేసి అందరికి పంచుతారు. ఈ పాటల్లో సువ్వీ, అల్లొనేరెళల్లో మొదలై

నవి ఊత పదాలుగా వస్తాయి.

'దంపుళ్ల పాటకు దరిద్రం లేదు' అనే సామెత కరువైనా కాలమైనా అంతో ఇంతో తినాల్సిందే కాబట్టి ధాన్యం దంచక తప్పదు అనే విషయాన్ని తెలుపుతుంది. 'ఏరోటి దగ్గర ఆ పాట పాడాలి' అంటే ఒకరి ఇంట్లో దంచేటప్పుడు వారికి తగి నట్లు, ఇంకొకరి ఇంట్లో దంచినపుడు వీరికి అనుకూలంగా దంచేవాళ్లు పాడాలి అనే అభిప్రాయం ఉండొచ్చు. సువ్వి అంటే తెలియనివార్ని వ్యంగ్యంగా ఎత్తి చూపే సామెత 'సువ్వి అంటే తెలియదా రోకటి పోటు' అనేది. అల్లొనేరెల్లో అనే ఊతపదంతో పాడేపాటలు వెన్నెల బయళ్ళలో పాడతారు అని 'అల్లొనేరేళ్ల వెన్నెల లోనే అవతల కలవా'(రామాయణం సుందరకాండ') అనే సామెత తెలుపుతున్నది.

తెల్లవారుజామున సంగటి చేసేందుకు సద్దల్లో జొన్నలో దంచుతుంటారు. ఆ సమయంలో భిక్షాటనకు దాసరి వస్తుంటాడు. ఆ విషయాన్ని 'రోకటి పోటు దాసరి పాట' అనే సామెత చెపుతున్నది. కూనలమ్మ పిల్లలను వ్యాధులనుండి రక్షించే దేవత. క్షుద్ర దేవతగా భావించి 'కూనలమ్మ సంగీతం వింటే పుణ్యము లేదు. వినకుంటే పాపము లేదు' అనే సామెత చెపుతారు. పదినాలు అంటే పదన గేయాలు ( ? ). బిచ్చగాళ్లు పాడేవి. 'పదినాలు పాడకుంటే వరికూడు ఎవరు పెడ తారు?' అని సామెత. 'ఎత్తిపోయే వాడా ఏదుట్లో ఓ నురుగు వేసిపో రా అన్నట్లు' అనే సామెత దురవగాహంగా ఉంది. నురుగు అంటే గేయంలో ఒక పాదం.

(ఇ) నృత్యం - నాటకం (24): శరీర హస్త నేత్రాభినయాల చేత భావాల్ని తెలుపుతూ ఆడే ఆట నృత్యం. నటులు వివిధ వ్యక్తుల పాత్రలు ధరించి కథల్ని అభినయం చేసేది నాటకం. నృత్యం నేర్చిన కాలు ఎప్పుడూ కదుల్తూనే ఉంటుంది. నాట్యం సరిగా చేయలేని నాట్యకత్తెలు అంగణం వంకరనో, పాత గజ్జె లనో, మద్దెల సరిగా వాయించ లేదనో నెపం పెడతారు.

ఈ సామెతల్ని బట్టి నాట్యానికి సమ విశాల ప్రదేశం, నాట్యకత్తె పాదాలకు గజ్జెలు, మద్దెల వాయిద్యం అవసరం అని కూడా తెలుసుకోవచ్చు. 'నాట్యం త్రొక్కిన కాలు రోపి రోటి కింద పెట్టినా ఊరుకోదట', 'ఆడే కాలు పాడే నోరు ఊరకుండవు'. 'ఆడ లేక అంగణం వంకర అన్నట్లు', 'ఆడ లేక పాత గజ్జెలు అన్నట్లు', 'ఆడ లేనమ్మ మద్దెల ఓడన్నట్లు' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి.

చిందు జానపద నృత్య విశేషం. మాదిగలకు ప్రియమై, మాలలకు అప్రియమైనది. చిందులో ఆంగికాభినయం ఉత్సాహంగా ఉంటుందని చెప్పే సామెత: 'చిన్నమ్మ చిందేస్తే చీర దారి చీరది, సింగారం దారి సింగారానిది' అనేది. భోగం వారు పెండ్లిండ్లలో, శుభ కార్యాలలో మేజువాణీ చేస్తుంటారు. 'ఊరికంతా ఒక భోగముదయితే ఆ భోగముది ఎవరి వద్ద ఆడును' అనే సామెత ఈ విషయాన్ని చెపుతుంది.

వేషం వేయడం, ఊర్లు తిరిగి నాటకాలాడడం కొందరికి బ్రతుకు తెరువు. ఆ విషయాన్ని 'వేషాలన్నీ గ్రాసాలకే', 'వేషాలకోసం దేశాల పాలు' అనే సామెతలు చెపుతున్నాయి. ఏ వేషం వేస్తే ఆ పాత్ర ప్రవర్తనను అభినయించాల్సిందే. 'కుక్క వేషము వేసిన మొరిగియే తీరవలెను' (సా.సా.142) అని సామెత. ప్రజల్ని నవ్వుల్లో ముంచెత్తేది నాటకంలో హాస్యగాని పాత్ర. హాస్యగాడు నిజ జీవితంలో దుఃఖించినా నవ్వుటాల కిందికే తీసుకుంటారు అనే విషయాన్ని 'హాస్యగానికి తేలు కుడితే హాస్యం కింద పోతుంది' (అం. వి.), 'హాస్యగాడు బావిలో పడిన తంతు' అని సామెతలు. హాస్యగాడు బావిలో పడి 'కుయ్యో మొర్రో' అంటుంటే కాసేపు వినోదం చూస్తామనుకుంటారు ప్రజలు. నాటకంలోని సత్పాత్రలను అనుసరించి కొంత మంది ఐనా మారొచ్చునని ఆశాభావం చూపేది 'నడవడికలు చక్కబెట్టేది నాటకము' అనే సామెత. గాంధీ మహాత్ముడు హరిశ్చంద్ర నాటకం చూసే సత్య వాక్పరిపాలకుడైనాడు గదా!

(ఈ) చిత్ర లేఖనం - శిల్పం (4): లలిత కళల్లో మరో రెండు చిత్ర లేఖనం - శిల్పం. చిత్రం వేయాలంటే కాన్వాస్ కావాలి. అది గోడ, పటం, మరేదైనా నిశ్చలమైనది. ఆ విషయాన్ని 'గోడ ఉంటే చిత్రం వ్రాయవచ్చు' అనే సామెత చెప్పగా 'ఆకాశంలో చిత్రం వ్రాయడం' (వి. వేం.) అసంభవమని మరొక సామెత చెపుతున్నది. అతిలోకంగా చిత్రించిన చిత్తరువుకు జీవం వస్తే ఎంత అందంగా అపురూపంగా ఉంటుందో! 'చిత్తరువునకు జీవం వచ్చినట్లు' అని సామెత. అందాలు చిందే అన్నుల మిన్నకు గిలిగింతలు పెడితే ప్రియుణ్ణి పరవశింప జేస్తుంది. కిల కిలా నవ్వి, రాతి బొమ్మ ఎంత అందంగా శిల్పించబడినా చక్కిలిగింత పెట్టడం వృథా - జడ పదార్థం కాబట్టి. ఆ విషయాన్ని చట్టు బొమ్మకు చక్కిలి గింతలు పెట్టినట్లు' అనే సామెత తెలుపుతుంది.

4.2.4 ఈ ఉప ప్రకరణంలోని కొన్ని ముఖ్యాంశాలు : అందరికీ విద్య అవసరం లేదు అనే అభిప్రాయం పల్లీయుల్లో ఉంది. కొన్ని కులాల వారికి చదువు దండగనడం, నిరక్షరాస్యుల్తో విద్యావంతుల్ని పోల్చి వెక్కిరించడం దీనికి సాక్ష్యాలు. తెలుగు అక్షరమాలను 'ఓనమాలు' అంటారు. తిండిపోతు, అసమర్థుడయిన గురువును దుయ్యబట్టడం, గురు ద్రోహాన్ని నిర్ద్వంద్వంగా ఖండించడం, చదువుతో సాముకు సమ ప్రాధాన్య మివ్వడం సామెతల్లో కనిపిస్తుంది.

మితాహారం, సంతోషం ఆరోగ్యానికి అవసరం. వాత పిత్త శ్లేష్మాలు వికటిస్తే వ్యాధులు వస్తాయి. అంగవికలుల గురించి మానవతా దృష్టితో కాక హేళన దృష్టితో చూసిన సామెతలే ఎక్కువ. ఆయుర్వేద వైద్య దృష్టితో కొన్ని వ్యాధులకు మందులు చెప్పబడ్డాయి.

కళల్లో కవిత్వానికి రసానంద ప్రధానత్వం, సంఘ సంస్కారం ప్రయోజనాలు. సంగీతం సర్వ ప్రాణి రంజకం అని, నాటకం ప్రజలకు సత్ప్రవర్తన నేర్పుతుందని సామెతలు వివరిస్తున్నాయి.



సూచికలు :-

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పు 67-68.
2. తెలుగు సామెతలు. పు. 493.
3. ఆక్షేపక వాతము - వాతము కుపితమై సిరలయందు జొచ్చి యేనుగుపై కూర్చుండి యుండెడు వాని శరీరము కదులునటులు మాటి మాటికి శరీరము కదులునటులు చేయునది. ధన్వంతరి - పుట. 530.
4. ఈ వస్తు గుణాల్ని గురించి చెప్పే విషయాలకు ఆధార గ్రంధం వస్తు గుణ చంద్రిక.
5. శ్రుతి యనగా శ్రవణము వల్ల ముందుగా నే శబ్దము వినబడుచున్నదో అది. షడ్జమము మొదలగు సర్వావయవ లక్షణము గల హ్రాస్వ మాత్రాక శబ్ద విశేషము శ్రుతి యనబడును. అట్టి శ్రుతుల వలన షడ్జమము, రిషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధ్వైతము, నిషాదములను సప్త స్వరములు కలిగెను. ఈ సప్త స్వరముల వలననే గ్రామములును, గ్రామముల వలన జాతులును, జాతుల వలన రాగములును బుట్టుచున్నవి. (క్రొత్త సంగీత విద్యా దర్పణము, పు. 5)
6. గాన కళా బోధిని పుట. 14.
7. రాగాలను గురించిన శాస్త్రీయ విషయాలకు ఆధారాలు-క్రొత్త సంగీత విద్యా దర్పణము, గాన కళా బోధిని అనే గ్రంథాలు.
8. గాన కళా బోధిని, పుట. 58-59.
9. తెలుగు - కన్నడ జానపద గేయాలు, పుట. 54.

4.3 పగలంతా చెమటోడ్చి శ్రమించిన కర్షక, కార్మికులకు శ్రమ పోగొట్టి మళ్లీ మర్నాటికి వారిని కాయ కష్టానికి సిద్ధం చేసే బలవర్ధకౌషధాలు వినోదాలు. దైహిక, మానసిక క్లేశాన్ని తాత్కాలికంగానైనా మరపించేవి విలాసాలు. బుద్ధిబలం, దేహబలం, ఎదగాల్సిన బాల బాలికలకు ధీశక్తిని, దేహశక్తిని ప్రసాదించేవి ఆటలు.

143 తెలుగు సామెతలు ఆధారంగా జానపదుల వినోద విలాసాల్ని, ఆటల్ని వింగడించి ప్రదర్శించే ప్రయత్నం ఈ ఉప ప్రకరణంలో జరుగుతుంది.

4.3.1 జానపదుల వినోదాలు (51) : జానపద వినోదాల్లో ప్రసక్తి వచ్చినవి ఊకుడు కథలు, వీధి భాగవతాలు, హరికథలు, తోలు బొమ్మలాటలు, సాము గరిడీలు, గారడీ విద్య, గంగిరెద్దులాట, కోతి ఆట అనేవి. ఊకుడు కథలు ఏ వీధిలోని ప్రజలు ఆ వీధి లోనో, లేదా ఆ పల్లె లోనో వృద్ధులచేత రాత్రి వేళల చెప్పించుకుంటారు. వీధి భాగవతాలు, పురాణ శ్రవణం, హరికథ, తోలు బొమ్మలాట ప్రదర్శకులో, హరికథకులో తమ పల్లెకో, పక్క పల్లెకో వచ్చి ప్రదర్శిస్తే వెళ్లి చూచి, విని పల్లీయులు ఆనందిస్తారు. సాము గరిడీలు, గారడీ విద్య, గంగిరెద్దులాట, కోతి ఆట ప్రదర్శకులు వీధి వీధికి వచ్చి ప్రదర్శించేవి జానపదులు పై వినోదాల్తో ఆనందం పొందడం, ప్రదర్శకులకు ధాన్యం ఇవ్వడంతో ఆ ప్రదర్శకులు బ్రతుకు సాగించుకోవడం అనాదిగా జరుగుతున్నది.

(అ) ఊకుడు కథలు (8): పగలంతా పనుల్లో శరీరం నలగ గొట్టుకున్న పల్లీయులు గంటో, రెండు గంటలో వినోదం కోసం వృద్ధుల్ని ఆశ్రయించి కథలు చెప్పించుకోవడం ఉంది. ఒకరు చెపుతుంటే ఒకరు ఊ కొడుతుంటారు. అందుకే ఇవి ఊకుడు కథలు. ఈ కథలు చిత్ర విచిత్ర సన్నివేశాలకు ఆట పట్టులు. నాయకుడు రాజకుమారుడు కావచ్చు. సామాన్యుడై ఉండి రాజుకూతుర్ని వివాహమాడో, ఏనుగుతో పూలదండ వేయించుకొనో రాజైనవాడు కావచ్చు. నాయిక అష్ట కష్టాలు పడుతుంది, మాంత్రికులు, మంత్ర తంత్రాలూ ఉంటాయి. నాయకుని పురుష ప్రయత్నం ఫలించనపుడు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై మేలు చేస్తుంటారు.

కథ ఎప్పుడూ సుఖాంతమే. ఊకుడు కథల్లో ఉండే అనల్పకల్పనలను గురించి చెప్పే సామెత 'కథకు కాళ్లు లేవు ముంతకు చెవులు లేవు' అనేది. కథ ఉన్నట్లుండి అనుకోని మలుపులు, ముఖ్యంగా నాయకునికి విరుద్ధంగా తిరిగితే 'కథ అడ్డం తిరిగింది' అని శ్రోతలు నిట్టూరుస్తారు. 'కథ కంచికి మనమింటికి' అనే

సామెత ప్రతి కథకూ ఉపసంహార వాక్యం. 'తెలుగు దేశానికి దక్షిణ సరిహద్దు కంచి. అక్కడనుంచి తర్వాత తమిళదేశం.కంచి వరకు తెలుగులో కథ సాగుతుంది, తర్వాత సాగదు అని ఈ సామెతలోని అభిప్రాయాన్ని నిడుదవోలు వేంకటరావు గారు వివరించారు[1] .

(అ) వీధి భాగవతాలు (12) : భాగవత కథలను ఆటలుగా ఆడేవారు భాగవతులు లేదా భాగోతులు.[2] వేషం వేసేందుకు మీసాలు గొరగక తప్పదు. కొన్ని ఊర్లలో వచ్చే ఆదాయం కాగడాల చమురుకు్కూడా సరిపోదు. వేషం తెరలో నుంచి రంగ ప్రవేశం చేసినపుడు పాత్ర సరిగా కనిపించేట్లు పట్టక పోతే దివిటీలు పట్టే చాకలి మంగలి వారికి తిట్లు తప్పవు. అంతే కాదు; హాస్యగాడు హాస్యం చేసేది దివిటీ వాళ్లనే. చాకలి మంగలి వారు దివిటీలు పట్టినా వారికి డబ్బు లేమీ ఇవ్వరు. ఈ విషయాల్ని స్పష్టం చేసే సామెతలు 'ఒక్కనాటి భాగవతము కొరకు మూతి మీసాలు గొరిగించుకున్నట్లు', 'ఏ వేషం వచ్చినా దివిటీ వానికే చేటు', 'పైకము భాగోతపు వారికి తిట్లు చాకలి మంగలి వారికి' (హైసా. VIII-15) అనేవి. భాగవతం జరిగేటప్పుడు ఆ ఊరి రెడ్డివస్తే అక్కడ ఆపి మళ్లీ మొదలు పెట్టక తప్పదు అని 'రెడ్డి వచ్చినాడు మొదటనుంచి పాడమన్నట్టు' (కార్. 1378) అనే సామెత తెలుపుతుంది

(ఇ) పురాణ పఠనం (8): సామాన్యంగా భారత, రామాయణాలు పఠనం చేస్తారు. భారత కథలోని సారం గమనించిన వారన్న సామెత 'తింటే గారెలు తినవలె వింటే భారతం వినవలె' అనేది. ఒక మొద్దు మొగుణ్ణి భార్య రామాయణం వినేందుకు బలవంతం చేసి పంపింది. వాడు తన చేతి కర్ర మీద గడ్డమాన్చుకొని, నిలబడి వింటున్నాడు. ఒక తుంటరి వచ్చి మూపుల మీద కూర్చొన్నాడు. రామాయణం వినడంలో ఇది కూడా ఒక భాగమనుకొని వాడు ఊరుకున్నాడు. ఇంటివద్ద భార్య రామాయణం ఎట్లావుంది అని అడిగితే 'మాశి మీద మాశి యెక్కి కూర్చుంటే మోశి మోశి చచ్చినాను' అన్నాడట' (కార్.2538), 'తెల్లవారుదులూ రామాయణం విని సీతకు రాముడేం కావాల అన్నాడంట' (నర). అనే సామెత రామాయణం అర్థం చేసుకోలేని మంద బుద్ధిని వెక్కిరించింది. దీనికి ఇంకో విధమైన సమర్థన ఉంది[3] 'రామాయణంలో పిడకల (పిటకల) వేట' అని సామెత. రామాయణం వింటున్న స్త్రీలు పిడకలకోసం పోట్లాడుకున్నారని ఒక అభిప్రాయం ఉంది, రామాయణంలో జాబాలి బౌద్ధ ధర్మాలను గూర్చి ప్రస్తావిస్తాడు. బౌద్ధ ధర్మాలంటే

గ్రంథాలను పిటకలు అంటారు. ఇవి మూడు (త్రిపిటకాలు).4 అంటే రామాయణంలో బౌద్ధ ధర్మం ఉండడం అసందర్భం అని భావం.

దీన్ని మనం ఇంకో రకంగా అన్వయించ వచ్చు. పౌరాణికుడు రామాయణంలో 'పిటకలు' గురించి చెప్పినపుడు నిరక్షరాస్యులైన అమ్మ లక్కలు పిడకలుగా భ్రమపడి మాక్కావాలంటే మాక్కావాలని పోట్లాడుకొని ఉండొచ్చు. ఇది ఒక ఊహ మాత్రమే.

'రామాయణం అంకు, భారతం బొంకు' అని కొందరి అభిప్రాయం. 'రామాండ కత లెల్లమే మెఱుంగని పనే? కాటమరాజుకు కర్ణుడోడె అన్నట్లు' అనే సామెత బట్టతలకూ మోకాటికీ ముడిపెట్టే ప్రబుద్ధుడు రామాయణంలో కాటమ రాజును, కర్ణుని ప్రసక్తి తెచ్చిన అసందర్భ ప్రసంగం. గొల్లలు పూజించే గ్రామ దేవత కాటమరాజు.

(ఈ) హరికథ (5) : గ్రామీణులు హరి కథ అంటే చెవి కోసుకుంటారని. 'అరవై ఆమడ పొయ్యి హరి కథ వినాల, తొంబై ఆమడ పొయ్యి తోలు బొమ్మలాట చూడాల' (నర) అనే సామెత నిర్ద్వంద్వంగా ప్రకటిస్తుంది. హరికథ గ్రామ ప్రజల ధన సహాయంతో జరిగేదని, కొన్ని పల్లెల్లో డబ్బు వచ్చేది కాదని 'వెట్టికి చెపితే వేగు దాకా చెప్పమన్నట్లు' అనే సామెత చెపుతుంది. హరిదాసుకు సంబంధించిన సామెతల్లో 'ఆట విడిస్తే హరి దాసు, సంసారము విడిస్తే సన్యాసి', 'హరి దాసున కంతా తన వారే', 'హరి దాసుకు అమరావతి అడ్డమా' అనే సామెతలున్నాయి. అమరావతిలో బౌద్ధ దేవాలయాలున్నా హరిదాసు లెక్కచేయడని భావం5.

(ఉ) తోలు బొమ్మలాటలు (4) : చాలా ప్రాచీనమైనవి. నేటి సినిమాలాంటివి. తెర ముందర కాగడాలు పెట్టి తెర వెనుక తోలు బొమ్మలను ఆడించేవారు. పల్లీయులకు ఇవి ఎంత ఇష్టమంటే వాటిని ఎంత దూరమైనా వెళ్లి చూచి వచ్చేవారు. 'అరవై ఆమడ పొయ్యి హరికథ వినాల, తొంబై ఆమడ పొయ్యి తోలు బొమ్మలాట చూడాల' (నర) అనే సామెత పై విషయాన్ని తెలిపేది. తోలు బొమ్మలు చేయించేందుకు ఎక్కువ ఖర్చు అవుతుందని, ప్రదర్శనలవల్ల వచ్చే ఆదాయం గిట్టుకోక పోవచ్చునని 'మెడ పూసలకు సమ్మ సరి పోయిన బొమ్మలాట ఆడినట్లు' అనే సామెత తెలుపుతుంది. 'తిరిగి తిరిగి దిమ్మ దిరిగి బొమ్మలాట చూచి చేరెరా కొంప' (సా), 'బోడి ఊళ్లో బొమ్మలాట' అనే సామెతలు బొమ్మలాటను గురించి చెప్పినవే.

(ఊ) **సాము, గరిడీ ప్రదర్శన (7)** : దొమ్మరులు, గొల్లలు, వీరముష్టులు సాము గరిడీలను పల్లీయులకు ప్రదర్శించి పొట్ట పోసుకునేవారు. రకరకాల మొగ్గలు పల్లటీలు వేయడం, గడ నాటి దాని మీదికి ఎక్కి వివిధ రకాల గరిడీలు చేయడం, రెండు కర్రలు పాతి, బిర్రుగా తంతి కట్టి దాని మీద నడుస్తూ ప్రదర్శన లిచ్చేవారు. కత్తి వాదరమీద నడిచేవారు. నేల మీద కత్తులు నాటి పైన తాటిపై గరిడీలు చేసే వారు. దొమ్మరాట యిద్దరు, ముగ్గురే చేస్తుంటారు. డోలును మార్చి మార్చి వాయిస్తుం టారు. ఈ విషయాలన్నీ తెలిపే సామెతలు: 'గడి ఎక్కి నేనే గంతులు వేయా నేనే', 'ఆటా ముగిసింది తంతీ తెగింది' (తె. సా. పీఠిక). 'కత్తిమీద సాము కాని వాడికైనా తగదు', 'వాని పెండ్లాము దొమ్మరి వాని డోలు' అనేవి. సాము గరిడీ ప్రదర్శనను దొమ్మరాటలుగా చెప్తూ, ఇది నాటి సర్కస్ అని సురవరం ప్రతాపరెడ్డి గారు అభిప్రాయ పడ్డారు.

(ఋ) **గారడీ విద్య (2)** : దీన్నే ఇంద్రజాలం అని కూడా అంటారు. మాయలు, మంత్రాలు చేసి చూపించడం గారడీ విద్య. కొరవి గోపరాజు సింహా సన ద్వాత్రింశికలో గారడి విద్య ప్రసక్తి ఉంది. ఒక ఐంద్రజాలికుడు తాడును గాలి లోకి నిలువుగా విసిరి, పైకెగ బ్రాకి, మాయం కాగా, వాని అంగములు తునకలు తునకలుగా నేలపై పడినవి. కాస్సేపయిన తర్వాత వాడు త్రాటి నుంచి గబ గబ దిగి వచ్చినాడు అని 150 ఏండ్ల క్రింద ఒక ఆంగ్లేయుడు వ్రాశాడు.[6] గారడీలో కత్తితో మనిషిని పొడవడం, తల గోసినట్లు, 'కడుపు చించుకున్నట్లు కనుకట్టు విద్యతో ప్రేక్షకుల్ని భ్రమింప జేయడం విశేషం. నిజాన్ని నమ్మకుండా మాయ అని భ్రమించేటప్పుడు గారడీ విద్య నాధారం చేసుకొన్న సామెతలు చెప్తారు. అవి 'తల కోసి ముందర పెట్టినా గారడీ విద్య అన్నట్లు', 'కడుపు చించుకున్నా గారడీ విద్య అన్నట్లు' అనే సామెతలు.

(ౠ) **గంగిరెద్దులాట (1)**: ఇదీ ప్రాచీనమైన వినోద ప్రదర్శనే. సంక్రాంతి పండుగ దినాల్లో పల్లెల్లో గంగిరెద్దులవాళ్ల వచ్చి గంగిరెద్దుల ఆట చూపిస్తుంటారు. కోడెకు రాముడని, ఆవుకు సీత అని పేర్లు. గంగిరెద్దు లాడించే వాడు తాను మామగా చెప్పుకొని సీతారాముల కల్యాణం జరిపిస్తుంటాడు. గంగిరెద్దు చేత రైతులకు మ్రొక్కించడం, రక రకాల ఫీట్స్ చేయించడం జరుగుతుంటుంది. గంగిరెద్దుల వాడు చెప్పిన ప్రతిదానికీ గంగెద్దు తల ఊచుతుంది. కాబట్టి 'దూడూ బసవన్నా అంటే తల ఊపినట్లు' అనే సామెత వచ్చింది.

(ఎ) కోతి ఆట (3): కోతి ఆట జానపదుల్లో నవ్వులు పూయిస్తుంది. చాంచల్యానికి మారుపేరైన కోతి మనిషి చెప్పినట్లు గడెక్కడం, గంతులు వేయడం, అత్తగారి సొమ్ము అంటే కర్ర కింద పారెయ్యడం, పుట్టింటి సొమ్ము అంటే నెత్తిన పెట్టుకోవడం లాంటి వినోదాల్ని చేస్తుంటుంది. కొంత మందికి కోతి ఆట ఆడించడం బ్రతుకు తెరువు. ఆ విషయాల్ని చెప్పే సామెతలు 'గడ ఎక్కు తిమ్మన్నా, గంతు వెయ్యి తిమ్మన్నా', 'కోతికి జల్తారు కుల్లాయి పెట్టినట్లు', 'కోతి గెంతడం సాయిబు సంపాదించడం' అనేవి. ప్రదర్శన చేసే కోతికి నెత్తిన కుల్లాయి ఉంటుంది.

4.3.2 విలాసాలు (81): అందలాలు, గుర్రాలెక్కడం, గొడుగు పట్టించుకోవడం, పగలే కాగడాలు పట్టించుకోవడం, పట్టెమంచం, పట్టుపరుపుల పైన పవ్వళించడం ఐశ్వర్యవంతుల విలాసాలు కాగా, తాంబూల సేవనం, మద్యపానం, పొగ త్రాగడం, భంగు పీల్చడం సామాన్యులకు కూడా అందుబాటులోని విలాసాలు. గొడుగు[7], కాగడాలు పట్టించుకోవడం రాజరిక, అధికార చిహ్నాలు. తినేదానికి లేకపోయినా విలాసాలు మానుకోలేవారు కాదని 'దౌలు దస్తు పగలు వస్తు' (నర) అనే సామెత తెలుపుతుంది. 'ఎప్పుడూ ఎక్కని రెడ్డి గుఱ్ఱమెక్కితే వెనకా ముందయినట్లు', 'ఎప్పుడూ ఎక్కనమ్మ గుర్రమెక్కితే వెనకా ముందా అన్నట్లు' (నర). 'నడవ లేనమ్మకు నాలుగు ప్రక్కలా సవారి'. 'ఇంట్లో యీగల మోత బయట పల్లకీల మోత'. 'పొగాకు అడుక్కొనే వాళ్ళ అందలం బయట పెట్టరా అన్నట్లు', 'బడాయి బండి మీద పోవడమే గాని బత్యానికి నూకలు లేవు' అనే సామెతలు గుర్రం, అందలం, బండికి సంబంధించినవి. 'చీర పోతుకు సిరి వస్తే గోలకొండ కాడికి గొడుగు తెమ్మన్నదట', 'కొత్తగా సిరివస్తే అర్థ రాత్రి గొడుగు పట్ట మన్నాడట' అనే సామెతలు గొడుగు పట్టించుకోడానికి సాక్షులు.

'పీకు జోడు కాగడాలు ఎవరిచ్చారంటే నా ఆముదపు చేను ఇచ్చిందన్నాడట' అనేది అధికారులు కాగడాలు పట్టించుకోవడానికి చిహ్నం. 'తినడానికి తిండి లేక పోయినా పండుకోడానికి పట్టె మంచం కావాలన్నట్లు' (శ్రీపాద), 'అట్ట హాసమూ పట్టె మంచమూ' (నర). 'దొరకు తొంగోను మంచం లేదు, బంటుకు పట్టు పరుపట' అనేవి శయ్యా సంబంధ విలాసాల్ని తెలిపే సామెతలు.

తాంబూలం, మద్యపానం, పొగ త్రాగుడు, భంగు పీల్చడం, నశ్యం పీల్చడం పేదలకూ అందుబాటులో ఉండే విలాసాలు. వీటిలో తాంబూలం తప్ప

మిగిలినవి దురలవాట్లుగా, ఆరోగ్య భంజకాలుగా ప్రజలలో గుర్తించబడ్డాయి. తాంబూల సేవనం ప్రజల భోగాల్లో ఒకటిగా ప్రాచీనులు తలచేవారు. వక్కలాకుల తిత్తి లేదా పేటికలను మోసేందుకు రాజుల వద్ద అడప గాళ్లు, అడప కత్తెలు ఉండేవారు. గవ్వ సున్నం వాడేవారు ఈ విషయాల్ని 'తములము వేయని నోరు కపులాలు లేని కోనేరు', 'కొరకను వక్క లేకున్నా కొంకుల దాకా తిత్తి' (చంద్ర), 'గోడకు పూసిన సున్నము విడెము లోనికి వచ్చునా?' అనే సామెతలు తెలుపుతాయి.

తాగుడుకు సంబంధించిన సామెతల ద్వారా తెలిసే విషయాలివి: తాగుబోతుకు సిగ్గూ, శరమూ ఉండవు. మాట తప్పుతాడు. నిజం చెపుతాడు. తోడు కోరతాడు. తూలి ముందుకు పడతాడు. తాళ్ల పన్ను కడతాడు. నోటి కొచ్చింది బూతులు కూడా వాగుతాడు. 'ఎంగిలికి ఎగ్గు లేదు. తాగుబోతుకు సిగ్గు లేదు', 'తాగినవాడు తప్పినవాడు ఒకటే', 'తాగిన వాని మాట దబ్బర కాదు', 'తాగు బోతు తోడు కోరుతాడు', 'తూగి ముందుకు పడడు, తాగి వెనకకు పడడు', 'తాగేవాడే తాళ్ల పన్ను కట్టుతాడు', 'మద్య పాయికి అనరాని మాట లేదు' అని సామెతలు.

కల్లు ధనాన్ని ఆరోగ్యాన్ని నాశనం చేస్తుంది ఈత లేదా తాటి చెట్ల నుంచి కల్లు తీస్తారు. కాబట్టి వాటి కింద కూర్చొని పాలు తాగినా కల్లే అంటారు. పాత కల్లు తాగేందుకు బాగుంటుంది, కల్లులో నీళ్లు కల్తీ చేస్తుంటారు. ఈ విషయాల్ని 'కల్లు యిల్లూ వొళ్లూ గుల్ల జేస్తుంది', 'ఈత చెట్టు కింద (తాటి చెట్టు) పాలు తాగినా కల్లే అంటారు', 'కాలను పాత కొయ్య, తాగను పాత కల్లు (మద్యము), నమ్మను పాత స్నేహితుడు, చదవను పాత పుస్తకాలు శ్రేష్ఠము', 'తాలు వడ్లకు కల్లు నీళ్లకు సరి', అనే సామెతలు తెలుపుతాయి.

'కల్లు విలువ వుండే కొద్దీ పులు పెక్కువై మత్తు నిస్తుంటుంది. కల్లు తాగినవాడు గాడిద కంటె హీనుడని, కల్లు తాగను బోయినవాడు తండ్రి చచ్చినా ఇంటికి తిరిగిరాడని 'ఈదులకు పోయినవాడు ఇల్లు కాలినా రాడు తాళ్లలోనికి పోయినవాడు తండ్రి చచ్చినా రాడు' (హైసా. IX-13), 'కల్లు తాగేవాడు గాడిద కంటే హీనుడు' అనే సామెతలు చెపుతున్నాయి. ఈత కల్లు కన్న ఇప్ప పూల నుంచి తీసిన సారాయి ఎక్కువ మత్తని 'ఈత నీళ్లు పడితే పాత జోళ్లు వెళ్లతవి, ఇప్ప నీళ్లు (కల్లు) పడితే ఎప్పటి జోళ్లయినా వెళ్లుతవి' అనే సామెత అంటున్నది.

పోర్చుగీసువారితో పాటు క్రీ. శ. 1600-1650 సంవత్సరాల మధ్య పొగాకు ప్రవేశించింది. పొగాకు చుట్టల్లోను, బీడీల్లోను, సిగరెట్లలోను ఉపయోగిస్తారు.

పొగాకుతో పొగ చుట్టలు చుట్టుకుంటారు. తునికి ఆకుల్లో పొగాకు పొడి వేసి బీడీలను, పలుచని కాగితంలో చుట్టి సన్నని పొగాకు పొడి వేసి సిగరెట్లను తయారు చేస్తారు. పొగాకుతో ఎంత జాగ్రత్తగా చుట్టినా మూరెడు పొడుగు చుట్ట కోరు. 'ఐదాయి బారెడు పొగ చుట్ట మూరెడు' అని సామెత. చుట్ట గట్టిగా పీల్చి పోతే మాటి మాటికి ఆరి పోతుంటుంది. ఘాటైన వాసన వస్తుంది. ఈ విషయాల్ని 'చుట్ట కాలిస్తే మాటాడనీయదు' అనే సామెత చెబుతుంది. మాట్లాడుతుంటే చుట్ట ఆరి పోతుంది. చుట్టను కొంత తాగి ఆర్పి మళ్ళీ ఇంకోసారి తాగుతారు. ఆ ముక్కల్ని 'చిలక కొట్టుడు' అంటారు. ఆ పిసరాన్ని 'చుట్ట తాగి చూరులో పెడితే ఇల్లు కాలి వెళ్ళవలసి వచ్చిందట' అనే సామెత చెబుతుంది. 'సిగరెట్టు తాగేవానికి బీడీ తాగే వాడు లోకువ' (సా) అనే సామెత ఈ మధ్యనే పుట్టింది.

పొగాకు రాళ్ళ నశ్యం కూడా చేస్తారు. నశ్యాన్ని గురించిన సామెతలు 'తాలి వట్టు తులమే చాలు' (సా). 'పొడుం పెట్టించే ముక్కు. పొగ పీల్చే నోరు కులంగా ఉండవు' అనేవి.

గంజాయి, భంగు నషానార్థకాలు. గంజాయి ఆకులు, పూవులు ఎండ బెట్టి పొగ తాగేందుకు అనువుగా సిద్ధం చేసుకుంటారు. సొంగ (గొట్టం) లో వేసుకొని పొగ తాగుతారు. ముఖ్యంగా సన్యాసులు భంగు ఆరాధకులు. 'తాగేది దమ్మిడి గంజాయి. ఇల్లంతా చెడ దుమ్మురు', 'భంగు తాగేవానికి హంగు గాళ్ళు పది మంది' 'సోము దప్పిన వాడా సొంగ ఎక్కడ పెట్టి నావురా అంటే త్రాగి తమ్మళ్ల బాలమ్మ గుడిపెకు చెక్కినా నన్నాడట' అనే సామెతలు భంగును గురించి చెప్పినవి.

4.3.3 ఆటలు (12) : చదరంగం, కోలాటం పెద్దల ఆటలు. బిల్లంగోడు, బొంగరాలు, గాలి పటాలు, పిల్లలాటలు. చతురంగమును మొదట కనిపెట్టినవారు హిందువులు. దానిని అరబ్బులు.... యూరోపు వాసులు నేర్చు కొనిరి.[8] 'ఎదురుపెట్టి చదరంగ మాడినట్లు' అనే సామెత చదరంగం గురించి చెప్పినది. కోలలచేత ఆడుటను కోలాటమందురు. అనగా మూరెడు పొడవు గలిగిన సన్నని కర్రలచేత ఆడుటయని అర్థము. కోలాటము పల్లీయనృత్యము[9] 'కొంటిమి తింటిమి కోలాట మెందుకు', 'తుమ్మ తోపుల్లో కొత్త కోలాటం' అనేవి కోలాటానికి సంబంధించిన సామెతలు.

బిళ్లంగోడు, గుచిబిళ్ల, జిల్లాకోడి లాంటి పేర్లతో పిలిచే ఆటను సంస్కృత భారతం 'వీటాతేళవ మనే' పేరుతో వర్ణించింది. పెద్ద కర్రతో చిన్న కర్రను కొట్టి

ఆదే ఆట. 'కోటికి లాగితే బిళ్లకు. బిళ్లకు లాగితే కోటికి', 'బిచ్చైన కోలలు రిచ్చైన గిల్లలు' అనేవి ఈ ఆటను చెప్పే సామెతలు. బాలురాదే బొంగరాల ఆట పల్నాటి వీర చరిత్ర నాటికే ఉంది. బొంగరానికి తాడు ముఖ్యం. తాడు చుట్టి విసిరితేనే తిరుగుతుంది. 'తాడు లేదు బొంగరము లేదు' అనే సామెత ఏదైనా పని బొత్తిగా జరగనప్పుడు, దరిద్రానికి చిహ్నంగా చెప్పేటప్పుడు ప్రయోగిస్తారు. 'తాడు లేకుండా బొంగరం ఆడించేవాడు' అనే సామెత అసాధ్యమైన కార్యాలు చేయగల దిట్టను గురించి చెపుతుంది.

గాలి పటాల ఆట నాచన సోముని కాలంలోనే ఉన్నట్లు ఉత్తర హరివంశం (5. ఆ) సాక్ష్యమిస్తుంది. గాలిపటానికి తోక ముక్కాని లాంటిది. దారం తెగిందంటే గాలిపటం దిక్కూ దరీ లేకుండా ఎగిరి పోయి నింగిలో కలిసిపోతుంది. ఈ విష యాల్ని 'తోక లేని గాలి పటం వలె', 'తాడు తెగిన గాలి పటం' అనే సామెతలు తెలుపుతున్నాయి.

4.3.4 ఈ ఉప ప్రకరణంలో నిరూపించిన ముఖ్యాంశాల్లో కొన్ని :

పల్లీయులు వారి పరిధిలో వినోదాలు ఏర్పాటు చేసుకున్నారు. కల్పనలు, దైవలీలలు ఉండే జానపద కథలంటే సరళ స్వభావులైన వారికి మిక్కిలి ప్రీతి. పల్లీయులకు వినోదాన్ని అందించి బ్రతుకు తెరువు సంపాదించుకొనే వారు కొందరు. జాన పదుల దైవ భక్తిని పెంచేవి హరికథలు, పురాణ శ్రవణం.

ప్రాచీనులు తిండికున్నా లేక పోయినా విలాసాలు మానుకోలేదు. పొగాకు పోర్చుగీసువారితో పాటు దేశంలో ప్రవేశించి ఆరోగ్యాన్ని, ధనాన్ని నాశనం చేసే ఒక విలాసమై కూర్చొంది. తాంబూలం బీద, ధనిక భేదం లేకుండా సేవించేవారు.

కోలాటం, బొంగరాల ఆటలు, బిళ్లంగోడు, గాలి పటాలు, పల్లీయుల ఆటల్లో కొన్ని.



సూచికలు :-

1. తెలుగు సామెతలు - (వ్యాసం) భారతి, జనవరి, 1966.
2. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 196.
3. వివిధ భాషలలో ఖండాంతర ఇండొనీషియా, కాంబోడియా దేశ భాషా రామాయణాలలో రాముడు సీత వరుస వారు మారుగా వున్నది. కొన్నిట సీత రాముని చెల్లెలు. ఇంకొక కథలో ఆమె రావణుని కూతురు. ఇట్లు నానాసంకరింగా ఉన్నది. కాబట్టి దీనిని 'రామాయణమంతా' అనిగాక రామాయణాలన్నీ విని అంటే సరిపోతుందని తెలుగు సామెతలు. (పుట. 514) గ్రంథంలో వివరించబడింది.
4. 5. తెలుగు సామెతలు, పుట. 514.
6. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట. 184.
7. దేవతా విగ్రహాలను ఊరేగింపు కాలములోను, రాజుల ఊరేగింపు కాలము లోను రెండు గజాల పొడవు కర్రకు రంగు రంగుల పట్టు బట్టలతో ఛత్రీ లనుగా కుట్టి వాడు చుండిరి. (ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట. 402)
8. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట. 186-87
9. పల్లె పదాలలో ప్రజా జీవనం, పు. 225

## తెలుగు సామెతలు ఆచార వ్యవహారాలు

4.4 ఒక సంఘంలోని ప్రజలు తర తరాలుగా పాటించే పద్ధతుల్ని ఆచారాలని స్థూలంగా నిర్వచించవచ్చు. కాల ప్రవాహంలో కొన్ని ఆచారాలు మాసి పోయి, కొత్తవి రావచ్చు. ఆ కొత్త ఆచారాలు కాల నేపథ్య బలంతో తర్వాతి తరాల్లో ప్రబల ఆచారాలుగా రూపొందవచ్చు. అంటే ప్రతి ఆచారానికి పుట్టుక, ప్రాబల్యం, చావు ఉంటాయన్న మాట. ఆచారాలకు ఎంత బలముందంటే సంఘంలో సాధారణ వ్యక్తులు వాటిని ఉల్లంఘించేందుకు ధైర్యం చేయలేరు. పల్లీయుల్లో చాలమంది ఆచారాల్ని తు. చ. తప్పక పాటించాలనుకొనేవారే. వారు పాత చింతకాయ పచ్చడి పథ్యంగా, 'పెద్దల మాట పెరుగు కూటి మూట'గా భావిస్తారు.

జీవిత చక్రమున జననము నుండి మరణానంతరము వర కాచరింపదగిన ఆచారము (షోడశ సంస్కారము) లను గూర్చి శ్రుతులు, స్మృతులు, గృహ్య సూత్రములు వివరించినవి[1] ...ఆచారముల వలన దీర్ఘాయుస్సు, పుత్ర పౌత్రాదులు, ధనము ప్రాప్తించుటయేగాక అవలక్షణములన్నియు నమసి పోవును.[2] అనంతర కాలమందలి పూజలు, వ్రతములు నోములుకూడ వీని నాశించియే ఆచరించుట జరుగు చున్నది. కనుక ఆచారము లావశ్యకములైనట్టివని ఋజువగుచున్నది.[3]

502 తెలుగు సామెతలు ఆధారంగా ఈ ఉప ప్రకరణంలో తెలుగువారి ఆచార వ్యవహారాల చిత్రణ చేసే ప్రయత్నం జరిగింది. పెండ్లి, పాతివ్రత్యం, ముత్తైదువతనం, వైధవ్యం, పేరంటం, వ్రతాలు-నోములు, గోత్రాలు, గర్భిణి-ప్రసవం, పిల్లలకు చేసే సంస్కారాలు, సహగమనం, సమర్త, దానాలు, మంత్రాలు, మరణం - తత్సంబంధి ఆచారాలు, మరి కొన్ని ఆచారాలు అనే 15 శీర్షికల కింద వింగడించబడి విషయ వివేదన చేయబడింది.

4.4.1 పెండ్లి (224) : స్త్రీ గాని, పురుషుడుగాని పెండ్లి చేసుకోనిదే సంపూర్ణ జీవితాన్ని అనుభవించినట్లు చెప్పే వీలు లేదు. వివాహం అనే అర్థంలో తెలుగులో పెండ్లి అనే పదాన్ని వాడుతున్నాము. తమిళంలో మాధుర్యానికి, ఆనందానికి, సంభోగ ప్రేమకు, పెళ్ళికి 'ఇంపమ్' అనే పదం వాడుతారు. అంటే పెళ్లి అనేది ఆనందం, మాధుర్య, సంభోగ ప్రదాయకం అని తేలుతున్నది. పెణ్ అంటే తమిళంలో వధువు, భార్య అనే అర్థం. తెలుగులో పెంటి అంటే ఆడ ప్రాణి. వధువును తెచ్చుకోవడం పెండ్లి-పెండ్లి చేసుకొన్న స్త్రీ పెండ్లాము అయి ఉండొచ్చు.[4] ఒక స్త్రీ ఒక పురుషుడు ధర్మకామం తీర్చుకుంటూ, పిల్లల్నికని, వంశం పెంచు

కుంటూ సంఘంలో గౌరవ ప్రదంగా జీవించేందుకు జరిగే కట్టుబాటు పెండ్లి అని చెప్పుకోవచ్చు.

పెండ్లికి సంబంధించిన ఆచారాలు-సంప్రదాయాలు వావి వరుసలు, మేనరికం, కుంద మార్పులు, ఈడు-జోడు, విశ్వాసార్థం ఓలి, ఇల్లరికం, పెండ్లి-కొన్ని సామాన్య విషయాలు, ముహూర్తం శకునాలు, పెండ్లి ఏర్పాట్లు, పెండ్లి తంతు, పెండ్లి కొడుకు - పెండ్లి కూతురు, గర్భాదానం, మనుగుడుపులు తోడి పెండ్లి కొడుకు అనే విషయాల కింద వేర్వేరుగా వివరించబడ్డాయి.

(అ) వావి వరుసలు (8) : పెండ్లి నిశ్చయించే ముందు వధువుకు, వరునికి వావి వరుసలు సరిపోతాయో లేదో పెద్దలు పరిశీలిస్తారు. ఒకటే గోత్రం వారు పెండ్లి సంబంధానికి పనికి రారు. సగోత్రీకులైన స్త్రీ పురుషులు అన్నా చెల్లెండ్లవుతారు. ఇట్లాంటివే మరికొన్ని ఏర్పాట్లు చూచి వావి వరుసలు నిర్ణయిస్తారు. వావి వరుసలు చెడ గూడదని, వావి చెడిన వాణ్ని నిందిస్తూ 'వావి వరుస దప్పి వర్తించి చెడుదురు', 'చిక్కినవాడు పిగ్గెఱుగడు, బలిసిన వాడు వావి ఎఱుగడు' అనే సామెతలు చెపుతారు. వావి వరుసలు సంఘంలో పాటించ నవసరం లేని వారు వేశ్యలు. ఆ విషయాన్ని 'వాడ వదినె కేల వావి వర్తనములు', (కార్. 1955), 'వార కాంతా జనంబులకు వావి గలదె' అనే సామెతలు తెలుపుతాయి.

(ఆ) మేనరికం (5) : మేనత్త కూతుర్ని లేక మేన మామ కూతుర్ని పెండ్లాడడమే మేనరికము. ఈ ఆచారం అవైదికం. తెలుగు జాతిలో మేనరికం అమలులో ఉన్నట్లు మహా భారతంలో తిక్కన శశిరేఖాభిమన్యుల వివాహాన్ని మేనరిక వివాహంగా చిత్రించడంతో తెలుస్తున్నది. కొన్ని కులాల్లో మొన్న మొన్నటి దాకా మేనరికం ఉంటే వేరే సంబంధం చూడ గూడదని కట్టుబాటు ఉండేది. 'ఉండేది ఒక పిల్ల ఊరంతా మేనరికం', 'ఉన్నది ఒక బిడ్డ ఊరెల్లా మొగుళ్ళు', వలచి వస్తే మేన మామ కూతురు వావి కాదన్నట్లు' అనే సామెతలు పై విషయాన్ని తెలిపేవి. మేన సంబంధముల వలన కలిగిన దుష్పరిమాణములను బట్టి తర్వాత కాలమున మేనాల్లి కిచ్చిం దాని కంటె మేకబాయి లెయ్యాలె' అను సామెత పుట్టినది. 5

(ఇ) కుంద మార్పులు (2): బావ, మరదులు, అక్క చెల్లెళ్ల నిచ్చి పుచ్చుకోవడం కుంద మార్పులు. కుంద మార్పులు ఒకరికి అచ్చి వస్తే మరొకరికి అచ్చి రావని 'కుంద మార్పిళ్ళు కూడదు' (బ్రౌన్). 'కుంద మార్పు మనువులు కూడైనా వస్తవి. కుమ్మయినా అవుతవి' అని సామెతలు చెపుతాయి.

(ఈ) ఈడు-జోడు (7) : వావి వరుసల్తో పాటు వధూ వరులు ఈడు-జోడు సరిపోతాదో లేదో చూస్తారు. బాల్య వివాహాల కాలంలో ఇది తారుమారైంది. పెద్ద వయసుండే పురుషుడు చాలా చిన్న పిల్లల్ని చేసుకోవడం జరిగింది. ఆ విషయాల్ని వ్యక్తపరిచే సామెతలు 'ఈడు చూచి పిల్లనియ్యి పిడిచూచి కొడవలియ్యి', 'ఈడు గానిది ఇంటికి రాదు జోడు గానిది దొడ్డికి రాదు', 'కుల హీనమైనా వరహీనం కారాదు', 'ముప్పై యేండ్ల మొగవానికి మూడేండ్ల ఆడ పిల్ల' (నర), 'ఆడవిని గాచిన వెన్నెల, ముదిమిని చేసిన పెండ్లి'. 'శిగ్గుల చేటు పెద్దల పెండ్లి' (కాశీ. 2057) అనేవి.

(ఉ) నిశ్చితార్థం (4) : వధువును పెద్దలు చూసి వివాహం నిశ్చయం చేసుకోవడం నిశ్చితార్థం అంటారు. దీన్నే మాట కట్టించడం, మంచి మాట అయింది అని కూడా అంటుంటారు. నిశ్చితార్థం తర్వాత పెండ్లి ఎగిరి పోతే ఆ అమ్మాయికి పెండ్లి అయేది దాదాపు అసాధ్యమేనని చెప్పాలి. ఓలి, కట్నాల విషయం, వధువుకు పట్టు చీర ఇవ్వడం - అన్నీ నిశ్చితార్థం నాడే నిర్ణయమవుతాయి. పెండ్లి అయిందాకా వరుని తరపువారు వధువు ఇంట్లో భోంచేయరు. ఈ విషయాల్ని 'నిశ్చితార్థమునాడే సిగ్గ వలసింది నాగవల్లి దాకా ఉండడం నా అదృష్టం కాదా అన్నదట', 'పట్టుకో కెట్టమని పెళ్లి కూతురి వారంటారు. పట్టుకో కెట్ట మని మేమంటాము. యీ తగాయిదా తీరితే గాని పెళ్లి స్థిరపడేటట్టు లేదు' (క. గా. 320), 'గతికితే అతకదు' అనే సామెతలు తెలుపుతున్నాయి.

(ఊ) ఓలి (7) : కన్యాశుల్కం, ఓలి సమానార్థకాలు. వధువు తండ్రికి కట్నంగా కొంత ఇచ్చి వధువును పెండ్లాడడం ఓలి ఇవ్వడం అవుతుంది. వెలమలలో ఓలి మాడలున్నట్లు 'పలనాటి వీర చరిత్ర' తెలుపుతుంది. విజయనగర సామ్రాజ్య కాలంలో కోమట్లు ఓలి ఇస్తున్నట్లు, శూద్రులు 10 మాడలు ఓలిగా ఇస్తున్నట్లు తెలుస్తున్నది.6 మేనరికంలో కూడ ఓలి సంప్రదాయం ఉంది.7 ఓలి తక్కువైతే సరియైన వధువులు లభించేవారు కాదని 'ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెండ్లాడితే నెలకు మూడు ఆవాలు' (కార్. 496) అనే సామెత చెప్తుతున్నది. ఓలి తీసుకొన్న వ్యక్తిని విరసించిన సామెత 'కూతును గుత్త రూకల కమ్మేవాడ అల్లునికి అరణ మిచ్చునా' అనేది.

(ఋ) ఇల్లరికం (3): కోడలు అత్తగారింట ఉండి కాపురం చేయడం కోడరికం కాగా అల్లుడు అత్తగారింట వెళ్లి ఉండడం ఇల్లరికం అవుతుంది. ఇల్ల

పల్లెని ఇంటా బయటా చులకనగా చూస్తారు. ఒకోసారి అల్లుడు ఏకు మేకై అత్త గార్ని కష్ట పెట్టడమూ ఉంది. ఆ విషయాల్ని 'ఇల్లరికము కన్న, మాలరికం మేలు', 'ఉప్పు గాళ్ళ. ఉప్పు చేతులు. ఇతదేనమ్మా ! ఇల్లిటపు టల్లుడు !', 'ఇల్లిటపు టల్లుడు ఇల్లెల పాదికి మొగుడు' అనే సామెతలు సూచిస్తాయి.

(ఋ) పెండ్లి-కొన్ని సామాన్య విషయాలు (12) :

అబద్ధాలు చెప్పి అనా పెండ్లి చేయాలని, పెండ్లి గడియ దిగి వస్తే ఏ ప్రయత్నమూ అక్కర లేదని, పెండ్లి చాలా ఖర్చుతో కూడుకొన్నదని, ఐదు దినాలు చేయాల్సిన పెండ్లిని భిక్షకులు చేసుకో లేరని సామెతలు చెపుతున్నాయి. 'నూరు అబద్ధాలు చెప్పి అయినా ఒక పెండ్లి చెయ్యమన్నారు' (వారి జాతులందు వైవాహికములందు....బొంక వచ్చు సఘము పొందదు అని శుక్ర నీతి), 'ఇల్లు కట్టి చూడు పెళ్లి చేసి చూడు', 'బందెపోటు దొంగ ప్రాణమునో ధనమునో హరిస్తే పెండ్లి యీరెంటినీ హరిస్తుంది', 'పెండ్లి అయిన యింట్లో ఆరు నెలలు కరువు', 'బుడ బుక్కల వాని పెండ్లి యెంత బుడ్డిలో చమురెంత', 'పిచ్చు గుంటల వాని పెండ్లి ఎంత వైభవ మెంత' (పెటాకు లెంత) అనేవి. అవివాహితులుగా మర ణించడం పాపమని, వారి ఆత్మలకు పుణ్య లోకాలు వచ్చేందుకు చచ్చి పోయిన స్త్రీ. పురుషుల సమాధులకు వివాహం చేసే వింత ఆచారముంది. వరుని, వధువు తరపువారు కట్నాలు మాట్లాడు కోవడం, తర్వాత బంధుత్వం కొనసాగించడం ఉంది. శ్మశానమే వివాహ వేదికగా వివాహం జరిపిస్తారు. బ్రాహ్మణులకు దక్షిణ లిస్తారు. ఈ విషయాన్ని 'చచ్చిన వాడి పెండ్లికి వచ్చిన సంభావన చాలు' (రా. వ. 295) అనే సామెత తెలుపుతుంది[8].

(ఎ) ముహూర్తం (4) : పెండ్లి జరిగే శుభ సమయం ముహూర్తం లేక లగ్నం. లగ్నం అంటే వివాహమనే అర్థం అనంతపురం మండలంలో ఉంది. పంచాంగంలో ప్రతి సంవత్సరమూ ఉండే శుభ ముహూర్తాల్ని సూచించి ఉంటారు. కొన్ని నెలల్లో, తిథుల్లో వివాహం చేయరు. ముహూర్త బలం వల్లనే వధువు ముత్తైదు తనం నిలుస్తుందని పల్లీయుల నమ్మకం. యానాది వారికి తిథి పట్టింపు లేదు. కల్యాణ ప్రదేశానికి ఎదురుగా ఒక కర్రె పాతి, దాని నీడ కర్రె కిందికి వచ్చి నపుడు, మట్ట మధ్యాహ్నం అభిజిత్ లగ్నంలో పెండ్లి జరిపిస్తారు. ఈ విషయాల్ని 'కాలు త్రొక్కిన వేళ కంకణం కట్టిన వేళ', 'యానాది వాడి లగ్నానికి ఏ నాడైతే

నేమి', 'మూడో పెండ్లి వానికి ముహూర్తం కావాలా' అనే సామెతలు తెలుపు తున్నాయి.

(ఏ) శకునాలు (5) : వరుని పక్షం వారు, పెండ్లికి బయలుదేరి వెళ్లేటప్పుడు శకునాలు చూస్తారు. పిల్లి, నంబి అపశకునాలు. ఆ విషయాన్ని 'నంబీ నంబీ నా పెండ్లి కేమి సహాయం చేస్తావంటే నీ పెండ్లికి నేను ఎదురు రాను పో అన్నాడట' 'పెళ్ళికి పోతూ పిల్లిని చంకలో పెట్టుకొని పోయినట్లు', 'పీటల మీది పెళ్లికి పిల్లి ఎదురు' (శ్రీపాద) అనే సామెతలు చెపుతాయి.

(ఐ) పెండ్లి ఏర్పాట్లు (29) : తోరణాలు కట్టడం, బాజాలను సిద్ధం చేయడం, పెండ్లి భోజనాలు ఏర్పాటు చేయడం, అరివేణి కుండలు తేవడం, బాజా సంచా, భోగం మేళం ఏర్పాటు చేయడం - ఇవన్నీ పెండ్లి ఏర్పాట్లే. తోరణం కట్టడం నుంచి నాగవల్లి తీరడం వరకూ పెండ్లి నిర్విఘ్నంగా జరగాల్సి ఉంది. పెండ్లి తంతు మొదటి నుంచి చివరి దాకా మంగళ వాయిద్యాలు మోగుతుండాల్సిందే. బ్యాండు, తప్పెట్లు, సన్నాయి, డోలు, మంగళవాద్యాలు సన్నాయి మేళం మాత్రం తప్పని సరి. పెండ్లి భోజనంలో పప్పు వండడం తప్పని సరి. పిండి వంటలున్నా. ఒకో సారి పెండ్లిలో వేళకు బోజనం అబ్బక పోవడం, చివరి బంతికి అయి పోవడం జరుగుతుంటుంది. ఈ విషయాలన్నిటినీ చక్కగా చిత్రించే సామెతలు: 'తోరణం కట్టగానే పెండ్లి పూర్తి అయినట్లా', 'పూరణము లేని బూరె వీరణం లేని పెండ్లి వ్యర్థము', 'తల్లె కొట్టినా తప్పెట కొట్టినా పెండ్లే'. 'అయి పోయిన పెండ్లికి అంబారి మేళము ఎందుకు'. (సా). 'దమ్మిడి పెళ్లికి రూపాయి బాజా సంచా'. 'అర్ధ రూపాయ పెండ్లి అందులో బిరుసు బాజాలు', 'దమ్మిడీ పెళ్లికి ఏగాని బోగం మేళం', 'పెండ్లి పప్పన్నం దినమూ రమ్మంటే వస్తుందా', 'పప్పు లేని పెండ్లి ఉప్పు లేని కూర', 'పెండ్లిట్లో గంజి నీళ్లకల్లాడే వాడు' (చంద్ర) 'పేకులాట పెండ్లికి పోయి పిల్లా నేనూ సగమైవచ్చినానన్నాడట' అనేవి. పప్పన్నం పెట్టడం అంటే పెండ్లి భోజనం పెట్టడం అనే నేటి అర్థం.

(ఓ) పెండ్లి తంతు (101) : అవిరేణి కుండల పూజ నుంచి అప్పగింతలు వరకు వివిధ కార్య క్రమాలు పెండ్లిలో జరగాల్సి ఉంది. పెండ్లి కొడుకు లక్షణం పలకడం-శుభం పలకడం-ముద్దుల గుడవడం; అరివేణి కుండల పూజ, తలపాగా చుట్టి బాసికం కట్టడం, బియ్యపు ప్రోలు పోసి పీటలు వేసి వాటిపై వధూ వరులను కూర్చో బెట్టడం, సేసలు పెట్టడం, జీల కర్ర-బెల్లం వధూ వరులు ఒకరి తలపై

మరొకరయందుకోవడం, కంకణాలు కట్టు కోవడం, సన్నెకల్లు తొక్కడం, మెట్టెలు పెట్టు కోవడం. మాంగళ్య ధారణ, సప్తపది, తలంబ్రాలు, చదివింపులు, అరుంధతీ దర్శనం, నాగవల్లి. ఊరేగింపు, అప్పగింతలు అనే అంశాలు పెండ్లి తంతులోని ముఖ్యాంశాలు. ఒక్కొక్క అంశం వేర్వేరుగా వివరించబడుతుంది.

సంవర్ణాన్ని అనుసరించి పెండ్లి కొడుకు లక్షణం పలకడం, శుభం పలకడం, ముద్దులు గుడవడం అరివేణి కుండల పూజకన్నా ముందు జరుగుతుందని ఊహించుకోవచ్చు. ఇది ఒక తంతుగా చెప్పాలనో లేక పరిహాసానికి ఊ సామెతలు వచ్చాయో పరిశీలించాల్సి ఉంది. ఈ విషయాల్ని తెలిపే సామెతలు 'లక్షణం పలుకరా పెళ్లి కొడుకా అంటే అయిరేణి కుండ పదహారు వక్కలు అన్నట్లు', 'శుభం పలకరా పెండ్లి కొడుకా అంటే, యవడి అలి తాడు తెగితే నాకేమి? నాకు వేసే పిండా కూడు నాకు వేస్తే అవిరేణి కుండల కాడ చచ్చినట్లు తొంగుంటాను అన్నాడట' (కార్. 2068). 'శుభం పలుకరా పెండ్లి కొడకా అంటే పెళ్ళి కూతురు ముండ ఎక్కడున్న దన్నాడట', 'ముద్దులు కులకరా పెండ్లి కొడకా అంటే పెండ్లికి వచ్చిన పేరంటాండ్లు అందరూ నా పెద్ద పెండ్లాలు అన్నట్లు' (కార్. 1772)అనేవి.

ముహూర్తానికి ముందే వధూవరులను అవిరేణి కుండల ముందు కూర్చుండబెట్టి పూజ చేయిస్తారు. పూజ కుండలే అవిరేణి కుండలు. వాటిని పూజించితే మహాలక్ష్మిని పూజించినట్లు.9 వధూ వరుల భావి జీవితంలో శుభం కలగడానికే ఈ పూజ. అవిరేణి కుండలు పగలడం పెద్ద అపశకునం. ఈ విషయాన్ని 'లక్షణం పలకరా పెండ్లి కొడుకా అంటే అయిరేణి కుండ పదహారు వక్కలు అన్నట్లు', 'శుభం పలకరా పెండ్లి కొడకా అంటే, యవడి అలి తాడు తెగితే నాకేమి? నాకు వేశే పిండా కూడు నాకు వేస్తే అవిరేణి కుండల కాడ చచ్చినట్లు తొంగుంటాను అన్నాడట' (కార్. 2057) అనే సామెతలు తెలుపుతాయి. అయిరేణి కుండలకాడ వరుడు పడుకొంటే తర్వాత జరగాల్సిన పెండ్లి కార్యక్రమం ఎలా జరుగుతుంది ?

వరునికి తలపాగా చుట్టి బాసికం కడ్తారు. వధువుకు కూడా నొసట బాసికం కడతారు తలపాగా చుట్టాలి అంటే నిపుణత్వం కావాలి. 'తలపాగా చుట్ట లేక తల వంకర అన్నట్లు'. 'తల విడిచి మోకాలికి బాసికం కట్టినట్లు', 'బాసికం మొదలు బుజం తీం వరకు బదులుతో పెండ్లి జరిపినట్లు' అని సామెతలు.

వివాహ వేదికపై బియ్యం పోసి, వాటిపై పీటలు వేసి, తెల్లని గుడ్డ పీటలపై పరిచి వధూవరులను మొదట కుడికాలు పీటపై పెట్టి కూర్చోమంటారు. ఏ

శుభ సందర్భానికైనా కుడికాలు ముందు పెట్టడం సాంప్రదాయం. ఈ విషయాల్ని 'కలకాలం బ్రతికే బ్రతుకులు కుడికాలు పెట్టవే కూతురా అన్నట్లు', 'ఎత్తు బారపు పెండ్లికి ఏ కాలు పెట్టినా ఒకటే' అనే సామెతలు తెలుపుతున్నాయి.

పేరంటాండ్లు వధూవరులకు సేసలు పెడ్తారు. దీన్నే నలుగు పెట్టడం అని కూడా అంటారు. వధువు. వరుని నొసట పసుపు కుంకుమాక్షతలు పెడతారు. ఈ విషయాల్ని 'చెవిటిదాని సేసలు పట్టమంటే బియ్యం తిని ఉంటే అశుద్ధం దిన్నట్లే', 'ఇ (వి) చిత్రాల పెండ్లి కొడుక్కు అక్షింతలు పెడితే, నొసలు గుల గుల అని నోట్లో వేసుకున్నాడంట' అనే సామెతలు చెపుతున్నాయి.

వధూ వరు లొకరి చేతికొకరు కంకణాలు కడతారు. ఒకరి కాలు మరొకరు కాలితో నొక్కుతారు. ఆ విషయాల్ని 'కాలు త్రొక్కిన వేళ, కంకణం కట్టిన వేళ' అనే సామెత చెప్పుతుంది. ఆ వేళ మంచిది కావాలని సామెత భావం. 'కాపురం చేసే కళ కాలు తొక్కేటప్పుడే కనబడుతుంది' అట. పురుషుడు. వధువు మృదువుగా కాలు తొక్కకోవాలనో, లేక వధువు మాత్రం మృదువుగా తొక్కి వినయం చూపించాలనో ఈ సామెత భావం అయి ఉంటుంది.

వధువు చేత సన్నెకల్లు తొక్కిస్తారు.10 వివాహ వేదిక చుట్టూ వధూ వరుల్ని సప్తపది నడిపిస్తారు. 'సన్నెకల్లు దాచితే పెండ్లి కాదా', 'గుండ్రాయి దాస్తే కూతురు పెండ్లి ఆగునా' అనే సామెతలు సన్నెకల్లు తొక్కడానికి సంబంధించినవి. 'మూడు ముళ్ళు ఏడు అడుగులు' అనే సామెత సప్త పదిని చెప్తున్నది. పెండ్లి అంటే తాళి మూడు ముళ్ళు, సప్తపది ఏడు అడుగులు అని సామెత భావం.

ప్రాచీనుల్లో పురుషులు కూడా మెట్టెలు ధరించేవారు. ఇప్పుడు కూడా పెండ్లిలో పురుషునికి ఒక మెట్టె పెడతారు. స్త్రీ పెండ్లి గుర్తుల్లో మెట్టెలు, పుస్తెలు ముఖ్యమైనవని. మెట్టెలు కాలికి పెట్టేటప్పుడు పాదాన్ని గుండ్రాయి మీద పెట్టి, వేలికి సరిపోయేటట్లు అణగ గొడతారు. స్త్రీకి మెట్టెల ప్రాధాన్యాన్ని 'కంచం ఇచ్చి మెట్టె పెట్టించుకున్నా కాన లేదు మొగుడు' అనే సామెత వేనోళ్ళ చాటుతున్నది.

మాంగల్య సూత్రధారణ పెండ్లి తంతులో ముఖ్యమైనది. తాళి బొట్టు కడితే పెండ్లి అయి పోయినట్లే, ఇంక తిరుగు లేదు. మాంగల్యం మగని చేత కట్టబడి మగడు బతికి ఉన్నన్నాళ్లూ స్త్రీ గళానికి అలంకారంగా ఉంటుంది. తాళి కట్టే ఆచారం అవైదికాచారం. కొన్ని కులాల్లో తాళి కట్టే ఆచారం లేదు. తాళి మూడు

ముళ్లు వేసి కుంకుమ, పసుపు, అక్షతలు ముడి పైన వరుడు ఉంచుతాడు. మూడు ముళ్లు అంటే పెండ్లి అనే రూఢ్యర్థం కూడా వచ్చింది. 'పెండ్లి సందట్లో బొట్టు కట్ట మరిచినాడట' (కార్. 2481), 'బొట్టు కట్టితే గాని ముండ మొయ్యదు', 'తాళి బొట్టు కాదు తన కాళ్లకే కట్టు' (సా). 'ముడి వేశాక ముండయినా ముత్తయినా తప్పదు' అనే సామెతలు తాళి కట్టిన తర్వాత ఇష్టమున్నా లేక పోయినా స్త్రీ పురుషులు సంసారం చేయాల్సిందేనని నిర్దేశిస్తున్నాయి.

తాళి కట్టడం అయి పోయిన తర్వాత వధూవరులు తలంబ్రాలు పోసుకుంటారు. ముత్తయిదువుల చేత దంపించిన కొంచెం తవుడు ఉండే బియ్యం తలంబ్రాలు. వధూ వరులకు ఇష్టం లేనప్పుడు తలంబ్రాలు పోసుకోవడంలో వేడుక ఉండదు. ఆ విషయాన్ని 'ఒల్లి ఒల్లనమ్మ తలంబ్రాలు పోసినట్లు', 'వల్లీ వల్లని పెండ్లి కొడుకు తలంబ్రాలు పోసినట్లు' (నర), 'నీకూ నాకూ కాదు రోలెత్తి తలంబ్రాలు పోయమన్నట్లు' (కార్. 1298) అనే సామెతలు తెలుపుతున్నాయి. తలంబ్రాలకు బదులు రోలెత్తి ఒకరి నెత్తిన ఒకరు వేసుకుందాం అనే భావం ఈ సామెతలో ఉన్నట్లు 'కార్' అభిప్రాయం.

తలంబ్రాలు అయిన తర్వాత చదివింపులుంటాయి. వధువు తరపువారు వరునికి కానుకలూ, కట్నాలు ఇస్తారు. బంధు మిత్రులు వధూ వరులకు కానుకలంద జేస్తారు. 'మా వానికి చదువు లేక పోయినా చదివింపు వస్తే చాలు' (రా. వ. 482), 'మొండి మొగుడి పెళ్లి కెళ్లి అడ్డ గోడ చాటు నుండి అర్థ రూపాయ కట్నం చదివించిదంట', 'తలారి దుప్పటి రెడ్డి చదివించినట్లు' అనేవి చదివింపులకు సంబంధించిన సామెతలు.

చదివింపులు అయిన తర్వాత వధూ వరులను వివాహ వేదిక నుంచి తీసుకుని వెళ్ళి అరుంధతీ నక్షత్ర దర్శనం చేయించడం ఆచారం. ఇది ఆర్య సంప్రదాయం. తెల్లవారు జామున వివాహాలు చేసే కాలంలో ఇది బాగానే ఉన్నా, పగటి పెండ్లిండ్లలో హాస్యాస్పదమైంది. అరుంధతిని దర్శించి చేతిలోని అక్షతలు వెదజల్ల మంటే 'అరుంధతీ కనబడదు. అధ్వాన్నమూ కనబడదు-అరవై వరహాలు అప్పు మాత్రం కనబడుతుంది అన్నాడట' (తె. సా. పీఠిక) ఒక పెండ్లి కొడుకు.

ఐదు రోజుల పెండ్లి జరిగే కాలంలో నాల్గవ రోజు నాకబలి జరిపే ఆచారం ఉండేది. నాకబలి, నాగవల్లి రూపాంతరాలు. నాగవల్లి సందర్భంలో వరుడు అలిగి

విడిదింటికి వెళ్లడం, వరునికి, వరుని అక్క చెల్లెండ్లకు కాన్కలిచ్చి వధువు తలి దండ్రులు తోడ్కొని రావడం, నాగవల్లి ఆచారాన్ని పూర్తి చేయడం జరుగుతుంది. అక్కడ విస్తారాలవుతుంటాయి. బీదలు పెండ్లి దినమే నాగవల్లి చేస్తారని హేళన చేయబడింది. ఆ విషయాల్ని తెలిపే సామెతలు 'నాగవల్లి విస్తరము' (కార్. 1257), నాగవల్లి తీరినట్లు', 'నగుబాటు పెండ్లికి నాడే నాగవల్లి' అనేవి.

నాల్గవ, నాటి రాత్రి వధూ వరులను రథాలపై (లేక ఏనుగులపై) నుంచి ఊరేగింపు చేయాలి.11 పల్లకీలకో ఊరేగించడం కూడా ఉంది. 'శివ శివా' అనేది దేవుని పేరైనా పాడెనెత్తినప్పుడు మాత్రమే ఉచ్చరిస్తారు. దేవుడి పేరు కాదని పెళ్ళి పల్లకి ఎత్తినపుడు శివ శివా అన్నట్లు'(చంద్ర)అనే సామెత పై విషయాన్ని తెలిపేది.

పెండ్లి సొంతం అయి పోయిన తర్వాత వధువును అత్తగారింటికి సారె కావిళ్లతో పంపించడం, అప్పగింతలు పెట్టడం ఆచారం. వధువు పెద్దల కందరికి మొక్కి వెళ్తుంది. ఆ విషయాల్ని 'సారె పెట్టకుండా పంపుతున్నాను కూతురా నోరు పెట్టుక బ్రతుక మన్నదట' (సా), 'చైత్ర వైశాఖాల్లో పెండ్లి కావిళ్ల (సారె) శ్రావణ భాద్ర పదాల్లో దినం కావిళ్లు', 'అందరి కాళ్లకు మ్రొక్కినా అత్త గారింటికి పోక తప్పదు' అనే సామెతలు తెలుపుతాయి.

(బి) పెండ్లి కొడుకు - పెండ్లి కూతురు (27)

యథేచ్ఛగా తిరిగే పురుషుడు, పెండ్లి అవుతూనే ఇంటికి కట్టుబడి పోవాల్సి వస్తుంది. పెండ్లి కూతుర్ని ముందు బాగా చూచుకొని చేసుకోవాలి. తర్వాత కొంత చూచీ చూడనట్లు పోవాలి. అరువు వస్తువుల్తో పెండ్లి చేసుకుంటే పరువు పోగొట్టుకో వాల్సి వస్తుంది. ఆ విషయాల్ని 'అయిందిరా పెండ్లి అంటే అణిగిందిరా రంధి' అన్నాడట', 'పెళ్ళికి ముందు కళ్లు బాగా తెరుచుకొని ఉండి పెండ్లి కాగానే సగం మూసుకోవాల', 'ఎరువుల సొమ్ములు యెరువులవాడు యెత్తుకొని పోతే పెండ్లి కొడుకు ముఖాన పేడ నీళ్లు చల్లినట్లే ఉంటుంది' (కార్. 2227) అనే సామెతలు చెపుతాయి.

ఇష్టంలేని వానితో గాని, వృద్ధునితో గాని పెండ్లి జరిగితే ఆడ పిల్లకు నర కమే. గొప్పింటి పిల్ల అయినా మొగునికి అణిగి మణిగి ఉండాల్సిందే. స్త్రీ పునర్వి వాహం కొన్ని కులాల్లో తప్పుగాదు వడ్డె వారిలో 'స్త్రీ ఏడుసార్లు వివాహ వేదిక ఎక్క వచ్చును' అని ఒక సామెత ఉంది (థర్స్టన్). ఈ విషయాల్ని 'మనసిచ్చీ మనే సివ్వక మనువుకు పోతే నిలుచున్నట్లే నిద్ర వచ్చిందట', 'ఇచ్చుర్ల పసుపు

వేసుకొంటే వికారము ముసలివాని చేసుకుంటే వాకారము' (హైసా- 2), 'షావ్కా సాహెబు కూతురైనా పెండ్లి కొడుక్కు పెండ్లామే', 'ఏడు మనువులు వెళ్లినా ఏకుల రాట్నం తప్పలేదు'. 'మొదట చెడ్డ పెండ్లి కూతురా గరిగ బుడ్డి బాగా పట్టు' (సా) అనే సామెతలు తెలుపుతాయి.

(క) గర్భాదానం (9): దీన్నే శోభనం, కార్యం, నిషేకం అని కూడా అంటారు. వయో వివాహాచారాల కాలంలో అయిదు రోజుల పెండ్లి కార్యం లోనే శోభనం జరిగి పోయేది.12 శోభనం నాడు సిగ్గుతో తలవంచుకొన్న వధువు ఎల్లకాలం గృహిణిగా సగర్వంగా తలెత్తు కొని తిరగవచ్చునని. దానాల్లో గర్భాదానం పుణ్య మని, సాతానివాని గర్భాదానం కొత్త చాప మీదనే జరుగుతుందని సామెతలు చెపు తున్నాయి. 'కార్యంనాడు తల వంచుకొని కలకాలం తలెత్తి తిరగవచ్చు', 'దానా లలో కెల్ల గర్భాదానం పుణ్యం', 'చుట్టక పోయే చాప, మూసుక పోయే తలుపు. అలిగి పోయే పెండ్లాము', 'సీతాపతే చిరి చాపే గతి' అని సామెతలు. గర్భాదానం అంటే ఏమిటో సూటిగా చెప్పే సామెత 'గర్భాదానం అంటే వడలు తినడ మను కొన్నానే గుద్దదిరేవనే అన్నదట-కొత్త పెండ్లి కూతురు' అనేది.

(ఖ) మనుగుడుపులు - తోడి పెండ్లికొడుకు(10) ;

పెండ్లి అయిన తరువాత అత్తగారు అల్లునికి కొన్నాళ్ల పాటు షడ్రసోపేత మైన విందులు చేయడం-మనుగుడుపులు, అల్లెం, అల్లెదం తినడం అని అంటారు. నేతి పిండి వంటలు తిని అల్లుడు పుష్టిగా తయారవుతాడు. అల్లెంలో అతి రసాలు తప్పకుండా ఉంటాయి. ఆషాఢంలో అత్తగారింట అల్లుడు ఉండడం నిషేధం. అలుక పాన్పుపై అల్లుడు ఏది కోరితే అది ఇవ్వాల్సిందే. ఈ విషయాల్ని తెలిపే సామెతలు: 'అత్త యింట అల్లుని చూడాలి, ఆముదపు చేలో ఆబోతును చూడాలి'. 'మనుగుడుపు పెండ్లి కొడుకు వలె', 'అతి రసాలు లేనిదే అల్లెం కాదు', 'ఆషాఢ ములో కొత్త అల్లుడు అత్తగారింట్లో ఉండరాదు', 'అలుక పాన్పు మీద అల్లుడలి గితే అత్త కంగారు పడ్డట్లు' అనేవి.

పెండ్లి కొడుకుతో పాటు పెండ్లి కొడుకు సోదరుడు లేదా సోదరుని వరుసవాడు తోడి పెండ్లి కొడుకుగా పెండ్లి పీటలపై కూర్చుంటాడు. పెండ్లి కొడుకుతో పాటు వెళ్లి అల్లెదం తింటుంటాడు. అల్లునికి విందులు చేయడంలో బాధ లేదు గాని తోడి పెండ్లి కొడుక్కు కూడా విందులు చేయడం అత్త మామలకు ఇష్టం ఉండదు. ఆ విషయాన్ని 'అల్లుడిని చూపి, యీయన నా కూతురు మొగుడు, తోడి పెండ్లి

కొడుకును చూపి, యీయన నా మొగుడు. ఆరు నెలల నుంచి ఉన్నాడు అన్నాడట' అనే సామెత చెపుతుంది.

4.4.2 పాతివ్రత్యం (19) : భర్త మీద భక్తి గలిగి, అతడు చెప్పినట్లు నడుచుకొంటూ, పర పురుషుని కోరని స్త్రీ పతివ్రత. పతి వ్రతా ధర్మం పాతివ్రత్యం. తనలో రంకు బుద్ధి లేకుంటే ఇల్లాలు ఎక్కడున్నా పతివ్రత గానే ఉంటుందని, వయసులో అడ్డ దిడ్డంగా తిరిగి వార్ధక్యంలో మంచిగా ఉన్నా అది పతి వ్రతాత్వం కాదని, పతి భక్తి చూపేందుకు నిప్పులు తొక్కేవారని, పచ్చి కుండలో నీళ్లు పోసే వారని సామెతలు తెలుపుతున్నాయి. సీతాదేవి అగ్ని పరీక్షలో నెగ్గడం ఈ సందర్భంలో మనకు గుర్తుకు రాక తప్పదు. ఈ విషయాల్ని తెలిపే సామెతలు 'తాను పతివ్రత అయితే సాని యింట కాపుర ముంటే మాత్రమేమి', 'పాపటలో వెంట్రుక నరిస్తే పతిత్తు', 'పతి భక్తి చూపిస్తాను మగడా, చెప్పులు తేరా! నిప్పులు తొక్కుతాను', 'పచ్చి కుండలో నీళ్లు పోయి పీ పాతివ్రత్యం తెలుస్తుంది అన్నట్లు' అనేవి.

స్త్రీ శీల రక్షణకోసం ఇనుప కచ్చడాలు ఉపయోగించేవారని, కొంత మంది స్త్రీలు ఏదో ఒక విధంగా ఆ బంధాలు తెంచుకొని తమ కోర్కెల్ని తీర్చుకొనేవారని 'ముద్ర ముద్రగానే ఉండగానే ముగ్గురు బిడ్డల తల్లి అయినట్లు' అనే సామెత తెలుపుతున్నది.

పండుగ దినాల్లో స్వేచ్ఛాప్రణయ ముండేదని 'పండుగ నాడూ పాత మొగుడేనా' 13, 'పండుగ నాడూ పాత పెండ్లామేనా' 14 అనే సామెతలు తెలుపుతాయి.

4.4.3 ముత్తైదువతనం (19) : ఐదు మాంగల్య చిహ్నాలుండే స్త్రీ ఐదు వరాలు, ముత్తైదువ. ఆ చిహ్నాలు మంగళ సూత్రం, పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు అనేవి. అవిధవా అనే సంస్కృత శబ్దానికి అయిదువ తెలుగు పదం అని భాషా శాస్త్రజ్ఞుల నిరూపణ. భర్త ఎట్లాంటి వాడైనా స్త్రీ ముత్తైదువగా ఉంటేనే గౌరవం. ఆ విషయాన్ని నొక్కి చెప్పే సామెతలు 'అలంకారం కంటె అయిదువ తనం మేలు', 'పుస్తే పూసా పసుపు పుని స్త్రీకి', 'పట్టెడు బొట్టుంటే పదిలక్షలు', 'కంచు మెట్టె మట్టిగాజు ఉంటే కావలసిందేముంది' 'మూడునాళ్ల ముత్తైదువ తనానికి ఆరు జోళ్ల లక్కాకులు' (చెవ్వాకులు) అనేవి.

4.4.4 వైధవ్యం (48) : విధవకు హిందూ సంఘంలో స్థానం లేదు. పేరంటాలకుగాని, శుభ కార్యాల్లో పాల్గొనేందుకుగాని ఆమెకు అర్హత లేదు. ఆమె

మొగం చూడ్డం అపశకునంగా భావించడమే గాక ఆమె చేతి భోజనం తినేదానికి కూడా అసహ్యించుకొంటారు..... 'విశ్వస్తవడ్డింపగన్' భోంచేశానని శ్రీనాథుడు వాపోయాడు. బ్రాహ్మణ కులంలో విధవకు శిరోజాలు తీయించి ముసుగు వేస్తారు. ఆ అభాగిని పుస్తె, పసుపు, కుంకుమ, గాజులు, మెట్టెలు, పూసలు, పూలు శాశ్వతంగా కోల్పోతుంది. భర్త చనిపోవడానికి ఆమె కాలు పెట్టిన దుర్ముహూర్తమే కారణమట. ముండమొయ్యడం, తాళి తెంపడం అంటే భర్త చనిపోయిన స్త్రీని విధవగా చేసే కార్య క్రమం. భర్త చచ్చిన పదవనాడు ముత్తైదువ పసుపు, కుంకుమలు తీసేస్తారు. విధవైనా వయసులో ఉన్న స్త్రీ కామంతో రంకు చేస్తే వేవిళ్ల తప్పవు. ఈ విషయాల్ని విశదీకరించే సామెతలు. 'అమ్మ గృహ ప్రవేశం, అయ్య అగ్ని ప్రవేశం', 'అదుగో పసుపు అంటే ఇదిగో ముసుగు అన్నట్లు', 'తాడు తెంచను ముహూర్త మెందుకు', 'పదియవ నాటి ముత్తైదువు వలె', 'తలలు బోడులైన తలపులు బోడులా', 'వెధవ ముండకైనా వేవిళ్ల తప్పవు' అనేవి.

విధవ అంచుచీర కట్టరాదనే నియమాన్ని 'అన్నీ ఉన్నాయి కాని అంచుకు తొగరు లేదు' అనే సామెత తెలుపుతున్నది. పురుషునికి భార్య చనిపోతే విధురత్వం వస్తుంది. పెండ్లి నాడు కొత్త మొలతాడు కట్టుకొన్న పురుషుడు భార్యకు దివసం చేసే సమయంలో మొలతాడు తెంచుకోవాల్సి వస్తుంది. అయితే నేం వెంటనే కొత్త మొలతాడు కట్టు కుంటాడు _ పెండ్లికి సిద్ధమౌతాడు. స్త్రీ తాడు తెగితే మళ్లీ తాడు వచ్చే అవకాశం లేదు. కొన్ని కులాల్లో తప్ప. ఆ విషయాన్ని చెప్పే సామెత 'వాడి తాడు తంగేళ్ల రేవులో తెంచుకొన్నాడు లే' (సా) అనేది.

4.4.5 పేరంటం (16): వివాహాది శుభ కార్యాలు జరిపేందుకు ఇరుగు పొరుగు ముత్తైదువలను పిలవడం, వారుచేసే కార్య క్రమాన్ని పేరంటం అంటారు. పేరంటాళ్లను పసుపు, కుంకుమ పెట్టి ఆహ్వానిస్తారు. పిలువని పేరంటం వెళ్తే గౌరవముండదు. కొంత మంది పురోహితులు పేరంటాళ్లను అద్దెకు పిల్చుక పోతారు. పేరంటాళ్ల కిచ్చే కానుకలు పురోహితులకు చెందుతాయి. అద్దె పేరంటాళ్ల అని తెలిసిన గృహస్థులు గౌరవంగా చూడరు. సిద్దిలో (నేయి పోసే తోలు వంచి) మిగిలిన మురికి వేసే వారికి గతి. ఈ విషయాల్ని 'పసుపు కుంకుమ కోసం పదామడైనా పరుగెత్తాల', 'పసుపూ, బొట్టూ పెట్టి పిలిస్తే వెళ్లక, పెంకు పట్టుకొని

పులుసుకు వెళ్లింవట', 'పిలవని పేరంటము చెప్పని ఒక్క పొద్దు', 'అద్దె పేరం టము సిద్దె మురికి' అనే సామెతలు వివరిస్తున్నాయి.

4.4.6 వ్రతాలు-నోములు (5) : పవిత్రంగా భావించే మాంగల్యాన్ని కాపాడు కొనేందుకు ముత్తైదువులు వివిధ వ్రతాలూ, పూజలూ, నోములూ చేస్తారు. నోములు ఎక్కువగా నోస్తే ఎక్కువ సుఖాలు వస్తాయంటారు. ఏకాదశి నాడు ఉపవాసం చేయాలి. నాగపూజ, ఏకాదశి, తవుడు నోము అనేవి సామెతల్లో ప్రసక్తికి వచ్చాయి. (సంతానంకోసం చేసే పూజలు గొడ్రాలు అనే శీర్షికలో (4.4.7) చర్చింపబడ్డాయి) 'పుట్టలో పాలు పోసి పొట్ట పట్టుకొని చూచినట్లు', 'తెద్దు నాకి ఉప వాసం చెడ గొట్టు కొన్నట్లు', 'తవుడు నోము పట్టిన అమ్మకు తరగని ఐదువ తనము', 'తక్కువ నోములు నోచి ఎక్కువ ఫలం రమ్మంటే వస్తుందా' అనే సామెతలు పై విషయాల్ని తెలుపుతున్నాయి.

4.4.7 గొడ్రాలితనం (16) : సంతానవతికి సంఘంలో ఉన్న గౌరవం గొడ్రా లికి లేదు. గొడ్రాలి మొగం చూస్తే పాపమని, అపశకునమని భావిస్తారు. పిల్లల్ని కనడం తన స్త్రీత్వానికి సార్థకంగా ప్రతి వివాహితా తలుస్తుంది. స్త్రీలు పిల్లల కోసం ఎన్నో పాట్లు పడతారు. పెద్దల చేత, సన్యాసుల చేత దీవనలు పొందడం, తాయె త్తులు కట్టించుకోవడం, నాగులకు పుట్టలో పాలు పోయడం, అశ్వత్థ ప్రదక్షిణం చేయడం, భర్తతో సరి గంగా స్నానాలు చేయడం, సప్త సాగర యాత్ర పోవడం లాంటివి. సామెతల్లో ఈ కార్యాలన్నింటినీ పరిహసించడమూ, వ్యతిరేకంగా చూడడమూ జరిగింది. ఆ సామెతలు: 'అర్జీలకు పనులు కావు ఆశీర్వచనాలకు బిడ్డలు పుట్టరు'. 'వెంకమ్మకు అంక్ష వేస్తే పుల్లమ్మకు బిడ్డ పుట్టినదట', 'తాయెతు లకే పిల్లలు పుడితే తానెందుకు'. 'పుట్టలో పాలు పోసి పొట్ట తడుము కొన్నట్లు'. 'రాగి చెట్టుకు ప్రదక్షిణాలు చేస్తే బిడ్డలు పుట్టుతారంటే చుట్టూ చుట్టుకు పొట్ట చూచు కొన్నదట', 'సాటి వారితో సరి గంగ స్నానాలు చేస్తుంటే ముసలి మొగుణ్ణి కాస్తా మొసలెత్తుక పోయిందట', 'సంతానాని కని సప్త సాగర యాత్ర వెళితే ఉప్పు నీరు తగిలి ఉన్నది కాస్తా ఊడ్చుక పోయినదట' అనేవి.

4.4.8 గర్భధారణ-ప్రసవం (4) : గర్భవతికి రక రకాల కోరికలు కలుగు తుంటాయి. వీలున్నంత మేరకు కుటుంబ సభ్యులు తీరుస్తుంటారు. కోర్కెలు తీరక పోతే కాళ్లు చేతులు మొగం గర్భవతులకు వాస్తాయని, శిశువుకు అంగ వైకల్యం వస్తుందని జానపదుల అభిప్రాయం. ప్రసవ సమయంలో నొప్పులకు 'ఇంక

పిల్లలు వద్దు బాబోయ్' అనుకోడం. వళ్ళు వచ్చి ఆరుతూనే మళ్ళీ ఇంకో పిల్లకోసం ఉవ్విళ్లూరడం స్త్రీ జన సామాన్యం. ఈ విషయాల్ని 'ఓపనివారు కోరనిదీ ఒంటని వారు అడవనిదీ లేదు' (కాల్. 489), 'ప్రసూతి వైరాగ్యం వంటి పచ్చి ఆరే దాకనే' 'ప్రసూతి వైరాగ్యం, శ్మశాన వైరాగ్యం' (కార్.1578) అనే సామెతలు చక్కగా తెలుపుతాయి.

4.4.9 పిల్లలకు చేసే సంస్కారాలు (10) :

నామకరణం చేయడం, అన్న ప్రాశనం, చెవులు కుట్టడం, ఉపనయనం అనేవి సామెతల్లో ప్రస్తావించబడ్డాయి. 'పెద్దలు పెట్టినది పేరు, ప్రేమతో పెట్టినది ఊరు', 'బిడ్డ వచ్చినా బారసాల బాగా జరిగింది'. 'అన్న ప్రాశనం నాడే ఆవ కాయ దిప్పా', 'అబ్బురాన బిడ్డ పుట్టింది గడ్డపార తేరా చెవులు కుడతాను అన్నా డట' అని సామెతలు. 'బోర్ల పడినపుడు బొబ్బట్లు, ప్రాకులాడినపుడు పాల కాశి కలు, అడుగులు పెట్టినపుడు అరిశలు పంచమన్నారు' (పసి బిడ్డలకు) అని ఒక సామెత బోధిస్తున్నది.

4.4.10 సహగమనం (9) : ఇది ఉత్తర హిందూస్థానాచారం. కాకతీయుల కాలంలో, రెడ్డి రాజుల కాలంలో ప్రారంభమై అరుదుగా అక్కడక్కడ జరుగు తుండేది. విజయనగర సామ్రాజ్య కాలంలో వ్యాపించింది. దీన్నే సతి లేక సహ మరణం అంటారు. సతిని భర్త చితిపై కాల్చడం లేదా భర్తతో పూడ్చడం జరిగేది. సహగమనం అరుదుగా పెద్ద కులాల్లో వ్యాప్తి పొందింది[15]. సహగమనం చేసేం దుకు ఆత్మ స్థైర్యం. బాధ నోర్చుకొనే సహనం ఉండాలి. స్త్రీ సతి చేసేందుకు జంకేటప్పుడు ప్రజలు ప్రోత్సహించేవారు. ఈ విషయాల్ని తెలిపే సామెతలు 'పేణ్ణీ ళ్లకు వోర్వ లేనమ్మ సాగుమానము చేస్తానన్నదట' (కార్. 2021), 'దూకు దూకు మనే వాళ్లే గాని దూకే నా లంజ కొడుకు ఒక్కడూ లేడు', 'దిగు దిగు మనే వా సవితే గాని దిగే నా సవతి లేదు' అనేవి.

4.4.11 సమర్త (15) : మొట్ట మొదటి ముట్టు సమర్త. 12 - 16 సంవత్సరాల మధ్య బాలికలు పుష్పవతు లౌతుంటారు. సమర్త అయినప్పుడు కట్టు కొని ఉన్న చీర ఇంటి చాకలి స్త్రీకి ఇచ్చే ఆచారం ఉంది. ముట్టయిన స్త్రీ కుంప ల్లోకి రాకూడదు. మూలన కూర్చుండ బెడతారు. సమర్త అయిన బాలికకు పెండ్లి అయి ఉంటే అత్తవారు, లేకుంటే ఇతర బంధువులు సమర్త కట్నాలు తెస్తారు. సమర్తాడిన బాలికను ఎన్నో భూతాలు ఆశ్రయించుకొని ఉంటాయని, అవి ఇతరుల

కెవరికైనా కీడు చేయొచ్చునని జానపదుల నమ్మకం. ఈ విషయాల్ని తెలిపే సామెతలు 'ముసలి ముప్పున తొలి సమర్త', 'సరదాకి సమర్తాడితే చాకలిది కోక దొబ్బింది'. 'కూతురు ముట్లు కుండల్లో కోడలి ముట్లు కొండల్లో' (శ్రీపాద). 'ముట్లు ముడిగిన తరువాత సమర్త సారె పెట్టినట్లు', 'సమర్త యీడు చాకలి దాన్ని కొట్టింది' అనేవి. పెండ్లి అయిన బాలిక సమర్తయితే గర్భాదానానికి సిద్ధమైనట్లే. ఇష్టం లేని మనువును కట్టు కొన్న ఒక బాలిక మాటలే 'ఇంత చక్కని మగవాడికి సమర్తాడుదునా' అనే సామెత.

4.4.12 దానాలు చేయడం (33): దానం చేయడం ప్రతి మతంలో కూడా ఒక ఆచారమే. తమకున్న దానిలో అంతో ఇంతో ఇస్తే పుణ్యం వస్తుందని, దానమివ్వనివాడు దరిద్రుడై పుడతాడని. గుప్తదానం మంచిదని అపాత్ర దానం చేయరాదని సామెతలు తెలుపుతాయి. చనిపోయిన వ్యక్తి ఆత్మను గోదానం వైతరిణీ నదిని దాటిస్తుందని; హిరణ్య దానం, కన్యాదానం పుణ్య ప్రదాలని; ఈగకు ఇలి, పాముకు బలి, చిలకకు చక్కెర, చీమకు పంచదార దానం చేయాలని, దానం ఇస్తే శని పోతుందని అన్నం తినేందుకు ఆకు ఇవ్వడం పుణ్యమని, ఒక చెడ్డ పని చేసి దానం చేస్తే పుణ్యం రాదని ఈ సామెతలు తెలుపుతాయి. 'మూడు జన్మల సంగతి చెప్పగలను, పూర్వ జన్మలో ఇచ్చి పెట్టుకో లేదు కనుక ఈ జన్మలో దేవుడు నాకీయ లేదు, కనుక ముందు జన్మలో నాకేమి ఉండదు', 'కుడి చెయ్యి చేసే దానం ఎడమ చెయ్యి ఎఱుగ రాదు', 'పాత్ర ఎఱిగి దానము గోత్ర మెరిగి బిడ్డనూ ఇవ్వవలె', 'ఇటయితే వైద్య కట్నం అటయితే వైతరిణీ గోదానం', 'ఇస్తే హిరణ్య (బంగారు) దానం, లేక పోతే కన్యాదానం'. 'ఈగకు ఇలి లేదు పాముకు బలిలేదు', 'చిలుకకు చక్కెర, చీమకు పంచదార', 'చిలుం వదిలితే ఛిద్రం వదులుతుంది', 'అడక్కుండా చెప్పు లిచ్చాడు, అడిగితే గుఱ్ఱమిస్తాడని అనుకొన్నట్లు', 'ఆకు ఇస్తే అన్నం పెట్టినంత పుణ్యం'. 'చెట్టు నరికి పండ్లు దానము చేయగానే సుకృతి అగునా' అని సామెతలు.

4.4.13 మంత్రాలు (10): వేర్వేరు కార్యాలకు వేర్వేరు మంత్రాలుంటాయి. పురోహితుడు అవివేకో, అసమర్థుడో అయినపుడు ఒకే మంత్రం అన్నిటికీ పఠిస్తాడని, తేలు, పాము కాటులకు మంత్రాలున్నాయని సామెతలు చెపుతున్నాయి. 'తలప్రాలకు తద్దినాలకు ఒకే మంత్రమా', 'పిడుక్కూ బియ్యానికీ ఒకే మంత్రమా', 'ఎద్దు వలె ఉన్నావే తేలు మంత్రం తెలియదా', 'పెమ్మకట్ల వారి మంత్రం దెబ్బ

అంటే కమ్మ కట్ట పాము కాటైనా దిగి పోతుంది' అనేవి. 'వాతాపి జీర్ణం వజ్ర శరీరం' అనేది అగస్త్య మంత్రం. 'అగస్త్య మంత్రం పలకడం' అని సామెత.

4.4.14 మరణం - ఆచారాలు (55) : మరణ సంబంధి విషయాల్లో చావు. కాటికి చేర్చడం, దింపుడు కళ్లం, కొరివి పెట్టడం, పిండ ప్రదానం, తర్పణాలు వదలడం, మాసికం, తద్దినం అనే ఆచారాలు సామెతల్లో ప్రస్తావించబడ్డాయి. మరణించిన వారి బంధువులకు చావు విషయం మెల్లగా, పరోక్షంగా చెప్పాలనేది మనో వైజ్ఞానిక దృష్టితో చూస్తే సమంజసమైనదే. వల్ల కాట్లో వున్నంతసేపు అందరూ లౌకిక ప్రపంచం వ్యర్థం అంటారు. శవాన్ని అలంకరిస్తారు. రాచ పీనుగు సైనికులు, అంగ రక్షకులు, లేక పోతే ఏదో ఒక జంతువుతో నైనా తోడుగా పోతుంది. ఇప్పటికీ దుర్ముహూర్తంలో చనిపోతే శవంతో పాటు ఏ కోడిపిల్లనో కలిపి ఖననం చేస్తారు. తల్లి దండ్రుల చితికి కొడుకు కొరివి పెడతాడు. చనిపోయిన వెంటనే శవం నోట బియ్యం పోస్తారు. తల దగ్గర దీపం పెడతారు. శవాన్ని శ్మశానం దారిలో ఒక చోట దించుతారు. దీన్నే దింపుడు కళ్లం అంటారు. పూర్వ మెప్పుడో అలా దించినపుడు శవానికి ప్రాణం వచ్చిందని, అప్పటి నుంచి అది ఆచారమైందని తెలుస్తున్నది. కాటి కాపరికి కాసు ఇవ్వాల్సి ఉంటుంది. బ్రాహ్మణుల ఇండ్లలో శుభానికి కంది పప్పునూ, అశుభానికి పెసర పప్పునూ వాడుతుంటారు. ఈ విషయాల్ని చిత్రించిన సామెతలు 'చావు కబురు చల్లగా చెప్పమన్నట్లు', 'వల్లకాటి వైరాగ్యం, పురిటాలి వైరాగ్యం', 'శవానికి చేసిన అలంకారం వలె', 'రాచ పీనుగు తోడు లేకుండా పోదు', 'కొరివి పెట్టేవాడు కొడుకు, కూడు పెట్టేది కూతురు'. 'పగలు చస్తే వాతికి లేదు, రాత్రి చస్తే దీపానికి లేదు', 'దింపుడు కళ్ల మాశ', 'కాటికి పోయినా కాసు తప్పదు', 'అటయితే కందిపప్పు ఇటయితే పెసర పప్పు' అనేవి.

పితృ దేవతలకు అర్పించే అన్నం ముద్ద పిండం. 'తిలలతో కూడిన జలం పితరులకు వదిలేది తర్పణం. అబ్దికం వరకు నెల నెలా చేసే శ్రాద్ధం మాసికం. సంవత్సరాని కొకసారి చేసేది తద్దినం. 'అశ్రద్ధ పితాళ్లకు ఏతాం తర్పణం' అనే సామెత ఏతాం తొక్కేవాణ్ణి పితరులకు తర్పణం వదలమన్నపుడు వాడు ఏతాం నీళ్లే తర్పణం అన్నాడట అనే విషయాన్ని తెలుపుతున్నది. తర్పణాల మీద నమ్మకం లేని వాతన్న మాటలివి. పితరులు కాకి రూపంలో వచ్చి పిండాలు స్వీకరిస్తారు అని ఆచారం చెప్పగా 'పీయి తినెడి కాకి పితరుండు ఎట్లాను' అని వేమన

ప్రశ్న. 'మందుకు పోయినవాడు మాపికానికి వచ్చినట్లు' అనే సామెత మాపికానికి సంబంధించింది. తద్దినం నాడు శూద్రులు తాత్కాలిక జంద్యం వేసుకుంటారని, తద్దినం అన్నదమ్ములే పితరులకు పెట్టాలని, పనసకాయ శ్రాద్ధాల్లో దానం చేస్తుంటారని సామెతలు చెపుతున్నాయి. 'తద్దినం నాటి జందెం వలె', 'అన్నెం పున్నెం తినడానికి ఆలి తమ్ముడు, అబ్బ తద్దినం పెట్టడానికి మగని తమ్ముడు', 'పనసకాయ దొరికినపుడే తద్దినం పెట్టమన్నట్లు' అనేవి. వేశ్యకు, ఆమె కొడుక్కు పితరు లెవరో తెలియదని పరిహసించే సామెతలు 'లంజ పితాళ్లకు పెట్టి ఆకాశం చూచిందట'. 'లంజ కొడుకు తండ్రికి తద్దినం పెట్టినట్లు' అనేవి.

**4-4-15 మరికొన్ని ఆచారాలు (19):** తులాభారం, భద్రం చెప్పడం, కూలికి ఏడవడం, పిడి, కోటికి పడగెత్తడం, సెలగ అనడం, కుడి, ఎడమ భేదాలు, చూపుడు కత్తి చూపడం, బోడితల గొరుగు కోవడం, చీర పెట్టడం, కన్నెరికం, అనే ఆచారాలు ఈ శీర్షికలో చెప్పబడతాయి. రాజులు తులా భారం (1) తూగే ఆచారం ఉండేది. తిరువాన్కూర్ మహారాజా, రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు తులాభారం తూగారు. రాజు తన బరువుండే బంగారు నాణేలు, నగలు తూచి బ్రాహ్మణులకు దానం చేయడమే తులాభారం. 'వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు తులాభారం తూగితే కరెడ్ల కామక్క వంకాయల భారం తూగిందట' అనే సామెత ఉంది.

భద్రం చెప్పడం (1): కీడు కలిగే వీలున్నప్పుడు జరగ కూడదని శుభం కోరు కుంటూ ముందు జాగ్రత్త చెప్పడాన్ని భద్రం చెప్పడం అంటారు. చెట్టెక్కే వాన్ని 'భద్రంగా ఎక్కు' అనడం, చీకటిలో వెళ్లేవాన్ని 'పురుగూ పుట్రా ఉంటుంది భద్రంగా పో' అనడం లాంటివి. 'ముందు ముల్లు త్రొక్కి వెనుక భద్రం అన్నట్లు' అని సామెత.

వచ్చే వారికి స్వాగతం చెప్పడం, వెళ్లేవారికి ఆసీమాంతం చెప్పడం: (2) వెళ్లేవార్ని నీటి దాకానో, కోట దాకానో సాగ నంపడం ఆచారాలు. 'వచ్చే వాళ్లకు స్వాగతం, వెళ్లే వాళ్లకు ఆసీమాంతం', 'కోట వరకు, నీటి వరకు సాగనంప వలెను' అనేవి సామెతలు

కూలికి ఏడవడం (1): నగరాల్లో ధనికులు చనిపోతే ఏడ్చేందుకు కూలికి స్త్రీలను పిలిచే ఆచారం ఉంది. ఆ విషయాన్ని తెలిపే సామెత 'కూలికి ఏడిస్తే కొలుకులు తడౌతవా?' అనేది.

సిడి (2) : విజయనగర సామ్రాజ్య కాలంలో స్త్రీలు మొక్కుబడి చెల్లించు కోవడానికి సిడి ఊగే ఆచారం ఉండేది.16 స్త్రీ నడుముకు మాత్రమే బట్ట కట్టుకొని, వీపు చర్మంలోకి సిడి గాలం గ్రుచ్చి సిడి మాను పైకి వేలాడ దీసినప్పుడు గాలిలో వేలాడు తుంటుంది. 'నే నాదేదే బండి సిడి ఆట. మా పెద బావ చూస్తాడంటే ఎలా' అనే సామెత ఈ విషయాన్ని తెలుపుతుంది గాలపు సిడి కాకుండా గంప సిడి ఉండేది. గంపలో కూచొని సిడి తిరగడం గంప సిడి. గంప సిడి నిరపాయం, వేదన లేనిది. 'గంప సిడి కాదు గాలం సిడి' అనే సామెత పై విషయాన్ని తెలిపేది.

కోటికి పడగెత్తడం (4) : ఒక కోటి ధనానికి ఒక జెండా తమ ఇంటి మీద ఎగురవేసే ఆచారం ఉండేది. 'కాసుకు గతి లేదు కోటికి కొడి ఎత్తినాడు', 'కోటికి పడగెత్తు వాణ్ణి పదివేల కాపవై బ్రతుకు మన్నట్లు' అని సామెతలు.

సెలగ అనడం (2): 'కొలవడంలో, లెక్కించడంలో ఒక సంఖ్యను నిర్ణయించుకొని (20,50,100) ఆ సంఖ్య వచ్చినపుడు అంకెకు బదులు 'సెలగ' అని అంటారు (పందొమ్మిది-సెలగ)17. 'నూటిని పొడిచి శలగ అంటాడు' అని సామెత. సెలగలో ఎక్కువ సంఖ్య 100, తక్కువ సంఖ్య 20. ఎక్కువ సంఖ్యకు బదులు 'సెలగ' అనడం గొప్ప విషయం. వీరులు నూరు మంది శత్రువుల్ని చంపి ఒక సెలగ అయింది అనే వారనే సంగతి ఈ సామెత చెపుతున్నది.

కుడి - ఎడమ (3) : గొల్ల, మాల, కుమ్మరి ఇలా కొన్ని కులాల వారు కుడిపైట వేసుకుంటారు. కొంత మంది కుడి వైపుకు. కొంత మంది ఎడం వైపుకు కొప్పు పెట్టుకొంటారు. ఇవి కులాచారాలు. 'కులానికి కుడి పైట, అందానికి ఎడమ పైట'. 'కూడుండగానే కులాల వాళ్ల కుడి పైట మారదు' 'కుంచెడుంటే కుడి కొప్పు, అడ్డెడుంటే ఎడమ కొప్పు' అనేవి సామెతలు.

చూపుడు కత్తి (1) : జాతరలో పోతును నరికేటప్పుడు పైకెత్తి చూపించే కత్తి చూపుడు కత్తి. నరికే కొడవలి వేట కొడవలి. ఇలా చేయడం ఒక ఆచారం. 'చూరు కత్తి తెగుతుంది గాని చూపుడు కత్తి తెగుతుందా' అనేది సామెత.

చీర పెట్టడం (1) : సంవత్సరాని కొకసారో, శుభకార్యాలకో అక్క చెల్లెండ్లకు దగ్గరి బంధువులకు చీర, సారె పెట్టి పంపడం ఆచారం, 'తల్లికి కూడు పెట్టని వాడు పిన తల్లికి చీర పెట్టాడట' అని ఒక వ్యంగ్య సామెత.

కన్నెరికం (1) : వేశ్య మొదటి నిషేకం కన్నెరికం. కన్నెరికం చేసేవాడు వేశ్య కొంగున ఒక కాసు ముడివేసే ఆచారం ఉంది. ఆ విషయం తెలిపే సామెత 'కన్నెఱికానికి కాసు లేని వాడు కల కాలం కాపాడ గలడా' అనేది.

బోడితల (3) : గ్రామ శాంతికోసం వెట్టివానికి బోడితల చేస్తారు. గ్రామ జాతరలో వాన కోసం కుర్రుని ఉంపుడు గత్తె 'కోడుంబావి' బొమ్మను పూజించి, చివర్లో అంత్య క్రియలు చేస్తారు. వెట్టి గుండు గొరిగించుకొని ఈ కార్యక్రమం చేయాల్సి ఉంటుంది. 'గ్రామ శాంతికి బోడితల గొరుగు కోవడం' అనే సామెత పై విషయాన్ని చెప్పేది.

4.4.16 పై విధంగా వ్యక్తి గర్భంలో పిండంగా ఉన్నప్పటి నుంచి ఆ వ్యక్తి చావు తర్వాతి సంస్కారాలదాకా ఉండే వివిధ ఆచారాలు సామెతల్లో ప్రతిబింబించాయి. పెండ్లికి సంబంధించిన ఆచారాలుండే సామెతలు ఎక్కువగా ఉన్నాయి. తర్వాతి స్థానం మరణ సంబంధి ఆచారాలను తెలిపే సామెతలది.

సూచికలు :-

1. పరాశరస్మృతి-ఆచార్య నిరూపణము. శ్లో. 37
2. మనుస్మృతి-అధ్యా. శ్లో. 156
   పై రెండూ 'పల్లె పదాలలో ప్రజా జీవనము' పుట. 262 లో ఉటంకితాలు.
3. పల్లె పదాలలో ప్రజా జీవనము. పుట. 262.
4. ... పెణ్ణాస — ఆడుదాని మీద ఆశేగాని మరొకటి కాదు. ఆ పెణ్ ఇల్ అవుతుంది. ఇల్ అంటే ఇల్లు. పెణ్ ఇల్ అవడమే పెండిల్ (ఆది ద్రవిడ భాషా సంధి) అదే మన పెండిలి, పెండ్లి. ఆఖరికి పెళ్లి. పెళ్లి-దాని పుట్టు పూర్వోత్తరాలు (పుట. 57).
5. పల్లె పదాలలో ప్రజా జీవనము. పు. 269.
6. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పు. 344
7. పల్లె పదాలలో ప్రజా జీవనము. పు. 269.
8. పెళ్లి - దాని పుట్టు పూర్వోత్తరాలు. పుట. 93-94
9. పల్లె పదాలలో ప్రజా జీవనము. పుట. 276.
10. ఆర్య సాంప్రదాయిక (బ్రాహ్మణ) పెండ్లిండ్లలో సప్తపది తర్వాత, సన్నెకల్లు మీద పెండ్లి కూతురు చేత కాలు బెట్టించి, వధువు తల్లి కొన్ని హిత

వాక్యములు పలుకును. వాటి భావమిది: "మంచి చెక్డలలో నీ హృదయాన్ని గట్టి చేసుకో. దుర్మార్గుడెవడైనా వచ్చి శీల భంగము చేయ ప్రయత్నించినచో వాడి ఎదకు ఈ రాయి తాకినట్లు తాకు" అని. (తెలుగు సామెతలు. పుట. 569.)

11. అభిలషితార్థ చింతామణి (ఆంధ్రుల సాంఘిక చరిత్రలో ఉటంకితం. పు. 27)

12. పల్లె పదాలలో ప్రజా జీవనము (పుట. 292.)

13. ఆ రోజులలో - అంటే పండుగలకూ, పబ్బాలకూ అతిథులు వచ్చినప్పుడూ పై చేతులు చూస్తూనే ఉండాలి - విధిగాను. (పుట. 31) .... ఇప్పటికీ కొన్ని స్థలాలలో పండుగలూ_పబ్బాలు జరిగినప్పుడు చూడాలి. అన్ని నియమాలకు ఆ నాడు సెలవు. ఎవరు ఎవరితో జతకడుతున్నారో అడిగేవాడూ, చూసేవాడు లేడు. (పెళ్లి - దాని పుట్టు పూర్వోత్తరాలు. పుట. 51)

14. రవికల పండుగ (కంచుకోత్సవం) సంవత్సరానికొకసారి చేస్తారు. పండుగ నాడు స్త్రీలందరూ కోవెలలోకి వచ్చి. రవికలు విప్పి పోగు వేస్తారు. పురుషులు వచ్చి ఒకో రవిక తీసుకుంటారు. ఇష్టమున్నా లేకున్నా ఆ రవిక తీసుకొన్న పురుషుడు స్త్రీ ఆ రాత్రికి భార్యా భర్తే. (దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు? పుట. 94-95)

15. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. (పుట. 168 — 169.)

16. ఆంధ్రుల సాహిత్య చరిత్ర. (పుట. 290)

17. తెలుగు సామెతలు. (పుట. 369.)



## 4.5. తెలుగు సామెతలు - ప్రజల నమ్మకాలు

4.5 కార్యకారణ వివక్ష చేయకుండా ఒక విషయాన్ని విశ్వసిస్తే అది 'నమ్మకం' అని చెప్పవచ్చు. నమ్మకాలు మత, కుల పరమైనవి కావచ్చు. కాని చాలా నమ్మకాలను మనం కుల, మత పరాలుగా నిరూపించలేం. ఈ నమ్మకాలు ఆచారాల్లాగా తర తరాలుగా వ్యక్తులకు, సంఘానికి సంక్రమిస్తూ ఉంటాయి. ఉదా॥ తల్లి దండ్రులకు శకునాలపై నమ్మకం ఉంటే పిల్లలకు రావచ్చు. సంఘంలో అందరూ గాకపోయినా, కొందరైనా విశ్వసించి దాని ప్రకారం నడుచుకుంటుంటే అది నమ్మకమే అవుతుంది. ఈ సందర్భంలో ఒక వింత నమ్మకాన్ని ఉదాహరిస్తాను. ముట్టులో ఉన్న స్త్రీని ఎన్నో దుష్ట శక్తులు ఆవరించి ఉంటాయని ప్రాచీనుల నమ్మకం. ఒక ఊర్లో జరిగిన సంగతి ఇది. ముట్టులో వున్న అవివాహితను ప్రియుడు కలిశాడు. అతనికి విపరీతమైన జ్వరం వచ్చింది. అదేదో చెడ్డ జ్వరమే అని పెద్దలకిగి తెలుసుకొన్నారు. ఆ కన్య చేతి గాజు ముక్కతో ఆమె తొడ నుంచి రక్తం తీసి, రోగి కంటికి కాటుకలా పెడితే బాగవుతుందన్నారు కొందరు. ఆ అమ్మాయి ఒప్పుకోలేదు. అతడు చనిపోయాడు. అందువల్ల ముట్టయిన స్త్రీని కలిస్తే అపాయం అని ముందే ఒక నమ్మకానికి కట్టుబడిన ప్రజలకు ఇది ఒక సాక్ష్యం అయింది.

312 తెలుగు సామెతల ఆధారంగా ప్రజల నమ్మకాలు సామెతల్లో ప్రతిబింబించిన తీరును నిర్ణయించే ప్రయత్నం ఈ ఉప ప్రకరణంలో జరుగుతుంది. జ్యోతిష సంబంధి నమ్మకాలు, సాముద్రిక సంబంధి నమ్మకాలు, దృష్టి దోషం. శకునాలు, అరిష్టాలు, సోదె, కలలు, దిక్కులు, అదృష్ట దురదృష్టాలు, కృతఘ్నత, పాపం, మరికొన్ని నమ్మకాలు అనే పన్నెండు శీర్షికల విషయ నిరూపణ చేస్తాయి.

### 4.5.1 జ్యోతిష సంబంధి నమ్మకాలు (47) :

తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అనే ఐదు అంశాల్ని గురించి చెప్పేది పంచాంగం, ఏ శుభ కార్యం నిర్ణయించుకోవాలనుకున్నా ఈ అంశాలు సరిగా ఉన్నాయో లేదో చూస్తారు. ఆయుష్కర్మ అనే ముద్దు పేర్తో పిలవబడే క్షౌరం చేసుకోడానికి కూడా మంచి తిథి కావాలనుకుంటారు. పంచాంగం అడగడం అంటే శుభ కార్యాలకు తిథి, వార నక్షత్రాలు బాగున్నాయో, లేదో అడగడం, పంచాంగానికి సంబంధించిన సామెతలు: 'అంత పెద్ద పుస్తకం చంకలో ఉన్నది పంచాంగం చెప్ప లేవా అన్నట్లు', 'పగవాణ్ణి పంచాంగం అడిగితే మధ్యాహ్నానికి మరణం అన్నాడట' అనేవి.

సంక్రాంతితో మొదలయ్యే ఉత్తరాయణంలో మరణిస్తే పుణ్యమని ప్రజల నమ్మకం. భీష్ముడు శరశయ్యపై ఉండి, ఉత్తరాయణం వచ్చిందాకా మరణించ లేదు. 'ఉత్తరాయణం వచ్చింది ఉరి పెట్టుకోమన్నట్లు' అని సామెత.

అమావాస్య మంచిరోజు కాదు. ఆదివారం అమావాస్య అయితే మంత్రాలు నేర్చుకొనేందుకు చాలా శ్రేష్ఠం. ప్రతి పనికి తిథి మంచిదో కాదో చూస్తారని 'దినము మంచిదని తెల్లవార్లూ దోచినట్లు' అనే సామెత తెలుపుతుంది. అమావాస్య, పున్నమి, పాడ్యమి, పంచమి, అష్టమి అనే తిథుల ప్రసక్తి సామెతల్లో వచ్చింది. పాడ్యమి, పంచమి మంచి తిథులు. 'అమావాస్య నాడు ఎందుకు కయ్యానికి దిగినావంటే ఎదిరివాడికి అచ్చిరాకుండని' అన్నాడట ఒకడు. స్త్రీలు 'పున్నమ ముందు పుట్టింటికీ, అమాస ముందు అత్తవారింటికీ వెళ్లగూడదు' (గోసేవ నవంబర్, 1949) అని ప్రజలు నమ్ముతారు. పున్నానికి తేనె తుట్టెలో తేనె నిండుగా ఉంటుందని, అమావాస్యకు అయిపోతుందని 'పున్నానికి పూజ అమావాస్యకు అరగింపు' అనే సామెత తెలుపుతుంది. 'పాడ్యమి ప్రయాణానికి మంచిది' (నర), 'పంచమి నాడు పల్లకి ఎక్కనూ లేదు, అష్టమి నాడు జోలి పట్టమా లేదు' అని సామెతలు.

క్షౌరానికి తిథి, నక్షత్రం చూస్తారని, మూలా నక్షత్రం చెడ్డదని 'తల గొరిగించుకొన్న తరువాత తిథి, నక్షత్రం చూచినట్లు', 'పిల్లవాడు మూలా నక్షత్రంలో పుడితే మూలం పీకి వేసుక పోతాడు' అనే సామెతలు తెలుపుతున్నాయి.

వారాల్లో కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి అని ప్రజలు నమ్ముతారు. శుక్రవారం డబ్బు ఇతరులకు ఇవ్వరు. ఇస్తే సిరి క్షీణిస్తుందంటారు. మంగళ, బుధ వారాలు మంచివి కావు. చుట్టాలు రాకుండా ఉండేందుకు పొయ్యిలు చెడ్డ దినంలో వేయాలి ఒక్కో వారం ఒక్కో దిక్కుకు పోరాదు. దాన్ని వారశూల అంటారు. ఉదా॥ శని, సోమ వారాల్లో తూర్పుకు ప్రయాణం చేయకూడదు. పై విషయాల్ని తెలిపే సామెతలు: 'తన సొమ్ము సోమవారం, మంది సొమ్ము మంగళవారం', 'పొయ్యిలు చెడ్డ దినంలో వేయాలి, పెండ్లిండ్లు మంచి దినంలో చేయాలి', 'ఇల్లు ఇందువారం పొయ్యి బుధవారం' (కట్టాల), 'బుధవారం నాడు పులి కూడ బయలు దేరదు' (బయటికి తల పెట్టదు), మంగళ, బుధ వారములు పంచమ అల్లతాడు' (పా). 'శుద్ధి శుక్రవారము, మడి మంగళ వారము', 'పిడుగుకు వారశూలా' అనేవి.

నెలవంక దక్షిణం కొమ్ము హెచ్చుగా ఉంటే రాశి ఎక్కింది. కొలత తగ్గింది అంటారు, అంటే ధరలు పెరుగుతాయట (?). 'దక్షిణపు కొమ్ము హెచ్చు అయితే ధాన్యపు ధర హెచ్చు, ఉత్తరపు కొమ్ము హెచ్చు అయితే ఉప్పు ధర హెచ్చు' అని సామెత.

4.5.2 సాముద్రిక సంబంధి నమ్మకాలు (20):

భాగ్య సూచక లక్షణాన్ని తెలిపే శాస్త్రం సాముద్రిక శాస్త్రం. శరీరంలో అవయవాలుండే తీరు, రేఖలు, సుడులను బట్టి ఈ శాస్త్రం శుభా శుభాల్ని నిర్ణయిస్తుంది. దేహ లక్షణాల్ని బట్టి వ్యక్తుల గుణ గుణాల్ని చెప్పే సామెతలివి: 'నల్లని వాడికి నాభిలో విషం', 'పొట్టి వానిని పొడల వానిని నమ్మరాదు' (సాసా. 333), 'కుంటి వానికి కుయుక్తు లెక్కువ', 'హనుమంతుని మోర ఉంటే అదృష్టవంతుడు' 'కళ్లార్పేవాడు ఇళ్లార్పుతాడు' (సా), 'పంటి మీద పల్లెక్కిన వాడు ఇంటి మీద ఇల్లు కడతాడు' (సా), 'ఎడమ చేత్తో పని చేసే వాడిని, చిన్న చెవుల వాడిని నమ్మ వద్దు' (ప. ప.), 'మచ్చ నాలుక వానికి మాట నిలకడ లేదు', 'చెదలు కాళ్లవాడు క్షణ మొక చోట నిలువడు' అనేవి మగవారి సాముద్రిక లక్షణాలను చెప్పేవి.

'కండ్లు అర్చినమ్మ ఇండ్లు అర్చును', 'ఈడుపు కాళ్లది ఇంటికి చేటు. దొడ్డి కాళ్లది దోవకు చేటు, మాడుపు మొగముది మొగునికి చేటు', 'హీన స్వరం పెళ్లాం ఇంటికి చేటు' అనే సామెతలు స్త్రీ సాముద్రిక లక్షణాలను చెప్పేవి.

వెంట్రుకలు గుండ్రంగా చుట్టుకొని ఉండడాన్ని సుడి, రోమావర్తం అంటారు. సుడులు ఉండే ప్రదేశాన్ని బట్టి శుభా శుభాలు కలుగుతాయి. ముఖ్యంగా పశువులను సుడులు చూడందే రైతులు కొనరు. పొరక సుడి, కంటి పులి, గూటం సుడి ఉంటే ఆ ఎద్దుల్ని కొనేందుకు జంకుతారు. అవి మిగతా పశువులకన్నా తక్కువ వెలకే దొరుకుతాయి. ఎద్దులకు స్థానపు సుడి, ధాన్యపు సుడి వంటివి పది రకాల సుడులు శుభాన్నిచ్చేవి కాగా, 18 రకాల సుడులు అశుభ సూచకాలు. వృషభ లక్షణంలో 55 రకాల సుడులు చెప్పబడ్డాయి. విభాషికపు సుడి (గొడుగు సుడి) మీద ఇంకో సుడి ఉంటే ఆ ఎద్దున్న దొడ్డిలోని పశువులు క్షీణిస్తాయి. 'గొడుగు మీద గొడుగుంటే పిడుగు మీద పడ్డట్టే' (ప. ప.) అని సామెత. (పసిడి పలుకులు. పుట. 194).

కన్నె పాపట తీసే చోట సుడి ఉంటే 'చుక్కతల' అంటారు. చుక్కతల ఉండే స్త్రీకి చిన్న పిల్లల చేతనే పెళ్లి చేయిస్తారు. ఆ దోషం పోయేందుకు చుక్క

పోతును (పొట్టేలి) పెండ్లిలో బలి ఇస్తారు. చుక్క తల ఉంటే ఇల్లు నాశన మవు తుందని ప్రజల నమ్మకం. 'కోడి ముందరి తల సుళ్లు వెదికినట్లు' అని సామెత. తలసుళ్లు ఉండబట్టే ఆమె విధవ అయిందని భావం.

4.5-3 దృష్టిదోషం (16) : ఒక్కొక్కరి దృష్టి చెడ్డగా ఉంటుందని, వారి వల్ల కీడు జరుగుతుంటుందని ప్రజల నమ్మకం. అతి రసాలు చేసేటప్పుడు ఒక అతిరసం తీసి పొయ్యి గడ్డ మీద పెడతారు, దిష్టి తీసి. నూనె గతుకులాడితే, నిప్పటి సరిగా కాలక పోతే, దిష్టి తగిలింది అని పిల్లల్ని అక్కడనుంచి పంపేస్తారు. శిశువులు పోరు పెట్టుకొని ఏడుస్తుంటే వెంట్రుకలు. మిరపకాయలు నిప్పుల మీద వేయడం. పరక పుల్లలు కాల్చి దిగదీయడం చేస్తుంటారు. దిష్టి తగిలి ఉంటే వెంట్రుకలు కమురు వాసన, మిరపకాయలు కారు రావని, పరక పుల్లలు చిట పట లాడతాయని అంటారు.

పిల్లలకు బుగ్గన చుక్క పెట్టడం, వధూ వరులకు బుగ్గన చుక్క పెట్టడం దృష్టి దోషం నుంచి తప్పించేందుకే. ప్రాణులకే కాదు పైర్లకూ, భవనాలకూ దృష్టి దోషం తగులుతుందని 'దిష్టి బొమ్మ'ను కడుతుంటారు. నాలుగు దోవలు కలిసే చోట మిరప కాయలు, బలి అన్నము. ఆకు వక్కలు, దిష్టి బొమ్మను పెట్టి దిష్టి తీస్తారు. కురుపులు చాలా నాళ్లు మానకుండా ఉంటే అవి దాటు కురుపులుగా భావించి దాటు తీస్తారు. ఎవరికైనా గాలి బట్టినా ఇలాగే చేస్తారు. దిష్టి తీసేందుకు జంతు బలి చేయడం కూడా ఉంది. ఆ దారిన వెళే వారు ఆ వస్తువుల్ని దాటుకొని పోతే వారికి దాటు కురుపులు వస్తాయని, గాలి పడుతుందని అంటారు. ఈ విష యాల్ని ప్రతిబింబించే సామెత: 'నరుని కంట నల్లరాయి పగులును' (కార్.1238), 'కోటికి సీటు కూటికి చాటు', 'చల్ల కుండకు చంటి బిడ్డకు చాటుండాలి', 'ఆడవి చూచిన చేపల గుంటకు, మగవాడు చూచిన కందుల కళ్లానికి పోరాదు', 'కోడి పిల్లకు గొజ్జె పిల్లను బలాదూరు (దిష్టి) తీసినట్లు', 'ఎదురు పద్దమ్మ యెండి పోయిన దట' (కార్. 386), 'తీసిన వారు బాగానే ఉంటారు, తీయించుకున్న వారు బాగానే ఉంటారు; ఎదురైన వారికి తగులుతుంది ఎదురు మిత్తి' అనేవి.

4.5-4 శకునాలు (37) : శుభ సూచక నిమిత్తం శకునం అని శబ్ద రత్నాకరం. సాహిత్యంలో శకునాల ప్రశంస ఎంతో ఉంది. సింహాసన ద్వాత్రింశికలో ఒక రాజ కుమారుడు వేటకు వెళ్లేటప్పుడు ఎదురైన అప శకునాలు ఒక సీస పద్యం నిండా చెప్పబడ్డాయి. (ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 116) ఇంటి. నుండి

బయల్దేరేటప్పుడు శకునం చూసి బాగుంటే వెళ్ళడం, లేకుంటే మానివేయడం జరుగు తున్నది. లావుకం తొక్కడం స్త్రీ సంభోగ శకునమని, వాయసం తీర్చడం, బల్లి పలకడం, నక్క ఎదురు రావడం శుభ సూచకాలని సామెతల్లో చెప్పబడింది. బయలు దేరినపుడు ఎక్కడికి అని అడగడం, దారిలో తడవడం, ఏకుల రాట్నం, నంబి, ఒంటి బ్రాహ్మణుడు, నాగుబాము, కుందేలు, పిల్లి, గుడ్ల గూబ, అంగ వైకల్యం ఉండే వ్యక్తి ఎదురు రావడం, తుమ్మడం అప శకునాలు. వెనుక తుమ్ము మాత్రం మంచి శకునమే. 'చీకు లావుకం త్రొక్కినట్లు', (సంభోగ శకునం వృథా అవుతుంది అని భావం). 'వాయసము తీర్చినది' (బ్రౌ). 'బల్లి పలికిందని బావ పక్కలో చేరిందట', 'నక్క మొగం చూచి వచ్చినాడు' (నర). 'వెనక తుమ్ము ముందుకు మంచిది' (నర) అనేవి మంచి శకునాల్ని చెప్పేవి.

'శకునం వేళ ఎక్కడికని అడుగ కూడదు గాని ఎక్కడికో చెప్పి పో అన్నట్లు', 'తడిసి ముప్పందుం మోసినట్లు' (నర). 'ఏబ్రాసి పెళ్ళి కెడుతూ ఉంటే ఏకుల రాట్నం ఎదురయిందట', 'నంది బ్రాహ్మడెదురైనా, నాగుబామెదురైనా, చెవుల పోతెదురైనా చేటు తప్పదు' (నర), 'పిల్లి యెదురైతే తల్లైయినా శత్రువవు తుంది' (వ.వ.). 'గృహ ప్రవేశానికి వెడుతూ గుడ్ల గూబను చంకలో పెట్టుకొని పోయినట్లు', 'విరోధికి అప శకునం కలిగించను తన ముక్కు గోసుకొని ఎదురు పడినాడట', 'పిటికి బంటుకు తుమ్మాకష్ట', 'తుమ్ము తమ్ముడై చెప్పు' అనేవి అప శకునాల్ని తెలిపే సామెతలు.

అనుకోకుండా పలికే మాటలను బట్టి రాబోయే శుభా శుభాల్ని గ్రహించ వచ్చు ఇరుగు పొరుగు ఇండ్ల మీద అక్షతలు, నీళ్లు చల్లి వారు మాట్లాడుకొనే మాటల్ని ఉప శ్రుతిగా గ్రహించి ప్రయాణాలు మొదలు పెట్టారు. ఈ విషయాల్ని 'వచ్చే కీడు వాక్కే చెప్పును' 'వట్టింటికి పోచిళ్ల చల్లినట్లు' అనే సామెతలు తెలుపుతాయి. మనుషులు లేని ఇండ్లపై పోచీళ్ల చల్లడం వృథా అని సామెత భావం తీతువ పిట్ట కూయడం అపశకునం. చావును తెలుపుతుందట. ఆ విషయాన్ని 'హేతువు లేకుండా తీతువు కూయిదు' అనే సామెత చెపుతున్నది. అరక విరగడం రైతుకు పెద్ద అప శకునం. 'అడుగులోనే అరక విరిగినట్లు' అని సామెత.

455. అరిష్టాలు (11) : ఆడ కోడి కూత వేయడం, తోలు గుడ్డు పెట్టడం అరిష్ట సూచకాలు. అందుకే ఆ కోడిని కోసి వేస్తారు. గూబ ఇంటిపై

వాలదం, కంటి పులి ఉంటే ఎద్దు గాటిన ఉండదం ఇంటికి చెరుపు, ఏదు పల్లి ఇంట్లో ఉంటే పోట్లాటలు వస్తాయి. ముసలి కుక్కలు మొరిగితే కరువు, పిల్లి కండ్లు పోగొరుతుంది. ఇంటి ముందు మునగ చెట్టు ఉండ కూడదు. ఈ విషయాల్ని 'అద కోడి కూత కూస్తే అడుగంటదమే ఇల్లు'. 'అరుబాటం కోడి పెట్ట తోలు గుడ్డు (పై పెంకు మెత్తగా ఉండేది) పెట్టెనంట' (నర), 'గూబ ఎక్కిన కొంప చెరుసు', 'కంటి పులొచ్చి ఇంటి పులి నెత్తుక పోయెనంట' (నర). 'ఇంటిలో ఏదు ముల్లు యెయ్య', 'ముసలి కుక్కలు ఊరకే మొరగవు', 'పిల్లి కండ్లు పోగోరుసు. కుక్క పిల్లలు రాగోరుసు'. 'ముందు మునగ వెనుక వెలగ (వేప) ఉండకూడదు' అని సామెతలు విశదీకరిస్తాయి.

4.5.6 సోదె (12) : దీన్నే ఎరిక. గద్దె అని కూడా అంటారు. కొరవ కులం స్త్రీలు కొంత మంది 'ఎరుకోయమ్మ ఎరుక' అని ఊర్లలో భిక్షాటన చేస్తూ సోదె చెపుతాడు కాబట్టి ఆ కులానికి ఎరికల కులం అనే పేరు వచ్చింది. వీర్నే 'గద్దె ఎరికల' అని కూడా అంటారు. కొండరాజులు 'కుర్ పెర్ తోకన్న కొండ దేవత కొండ దేవత' అంటూ తంబూర వాయిస్తూ వచ్చి సోదె చెపుతుంటారు. చాలా మంది సోదెను నమ్ముతారు. నమ్మనివారు విరచించిన సామెతలు: 'మనస్సులో ఎంత ఉంటే సోదెలో అంతే వస్తుంది', 'చెయ్యి చూపించుకొని జెష్ట అనిపించుకున్నట్లు' (శ్రీపాద), 'గద్దెకు పోతే మద్దులు తక్కువ' (నర). 'సోలెడు బియ్యానికి సోదెకు పోతే తూమెడు బియ్యం తువ్వలు తిన్నవట' (వ. వ.) అనేవి.

4 5 7 కలలు (6): కలల్ని బట్టి శుభా శుభాల్ని స్వప్నశాస్త్రం చెపుతుంది. కల నిజం కాదని, కలలో ధనం దొరికినా, చచ్చినా నిజం కావని 'కలలో వచ్చింది యిలలో రాదు', 'కల నిజం కాదు కణితి దిండు గాదు', 'కలలో కనిపించిన లంకె బిందెలు రాక పోయినా పెరికి పెరికి పరుపంతా నీళ్ల చాయ మాత్రం అయింది', 'చచ్చినట్లు కల వచ్చినా మేలుకోక తప్పదు' అనే సామెతలు తెలుపుతాయి.

4.5.8 దిక్కులు (6): ఉత్తరపు వాకిలి యింట్లో సంసారం ఉండగూడదని, వల్లకాదు ఊరికి ఉత్తర దిక్కున ఉంటుందని. తూరుపు, పడమర తలపెట్టి పడుకోరాదని, దక్షిణం తల పెట్టి పడుకోవాలని సామెతలు చెపుతున్నాయి. ఈ నమ్మకాలు ప్రాంతం ప్రాంతానికి భేదించవచ్చు. పడమర తలపెట్టుకోవడం మంచిదని మా పెద్దలు చెప్పిన మాట. 'ఉత్తరపు వాకిలి యిల్లు ఊరకే ఇచ్చినా వద్దు',

'ఉడిగి ఉత్తరం చేరును', 'తూరుపు తలాపి (తలదాపి) దున్న పోతు గూడా పెట్టదు', 'పడమరకు పందియైనా తల పెట్టదన్నట్లు' (ప. ప.), 'దానం చేయకున్నా దక్షిణం తల జేసి పండాలి' అని సామెతలు.

4.5.9 అదృష్ట దురదృష్టాలు (39) : అదృష్ట దురదృష్టాల మీద ప్రజల కెంతో నమ్మకముంది. తాము చేసిన పని ఫలిస్తే అదృష్టమని, ఫలించక పోతే దురదృష్టమని భావిస్తారు. ఇంతెందుకు ? జూదం, రేసులు, లాటరీలు ఇవన్నీ అదృష్టం కోసం ప్రజలు పెట్టే పరుగులే అదృష్టవంతుణ్ణి ఎవరూ చెరప లేరు. అదృష్టం అనుకోకుండానే వస్తుంది. తెలివి కన్న అదృష్టం మేలు. బట్టతల ఉంటే అదృష్టం. అదృష్టవంతుడు పట్టిన దెల్లా బంగారవుతుంది. మగ పిల్లవాడు నలుగు రమ్మాయిల తర్వాత పుడితే అదృష్టవంతుడు. ఆరవ కాన్పు ఆడ పిల్ల అదృష్టవంతురాలు. ఈ విషయాల్ని 'అదృష్టవంతుణ్ణి చెరిచే వారు లేరు', 'అదృష్టం చెప్పి రాదు దురదృష్టం చెప్పి పోదు', 'అంబడి పూడి అప్పయ్యదీ బట్ట తలే, నా మొగుడుదీ బట్ట తలే కాని, అప్పయ్యది ఐశ్వర్యపు బట్టతల, నా మొగుడుది పేను కొరికిన బట్టతల' 'పట్టినదెల్లా బంగారం ముట్టిన దెల్లా ముత్యం', 'నలుగురి తర్వాత పుట్టితే నట్టిల్లు బంగార మవుతుంది, ముగ్గురి తర్వాత పుట్టితే ముయ్యి మూకుడుండదు'. 'ఆరవ కాన్పు ఆడపిల్ల అత్తవారింటికి లక్ష్మి' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి.

దరిద్రునికి ఆకలి, నిద్ర ఎక్కువని తల పేలు, చీర పేలు పడతాయని, దరిద్రుడు ఏది చేయ బోయినా వ్యతిరేకంగానే జరుగుతుందని, ఇంట్లో పోట్లాట లుంటే దరిద్రమని సామెతలు చెపుతున్నాయి. ఉమ్మడి ఇంట్లో పోట్లాటలుండ కూడదని, ఉంటే ఒకర్ని కానకుండా మరొకరు గింజలమ్ముతారు కాబట్టి దరిద్రులౌతారని ఈ సామెత ద్వారా బోధించి ఉండొచ్చు. 'అభాగ్యునికి ఆక లెక్కువ, నిర్భాగ్యునికి నిద్ర ఎక్కువ', 'ఛిద్రమునకు చీర పేలు, దరిద్రమునకు తల పేలు' (కార్. 842), 'దరిద్రుని నెత్తిన రాళ్ల వాన' (నర), 'తగిలిన కాలికే తగులును నొగిలిన కొంపే నొగులును', 'గుద్దులాడిన ఇంట్లో గుప్పెడు గింజలు నిలువవు' అని సామెతలు. 'తెల్లవారు జామున పొయి గడ్డ మీద సాయంత్రం కల రోటి (రాతి రోలు) మీద కూర్చో గూడదు' (నర). అలా కూర్చుంటే దరిద్రం వస్తుందట.

4.5.10 కృతఘ్నత (25) : నమ్మిన వార్ని మోసం చెయ్యడం, మేలుచేసిన వారికి కీడు చెయ్యడం పాపం పనులుగా ప్రజలు నమ్ముతారు. ఎరుకల వారికి

దొంగతనం వృత్తి. అయినా తాము మజ్జిగన్నం తిన్న యింట్లో దొంగతనం చేయరు. మజ్జిగలో ఉప్పు పడుతుంది కాబట్టి. ఉప్పు తినడం అంటే స్వామి భక్తికి ప్రమాణం చేసినట్లే అవుతుంది. వారి కులాచారం ప్రకారం (థర్స్టన్) 'అన్నం పెట్టిన తల్లి అన్నపూర్ణ' గా భావిస్తారు. అన్నం పెట్టిన ఆమెను కామ దృష్టితో చూడడం కృతఘ్నత అవుతుంది. ఈ విషయాల్ని 'తిన్న యింటి వాసాలు యెన్నే వాడు' (కార్. 1078), 'అన్నం పెట్టిన వారింటికి కన్నము పెట్టినట్లు', 'కూడు పెట్టి నామెను తొడ విందు అడిగినట్లు', 'నమ్మించి గొంతు కోసినట్లు', 'తడి గుడ్డతో గొంతు కోసినట్లు' అనే సామెతలు ప్రతిభావంతంగా ప్రతిబింబించేవి. ఇంటి వాసాలు ఎన్నడం ఇల్లు తనదని నిరూపించేందుకు సాక్ష్యం సమ కూర్చు కోవడం. తడి గుడ్డతో గొంతు కోయడం అంటే మంచి మాటల్తోనే నాశనంచెయ్యడం.

4.5.11 పాపం (13) : బ్రాహ్మణుని చంపడం పంచ మహా పాతకాల్లో ఒకటి. గో హత్య కూడా అంటిదే. కుక్కను చంపిన పాపానికి గుడి కట్టడం, పిల్లిని చంపిన పాపానికి పిల్లి బొమ్మను బంగారంతో లేదా బెల్లంతో చేసి బ్రాహ్మ ణునికి దానం చేయడం పరిహారాలు. కప్పను, పంది కొక్కును చంపడం కూడా పాపమే. ఈ సామెతల్లో పాపభీతి చూపి పెద్దలు భూతదయను సాధించారని చెప్పుకో వచ్చు. భార్య పొత్తులో తినడం తప్పు అని కొందరు, కాదని కొందరు. పెండ్లిలో వధూ వరులకు ఒకరి ఎంగిలి ఒకరిచేత తినిపిస్తారు కాబట్టి ఆలి పొత్తులో తినడం తప్పయి ఉండదు. చిన్నప్పుడు అమ్మ పొత్తులో తినవచ్చు. పెద్దయి తర్వాత ఆలి పొత్తులో తినవచ్చుగాని అమ్మ పొత్తులో తిన రాదు అని సమన్వయం చేయొచ్చు. భార్య వరుసైన వారికి కొట్టాల్సిన వసంతం అమ్మకు, అవ్వకు చిమ్మేవాడు పాపిష్టి. ఈ విషయాల్ని వ్యక్తం చేసే సామెతలు: 'పేదకు తగిలె బ్రహ్మ హత్య అన్నట్లు', 'తనను పొడిచినే గుడి గోవు నయినా పొడిస్తే పాపము లేదు' (కార్. 989), 'కుక్కను చంపిన పాపము గుడి కట్టినా పోదు' (కార్. 635), 'పిల్లిని చంపిన పాపము సీది, బెల్లము తిన్న పాపం నాది', 'కప్పను చంపితే అప్పను జంపినంత పాపము' (సా). 'అమ్మ పొత్తులో ఆలి పొత్తులో తినేవాడు' (సార). 'తల్లికి కొట్టరా వసంతం అన్నట్టు', 'అవ్వను పట్టుకొని వసంతాలాడినట్లు' అనేవి.

4.5.13 మరికొన్ని నమ్మకాలు (80) :

వరుసవేది రాగిని, ఇనుమును బంగారం చేస్తుంది, రాగి, ఇనుములనుంచి బంగారు చేయడం రసవాదం. 'ఇనుము గుణము చూసునా పరసు వేది' అని

సామెత. 'వాద భ్రష్టుడు వైద్య శ్రేష్టుడు' అనే సామెతలో రసవాదం కోసం మూలి కల విషయం బాగా తెలుసుకొన్నవాడు బంగారు చేయలేక పోయినా మంచి వైద్యు డౌతాడు అనే భావం ఉంది.

**అంజనం :** బోకి పెంచులపై మంత్రించిన కాటుకను పూసి చూస్తే కోరిన విష యాలు కనబడేవి (ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 27.). అంజనమున మాట లాడనేల' అనే సామెత అంజనంలో కనిపించినట్లు స్పష్టంగా కనిపిస్తుంటే కప్పి పుచ్చి ప్రయోజనం లేదు అంటుంది.

పారే నీళ్లు మంచివి అని, వాటికి పాటింపు లేదని 'పారే నీళ్ల పాలు ఊరే నీళ్ల ఉచ్చలు' (నర), 'పారే నీటికి పాటింపు లేదు'. (నర) అనే సామెతలు తెలుపుతున్నాయి.

బొద్దాకు తింటే బుద్ధి పెరుగుతుందని 'బొద్దాకు తింటే బుద్ధి పెరుగు నన్నట్లు' అనే సామెత చెపుతున్నది.

దుష్టుడైన బలవంతుని దేవుడే శిక్షిస్తాడని ప్రజల నమ్మకం. 'ఊరి వారి బిడ్డను నగరివాడు కొడితే, నగరివారి బిడ్డను నారాయణుడు కొడతాడు' అని సామెత.

ఈర్ష్య నాశనం. 'ఒకరి కలిమికి ఏడిస్తే ఒక కన్ను పోయింది, తన లేమికి ఏడిస్తే రెండో కన్ను పోయింది' అని సామెత.

నవ్వు ఎక్కువైతే చెరుపు. 'నవ్వు నాలుగందాల (నానందాల) చేటు' అని సామెత.

అరుంధతి కనబడకుంటే చావు దగ్గర పడినట్లు. 'ఆరు నెలలకు చచ్చే వాడికి అరుంధతి కనబడదు' అని సామెత.

'ఏడు గోత్రాలవారు ఒక మంచము మీద గూర్చోనరాదు' (సా) అని ఒక సామెత నిషేధిస్తున్నది.

'అరికాలు దురద పెడితే ప్రయాణమునకు హేతువు' (సా) అని ఒక సామెత తెలుపుతున్నది.

కరివేపాకు కోసేటపుడు ఏదో ఒకటి వాగక పోతే ఆకు వాసన పోతుందిట 'కరేపాకు కోసేవాడు వాగినట్లు' (కార్, 546) అని సామెత.

బదనిక చెట్టు మీద మొలిచే ఓషధి. బదనిక చూపిస్తే పాముకు కోపం. 'పాముకు బదనిక చూపిస్తే ఎంత అలుగునో' (బ్రౌన్) అని సామెత.

పాము ముదిరి గాము అవుతుందని, నాలుగు ఈతల పీత పాతాళగంగ అవుతుందని 'పాము ముదిరి గామైనట్లు', 'నాలుగు ఈతల పీత పాతాళగంగ అయింది' అనే సామెతలు తెలుపుతున్నాయి. రెండో సామెత పరిహాసానికి చెప్పింది కావచ్చు.

మూగవాని ముందర ముక్కు గోక్కుంటే వానికి తలనొప్పి వస్తుందట. 'చెవిటి వానికి శంఖము, మూగవానికి ముక్కు గిరుకున్నట్లు' అని సామెత.

పచ్చని చెట్టును కొట్టడం, దీపాన్ని, పొంగే పాలు ఆర్పడం చేయరాదు. 'ముషిణి చెట్టు అయినా పచ్చని చెట్టు కొట్టరాదు', 'పొంగేపాలు, వెలిగే దీపం ఆర్పరాదు' (న్య సా. 683) అని సామెతలు.

వృద్ధుల బుద్ధి మందం అని 'అరవై ఏండ్లు నిండిన వాడిని ఆలోచన అడక్కు. ఇరవై ఏండ్లు నిండని వానికి పెత్తన మీయకు', 'ఏండ్లు ఎగసన బుద్ధి దిగసన' అనే సామెతలు తెలుపుతున్నాయి.

ఏట్లో పడినపుడు గంగమ్మ మూడుసార్లు తేల్చుతుందని, అప్పటికీ తప్పించుకోలేక పోతే మునిగి పోతాడని ఒక నమ్మకం', 'ఏఱు అయినా మూడు నేరాలు కాస్తుంది' అని సామెత.

అర్జునుని పది పేర్లు ఉండే శ్లోకం చదివితే పిడుగు పడదని ఒక నమ్మకం. 'అర్జునా అంటే అరవై ఆమడ అవతల పొయ్యి పడుతుంది' (నర). 'అర్జున భర్జున పడెరా పిడుగు' అని సామెతలు. రెండో సామెత ఆ శ్లోకం రానివాడు భయం భయంగా అన్న మాటలు. ''అర్జునః ఫల్గుణః పార్థః కిరీటీ శ్వేతవాహనః

బీభత్సో విజయః కృష్ణః సవ్య సాచీ ధనంజయః'' అనేది ఆశ్లోకం.

'ఇంట్లో కందురీగలు తెట్టెలు పెడితే ఇల్లాండ్రు గర్భవతులౌతారు'. 'కోతి అంటే కొర్ర గింజంత తగ్గి పోతారు' (నర). 'మునగ చెట్టు పొయ్యిలో పెడితే మూగ బిడ్డలు పుడతారు. 'రోకలి తూలితే చుట్టాలు వస్తారు'. ఎసట్లో బియ్యం తింటే పెండ్లినాడు వాన వస్తుంది' (సా). 'తద్దె పేరంటాల్లో తెల్లవారి అన్నము తింటే ముసలి మొగుడు వస్తాడంట' (సా) అని ప్రజలు నమ్ముతారు. చివరి రెండు సామెతల్లో బాలికలను కుండల్లో దేవుకొని ఓగు తిండి తినకుండా చేయడం, వ్రతాల్లో ఉపవాసముండేందుకు తల్లులు శిక్షణ నిచ్చే ఉద్దేశం ఉన్నట్లు బోధ పడుతున్నది.

4.5.13 సామెతలు చాలా మాత్రం నమ్మకాలకు విరుద్ధంగా ఉండే వయినా ఆ నమ్మకాలు చాలా మందిలో ఉన్నట్లు. నమ్మకం లేని కొంత మంది ఈ సామెతలు సృష్టించినట్లు మనం భావించొచ్చు. శకునాల మీద, అదృష్ట దురదృష్టాల మీద జ్యోతిష్ శాస్త్రం మీద ప్రజల్లో నమ్మకం ఎక్కువగానే ఉంది. ఆ నమ్మకాల్ని పాటిస్తున్నారు కూడా. ప్రాణం మీదికి వస్తే తప్ప, తిధి, వారం, నక్షత్రం, వార శూల, శకునం చూడకుండా పల్లీయులు ప్రయాణం చేయరు.

ఈ నమ్మకాలు పరోక్షంగా ప్రజల్లో భూత దయను పెంచుతున్నాయి. ఆడ పిల్లలకు అత్తింటి ప్రవర్తనను నేర్పుతున్నాయి. రజస్వల అయిన స్త్రీని దుష్ట శక్తులు ఆవరించి ఉంటాయని నమ్మడం, దృష్టి దోషం కోసం బలులివ్వడం వంటి నమ్మకాలు అతి ప్రాచీన కాలం నుంచీ పరంపరగా వస్తున్నాయి.

నమ్మకాలు ప్రజల ప్రవర్తనపై ఎంతో ప్రభావాన్ని కలిగి ఉన్నాయనడానికి సందేహించాల్సిన పని లేదు.



# 4.6. తెలుగు సామెతలు - వస్త్రభూషణాలంకరణాలు

4.6 వస్త్ర, భూషణ. అలంకరణలు వైయక్తికం, సాంఘికం, సాంస్కృతికంగా ఉండవచ్చు. వారి వారి శక్త్యనుసారం బట్టలు, నగలు ధరించడం అలంకరణ చేసుకోవడం వైయక్తికం. కులాన్ని బట్టి బట్టలు, నగలు ధరించడం అలంకరణ చేసుకోవడం సాంఘికం. కొన్ని కులాలు ఎడమ పైట, కొన్ని కులాలు కుడి పైట వేసుకోవడం; కొందరు కుడి కొప్పు, కొందరు ఎడమ కొప్పు పెట్టుకోవడం సంఘ సంబంధి. ఆచార వ్యవహారాలను అనుసరించి వస్త్ర, భూషణ ధారణ, అలంకరణ చేసుకోవడం సాంస్కృతికం. ముత్తైదువ తాళి, మెట్టెలు ధరించడం, విధవ తీసి వేయడం; ముత్తైదువ తలకట్టు ఉంచుకోవడం, కొన్ని కులాల్లో విధవ తలకట్టు తీసి వేయడం, పూలు, బొట్టు ముత్తైదువ ధరించడం, విధవలు తీసి వేయడం సంస్కృతికి సంబంధించినవి.

ఈ ఉప ప్రకరణంలో పురుష, స్త్రీ వస్త్రధారణ, బంగారం, రత్నాలు, నగలు, కేశాలంకరణ, మీసం ప్రాధాన్యం, పుష్పాలు, చందనాది అలంకార సామగ్రి గురించి ఉన్న వివిధ విషయాల్ని నా పరిశీలనలో లభించిన 489 సామెతల ఆధారంగా వివరించాను.

**4.6.1 వస్త్రాలు :** వస్త్రాలకు సంబంధించిన సామెతలు 117. స్త్రీ, పురుషులకు వేర్వేరు వస్త్రధారణ ఉంది. కప్పు కొనేందుకు దుప్పటి, బొంత కంబళి ఉపయోగిస్తారు. గోచి దరిద్రుని కట్టు వస్త్రం.

**వస్త్రాల అవసరం (18) :** సామాన్యులు కట్టేది నూలు బట్ట. అది చాలా కాలం మన్నదని 'నూలు గుడ్డ నూరేండ్లు కట్టబోము' అనే సామెత చెపుతుంది. చేలో పత్తి తీసి నూలు వడికి, సాలె లేదా మాల నేతగాండ్లకిచ్చి బట్టలు నేయించుకుంటారు. ఆ విషయాన్ని 'కాయలో పత్తి కాయలో ఉండగానే కామన్న కారు మూళ్లు, నాకు మూడు మూళ్లు' (గుడ్డ) అనే సామెత వ్యంగ్యంగా చెపుతుంది. కొత్త గుడ్డకు రంగు అద్దుతారని 'కొత్త గుడ్డకు రంగు పట్టినట్టు పాత గుడ్డకు పట్టదు' అనే సామెత తెలుపుతుంది. కలిగినవారు వెడల్పు ఎక్కువుండి పిక్కల దాకా వచ్చే బట్టల్ని ధరిస్తారు, పేదలు ముతక బట్టలు మూర తక్కువవి ధరిస్తారు. ఉతుకులు పడే కొద్దీ అవి పైకి వచ్చేస్తాయి. 'కలిగితే కాళ్లమయ్యా, లేక పోతే మోకాళ్లమయ్యా' అని సామెత. ఏవి తక్కువఉన్నా సర్దుకోవచ్చుగాని, వస్త్రం,విస్తరి

చిన్నదిగా ఉంటే కష్టం. చాలీ చాలకుంటే ఇటు కట్టుకోవటానికి, అటు తినడానికి ఇబ్బంది అవుతుందని 'వస్త్ర హీనము, విస్తరి హీనము పనికి రావు' అనే సామెత చెపుతుంది. మంచి బట్టకు పుంజం నూలు కావాలి (పుంజం 30 ఎనికల నూలు అని బ్రౌణ్యము, శబ్దారత్నాకరము. 60 ఎనికల నూలు అని కార్) అని 'పుంజం పెట్టినది బట్ట, లంచం పెట్టినది మాట' (కార్. 2474) అనే సామెత విశదీకరిస్తుంది. పీదలు చిరిగిన బట్టకు మాసికలు కుట్టు కుంటారు. 'మాసికలేసిన బట్ట దాసి దాని బిడ్డ వంటిది' అని సామెత. మాసిక లేసిన బట్ట మరో చోట చిరుగుతుంటుంది. దాసి దాని బిడ్డ ఏదో ఒక వస్తువు కోసం ఏడుస్తూనే వుంటుంది అని అంతరార్థం.

పురుషుల వస్త్రాలు (39): కట్టు పంచ, ఉత్తరీయం లేదా పై పంచ, అందంగా ధరించే వల్లెవాటు, తలపాగా, ఇవి పురుషుల వస్త్రాలు. పైన కప్పుకొనే సన్నపాటి వెడల్పు వస్త్రం దుప్పటి. పేద కుటుంబాల్లో ఉండే రెండు మూడు పంచెలను ఇద్దరు మార్చి కట్టు కుంటారు. అవి పొత్తు పంచలు. తండ్రి కొడుకుల బాంధవ్యం కన్నా పొత్తు పంచ కావాలనుకునే స్వార్థాన్ని 'అబ్బ చస్తే పొత్తుపంచ నాది అన్నాడట', 'అప్పిగాడు పోతే ఆ పంచా నాకే, పాపి గాడు పోతే ఆ పై పంచా నాకే' అనే సామెతలు ఎత్తి చూపుతాయి.

పంచెకు అందం తెచ్చేది అంచు. కొన్ని పంచలు అంచు అందంగా ఉన్నా పంచె నేత బాగుండదు. ఆ విషయాన్ని తెలిపే సామెత 'అంచు డాబే గాని పంచె డాబు లేదు' అనేది. ఒక ఆడంబరునికి 'బిచ్చానికి పోయినా బిగువు తప్పలేదు, దుప్పటి పోయినా వల్లెవాటు తప్పలేదు' అట. భోంచేసే సమయంలో మడి బట్ట లేదా పట్టు బట్ట బ్రాహ్మణులు ధరిస్తారు. పట్టు బట్ట ఉండొచ్చుగాని, భోజనం ఉండక పోవచ్చునని 'అన్నం లేక పోయినా పట్టు బట్ట' అనే సామెత; ముఖ్యమైనది తీసి అముఖ్యమైనది ధరించే సందర్భానికి 'గోచి విప్పేసి పాగా చుట్టినట్లు' అనే సామెత చెపుతుంటారు. అంగ వస్త్రం ఉత్తరీయం. 'అనుకున్న పని అంగ వస్త్రంలో అయినట్లు' అనేది అంగ వస్త్రం ప్రసక్తి ఉండే సామెత. ముఖ్య సందర్భాల్లో విలాసంగా దుప్పటి కప్పుకోవడం, మిగిలిన సందర్భాల్లో కంబళి కప్పుకోవడం ఉన్నట్లు 'అప్పటికి దుప్పటి, ఎల్ల కాలానికి కంబళి' (చంద్ర), 'అప్పటి మాటలకు దుప్పటి ఇచ్చినాను గాని, కల కాలం దుప్పటి కప్పుకోను ఇచ్చినానా' అనే సామెతల ద్వారా తెలుసుకోవచ్చు. దుప్పట్లు వివిధ రంగుల్లో ఉంటాయని, దుప్పటి

పొడవు ఐదు మూళ్లు (10½ అడుగులు) ఉండేదని. 'రంగుల దుప్పట్లు నీ గొంగడికి సరిపోలవన్న గువ్వల చెన్నా'. 'వెంకటప్ప సంకి ఏడుమూళ్ల దుప్పటి' అనే సామెతలు చెపుతున్నాయి.

ఒక దానికి పెద్దదిగా. ఇంకో దానికి చిన్నదిగా ఉండి ఎటూ ఉపయోగించని విషయాన్ని 'గోచికి పెద్ద కొల్లాయి గుడ్డకు చిన్న' (ఆం.వి.), 'గోచికి పెద్ద కోకకు చిన్న' అనే సామెతలు చెపుతాయి. ఒకరు చెప్పిన బుద్ధి కల కాలం ఉండదని, తనే సొంతంగా గోచి పెట్టుకొనే విధానం నేర్చుకోవాలని 'ఒకరు పెట్టిన పట్ట గోచి ఎన్నాళ్లుంటుంది' (నర) అనే ప్రశ్నా సామెత అంటున్నది. గోచి కూడా ఒకరి దొకరు మార్చుకోవడం కటిక దరిద్రమని 'పండుకొన్న వాని గోచి లేచిన వాడు పెట్టుకొన్నట్లు' అనే సామెత తెలుపుతున్నది.

తలపాగా పెద్దతనానికి చిహ్నం. ప్రాచీనులు తలపాగా అలవాటుగా చుట్టు కొనేవారు. ఇప్పటికీ పెండ్లిలో వరునికి తలపాగా చుట్టే సంప్రదాయం సజీవంగా ఉంది. తలపాగా చుట్టడం సులభం కాదు అని, ఖరీదైన తలపాగాలు ఉండేవని 'తలపాగా చుట్టలేక తల వంకర అన్నట్లు', 'ప్రాణము లేనివానికి బంగారు తలపాగా జుట్టిన ప్రయోజనమేమి?' అనే సామెతలు తెలుపుతున్నవి. 'గుండీ దొరికిందని కోటు కుట్టమన్నాడట' (గ్రా. ం. 462) అనే సామెత ఆధునికం.

స్త్రీల వస్త్రాలు (44) : చీర, దుప్పటి, రవిక స్త్రీల వస్త్రాలు. స్త్రీకి సింగారం చీర. అందుకే స్త్రీలు చీర సింగారించేందుకు చాలాసేపు పడుతుంది. చీరకు కొంగు తప్పని సరిగా ఉంటుంది. కొంగుకు బొమ్మలు, అలంకరణ ఉంటాయి. కొంగునే పైట అంటారు. గొల్ల, కుమ్మర, మాల ఇంకా కొన్ని కులాల స్త్రీలు కుడి పైట వేసుకుంటారు. ఈ విషయాన్ని తెలిపే సామెతలు 'కండే కాంతి చీరే సింగారం' (నర), 'చీర సింగారించే సరికి ఊరు మాటు మణిగింది', కోక ఉంటే కొంగు వుండదా' (రా. న. 682) 'కొంగు తడిస్తే చలి గాని కోకంతా తడిస్తే ఏం చలి?' అనేవి. స్త్రీకి కోక కాదు అందం. కోక గట్టిన శరీరంలో అందముండాలి అని ఒక విలాస పురుషుడనే మాటలు ఈ సామెతలు: 'కోక డాపుతో కోరిక లీడేరునా', 'కోక డాబేగాని .... డాబు లేదు' (నర) అనేవి. 'కులానికి కుడి పైట అందానికి ఎడమ పైట' అనేది అందానికి ఎడమ పైట చిహ్నం అనే పల్లీయుల అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నది.

సన్న నూలుతో నేసిన చీర సున్నితంగా, అందంగా, ఖరీదెక్కువగా ఉంటుంది. వన్నె చీర (రంగు చీర), ఉభయ రాగాల చీర (రెండు రంగుల చీర?), చారలు చారలుగా ఉండే డోరియా కోక, అంచుకు గాని మొత్తానికి గాని తొగరు (ఎర్ర) రంగు వేసిన తొగరు చీర, చిత్తరువులు ముద్రించిన చిత్తారి చీర, పట్టుచీర అనేవి సామెతల్లో ప్రసక్తి వచ్చిన కొన్ని రకాల చీరలు. అన్నిటి కన్నా పట్టుచీర ఖరీదు. పేరంటాలకు, దేవాలయాలకు ధరించి వెళ్లేది. మర్యాదకోసం పట్టుచీరను అరువు తీసుకొని ఐనా ధరించడం స్త్రీలలో ఉంది. ఈ విషయాల్ని 'చక్కని వాళ్లు చిక్కినా అందమే, సన్న చీర మాసినా అందమే', 'సిగ్గు దప్పిన చుట్టం వన్నె చీర కేడ్చినదట', 'చేసుకున్న దానికి మూసుకోను లేదు ఉంచుకొన్న దానికి ఉభయ రాగాల చీర', 'మక్కువ పడి ముక్కాలి పీట చేయించుకుంటే డోరియా కోక కత్తిరించుక పోయిందట', 'దొరసానికి దుప్పటి లేదు తొత్తుకు తొగరు చీరట', 'చీర చిత్తారు, రవిక జల్తారు', 'పీతాంబరము యెరు విచ్చినమ్మ పీట వెంబడి పట్టు కొని తిరగ వలసినది' (కార్. 1468) 'పట్టు పుట్టము తొత్తు కట్ట బెట్టిన పేద మద కలతో పాడు చేయు' అనే సామెతలు చక్కగా వ్యక్తీకరిస్తాయి.

కొత్త చీర బిరుసుగా ఉండేందుకు గంజి పెడతారు. స్త్రీలు ముట్టు సమయంలో పాత కోకలు కడతుంటారు. ఇల్లు ఎక్కి కోక విప్పడం స్త్రీ సిగ్గు లేని తనానికి చిహ్నం. 18, 16, 14, 12 మూరల చీరలు ఉండేవి. 12 మూరల చీరలు పడుచులు ధరించగా, మిగతావి ప్రౌఢ స్త్రీలు ధరించేవారు. చీర మూర వేసే కొంటారు. బడాయి స్త్రీకి పాత కోకలు తప్ప మరేమీ ఉండవు. ఈ విషయాన్ని తెలిపే సామెతలు 'కోకకు పెట్టిన గంజి కూడి రాదు', 'ఎన్ని ముట్లు పాతలైతే ఒక కటుకోక అవుతుంది' 'ఇలు ఎక్కి కోక విప్పినట్టు'. 'పాపమని పాత చీర ఇస్తే గోడ చాటుకు పోయి మూర వేసిందట', 'బడక బండెడు పాత కోకలు సందెడు' (నర) అనేవి.

రవికలకు సంబంధించిన సామెతల్లో ఖరీదైన రవికలు జలతారుతో నేసే వారని, పూర్వం రవికె తొడగడం ఐశ్వర్య, విలాస చిహ్నంగా ఉండేదని 'చీర చిత్తారు. రవికె జల్తారు', 'ఇటుకులాడికి రవికె పెట్టితే కంపకు పెట్టి చింపు కొనె నట' (హైసా. VII-1) అనే సామెతలు చెపుతున్నాయి. చీర బట్టలో రవిక మిగుల్చు కోవడం సుసాధ్యం. రవికలో చీర మిగల్చడం అసాధ్యం. 'అత్యాశను 'రవికలోనే చీర మిగిలించాలంటే ఎలాగు?' అనే సామెతతో ప్రశ్నిస్తారు.

శయన వస్త్రాలు (17) : పండుకొనేందుకు మెత్తగా ఉండేటట్లు పాత వస్త్రాలతో మందంగా కుట్టుకొనేది గంత లేదా బొంత. దీన్ని చలికి కప్పుకొంటారు కూడా. గొర్రె ఉన్నితో నేసి కప్పుకొనేందుకు ఉపయోగించేది కంబళి లేక గొంగడి. బొంతలు అతుకుల గుడ్డలతో కుట్టేవి. బొంతల్లో చీర పోతులు పడుతుంటాయి. గొర్రెల కాపర్లు కంబళి లోనే భోంచేస్తుంటారు. జడ పదార్థానికి కంబళి ప్రతీక. ఈ విషయాల్ని 'బొంత కుట్టుకున్న వాడు కప్పుకో లేడా?'. 'కింద ఒక బొంత, మీద ఒక బొంత నాకేమి చింత', 'గంతకు తగిన బొంత దొరకనే దొరుకుతుంది', 'అతుకుల బొంత గతుకుల బాట', 'చీర పోతు లేరి వేయడం కన్నా బొంతను కాల్చి వేయడం నిమ్మళం', 'గొంగట్లో తిని, గొంగడి తుప్పుడు యెన్నినట్లు' (హైపా. VIII-7), 'ఎక్కడ వున్నావే కంబళీ అంటే వేసిన చోటనే ఉన్నాను వెంగళీ అందట' (కార్. 375) అనే సామెతలు అభివ్యక్తం చేస్తాయి.

4.6 2 ఆభరణాలు (157) : నగలు బంగారం తోను, రత్నాల తోను చేస్తారు. పూర్వం పురుషులు కూడా చెవులకు ముక్కుకు పోగులు, మెడల్లో కంటెలు, చేతుల్లో కడియాలు, కాలికి మట్టెలు ధరించేవారు. బంగారు నగలంటే స్త్రీలు చెవి కోసుకుంటారు. పెండ్లిండ్లకూ పేరంటాలకు వెళ్లేటపుడు స్త్రీలు బంగారు నగలు అరువు తెచ్చుకొని ఐనా ధరిస్తుంటారు. నగలు చేయించలేదని భర్తల్ని వేధించుకు తింటుంటారు. అలంకారానికే గాక, అవసరానికి కూడా నగలు ఆదుకుంటుంటాయి. తాకట్టు పెట్టి డబ్బు తెచ్చుకొనేందుకు, అమ్ముకొని భూములు కొనేందుకు నగల్ని ఉపయోగిస్తుంటారు. బంగారు నగలు కొనలేనపుడు వెండి, ఇత్తడి, రాగి నగలు పెట్టుకొంటుంటారు. రత్నాలు నగల్లో పొదుగుతారు.

బంగారం (25) : శ్రేష్ఠంగా, అందంగా ఉండి విలువైన దాన్ని బంగారంతో పోలుస్తుంటారు. బంగారం ఉండడం సిరికి చిహ్నం. అదృష్టవంతులు పట్టిన మట్టి కూడా బంగార మవుతుంది. కొద్ది బంగారైనా మనిషికి అహం పెంచుతుంది. ఎన్ని సార్లు పుటం పెట్టినా ఇత్తడి బంగారం కాదు. బంగారం ప్రకాశవంతంగా ఉంటుంది. బంగారం కరిగించాలంటే వెలిగారం అవసరం. నిప్పులో వేసి పుటం పెట్టే కొద్దీ బంగారు ఇంకా ఎక్కువై మెరుస్తుంటుంది. బంగారం ఉండే కొద్దీ స్త్రీల సింగారం పెరుగుతుంది. ఎంత విలువైన దానికైనా అనరా అవసరం ఉంటుంది. ఈ విషయాల్ని మనకు చెప్పే సామెతలు: 'పట్టినదెల్లా బంగారం, ముట్టినదెల్లా ముత్యం', 'మాష మెత్తు (అయిదు గురి గింజల ఎత్తు) బంగారం మనిషిని గాడిద చేస్తుంది', 'ఎన్ని

పుటాలేసినా ఇత్తడి ఇత్తడే పుత్తడి పుత్తడే' 'మెరిసేది అంతా బంగారు కాదు' (సాసా. 380) 'బంగారం కరగను వెలిగారం తప్పనట్లు', 'నిజమైన బంగారు నిప్పుకు వెరువదు', 'బంగారం కొద్దీ సింగారం', 'బంగారపు పళ్లానికైనా గోడ చేర్పు ఉండ వలెను' అనేవి. అందమైన దానికి సుగుణ ముండడాన్ని 'బంగారానికి తావి అబ్బినట్లు' అనే సామెత, విలువైన వస్తువుతో విలువ తక్కువదాన్ని తెచ్చుకోవడం ఆడంబరం మాత్రమే నని, 'బంగారు గాలానికి బంగారు చేప పడునా' (రా. ప. 747) అనే సామెత, మితంగా మాట్లాడాలని 'మాట వెండి మౌనం బంగారం' అనే సామెత వ్యంగ్యంగా తెలుపుతాయి.

**రత్నాలు (44) :** బంగారంలో రత్నాలు పొదిగి నగలు చేయిస్తుంటారు. రత్నాలు తొమ్మిది రకాలు. మౌక్తికం, పద్మరాగం, వజ్రం, ప్రవాళం, మరకతం, నీలం, గోమేధికం, పుష్యరాగం, వైడూర్యం అనేవి. రత్నాలకు 'రాళ్లు' అని మరో పేరు. రత్నాలను గురించిన, ప్రత్యేకంగా ముత్యాలు, పద్మరాగాలు, వజ్రాలు, పగడాలను గురించిన సామెతలు లభిస్తున్నాయి.

రాజులు రత్నాల మీద ఎక్కువ సొమ్ము వెచ్చించే వారని, మణిని కోయాలంటే మణే కావాలని, శ్రేష్ఠమైన రత్నాన్ని ఇత్తడిలో పొదిగితే దానికి విలువ తగ్గక పోయినా, బంగారులో పొదిగితే రాణింపు వస్తుందని, నీచుల్లో శ్రేష్ఠులుండ నట్లు గాజు పూసల గనిలో రత్నాలు దొరకవని, విలువైన రత్నాన్ని పారవేసి కొర గాని గాజును కోరేవారు అవివేకులని, పట్నంలో రత్న పరీక్షకులుంటారని సామెతలు తెలుపుతున్నాయి. 'రాజుల సొమ్ము రాళ్ల పాలూ లంజల పాలూ' (కార్. 2578), 'మణిని మణితో కోయవలె', 'జీన రత్నాన్ని ఇత్తడిలో పొదిగితే రత్నానికేమి లోటు', 'రత్నాన్ని బంగారంలో పొదిగితేనే రాణింపు', 'గాజు పూసల గనిలో మణి దొరకునా', 'రత్నాన్ని దువ్వి గాజును కోరినట్లు' అనేవి ఆ సామెతలు.

'రేగు బండ్లకు ముత్యాలమ్మకొన్నట్లు' (రా. ప. 558) అనే సామెత విలువలేని దానికి విలువైన వస్తువును మార్చే అవివేకానికి ప్రతీక. ముత్యాలు చిన్నవిగా ఉంటాయి. దూరంగా ఉండే వస్తువుల్ని పెద్దవి అని చెప్పే బడాయికి 'ఏటి ఆవతల ముత్యాలు తాటికాయ లంతేసి అన్నట్లు, (కార్. 423) అనే సామెత చెప్తారు. కొంత మంది బడాయి బసవయ్యలు 'కూటికి గతి లేకున్నా కుంచెనలకు ముత్యాలు' కావాలంటారని సామెత చెపుతుంది. నోరెత్తని వార్ని 'నోటి ముత్యాలు రాలి పోతవా' (కార్. 1346) అని అంటాము. మాలిన్యం కడిగి వేస్తే [illegible]త్వం

బాగా ప్రకాశిస్తుంది అనే విషయాన్ని 'పుల గడిగిన ముత్తియంబు పొలుపారి' (శ్రీపాద) అనే సామెత తెలుపుతుంది.

విలువైనది పేడ స్థలంలో దొరికినా గ్రహించాలి అని 'లద్దిలో మాణిక్యం' (దొరికినట్లు). 'మసి పాతన మాణిక్యమట్లు' అనే సామెతలు తెలుపగా, నీచుని కడుపులో శ్రేష్ఠుడు పుట్ట వచ్చునని 'ఓగు కడుపున వజ్రం పుట్టినట్లు' అనే సామెత, కృత్రిమ పగడాలుంటాయని, అంత విలువచేయని పగడం ప్రతి ఇంట్లోనూ ఉంటుందని. 'మంచి పగడాలు చూపి మాయ పగడాలు అమ్మినట్లు', 'పగడం లేని ఇల్లు జగడం లేని ఇల్లు ఉండవు' అనే సామెతలు తెలుపుతున్నాయి.

నగలు (89) : బంగారులో రత్నాలు పొదిగి ధనికులు నగలు చేయిస్తుంటారు. వెండి, ఇత్తడి. రాగి నగల్ని పేదలు ధరిస్తారు. తలలో పెట్టుకొనేవి, మెడలో వేసుకొనేవి. చెవులకు, ముక్కుకు, మొలకు, చేతులకు. కాళ్లకు. వ్రేళ్లకు ధరించేవి వేర్వేరు నగలున్నాయి.

నగలెన్ని పెట్టినా తొత్తు దొరసాని గాదు. అరువు నగలు పెట్టడం, తీయడం చేతుల నొప్పి. నగల్లో బంగారుకు ఆధారంగా లక్క పెడుతుంటారు. చూసి ఆనందించే వారుంటేనే నగలు పెట్టుకోవాలి. సొమ్ములు అవసరానికి ఆదుకుంటాయి. ఈ విషయాన్ని తెలిపే సామెతలు 'తొత్తుది నగలెన్ని ఇడిన దొరసానగునా?', 'తీయడం పెట్టడం తీపుల చేటు కనడం కూచోవడం నొప్పుల చేటు'. 'లక్క లేని నగ బొక్కలేని మాంసం', 'చూసేవారుంటే సొమ్ములు పెట్టాలి చేసే వారుంటే పిల్లలు కనాలి', 'అందానికి పెట్టిన సొమ్ము ఆపదకు అడ్డం వస్తుంది' అనేవి.

నొసటి ఆభరణం : పిల్లలు, స్త్రీలు ధరించే నొసటి ఆభరణం రావి రేకు. దాని ప్రసక్తి 'తన పిల్ల తవిటికి యేడిస్తే లంజ పిల్ల రావి రేకుకు యేడ్చినది' (కార. 889) అనే సామెతలో వుంది.

పూసలు అంటే మణులు అనే అర్థం ఉంది. విలువ ఎక్కువగా వుండే రత్నాల్ని దండగా గుచ్చుకోలేని పేదలు రంగు పూసలు దండగా గుచ్చుకొని వేసుకుంటారు. వివాహిత స్త్రీలు తప్పనిసరిగా మెడలో ఏదో ఒక దండ ధరించాలి. రత్నాలు కాదు గదా, మామూలు పూసలు కూడా కొనలేని ఒక బీదరాలి ఆక్రందన 'నల్ల పూసకు తెల్ల పూస లేదు, తెల్లపూసకు నల్లపూస లేదు' (కార్. 2421) అనే సామెతలో ప్రతి ధ్వనిస్తున్నది. ప్రేమ నటిస్తూ నగలు కాజేసే ప్రియులను 'మెడ తడవడం పూసల కొఱకే' అనే సామెత బయట పెడుతున్నది. హారం తగిలించే వంకర కమ్మి కొలికి. కొలికికి తగిలించే పూస కొలికి పూస. హారానికి కొలికి అవసరాన్ని 'నూరు పూసలకు ఒకే కొలికి', 'ముఖానికి ముక్కాసర దండకు కొలికాసర' అనే సామెతలు చక్కగా చెప్తాయి.

కర్ణాభరణాలు : తీగెలు, కమ్మలు, మద్దికాయలు, కుట్టు పోగులు, కుండలాలు. బొగడలు కమలాలు, అనేవి. పేదలు చెవులకు తాటాకుల కమ్మలు పెట్టుకొనేవారు. కమ్మ అంటే తాటాకు అని అర్థం. ఆ తర్వాత బంగారు కమ్మలు వచ్చాయి. చెవులు కంసలి చేత కుట్టించు కుంటారు. జీలుగు బెండ్లు. తాటాకులతో చేసిన విచ్చుటాకులు, కమ్మకు సరిపోయేట్లు చెవి రంధ్రం పెద్దదయేందుకు ఉపయోగిస్తారు. పురుష కర్ణాభరణాలు పోగులు. చెవులు కుట్టించుకొన్నపుడు సన్నని దారపు పోగుల్లాంటి కుట్టు పోగులు పెట్టుకుంటారు. చెవి పై భాగంలో ధరించే కర్ణాభరణాలు బొగడలు. బాలుర చెవితమ్మలకు పెట్టే కర్ణభూషణాలు మద్దికాయలు అని ప్రౌఢ్యం, శబ్ద రత్నాకరం చెపుతున్నా స్త్రీలు కూడా పెటుకొంటారని సామెతల సాక్ష్యంతో నిర్ణయించవచ్చు. ఇవి పెద్దవిగా మద్దికాయల ఆకారంలో ఉండవచ్చు.

పద్మాకారంలో చేసిన కమ్మలు కమలాలు. బంగారుతో చేయించుకోలేనపుడు రాగి చెవి పోగులు, ఇత్తడి కమ్మలు ధరించేవారు. 'కుట్టేవారు కుడితే చెవులు నొప్పెట్టవు', 'ఉత్త చెవి కన్నా తాటాకు చెవి మేలు' (కార్. 317), 'తీగ పెట్టినమ్మ మాట తీయగా, కమ్మ పెట్టినమ్మ మాట కమ్మగా, విచ్చుటాకుల పెట్టినమ్మా! నీ మాట విన సహించదు అన్నదట', 'చెవ్వాకు పోయినమ్మకు దుఃఖమూ లేదు. దొరికినమ్మకు సంతోషమూ లేదు', 'జీలుగు బెండ్లు చెవులు పెంచుతాయిగాని కుండలాలిస్తాయా?', 'తలకాయ పోతూంటే చెవుల పోగులకు మళ్ళ కాడినట్లు' (నర) 'నీ మగనికి రాగి పోగులే అంటే నీ మగనికి అవీ లేవే అందట' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి.

మహమ్మదీయ స్త్రీలు చెవి అంచు వెంబడి చాలా చోట్ల దారపు పోగుల్లాంటి బంగారు నగలు ధరిస్తారు. ఆ విషయాన్ని హిందువులు పరిహసించడం 'సాహెబుకు నవాబు రాజ్యం అబ్బినా బీబీకి బుట్టురాదే' (క. గా. పుట. 201), 'మగడు నవాబైనా బూబమ్మకు కుట్టు పోగులే' అనే సామెతల్లో ధ్వనిస్తుంది.

కుమ్మరవాళ్లు కూడా కమ్మలు ధరించేవారని, చీదవారు ఇత్తడి కమ్మలు పెట్టుకొనేవారని 'కుమ్మవాని గుడ గుడాలు తెలుసునుగాని, చెవుల కమ్మల సంగతి మాత్రం తెలీదు అన్నట్లు', 'నీ మెచ్చుల మాటలకు నా యిత్తడి కమ్మలకు' (నర) అనే సామెతలు చెపుతాయి.

'మద్ది కాయలు మాటిద్ద మాడిక్కి'. 'తల్లి చెవులలో మద్దికాయలు దండుగలకు. భార్య మెడలో పూసలు బందుగులకు' అనేవి మద్దికాయలకు సంబంధించిన సామెతలు.

'కుట్టిన చెవికి బుదగలు లేవు మధ్యాహ్నం నద్దికి ఉప్పు లేదు', 'బొల్లెల మొగుడు బొగడలు చేయిస్తే అప్పుల మొగుడు అమ్ముకు తిన్నాడట' (గృ.ల.369) అనే సామెతలు బొగడల ప్రసక్తి ఉందేవి.

తీగెలు కుట్టు పోగుల్లాంటివే కావచ్చు. వాటి ప్రసక్తి 'గారవాల బిడ్డకు గడ్డపారతో చెవులు కుట్టి నలికె పారలు తీగెలేసినట్లు' (చంద్ర) అనే సామెతలో ఉంది. గడ్డపారతో చెవులు కుట్టడం, నలికె పారలు తీగలుగా వేయడం అసాధ్యం. అతి గారాబాన్ని పరిహసించిన మాటలివి.

'తల్లి చెవులు కొరికిన వాడు పినతల్లికి కమలాలు చేయిస్తాడా?' (గృ.ల.88) అనే సామెత కమలాల ప్రస్తావన తెచ్చినది.

నాసాభరణాల్లో పెసర పుడక, ముక్కెర, నత్తు, బులాకు అనేవి సామెతల్లో కనిపిస్తున్నాయి. ఎడమ పక్క ముక్కుకు పెటుకొనేది నత్తు. ముక్కు మధ్య పెట్టుకొనేది బులాకీ. బంగారు నాసాభరణం లేనప్పుడు పెసర పుడక (?) పెటుకొనేవారు. వీటి ప్రస్తావన ఉండే సామెతలు: 'మొండి ముక్కున ముక్కెర ఉంటె మూతి తిప్పడమే ముచ్చటగా అనుకొన్నదట'. 'ముక్కిడి తొత్తుకు ముత్యపు నత్తేలా?', 'ధనియాలకు దమ్మిడీ లేక పోయినా లంజకు బులాకు' (రా. ప. 887) అనేవి. నాసాభరణాలకు బంగారంలో ముత్యం పొదుగుతుండటం వల్ల నాసాభరణానికి 'ముత్యం' అనే పేరు కూడా వచ్చింది. ఆ విషయాన్ని తెలిపే సామెత 'ముక్కు చిన్నది ముత్యం పెద్దది' అనేది.

పూసలు అంటే మణులు అనే అర్థం ఉంది. విలువ ఎక్కువగా వుండే రత్నాల్ని దండగా గుచ్చుకోలేని పేదలు రంగు పూసలు దండగా గుచ్చుకొని వేసుకుంటారు. వివాహిత స్త్రీలు తప్పనిసరిగా మెడలో ఏదో ఒక దండ ధరించాలి. రత్నాలు కాదు గదా, మామూలు పూసలు కూడా కొనలేని ఒక బీదరాలి ఆక్రందన 'నల్ల పూసకు తెల్ల పూస లేదు, తెల్లపూసకు నల్లపూస లేదు' (కార్. 2421) అనే సామెతలో ప్రతి ధ్వనిస్తున్నది. ప్రేమ నటిస్తూ నగలు కాజేసే ప్రియులను 'మెడ తడవడం పూసల కొఱకే' అనే సామెత బయట పెడుతున్నది. హారం తగిలించే వంకర కమ్మి కొలికి. కొలికికి తగిలించే పూస కొలికి పూస. హారానికి కొలికి అవసరాన్ని 'నూరు పూసలకు ఒకే కొలికి', 'ముఖానికి ముక్కుసర దండకు కొలికాసర' అనే సామెతలు చక్కగా చెప్తాయి.

కర్ణాభరణాలు : తీగెలు, కమ్మలు, మద్దికాయలు, కుట్టు పోగులు, కుండలాలు, బొగడలు కమలాలు, అనేవి. పేదలు చెవులకు తాటాకుల కమ్మలు పెట్టుకొనేవారు. కమ్మ అంటే తాటాకు అని అర్థం. ఆ తర్వాత బంగారు కమ్మలు వచ్చాయి. చెవులు కంసలి చేత కుట్టించు కుంటారు. జీలుగు బెండ్లు. తాటాకులతో చేసిన విచ్చుటాకులు, కమ్మకు సరిపోయేట్లు చెవి రంధ్రం పెద్దదయేందుకు ఉపయోగిస్తారు. పురుష కర్ణాభరణాలు పోగులు. చెవులు కుట్టించుకొన్నపుడు సన్నని దారపు పోగుల్లాంటి కుట్టు పోగులు పెట్టుకుంటారు. చెవి పై భాగంలో ధరించే కర్ణాభరణాలు బొగడలు. బాలుర చెవితమ్మలకు పెట్టే కర్ణభూషణాలు మద్ది కాయలు అని బ్రౌణ్యం, శబ్ద రత్నాకరం చెపుతున్నా స్త్రీలు కూడా పెటుకొంటారని సామెతల సాక్ష్యంతో నిర్ణయించవచ్చు. ఇవి పెద్దవిగా మద్దికాయల ఆకారంలో ఉండవచ్చు.

పద్మాకారంలో చేసిన కమ్మలు కమలాలు. బంగారుతో చేయించుకోలేనపుడు రాగి చెవి పోగులు, ఇత్తడి కమ్మలు ధరించేవారు. 'కుట్టేవారు కుడితే చెవులు నొప్పెట్టవు', 'ఉత్త చెవి కన్నా తాటాకు చెవి మేలు' (కార్. 317), 'తీగ పెట్టినమ్మ మాట తీయగా, కమ్మ పెట్టినమ్మ మాట కమ్మగా, విచ్చుటాకుల పెట్టినమ్మా! నీ మాట విన సహించదు అన్నదట', 'చెవ్వాకు పోయినమ్మకు దుఃఖమూ లేదు. దొరికినమ్మకు సంతోషమూ లేదు', 'జీలుగు బెండ్లు చెవులు పెంచుతాయిగాని కుండలాలిస్తాయా?', 'తలకాయ పోతూంటే చెవుల పోగులకు మళ్ల కాడినట్లు' (నర) 'నీ మగనికి రాగి పోగులే అంటే నీ మగనికి అవీ లేవే అందట' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి.

మహమ్మదీయ స్త్రీలు చెవి అంచు వెంబడి చాలా బొల్లదారపు పోగుల్లాంటి బంగారు నగలు ధరిస్తారు. ఆ విషయాన్ని హిందువులు పరిహసించడం 'సాహెబుకు నవాబు రాజ్యం అబ్బినా చెవికి పట్టుదారాలే' (వ. గా. పుట. 201), 'మగడు నవాబైనా బీబమ్మకు కుట్టు పోగులే' అనే సామెతల్లో ధ్వనిస్తుంది.

కుఱ్ఱవాళ్లు కూడా కమ్మలు ధరించేవారని, పేదవారు ఇత్తడి కమ్మలు పెట్టుకొనేవారని 'కుట్టువాని గుడిసెలు తెలుసుకున్నాని. చెవుల కమ్మల సంగతి మాత్రం చెప్పేదు అన్నట్లు'. 'నీ మెచ్చుల మాటలకు నా ఇత్తడి కమ్మలకు' (నర) అనే సామెతలు చెప్తాయి.

'మద్ది కాయలు మాటిస్తే మాడ్చి'. 'తల్లి చెవులలో మద్దికాయలు దండుగలకు, భార్య మెడలో పూసలు బంగుగులకు' అనేవి మద్దికాయలకు సంబంధించిన సామెతలు.

'కుట్టిన చెవికి బుదగలు లేవు మధ్యాహ్నం నద్దికి ఉప్పు లేదు', 'బొల్లం మొగుడు బొగడలు చేయిస్తే అప్పుల మొగుడు అమ్ముక తిన్నాడట' (గృ.ల.369) అనే సామెతలు బొగడల ప్రసక్తి ఉండేవి.

తీగెలు కుట్టు పోగుల్లాంటివే కావచ్చు. వాటి ప్రసక్తి 'గారువాల బిడ్డకు గడ్డపారతో చెవులు కుట్టి నలికె పారలు తీగెలేసినట్లు' (చంద్ర) అనే సామెతలో ఉంది. గడ్డపారతో చెవులు కుట్టడం, నలికె పారలు తీగలుగా వేయడం అసాధ్యం. అతి గారాబాన్ని పరిహసించిన మాటలివి.

'తల్లి చెవులు కొరికిన వాడు పినతల్లికి కమలాలు చేయిస్తాడా?' (గృ.ల.88) అనే సామెత కమలాల ప్రస్తావన తెచ్చినది.

నాసాభరణాల్లో పెసర పుడక, ముక్కెర, నత్తు, బులాకు అనేవి సామెతల్లో కనిపిస్తున్నాయి. ఎడమ పక్క ముక్కుకు పెటుకొనేది నత్తు. ముక్కు మధ్య పెట్టుకొనేది బులాకీ. బంగారు నాసాభరణం లేనప్పుడు పెసర పుడక (?) పెటుకొనేవారు. వీటి ప్రస్తావన ఉండే సామెతలు: 'మొండి ముక్కున ముక్కెర ఉంటె మూతి తిప్పడమే ముచ్చటగా అనుకొన్నదట'. 'ముక్కిడి తొత్తుకు ముత్యపు నత్తేల?', 'ధవియాలకు దమ్మిడీ లేక పోయినా లంజకు బులాకు' (రా. ప. 887) అనేవి. నాసాభరణాలకు బంగారంలో ముత్యం పొదుగుతుండటం వల్ల నాసాభరణానికి 'ముత్యం' అనే పేరు కూడా వచ్చింది. ఆ విషయాన్ని తెలిపే సామెత 'ముక్కు చిన్నది ముత్యం పెద్దది' అనేది.

బంగారు పండ్లను పండ్లు పోయినవారు కట్టించుకునే సంగతిని 'పాచి పండ్లోడు కూడ బెడితే బంగారు పండ్లోడు మాయం చేసే' (రా. వ. 417) అనే సామెత తెలుపుతుంది.

ధనికులు మొలతాడు బంగారు లేదా వెండితో చేయించుకొనేవారు. బిళ్లలు వేసి మొలతాడు చేయించడం ఉన్నట్లు 'అంచుతుకుల మగవానికి చీకుల (బిల్లల) మొలతాడు' అనే సామెత చెప్పుతున్నది. ధనికులు తప్ప బంగారు బిళ్ల మొలతాడు పేదలు చేయించుకోలేరని వ్యంగ్యార్థం.

హస్తాభరణాల్లో కంకణాలు, కడియాలు, ఉంగరాలు ఉన్నాయి. కడియాలు, కాళ్లకు, చేతులకు వేసుకొనేవి. బోలుగా లావుగా ఉండేవి కడియాలు. పలచగా రేకులా వెడల్పాటి గాజులాగా ఉండేవి కంకణాలు. ఉంగరాలు చేతి వ్రేళ్లకు ధరిస్తారు. వాటి ప్రసక్తి ఉండే సామెతలు: 'ముచ్చు ముండ కేల ముంజేతి కడియాలు', 'కంకణాల చెయ్యి అడితే కడియాల చెయ్యి అడుతుంది'. 'ముంజేతి కంకణానికి అద్ద మెందుకు'. 'ఉంగరాల చేతిలో మొట్టితే నొప్పి ఉండదు. (సా. సా. 63) అనేవి. ఉంగరాల చెయ్యి అంటే ధనికుని చెయ్యి అని ధ్వని.

పాదాభరణాల్లో గజ్జెలు, పిల్లాండ్లు. మెట్టెలు ఉన్నాయి. గజ్జెల్ని స్త్రీలు, పిల్లలు ధరిస్తారు. సాధారణంగా వెండితో చేస్తారు. స్త్రీలు పాదం నాలుగో వేలికి ధరించే ఉంగరంలాంటి నగ పిల్లెండ్లు. రెండో వ్రేలికి ధరించే రెండు ఉంగరాల్లాంటివి మెట్టెలు. పూర్వం మొగవాళ్లు కూడ మెట్టెలు ధరించేవారు. పెండ్లిలో వరునికి కుడికాలి రెండవ వ్రేలికి ఒక మెట్టె, వధువు రెండు పాదాల రెండో వ్రేళ్లకు రెండు రెండు ధరింపజేస్తారు. వాటి విషయం 'గారాము గజ్జల కేడిస్తే వీపు దెబ్బల కేడ్చిందిట', 'అక్కున లేదు చెక్కున లేదు పీతిరి కాళ్లకు పిల్లాండ్లు', 'కంచం ఇచ్చి మెట్టె పెట్టించుకున్నా కానలేదు మొగుడు' అనే సామెతలు ఎంతో హృదయంగమంగా తెలుపుతున్నాయి.

4.6.3 తలకట్టు (37): పురుషుని తలకట్టును శిఖ, జుట్టు అని; స్త్రీ తలకట్టును కొప్పు, ముడి, జడలు అని అలంకరణ విధానాన్ని బట్టి పిలుస్తారు. నిన్న మొన్నటి దాకా పురుషులు అందంగా భావించి జుట్టును పెంచుతుండేవారు. 'ఆడు దానికి బొట్టు, మగవానికి జుట్టు' (సా) అందమిస్తాయి. పురుషులు ఎంత మంది ఒక చోట కూడినా జగడాలు, సందడి ఉండవని స్త్రీలు ఇద్దరు ముగ్గురు కూడితే చాలు

సంపద, జగడాలు ఉంటాయని, 'ముసన్నాట అరపై వగనములున్నా ఒకటే ముప్పై ఆరు గుల్లి కొప్పులున్నా ఒకటే' అనే సామెత వ్యంగ్యంగా బోధిస్తున్నది.

కొప్పు పెట్టుకొనేందుకు వెంట్రుకలు దండిగా ఉండాలి. వెంట్రుకలు బాగా చిక్కు తీస్తే తప్ప కొప్పు సరిగా రాదు. కొప్పు ముంతంత ఉండాలి. వేశ్యకు కొప్పుపైనే ఆశ. కొప్పున్న స్త్రీ తల ఎటు తిప్పినా అందమే. ధనికులు, పై కులాల వారు కుడి కొప్పు, ఇతరులు ఎడమ కొప్పు పెడతారు. చెవి దగ్గరికి కొప్పు పెట్టడం చేత కాని స్త్రీలు చేసే పని. కొప్పుకు నవరం పెడతారు. ఎడప మండలంలో నవరాన్ని 'తలదారం' అంటారు. పిగదారం అంటే పురుషులు జుట్టుకు పెట్టుకొనే నవరం కావచ్చని సందర్భాన్ని బట్టి ఊహించడం జరిగింది. ఈ విషయాల్ని అభివ్యక్తం చేసే సామెతలు 'వెంట్రుకలున్నమ్మ ఏ కొప్పయినా పెడుతుంది', 'చిక్కు తీసి కొప్పు పెట్టినట్లయింది', 'అంత నాడు లేదు ఇంత నాడు లేదు సంత నాడు పెట్టింది ముంతంత కొప్పు', 'చేత గానమ్మకు చెవి కాడ కొప్పు' (గ్రా.ల.787), 'కొప్పుకు నగరం చెప్పుకు తగరం అందము'. 'పిగ్గేమి పిగదారమా అంటే నా కేమి పిగ్గె తల దారమా అన్నదట' అనేవి.

స్త్రీలు శిరోజాల్ని ముడి గానో, జడ గానో వేసుకుంటారు. ముడి పొట్టిదిగా మెడ దాకా ఉంటుంది. ముడి, జడ ప్రసక్తి ఉంచే సామెతలు 'ముడి మూరెడు సాగదు', 'జుట్టుంటే ఎన్ని జడలైనా వేయ వచ్చును' అనేవి. రెండో సామెత 'జుట్టున్నమ్మ ఏ కొప్పు అయినా పెట్టవచ్చు' అనే సామెతకు పుత్రిక కావచ్చు.

అరుదుగానయినా స్త్రీలలో కూడా బట్ట తల ఉన్నట్లు 'ఆమె పేరు కుంతలమ్మ చూడ బోతే బట్ట తల', 'బట్ట తలమ్మ పాపట తీయమన్నట్లు' అనే సామెతలు తెలుపుతున్నాయి.

తల స్నానానికి నలుగు పిండి (అటకలి) వాడతారు. తలకు ఏదో ఒక నూనె రాస్తుంటారు. పేదవారికి నెత్తికి చమురు కూడ ఉండదు. 'త్రాగను గంజి లేదు తలకు అటకలి', 'వెట్టికి పుట్టిన బిడ్డ నెత్తికి లేక ఏడ్చిందట' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి. పల్లెల్లో అతి పేదతనాన్ని చెప్పేటప్పుడు 'నెత్తికి లేదు కుత్తకు లేదు' అంటుంటారు. నెత్తికి చమురు, వంటికి బట్ట లేదని అర్థం.

2.6.4 మీసకట్టు (18) : ప్రాచీనులు మీసానికి చాలా ప్రాముఖ్యం ఇచ్చారు. మీసాలపై నిమ్మకాయలు నిలబెట్టడం గొప్పగా, పిడికెడంత మీసాలు వుండడం పురుష చిహ్నంగా భావించారు. కొంత మంది మీసాల్ని తాకట్టు పెట్టి అప్పు

తెచ్చుకొనేవారు. మీసం గొరిగించడం అవమానాల్లో చాలా గొప్పది. ఇప్పటికీ పల్లెల్లో మీసం గొరిగించుకొన్న సోగ్గాణ్ణి పేడి మూతి అని హేళన చేయడం, పందెం నెగ్గక పోతే మీసం గొరిగించుకుంటా మనడం ఉంది.

మగ మూతికి మీసం అందమని, మీసం లేని బ్రతుకు వ్యర్థమని, దాతలు, శూరులకే మీసం ఉంచుకొనే అర్హత ఉందని, మీసాలకు సంపెంగ నూనె పూయడం విలాసం అని, రాగి రంగు మీసాలు వికార చిహ్నమని, గంజి తాగే వానికి బడాయి అనవసరం అని 'మీసం పస మగ మూతికి' 'గ్రాసం లేని కొలువు, మీసం లేని బ్రతుకు', 'ఇయ్య గల, ఇప్పించ గల అయ్యలకే గాక మీసంబున్నఖల కేలా?', 'పిఱికి వారికే పిడికెడంత మీసాలు', 'రోసం లేని మూతికి మీస మెందుకు?' 'గంజి తాగేవానికి మీసా లెగ బెట్టే వాడొకడా'. 'అంటుకోను ఆముదం లేకుంటే మీసాలకు సంపెంగ నూనె', 'అందాల పురుషుడికి రాగి మీసాలు' అనే సామెతలు తెలుపుతున్నాయి. మీసాలు దువ్వడం సవాలు చేయడానికి మీసాలు మన్ను కావడం అవమానానికి చిహ్నాలుగా 'క్రింద పడినా మీసాలు దువ్వుతాడు', 'ఏమి క్రింద పడితివే అంటే మీసాలకు మన్ను గాలేమ చూస్తివా అన్నాడట' (నర) అనే సామెతలు స్పష్టపరుస్తాయి.

4.6.5 పుష్పాలు (41) : పుష్పాలకు మన సంస్కృతిలో ముఖ్య స్థానం ఉంది. ముత్తైదువులు, కన్యలు పుష్పాల్ని ధరించే హక్కు గలిగి వుండగా, విధవలకు పుష్పాల్ని ముడుచుకోవడం నిషేధమయింది. పుష్పాల పవిత్రత దేవుని పాదాలకు సమర్పించడంలోనే ఉంది.

పుష్పాలకు సువాసన ముఖ్యం. కొన్ని దుర్గంధ కుసుమాలుంటాయి. పూలకు వచ్చేది పుట్టు వాసనే. పూలు సువాసనతోనే పుడ్తాయి. వాడి పోయిన పూలు ముడువరు. గొప్పవారితో ఉన్న తక్కువవారికికూడా సుగుణాలు, గౌరవం అబ్బినట్లు పూలతో కూడిన నారకు వాసన అబ్బుతుంది. స్త్రీల తలలెక్కే భాగ్యం కలుగుతుంది. పూల పాన్పుపై పడడం అదృష్ట చిహ్నం. పూలమ్మడం గౌరవమైన వృత్తి. స్త్రీలు కడుపుకు లేక పోయినా పూలు కావాలంటారు. 'దుర్గంధ కుసుమం కంటె నిర్గంధ కుసుమం మేలు', 'పుట్టు వాసనా? పెట్టు వాసనా', 'పువ్వు పుయ్యగనే తెలుసును పరిమళము' (కర్. 1496), 'వాడి పోయిన పూలు ముడుచువారుందురా', 'పూల వాసన నారకు పట్టినట్లు', 'నన గూడి నార తల కెక్కినట్లు' 'పడ బోయి పూపాన్పుపై బడినట్లు', 'పూలమ్మి బ్రతికినవారిని పుల్లలమ్మ బిలువ

రాదు', 'కర్పు కూటికి ఏడ్చితే కొప్పు పూలకు యేడ్చెనట' (హైసా. I-7) అనే సామెతలు పై విషయాన్ని తెలిపేవి.

పిల్లె బొండు మల్లె, పన్నీరు పువ్వు, మొగలి, మోదుగ, సంపెంగ, పొద్దు తిరుగుడు, తంగేడు, ఇప్ప పుష్పాల ప్రసక్తి సామెతల్లో ఉంది. జిల్లేళ్లకు మల్లెలు పూయవని, కొంతమంది మాట్లాడితే మల్లెలు కురిపినట్లుంటుందని, మల్లెల వాసన మడ్డి ముండకు తెలియదని, బొండు మల్లెలు బోడి తలకు అనవసరం అని, పన్నీరు పువ్వు సువాసనలను వెదజల్లుతుందని, దాని మొక్కకు ముండ్లుంటాయని, మోటు వాడికి మొగలి పువ్వు వాసన తెలియదని, మోదుగ పుష్పాలు పూసే మొక్క సంపెంగలు పూయదని, పొద్దు తిరుగుడు పుష్ప బుద్ధి చంచలమని, తంగేడు పుష్పాలు అందంగా ఉన్నా నిర్గంధాలని, వాటిని గొబ్బెమ్మలకు పెడతారని, ఇప్ప పుష్పాలు చాలా దూరం వెదజల్లే ఘాటైన వాసన కలిగి వుంటాయని సామెతలు చెప్తున్నాయి.

'జిల్లేళ్లకు మల్లెలు పూయునా?', 'మాట్లాడితే మల్లెలు కాట్లాడితే కందు రీగలు', 'మడ్డి ముండకు మల్లె పూలిస్తే ముడిచి ముడ్డి కింద పెట్టుకున్నదట', 'బోడి తలకు బొండు మల్లెల ముడిచినట్లు', 'పన్నీరు పువ్వును ఏ పేర పిలిచినా సువాసనంనే వెదజల్లుచుండును', 'ముండ్లుండగానే పన్నీరు పువ్వు పనికి రాకుండా పోయిందా?', 'మోటు వాడి కేమి తెలుసు మొగలి పూవు వాసన', 'మొప్పెకు మొగలి చెండిస్తే మడిచి గుద్దలో పెట్టుకొనిందంట' (నర). 'మొదలు మోదుగ పూస్తే కొన సంపెంగ పూస్తుందా?', 'పొద్దు తిరుగుడు పుష్ప బుద్ధికి. పొద్దుకు నిలకడ లేదు'. 'వుసుకుడా, వుసుకుడా! పూవులు తెమ్మంటే తటుకు తటుకున పోయి తంగేడు పూవులు తెచ్చినాడట', 'పాత తంగేడు పూలు పనల పండగకైనా పనికి వస్తాయి'. 'ఇప్ప పూలకు వాసన వెదక వలెనా', 'మరువము తోనే పరిమళము' అనే సామెతలు పై విషయాల్ని తెలిపేవి. మరువం మొలకలు సుగంధ భరితాలు. పుష్పాలతో మరువాన్ని కలిపి మాలలల్లుతారు.

4.8.6 చెప్పులు (22): 'కంటికి రెప్ప కాలికి చెప్పు' రక్షణకు అవసరం. ముచ్చెలు, పాపోసులు, పై జారు చెప్పుల్లో రకాలు. చివరి రెండు పదాలు హిందూస్థానీవి. చెప్పును అపవిత్రంగా, చెప్పుతో కొట్టించుకోవడం అత్యంత అవమానంగా భావిస్తారు. చెప్పులను దానం ఇవ్వడం సంప్రదాయం. కాలికి రాని చెప్పు వృథా. పని లేని వారింట్లో పాపోసుల ఏట్లాట ఉంటుంది. లక్క పాపోసులు తొడుక్కోవడం విలాస చిహ్నం. చెప్పులు తొడుక్కున్న వానికి నేల ఎత్తు పల్లాలు తెలి

యవు. బంగారుతో చేసినా ముచ్చెలు కాలికి తొడగాల్సిందే. అందం కోసం చెప్పు పై పట్టీల్ని పట్టుతో చేయడం, తగరం అతికించడం ఉంది.

ఈ విషయాల్ని వివరించే సామెతలు 'అడక్కుండా చెప్పులిచ్చాడు అడిగితే గుబ్బ మిస్తాడని అనుకొన్నట్లు', 'కాలికి రాని చెప్పును కంచెల్లో వేయమన్నారు', 'పని గల వారింట్లో పైసల ఏట్లాట, పని లేని వారింట్లో పాపోసుల ఏట్లాట' (హైసా. III-9) 'లక్క పాపోసులు తొడుగుకొని లట లట పోతావు గాని వాకిలి ఎవడు నూకుతాడోయి వన్నె కాడ', (హైసా. VII-16), 'చెప్పులు తొడుకున్న వానికి లోకమంతా తోలుతో కప్పబడ్డట్టు తోస్తున్నది' (కార్. 917), 'బంగారు చెప్పులైనా (ముచ్చెలైనా) కాళ్లకే తొడగాలి', 'డబ్బిచ్చి చెప్పుతో కొట్టించు కున్నట్లు', 'చెడి బ్రతికిన వాడు చెప్పు మీది కుచ్చు వలె త్రుళ్లి పడును', 'పట్టు కూర్చితేనే పై జారు మడి కొన', 'కొప్పుకు సగరం చెప్పుకు తగరం అందము' అనేవి.

4.6 7 అలంకరణ సామగ్రి (45) : అలంకరణం చేసుకొనేందుకు అద్దం అవసరం. గంధం, లత్తుక, కస్తూరి, అటకలి, కాటుక, పసుపు, బొట్టు అలంకరణ సామగ్రి.

అద్దం చేతికి తీసుకుంటే కోతి చేష్టలు చేయడం మానవ సహజం. ముఖం అందంగా లేక పోతే అద్దం తప్పు కాదు. అంధునికి అద్దం చూపడం వ్యర్థం. అద్దంలో నీడకు, ముడుపుకు ఆశపడడం అవివేకం. నడ మంత్రపు సిరి వచ్చినవాడు వీపు చూసేందుకు అద్దం కావాలంటాడు. ఆ విషయాలకు 'ఎదురు గుండా అద్దముంటే ఎక్కిరించుకో బుద్ధవుతుంది', 'ముఖము బాగు లేదని అద్దం పగుల గొట్టినట్లు,' 'అంధునికి అద్దం చూపినట్లు', 'అద్దంలో నీడకు ఆశపడినట్లు', 'అద్దం లోని ముడుపు అంది రాదు', 'ఎన్నడు లేని కల్మి కల్గినా వెన్నున కద్ద మద్దు, కొన వేళ్లకు ముచ్చెలు దొడుగు' అనే సామెతలు అద్దం పట్టాయి.

స్త్రీ వొంటికి పసుపు, నొసటికి బొట్టు, కంటికి కాటుక అందాన్నిచ్చేవి. విధవలకు నిషేధింపబడినవి. బొట్టు స్త్రీకి అందం అని, కాటుక లేనిదే స్త్రీ అలం కరణ పూర్తి కాదని సామెతలు చెప్తాయి. 'అంత మంచి మొగానికి అర్ధ శేరు పసుపు' (నర). 'ఈ మొగానికా సేరు పసుపు' అనేవి పసుపు అవసరాన్ని తెలిపేవి. 'ఆడదానికి బొట్టు మొగవానికి జుట్టు', 'బొట్టు పసే గాని బోనం పస లేదు', 'కూటికి లేకున్నా కాటుక చుక్క మానదు' అనేవి. 'కన్ను పోయేంత కాటుక పెడ తారా' అనే సామెతలో అంతరార్థం పరిశీలించాల్సి ఉంది.

దేహానికి, బట్టలకు సువాసన కోసం చందనాన్ని రాసుకుంటారు. తాటి చెట్టుకు గంధం పూయడం అవివేకం అని, గంధం చెక్క అరగ దీసే కొద్ది సువాసన లిస్తుందని 'తాటి చెట్లకు గంధం పూసినట్లు', 'అరగ దీసిన గంధపు చెక్కకు వాసన తగ్గునా?' అనే సామెతలు తెలుపుతాయి.

లత్తుక, అటకలి, పన్నీరు, కస్తూరి, పునుగులను గురించిన సామెతలున్నాయి. ప్రాచీనుల్లో చాలా మంది తిండికి లేకున్నా అలంకరణకు ఎక్కువ డబ్బు వెచ్చించే వారని ఈ సామెతలు సాక్ష్యమిస్తాయి. ఇప్ప నూనె పూస్తే చర్మం నిగ నిగ లాడుతుంది. పునుగు పిల్లి మంచి పునుగు వస్తుంది. పునుగు చట్టము అంటే పునుగు ఉండే చిన్న తిత్తి. 'మింగను మెతుకు లేకుంటే లంజకు లత్తుకట', 'తలకు దారి లేదు బుడ్డకు అటకలి', 'బూడిదలో పోసిన పన్నీరు బుద బుద', 'కన్నీరు కిందికి కారుతుంది పన్నీరు పైకి చిమ్ముతుంది', 'ఇంటి పేరు కస్తూరివారు ఇంట్లో గబ్బిలాల కంపు', 'ఎట్టి కొచ్చిన కస్తూరి ముడ్డికి పూయమన్నట్లు' (శ్రీపాద), 'ఇగిరి పోయిన చెంపలకు ఇప్ప నూనె పెడితే సావిదాని ముఖం నవ నవ లాడిందట', 'పునుగు చట్టము పిండినట్లు' అనే సామెతలు పై అలంకరణ సామగ్రిని గురించి చెప్పేవి.

4 6.8 ఈ ఉప ప్రకరణంలోని ముఖ్యాంశాలు కొన్ని: స్త్రీలు అలంకరణ కెక్కువ ప్రాముఖ్యమిచ్చే వారు. సన్న చీరలు, రంగు చీరలు. పట్టు చీరలంటే వారికి ప్రీతి. నగలను ధనికులు బంగారు, వెండితో, పేదలు రాగి, ఇత్తడితో చేయించుకొనేవారు. స్త్రీ తలకట్టు విధానాల్లో కొప్పును అందంగా భావించేవారు. పురుషులు మీసాలకు మిక్కిలి విలువ ఇస్తుందేవారు. తినేదానికి లేకపోయినా పూలు ముడవడం, కాటుక, బొట్టులాంటి అలంకరణ చేసుకోవడం స్త్రీలు మానలేదు.

ఈ సామెతల్ని బట్టి కొన్ని సాంఘికాచారాలను నిర్ణయించవచ్చు. కొన్ని కులాలవారు కుడి పైట వేసుకోవడం, కుడి కొప్పు ధనికులు పెట్టు కోవడం, ధనికులైనా మహమ్మదీయ స్త్రీలు చెవులకు కుట్టు కాడలు ధరించడం మొదలైనవి.

అప్పటి నగలు, చీరలు. అలంకరణ సామగ్రి కొన్నిటికి కొన్ని ఇప్పుడు ప్రజల వాడుకలో లేక పోయినా సామెతల్లో మాత్రం సజీవంగా ఉన్నాయి. ఉదా: పరి, రావి రేక, మద్దికాయలు. ఉభయ రాగాల చీర. అటకలి మున్నగునవి.

పై విధంగా తరతరాల తెలుగు ప్రజల వేషధారణను ఈ ఉపప్రకరణంలో సామెతల ఆధారంగా నిర్ణయించడం జరిగింది.

## ★ ఆంధ్రుల కులాలు - కొన్ని వివరాలు

పట్టిక నెం. 4

| వరుస సంఖ్య | కులం పేరు | ప్రధాన వృత్తి | బిరుదనామం | కుల భిక్షుకులు | నా పరిశీలనలోని సామెతల సంఖ్య |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1) | ఈడిగ/ఈంద్ర గమళ్ల/గమండ్ల, ఆపిలీలు | ఈత, తాటికల్లు తీయడం | అయ్య, అప్ప. గౌడు, చెట్టి | .. | 4 |
| 2) | ఉప్పర, సగరకుల | ఉప్పు చేయడం, మట్టి పని | చెట్టి | ... | 5 |
| 3) | ఎరుకల, కొరవ/కొరచ | సోది చెప్పడం, దొంగతనం | . | .... | 8 |
| 4) | ఒడ్డె | మట్టి పని | నాయకన్, బోయన్ | ... | 8 |
| 5) | కంచరి | కంచు పని | ఓజు, అయ్య, ఆచార్య, ఆచారి | పనస రుంజ | 2 |
| 6) | కంసల | బంగారు. వెండిపని | .... | .... | 27 |
| 7) | కమ్మ | వ్యవసాయం | నాయుడు | పిచ్చిగుంట్ల | 17 |
| 8) | కమ్మరి | ఇనుప పని | ఓజు, అయ్య, ఆచార్య. ఆచారి | పనస, రుంజ | 4 |
| 9) | కాపు/రెడ్డి | వ్యవసాయం | రెడ్డి | పిచ్చిగుంట్ల | 88 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| --- | --- | --- | --- | --- | --- |
| 10) | కుమ్మర | కుండలు చేయడం | .... | .... | 25 |
| 11) | కురవ/కురుబ | గొర్ల పెంపకం, ఉన్ని కంబళ్ల నేత | గౌడ, హెగ్గడె, కౌతిగిడున్, నాయక్కన్ | .... | 4 |
| 12) | కోమటి/వైశ్య | వ్యాపారం | శెట్టి, చెట్టి, శ్రేష్ఠి, అయ్య | మైలారి, పీరమ్మ | 87 |
| 13) | క్షత్రియులు | .... | .... | .... | |
| 14) | గాండ్ల/గానిగ, తెలిక | నూనె తీయడం | చెట్టి | .... | 9 |
| 15) | గొల్ల/యాదవ | పశుపోషణ, గొర్ల పెంపకం, పాలు అమ్మకం | మందాడి | పిట్టగుంట్ల | 31 |
| 16) | చండాల | .... | .... | ... | 3 |
| 17) | చాకల | బట్టలుతకడం | .... | మైలారి, పటం | 41 |
| 18) | తంబళి | అర్చకత్వం | అయ్య, అప్ప | .. | 8 |
| 19) | తొగట | అద్దకం, నేతపని | .... | .... | 1 |
| 20) | తోటి/వెట్టి | వీధులూడ్వడం, శవవాహకత్వం | .... | .... | 4 |
| 21) | దూదేకుల,పింజారి | దూది ఏకడం, పరుపులు కుట్టడం | బై, అన్న, అప్ప, సా, అమ్మ | .... | 7 |

| 1 | 2 | 4 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 22) | దొమ్మర | సాము గరిడీలు చేస్తూ భిక్ష మెత్తడం, పడుపు వృత్తి, దొంగతనం | .... | ... | 3 |
| 23) | పిచ్చుగుంట్ల | భిక్షుకత్వం | .... | .... | 1 |
| 24) | బండ | భిక్షుకత్వం | .. | .... | 4 |
| 25) | బలిజ | వ్యాపారం (గాజులు గుండపొడి మొ॥వి) | నాయుడు | .... | 9 |
| 26) | బుడబుడకల | భిక్షుకత్వం | .. | ... | 1 |
| 27) | బూచీ | .. | .... | .... | 1 |
| 28) | బెస్త | చేపలు పట్టడం, పల్లకీ బోయీలు | | .... | 3 |
| 29) | బోయ/బేడర్ | దొంగతనం, తలారి, వ్యవసాయం | నాయుడు, నాయక్ దొర, దొర బిడ్డ | ... | 4 |
| 30) | బ్రాహ్మణ | పౌరోహిత్యం, వైద్యం మంత్రి, కరణం | .... | ... | 109 |
| 31) | భట్రాజు | పొగడి దానం పట్టడం | .... | .... | 3 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 32) | మంగల/కల్యాణ కులం భజంత్రీలు/అంగారకులు | క్షుర కర్మ, భజంత్రీలు వాయించడం | అన్న, గారు, అయ్య | .... | 41 |
| 33) | మాదిగ | చర్మకార వృత్తి | .... | దక్కలి, మాష్టిగ | 29 |
| 34) | మాల | నేత, కాటికాపరితనం, దొంగతనం | .... | మాష్టిగ, పంబల, నిత్యులు | 53 |
| 35) | ముత్రాచ/ముదిరాచ | చేపలు పట్టడం, గ్రామ తలారి | దొర, నాయుడు | .... | 4 |
| 36) | మొండి | భిక్షకత్వం | .... | .... | 5 |
| 37) | మొదలియారు | .... | .... | .... | 3 |
| 38) | యానాది | వేట, కావలి, తోటపని | .... | .... | 6 |
| 39) | వడ్రంగి/వడ్ల | కొయ్య పని | అయ్య, ఓజు, ఆచార్య, ఆచారి | పనస, రుంజ | 3 |
| 40) | వెలమ/ఎలమ | వ్యవసాయం | దొర, నాయుడు | .... | 8 |
| 41) | శూద్ర | .... | .... | .... | 1 |
| 42) | సాలె/దేవాంగ | నేత | .... | వీరముష్టి | 35 |

* థర్‌స్టన్ "Castes and Tribes of Southern India" గ్రంథం (1 నుంచి 7 సంపుటాలు) ఆధారం.

పట్టిక నెం. 5

## LIST OF THE PROVERS STATED IN "CASTES AND TRIBES OF SOUTHERN INDIA" (Vol. 1 - 7) OF E. THURSTON

**Balija :**

1. If a man be born a Balija, he must crack the arrack bottle.

**Chetti :**

2 He who thinks before he acts is a Chetti, but he who acts without thinking is a fool.

3. When the chetty dies, his affairs will become public.

4. Though ruined, a chetti is a chetti, and though torn silk is silk.

5. From his birth a chetti is at enmity with agriculture.

**Dasari :**

6. The mistake of a Dasari is excused with an apology.

7. The songs of Dasari are known only to the God i.e. they are unintelligible and unreal

8. For the song of Dasari alms are the payment i.e. that is all the song is worth.

9. Sing again what you have sung oh! Dasari, with dirty teeth.

10. When a beggar was asked whether he was a Dasari or Jangam, he replied that it depends on the next village. This is reference to his being a time server.

**Golla :**

11. ... a golla will not scruple to water the milk which he sells to his own father.

12. Another proverb refers to the corrupt manner in which he speaks his mother-tongue.

**Kaikolan :** (Tamil weaver caste)

13. Narrate stories in villages where there no kaikolans.

14. Why should a weaver have a monkey ?

15, On examining the various occupations, weaving will be found to be the best.

16. The person who was too lazy to weave went to the stars.

17. The chetti (money - lender) decreases the money, and the weaver the thread.

**Kamma:**

18 Kammavani chetulu kattina nilavadu.

19. Kammavandlu cherite kadama jatulu vellunu.

20 Kammavariki bhumi bhaya padu tunnadi.

**Kamsala:**

21 ... the Kamsalas are of all castes seven visses (viss, a measure of weight) less.

**Kapu:**

22. Only a Reddi can cultivate the land, even though he was to drink for every clod turned over.

23. Those are Reddis who set their living by cultivating the earth.

24. The Reddi who grows arika can have must but one cloth for man and wife.

25. It is a common saying among the kapus that they can easily enumerate all the varieties of rice, but it is impossible to give the names of all the sections into which the caste is split up.

26. So great is the attachments of the vadugan to the black cotton soil that the Tamilians mock him by saying that, when God offered paradise to the vadugan, the latter hesitated, and enquired where there was black cotton soil there.

27 The kapu protects all.

28. The kapus difficulties are known only to God.

29 The kapu dies from even the want of food.

30. The kapu knows not the distinction between daughter and daughter-in-law (i.e ) both must work for him.

31. The kapu goes not to the fort (i.e.) into the presence of the Raja. A moderate variant is that the kapu goes not to the court (of law).

32 While the kapu was sluggishly ploughing, thieves store the rope collars.

33. The year the kapu came in, the famine came too.

34. The Reddis are those who will break open the soil to fill their bellies.

35. When the unpractised Reddi got into a palanquin it Swing from side to side.

36 The Reddi who had never mounted a horse sat with his face to the tail.

37. The Reddi fed his dog like a horse and barked himself.

**Komati :**

38 Telugu teta Aravam adhvanam.

39. A Brahman will learn if he suffers and a Komati will learn if he is ruined'

40. If I ask whether you have salt, you say that you have dhol.

41. Like the burning of a Komati's house, which would mean a heavy loss.

42. When the komatis whisper one the other side of the lake you will hear them on this side.

43. The komati that suits the stake .. The proverb is now used of a person who is forced to suffer for the faults of others.

44. The Komatis are satirically named Dhaniyala Jati.

**Korava - (Erukala) :**

45. There is a Tamil Proverb "give an elephant to Pandit and a cat to a kuravan".

46. With dry mouths nothing can be uttered.

47. There is a Tamil proverb that, if a korati is brought to bed, her husband takes the prescribed stimulant.

48. ... that no one has seen a dead monkey, or the burning ground of a korava.

**Karanam :**

49. Even if a thousand pagodas are levied from a village not even a cash will be levied from the karnam

50. The karnam is the cause of the kapu's death.

51. The hungry karnam looks into his old accounts (to worry his creditors).

52. The Co-operating of the karnam is necessary as the axles to the wheels of a cart.

53 One karnam to one village.

54. If a karnam trusts another, his end is near. If an enemy is his neighbour, if another karnam is his superior, if the kapu bears complaints against him a karnam cannot live on.

**Madiga :**

55. Under the magili system of cultivation, even a Madiga will grow good crops, not even a Madiga will sow before Mala punnamma.

**Mala :**

56. Dagipoyinavandlu dagindlavandlu.

**Mondi :**

57. The rough and rugged ground traversed by the Kalladi siddhan is powdered to dust.

58. Which ever way the Kalladi mangam goes you should dole out a measure of grain for him.

**Mutracha:**

59 There is a saying current among the Mutrachas that the mutrachas caste is good as a pearl, but become degraded as its members began to catch fish.

**Odde:**

60. There is a common saying that a widow may amount the marriage dias seven times.

61. The Oddes live with their huts on their heads, (i. e, low huts) .

62. Cobras have poison in their fangs, and oddes in their tongues.

63. Though wealth accumulates like mountain, it soon disappears like mist.

**Sale:**

64. ... if you want to narrow the breadth of a river, you should plant reeds on its margin; and if you desire to destroy the sanitation of a village, you should bring weavers into it and settle them there.

65. .. the chetti (merchant) loss by partnership while the weaver came to grief by isolation.

66. If a dog gets a sore at its head, it never recovers from it; and even so a weaver who gets a sore on his foot.

**Satani:**

67. Tie knot on the Satani's tuft of hair, and on the ascetic's holy thread.

**Toti:**

68 ... if you work like a Toti, you can enjoy the comforts of a king

**Uppara:**

69. ... one is ruined both ways, like an uppara who has turned Sanyasi.

**Vetti:**

70. Whatever may be wealth of the lord who comes to rule over him, his duty of supplying him with a bundle of grass is not to cease.

71. Let the vettiyan and corpse struggle to-gether (Tamil proverb).

పట్టిక నెం. 6

# ఈ గ్రంథ రచయిత సేకరించిన సామెతలు

అంత మంచి మొగానికా అర్ధశేరు పసుపు
అంత మటుకు ఊరగ నీ నెత్తిన నే నేరగ
అంత్య భ్రష్టత్వం కన్న ఆది నిష్ఠూరం మేలు
అందమేం కడుక్కొని తాగుతామా!
అందమైన ముఖానికి అర్ధ శేరు పసుపు దండుగ
అందరికీ సైనం చెప్పే బల్లి కుడితొట్లో పడినట్లు
అక్కుఅ తీరి ముక్కుర నాది అన్నట్లు
అట్టహాసం పట్టె మంచం
అడ్డము లేని గుఱ్ఱం అగడ్తలు దాటిందంట
అతి తమ్ముడు అఘాయిత్యుడు
అతి మరణం
అత్త బచ్చిన ఆర్నెల్లకు నిట్టాడి గుంజ పట్టుకొని నిగిడి నిగిడి ఏడ్చిందంట
అత్త మీద కోపం పిత్తు మీద చూపినట్లు
అత్తా నిన్ను కొత్తకుంట్లో ఏపి మొత్త
అదవ ఎవరు అంటే అలు సచ్చినోడంట
అది నోరా? అలవ గుద్దా?
అదునూ పదునూ పోయినాక నా మొగుడు రాగి సేద్యగాడు
అదృష్ట వంతుడికి ఆతుల్లో తేనెపట్టు పట్టుతుంది
అదో పాముంటే తోకే తొంబై ఆమడ అన్నాడట
అద్దానాన అలుగూడా తోడు గాదు
అద్దెడు వడ్లకు అతులు పెరకను పోతే గాదెడు వడ్లు గాడిద మేసిపోయెనంట
అన్నము చుట్టరికము, దుడ్డు పగ
అన్నమైతే నేమిరా మరి సున్నమైతే నేమిరా అందుకని ఈ పాడు పొట్టకు అన్నమే వేతామురా!
అన్నీ చెప్పిన పెద్ద మనిషి అ కూటికే అలాం అయినాడు
అన్నీ తెలిపిన బల్లి కుడితొట్లో పడినట్లు
అప్పు అంటే ఆరేనిగల్ని సై అంటాడు

అప్పులు చేసి కుప్పలు పెట్టినట్లు
అప్పులేని గంజి చిప్పెడైనా చాలు
అప్పులేని వాడు అధిక సంపన్నుడు
అబద్ధాలు చెప్తే ఆడ పిల్లలు పుడ్తారు
అబ్బడు బాయిలో ఏరిగితే, కొడుకు బాయి గడ్డన ఏరుగుతాడా?
అబ్బని పున్నేన బాయి తవ్విస్తే కొడుకు పున్నేన బూడదెంగె
అమ్మ కడుపు చూస్తుంది పెళ్లాం జేబు చూస్తుంది
అమ్మను తిట్టగాకురా నీయమ్మ నాయాలా అన్నట్లు
అమ్మ పొత్తులో ఆలి పొత్తులో తినేవాడు
అయితే అవతలి గట్టు లేక పోతే ఇవతలి గట్టు
అయితే ఆటాకోర్ లేక పోతే జాటా కోర్
అయితే ఆతుకూరు లేక పోతే భట్టిపాడు
అయి పుట్టిన పియ్యి తింటాడు
అయ్యిందయింది పోయింది పోయింది
అయ్యొచ్చే పనికి పియ్యొచ్చిందట
అరవై అమడ పొయ్యి హరికథ వినాల. తొంబై అమడ పొయ్యి
తోలు బొమ్మలాట చూడాల
అరువులు చెప్పినోనికి అడ్డగ, పని జేసినోనికి పాతిక
అర్జునా అంటే అరవై ఆమడ అవతల పోయి పడుతుంది
అలిపి చెల్లి, అక్క యింటికి పోతే అక్క బావ ప్రక్కన పరుండ బెట్టిందిట
అవతల గట్టా? ఇవతల గట్టా?
అవ్వ అతులకు తాత మీసాలకు సరి పోయింది
ఆంధ్రానాం అనైకమత్యం
ఆంధ్రుల ఆరంభ శూరత్వం
ఆగిత్యము అరుపాళ్లు
ఆట విడుపు చేట దెబ్బలు
ఆడదానికి కొవ్వు పట్టినా, దున్న పోతుకు పొగరు బట్టినా, దాపు తాడు తెగ
మరిగినా ఉండవు
ఆడ పెత్తనం బోడి పెత్తనం

ఆడ బిడ్డ చెడితే పుట్టినిల్లు చేరాల బంగారు చెడితే కంసలిల్లు చేరాల

ఆడ బిడ్డలు పుట్టిన ఇల్లూ, ఎనుములు పడిన మడుగు, చేపలు తిన్న కడుపు ఒకటే

ఆతులు గొరిగే మంగల కత్తి మాకులు తెగుతుందా?

ఆతొచ్చినా ఆదాయమే (కోమట్లు) ఇచ్చెయ్ బావా!

ఆముదముతో గుద్ద కడుక్కున్నట్టు

ఆయనే ఉంటే మంగలెందుకు?

ఆయము ఆరునెల్ల వెతుకులాడుతుందట నెత్తురు గడ్డ

ఆరుబాటం కోడిపెట్ట తోలు గుడ్డు పెట్టిందంట

ఆరేసి మూడెత్తు కున్నట్టుంది

ఆలిని గదరా అలుపుడా? అంటే, పేరు రాకపోయెనే పెద్దమ్మా: అన్నాడట

ఆలి వెనుక అరుగుల మీంద, మగని వెనుక మంచాల కింద

ఆలు అరిటి పండు, తల్లి తలకాడ పుండు, చెల్లెలు చేదుకాయ, లంజ లవంగం మొగ్గ

ఆలు చుట్టాలు అరుగుల మీద, మొగుని చుట్టాలు మంచాల కింద

ఆలూ మొగుని కొక గుడ్డ అడక్క తిన్నొక పెంకు

ఆవిటి గాలి మళ్లితే ఆకలి జాస్తి

ఆశకు పోతే గోసిలో రాయి పడిందంట

ఇంటికి కోడలొచ్చిన వేళ, గొడ్డొచ్చిన వేళ, కుండొచ్చిన వేళ

ఇంటి దేవుని కన్న పంటి కుక్క మేలు

ఇంటి సొమ్ముకు బాడిగేమి?

ఇంట్లో వాడే పెట్టెరా కంట్లో పుల్ల

ఇంట్లో వాళ్ల ఈకెనేస్తే బయట వాళ్లు పరకనేసిరి

ఇచ్చిత్రం ఎల్లక్కా అంటే బెల్లం పుల్లక్కా అనిందంట

ఇచ్చిత్రాని కిద్దరు చస్తే ఈడ్చలేక ముగ్గురు సచ్చినారంట

ఇద్దరాండ్ల వాడు, మూడెద్దులోడు ఒకటి

ఇప్ప పూలు పూసేకాలం నిప్పుల్లో పడినా చలి పోదు

ఇరికించి పెరుకు లాడినట్లు

ఇరికిరికి పెడితే ఇల్లంతా చాల్లు

ఇరు పోటీల మీద ఇల్లు చెడె - వాయు నొప్పులతో వాళ్ళు చెడె
ఇల్లు లేనమ్మ ఈనం చెడె, మొగుడు లేనమ్మ మానం చెడె
ఈడుపు కాళ్ళది ఇంటికి చేటు, పొడ్డి కాళ్ళది దోవకు చేటు మాడుపు మొగముది మొగునికి చేటు
ఈతెగిరి ఆడ చూసుకాడు
ఈతమాను ఇల్లు కాదు. తాటి మాను తావు కాదు, తగులు కున్నోడు మొగుడు కాదు
ఈత రానమ్మను గంగమ్మ ఎత్తుక పోయెనంట
ఈ పొద్దింట్లో రేవు మంట్లో
ఉచ్చికాయంత బలిజోడుంటే ఊరంతా చెడిపోతుంది, కంది గింజంత కాపోడుంటే కలిగ్గమంతా బతుకుతుంది
ఉడికిన పొట్టపేగు కూడా తెంప లేవు
ఉత్తర ఉరిమినా, పాము తరిమినా తప్పదు
ఉత్తమా పతివర్త ఊరెళ్లి పోతుంటే ఊర్లో కోళ్లన్నీ తేరెళ్లి పోయెనంట
ఉన్న వారి దయా, ఊట బావి నీళ్లు ఒకలాంటివే
ఉపాయం ఉంటే అపాయం లేదు
ఉపాయముందిగాని రూపాయల్లేవు
ఉప్పు రాతికి కూడా పనికిరావు
ఉప్పు లేని కూడు తిని దిక్కు లేని చావు చచ్చెనంట
ఉరికే వాడు బిత్తలే, తరిమేవాడు బిత్తలే
ఉరికేవాన్ని జూస్తే జూస్తే తరిమేది జాస్తి
ఉలవ పొల్లో బక్కోడ్డు పడినట్లు
ఊదు మొగమోడా ఊరికి పోదామా? అంటే, రెప్పలార్పే వాడా: రేపు పోదాం అన్నాడట
ఊనాపు దేవుడా ప్రాణానికి చేటా అని ఉంది/అన్నాడు
ఊపిరుంటే ఉప్పమ్ముకొని బతకొచ్చు
ఊబల నోరు దాబలు గొడితే దాబలు నోరు దయ్యాలు గొట్టెనంట
ఊరికే ఉంటే ఊరేమి? పేరేమి?
ఊరికే ఉండే ప్రాణానికి ఉరి పెట్టుకొన్నట్లు
ఊరిమిందికి ఉప్పాళ లంజకు కొప్పాళ

ఊరి ముందర తవట నిక్కు సవట నేల వాన నిక్కు

ఊరివాళ్ల మీద పోట్లాడి తేరు చూడకుండా పోయినట్లు

ఊర్లో ఇల్లు లేదు, అడవిలో చేను లేదు

ఎండకు పెట్టిన పందిలి వానకు నిలుస్తుందా

ఎండ్రకాయ కొవ్వు పడితే బొక్కలో ఉండదు

ఎంత జేసినా క్రొత్త కుండలో నీళ్లు బోసినట్లే

ఎంత పెద్ద కుందేలయినా వలకు తలకిందే

ఎక్కిరిస్తే అందం పోతుంది

ఎక్కువ ఆశకు పోయి వేటకాడు చచ్చెనంట; తక్కువ బుద్ధికి పోయి నక్క చచ్చెనంట; కొలనేముకోనికి పోయి కొంగ చచ్చెనంట

ఎచ్చులకారి మొగుడు వెనక్కి పోనీడు, ముందుకూ పోనీడు

ఎచ్చు ఎలకిల పడింది బొచ్చు బోళ్ల పడింది

ఎచ్చుకు పోయి ఎలకిల పడినాడంట

ఎత్తుక పొయ్యి ఏట్లో వేసినట్లు

ఎత్తుకొని మొత్తుకున్నట్లుంది

ఎద్దు ఏటంటే పోతే ఏమి? బండి బాటంట పోతే ఏమి?

ఎద్దు దున్ని దున్ని చస్తే పిడుదు ఒగిరిచ్చి చచ్చిందంట

ఎద్దులో లాభం గుదలో పోయింది

ఎనుము నెక్కువానికి తోక ఎత్తే వాడు ఒకడా?

ఎన్ని గుఱ్ఱాల మీద వచ్చినాడు?

ఎన్ని పుంగనూర్లయితే ఒక బెంగుళూరవుతుంది?

ఎరికలోని మాట యాడికి నిజము?

ఎరుపు వెర్రి ముండ మెచ్చు, నలుపు నారాయణుడు మెచ్చు

ఎలుక ఎలుక తట్టే తోడుతుంది కాని కొక్కు తట్టు తోడుతుందా?

ఎవడెవడు చేసిన కర్మ వానికే కొట్టుకుంటుంది

ఎవరి జానతో వాళ్లు ఎనిమిది జానలే

ఎవర్నన్నా పిల్చుక రా గాని గిత్తోన్ని పిల్చుక రాకు

ఏం చేస్తాండావు కోడలా? అంటే, ఉలగ బోసి ఎత్తుకుంటాండాను అత్తా? అనిందంట

ఏ ఊరు పోతున్నావు అంటే, ఏట్లో మోకాటి లోతు నీళ్ల అన్నాడట
ఏగే వాళ్లుండే వచ్చింది ఆపద పడతారు
ఏట్లో నీళ్లు పారుతున్నా కుక్కకు గతగతలే
ఏది పొట్ట పోస్తే ఎంతో బాగా అరుగుతుంది
ఏనుగెక్కి ఏకాంతమాడరాదు
ఏమిరా గుడ్డోడా పడితివంటే, అదొక లగువులే! అన్నాడంట
ఏరా క్రింద పడితివే! అంటే, మీసాలకు మన్నవలేదు చూస్తివా అన్నాడట
ఏరిగేత్రాపుడు గుడ్డ మరచి పోయేవాడు
ఏరు దాటిందాకా ఎంగన్నా, ఏరు దాటినాంక నా పింగన్న
ఏ రామేశ్వరం వెళ్లినా శనేశ్వరం తప్పనట్లు
ఏ వేళప్పుడు లేచినా రాళ్లాంకరాద్నే తెల్లవారినట్లు
ఒంటే కొడుకని వరి కూడు పెడితే వడ్డెవోళ్ల పాలయినాడంట
ఒకనాటి ఒకసమ్మంట
ఒక పూట తింటే యోగి, రెండు పూటలు తింటే భోగి, మూడు పూటలు తింటే రోగి
ఒక బిడ్డ బిడ్డా కాదు, ఒక గుడ్డు గుడ్డూ కాదు
ఒకరు పెట్టిన పుట్టగోచి ఎన్నాళ్ళుంటుంది?
ఒకరు మెచ్చా వక్కపేడు గూడా తేలేము
ఒట్టు తీసి గట్టున పెట్టు
ఒడ్డూ వాసాలకి మేగాని బిడ్డకు పాలు లేవు
ఒత్తి పలకవే వియోగిపిల్లీ! అంటే, మ్ర్యావ్ మ్ర్యావ్ అన్నదట
ఒత్తి పలకవే వైష్ణవ పిల్లీ! అంటే, మ్ర్యావ్ మ్ర్యావ్ అన్నదట
ఒప్పని పెండ్లాన్ని ఒసే అన్నా తప్పే, ఒయీ అన్న తప్పే
ఒప్పనోడు పెత్తే నొప్పి లేదు
ఓణీలు వేసే వొంకరు తిరక్క తప్పదు
కంటి పులి ఇంటికి తాకుబడి
కంటి పులి వచ్చి ఇంటి పులి నెత్తుక పోయెనంట
కండే కాంతి, చీరే సింగారము
కంద కడిగిన నీళ్ళు కాళ్ల కందించి, తవ్వ కడిగిన నీళ్ళు దాహానికిచ్చింది

కంది చేలో సూది పోతే పప్పుచట్లో వెదికినట్లు
కట్టె, కొట్టె, తెచ్చె
కట్టేది ? అంటే మెట్టేది? అనాల
కడుపా ? కంచాలమ్మా చెరువా ?
కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది
కడుపులో బిడ్డ ఊడి పడేటట్లు చెప్తాడు
కతలన్ని ఎతలాయె, కాపురం మెండాయె, నిన్న చచ్చిన కుందేలు ఈపొద్దు కూరాయె
కదిరి పున్నమంత కాంతి లేదు, మొలకల పున్నమంత మొబ్బు లేదు
కన్నడ కస్తూరి, అరవ అధ్వాన్నము, తెనుగు తేట
కన్ను పోక తలికేవాతేసుకోవాల
కప్పకు తోక లేదు, కమ్మోనికి ఇసోసం (విశ్వాసం) లేదు
కమ్మ కక్ష - కాపు కక్ష
కలిగినింటి బిడ్డ, కాకర కాయ పైకి కనబడవు
కలిసొచ్చే కాలానికి నడిచొచ్చే కొడుకు పుడతాడు
కపి పోక వసె కొట్టుకొన్నట్లు
కానుగమాను కన్న తల్లి, వేప మాను వెర్రి తల్లి
కాప దాటా? గొర్రె దాటా?
కాపోన్ని, కంది గింజనూ ఏపట్లో వేసి ఏంచినా పాపం పోదు
కాయా ? పండా ?
కార్తీకం వరి పొట్టలు పగిలితే చీటీగలు పొట్ట పగిలి చస్తాయి
కాల మెట్టుందిరా మంగలీ? అంటే, ఎలక్కాయంత బంగారు లేనోడుంటాడా? అన్నాడంట
కాశికి పోతే కాసుకో లంజ
కించిత్తు బట్టాకారం
కింద వేస్తే కింద పడతాడు, మింద వేస్తే మింద పడతాడు
కుంటోణ్ణి ఎంత మోపినా నిష్ఠూరమే
కుందేలు కనబడినపుడు కుక్క యీరగను పోయిందంట
కుక్కకు కుబేందరం వస్తుందా?

కుక్క జోలికి పోతే చక్కదనం పోయినట్లు

కుక్క నోట్లో కట్టె పెడ్తే కయ్యో, కయ్యో మంటుంది

కుక్కాళ గుంట్రాతితో పోయె

కుప్ప కాలితే మా అప్పు తీరుతుంది

కురవ తిక్క, రాగి రొట్టె, పుద్రు బెల్లం

కులం చెడినా గోత్రం చెడకూడదు

కులానికి కుడి పైట, అందానికి ఎడమ పైట

కులానికి నా సాదు అంటే, తలా గంటెడు అన్నాడంట

కూతుళ్ల కన్నమ్మ కులుకేం జూశావు, కొడుకుల కన్నమ్మ గోడు జూడు

కూరలేని తిండి కుక్క తిండి, దార లేని తిండి దయ్యపు తిండి

కూలి చేస్తే కుండ గాలాల. లేక పోతే ఎండ గాలాల

కూలి బంటు కొక మాల బంటు, మాల బంటు కొక మడే బంటు

కొండంత రెడ్డి కొంగు పట్టితే వద్దన్ను కాదు, కద్దన్ను కాదు

కొడుకు చేసిన ఆదీకానికి అబ్బరు అడివి బందారాకు మోపి వచ్చెనంట

కొర్ల గుంట చెరువు నిండితే కోడి గూడా వక్కాకు వేస్తుంది

కోక దాబే గాని - కు దాబు లేదు

కోటి వంటల కన్న కోడి తునకలు మేలు

కోడికీ, మేడికీ విలికి లేదు

కోడికే దిగులు లేకుంటే కొండంతయేడి

కోడిని సంపాయించుకుంటే, కోడితల కాయంత బంగారు సంపాయిస్తుంది

కొడుక్కి పెళ్లి అవుతుందన్న సంతోషమే కాని, కోడలు వస్తుందన్న సంగతి తోచ లేదు కాబోలు

కోడి రాళ్ల గలగరించి పోస్తే కోడి అతిగించుకున్నట్లు అరిగించుకుంటారు

కోత కొడవలికీ సిగ్గు లేదు - కొయ్య గూరకూ సిగ్గు లేదు

కోతా! (కోతి+అ) కోతా! నీ పియ్యి మందు క్కావాలంటే కొర్రెక్క ఏరిగిందంట

కోతి అంటే కొర్ర గింజంత తగ్గి పోతారు

కోతి ముండకు రాత చక్కన, పాత గోడకు పూత చక్కన

కోపము లేని రాజుకు జీతము లేని మంత్రి

కోమటి దగ్గర ఒకటిచ్చి పది తెచ్చుకోవచ్చు

కోర్టుకు పది రూకలు పెట్టుకోనన్నా పెట్టుకొంటాము గాని, కోడలికి అమ్మిలి (అంబలి) పొయ్య లేమన్నారంట - కాపోళ్లు

కోర్టుకు బోతివా, కొల్ల బోతివా?

క్షణం తీరు బాటు లేదు, పైసా సంపాదన లేదు

గంగమ్మ ఇచ్చేలా? దున్న పోతు ఇచ్చేలా?

గంగమ్మ ఎనకీడితే వస్తుంది

గడ్డేసిన తావున గొడ్డును కట్టెయ్యాల

గచ్చు గచ్చురా మాల పోలిగా: అంటే, ఉద్ది చెట్టు మద్ది మానులావుంది మహా ప్రభూ: అన్నాడట

గతి లేనమ్మకు గంజే పానకం, మతి లేనమ్మకు మరిదే మొగుడు

గద్దెకు పోతే సుద్దులు తక్కువ

గాడిదను జంపి గల్లుకు బోయినట్లు

గాడు పట్టిన గంగమ్మా మాయింటి దాకా రామ్మా: అన్నాడట

గిలాంచెడి గిద్దె ఎత్తుకొని పోతే, గుద్ద నాకించి పంపించినారంట

గుంత మన్ను గుంతకు చాలదు

గుడ్డోని పనికి ముగ్గురు పంచేటు

గుడ్డోని రాయి గూట్లో పడినట్లు

గుడ్లూ కోడీ తిని గూడెక్కి కూత వేసేవాడు

గుద్ద గాడుబట్టి అనుముల గాదెకు అగ్గి పెట్టుకున్నోంట

గుద్దలో కాల్తూంటే, గుర్రప్పడు ఏమి కావాలన్నాడంట

గుద్దలో గూటం నుడి ఉంది

గుద్దలో గోరోజనం ఉంది

గుద్దలో నరాలు ఎంచుతాడు

గుమ్మడి కాయ పొయ్యే కంత గానక సాసవ గింజను పట్టుకొని మల్ల కాడెనంట

గురువు గుద్దకు సున్నం పెట్టేవాడు

గురువు గుద్ద దెంగి ఎద్దు పొడిచిందని చెప్పినట్లు

గుర్రంకొండకు పోయి ఏం తెచ్చినావంటే, గుద్దలోకి గూటం నెత్తికి మూట అన్నాడంట

గుర్రం గుగ్గుళ్ళు తింటూంటే, గాడిద కడుపూది చచ్చేనంట

గుళ్లో దేవుడు గుద్ద బోనిచ్చుకోనుంటే, వాకిట్లో దేవుడు వల్లె కావాలన్నాడంట

గొర్రె పిల్లను సంకలో పెట్టుకొని ఊరంతా వెదికినట్లు

గొర్లోని కోపము మెడ మిందికి బరువు

గోడ దెబ్బ చెంప దెబ్బ కూడా తగులుకుంటుంది

గోరంత దీపం కొండలకు వెలుగు

గోలుకొండ మిరపకాయ

గోపి లేనోవిది రాజ్యమంతా

చచ్చిన పీనిగ అగ్గికి వెరుస్తుందా?

చచ్చే వానికి సముద్రం లోతా?

చలం పల్లె పంచాయతీ చెరిసగం

చవక సనేశ్వరము

చాల్లో చాలు వేస్తే నా పాలెక్కడ పోతుంది

చిన్న చిన్న చెట్లు చిన్న దయ్యాలు పెద్ద పెద్ద చెట్లు పెద్ద దయ్యాలు

చిలకలాంటి భార్య వుంటే కోతిలాంటి లంజ వుండాలట

చిలో.మంటే పలో మంటావు

చీటీగలు సద్దకోలెల్లో పడి చస్తాయి

చీలు అంటే పిబ్బి ఎత్తుకొని పోయి, దుడ్డు అంటే, "నా కొద్దు - నేను పిల్లోణ్ని, మా నాయన ముసిలోడు" అన్నాడంట

చెంపకు చేయి పరంబగునపుడు కంటికి నీరాదేశంబగు

చెరుకా! బెల్లం పెట్టమంటే పెడ్తుందా? గానుగలో వేసి తిప్పితే పెడ్తుంది

చెరువులో వేస్తే తూములో వెళ్లబారి వస్తాడు

చెవిటి వాని ముందర శంకు పట్ట గూడదు, మూగోని ముందర ముక్కు గీరుకోకూడదు

చెవిటి శంకరా! అంటే, చెంబు దెంకరా! అన్నాడంట

చేత కానమ్మకు చెవికాడ కొప్పు

చేత గాని పని చెయ్యగాకురా మాల పోలిగా!

చొట్ట లేక ఉట్టి పట్టుకోని ఊగులాడుతాండాడు

జరిగి బండి, జరక్క పోతే బంద

జాజికాయ పోస్తే జోకొట్టినట్లు నిద్ర పోతారు
జానెడు ఇంట్లో బారెడు కట్టె కొట్రా మొగుడా! ఎట్ల కొడతావో అనిందంట
జీతగానికీ మొగ బిడ్డా!
దౌలు దస్తు - పగలు పస్తు
తడిపి ముప్పందుం మోసినట్లు
తనకయితే తగరం కూడా కొట్టుకో లేరు గాని ఇతరులకయితే ఇనుమైనా కొడతారు
తనకు లేక తడికెలు తోస్తూంటే, నాకూ ఒక దాన్ని మాట్లాడ మన్నాడంట
తను దొంగయితే పొరుగును నమ్మరు
తలకాయ ఉన్నంత సేపు వడిశం పోదు
తలకాయే పోతాంటే, చెవుల పోగులకు మళ్లకాడినట్లు
తలచు కొన్నప్పుడే తాతకు పెండ్లా!
తల దీసి మొలేస్తావా?
తల్లి చస్తే, తండ్రి దాయాది
తల్లి తలకాడ దయ్యము
తల్లీ. దండ్రీ, గురువూ. దైవమూ
తాగే నీళ్లల్లో దడ్డద్దే వాడు
తాతకు శోభనం ఎప్పుడంటే. లేచినప్పుడే
తిక్కది తిన్నాళ్లకు పోతే తొక్కి చంపినారంట
తిట్టా వద్దు, కొట్టా వద్దు వట్టలు పిసికితే వాడే వస్తాడు
తిట్లన్నీ గాలికి, మెట్లన్నీ మెడకు
తిననూ. ఏరగనూ తీరుబాటు లేదు
తిని వచ్చిన వానికి అన్నము. బోడి గుండుకు ఆముదము పెట్టినట్లు
తిష్ట కుదిరితే గానీ, నిష్ట కుదరదు
తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం
తురక బాస నడ్డీపు కెక్కుతుంది
తురకోనికి ఇసోసము (విశ్వాసము) లేదు, కోడికి కళాసము లేదు
తులవ నోరుకు ఉలవలు ఏంచాల
తెరుసుడు నోటికి తెలివే లేదు
తెలివి ఒకరి సొమ్మా? బెస్త గుర్రమ్మా!

తెలిసి తెలిసి గోతిలో పడినట్లు

తెల్లవారుజామున పోయి గడ్డమీద, సాయంత్రం కలరోటిమీద కూర్చో గూడదు

తెల్లవారుదులూ రామాయణం విని, సీతకు రాముడేం కావాలన్నాడంట

తేలును జంపి పొగేస్తే తేలు కుటితే సలుపుండదు

తొంబై ఆమడ పోయి తోలు బొమ్మలాట, అరవై ఆమడ పోయి అపుల పట్నం చూడాల

తొడ సంబంధం తొంభై ఏండ్లు

తొడుక్కున్న వానికి గాని తెలియదు, జోడు ఎక్కడ కరుస్తుందో?

తోడు మంచిది, దోవ సదరము

తోలు నోరయి సరిపోయింది గాని, చెక్క నోరయి ఉంటే ఎప్పుడో పగిలి పోయుండును

తోస్తే తొంబై ఆమడ పోయి పడతాడు

దగ్గుతూ పోతే శొంఠి పిరెము

దరిద్రునికి ఆక లెక్కువ

దరిద్రుని నెత్తిన రాళ్లవాన

దిబ్బల మీదుండి మేడల మీద కల గన్నట్లు

దిబ్బల మీదుండే వాళ్ల మిద్దె లెక్కాలంటే అవుతుందా?

దిమాకు దిండ్ల మింద, లంజ తొడల మింద

దియ్య లేని ఇంట్లో దినానికి పాతిక నష్టి

దెంగినోడు దెంగి పోతే, విల్చినోనికి నీళ్ళు కారెనంట

దెంగే వానికే దేవుడు వరమిచ్చేది

దొరల చిత్తం మాన్ల నీడ

దోవన బొయ్యే గంగమ్మా! మాయింటి దాకా రమ్మనట్లు

ధర్మనికి చేను పండును, కర్మనికి కడుపు పండును

ధాన్యపు సుడి వున్న ఎద్దు ఇంట్లో వుంటే ధాన్యం సమృద్ధిగా వుంటుందట

నంజుకు లేక పోతే గంజికి దిగదు

నంది బ్రాహ్మడెదురైనా, నాగు బామెదురైనా, చెవులపోతెదురైనా చేటు తప్పదు

నక్క తోక తొక్కి వచ్చినాడు

నమ్మితిరా పిద్దా! అంటే, దెంగితిరా గుద్దా! అన్నాడంట
నా దెబ్బంటే గోలుకొండ అబ్బా అనాల
నిన్న ఇంట్లో, ఈ పొద్దు మంట్లో
నిన్న ఉన్నవాడు రేపు లేదు
నిన్ను నమ్మి నాన బోసుకోవాల
నిష్ట నీళ్ల పాలు, గుద్ద మాల పాలు
నీటికి ప్రవాహం, దేహానికి పరిశ్రమ ఎంతో అవసరం
నీ మెచ్చుల మాటలకు నా ఇత్తలి కమ్మలకు
నీవి ఇత్తలి కమ్మలే? అంటే నీకు అవి గూడా లేవే! అన్నెంట
నూగులూ నూనే ఒకటి, గాండ్లోడు వేరే
నూరు అబద్ధాలు చెప్పి అయినా, ఒక పెండ్లి చెయ్యాలంట
నెత్తికి చెప్పులడుగుతాడు
నేటి బాలలే రేపటి పౌరులు
నేసే వానికి గోసికి కరువు, కుమ్మరోనికి కుండకు కరువు
నోటికి చెయ్యికీ అడ్డమా?
నోరు చెడ్డయితే ఊరు చెడ్డే
నోరున్నోళ్లదే ఊరు, పిర్రలున్నోళ్లదే చోటు
(పండగల్ని) ఏకాశి (ఏకాదశి) వెనకేసుకొని వస్తుంది
పండబొయ్యేటపుడు వండబోతాడు, వండబొయ్యేటపుడు పండబోతాడు
పండ్లు రాలగొట్టి బెండ్లు పెడతా
పంది కనినట్లు కంటే సరి పోయెనా? సాకి సంతరించొద్దా?
పచ్చి పులుసు తిని పల్లు కుట్టుకుంటూ రావాల
పడిశం ముక్కోనికి పారిజాతా లేల?
పచ్చార బాముూ, పసి బిడ్డా ఒకటే!
పతియే ప్రత్యక్ష దైవం
పనికి రాని మంగలోడు పిల్లి తల గొరిగి నాడంట
పరకతో కొట్టి, పావుతో నీళ్లిస్తా!
పర పూటలు పడాకురా! షాదై పోతావు
పరాయోళ్లకి పెట్టాకురా! పాడై పోతావు

పాడ్యమి ప్రయాణానికి మంచిది
పాత తంగేడు పూలు పనల పండగ నాటికైనా పనికి వస్తాయి
పాత నేస్తం వరకట్లో కొట్టినా పోదు
పాపమని పాలేస్తే ఎముకలెముకలు ఏరేసినాడంట
పారే నీటికి పాటింపు లేదు
పారే నీళ్ల పాలు, ఊరే నీళ్ల ఉచ్చలు
పాపి పోయిన కూడు పక్వాని కొస్తుందా?
పిచ్చోడి కేమిరా లోకం? అంటే, పింగు మీదనే అంట
పిడికెడు తిన్నమ్మ పీటకోడు లాగుంటే, చాటెడు తిన్నమ్మ చెక్క పేడు లాగుంది
పిత్తం దే గబ్బురాదు
పిత్తను సత్తువ లేకుంటే బేదికి మాత్ర వేసినట్లు
పిరెము చేసి పీటేస్తే కలాన మెత్తుకొని కల్ల కిందికి పోయెనంట
పిలిచి పిల్లనిస్తామంటే, కలాన మెత్తుకొని కళ్ల కిందికి పోయినాడంట
పిల్లి గుడ్డిదైతే ఎలుక గడ్డి పెట్టిందట
పిల్లి బిత్తుల వచ్చింది
పిల్లి సంసారం చేసినట్లు
పిల్లోడు ఏడ్చేది పప్పు గింజలకే
పీతిలో రాయేస్తే మొగాన పడుతుంది
పీతిలో రేగిగాయ? అంటే, అద్దుకొని తింటానన్నాడంట
పీర్ల పండుగకు శ్రీరామ నవమికి ఒకటే మంత్రమా?
పుట్టు దరిద్రునకు పుట్టెడు ఆలోచనలు
పుట్టు రాజు పుట్టు బుద్ధి గులాపు బుద్ధి
పుణ్యానికి పోతే పులి ఎత్తుక పోయినట్లు
పున్నం ముందర పుట్టింటికి అమాస ముందర అత్తింటికి పోగూడదు.
పుబ్బ కార్తిలో వాన కురిస్తే పూరేలి గుడ్డ కూడా తడసదు
పెడాత్రానికి, పెద్ద రోగానికీ మందు లేదంట
పెద్దయేటప్పటికి పెద బాబ కోతి అయితా ఉండాడు
పెద్ద వాళ్ల మాటలు పిల్ల వాళ్ల పాటలు

44

పేడా బెల్లం పిసికినట్లు
పొద్దున్న వచ్చిన వానా, పొద్దెక్కి వచ్చిన చుట్టం వెంటనే పోరు
పొద్దూ పోలే, నిద్రా రాలే, కతన్నా చెప్పరా! వెతల మారి మొగుడా!
అంతే, నాకేం వస్తాయే నా తల్లీ! అన్నాడంట
పొరుగు మండుతుంటే పొయ్యిలో ఉప్పులు పోసెనంట
పోరా పుంగనూర్ పూస్కే!
పౌరుషానికి పోయి పచ్చి పులుసు తాగినట్లు
బంతికి ముందు, బారుకు వెనక
బంతిలో వలిపిక్కారం పనికి రాదు
బక్కెద్దుల వ్యాపారము, పాత కోకల వ్యాపారము ఒకటే
బడక బండెడు పాత కోకలు సందెడు
బడే సాబ్ బండీ, అల్లీ సాబ్ ఎద్దులూ, ఎట్ల పోతేనేమి?
బాలనాయకం బహునాయకం
బాల వాక్కు బ్రహ్మ వాక్కు
బీర కాయకు తగిన పీచు, కాకర కాయకు తగిన ముండ్లు ఉంటాయి.
(అందుకే కలిపి కూర చేయరు)
బుద్ధి గుడికీ సుకము, దుక్కి గుడికీ ఫలము
మంచివాడు మనసులో అనుకొంటాడు, చెడ్డోడు చేసి చూస్తాడు
మంచివాని బుద్ధి మాంసం కాడ తెలుస్తుంది
మంట జోరైతే వంటా జోరే
మంత్రాలకు చింతకాయలు రాలవు
మడే కాపోనికి మజ్జిగా సంగటి
మనసేమో మంచివాడు గుణమే గుడిచేటు
మబ్బులు విడిచిన ఎండ, మొగున్నిడిచిన ముండ
మబ్బులో మేడి తోక దొంగిలించినట్లు
మాటేలపుడు ఎండ, మాదిగోని పొగురూ - ఒకటే
మాటలతోనే మామిడి పండ్లు రాలుస్తాడు
మాన్లున్న చోట రాసుకోకుండా ఉంటాయా? మనుషులున్న చోట అరుసు
కోకుండా ఉంటారా?
మా మేన మామ చెవులో వెంట్రుకలు మొలిపించు స్వామీ! అన్నట్లు

మారులేని తిండి మద్ది తిండి, దారలేని తిండి దయపు తిండి
మాలోన్ని మాట్లాడిచ్చి కొట్టాల, మాదిగోన్ని మాట్లాడిచ్చకుండా కొట్టాల
మాసికాయ పోస్తే మతి చెడినట్లు నిద్దర పోరాదు
మించినోనికి మించినోళ్లుంటారు
మిడి పేళము అక్కరకురాదు
ముక్కు కోసి సున్నం పెట్తారు
ముక్కు కోస్తే మూడ్నాళ్ల కొస్తుంది, కొప్పు కోస్తే కొన్నాళ్ల కొస్తుంది
ముక్కు వట్టుకుంటే ఊపిరి పోతుంది
ముక్కు మూసుకుంటే మూడు నిమిషాలు
ముద్దిన రూకుంటే, రెడ్డెన్న మామా! అంటాడు
ముప్పై ఏండ్ల జీతగానికన్నా మూడేండ్ల ఇంటిబిడ్డ మేలు
ముప్పై ఏండ్ల మొగోనికి మూడేండ్ల ఆడది
ముల్లాల ముట్టించి, తేలాల తేలి పోతుంది
ముసలి ముప్పున బిడ్డలు పుట్టినా ముప్పున పేదరికం వచ్చినా కష్టము
మూడేపి ఆరతుకుతా ఉండాడు
మూలుండే దాన్ని ముంగిట్లో ఏస్తాడు
మూసిపెడ్తే పాసిపోతుంది
మెడకు బెండు, కాలికి గుండు
మేన మామ చెవుల్లో వెంట్రుకలుంటే మేనల్లునికి అదృష్టం అట
మొగ మాటకు పోతే ముండకు బిడ్డ అయిందట
మొగుడు రాజైనా గాజు కడియమేనా?
మొదలు లేదు సుద్భుక్కా! అంటే, బిడ్డకు సోమ లింగము! అన్నాడట
మొప్పెకు మొగిలి చెండిస్తే మడిచి గుద్దలో పెట్టుకొనిందట
మొహమాటానికి పొయ్యి ముండ యాకటి అయినట్లు
యాత్రకు పొయ్యా పాత్రలు తెచ్చుకోవాల
యానాదివాడు గుద్దగడగను పోతే ఏట్లో నీళ్లు ఎండి పోయినాయంట
రామ రామ అని రాజ్యం ఏలుదువులే
రాముడున్నాడు రాజ్యముంది
రాయిని కొట్టే కాడ, పెండ్లాన్ని కొట్టేకాడ ఉండరాదు
రాయీ టెంకాయ మాదిరి

రెడ్డేరి దున్నపోతు।తా ఎక్కడు, ఇంకొక దాన్ని ఎక్కనియ్యడు
రేపు రేపు అంటే రూపు లేకుండా పోతుంది
రోకటితో గొడితే మూలిగే పాయము
రోసం లేని వానికి మోసం లేదు
లంజ చస్తే నేం? మంచం విరిగితేనేం?
లంజ ముదిరి సంసారి అయిందట
లంజ లేందే గంజి దిగదు
లెయ్యలేని అత్తకు లేపుల చిన్ని కోడలు, లేపుల చిన్ని కోడలుకు లెయ్యేరిగే బిడ్డ
లోక మెట్లుందిరా సిద్ధా? అంటే ఎవరెవరి లోకం వాళ్ళదే స్వామీ అన్నాడంట
వంక దొరకనమ్మ డొంక బుచ్చుకొంది
వంగితే వట్టలు కత్తిరిస్తాడు
వందబోయ్యేటప్పుడు పందబోతావు
వందాడి కొండంత కొండా లేదు, సాకి బండంత బండా లేదు, మోటకట్ల చెరువంత చెరువూ లేదు
వంతాడి కొండ వణికింది, సాకిబండ సాగింది, పాలకొండ పదిరింది, మొట్టికొండ మోటుకునింది
వందాడా? రండాడా?
వల్లమాలిన మగడా! పగలే లొచ్చినావ్? అంటే, అందుకొక్కాడు అగ్గికోసం అన్నారట
వల్లీ వల్లవి పెళ్లికొడుకు తలంబ్రాలు పోసినట్లు
వశం కాని దాన్ని ఒయ్యా అన్నా తప్పే, ఒశెమ్మా అన్నా తప్పే
వాన కన్న ముందు ఉరుమును, మాట కన్నా ముందు ఏద్చేదాన్ని నమ్మకూడదు
వాన లేందే వట్టి పిడుగు పడినట్లు
వాసన లేని పొగాకు గూట్లో ఉన్నా ఒకటే, నోట్లో ఉన్నా ఒకటే
వినాయకచవితి వెనుక వేసుకు వస్తుంది, ఉగాది ఊడ్చుకు పోతుంది
విరిగింది వేలు అంటే ఉచ్చలు కూడ పోయడు
విరుద్ధమా అంటే, చెరిసగమా అన్నట్లు

వివాహం విద్య నాశనం, శోభనం సర్వనాశనం

వెక్కిరించబోయి వెలకిలా పడినట్లు

వెనక తుమ్ము, ముందుకు లాభం

వేలు చూపితే హస్తం దిగమింగుతాడు

శుభం పలకరా పెండ్లి కొడకా! అంటే పెండ్లికూతురు ముండెట్టబోయింది? అన్నట్లు

సంకురాత్రికి సొనవ గింజంత తగ్గుతుంది, శివ రాత్రికి శివ శివా అని పోతుంది

సంక్రాంతికి సొనవ గింజంత, శివ రాత్రికి శివలింగమంత, ఉగాదికి ఊరుగాయ, మొలకల పున్నానికి మాగుకాయ

సంజయ్య ఇంట్లో సద్ది తిని, అంజయ్య ఆవుల్ని కాచినట్లు

సంతులేని యిల్లు సావడి కొట్టము

సంతోషమే సగం బలం

సందట్లో సదేమియా

సందిస్తే సంకల్లో చెయ్యేస్తారు

సగం పరువు సంతలో పోతే, వున్న పరువు వూళ్లో పోయిందట

సగం పాయం పోయి సంగీతం పాడతా ఉంది

సముద్రాన్నన్నా ఎళ్లీదవచ్చు గాని సంసారాన్ని ఎళ్లీదలేము

సరకారుకు పదిదుడ్లన్నా పెట్టుకుంటాం గానీ పెద్ద కోడలికి అమ్మెలి పొయ్య లేమన్నారంట కాపోళ్లు

సాగితే బండి, సాగక పోతే బండ

సిగరెట్టు తాగేవానికి బీడీ తాగేవాడు లోకువ

సిరి పోయి చీడ పట్టుకున్నట్లు

సెగ లేనిదే అన్నముడకదు, శ్రద్ధ లేనిదే చదువు రాదు

సొమ్ము పోగొట్టుకున్న వాళ్లే దొంగలు

హస్తమి ఆదివారం వచ్చింది, చస్తిమోయి గొల్లబోయల్లారా! మీ యాండ్ల నమ్మి అడ్డకొట్టాలు వేయించండి అన్నవట గొర్లు

దోసెల బోస్తివా? దోపల బోతివా?



పట్టిక నెం. 7

## డా॥ ఇ. చంద్రమౌళి సేకరించిన సామెతలు

అందరూ అయ్యోర్లైతే చదివే దెవరు?

అందులో పస లేకపోయినా అద్రా పుంజాలి అన్నట్లు

అంబటేరు పార్తా ఉండే అత్తా అంటే కొల్త్రపకతో అపకదే కోడలా
అన్నదట

అడక్కతినే వాడికి అక్షింతలిస్తే మరుక్కపోయి నోట్లో వేసుకున్నెంట

అడక్క తినే వాడికి అలక కూడానా ?

అడక్క తినే వాడికి బడాయొస్తే అర్ధరాత్రి గొడుగు బట్టెనంట

అత్త చేస్తే అడుగు బోయింది, కోడలు చేస్తే కొత్తది

అదిశెంగ బిడ్డ పుత్తే గెడ్డపార ఎత్తుకున్నదంట చెవులు కుట్న

అప్పటికి దుప్పటి, ఎల్లకాలానికి కంబళి

అయిన కాడికి మద్దేణం

అయ్యోరొచ్చేదాక అమాస ఆగునా ?

అరువులేనోణ్ణి ఎరువుకి పంపిస్తే ఏరిగి మూట కట్టుకొని వచ్చెనంట

ఆకలి పెరికితే గుర్రం ఆరిక్కసువు గూడ పెరక తిన్న

ఆకాశం వైపు తిరిగి ఉమ్మి వేస్తే అది మీద పడ్తుంది

ఆడలేనమ్మ మద్దెలపైన ఐడి కొట్టుకున్నట్లు

ఆడికొచ్చీ ఈడికొచ్చీ మూల మూల కొచ్చెనంట

ఆరావులోడు పోయి మూడావులోణ్ణి అప్పు అడిగినట్లు

ఆవు చేను మేస్తే దూడ గెనిమె మేసునా

ఆశ బారెడు అస్తి మూరెడు

ఇంటిలో బావగారున్నారని సంతకెళ్ళి స్నానమాడినట్లు

ఇంటివాడు గొడ్డు గేదంటే పొరుగువాడు పాడిగేదె అంటాడా ?

ఇచ్చినోడు పుచ్చిన కుక్క, తీసుకున్నవాడు తిరవళరాజు

ఈడులేని స్నేహం చేయరాదు, ఈతమాను గుద్ద దేకరాదు

ఈతరానమ్మను గంగెత్తుక పోయె

ఈ పొద్దు చిన్నక్కకైన గతే రేపు పెద్దక్కకు

ఈ సత్రం నేను కట్లేదు, మరి అదెవరు కట్టారో సరిగా తెల్దు అన్నట్లు
ఉండే వాడికొక ఊరైతే లేని వాడిదే దేశం
ఉచ్చుల్లో చేపలు పట్టేవాడు
ఊగే పంటి మీద రాయి పడినట్టు
ఊరికి బొయ్యేవాడు పన్జెప్పితే ఊరిలో వాళ్లంతా చేస్తే కూడా అయిపోందట
ఊరుకున్నంత ఉత్తమం, బోడిగుండంత సుఖం లేదట
ఊళ్లోళ్ళకి ఉగ్గాలు, మాలోళ్ళకి మంచాలు మోశేవాడు
ఊళ్లోవాళ్ల సొమ్మైతే ఉప్పు లేకుండా తింటారు
,, సొమ్మైతే ఉరి బోసుకుని సస్తారు
ఎండాకు రాత్తే పండాకు ఎక్కిరించిదంట
ఎక్కని మడవలకి నీళ్లు గట్టేవాడు
ఎత్తిపోయేదానికి ఏ కాలైతే నేమి?
ఎద్దు అడుగులో ఏడు తట్లు జల్లలు అన్నట్లు
ఎపుడూ ఎక్కనోడు గుర్రమెక్కితే ముందెనకా యెనక ముందాయె
ఎరవేసి ఏనుగును। లేవదీపినట్లు
ఎలికెక్కిరించిందని ఇంటి కగ్గి పెట్టినట్లు
ఎల్లప్పుడూ వస్తుందా ఎల్లమ్మ జాతర?
ఎల్లికల పడుక్కొని ఎంగిలూంస్తే ఎదురొమ్మున పడింది
ఎవడు రాజైనా ఏరక తినేది తప్పదు
ఏవిగల్దినే వేశాలమ్మకు పేనిగలు పిండాకూడంట
ఏ యాళ కాడ లేపినా చింతమాకుకోళ్ల ఊరుకాడ తెల్లారెనంట
కడుపా! కావేరి పాక్కు చెరువా?
కమ్మనీసు కతిగినా పోదు, కాకి చిప్పతో గోకినా పోదు
కుక్కలుండే ఊరికి నక్క పోతురాజు
కొనకొమ్మన కూర్చొని మొదలు కొమ్మను కొట్టినటు
కొయ్యహారాకు జున్న కోస్తే ఎగబెరుగు
కొరకన నక్క లేదు. కొంకులదాక తిత్తి
కోమటోళ్ళకి ఉల్లిపాయలాగ
గుడ్డోడి పుతు గూడెతుక్కున్నటు

గుఱ్ఱం గుడ్డిదయినా గుగ్గిళ్ళకు కొదవ లేదు

చిత్తం శివుడి మీద ధ్యానం చెప్పుల మీద

చిలక ముక్కుకు చింతపండు

చుంచులా ఉండి పంచులు తెగ కొరికినట్లు

చెడిపోయే కాలానికి కుక్క మూతి పిందెలు

చెవుటోడి చెవులో శెంకూదినటు

చేతికొచ్చింది నోటికాడికి పోయేదాకా ఏం నమ్మకం?

చేసిన పనికి ఒప్పాళాలు చెప్పేవారు పదిమంది

తల్లూర్చేదానికి తావు లేకుంటే మెడకి డోలొకటి

తల్లికి కూడుపెట్టలేని వాడు పిన తల్లికి కడియాలు చేయించినట్లు

తాటి కొద్ది యిడిస్తే తేట నీళ్లు తాగెనంట

తాతా పెండ్లంటే తలెగరేసినాడంట

తినను నేర్చినమ్మ పెట్ట నేర్వదు, పెట్ట నేర్చినమ్మ తిన్న నేర్వదు

తెల్లార్తే పగలు చీకటోడ్ని రేజీకటోడు ఏరాతారాడ్తా వన్నోంట, రాత్రి రేజీకటోడ్ని పగలు చీకటోడు ఏరా గుడి కొస్తావన్నోంటి

దార్ని పొయ్యే వాడ్ని అబ్బా అంటే ఎవడికి పుడ్తివే బిడ్డా అన్నోంట

దిబ్బెక్కి యారగలేనోడు తిరపతి కొండెక్కినాడంట గోవిందలు పెట్టేదానికి

దున్నేవాడికి నక్కల జూపుట

దెబ్బకు దెయ్యం కూడా దిగుతుంది

దేవుడి పేరు కదా అని పెళ్లి పల్లకి ఎత్తినపుడు శివశివా అన్నట్లు

నారగంటి పాశెగాడికి మంగల చెంగడు మంత్రంట

నువ్వు పోటు వెయ్యి నేను నువ్వీ నువ్వీ అంటానందట

నేర్వని వంగి - ఉడికిన జల్ల కరిచెనే అమ్మా అనెనంట

పందిని పటుకోబోయినా గుఱ్ఱంటుంది, ఇడవబోయినా గుఱ్ఱంటుంది

పట్ట పగలు పిలిస్తే దిక్కులేదు కాపీ, అర్ధరాత్రి కన్నుగీటితే వచ్చిందంట

పడుచెటు ప్రబలము - ఏసిన చెట్టు ఎత్తు బారము

పనికి పంజాకోర్, తిండికి తిమ్మరాయడు

పాచి పండ్లోడు చేర్చిపెడ్తే బంగారు పండ్లోడు బారబోసెనంట

పాచి బలిస్తే పంటికి బలం మట్టి బలిస్తే ఒంటికి బలం
పిందెగా మాగితే తొాణం తెగిపోవు
పీనిగెలు మోసే వాడికి అతులు బరువా!
పుళగరా! పుళగరా! పోలిగా అంటే టంగుటూరి మిరపగింజ తాటి
కాయంతుందన్నోంట
పూరేడి బుర్రంటే ఒళ్ళు జల్లంటుంది
పెండ్లింట్లో గంజి నీళ్ళకు అల్లాడేవాడు
పెరట్లో కూరాకు రుచిగా ఉండదు
పేనుకొరికితే మూర్ఛ పోతే పాము కొరికితే చెప్పాలా?
పోతే పోయింది మూడు పుట్ల భూమి, కోర్టు వ్యవహారం తెలిపిందన్నాదట
పోతే మొగుడాల్తో పోవాల, లేక పోతే కాశీ యాత్ర పోవాల
పోలీ పోలీ! నీ ఆవులు ఎవురు మేపుతారంటే, నా తిత్తిలో దుడ్డు మేపుతుంది
అనిందట
బిడుగు మాల్ని ముండ బీటికి ముగ్గు బెట్టెనేంట
పంగమాల్ని మంగలోడు పిల్లి తల గొరిగెనంట
బిడ్డ ముద్దా? పని ముద్దా?
మంచి మాటలకి మామిడి కాయలు రాలునా?
మద్దేణం బతికినా మానంతో బతకాలి
మన దేవుడి సత్యం మనకు తెలియదా!
మాలదాన్నక్కా అంటే, మరొక మెట్టు ఎక్కెనంట
ముంత బొయ్యి కడవలో ఇరుక్కున్నదట
ముందు మడక నక్కగా పోతే గదా! వెనక మడక నక్కగా వచ్చేది
మూతి గట్టి, మేత మేయ మన్నట్లు
మొండి కెత్తినమ్మ మొగుడి పెళ్లి కెళ్లి అర్ధగోడ (అడ్డగోడ) ప్రక్క
నుండి అర్ధ రూపాయ చదివించిపెడంట
మొత్తే వాడికి దా మోటెనుము పాలిచ్చు
మొదటి పెళ్లాం బిడ్డలు ముష్టి ఎత్తుకొని తింటుంటే, ముండకు బిడ్డలు
లేరని రామేశ్వరం తీర్థం బయల్దేరినట్లు
రంకు నేర్పినమ్మ బొంక నేర్వకపోతే కొంక నక్కల పాలు

రంకు సాగితే పెళ్ళెందుకురా పెద బాబు అన్నట్లు
రాయి తిరిగితే రాజ్యమంతా చుట్టాలే
రెండికి చెడిన రేవణ
రౌతు మెత్తనోడైతే గుఱ్ఱం మూడు కాళ్లతో నడ్చు
లోభికి ఇబ్బిడి ఖర్చు
వగలాడీ! మొగుళ్ళెందరే అంటే పల్లేరు కాయతో పద ముగ్గురట
వగలేనోడు లంజరిక మాడ్తే, ఇంటికి దుగ్గానేసు కున్నారట పంపకం
వట్టి ముండా బట్టగప్పు అంటే రెండు కాళ్ళెత్తి నెత్తి నేసెనంట
వీర పతివ్రత ఇల్లెక్కొ నాడితే ఇంటి మీది సొరకాయ ముడ్డెత్తుకునాడిందంట
శుభం పలకరా సుబ్బన్న అంటే, పెళ్లి కూతురు ముండ ఏదన్నాడట
శెట్టి పింగారించుకొనే సరికి తెల్ల వారిందట
సత్రం కూటికి అయ్యంగారు సిఫార్సు
సద్దు జేసే పిల్లి ఎలుకను పట్టునా?
సనిబట్టినోడు సంతకు బోతే, ఈనం బట్టినోడు ఎదురు వచ్చినాడంట
సేద్యగానికీ మొగబిడ్డా?
హస్తలో ఆకు ఆడితే చిత్తలో చినుకు లేదు



# ఉపజీవ్య రచనలు

## I వ్యాసాలు , పీఠికలు :

| | |
|---|---|
| కన్వీనర్ వచనములు (అకాడమీవారి 'తెలుగు సామెతలు' మూడవ కూర్పు) | మరుపూరు కోదండరామరెడ్డి |
| తెలుగు సామెతలు 'జీలకర్ర-సింగినాదము' (వ్యాసం) | కృష్ణకుమారి<br>భారతి, జనవరి 1938 |
| తెలుగు సామెతలు (వ్యాసం) | నాయని కృష్ణకుమారి<br>తెలుగు స్వతంత్ర, జనవరి, 1954,<br>పరిశోధన (గ్రంథం) |
| తెలుగు సామెతలు (వ్యాసం) | ఏకుమళ్ల కామేశ్వరరావు, భారతి,<br>ఫిబ్రవరి, 1955 |
| తెలుగు సామెతలు (వ్యాసం) | నిడుదవోలు వేంకటరావు, భారతి,<br>జనవరి, 1966. |
| తెలుగు సామెతలు (వ్యాసం) | డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి,<br>స్రవంతి, ఫిబ్రవరి, 1980. |
| బ్రౌన్ నోట్స్ | 'కార్' గ్రంథం తన కాపీలో<br>అక్కడక్కడ నోట్ చేసుకున్నవి. |
| భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించిన సామెతలు (వ్యాసం) | కాలిపు వీరభద్రుడు, స్రవంతి,<br>మార్చి, 1968. |
| మెత్తని వారిని చూస్తే : సామెతలు (కలగూర గంప) | జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి,<br>భారతి, ఈశ్వర సం. మాఘమాసం. |
| శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి-నోట్స్ (వేటపాలెం లైబ్రెరీలో లభించింది) | |

సామెతలు (వ్యాసం) కథలు_గాథలు (సంపుటం. 2) — చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

సామెతలు (పీఠిక) (అకాడమీవారి "తెలుగు సామెతలు" ద్వితీయ ముద్రణ పీఠిక) — విశ్వనాథ సత్యనారాయణ

సామెతలు (పీఠిక) (ఆం.ప్ర. సాహిత్య అకాడమీ వారి "తెలుగు సామెతలు" (ప్రథమ ముద్రణ పీఠిక) — సంపత్ రాఘవాచారి

సామెతలు (వ్యాసం) జానపద సాహిత్య స్వరూపం (గ్రంథం) లోనిది — డా॥ ఆర్వీయస్ సుందరం

సామెతలు - ఛందస్స్వామ్యతలు — బండి నాగరాజు, భారతి. 1966

సామెతలు - నిర్వచనము (వ్యాసం) — శ్రీ వై. వెంకటరమణారావు. స్రవంతి, ఏప్రిల్. 1964.

పింగినాదం - జీలకఱ్ఱ — జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, భారతి, ఈశ్వర, మాఘమాసం.

స్త్రీలు - సామెతలు — ఇల్లిందల సరస్వతీదేవి, సుజాత, 15-10-52 కిన్నెర, డిసెంబర్, 1952.

Proverbs and Proverbial Expressions (Essay) (from the book Folklore and Folklife) — Roger D. Abrahams

## II విజ్ఞాన సర్వస్వాలు - నిఘంటువులు :

ఆంధ్రప్రదేశ్ దర్శిని.

తెలుగు విజ్ఞాన సర్వస్వము (మూడవ సంపుటం)

మాండలిక వృత్తిపదకోశం (వ్యవసాయం)

శాసన శబ్దకోశము (ఆంధ్రప్రదేశము, 1967) — కుందూరి ఈశ్వరదత్తు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్.

African Encylopedia

Chamber's Enclopedia (Vol.XI)
(New Revised edition)

Encyclopedia Americana (Vol.XXII)

Encyclopedia Britannica

Every Man's Encyclopedia (Vol. X)

Nelson's Perpetual Loose-Leaf
Encyclopedia (Vol. X)

The New Book of Knowledge (Vol. XV)

The World Book of Encyclopedia (Vol. XV)

Dictlonary Telugu-English (నిఘంటు - తెలుగు ఇంగ్లీషు) — C. P. Brown

The Oxford Dictionary of
English Proverbs

A Study of Famines in Rayalaseema — K. Srinivasulu Naldu
M. Phil. Dissertation in
Economics. S. V. U.

ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి (1974) — ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి
బాలేందు శేఖరం, సరస్వతీ బుక్ డిపో,
కర్నూలు.

## III గ్రంథాలు :

ఆంధ్రుల సాంఘిక చరిత్ర (ద్వితీయ ముద్రణ) — సురవరము ప్రతాపరెడ్డి, ఆంధ్ర సారస్వత
పరిషత్తు, హైదరాబాదు.

క్రొత్త సంగీత విద్యా దర్పణము (1968) — శ్రీ ఏకా సుబ్బారావు, ది ఓరియన్ట్
పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి.

| | |
|---|---|
| గానకళా బోధిని (1951) | శ్రీ ఎస్. పి. పార్థసారథీ అండ్ శ్రీమతి ద్వారకా పార్థసారథి, బాల సరస్వతీ బుక్ డిపో, కర్నూలు. |
| తెలుగు-కన్నడ జానపద గేయాలు (1979) | డా॥ ఆర్వీయస్ సుందరం, జానపద విజ్ఞాన భారతి, మైసూరు. |
| తెలుగు వాక్యం (1975) | డా॥ చేకూరి రామారావు, ఆం. ప్ర. సాహిత్య అకాడమి, హైదరాబాద్. |
| దేవాలయాలమీద బూతు బొమ్మ లెందుకు? (ఆరవ కూర్పు, 1977) | తాపీ ధర్మారావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. |
| ధన్వంతరి (1966) | మల్లంపల్లి భైరవమూర్తి పంతులు, కొండా శంకరయ్య - సికింద్రాబాద్. |
| పెళ్లి - దాని పుట్టు పూర్వోత్తరాలు (పునర్ముద్రణ, 1977) | తాపీ ధర్మారావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. |
| మన మతములు - సాంప్రదాయములు (1975) | డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాద్. |
| వస్తుగుణ చంద్రిక (1970) | చెరుకుపల్లి వెంకటరామయ్య, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమహేంద్రవరము. |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి (సం. 2) | శ్రీరామకృష్ణ మఠము - మద్రాసు. |
| A Hand Book of Vira Saivism (Second Revised Ed. 1979) | S. C. Nandi Math; Motilal Banarsidas, Delhi. |
| Andhra Pradesh: The Granary | |
| Folk Lore and Folk Life (1972) | (Ed.) Richard M. Dorson, The University of Chicago Press, Chicago and London. |

| | |
|---|---|
| Proverbs | Compiled and Edited by Jerry Gluski, Elsevier Publishing Company, Newyork, 1971. |
| Religions in India; A Study of their essential unity | J. P. Suda, Sterling publications Pvt. Ltd., AB/9 Safdarjang Enclave, New Delhi - 110 016. |
| South Indian Folklore (Essay) Agricultural Journal of India (P. 124) | C. Benson |
| The Eleven Religions and Their Proverbial Lore (Third impression, 1947) | S. G. Champion, George Routledge and sons, Ltd., Broadway House, 68-74, Carter Lane, E. C. 4. |
| The Village Gods of South India (Second Ed. Revised and enlarged (1921) | Rev. R.H. Whitehead, Association Press (YMCA) 5, Russel Street, Calcutta. |
| Vaisnavism Saivism And Minor Religion Systems (1965) | Sir R. G Bandarkar, Indological Book House, Varanasi. |
| Visnuism and Saivism A Comparison (First Indian Edition 1976) | J Gonda; Munshi Ram Manohar Lal Publications Pvt. Ltd., |



"సామాజికమైన తరతరాల అనుభవాన్ని ఇముడ్చుకొని
సామ్యత, ప్రభావోత్పాదకత, ధ్వని ప్రాధాన్యత
ప్రజా ప్రాచుర్యం, శ్రావ్యత కలిగి
సంభాషణా యోగ్యమైన సంక్షిప్త వాక్యం
తె లు గు సా మె త"

- పి. నరసింహారెడ్డి